కళాపీఠ ప్రచురణ 1.

శ్రీః

# నా రా య ణ రా వు

[ ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి బహుమతి నందిన నవల ]



అడివి బాపిరాజు



కళాపీఠం—హైదరాబాద్ (దక్కన్)



# అర్పణము



పితృపాదులు పూజ్యులు

నాకళాజీవితానికి

మోసులు వెలార్చిన

కీర్తిశేషులు:

శ్రీ అడివి కృష్ణయ్యామాత్యులవారి

దివ్యస్మృతికి



# అంజలి

ఈ నవల ఉద్భవించడానికి ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు కారకులు. వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనాలు.

ఈ నవలారచనలో నాకు ఉత్సాహం కలిగించిన నా ప్రాణమిత్రులు డాక్టరు చెన్నాప్రగడ సుబ్బారావు, ముష్టి లక్ష్మీనారాయణ, ములుకుట్ల సుబ్బారాయుడు, మంచాళ జగన్నాధరావు, కాశీపట్నపు శేషశాయి గార్లకు నా ప్రేమాంజలులు.

ఈ కావ్యాన్ని సరిచూచిన ప్రజ్ఞామూర్తి, మిత్రుడు కాటూరి వెంకటేశ్వరునికి నమస్కారాలు.

ఈ నా కృతిని ప్రథమంలో తమ దినపత్రికలో ప్రచురించిన ఆంధ్ర పత్రికాధిపులకు ఎంతయో కృతజ్ఞుణ్ణి.

కాగితం కరువురోజులలో కోరుటతోనే ముద్రణాలకు కాగితము నందజేసిన రాజమహేంద్రపుర ఆంధ్రాపేపరుమిల్లు, మీజాన్ ప్రెస్ లిమిటెడ్‌వారికి నా జోహారులు.

ఇది అచ్చువేయించుటలో నాకు వేవిధాల సహాయంచేసిన మిత్రులు, యువకులు పెనుమర్తి కామేశ్వరాయనికి, తెలికిచర్ల వెంకటరత్నంగారికి, మాదవపెద్దికవికి, మారిన సుబ్బారావుగారికి, కలగర నాగభూషణం చౌదరిగారికి, ముత్తేవి మాధవాచార్యగారికీ నా నమస్సులు.

కోరిన తక్షణమె, తమ కెంత తీరిక లేకపోయినా, ఓపికతో, ప్రేమతో, ఈ మూడవ ముద్రణము అచ్చు పూర్తిచేసియిచ్చిన నేషనల్ ప్రెస్ వారిని నేను మరవలేను. వారికి నా అభివాదాలు.

ఇది బైండు చేయగా వచ్చిన ధనము "ప్రజాశక్తి" దినపత్రిక నిధికి సమర్పించిన నేషనల్ ప్రెస్‌వర్కర్సు దేశభక్తికి ఎంతో సంతోషము కలిగినది.

ఈ నవలను పాఠ్యగ్రంథముగా నిర్ణయించిన ఆంధ్ర చెన్న విశ్వవిద్యాలయాధికారుల ప్రోత్సాహోపకారముల కెంతయు కృతజ్ఞుడను.

హైదరాబాద్ (దక్కన్).

అడివి బాపిరాజు

24—7—1945

ఓం

శ్రీరస్తు

# నారాయణరావు

## ప్రథమ భాగము

### ౧

### "నీకు పెండ్లి అయినదా?"

"ఏదియో పడిపోయినట్లు అల పెరుంగని మహావేగమున ఈ లోకమంతయు ఎచటి కిట్లు పరువెత్తిపోవుచున్నది! కనులు మూసికొన్నచో వెనుక కేగుచున్నట్లు తోచు నీ లోకము, నిజముగా ముందుకే పోవుచున్నదా? ఈ ధూమశకట మతిరయమున బరువిడుచుండ, ఆ వృక్షములు పొదలువెనుక కేగుటయేమి! ఆ తారకలతోడి, మబ్బులతోడి మహాగగనము కదలకుండుటయేమి! ఇది యంతయు భ్రమయనుకొని నవ్వుదమా, నిజమనుకొని అచ్చెరువందుదమా!

అనేక కోటియోజనముల దవ్వున దీపకళికలవలె మినుకుమినుకుమను నానక్షత్రములు, ఈ గ్రహగోళములు, ఈమట్టిముద్దపై ప్రాకులాడు మనుజకీటకముల కొఱకే దివ్వటీలు పట్టుచున్నవా! కోటి సూర్యోజ్జ్వలములగు తారకలు, వాని నాశ్రయించినగ్రహములు నివియెల్ల ఎవ్వరినిట్లు వెదకికొనుచుపోవుచున్నవి? ఛందస్సులను దర్శించిన మన మహర్షులు ఈ పరమార్థమును ఎంత చక్కగా గానముచేసిరి!

ఈ తారకలుకూడ సంగీతము పాడునట. అవి ఏ మహాభావమును గానము చేయుచున్నవో! బిథోవిన్, త్యాగరాజు మొదలైన మనగాయకులు ఆ మహాభావము నేనా తమ గాంధర్వమున ప్రతిఫలింపజేయుచున్నది?"

వ్యక్తావ్యక్తమగు తన యాలోచనములనుండి మరలి నారాయణరావు రైలు కిటికీనుండి తల వెనుకకుదీసి ఆ యింటరు తరగతిలో మైమరచి నిద్రించుచున్న స్నేహితుల పారజూచినాడు.

మెయిలు అమితవేగముతో కృష్ణానది వంతెనదాటి బెజవాడ స్టేషను సమీపించినది.

'ఓరే సుషుప్తికుమాళ్లు! లెండి! బెజవాడ వచ్చాము. ఒకటే నిద్దరా! లెండర్రా!'

అని నారాయణరావు తన స్నేహితుల నిద్దురలేపినాడు. కన్నులు నులుముకొని, చిరునవ్వునవ్వుచు పరమేశ్వరమూర్తి లేచి, ఇటు నటు పరికించి, ఆవులింత

లడచుకొనుచు, ఒడలు విరిచికొనుచు 'ఓహో డాక్టరుగారు ! లేవరోయి ! నిద్ర పాడిపోయేందుకు క్షాపీఅరఖు, ఇడ్లీమాత్ర సేవిద్దువుగాని ' అని రాజారావును ఒక చరపు చరచినాడు.

రాజారావులేచి, కోపము నభినయించుచు, 'ఓయి బక్కవాడా, నీవటోయి ! అని పరమేశ్వరుని ప్రక్కమీద పడవైచి యదిమిపట్టినాడు.

'ఓరి పాపిష్ఠిగ్రహం ! బక్కాళ్ళమీదా నీ బాహుబలం ! ' అని ప్రక్కమీద దొర్లుచున్న రాజేశ్వరుడు లేచి, రాజారావును గబగబ రయిలు తలుపువైపుకు గెంటు కొని పోయినాడు.

'నారాయణా ! అల్లారం లాగరా ! హత్య, హత్య పోలీసు పోలీసు ' అంటూ లక్ష్మీపతి గొలుసును లాగబోయినట్లు నటించినాడు.

'మీరంతా ద్వంద్వయుద్ధాలలో వీరధర్మం నిర్వర్తించండి. నేను ముఖప్రక్షాళనాది ప్రాతః కాలోచితకృత్యంబుల నిర్వర్తించెదనుగాక ! ' అని నవ్వుచు నారాయణరావు బిట్టబిగిసికొని గుబ్బుపెట్టి నిద్రపోవుచున్న మరియొక మిత్రుని 'అరే మహమ్మదు, ఇబిరాఅలం, సుల్తాన్ అబ్దుల్ రజాక్ పాదుషాహ్ సాహెబువారూ ! లెండీ. మీకీ వైతాళికులు లేరు ! రాజ్యం గీజ్యం బూది అయితున్నాయి ' అని లేపినాడు.

అలం నిద్దురలేచి 'ఏమి తొందరరా ! ' అనుచు మొగము కడుగుకొనుటకు సిద్ధమయ్యెను.

ఆ యువకమండలిఅంతయు పక్కలు చుట్టుకొని, సామాను సర్దుకొనులోపల నారాయణవచ్చి 'ఏమర్రో, ఇడ్లీ, ఉపమా, కాఫీ, పూరీ, ఉర్లకడంగ్ ప్రత్యక్షమౌతున్నాయి. సేవించటానికి భక్తులందరున్నూ, సిద్ధంగా వున్నారా ? ' అని హెచ్చరించి, ఆయా సరకులను బల్లలపై నమరింప ప్రారంభించినాడు.

లక్ష్మి :—నాకు 'చా' తెచ్చావురా.

రాజా :—లేదురా 'చీ' తెచ్చాడు.

అలం :—తురకవాణ్ణే ! నాకే 'చా' అక్కర్లేదు, యీడికి ఎందుకోయ్ 'చా' ? తుమ్ చీనావాడా ఏమిరా ?

పక్కబండివారు మెయి లిక్కడ అరగంటవరకు ఆగుననియు, గవర్నరుగారి స్పెషలు చెన్నపట్టణము వెళ్లుచున్నదనియు చెప్పికొనుట విని, 'ఓరి నాయనా ! చెట్లు మొలవాలిరా ! బాబూ ! ' అనుకొనుచు మన మిత్రులందరు ఉపాహారముల నారగించి కాఫీ త్రాగినారు. 'త్రికాజిల్సు' సిగరెట్లడబ్బాలు తీసి, సిగరెట్లు వెలిగించి ధూమపానలోలురైనారు.

నారాయణరావు 'పుస్తకాలు ఏవన్నా పట్టుకువస్తానురా ' అని వేరొక చివర నున్న హిగిన్‌బాదమ్ పుస్తక విక్రయశాలకడకు విసవిస నడచిపోయినాడు. గవర్నరుగారి ప్రయాణ సందర్భమున గావలియున్న పోలీసువారు ఆయుధోపేతులై అన్ని వైపుల పహరా ఇచ్చుచున్నారు. ఫలాహారపుశాలకడ వారిబండి ఆగును. కాన

అచ్చట నెరును రాకుండ బందోబస్తు చేసినారు. గవర్నరుగారికి స్వాగతమిచ్చుటకు కృష్ణాకలెక్టరుగారు, పురప్రముఖులు, ఉద్యోగస్థులు మొదలగువార్రు పూలదండలతో, సన్మానపత్రములతో నిరీక్షించుచున్నారు.

నారాయణరావీ దృశ్యమంతయు జూచుచు పుస్తకశాలకడ నాలోచనా నిమగ్నుడై నిలుచుండిపోయినాడు.

నారాయణరావు ఆజానుబాహుడు. అయిదడుగుల పదునొకం డంగుళముల పొడవువాడు. బలసంపదకు నెలవైనవాడు. ఉజ్జ్వల శ్యామలుడు. చిన్నవై తీక్ష్ణమైన లోచనములు తీరైసమమై కొంచెము పొడుగైనముక్కు దూరస్థములగు నాకన్నుల మధ్య ప్రవహించి, ధనస్సువలె తిరిగిపోయిన పై పెదవికి నాతిదూరమున నాగినది. అతని నోరు సుందరమై పద్మినీజాతి లలనారత్నమునకు వన్నెతీర్చునట్టిదై యున్నది. ఆ లోపమును ఉత్తమనాయక లక్షణమగు నామ్రచిబుకము దృఢరేఖాచక్రితమై ధీరత్వము పుంజీభవింపజేయుచు తీర్చినది.

నారాయణరావు కుడిచేతి చూపుడుమ్రేలితో నడుగుపెదవిని నొక్కుకొనుచు, బొమలుముడిచి, విశాలఫాలము, వీచికల నిండిన పాలసముద్ర మట్లయిపోవ, పరధ్యానములో మునిగిపోయినాడు.

ఉన్నట్లుండి తన్ను ఎవరో తీక్ష్ణదృష్టుల చూచుచున్నట్లు కాగా, ఆలోచనలు మరల్చుకొని ఎదుట నిలుచుండి తన్ను వింతచూపులతో గమనించు నొక పెద్దమనుష్యుని పరికించినాడు. నారాయణరావు తనలో నవ్వుకొనుచు ప్రక్కనున్న పుస్తకశాల కడకు పోబోవ ఆ నూతన వ్యక్తి 'ఆగు' మని చేయియెత్తినాడు. బంగారపు పొన్నుకర్ర విలాసముగ నాడించుకొనుచు ఆ మూర్తి నారాయణరావుకడకు వచ్చెను.

'మీ పే రేమిటండి?'

'నారాయణరావు.'

'ఇంటి పేరు?'

'తటవర్తివారు'

'మీ గోత్రం?'

'కౌండిన్యస.'

'మీకు వివాహ మైందాండి?'

ఈ సంభాషణమంతయు ఇంగ్లీషుభాషలోనే జరిగినది.

'అయ్యా! నారాయణరావుగారూ! నాకీఅనవసరమైన చోద్యం ఎందుకని మీరనుకుంటున్నారేమో! మిమ్మల్ని చూడగానే మీకు వివాహం కాలేదని నాఅంతరాత్మ చెప్పింది. అందుచేత ఈ వెర్రిప్రశ్నలు వేసినాను. వీరెవరా అని మీరు అనుకోవచ్చు. గవర్నరుగారి రాకకు వేచి ఉన్న బృందంలో నే నొకణ్ణి. నన్ను తల్లాప్రగడ లక్ష్మీసుందరప్రసాదరావు అంటారు. నేను మిమ్మల్ని అడిగిన ఆఖరి ప్రశ్నకు జవాబు

ఇవ్వవలెనని నా మనవి. నా ఊహ సరియైనదా కాదా అని తెలిసికొన కుతూహలం పడుతున్నాను.

'నాకు వివాహంకాలేదండి' అని చిరునవ్వుతో నారాయణరావు జవాబుచెప్పినాడు. ఈయనయేనా విశ్వలాపురం జమీందారుగారు. రాజధానీ శాసనసభలో మెంబరు, అనుకున్నాడు నారాయణరావు.

'గవర్నరుగారి బండి ఇంకా పదిహేనునిమిషములదాకా రాదులెండి. ఇప్పుడెక్కడనుండి వస్తున్నారు?' అని జమీందారుగారు ప్రశ్నించినారు.

'చెన్నపట్టణాన్నుంచి స్నేహితులూ నేనూ కలిసివస్తున్నాం. సెలవిప్పిస్తారా?' అనినమస్కరించి,మర్యాదలు వెలుగుచూపులు మరలించి పుస్తకశాలచేరినాడు.

స్నేహితులందరును ప్లాటుఫారంపై తిరుగుచున్నారు. గవర్నరుగారిని చూచుటకు రాజమహేంద్రవరంలో వీలు ఏల లేకపోయినదో వీరికి? ఈయన శాసనసభలో స్వరాజ్యపార్టీలో జేరి, నిపుణతతో ప్రభుత్వ తంత్రమును చిందర వందరచేయుచు దేశసేవను తనకు తోచినవిధమున జేయుచున్నాడు. నిజమే కానిఎవరయినను శాసనసభలకువెళ్ళి చేయదగినదేమున్నది? ఈరాజనీతినిపుణుడు అంత లప్రౌఢముగాతన్ను ప్రశ్నించినాడేమి? అని అనుకొనుచు నారాయణరావు ఏవో కొన్ని నవలలు, తదితర గ్రంథములు కొని తన పెట్టె జేరినాడు.

మిత్రులెవ్వరును పెట్టెలో లేరు. నారాయణునకు మనస్సు పుస్తకములమీద లగ్నముకాదు. జమీందారుడు, ఆశాకాంతులు వెలుగు అతని కన్నులు, దీనమైన అతని ఆఖరిప్రశ్న తలంపుకు వచ్చినవి. ఆయనకడ ఎంత రాచఠీవియున్నది? స్వార్థపరులై అవహాస్యపు జీవితముల జీవించు అనేకులవలెగాక, ఈయన స్వరాజ్యసముపార్జనమహాయజ్ఞమునందు దానును ఒక ఇంధనమును అప్పుడప్పుడు వేయుచునేయున్నాడు.

'ఏడి నారాయడు! ఓరి ఇడుగోరా!' అని గబగబ స్నేహితులందరు వచ్చి పెట్టె నెక్కినారు.

## ౨

## రైలుకూడ తథాస్తన్నది

'ఒరే నారాయడూ! ఏమైపోయినావురా నువ్వు? గవర్నరుగారి నాహ్వానించి సమ్మాన పత్రాలు సమర్పించి సాగనంపివచ్చాము మేమంతా. నువ్వు జాతీయవాదివి. అవును. గవర్నరుగారికి దర్శనమివ్వవు. ఆ మాట మరచి పోయినాం.' అంటూ రాజేశ్వరరావు నారాయణుని చేతిలోని గ్రంథము లందిపుచ్చుకొని పేర్లు చూచుచు 'అన్నట్లు మా జమీందారుగారు గవర్నర్ని ఇంటర్వ్యూచేశారిక్కడ. ఆయనను కనిపించావటగా నీవు!' అని ప్రశ్నించెను.

అంతలో పరమేశ్వరు దండుకొని 'అవునూ ఆయన ఏమిటి నీ భోగట్టా తెగ విచారిస్తున్నాడు ?'

నారాయణరావు చిరునవ్వుతో 'మరి నేనేమి సామాన్యుడ ననుకున్నావుటరా ! నేనుకూడా ఆయనకు ఇంటర్వ్యూ ఇచ్చాను.'

రాజా :—నువ్వు పెటగోనియనువురాబ్బాబూ ! సామాన్యుడ వెందుకవుతావు ?

రాజే :—నీ గోత్రంకూడా అడిగాడురా ? ఎందుకో ?

నారా :—పెటగోనియనులకు గోత్రము వుండదనుకొన్నాడేమో ?'

రాజే :—లక్ష్మీపతి చెప్పాడు, మీది కౌండిన్యసగోత్రమని.

ఆలం :—కాదురాభాయి ఆయన నీకీ నిఖ్కా సేస్తాడురా.

నారా :—నీ మొఖం, ఆయన సాయిబుగాదురా. మొగాడికి నిఖ్కా చేయడానికి !

రాజే :—అవునురోయి ! ఆయనకో కూతురుందిరా. ఆ పిల్లకింకా పెళ్ళికాలేదనిజమే.

పర :— ఇకనేమి ? నారాయుడి రొట్టె నేతిలో బడింది.

రాజా :—నారాయుడి రొట్టెకాదు. నాదీని. నే నింక హీజ్ హైనస్ విశ్వలాపురం జమీందారుగారికి స్టేటు డాక్టర్నవుతాను

రాజే -ఒరె బాబూ ! నారాయుడు ! నన్నుకూడా కనిపెట్టివుండాలిరా. మామగారికి సిఫార్సుచేసి నన్నుకూడా స్టేటు ఇంజనీరుగా పారేయించు

నారా :—ఏడిశారులే వెధవల్లారా ! మీలో ఒక్కడూ ఇంకా పరీక్షకైనా కూర్చో లేదు. అప్పుడే ఉద్యోగాలు ! మామగారి యెస్టేటులో మిమ్మల్నెవ్వళ్ళని అటుగైనా పెట్టనివ్వను. ఒక్క పరమేశ్వరుణ్ణిమట్టుకు ఆస్థానకవిని చేస్తాను.

రాజే పెళ్ళాసి చూస్తావేమిరా ఇంకా, పరమేశ్వరుడూ! ఏదీ రాజజామాతమీద ఒకకీర్తన పాడరా!

పరమేశ్వరమూర్తి లేచి నిలిచి ఆశీర్వచన ముద్రపట్టి గొంతు సవరించు కొంటూవుండగా, రాజేశ్వరరావు 'ఆగరా పరమాయి ! మరచిపోయాను బంగారపు బొమ్మ, పచ్చకర్పూరపు బరిణలాంటి పెళ్ళికూతుర్ని విడిచిపెట్టి; యీ మొరటు నారాయుడిమీద పాటపాడడానికి వల్లగాదు. చేయరా, ముందు వధూకీర్తనం చేయి' అన్నాడు.

'అల్లా ! సభవారి అనుజ్ఞా ?' అని అడిగి పరమేశ్వరమూర్తి,

'యెంకివంటి పిల్ల లేదోయి, లేదోయి !
యెంకి నావం కింక రాదోయి, రాదోయ్ !'

అని పాడునప్పటికి రాజారావు, 'చాల్లేవోయ్, నీ అశుభప్పాటలు' అని వారించినాడు.

పరమేశ్వరుడు తెల్లబోయి,

'సీతాపె వుంటాను నాయుడుబావా !
నీమాపె యింటాను నాయుడుబావా !'

అని అంటున్నాడు.

'బాగుండిరా. 'మంగళారతాని కావ్యాని' అన్నారు. తథాస్తు అనండోయి సభవారు' అన్నాడు రాజారావు.

సభవారితోపాటు రైలుబండికూడ 'తథాస్తు' అన్నట్టుగా కూత కూసినది. 'గార్డు' కూడ యీలవేసి జెండాతోడి చేయ్యెత్తి దీవించినాడు. సమయ్యానికి ఊడిపడి నట్లుగా జమీందారుగూడా పరుగుపరుగున వచ్చి బండిలో నెక్కినాడు.

కేకిసలు కొట్టుచున్న మన మిత్రులందఱు సదరుపాటుగ గను లప్పగించి చూచుచుండ, రాజేశ్వరరావు లేచి నిలిచి 'దయచేయండి, దయచేయండి' అంటూ చోటుచేసినాడు. జమీందారుగారు కూరుచుండి 'నాబోటి వృద్ధులు చెదలుపట్టకుండా వుండాలంటే అప్పుడప్పుడు మీవంటి పడుచువాళ్ళతో సావాసం చెయ్యాలి. మిమ్మం దఱిని చూస్తే నాకు తిరిగి యౌవనం వచ్చినట్టుగావుంది. మీరంతా ఒక్కసారిగా బయల్దేరారు. అందరూ ఒక కాలేజీలోనే చదువుతున్నారు కాబోలు. రాజేశ్వరరావు గారు మా వూరివాడు కావడంచేత నే నెఱుగుదును. తక్కిన అందఱూ కూడా రాజ మండ్రికేనా ? యింకా పైకిపోయేవారా ?' అన్నారు.

రాజే :—లేదండీ, అందరూ తలోవూరివాళ్లూ, తలో కాలేజివాళ్లూను. ఇదిగో, మా నారాయుడు యఫ్. యల్. పరీక్షకు వెళ్ళాడు. ఆలంసాహెబు కూడా యఫ్. యల్. కే. వెళ్ళాడు. అతడు రాజారావని వేమూరివారు. వారిది కాకినాడ. అతను యం. బి. బి. యస్. నాల్గోయేటి పరీక్షకు హాజరైనాడు. అడుగో అతను పరమేశ్వరమూర్తి. వాడ్రేవువారి చిన్నవాడు. ఆయన గ్రాడ్యుయేటు. కవి, చిత్రకారుడు, గాయకుడూను. ఇందాక మీకు కనిపించిన లక్ష్మీపతిది నిడమర్రు. ఇంటిపేరు నిడమర్తివారే. ఆయన మా నారాయడి బావగారు. ప్రైవేటుగా యఫ్. యే. పరీక్షకు హాజరైనాడు. ఒక్క లక్ష్మీపతి తప్ప తక్కిన అందరమూ ఒక్కసారే రాజమండ్రిలో ఇంటరు చదివాము.

లక్ష్మి :—రాజేశ్వరరావునాయుడుగారు మీకు తెలిసినవారే కదండి. బి. యి. పరీక్షకు హాజరైనాడు. చాలా సంపన్నగృహస్థులూ, సరసులూను.

జమీం :—సరిసరి. ఆయన్ని నేను ఇంతనాటినుంచీ యెఱుగుదును. కాలేజీలుమూసి చాలారోజు లైనట్లుంది. ఇంత ఆలస్యంగా బయలుదేరినారేమి ?

ఆలం :—రాజారావు పరీక్షలు మొన్ననే ఆఖరైనాయండి. అందుకోసం మేమంతా మరినాల్గు దినాలు నిలిచి ఏవో సినిమాలతో కాలక్షేపంచేసి బయలెళ్ళాము.

జమీం :—తక్కిన పరీక్షల్లో ఎట్లావున్నా, మనవాళ్లు లా కాలేజీలో చాలా మేటి లనిపించుకొంటున్నారు.

రాజే :—మా నారాయణరావు 'లా' ఆత్మవికాసానికి పరమశత్రు వంటాడు.

జమీం :—ఏమండి నారాయణరావుగారూ ! అయితే మీరు గాంధీమతస్థులా ?

నారాయణరావు సంభాషణ ప్రియుడయ్యు మితభాషి. తన హృదయానికి పులకరాలు కలిగించు చర్చ వచ్చినచో, పట్టుదలతో యుక్తులతో గంభీరమైన విద్యా

రై లుకూడ తథాస్తన్నది

ప్రౌఢితో కవిత్వమువలె, గీతమువలె ఉపన్యసింపగలడు. సంభాషణలో నెదుటివానిని చెరిగివేయగలడు. అప్పు డాతని సహజవినయసంపద మాయమగుటకూడ నొక్కచో సంభవించును. కొరడాకొనలవలె చురుక్కు మనిపించును. అపహాస్యరసము నంజుడు చూపును. ఎన్ని విషయములనైనను అలంకారములతో, ఉదాహరణలతో, భావనాపథములకు నెత్తివేయుచు మాట్లాడగలడు. కాని తనకు గౌరవాస్పదులగు పెద్దలన్న యెట్టి వాదములకు బోడు.

లక్ష్మి :—మా బావగారి తరపున నన్ను కొంచెం వాదించనీండి. అతని అభిప్రాయాల్నే నేను మనవిచేస్తాను. అత నసేది—? ఇప్పుడు దేశంలో విజృంభించియున్న 'లా' ధర్మదూర మంటాడు? సత్యానికి చాలా దూర మంటాడు. అసత్యం కలపందే నిజంకూడా నెగ్గదంటాడు. సాధారణంగా నిజం అసలు నెగ్గదంటాడు. ఇప్పుడుండే సాక్ష్యచట్టము, వ్యావహారికచట్టాలూ చాల దోషభూయిష్టాలనీ, అసలు ఆ తప్పు ప్రస్తుతకాలంలో 'లా' యొక్క తత్వంలోనే వుందనీ, అలా వున్నంతకాలం 'లా' సత్యానికి వేలకొలది మైళ్ళదూరంలో వుంటుందనీ వాదిస్తాడు.

జమీందారుగారు, తన హృదయము గ్రహించి నారాయణరావు సిగ్గుపడు చున్నాడని భావించుకొని, ఆతని మాట్లాడించక, ఇతరులతో ననేక విషయములు సంభాషించినారు.

మెయిలు వాయువేగముతో ఏలూరు వచ్చినది. జమీందారుగారు దిగిపోవుచు అందరితో తాను సెలవుతీసుకొనుచున్నాననియు, ఆనాటి స్నేహము మరల మరల తన కా యువకమండలి ప్రసాదించవలెననియు గోరినాడు.

'నేను మిమ్మల్ని ప్రార్థించేది మీరంతా ఈ రోజున మా ఊరులో మా యింటి కడ నా ఆతిథ్యం అంగీకరించాలని.'

ఆలం :—అయ్యో మేము సంతోషముతో వచ్చేదే. మాది ఏలూరు. నేను వస్తున్నానని మా తమ్ముళ్లు చిన్నచెల్లెలు స్టేషనుకు వచ్చారదుగో, మా అమ్మ నాకోసం ఎదురుచూస్తూ వుంటుంది. నన్ను క్షమించండి.

జమీం :—మిమ్మల్నెవర్నీ నేను బలవంతపెట్టను. ఎవరికి వీలుంటే వారువస్తే చాలా సంతోషిస్తాను. నాకు ఏ సంగతీ గోదావరి స్టేషనులో చెప్పాలని కోరిక.

అని జమీందారుగారు లేచి, వారందఱు తన కొనర్చిన నమస్కారములకు ప్రతినమస్కారములిడి, వెడలిపోవుచు, 'లక్ష్మీపతిగారూ ఒకసారి నాతో వస్తారా, ఒక చిన్నపని వుంది' అని పిలిచినారు.

లక్ష్మీపతి 'చిత్తము'ని ఆయనవెంట వెళ్ళినాడు. దారిలో కనబడిన 'గార్డును' చూచి జమీందారుగారు 'గార్డ్! వీరు నాతో మొదటితరగతిలో వస్తారు. కూడావచ్చే ట్రావెలింగు' టికెట్టు ఎక్జామినరుతో టికెట్టు విషయం చూడండి, నమస్కారము, అని లక్ష్మీపతి చేయిపట్టుకొని తన పెట్టెలోనికి గొనిపోయినాడు,

# ౩

## జమీందారుడు

విశ్వలాపురం జమీందారుగారైన లక్ష్మీసుందర ప్రసాదరావుగారిది పేరెన్నిక గన్న ఆఱువేల నియోగి కుటుంబము. హైదరాబాదు నవాబుగారి పరిపాలనలోనికి వచ్చిన రాజమండ్రీ సర్కారు దగ్గర వెండి తలందాను, బంగారు పొన్నుకఱ్ఱ, ఇరువదియైదూళ్ళకు వీరమిరాసీలు, నాలుగు సంప్రతులకు బదస్తూలు, దివాణం పొందుతూ, నిశ్శంక మహాశంక సింహమాన సకలవిద్వజ్జన ప్రముఖసంస్థిత అని బిరుదుపొంది తల్లాప్రగడ నన్నయనాయని పౌత్రులు గౌరవం పొందినారు. ఆ వీర మిరాసీలు క్రమక్రమముగా చిన్నజమీందారుగా పరిణమించినవి.

వారు నవాబులకు పన్ను కట్టుచుండిరి. వారి రాజకార్యనిపుణతకును, వేగు దనమునకును, జమీ దక్షతలో పరిపాలించి యైశ్వర్యవంతముగ జేయుచున్నందు కును నవాబులు మెచ్చుకొని బంగారు తలందాను, రవ్వల ఒర గల నిశితకరవాలము, శ్వేతచ్ఛత్రము, బంగారుపల్లకీలు, బిరుదునిశానీలిచ్చి శతాశ్వికదళమునకు దళవాయిగా నొనరించిరి.

విశ్వలాపురంజమీ మొగలితుర్రు పరిపాలనక్రిందికి వచ్చినపిమ్మట నన్నయ మంత్రి వంశీకుడైన తల్లాప్రగడ జగపతిరాజు మొగలితుర్రువారికడ అమాత్యుడై రాజ్యము సర్వవిధముల విజృంభింపచేసెను. కలిదిండి మహాప్రభువు జగపతిరాయని స్వామికార్యనిర్వహణదక్షతకు, స్వామిభక్తికి మిగుల సంతసించి, 'మహామంత్రి, రాజవంశోద్దీపక' అను బిరుదులు, రెండు గ్రామములతో దయచేయించినారు.

అట్టి యుత్తమవంశమున జన్మించిన శ్రీ రాజాలక్ష్మీసుందర ప్రసాదరావు, స్వకులదీపకుడయి, సదాచార సంపన్నుడై నూతన విజ్ఞాన ప్రకాశమున తన హృదయమును గాంతిమంతము చేసికొని. పాశ్చాత్య విద్యయందును గడతేరినాడు. సంస్కృతమున బి. యే., పరీక్షయందుత్తీర్ణుడయి ప్రసిద్ధపండితుల పాదములకడ సంస్కృతభాషామృతము సేవించి, అమరభావ పులకితుడైనాడు. తాను జమీందారుడయ్యు రయితుల కష్టములు పటాపంచలయి, వారు బాగుపడిననేగాని భావిభారత భాగ్యోదయము కాదని నిశ్చయించి, పూర్వపు శాసనసభలకు నూత్న శాసనసభలకు నుగూడ అధికసంఖ్యాకులగు ప్రజలచే ప్రతినిధిగ వరింపబడి ప్రభుత్వమునకు ప్రక్కలోని బల్లెమయి మెలగినాడు.

రాజనీతి శాస్త్రమున నాతడు న్యాపతి సుబ్బారావుపంతులుగారి ప్రియశిష్యుడు. మోచర్ల రామచంద్రరాయని ప్రియస్నేహితుడు అయ్యు గాంధిగారి అసహాయోద్యమముచే దేశము విప్లవమున బడిపోవునని ఆయన నమ్మడు. కావున శాసనసభలో

స్వార్థపరులగు ప్రజాద్రోహులకు తన స్థానమయినను చిక్కకుండ చేయగలుగుటయె తాను చేయగల దేశసేవయని నమ్మిన సత్పురుషు డాతడు.

లక్ష్మీసుందర-ప్రసాదరావుగారికి గంజాంజిల్లాలో నారికేళవలస జమీందారగు క్రొవ్విడి వీరబసవరాజవరదేశ్వరలింగముగారు తమ ప్రథమపుత్రిక వరద కామేశ్వరీ దేవి నిచ్చి వివాహముచేసినారు. వార్కి గర్భము నిరువురు పుత్రికలు, నొక పుత్రుడు పవిత్ర మొనర్చినారు. ప్రథమ పుత్రిక శకుంతలాదేవిని నెల్లూరుజిల్లాలో నొక చిన్న జమీకి ప్రభువైన భావనారాయణరావుగారి ప్రథమపుత్రుడు విశ్వేశ్వరరావుగారి కిచ్చి వివాహము చేసినారు.

కుమార రాజా విశ్వేశ్వరరావు చాల గర్వి. ఇంగ్లండుదేశమునకు బోయి అక్సుఫర్డులో ఎమ్. యే., పట్టమునంది హిందూదేశమునకు వచ్చి యుద్యోగుల నాశ్రయించి డిప్యూటీ తహశీల్‌దారుపదవి ప్రథమముననే సముపార్జించి ప్రాపకముచే డిప్యూటీకలెక్టరు పీఠ మచిరకాలముననే యధివసించినాడు. తాను జమీందారు నను మాట మరచిపోయి పై యుద్యోగులకడ వినయముగా సంచరించువాడు. బ్రిటిషు ప్రభుత్వము ఇండియాను వీడినచో నొక్క పురుగైన బ్రతుక దనియు, అత్యంత ఫలవంతము, నతి సుందరమునగు భారతభూమండలమెల్ల ఆసేతు హిమాచలము 'సహారా' యెడారి యయిపోవుననియు నాతనికి భయము.

విశ్వేశ్వరరావు మామగారితో హిందూదేశాన నాగరకతయే లే దనుచుండును. పాశ్చాత్యులు భారతభూమి మెట్టక పూర్వ మిచటివారెల్ల ఆఫ్రికావాసులగు నీగ్రోలవలె ఒకరినొకరు చంపికొని తినుచుండిరనియు దన యభిప్రాయము వెలిపుచ్చుచుండును.

కోర్టులో నగ్నివర్షము కురిపించి యభ్యర్థులను న్యాయవాదులనుగూడ దూదివలె నేకి విడుచును. న్యాయ నిపుణములగు వాదముల నాత దర్థము చేసికొనలేక యుక్కిరి బిక్కిరియై తన తీర్పునందు వానిని జారవిడిచి తప్పుదారిబడి పై న్యాయాధికారిచే సన్నసన్నని చీవాట్లు తినుచుండును. ఆతని తాబేదార్లు అరచేత ప్రాణము లుంచుకొని మసలుచుందురు.

ఇంటిలో భార్యాభర్తలకు చుక్కెదురు. సంతతము ఎట్టి చిన్నవిషయమునకైన ఇరువురకు మాటపట్టింపులు వచ్చి ఒకరితోనొకరు మాటలాడుట మానివేసికొందురు. జమీందారుల బిడ్డల మను నభిమాన మిరువురి మనఃపథముల నెల్లప్పుడు జాగరితమైయుండి సుడిగాడ్పులు రేపెట్టుచుండును.

వారి బిడ్డలు తల్లిదండ్రుల సర్వవిధముల ననుకరించుచు వారిలో వారు, సేవకులతో, తల్లిదండ్రులతో, తోడిపిల్లలతో కలహమాడుచుందురు.

కలహదేవతకు వారిది పుట్టిల్లు. అపశ్రుతి మేళవింపుతో, బహురాగముల కలయికతో, నాదేవి వారింట విచిత్రనృత్యము సలుపుచుండును.

లక్ష్మీసుందర ప్రసాదరావుగారి ప్రథమ పుత్రికా జామాత లిట్లు తిక్తఫలములై పోయి ఆయన హృదయమును తీరని కోరికలచే బాధాపూర్ణము చేసిరి.

శకుంతలాదేవికి సంగీత సాహిత్యముల నేర్పించినాడు. రాజమహేంద్రపుర వాసియగు నొక యమెరికను మిషనరీ భార్యకడ నామె కాంగ్లభాష గరపించినాడు. ఈ విద్య లామెకు గర్వము వృద్ధిజేసినవి. కళాభిజ్ఞతలేని జామాత కవి పిదరజనింప జేయు పిచ్చిపోకడలైనను, జిల్లా జడ్జీల భార్యలకడ, కలక్టర్ల సతులకడ, పాడుమని భార్యను ప్రోత్సహించుచుండెడివాడు. ఆమె విరసముగా తానవి యెల్ల మరచి పోయినానని భర్తతో నప్పడము విరిచెడిది.

రెండవకూతురు.శారద చిన్నతనమునుండియు శాంతవర్తన. మూగదేవుని వలె మాటలాడక విశాలనయనములతో, చిత్తరువువలె నన్నియు పరికించునది. ఆమె ఒక్కసారి దేనిని విన్నను మఱి మఱవదు. ఆమెమాటలలో సున్నితమై, తేటయై, మధురమగు చక్కని తెలివి తేటనీటియూటవలె ప్రవహించును. వీణె తీగలు, కోయిల గొంతులు కొండకోనలోనివేణుని కుంజముల పాటలుగూడ పేలవము చేయగలిగినది ఆమె కంఠము. గానమూర్తి యగు శ్రీరామయ్యగారి పాదములకడ నామె సంగీతము నేర్చికొన్నది. శ్రీరామయ్యగారు గాత్రములో, 'ఫిడేలు' వాద్యములో దక్షిణాపథమున పేరెన్నికగన్న కళాస్వరూపులు. జంత్ర వాద్యములో నాయనను మించువారు ఆనాడు లేరు. తన కమానుకదల్పులోని విశ్వ గీతాస్వనము నాయన శారద కమానులోనికి ప్రవహింపజేసినాడు. శ్రీ త్యాగరాజ మూర్తి కన్నులరమూసి శ్రీ సీతారాముని ప్రత్యక్షము జేసికొనిన దివ్యగానములో జనించిన తారక లగుకృతులు, ఆ సంప్రదాయముతోనే శ్రీరామయ్యగారు శారదకు ధారవోసినారు. శారద వీణయు బాగుగా నేర్చికొనుచున్నది వీణాదక్షుడగు వేరొక యుత్తమ వైణికునికడ.

శారదకు తండ్రియన్న ప్రేమమిడి యెక్కువ. ఆమె చిన్న తమ్ముని నొక్క క్షణమైన వదలియుండదు. అచ్చముగా తన తల్లిపోలిక యైన శారదను జూచిన జమీందారుగారికి గాఢానురాగము పెనవైచికొని పోవునది. తనఆశయముల కీమెయే తగిన కుమారితయని యాయన గర్వపడును. 'చదువులలో చిత్రమెల్ల జదివిన బాలా!' అని ఆనందబాష్పములతో తనయను గాఢాలింగనమొనర్చి యొకనాడు జమీందారుగారు తన స్నేహితులకడ, అప్పటికి బదునొకండేండ్లు ప్రాయముగల శారదచే సంగీత సాహిత్యసభ చేయించినాడు. వృద్ధుడు, శాంతమూర్తి, తేజస్వియు నగు భాస్కరమూర్తి శాస్త్రుల్లు బి. యే., యల్. టి. గా రామెకు నాలుగు భాషలు, ఛప్పన్నవిద్యలు నేర్పినారు.

నేడు శారద పదునాల్గు సంవత్సరముల యెలనాగ. అందాలప్రోవు. సుగుణాలనిధి. చదువుల కన్నతల్లి. ఆమెకు తపఃఫలమై జీవితకల్పకమగు భర్తను గొనితేవలయు.

సంఘ సంస్కరణాభిలాషి యగు జమీందారుగారు శారదకు ఉన్నతవిద్యలు చెప్పించవలెనని యెంత కుతూహలపడినను ఆయన హృదయము మాత్రము పూర్వ

సంప్రదాయ ఘంటాపథము దాటలేకపోయినది. వయసుమీరిపోకుండ శారదకువరుని తేవలయు. ఇదివరకు జమీందారీకుటుంబములతో వియ్యమందినాడు. ఆసరదాతీరినది. తల బొప్పెలు కట్టినది. ఈనాడీ అనురంగుకూతురిని 'జమీందారు కిరాతుచేత నిడ నమ్మ త్రికరణశుద్ధిగ నమ్ము శారదా!' అని హృదయమున శపథము చేసికొన్నాడు.

భార్యయైన వరద కామేకాశ్వరీదేవి తన అన్నగారి కొమరుడగు శ్రీ క్రొవ్విడి బసవ రాజేశ్వర జగన్మోహనరావునకు శారదనిచ్చి యుద్వాహమొనరింప పట్టు పట్టినది. అన్నగారగు విశ్వేశ్వర ఆనందసువర్ణేశ్వరలింగంగారు విజయనగర వేశ్యా వాటీ సముద్రజనిత మాయాప్సరోమణీ నీచశృంగార సమారాధనలో ప్రాణముగ్గూడ ధారవోసి, ఆస్తి అప్పులపాలుచేసి, పోయినాడు. 'కోర్టుఆఫ్‌వార్డ్సు' వారు వ్యవహ రించి, అప్పులు నిశ్శేషముగా దీర్చివేసి, రెండులక్షలరూపాయల విలువతో నిరువది రెండేళ్ళ వయసున జగన్మోహనరావుకు జమీ అప్పగించినారు.

ఈ చిన్న జమీందారునిగూర్చి రహస్యములు కథలై దేశమంతట ప్రాకుచున్నవి.

లక్ష్మీసుందర ప్రసాదరావుగారాసంబంధముమాట భార్య కదిపినప్పుడు జుగుప్సపడినాడు. 'అమ్మాయిని నరకకూపంలోకి వేరే త్రోయనక్కరలేదు! మన హృదయాలు పాషాణాలు చేసుకోవాలి మీ మేనల్లుడి కివ్వాలంటే' అన్నారు.

శీఘ్రముగా వివాహముచేయ సంకల్పించి వరునికై ఆంధ్రదేశము వలలువేసి వెదకించినారు. అభిజాత్యముగలవాడు, అన్నవస్త్రములకు లోపములేనివాడు, మంచి తెలివైనవాడు, రూపవంతుడు, గుణవంతుడు, చదువుకొన్నవాడు గావలెనల్లుడు. సుప్రసిద్ధ నియోగి కుటుంబములన్నియు వెదకించినారు. వాడ్రేవువారు, మంచి రాజువారు, మారెళ్ళవారు, చెన్నాప్రగడవారు వేయేల గోత్రములు ఋషులు కలియని ఇంటిపేర్లవారి 'జాబితా' గవర్నమెంటువారి 'నీలపుకాగితము' వంటిది తయారైనది.

తారాచువ్వవలె పైకెగయు బాలురకు ధనముండదు. ధనమున్నవారు విద్యాగర్భ దరిద్రతలో మునిగియున్నారు. రెండునుగల బాలకులకు రూపసంపద ఎరువుతీసుకొని రావలయును. కొంచెము కొంచెముగా నీ మూడును ఏకీభవించిన నరులు విషకుంభసమానులు. జమీందారుగారికి విసుగు జనించి శారదకు తగినభర్త దొరకునా? యనిపించినది. తన భావవీధిలో నడయాడు జామాత క్షేమాత్రము తీసిపోయినను అట్టి వానికి చూచి చూచి తన ముద్దులపట్టి నొసగుట కాయనకు మనస్సొప్పినదికాదు.

౪

## నా రా య ణు డు

బెజవాడ ప్లాటుఫారంలో నారాయణరావును జూచునప్పటికి, జమీందారుగారికి హృదయ మొక్కసారి యేలాకో ద్రవించిపోయినది. అస్పష్టమగు నొక్కవాక్కు

ఇతడే శారదకు వరుడు అని తన హృదయాంతరాళమునుండి నిశ్శబ్ద గీతాన ప్రతి ధ్వనించినది. నారాయణరావుకు వివాహము కాలేదని ఏల తట్టినదో జమీందారుగారి నాటికి చెప్పలేరు.

వ్యవహారములకై వచ్చినవారితోడను, తోటివారితోమాత్రమే సంభాషించు జమీంద్దారుగారు నారాయణరావు కడకేగి 'మీకు వివాహమైనదా ?' యని ప్రశ్నించినారు.

పిమ్మట మొగమెరుకగల రాజేశ్వరరావువలన నారాయణునిగూర్చిన వివరము లడిగి తెలిసికొన్నారు.

అయన, కంటికి పుస్తకాల దుకాణము కడ దూరముగా నున్నప్పుడే నారాయణ రాయని యాజానుబాహువిగ్రహము, పురుషత్వము మూర్తీభవించిన తేజముతో, కనుపించినది.

అవయవస్ఫుటత్వము కమ్మెచ్చున దీసినట్లున్నను, అతని కనుబొమలలో, పై పెదవి మెలుపులో, రేఖలు తిరిగిన నిడివిచెవులలో, సమమైన నాసికలో, వనితా లాలిత్యము వెన్నెలవలె ప్రవహించుచుండును. గాఢముష్టిఘాతమున స్తంభమునైన విరుగగొట్టగల యాతని చేతులు దీర్ఘాంగుళులతో, మెత్తని తలములతో నందమై యున్నవి. ఎత్తయి విశాలమైన యాతని ఫాలము, నల్లని దట్టమైన జుట్టు పొదువు కొన, కారుమబ్బు లాక్రమించిన వెన్నెలతునుకవలె విరిసిపోయినది.

నారాయణరాయని యౌవనసుదృఢ దీర్ఘదేహకాంతి ప్రవాహములో జమీం దారుగారు చిరపిపాసువగు హృదయమును తనివోవ నోలలార్చినారు. తమకు సమీపమందుననే యిన్నినాళ్లు దాగియున్న యీ పురుషరత్నమును తన భాగ్యదేవత నేటికి సాక్షాత్కరింపజేసినదని మురిసిపోయినారు.

లక్ష్మీపతి నారాయణరావునకు మూడవ బావమరదియు, మేనత్త కొడుకును, తల్లి దండ్రుల కొక్కడే సంతానమగుట సోదర సోదరీ ప్రేమయెరుగక, తన హృదయమంతయు నత్తవారికుటుంబమునకు ధారవోసినాడు. చిన్నబావయగు నారాయణరావును తమ్మునివలె ప్రేమించినాడు. ఆతని భావనాపథముల, నారాయణ రావు అమర్త్యబాలకుడు.

ఏలూరినుండి తాడేపల్లిగూడెం స్టేషనువరకు లక్ష్మీపతి శ్రవణపేయముగా నారాయణుని గుణగణవర్ణన చేయుచుండ, స్పెన్సరు చుట్టకాల్చుచు మెత్తని మొదటి తరగతి దిండుపై పరచిన బూరుగుదూది దిండ్లపై నొరగి, జమీందారుగారు హృదయమార వినుచున్నారు.

'నారాయణ మనస్సు చాలా మెత్తనండి. ఒకళ్ళబాధ చూళ్లేడు. చిన్న బాలుడుగా ఉన్నప్పుడుకూడా ఎవరైనా ఏడిస్తే వాడికళ్ళ గౌతమి తిరిగేది. తన అందమైనవస్తువుల వాళ్ళకిచ్చి ఊరడించడానికి ప్రయత్నించేవాడు. ఎంతమందో నౌకర్లున్నా చెల్లెళ్ళని, అన్నగారి బిడ్డల్ని తనే ఎత్తుకుంటాడు. ఆ పిల్లలు తల్లి

దండ్రులకన్న నారాయణంటే చెంగున గంతువేసేవారు. చంటిబిడ్డ తల్లిదగ్గరకు వెళ్ళడమల్లా పాలకోసమేగాని వాడిపక్కలోనేనిద్ర. మావాడిగొంతుకలో తేనెల తీయదనం, ఉరుముల గాంభీర్యం పెనచుకొన్నాయి. పాటలు పాడ్తే నాకు కళ్ళనీరు తిరిగేది. సంగీతం నేర్చుకోరా అంటేనేనంత పవిత్రుణ్ణికానురా అనేవాడు.

'బళ్ళలో చదివేటప్పుడు తోటివాళ్లొక్కళ్లూ బాధపడకూడదు కదాండి. పుస్తకాలు బొమ్మలు తినుబండారాలు అందరికీ అస్తమానం పంచుతోవుండేవాడు!' తాడేపల్లిగూడెమునుండి నిడదవోలు వరకు నారాయణరావు చదువుసంగతి లక్ష్మీపతి జమీందారుగారికి పదము పాడినాడు.

'ఎప్పుడూ ఏపరీక్ష తప్పలేదు. ప్రతి తరగతిలోనూ మొదటివాడే. ఇంటరు మూడు సబ్జెక్టులలో మొదటిమార్కులు సంపాదించాడు; బంగారు పతకాలు. ఇంతలో మహాత్మగాంధీగారి సహాయనిరాకరణం వచ్చింది. రాజమండ్రి కాలేజీ వదలివేసి దేశంకోసం పనిచేశాడు. ఖైదుకువెళ్ళాడు, ఆరు నెలలు నిర్భయంగా కృష్ణజన్మస్థానంలో గడిపాడు. వచ్చాడు. స్వరాజ్యపార్టీఅంటే ఇష్టంలేదు. బి.యస్.సి. ఆనర్సు చదివాడు. రెండవవాడుగా నెగ్గాడు. ఎఫ్. యల్. లో మొదటిస్థానము తప్పదు కదాండి.'

నిడదవోలు దాటేసరికి లక్ష్మీపతి తన బావగారి ఆస్తి వేదపారాయణము చేసినాడు.

ఇద్దరన్నదమ్ములు. మూడువందల యిరవై యకరముల మాగాణివుంది, తోటలు ముప్పయి యకరముల పైన ఉండవచ్చు. వడ్డీవ్యాపారంలో లక్ష అరవై వేలవరకు తిరుగుతున్నట్టు జ్ఞాపకం. బ్యాంకులలో షేర్లతో పాటు రెండు లక్షల రూపాయలవరకు ఉన్నవి. ఎంతలేదన్నా ఇరువై వేలదాకా నికరాదాయంఉంటుంది. మా మామగారు, సుబ్బారాయుడుగారు మంచి గుణవంతులు. మా అత్తగారు జానకమ్మగారు పార్వతీదేవి. నలుగురు కొమార్తెలకు వివాహాలయినాయి. మంచి సంబంధాలు చేశారు.

జమీం:—సర్వవిధాలా వరప్రసాదిగావున్నాడు, మీ బావమరది. నా సంకల్పానికి దైవమనుకూలిస్తే, మా అమ్మాయీ నేనూ కూడా ధన్యులమవుతాము.

లక్ష్మి:—అదేమిటండీ; తమరు గొప్పవారు. తమరు తలచుకొంటే జమీందార్ల సంబంధాలే కుదురుతాయి.

జమీం:—సరి! జమీందార్ల మాటకేమిగాని మన నియోగులలో సరియైన ఒక్క సంబంధం చెప్పండి. మీరూ చిన్నవారు. చదువుకుంటున్నారు. మీయెరుకను మంచి సంబంధం చెప్పండి.

లక్ష్మి:—(చిరునవ్వుతో) చిత్తం! నాకుమాత్ర మేమి తెలుసునండి.

జమీం:—అవునుగదా! నామనస్సు చివికిపోయేటంతవరకూ గాలించి వొదిలేను. ఇంత దగ్గిరలో మహారాజులు ముచ్చట పడిపోయే సంబంధం ఉందని తెలి

యకపోయింది. కాని భగవంతుని కృపవల్ల ఇప్పటికైనా తెలిసింది. లేక పోతే నా జన్మల్లా దుఃఖపడియుందును.

లక్ష్మి :—మనస్సులు కలిస్తే అంతా అల్లా కనబడుతుంది. నాకు మీవాడు మా అల్లుడు కావడం, ఎంతో సంతోషం. కాని మాకుటుంబాలు పల్లెటూరి కుటుంబాలు !

టమీందార్లుగా రాలోచనా పథములలో నెగయుచు అర్ధ నిమీలిత నేత్రులయి కూరుచుండిరి.

రైలు కొవ్వూరిలో ఆగి, గోదావరి వంతెన దాటుచున్నది.

సుందరీమణియై, నారాయణరావు పోలికలు గలిగి, ఒక చిన్ని బాలునకు తల్లియైన ప్రోయాలోకర్తు కొత్తపేటలో నామె పుట్టినింట సక్తై ఎదురుచూచు చున్నట్లు తోచి, లక్ష్మిపతి, చిరునగవు మెరుములీన, గోదావరి జలముల పాలజూచు చుండెను. ఆమె ప్రేమమూర్తి. భర్తకు సదుపాయము లమర్చుట నామె వేయి కనులు, వేయి చేతులతో పరిచర్య చేయును. ఆ నిర్మలగౌతమీ నీలజలములకు నామె హృదయమునకు ఎంత చుట్టరికమున్నది. తమ సర్వస్వము భర్తలకై ధారపోయు హిందూవనితామణులు భర్తలకు పూజింపదగినవారు. లక్ష్మీపతి యా వాగౌతమీ నిర్మల గభీరతలో తన ముద్దుబిడ్డ మో మింతలో చూచినాడు. అతని మోమున, సంధ్యాకాళమున అరుణ రాగమువలె, చిరున వ్వలంకరించినది.

బండి గోదావరి దాటి స్టేషనుకడకు వచ్చి ఆగినది. జమీందారుగారును, లక్ష్మి పతియు బండి దిగినారు. లక్ష్మిపతి 'అయ్యా సెలవు పుచ్చుకుంటాను, నమస్కారమండి' అని తన స్నేహితులున్న గదికడకు పోయినాడు. ఆలం ఏలూరిలోనే దిగినాడు. కూలీలు మూడునిముషములలో సామానులు సర్దినారు. రాజేశ్వరరావు, నారాయణరావు, లక్ష్మిపతిగారలు పరమేశ్వరమూర్తి రాజారావుల బుజాలమీద తట్టిరి. ప్రీతిపూర్వకముగా కరస్పర్శ గావించి, వారు సెలవుగైకొని టిక్కెట్లు పుచ్చుకొను ద్వారముకడకు వచ్చినారు. ఇంతలో జమీందారుగారును వేరొక పెద్దమనిషియు, నలుగురయిదుగురు జవానులు, ముగ్గురు జమీందారీ యుద్యోగు లీ యువకులకడకు వచ్చినారు.

జమీం :—ఈయన నాకు చిన్నతనాన్నుంచి స్నేహితుడు. వేపా శ్రీనివాసరావు గారు. ఈవూళ్ళో పెద్ద వకీలు.

శ్రీని :—చాలా సంతోషంగా ఉందండి మీవంటి పడుచువాళ్ళను కలుసుకోవడం. మరేమంటే మీరు భావి ఆంధ్రదేశానికి కీర్తితెచ్చే మణులని మా జమీందారు గారు చాలా చెప్పారు, యీ రెండు నిముషాల్లోనే.

జమీం :—వీరు లక్ష్మిపతిగారు, వారు ఈయన బావమరది నారాయణరావుగారు.

లక్ష్మి :—(జమీందారుగారు పేర్లకై తడుముకొనుటచూచి) అతడు రాజేశ్వరరావు నాయుడు.

శ్రీని:—చాలా సంతోషంగా ఉందండి. ఈ రోజున మీరంతా మాయింటికి అతిధులుగా దయచేయాలి, తప్పదు. లక్ష్మీపతిగారు! మీరు మాటతీసేశారంటే నాకు మనస్సు నొప్పికలిగించారని నష్టానికి దావాతెస్తాను.

లక్ష్మీ —(నిముషములో గ్రహించి) రాజేశ్వరుడిమాట నేను చెప్పలేనుగాని, మే మిద్దరం వస్తాము.

రా —నేను ఇంటికి వెళ్ళి తర్వాత వస్తాను.

శ్రీని:—ఇంటికి వెళ్ళి భోజనానికి రావాలి. లేకపోతే దావా తప్పదు.

రాజే:—మీకు మూడుపైసలు డిక్రీయిస్తారు. ఇప్పుడే చెల్లించమంటే చెల్లిస్తాను.

శ్రీని:—రాజేశ్వరరావుగారు! మీనాన్నగారు నాకు పూర్వాన్నుంచి పరిచితులు. నా సరదా తీర్చండి.

రాజే:—పది గంటలకు కలుసుకుంటాను. సెలవు.

అందరును స్టేషనుబయటకు వెళ్ళినారు. సామానులు జమీందారుగారి గుర్రపు బగ్గీలలో సర్దించి, శ్రీనివాసరావుగారు తనమోటారులో అతిధులిరువురిని తన ఇంటికి గొంపోయిరి.

జమీందారుగారు సొంతమోటారుమీద తమ భవనమునకు వేంచేసినారు.

## ౨

## శారద

గౌతమీజలచుంబిత ప్రత్యూషవాయు బాలకులు ఒయారముగా దేలియాడుచు వచ్చి, ఆ వనపుష్పచేలాంచలములలో దోబూచులాడుచుండిరి. వసంత గాఢసౌరభములు పొగవలె సుడులుకట్టి యెల్లెడల వ్యాపించుచున్నవి. బోగైన్ విల్లాలయు, గులాబులయు, వివిధ కుంకుమవర్ణములు, మల్లీమాలతుల స్వచ్ఛహృదయార్ద్రశ్వేతవర్ణములు, చంపక కనకాంబరముల సువర్ణరాగములు, నీలాంబర నిర్మలనీలములు కలసి మెలసి చిత్రరూపమై సొబగుమించిన జమీందారుగారి యుపవనములో, శారద ముగ్ధవనలక్ష్మివలె పూలు కోయుచున్నది. శారదకు పూలన్న ప్రాణము. (ఏబాలకు గాదు?) పూలచరిత్రలన్నియు నామెవల్లించినది. పూలమనసులు, పూలబాసలు నామె యెరుగును.

ఏ ఋతువుల నే పూ లవతరించునో, ఏ ప్రదేశముల నే కుసుమములు కలకలలాడిపోవునో హాస ప్రఫుల్లవదనయై శారద చెప్పుచుండును.

శారదాకుమారి సౌందర్యమూర్తి. ఆమె నయనములు విస్ఫారితములై, యర్ధనిమీలితములై, దీర్ఘనీలవర్త్మాంచలములై, విచిత్ర జీవిత నాటకము నాలోకించుచు, నాశ్చర్యహాసముల వెదజల్లుచుండును. నల్లనిపాపలు రెప్పలమాటున సగము దాగికొని యామినీ నీలాకాశగభీరములై తోచును. మేలిమిబంగారు రంగులో తామర మెరుపు కలిపిన శరీరచ్ఛాయ. నవయౌవనపు తొలివెలుగు లామె ఫాలఘుపై, నాసి

కాగ్రముపై, బుగ్గలపై, పెదవుల యంచులపై, చిబుకముపై, కంటి పైరెప్పలపై, చెవుల-తమ్ములపై న ర్తించుచుండును. స్వప్నసీమలగు కనుబొమలు సన్ననై చంద్ర వంక వంపులుతిరిగి చెక్కుల మాయమైనవి. బంగారు గన్నేరుమొగ్గవంటి ముక్కు, విలువంపగు నరుణో త్తరోష్ఠముపై పైడిమేడగట్టినది. మధ్య సుడి నొక్కుతో కాశీరత్న పుష్పములజంటబోలి యామె యధరము స్పష్టరేఖాంకితమై తేనియలు చెమరించుచున్నది. లేత దానిమ్మపూవామె చిబుకము. పదునాలుగేండ్ల యెలప్రాయపు మిసిమిరేకలు కర్ణములనుండి యంగుళీయాంచలముల కెత్తిపోతలైనవి. బాహుమూలములనుండి పాదతలములకు సొంపు లెగబోయు ఏటి కెరటాలవంపులు మిల మిల లాడిపోవు -కమ్మని చందనవర్ణపు పట్టు పరికిణీమడతలలో మెలివడిపోయినవి. నానాట నానందకిసలయములై మొలకెత్తు ముగ భావములు గులాబిరేక మబ్బుల, నీలిపయ్యెద జిలుగువెలుగుల తొంగిచూడసాగినవి.

ప్రక్కపాపట తీసికొని, ఒత్తై పొడవైన కచభారమును పిరుందులవరకు వ్రేలాడు వాలుజడగా గీలించి, కాళ్ళకు జరీబుటాపూవుల మొఖమల్ లూధియానా చెప్పులు తొడిగికొని, చెవుల లోలకులలో, కుడిముక్కుపుటమున చేసరిలో, మెడను హారములలో రవ్వలు, నీలాలు, కెంపులు తళుకులీనగా, నెమ్మదిగా పూవుల నరసికొనుచు, నొయ్యారముగా నడుగులిడుచు, తోటలో శారదాదేవి విహారము చేయుచుండగా. "నాన్నగారువచ్చినా" రని కబురు వచ్చినది.

శారదాదేవీ జమీందారుగారి తనయ నన్నమాట మఱవదు. ఆంధ్రదేశమున తన సుగుణములచే, దాతృత్వదీక్షచే వంశధారనుండి పెన్నవరకు వేనోళ్ళ వినుతింపబడు శారదాంబా జమీందారిణీగారి మనుమరాలగుటచే నామె పోలిక లన్నియు పుణికి పుచ్చుకొన్నది.

'తల్లీ శారదాంబా! ఈ దీపం నువ్వుపెట్టినదమ్మా! ఈ బిడ్డలు నీవారమ్మా! ఈ వంశము నువ్వు నిలిపినదమ్మా' అని యీనాటికిని జమీందారుగారి తల్లి నెన్నియో వేలం దరి జనులు తలచుకొని మ్రొక్కుచుందురు. జమీందారుగారితండ్రి జీవించి యున్నప్పుడును, ఆయన కీర్తిశేషులైన వెనుకను, జమీందారుగారి చిన్నతనములోను, జమీందారుగారు పెద్దలై రాజ్యభారమువహించినవెనుకను, శారదాంబా జమీందారిణిగారు బ్రదికినన్నాళ్లు అహోరాత్రములు అన్ని వర్ణములవారికి అన్నప్రదానము గావించినారు. మాలమాదిగలకు వంటలు చేయించి పెట్టించినారు. ఎందఱికో పెండ్లి పేరంటములు చేయించినారు. సంగీతసాహిత్య ధర్మశాస్త్రవేదాది విద్యా పారంగతులకు వార్షికములొసగి, సంభావించినారు. హైదరాబాదు సంస్థానములోవర్తకము చేసి, కోటికి పడగనెత్తిన గంగరాజు సుజనరంజనరావుగారి కామె ఏకపుత్రిక. సుగుణసంపదయు ధనసంపదయు నామెలో గంగా యమునల వలె సంగమించినవి.

తండ్రిగారు వచ్చిరని తెలియుటతోడనే, శారదమోమున సంతోషము విఱియ బాఱ, తలలో తుఱుముకొనుటకు గోసికొన్న పూవులను సజ్జలో నిడికొని, విసవిస

నడచి భవనములోనికి బోయినది. మేడమీద తన గదిలో నద్దములయెదుట నిలుచుండి పూవుల నమరించుకొని, యా బాలిక నాయనగా రెక్కడ నున్నారో. వెంకాయమ్మ నడిగి తెలిసికొని యచ్చటికి బోయినది.

జమీందారుగారు తాను చదువుకొను గదిలో సోఫాపై కూర్చుండియున్నారు. శారద తల్లిగారు వరద కామేశ్వరీదేవియు నచ్చటనే దిండ్లకుర్చీలో కూర్చుండి భర్తతో మాట్లాడుచున్నది. జమీందారుగారి యక్క సుందరవర్ధనమ్మయు నచట నిలుచుండి 'ఎందుకోయి! పిలిపించినావు అని యడిగినది:

సుందరవర్ధనమ్మగారు విగతభర్తృక. హైకోర్టు న్యాయాధిపతిచేసి, లక్షలు సముపార్జించి, న్యాయధర్మములో ప్రఖ్యాతివహించిన విశ్వనాథంగా రామె భర్త. వేదాంత జ్ఞానోపార్జనాసక్తి యామెకు మిక్కుటము. సంతతము ఆమె పట్టుబట్టలతోనే యుండును. ఆమె కుమారుడు తండ్రిబోలి చెన్నపట్టణములో న్యాయవాద వృత్తిలో పేరును ధనమును వెనుక వేసికొనుచు దివ్యముగ కాలక్షేపము చేయుచున్నాడు. పుత్రునింట తన యాచారాదికములు సాగమి, ధర్మకర్మ పరతంత్రుడగు నామెతమ్ముని ఇంటనే యుండి, యాజమాన్యము వహించి, కాలక్షేపమొనర్చుచున్నది.

జమీం:—చిన్నమ్మాయికి ఈ రోజున పెళ్ళికొడుకు వస్తున్నాడు.

వర్ధనమ్మ, వరదకామేశ్వరి—ఎక్కడనుంచి, ఎవరు?

జమీం:—కొత్త సంబంధం—

వర్ధనమ్మ:—మనదేశమేనా? మనదేశంలో ఇదివరకు మనం చూసి నచ్చ వనుకున్న సంబంధాలేగా అన్నీ?

వరద:—జమీందారీ కుటుంబమేనా?

జమీం:—(నవ్వుచు) నన్ను చెప్పనివ్వండి. మఱి మనదేశమే. జమీందారీకుటుంబం కాదుగాని పరువైననియోగులు. చాలా సిరీ, సంపదా కలవాళ్లు. (భార్యవంక చూచుచూ) జమీందారులకుకూడా అప్పిచ్చేటంత నిల్వ వుంది.

వర్ధనమ్మ:—పల్లెటూళ్ళలో మెరపకాయ కాల్చుకొని తింటూ డబ్బు ల్పవేసుకొన్న కోమట్లలాంటి మనవాళ్లు కొందరున్నారు. అలాంటివాళ్లు కాదుకదా?

వరదకామే:— బాగా అన్నారు వదినా!

జమీం:—మనకన్నా మర్యాదకలవాళ్లు. జమీందారులకు బుద్ధులు నేర్పగల పరువు ప్రతిష్ఠలు కలవాళ్లు.

వర్ధనమ్మ:—పెళ్ళికొడుకు ఎల్లావుంటాడు?

వరదకామే:—ముంజేతి కంకణానికి అద్దమెందుకు వదినా! పెళ్ళివారు వస్తున్నారుగా! పల్లెటూరి ఆంబోతు కేమీ తీసిపోడులెండి.

వర్ధనమ్మ:—ఆ! మరిచిపోయాను, పెళ్ళికొడుకు ఏం చదివాడు?

జమీం:—పెళ్ళికొడుకుది నవమన్మధాకారం. వంట్లో రక్తములేక పాలిపోయి, అదో మంచి మేలిమిబంగారు రంగని చెప్పుకుంటూ నాల్గడుగులు నడవలేని

మనజమీందారి దద్దమ్మకాడు. అందానికి అర్జునుడు, బలానికిభీముడు ఈ సంబంధము కుదిరితే మన శారద అదృష్టవంతురాలు.

వరద :—కాకిముక్కుకు దొండపండు. ఇంతవరూ మీకు మావాడు నచ్చలేదు. వాడి కేమిలోటో? ఎందుకు నచ్చలేదో? నాతో చెప్పారుకాదు. ఖర్చు కొంచెము ఎక్కువచేస్తే దుర్వ్యయమంటారు. ఓర్పులేనివాళ్లు కల్పించినవన్నీ నమ్ము తారు. శారదకూడ ఎదుగుతూంది. దాని అభిప్రాయముకూడా అడగడం మంచిది. మీరు నవనాగరీకులుగాదూ! వీరేశలింగం పంతులుగారితో స్నేహము చేసినవాళ్ళేనూ! ఆడపిల్లకు ఏసంబంధం యిష్టమో అది చేయ డమే మంచిదికాదూ.

వర్ధ —ఆ! మరదలుగారు స్వయంవరాలు చేయించమంటారు. శారదను పిలి పించండి.

ఇంతలో మెరుపుదీగవలె శారద యచ్చటికి వచ్చినది. తండ్రిగారు చేతులు చాచుటకోడనే యా బాలిక పూలబంతివలె ఆయన కౌగిలింతలోనికి వచ్చి వ్రాలెను. కుమార్తె శిరంబు మూర్కొని తనప్రక్క సోఫాపై కూర్చుండబెట్టుకొని, జమీం దారుగారు 'శారదా ఎక్కడికి వెళ్ళినావమ్మా' యని ప్రశ్నించిరి.

శా :—తోటలో పువ్వులు కోసుకుందామనిన్నీ, నీళ్లు సరిగ్గా లోడేదో లేదో చూద్దా మనిన్నీ వెళ్లాను. నాకోసం మీరు చెన్నపట్నం వ్రాసిన పుస్తకం వచ్చిం దండి బాబయ్యగారూ. నిన్ననే షేక్స్పియరు మొదలుపెట్టింది మా దొర సానమ్మగారు. 'వెనీసు వర్తకుడు' అనే నాటకం. మనం తెప్పించుకున్న పుస్తకంలో నాటకాలన్నీ వున్నాయి. బొమ్మలుకూడా చాలాబాగా వున్నా యండి. కాని 'వెరిటీ' అచ్చువేయించిన 'యెడిషను' కావాలట! అది తెప్పించి పెట్టరూ బాబయ్యగారూ?

జ :—నీ యీడున షేక్సుపియరు పేరే తెలియదమ్మా మాకు. నీకు మంచి గురువు గారు దొరికింది. నాదగ్గర 'ఆర్డెను యెడిష'నుంది. అది వెరిటీకన్న చాలా మంచిది.

తండ్రికొమార్తెల కిరువురకు సంభాషణ యింగ్లీషులోనే జరిగినది. తండ్రి శారదవైపు చిఱునవ్వుతో చూచి యింగ్లీషులో నిట్లు పలికెను.

'శారదా! జగన్మోహనరావు సంగతి నీకు చాలా వివరించి చెప్పాను. నీకు సర్వవిధములా తగిన వరుణ్ణి ఈ రోజున రప్పిస్తున్నాను. చదువులో మొదటివారిలో మొదటివాడు. రూపసంపదేకాదు, మంచి బలమైనవాడూ, అందమైనవాడు. ధనంలో మన కెంత ఆస్తి వున్నదో అతనికి అందులో సగం ఉన్నది. అతను ఎఫ్. ఎల్. పరీక్షకు వెళ్ళినాడు. మొదటివాడుగా నెగ్గుతాడు. పరీక్షలోను, ఆటలలోను నెగ్గిన మెడల్సు' 'కప్పులు' 'కాకివారి షాపంతషాపు' పెట్టించవచ్చు నన్నారు.

శారద సిగ్గుపడి చిరునగవుతో మాట్లాడక తలత్రిప్పి యూరకున్నది.

వర్ధనమ్మగారు తమ్మునితో 'నీతో చెప్పుటకు సిగ్గుపడుచున్నదేమోనోయి' అని యన్నది.

'వారంతా సాయంత్రమునకు అమ్మాయిని చూడడానికి వస్తారు.' అని జమీందారుగారు స్నానమునకు లేచినారు.

## ౬

## కొ త పే ట

సుబ్బారాయుడుగారు మంచి సరసుడు, మాటకారి. తేనెలూరునట్లే వ్యవహారమునయినను, తేటతెల్లముగ వివరింపగలరు. వ్యవహారదక్షులైన సుప్రసిద్ధ న్యాయవాదులే యాయన మాటలు చెవులార వినుచుందురు. అప్పులిచ్చు షాహుకార్లకందరకు తప్పనివగు ధనసంబంధి వ్యాజ్యములలోదప్ప నితరములయెడ నాయనకు సంపర్కమేదియు లేకపోయినను, చక్కని బుద్ధిసూక్ష్మత, పరిశీలనాదక్షత కలవాడగుటచే నే సంబధమైనను, న్యాయసూత్రములపట్ల విచిత్రాలోచన చేయగలడు. సలహా చెప్పగలడు. చదువుకొని పట్టాను బొందినచో భాష్యం అయ్యంగారు కాదగిన తెలివి యాయనకుగలదు. హిందూన్యాయశాస్త్రములో నిదివరకులేని కొన్ని సూక్ష్మముల వివరించి యాయన యొసంగిన సలహాలవలన, ఒక దత్తతాభియోగము నెగ్గినదనియు, నా వ్యవహారపు దీర్పే దత్తతాన్యాయమును చాలవరకు మార్చిన దనియు కోనసీమలోని పండిత పామరులందరికిని దెలియును.

పచ్చని దబ్బపండుచాయ మానిసి, పొడగరి. అజానుబాహుడు. తెల్లగా నచ్చటచ్చట నెరసినతల, గడ్డము, మీసము లాయనకు వింతశోభ నిచ్చును. పొలము దిమ్మవంటి వక్షముతో, వత్రువలుతిరిగి కండలూరిన బాహుసంపదతో, కోలనై, బింకమొలుకు మోముతో, విశాలమై లోతైన కాటుకకన్నులతో, విరివియై విశాలమైన ఫాలముతో, తెల్లని యజ్ఞోపవీతముతో నాయన ద్రోణుని దలపించుచుండును.

సుబ్బారాయుడుగారి కెన్ని కథలు వచ్చునో లెక్కలేదు. ఆయన చెప్పు కథలు పెద్దలుగూడ తనివోవ వినుచుందురు. కొంచె మెచ్చుతగ్గుగా ననేక భాషల లోని గ్రంథములన్నియు నాయన పఠించినారు. కథలు సందర్భానుసారముగా నాయన కల్పించవలసి వచ్చిన కల్పించును. ఒకసారి కల్పించిన కథలు మరల నెప్పటికిని మఱచిపోడు.

ఆనాటి సాయంత్ర మేడు గంటలకు, దన నాల్గవ కొమరిత ఊకొట్టుచుండగా కాశీమజిలీలలోని అదృష్టదీపునికథ యాయన చెప్పుచుండెను. పెద్దకొమరుడు, నాతని సంతాన మగు నిద్దఱు కొమాళ్లను గొమార్తెయు, సుబ్బారాయుడుగారి భార్య జానకమ్మగారు, కొందరు రైతులు, ఇరుగు పొరుగు బ్రాహ్మణులు, చుట్టములు, కాళ్లుపట్టుచున్న మంగలి, విసనకఱ్ఱ వీచుచున్న చాకలి యా కథ వినుచుండిరి. ఇంతలో గొన్ని బండ్లు వారియింటిముం దాగిన చప్పుడైనది.

నారాయణరావు లోనికివచ్చినాడు. ‘అన్నయ్య వచ్చాడు. అమ్మా! చిన్నన్నయ్యేవ్!’ అంటూ సూర్యకాంతం లేచి పరుగున అన్నగారి దగ్గరకుజేరినది. నారాయణరావామెను సునాయాసముగ బైకెత్తి తన హృదయమున నదిమికొని ముద్దిడి క్రిందికిదింపినాడు. ‘చిన్ననాన్నగారు! తిన్ననాన్నగాలు!, తిన్ననాన్నాలు!’ అనుచు నారాయణరావన్నకొమార్తెయు, నిరువురు కొమరులును, లేగదూడలవలె పినతండ్రికడకు పరుగువారిరి. ముగ్గురి నొకసారిగా నెత్తివేసికొని యొకరిని భుజముమీద, నిరువురిని జేతులలో నిముడించుకొని, చెల్లెలు తన్ను జేయిచుట్టి నడువ, ముందరి మండువాలోనికి బోయినాడు. బండివాడును, జాకలి, మంగళ్ళ, సామానంతయు లోనికి జేరవేసిరి. నారాయణరావందులో నొక పెద్ద పెట్టె మండువాలో దింపించి, తాళముతీసి, యందులోనుండి బొమ్మసామానులు, జపాను మరపనులు, చిత్రచిత్రములైనవి పుదుచ్చేరీపనులు, విక్టోరియా చిత్రవస్తుశాలలోకొన్న రాగి, వెండి, దంతపు, గంధపు శిల్పపుంబనులు, కొండపల్లి బొమ్మలు, మచిలీపట్టణపు టద్దకపుదెరలు. ఖద్దరు పట్టునూలు చొక్కాలు, పరికిణీలు, బొందూరు చీరలు, వయ్యాదకండువాలు తీసి తనచుట్టుమూగిన తల్లికి, వదినగారికి, పిల్లలకు, అన్నగారికి పెదతల్లికి జూపించినాడు.

‘నా గుల్లంబండి బాగా వెలుతోంది’ అన్నాడు అన్నగారి చిన్నపిల్లవాడు.

‘తిన్నాన్నగారూ! నా మోటారు బాగాలేదుటండీ తమ్ముడుబండికంటే?’ యని పెద్దవాడు.

‘ఓరే తమ్ముడూ! నాకు తెచ్చిన యీ వెండిబొమ్మ సామానంత మంచివి కావురా మీవి?’ అన్నది యన్న కొమరిత.

మంచిరంగులు వేసి బొంబాయిలో జరీపువ్వుల పనిచేసిన బొందూరు కండువాలు చూచికొనుచు, గంధపుబొమ్మలు మొదలైనవి గమనించుకొనుచు, సూర్యకాంతము ముసిముసినవ్వులతో మురిసిపోయినది.

‘నారాయడు మూడువందల రూపాయలకు తక్కువ ఖర్చుచేసిఉండడు వీటికోసం. డబ్బంటే మంచినీళ్ల తాగుతాడు’ అనుచు నన్న యగు శ్రీరామమూర్తి విస్తుపోవుచు జూచినాడు.

శ్రీరామమూర్తికి తమ్ముడన్న నెంత ప్రేమయున్నదో, నారాయణరావుతక్క దక్కనలోక మెఱుగదు. తలిదండ్రులు, శ్రీరామమూర్తి భార్య వరలక్ష్మమ్మయు గొంచెముగా నెఱుంగుదురేమో. శ్రీరామమూర్తి సుబ్బారాయుడుగారికి, జానకమ్మగారికి బ్రథమసంతానము. ముప్పదియేండ్ల యీడువాడై, బి. యె. ప్లీడరుషిప్పు పరీక్షలలో గృతార్థుడై, యమలాపురములో వృత్తి జేయుచు, ధనము బాగుగా సముపార్జించుచు, బేరుగాంచిన న్యాయవాది యతడు. వ్యవహారముల నారితేరిన బంటు. కోర్టు, ఇల్లు, తన యూరు తన యాలుబిడ్డలు, తలిదండ్రులు, తమ్ముడు, చెల్లెళ్ళు, ఆలివంకబందుగులు, దగ్గరబందుగులు; అదియే యతని ప్రపంచము.

సాంఘిక రాజ్యాంగ వ్యవహారములతో నాతనికి నిమిత్తములేదు. మేనమామ పోలికతో గొంచెము స్థూల మనిపించు చామనచాయ రూపము. అయిదడుగుల ఏడంగుళముల పొడవయ్యు దమ్మునికన్న, దండ్రికన్న నాతడు చాలపొట్టి.

'అన్నయ్యా! నీకోసం యీ మంచిగంధంది ఉత్తరాలపెట్టె పట్టుకువచ్చాను. బాగుందా? దీని పనితనం చూడు. మూతమీద గోవర్ధనోద్ధరణం లోపల కైలాస పర్వతం రావణుడు ఎత్తడం చెక్కివున్నది. కింద రాముడు లేడికై పరుగెత్తడం, పక్కల్ని అశోకవనంలో సీత, బృందావనంలో గోపికాకృష్ణులను చెక్కాడు. దీని ఖరీదు డెబ్భైఅయిదు రూపాయలు.'

'ఇంత చిన్నదానికే అంత ఖరీదేమిటిరా?'

'శిల్పపుపనివిలువ అది' అన్నది వదినగారు.

'ఏమమ్మోయి వదినా! నీకు తెచ్చిన పొందూరుచీర యిదిగో.'

'ఎందుకురా పొందూరు కొనడం? మామూలు ఖద్దరులోనే సన్నరకం ఏడెనిమిది పెడ్తే వస్తాయిగాదుట్రా' అన్నా డన్నగారు.

'అదిగా దన్నయ్యా? బండఖద్దరుచీరలు కట్టుకుంటూంది. అసలే కొంచెం బొద్దు మనిషి, అందులో సాదా ఖద్దరు చీరలు కట్టుకుంటూంటే రెండు రెట్లయింది వదిన అని, మూడుపాటి నూలువి, ఒక పట్టుశాలీ నూలుది నాల్గా కొనుక్కు చక్కా వచ్చాను. అమ్మకి నాల్గు పట్టుకువచ్చాను. నీకు జరీకండువాలు రెండు. ఒకటి పొందూరుది, ఒకటి శేలంది. నాన్నగారికి బందరు పులిగడ్డవి, నాల్గు ఎట్టఅద్దకం పంచెలు పట్టుకువచ్చాను. ఇంకా వున్నాయి. అక్కయ్యలకీ, కన్నతల్లికీ, అమ్మడికీ, పిల్లలకీ, నీకూ నాకూను. కన్నతల్లి ఏదట్టా?' 'మందపల్లి మామయ్యగారింటికి వెళ్ళింది. వస్తూవుంటుంది' అన్నాడు శ్రీరామమూర్తి. హృదయము వికసించి, యాతని మోము వెన్నెలవెలుగయినది. తమ్ముని గుణగణములు రోజుకు మూడు నాల్గు సారులు తక్కువకాకుండ నితరులకడ వర్ణన నాతడు చేయుచుండెను.

'మా తమ్ముడున్నాడే వాడిదేహం, ఎంత వజ్రమో, హృదయం అంత నవనీతంనుమండీ. మా నాన్నగారి తెలివితేటలు దశమి వెన్నెలైతే మావాడిజ్ఞానం పున్నమవెన్నెలండీ! మనకు స్వరాజ్యమంటూవస్తే మావాడు ముఖ్యమంత్రి అవవల సిందే. నౌరోజీ, దాసు, నెహ్రూ, రాధాకృష్ణ, పట్టాభి, హల్దేను మొదలైన వాళ్ళతో సమమైన బుద్ధండీ' అని యనుచుండును.

తాను లోభియయ్యు, దమ్ము డిట్లు ధనము వెచ్చించుటన్న నాతనికి బరమ ప్రీతి. అతని హృదయాంతరాళమున నణగిమణగియున్న యుత్కృష్టగుణము లన్నియు దమ్ముడగు నారాయణరావుకడ జాగృతములై ప్రత్యక్షమైనవి.

ఈ సంగతి యంతయు సూక్ష్మగ్రాహియగు నారాయణరావున కవగతమే!

పరమలోభీ, గట్టిమనస్సువాడూఐన అన్నగారంటే, అంతగౌరవం, అంత

ప్రేమా ఏమిట్రా నారాయుడికి ' అని యాతని స్నేహితు లెన్నిసారులు గుసగుసలు పోయినారో !

' ఏమిరా చిన్నబాబూ ! నాన్నగారు పంపించిన అయిదువందలూ ఖర్చుచేసే శావా ' అన్నది తల్లి.

ఆఁ ఇంకో నూటయాభై రూపాయిలొసరకు వి.పీ. గా వస్తుంది. అమ్మా !

కొడుకు సోద్యాలు చూసి సంతోషించడమేనా; మాకు నాల్గు మెతుకులేవన్నా పారేయించేదున్నదా ? " అని యప్పుడే లోనికి లక్ష్మీపతితో వచ్చిన సుబ్బారాయుడు గారు భార్యను నవ్వుచు ప్రశ్నించినారు.

వేళాకోళములు చేయుటలో సుబ్బారాయుడుగా రద్వితీయులు. అందులో భార్య నెప్పుడు బరిహాసవచనములతో ముంచివేయుచుండును.

' మా అక్కయ్య వంటచేసుకొని కూచుంది. ఎనిమిదైనా మీరు లేవకపోతే ! రోజూ ఎంత మొత్తుకొన్నా తొమ్మిదింటికైనా భోజనానికి లేచిరాని మీకు ఈవాళ పట్నవాసాన్నుంచి అబ్బాయి వచ్చాడనా, ఇంత తొందరగా జఠరాగ్ని కదిలింది ? '

గుమ్మందగ్గిర నిలుచుండి నారాయణరావు గొనితెచ్చిన వింతలన్నియు గమనించు చుండిన జానకమ్మగారి యక్క, లక్ష్మీనరసమ్మగారు ' మరదిగారికి కొత్తదే అమ్మాయీ ! ఉన్నదోటీ అనేదొహటీ ' అని పలికినది.

' అప్ప చెల్లెళ్ళిద్దరూ వీరసతు లౌతున్నారు. ఆడవాళ్ళు తలుచుకుంటే మొగాళ్ళు మూలగదుల్లో దాగాలిసిందే ' అని సుబ్బారాయుడుగారు నవ్వికొన్నారు.

## ౭

## పరమేశ్వరమూర్తి

పరమేశ్వరమూర్తి రాజారావును సామర్లకోట స్టేషనులో కాకినాడ నెక్కించి, తానుబోయి మరల మెయిలులో గూర్చుండినాడు. పరమేశ్వరమూర్తి పలుచని శరీరము, సొగసైన కన్నులు, పసిమిపచ్చనిరంగున గలియుటకు యత్నించు చామనచాయ, చీలికగడ్డము, సమఫాలము, సన్నని పెదవులు, లెక్కపెట్టుటకు వీలున్న నల్లని మీసములుగలవాడు. చిన్న చెవులు, సన్నని పొడుగాటి కంఠము, విస్ఫారితముగాని భుజస్కంధము, గుండ్రని నున్నని కరములు, చిన్న చేతులుగల ఆతని కోమల శరీరమున నాడుదన ముట్టిపడుచుండును. ఈతలో బ్రథమ బహుమానమంది పోటుమానిసి యనిపించుకొను టొక్కటియే యాతని స్త్రీత్వమునకు దీటరనికొఱత తెచ్చిపెట్టినది.

సహజ పంచమస్వనమున గంఠము తేనెలూర సంగీతము పాడుకొనును. నిత్యనవీనములై ఆర్ద్రములైన ప్రకృతి విలాసము లాతని ధ్యానముద్రలో వికసించి మురిపించును.

ప్రకృతి యాతని యాలోచనా శక్తిని ప్రోదిసేయు పెంపుడుతల్లి. ప్రకృతిలో నేమార్పును జూచినను అతని హృదయము చలించిపోవును. సృష్టిలో ప్రతి పదార్థము పరమేశ్వరమూర్తికి మేరుపర్వత సమానమై గోచరించును. దృశ్యమానములగు ప్రకృతివికారములెల్ల, కాలనాటికారంగములుగా ప్రత్యక్షమై. యాతనిని వివిధ వికారములకు లోను జేయును.

పరమేశ్వరమూర్తికి ప్రాపంచికమైన వ్యవహారపథము లపరిచితములు. అతని నావరించియున్న సహజపాండిత్యమే యాతనికి బరీక్షలలో జయముగొనితెచ్చి, యాతనికే యాశ్చర్యము గొల్పుచుండును.

ప్రాణస్నేహితుడగు నారాయణరావువలె పరమేశ్వరమూర్తిగూడ సౌందర్యోపాసకుడు. అపశ్రుతియన్న యాతని హృయము తటతట కొట్టుకొని విహ్వలించును. ఒకనా డాతడు స్నేహితుని ఇంటికిబోయి, చక్కగా నలంకరించియున్న యాతని గదిని చూచెను. తెల్లనిగోడలపై నచ్చటచ్చట ప్రఖ్యాత భారతీయ చిత్రకారుల ప్రసిద్ధచిత్రాల పత్రిక లలంకరింపబడియున్నవి. ద్వారములకు గవాక్షములకు ఖద్దరుపై మనోహరవర్ణములు చిత్రించిన మచిలీపట్టణపు, పంజాబుదేశపు కలంకారీ అద్దకపు దెరలు వ్రేలాడదీసియున్నవి. శోభాయమానమగు నా మందిరములో నొకయెడ దగిలించియుంచిన క్యాలెండరుబొమ్మను గాంచి, పరమేశ్వరుడు వణకిపోయినాడు. అతని కంటిలో రాక్షసిబొగ్గునలకపడినట్లయినది. పంటిక్రింద నిసుకరేణువులు నమలినట్లయినది.

పరమేశ్వరమూర్తికి జిన్నతనములో వివాహమైనది. అతడెంత రసగ్రహణపారీణుడో యాతని భార్యయంత నిష్కళాహృదయ. ఆమెకు సౌందర్యమన్ననేమో తెలియదు. అలంకరించుకొనుట యంతకుమున్నే యెరుగదు. ఆమె యచ్చపు గృహిణి. గృహకృత్యము లవలీలగ నెరవేర్చును. ఉదయమున లేచినదిమొదలు రాత్రి భర్తను జేరువరకు నామె యొక్కక్షణమైన దీరుబడిలేక మధుపమువలె బనిచేయుచుండును. వంటయిల్లలికి ముగ్గులు పెట్టును. కూరలు తరగును, బియ్యము కడిగియిచ్చును. రాత్రి తానే మడికట్టుకొనును, ఆడుబిడ్డలెవరైన వచ్చినచో వారి పిల్లలకు నన్నియు నమర్చును.

రూపరేఖావిలాసముల కామె నోచుకొనకున్నను, ఆమెలో నొకవింతయందము తొలుకాడుచుండును. ఆమె కన్నులద్భుతములు. నిష్కపటమై శాంతిపూర్ణమగు నామె హృదయ మాకన్నులలో బ్రతిఫలించును. అవి వెడదలై, నల్లనై, దీర్ఘపక్ష్మముల వితానముక్రింద బ్రేమమున గడగుచుండును.

ఆమె పతిప్రాణయయ్యు హావభావ విలాసములచే భర్తృహృదయమును రంజింపజేయుటకై యత్నింపదు. పరమేశ్వరమూర్తి యామెను ప్రక్కపాపట తీసి కీలుజడ యల్లుకొనుమని కోరును. లేనిచో మధ్యపాపటతీసి బొంబాయి ముడి ముడుచుకొమ్మని కోరును. మోమున నంగరాగము లలదుకొమ్మనును. తెల్లచీరలు

థరింపు మనును? 'వంగపండుఛాయ వస్త్రములు రాత్రివేళ దేహమును విచిత్రముగ శోభింపజేయును' అని భార్యతో వాదించును.

ఆమాటలకు రుక్మిణి చిరునవ్వు నవ్వుకొనును. అంతమాత్రమే! అతిని కోర్కెల బరిపాలించుట నాటకస్త్రీలకు జెల్లునుగాని సంసారులకు గాదని యామె యూహ.

పరమేశ్వరమూర్తి పిఠాపురముజేరి యింటికేగునప్పటికి రుక్మిణిమోము ప్రఫుల్లమయినది. ఆమె నయనముల దివ్యకాంతులు ప్రసరించినవి.

తనతోగూడ గదిలోనికి వచ్చిన భార్యను గౌగిలించుకొని ముద్దిడుకొన్నాడు. అచ్చట నెవ్వరులేకపోయినను రుక్మిణి సిగ్గుపడి 'అబ్బా మీకెప్పుడూ ఈలాంటి పనులే నండి' యన్నది

'నా ప్రేమ నాపలేక అల్లాచేశాను. నేనురాసిన యెనిమిది ఉత్తరాలకూ నువ్వు రెండుత్తరాలు జవాబురాస్తావు. నీది కటిక హృదయం రుక్మిణీ! మూడునెల్లు విరహవేదన పడ్డానే? నీ బొమ్మే నాకు దిక్కా? ఎన్నాళ్లు నీకు ప్రణయవిలాసాన్ని నేర్పినా పూర్వకాలపు పునిస్త్రీవేకదా నువ్వు!'

'నే నేంజేయనండి. అత్తగారికి తెలుస్తుందేమోన్నభయం. ఆ రెండుత్తరాలేనా పనిదానిచేత రహస్యంగా కవర్లు తెప్పించి రాశాను.'

'పైగా ఆ రాతేమిటి? ఎవరికి రాసిందీ తెలీదు. ఏదో రెండుముక్కలు గిలికితే ఉత్తరం అవుతుందా?'

ఆమె తెల్లబోయి భర్తవంక జూచినది.

'పోనీవే! ఇదేమిటి? ఈగది ఇల్లావుంచావు. గదిని అలంకరించడం జన్మ నలంకరించుకోవడమే అని చెప్పలేదూ నేను? మరి ఈ సామానుకొట్టేవిటి?'

'మీరు మీరాన్నవుంటే నా కెందుకండి. ఎల్లానండి గది అలంకరించుకొని కూచునేది.'

'పోనీలే' యని పరమేశ్వరుడు రుక్మిణిని మరల తన హృదయమునకు హత్తికొని 'ఒకముద్దీ'మ్మనియెను. ఆమె లజ్జారుణవదనయై యిటు నటు చూచి నాధుని పెదవులు తన పెదవుల నొక్కి, 'వస్తా' నని యింటిలోనికి మాయమైనది.

పరమేశ్వరమూర్తి శ్రుత్యపశ్రుతులు వెలుగు నీడలవంటివని యెఱుగును. ఎంత విచిత్రమగు శ్రుతి నీవాపాదించుకొనగలవో యంతయపశ్రుతి వెన్నంటి గోచరించుచునే యుండును. రూపెత్తిన తన యాశయమై, పులకరాలు గలుగజేయు బాలిక భార్యయైనదని సంతసింతమన్న నామె తన్ను ప్రేమింపకయైన పోవును, లేదా కర్కశహృదయయైన నగును. పరిపూర్ణత యెక్కడిదీ సృష్టిలో?

తల్లిదండ్రులతో ముచ్చటలాడి, పుట్టింటికి బిడ్డలతో వచ్చియున్న చెల్లెలితో మృదూక్తులాడి బిడ్డల నాడించి, పట్టణమునుంచి కొని తెచ్చిన బహుమతు లెవరికి

వారికిచ్చి, భోజనమాచరించి, నిదురబోయి లేచి, పరమేశ్వరుడు గది నలంకరించు కొన మొదలిడినాడు.

వచ్చిననాటి రెండవరోజున పరమేశ్వరునకు నారాయణకడనుండి కమ్మ వచ్చినది.

'ఓరి పరమం! నా హృదయానికి ఎంతో దగ్గిరవున్న కవిరాజూ! విను. ఆ బాలిక సౌందర్యం అసలు శారదకు లేదు. నన్నూ, నా హృదయాన్నీ, నా ఆత్మనీ తనతో పెనవేసుకుంది తనలో ఐక్యం చేసుకుంది. మీ చిత్రకారమండలిలో ఆమె బొమ్మ చిత్రించడానికి ఒక్కరికైనా కుంచె నడవదోయి. ఆమె శరీరసౌష్ఠవము విడివడబోయే మల్లెమొగ్గల పోగేరా! ఆమె కళ్ళల్లో కథలు నర్తించాయి. జమీం దారుగారితో కూడా వచ్చాడే, అయన - శ్రీనివాసరావుగారు, అపూర్లోకల్లా మంచి ప్లీడరు. ఆయన ఇంటిదగ్గరనుంచి వెళ్లాం జమీందారుగారి ఇంటికి. ఆయన 'పిల్ల నచ్చిందా' అని అడిగాడు. నచ్చిందని చెప్పటానికి నేను తగుదునురా పరమం! ఆ బంగారుపోత విగ్రహానికి, ఆ పువ్వులప్రోవుకు, ఆ దివ్యబాలికామణికి నేను తగు దునా పల్లెటూరి బండమనిషిని. నువ్వు రైలులోనే జమీందారుగారి ఉద్దేశం గ్రహిం చావుకదా. మన వాళ్లందరూ అదేగ్రహించారు. నాకూ నిముషంలో అవగాహన అయింది. అప్పటినుండీ నాకు ఒకటే సిగ్గు. వారి అమ్మాయికి యింతవరకు పెళ్ళి చేయకుండా ఉంచింది నా యీ కర్కశపురుషత్వానికి బలి యివ్వడానికేనేమో!

'తప్పక సంబంధం నిశ్చయం అవుతుంది. నువ్వు వివాహానికి నీ భార్యతో రావాలి. అమ్మగారినీ నాన్నగారినీ అన్నదమ్ములను బావగారిని చెల్లెలిని నువ్వు నాకోసం బలవంతపెట్టి తీసుకురాగలిగితే నీకు నేనేమివ్వగలనురా? తలుపుదగ్గర పాట నిన్ను పాడనిస్తా.

'సర్వకాలాలా ఆ బాలిక నాకు ప్రత్యక్షమవుతోంది. నన్ను ఒక విచిత్రానందం అలుముకుపోయినట్లుగా ఉన్నదోయీ!

'ఇల్లా ఉండగా ఒక భయము నన్ను ఆవేశించింది. మా వ్యాపారములు చాలా బాగానే ఉన్నాయి. మేమూ కొంచెం భాగ్యవంతులమనే చెప్పాలికదా! అయినప్పటికీ బాలిక జమీందారీ కుటుంబంలో జన్మించినది. రాజ్యభోగములో పెరిగింది. రాచఠీవి ఆమెలో పుంజీభవించివుంటుంది. ఉంటే యీ సామాన్య సంసా రంతో ఆమె కలయిక మా జీవితాలకి విషాదాంతం అవుతుందేమో.

'అంటే ఈ వివాహంవల్ల నాకూ నా కుటుంబానికీ ఎడబాట్లయ్యే విధివ్రాత తటస్థిస్తే నాకు జన్మాంతం తీరనివ్యధేకదా! పోనీ మా అన్నయ్యకిమల్లే నేనున్నూ వుద్యోగంరీత్యా పరదేశంలో వుంటానుగనుక పరవాలేదు అనుకుందాం (అల్లాని అనుకోవడం నాకు చాలా కష్టంగా తోచినది.) అయినా ఆ బాలిక నన్ను ప్రేమించక రాచపట్టిననే గర్వంలో మునిగి ఉండేందుకు ఎక్కువ సావకాశాలుంటవనుకో!

అప్పుడు నా బ్రతుకు శూన్యమవుతుంది. అట్టి ఆలోచన చేయలేకుండా వున్నానురా పరమం.

'ఈ పిచ్చ ఉత్తరాన్ని చూసి నన్ను పిచ్చవాణ్ణి అనుకున్నా సరే! ఈ సందర్భంలో నువ్వు దగ్గరలేకపోవడం, నాలోని చైతన్యం మాయమైనట్లుగావుంది. నువ్వా ఇప్పుడే కొత్తగా చేసుకొన్నావు నీ సంసారాన్ని? ఇంతలోనే మళ్ళీ వానప్రస్థాశ్రమం స్వీకరించరా అని ఎట్లా అన్ను. జాగ్రతగా ఆలోచించి జవాబు వ్రాయి. డాకు దొరకి కాకినాడ రాశాను. మీ యిద్దరే నాకేటు గడలు.

'ప్రేమనేది నిజమేననిన్నీ, అది వట్టి పుస్తకాల్లోమాత్రం వుండే బూటకమనే వారి వాదన అనుభవరహితమనిన్నీ మనం ఇదివరకే అనుకున్నాం. అల్లాంటిప్రేమ నన్నిప్పు డావరించుకొందోయి. ఆ బాలిక నా హృదయాన్ని కాలుడు సత్యవంతుని జీవాన్ని బొమ్మలో లాగుతున్నట్లు లాగివేసిందిరా! అది నిజమైనప్రేమ కావచ్చును. లేక వట్టి వాంఛేనా కావచ్చును. కాని ఆ బాలికను నేను కరగ్రహణం చేయనినాడు నాజన్మం ఎడారి అని భావించుకుంటున్నా. ఏమో! ఆమెను చూడ్డానికి వెళ్ళని మునుపు, పిల్ల తెల్లగా పాలిపోయి ప్రాణం లేకుండా, క్షయరోగంపట్టి పీడించేవ్యక్తి లాగు. ఈవురో అంటూవుంటుందనిన్నీ, ఏదో కాస్త సంగీతం, కాస్తన్నర ఇంగ్లీషు, అరకాస్త తెలుగు, పరకకాస్త సంస్కృతం, బలవంతంగా నేర్చిన చిలకల్లే ఉంటుందనిన్నీ, కన్ను, ముక్కు, గడ్డం విభేదంలేకుండా ఉండేమూర్తి అయివుంటుందనిన్నీ మాబావా, నేనూ అనుకున్నాం; కాని, ఆమె మానవ బాలికకాదురా, మన్మథ సృష్టిరా? సరస్వతి సపత్నిరా!

'ఏమి సంగీతం, ఏమిమాధుర్యం! ఆమె మూర్తిదాల్చిన కళాధిదేవతంటే నమ్ము. మేము అక్కడ కరిగిపోయాము. లోకోత్తరుడగు శ్రీరామయ్యగారి అంతరంగిక శిష్యురాలనని ఫిడేలు వాయిద్యంలో చాటుకుందిరా.

'మాబావ, భాషలు తదితర పాండిత్యం సానపై పెట్టి ఒరచిచూచాడు.

'ఆ బాలిక హృదయం చూరగొనాలి అని తన్మయుణ్ణయి, మతి చలించిన నాకు తీవ్రావేశం కలిగింది. ఆబాలిక ఫిడేలు అందుకున్నాను. చెన్నపట్నంలో నేను నేర్చినవిద్య, వెంకటస్వామి నాయని మాధుర్యంతో, దక్షిణాపథాలు తిరిగి గమనించి హృదయస్థం గావించుకొన్న గోవిందస్వామిపిళ్ళే, చౌడప్పల చమత్కృతులతో గుప్పేశాను సంగీతం వెన్నెల. ఆరోజున ఎందుకైనా మంచిదని మా అద్భుతంగా వేషం వేశాను. ఎలాంటి వస్త్రము లలంకరించానో నువ్వు ఊహించి ఉత్తరంలో రాయి.

'మరి ఆ బాల నన్ను విస్తుబోయి చూసిందని నా అభిప్రాయం, మాబావ అభిప్రాయం అదే!

'జవాబుకు ఎదురుచూస్తూ నువ్వు దగ్గిరలేవని పరితపించే నీ నారాయుడు.'

# ౨

## ఔనా, కాదా ?

ఇంతలో లక్ష్మీపతి భార్య రమణమ్మ పిల్లవాని నెత్తికొని బండి దిగినది. అన్నయ్యవచ్చాడూ! ఎంతసేపయింది అన్నయ్యా నువ్వు బండిదిగి ? మందపల్లిలో వెంకట్రాయుడు మామయ్యగారి యింట్లో మాట్లాడుతోవుంటే పొద్దుపోయింది. ఇంతలో బాబు ఏడ్చాడు. నాలుగు వేడిమెతుకులు పెట్టి బయల్దేరాను. అత్తయ్య ఒకటే బలవంతం.

'బావా, నేనూ వస్తున్నామని అత్తయ్యతో చెప్పడానికి సిగ్గుపడ్డావేమిటే ? ఇందాకటినుంచి ఇంకా రాలేదని బావ ఒకటేచూడ్డం గుమ్మంవైపు ?'

నారాయణగారూ, అల్లా చూసేరోజులు వచ్చాయి. నేను చూసేవాణ్ణోకాదో నీ హృదయానికి తెలవదురా వెఱ్ఱివాడా'

'ఇల్లా యియ్యవే బాచిగాణ్ణి! రాడేం కొత్తవచ్చింది! ఏడుపు మొగం పెట్టాడు. మీ నాన్న వచ్చాడురా. సూరీడూ! బాచిగాడికి తెచ్చిన గిలకలు, బొమ్మలు ఇల్లాతేవే. ఇవిగోరా! ఆరీనీ! లంచం యిస్తే వచ్చాడు. బావా వీడు ఓవర్‌శీయర్ పని చేసేటట్టున్నాడోయి, అసాధ్యుడు. ఆ బూరా యియ్యి. నీదగ్గరకువస్తాడు. 'ఆ! వెళ్ళాడూ! వీడు తప్పకుండా లంచగొండే! అచ్చా.'

బాచిగాడు ఆటలో కెవ్వుమని కేరింతలాడినాడు. తండ్రిచేతుల్లో ఎగురుట ప్రారంభించినాడు. లక్ష్మీపతి తొనలు తిరిగి పండువలెనున్న తన కుమారుని ముద్దిడుకొని సూర్యకాంతం చేతి కిచ్చినాడు.

'బాచిగాణ్ణి నాకియ్యవూ సూరీడత్తయ్యా! అని శ్రీరామమూర్తి తనయ, జానకి బాలకు నెత్తుకొన్నది.

చాకలివాడును, పనికత్తెయు వేడినీళ్లతోడగా సుబ్బారాయుడుగారు, లక్ష్మీపతి, శ్రీరామమూర్తి, నారాయణరావు స్నానములకు బోయినారు. సూర్యకాంతం అన్నగార్లకు, బావగారికి సబ్బుబిళ్ళ లందిచ్చినది. మంగలివాడొడళ్ళు తోమినాడు. రమణమ్మ తెల్లని తువాలుమడత లందీయ, దుడుచుకొని, యామె యందిచ్చిన పట్టు తాపితాలు ధరించి మువ్వురు వంటవసారా నంటియున్న పడమటింటిలో యథాస్థానముల నధివసించిరి. సుబ్బారాయుడుగారు కోడ లందిచ్చిన యంగవస్త్రముచే దడి యార్చికొని, పీటపై నుంచిన మడిపంచెల జతలో నొకదాని గట్టి, సంధ్యావందనము ప్రారంభించినారు.

జపము కొంతయగుటయు, వడ్డన ప్రారంభించవచ్చునని తన మామూలుపద్ధతిని విస్తరివైపు చేయిచూపి తలయూపినారు. జానకమ్మగారి యక్కగారు వడ్డన ప్రారంభించి పూర్తిచేయునప్పటికి, చతుస్సాగర పర్యంతం అని ప్రారంభించి గోత్ర

ప్రవరలు పఠించి, సంధ్యావందనము ముగించిరి. అందరు నొక్కసారిగా భోజనములు గ్రహించినారు. భోజనములు కొంతవరకైనవి. పచ్చడి కలుపుకొనుచు సుబ్బారాయుడుగారు తమ యల్లుని దిక్కు మొగమై 'మీరు ఆలస్యంగా వచ్చారు. బస్సు చెడిపోయిందా యేమిటి, దారిలో?' అని సంభాషణ ప్రారంభించెను.

మామగారి చిన్న లక్ష్మీపతికి మిక్కిలి గౌరవము, భయము, భక్తి. అల్లుడన పరమప్రేమ మామగారికి.

'కాదండి, విశ్వలాపురం జమీందారుగారు తల్లాప్రగడ లక్ష్మీసుందర ప్రసాదరావుగారు రాజమండ్రిలో వున్నారు — '

'అవును ఆయన చాలా మంచివాడు. శాసనసభలో ఎప్పుడూ రయితుల తరపున మాట్లాడుతూ వుంటాడు. గాంధీగారి శకం రాని మునుపు, పేరుప్రతిష్ఠలతో పూజింపబడే ఆంధ్రనాయకులలో ఆయన ఒకరు. ఆయన్ని బాగా ఎరుగుదును. జమీందారైనా నియోగులలో, చాలా గౌరవంగా జీవిస్తున్న నాయకుడు.'

'ఆయనకు వివాహం కావలసిన బాలిక ఒకర్తె వున్నది.'

'ఊఁ!'

జానకమ్మగారు దొడ్డిలో చల్లగాలికై కూర్చుండియున్నది; యీ మాట విని లోనికి జూచినది.

'మా చిన్న బావకు తమ కుమార్తె నిద్దామని వారికి సంకల్పం కలిగింది. వారూ మేమూ బెజవాడ ప్లాటుఫారంలో తారసిల్లాము. ఆయన నారాయణబావ సంగతి ఎల్లా గ్రహించాడో మమ్మల్ని బలవంతంపెట్టి రాజమండ్రిలో అపుజేశారు.'

'వాళ్ళింట్లోనే?' అని జానకమ్మగారు అల్లుణ్ణి పృచ్ఛజేసినారు.

'అబ్బా! అప్పుడే! జమీందారులపేరు చెప్పేటప్పటికి ఒక్క గంతేసింది. బంగారపు తాళ్లెట్టి యూడ్పించుకోవాలి. బంగారపు చీపురుకట్టతో కొట్టించుకోవాలి.'

'ఊరుకుందురూ! మీరెప్పుడూ వేళాకోళం చేస్తూనే ఉంటారు.'

'ఇది వేళాకోళం అంటుందేమిటి? గాదిరాజు వారి సంబంధం వచ్చినప్పుడు కట్నాలసంగతి మనం కాదుకాబోలు, నిష్కర్షగా చెప్పి వాళ్ళను 'వచ్చిందేదారి' అని అనిపించింది.'

'అవును మొదట నగలమాట వారు నిష్కర్షగా అడిగితే నేను లాంఛనాల మాటడిగాను. మీరు బెల్లం కొట్టినట్లు మాట్లాడక ఊరుకుంటే, ఇంత నిష్కర్షగా అడిగేవాళ్ళ సంబంధం ఇష్టంలేక ఆయెత్తు యెత్తాను. అది తప్పుటే అక్కయ్యా?'

'తప్పనా ఏమి? జమీందారుకు వియ్యపరాల నౌతాననే సంతోషంచేత, కతికితే అతకదని విచారంలో మునిగి అన్నావనుకున్నాను' అని సుబ్బారాయుడుగారు నవ్వగా జానకమ్మగారు, శ్రీరామమూర్తి, కనకమ్మగారు నవ్వుచున్నారు.

శ్రీరామమూర్తి :—ఇంతకూ ఎక్కడోయి మకాం, రాజమండ్రిలో?

లక్ష్మీపతి :—శ్రీనివాసరావుగారింట్లో.

శ్రీరా :—ప్లీడరు శ్రీనివాసరావుగారేనా ? జమీందారుగారూ, ఆయనా జీవికాజీవులే.
సుబ్బారాయుడుగారు :—అమ్మయ్యా !
జానకమ్మగారు :—మళ్ళీ మొదలుపెట్టారా ?
సుబ్బా :—తర్వాత ఏం జరిగింది ?
జాన :—మకిప్పు డాతుర్దా వచ్చిందేమి ?
శ్రీరా :—ఉండవే అమ్మా ! లక్ష్మీపతిని చెప్పనియ్యి.
లక్ష్మి :—నారాయణా నేనూ వెళ్ళి పిల్లను చూశాం. ఆ అమ్మాయి చాలా అందంగా వుంది. మంచి తెలివైనపిల్ల. బాగా చదువు చెప్పిస్తున్నారు. సంగీతంలోనిధి.
జాన :—చిన్నబాబు ఈమధ్య మరీబాగా నేర్చుకొన్నాడన్నారూ !
లక్ష్మి :—అతనూ ఫిడేలు వాయించాడు.

లక్ష్మీపతి బావమరదివంక జూచినాడు.

ఇంతవరకూ హృదయములో నానంద రాగములు వినుచున్న నారాయణ రావు, చిరు బొమ ముడిలో బావగారివంక జవాబు పరపినాడు.

లక్ష్మి :—వారంతా మంచిరోజుచూచి మామగారితో మాట్లాడ్డానికి వస్తారనుకుంటాను.

జమీందారుగారు బావంటే వెఱ్ఱి పడిపోతున్నారు.

జమీందారుగారి యాడంగులు తెరవెనుకనుండి నారాయణరావును చూచి రనియు, దాను బాలిక నింగ్లీషుభాషలో, తెలుగులో, నితర విషయములలో బరీక్ష జేసితిననియు, లక్ష్మీపతి చెప్పగా నందఱు వినిరి. ఎవరి యాలోచనలు వారి నలము కొన్నవి.

సావిట్లో సుబ్బారాయుడుగారు పెద్దకుమారునితో సంబంధము విషయమై రాత్రి రెండుజాములవరకు ముచ్చటించి, తమ కా సంబంధము కాకుండుటయే మంచి దని నిశ్చయించినారు. లక్ష్మీపతి దక్షిణపు గదులలో దనగది జేరినాడు. నారాయణ రావు తల్లికడజేరి జమీందారుగారినిగురించి ముచ్చటించి, తండ్రిగారితోపాటు తనకై యారుబయట వేసిన మంచముపై పవ్వళించి నిదురపోయినాడు.

నాల్గురోజు లయినవెనుక పరమేశ్వరమూర్తి వ్రాసినలేఖయు, కాకినాడనుండి రాజారావు వ్రాసినలేఖయు వచ్చినవి.

' నేను కవిత్వం వ్రాయలేను. అయినా కవిత్వం అంటే నాకు పరమప్రీతి యన్న సంగతి తెలుసునుగదా, నువ్వు వ్రాసిన ఉత్తరం నాకు గల్గించిన సంతోషం. నేను పద్యాలు వ్రాసేవాణ్ణే అయితే నూరు పద్యాలల్లో గుప్పివేసేవాణ్ణి. లెక్కలవాణ్ణి కాబట్టి రెండుముక్కల్లో నా అభిప్రాయం తెలుపుతాను.

ఒకటి - జమీందారుగారి కుటుంబానికీ మీకుటుంబానికీ పొత్తు కలవదని మనం ఊహించడం న్యాయం.

రెండు - జమీందారీ కుటుంబములో నిష్కళంకమైనట్టిన్నీ, నిర్మలమైనట్టిన్నీ, ప్రేమపూరితమైన హృదయాలు ఉండడం అరుదు.

మూడు - పెళ్ళికుమార్తెకు కూడా నువ్వంటే ప్రేమకుదరడం కొంచెం కష్టం.

నాల్గు - అంత గొప్ప కుటుంబాలలో, నాగరికతలో మునిగివున్న వాళ్ళలో ఆరోగ్యము చాలా హీనముగా ఉంటుంది. నీకున్న బలసంపదకి, బలహీనురాలై జన్మ పొడుగునా ఏవో రోగాలతో మూల్గే బాలిక భార్య కావడం ప్రశస్తముకాదు.

అయినా ఈ యాపత్తులకు పూర్వపక్షేల్ను ఉన్నాయి. అవికూడా హలా ముఖ్యమైనవే.

ఒకటి—జమీందారుగారు నీ విషయమై విపరీతమైన ప్రేమతో ఉన్నారు. తక్కిన వాళ్లెట్లా ఉన్నా, ఆయన ఒక్కడు చాలు రెండు కుటుంబాలూ సరీగ్గా ఉండడానికి. మీ కుటుంబము ఎప్పుడూ తప్పు చెయ్యదు.

రెండు :—నువ్వు చక్కని వ్యక్తిత్వము కలవాడివి. అందమైన వాడివి, జ్ఞానము కలిగిన మహారాజు కుమార్తెనైనా వలలో వేసికొనే వ్యక్తిత్వము ఉందని నా అభిప్రాయము.

మూడు :—నీ ఉత్తరాన్నిబట్టిచూస్తే, బాలిక చాలా ఆరోగ్యవంతురాలని స్పష్టముగా ఉంది. జమీందారుగారు ఆరోగ్యవంతులు.

కాబట్టి నాకు జమీందారుగారి సంబంధములో ఏమి లోటు కనబడదు. నేను ఉత్తరములో ముఖ్యమైన మూడు విషయాలకన్న, అలంకారములతో అసలే రాయలేను. నా మాటలు కటువుగా ఉంటాయేమో! నేను రెండురోజులలో బయలుదేరి వస్తాను. ఈలోగా జమీందారుగారి కుటుంబము విషయమై దరియాప్తు చేసివస్తాను.

ఇట్లు, నీ ప్రియమైన
రా జా రా వు

‘ఒకనాడు ఐరోపీయ ప్రపంచాన్ని తన పాదాక్రాంతము నొనర్చిన మహోత్కృష్టుడైన ‘క్రిష్టాన్’ ఉన్నాడు, నేడు నా నారాయణుడున్నాడు.

‘నీకు పాదములకడ తన సర్వస్వముతో తన్ను ధారపోసుకొనుటకు ఏ బాలయున్నా తగదని నా మనవి.

‘నిన్నుద్వాహమై ఆ బాలిక తన బ్రతుకు సువాసనాలహరిలో లీనమొనర్చుకోవాలి.

‘చిన్న తనాన్నుంచి నేను కలల్లో తేలియాడేవాణ్ణి. సౌందర్యోపాసనామయమైన నా బ్రతుకు అందానికే దూరమైంది. నా పురుషత్వసంపద, ఉత్కృష్ట సౌందర్య స్వరూపయైన యోషారత్నము పదముల్మోల సమర్పింప తలుచుకొన్న నా తపస్సు నిర్జలభూమిలో నూయి త్రవ్వినట్లయినవి. కర్పూరకళా స్వరూపమైనటువంటి నా హృదయం చివికిపోయింది.

‘“మంచెకొనల్ విచిత్రలతగూర్చి, మనోహరవర్ణభంగి మూ। ర్తించి, పక్షీమణావృత శరీరరుచుల్ పొదివించి కంఠమున్। పంచమరాగ గీతికల బల్కి తీ, తేనెలు వాకలూర, మా। ధ్వంచిత దివ్యసుందర సుధామయ భావముల్లల్లువెట్టుచున్.”

'ఆ భావం భావమాత్రమే అయింది. అల్లాంటి సందర్భములో నీ అదృష్టం గమనించుకో. నీ హృదయాశయమైన బాలికామణికై ఎదురు చూడవచ్చును. నువ్వే ధైర్యంగల మగవాడివైతే మహాత్మా గాంధిగారు ఉపదేశమిచ్చినట్లు విధవావివాహం చేసికొని ఉందువు. విగత భర్తృకలైన బాలలు విద్యాసంపన్నలు సుందరీమణులు పెక్కుమంది వున్నారు. నీకు ధైర్యములేదు. సరేనయ్యా! ఎల్లావచ్చిందో, సంబంధ రూపంగా వరంలా ఒక బాలిక, విద్యాస్వరూప, కళాకోవిద, అద్భుత సౌందర్య మూర్తి, నువ్వు అదృష్టవంతుడవు.

'ఆలోచించక సంబందం ఒప్పించు. నేనే దగ్గరఉంటే! చాలా బాగుండేది.

''షెల్లీ' ఏకోర్కెకై సంఘ బహిష్కారంపొందాడో 'కీట్సు' ఏ అంద రానిఫలంకై ఆశించి ఆశించి లోకాంతరాలు చేరాడో, 'డాన్టీ' ఏ ఉత్కృష్టభావంతో ఆనందమయమైన కవిత్వం సృష్టించాడో, 'రొజెటీ' ఏ దివ్యపథములో వసించి భగ్నమైన ఆ బ్రతుకులో తనగీతికాగుళుచ్చము బలియిచ్చినాడో, ఆ మహాప్రణయము నీకు వరమైతే 'హామ్లెటు' లా 'అవునా కాదా?' యన్న సంశయంలోపడబోకు.

'సరే, నేనూ రెక్కలుకట్టుకుని మారాణీగారితో వస్తున్నా. ఒదిలివుండడం కష్టం గనక బాబయ్యగారి అనుమతిమీద వచ్చి, పెళ్ళి తంతులన్నీ నడిపిస్తాం. సూరీడు, కన్నతల్లి పిల్లకాయలు నువ్వు వచ్చావని మురిసి మురిసి విరిసిపోతారు.

నేను నీయొక్క! పరం.



## రా య బా ర ము

డిప్యూటీ కలెక్టరుగారు, తహశీల్దారుగారు, రాజమహేంద్ర నగరములోని పెద్ద వకీళ్లు, చెన్నపట్టణమునుండి జమీందారుగారి మేనల్లుడు ఆనందరావుగారు, పదిమందినీ కిటకిట లాడుచు నవుకర్లతో చాకర్లతో, ఒక్కసారిగా సుబ్బారాయుడు గారి ఇంటికి వచ్చినారు. సుబ్బారాయుడుగారు, చుట్టములకని వేరే కట్టి యుంచిన మేడ హాలులో పడకకుర్చీలమీద, పేము కుర్చీలమీద, దిండ్లకుర్చీలమీద నందఱు నధివసించినారు. కొత్తపేట డిప్యూటీ తహసీల్దారుగా రప్పుడు 'సుబ్బారాయుడు గారూ! కలెక్టరుగారు, తహసీల్దారుగారు, వీరందరూ తమతో ముఖ్యమైన పని వుండి వచ్చారు. తమరది కాదనక నిర్వర్తించడం మాకందరికీ చాల సంతోష ప్రదమైన సంగతండి.'

సుబ్బా:—చిత్తం. తమరు సెలవిస్తే నేను కాదనేవాణ్ణి ఎప్పుడూకాదండి.

డి. కలె:—తొందరపడి మాట యీయకండి. మాటయిస్తే మేము మటి వదలం.

సుబ్బా:—చిత్తం.

తహ:—సెలవియ్యండి ఆనందరావుగారూ! వారు జమీందారుగారి మేనల్లుడుగారు, చెన్నపట్నంలో పెద్ద న్యాయవాదులు.

సుబ్బా :—చిత్తం, నే నెరుగుదునండి.

ఆనం :—శ్రీరామమూర్తిగారు మాకు పూర్వస్నేహితులు. మా కెప్పుడు అప్పీళ్లు పంపిస్తూనే ఉంటారు. వారు పట్నంవస్తే నన్ను చూడకుండా వెళ్ళరు.

శ్రీరా :—ఆనందరావుగారూ నేనూ లాకాలేజీలో ఒక్కసారే చదువుకున్నాం. ఇన్నాళ్ళకు వారు మాయింటికి విచ్చేసి, మా ఆతిథ్యం అంగీకరించే భాగ్యం మాకు కలిగింది.

డి. త :—అల్లా అనకండి. ముందర మాయింటిలో ఏర్పాటులన్నీ అయినాయి. వారు మీయింటికి రావడానికి చాలా అభ్యంతరాలున్నాయండో శ్రీరామమూర్తిగారు ! ఇంతలో ఊరిలోని పెద్దలు నలుగురు సాహూతులయివచ్చి, యథోచితాసనముల నధివసించిరి.

ఆనం :—మా మామయ్యగారు, వారి ద్వితీయ పుత్రికను తమ ద్వితీయపుత్రునకిచ్చి వివాహంచేయ సంకల్పించుకుని మమ్ములనందరిని తమ్ముప్రార్థించుటకై పంపినారు. తమరు ఆమోదించవలెనని మేమంతా కోరుతున్నాము. వారి కోర్కెను పాలించవలసిందని మనవి.

సుబ్బా :—చిత్తం ! ఎంతమాట ! వారు జమీందారులు. మేము సామాన్య గృహస్థులం. ఆగర్భ శ్రీమంతుల పిల్లను నాకుర్రవానికి ఇస్తామని మీరయితే అనుగ్రహించినా నేను చూస్తూ చూస్తూ ఎలా సాహసించను ?

ఆనం :—తమరలా సెలవీయకండి. భాగ్య భోగ్యాలకేమి ? వారికున్నది వారికుంది. మీకున్నది మీకుంది.

డి. త :—పేరొక్కటి లోపంగాని మీరు మాత్రం తక్కువవారా ? మీ ఐశ్వర్యం ఏ జమీందారీకి తీసిపోతుంది ?

సుబ్బా :—తమ రదొకటి పెట్టకండి. మా ఐశ్వర్యమెంత ? మే మెంత ? ఏదో అన్నవస్త్రాదులకు లోపంలేకుండా గుట్టుగా కాలక్షేపం చేయడం తప్ప నే నంతటివాణ్ణికాను. అందులో జమీందారీ సంబంధాలకు తూగేతాహత్తు ఎంతటి సంసారికయినా ఉండదు. అందుకనే పెద్దలు ‘ సమయోరేవశోభతే ’ అన్నారు.

డి. కలె :—మీరు సమానులు కారంటే మేమంతా తెలివిమాలినవాళ్ళ మవుతామే కాని ఇతర మేమీ లేదు. ఈ వినయ సంపద మిమ్మల్ని సమానులనే కాదు - అధికులనూ చేస్తూఉంది. ఆ మాటంటే మళ్ళా మీ మొదటి ఆక్షేపణేసిద్ధిస్తుంది కాబోలు ? భేరీ జోగొట్టడమేగాని యేము మీకు మాటలు చెప్పలేము. వారు జమీందారులనే సందేహం మీకు సుతరామూ అక్కరలేదు. వారి యోగ్యతా, ప్రజారాధనతత్పరతా మీరైనా ఎఱగందికాదు. అనవలసి అంటారేకాని. జమీందారుగారు ఏలాగైనా మీవంటి సంపన్న గృహస్థులతో, వియ్యమందాలని కుతూహలపడుతున్నారు. మేమంతా అందుకు ప్రేరకులం, అనుమోదకులం, మీరు మా మాట తీసివేయరని ఆశపడివచ్చాం.

అంతలో నా యూరి కరణము వెంకటరాజుగా రందికొని, "సుబ్బారాయుడు బావగారు ! మీరు సందేహించకండి. మీ వుభయులకు సర్వవిధాలా తగివుంటుంది సంబంధం. బంధుకోటి కందరికీ గూడా వాంఛనీయమైనది కూడాను. జమీందారుగా రనగా రత్నాకరుడివంటివారు. ఆ శ్రీమహాలక్ష్మి మిమ్మును వెదకికొంటూ వస్తే కాలొడ్డి అతిలౌక్యం చేయకండి బావగారు. కలెక్టరుగారు తాసిల్దారుకూడా యింతగా చెప్పుతూంటే మీరు వెనకాడకండి ' అన్నారు. సుబ్బారాయుడుగారికి యనురోధ పరంపరలో ఏమిచేయడానికి తోచక, 'నేను వారిమాట తీసివేయాలనికాదు. అల్పుడ నని జంకుతున్నాను ' అనుచు పుత్రునివంక నొకచూపు సారించిరి.

ఇంతలో మరల తహసీల్దారుగారు దొరుకబుచ్చుకొని 'మీరు అల్పులో, అధికులో ఆ విషయం మాకు వదలిపెట్టండి. విశ్వలాపురం జమీందారుగారు పేరుకే గాని ఆచారవ్యవహారాల్లో జమీందారులుకారు. కాబట్టి వారితో యెత్తులెత్తలేమనే సంశయం మీ కక్కఱలేదు. అయినా మీరు పుచ్చుకొనేవారేగాని, యిచ్చేవారు కాన ప్పుడు మీ కా భయమక్కఱలేదు. ' అన్నారు.

సుబ్బా :—చిత్తం, పుచ్చుకోవడానికికూడా అర్హత వుండాలి. వారు యేనుగులను గుఱ్ఱాల్ని దాసదాసీజనాన్ని యిస్తే వాటిని భరించడానికికూడా శక్తివుండదు మావంటివాళ్ళకు.

వెంక :—ఈ పేదరుపులకేమిగానండి, బావగారు తలయెగరవేయండి. నేను అక్కగారికి చెప్పివస్తాను. రావోయి.

అల్లుడూ ' అంటూ శ్రీరామమూర్తితో నాయన జానకమ్మగారికడకేగెను. ఇచట సుబ్బారాయుడుగా రేమియు పాలుపోవక, 'తమవంటి వారందఱూ యీ స్వల్పకార్యంమీద నాయింటికి దయచేయడం, నేను తమ ఆజ్ఞకు అంజాయించడం, నా కెంతోకష్టంగావుంది. జమీందారుగారు మా కుఱ్ఱవానికి తమ అమ్మాయి నిస్తామ నడం ఒకయెత్తూ, దిగ్గంతులవంటి తమరందఱూ, ఆనాడు సప్తర్షులు హిమవంతుడి దగ్గరకు వెళ్ళినట్టుగా రాయబారంరావడం ఒక యెత్తున్నూ. ఇంతకూ, విధిసృజన వాళ్ళిద్దరికీ రాసిపెట్టి వుండడంవల్లనే మీవంటివారు పూనుకోవడం కలిగింది ' అంటూ ఉపచారవాక్యాలు చెప్పుచుండగా వెంకట్రాజుగారు తిరిగి వచ్చి, వియ్యపురాలితో పెండ్లికొడుకుతోగూడ మాటలాడి వచ్చితిననియు, వారందఱకు నంగీకారమేననియు చెప్పి 'ఏమంటున్నారు, మా బావగారు ? ఇక నెలాగూ యిది తప్పేదిగాదండోయి, మెడలు విఱిచి అంటగట్టడమే గాని 'అనుచు మేలమాడిరి.

సుబ్బా :—తథాస్తు. కానివ్వండి. ఉభయత్ర పెద్దలు, మీ అందఱిమాటకు నేను మాత్రం ఎదురు చెప్పుతానా.

అన్నంతలో అందఱును 'శుభం, శుభం ' అనుచు మందహాసములొన ర్చిరి. వెంటనే సీతారామాంజనేయ సోమయాజిగారొక యాశీర్వచన పనస నారంభింప, సభలోనున్న తక్కిన బ్రాహ్మణోత్తములందుకొనిరి,

విమ్మటి వెంకట్రాజుగారు, సిద్ధాంతిగారితో ! 'చిత్తం, యికనేము న్నది తరవాయి ? పంచాంగం చూచి మనవాళ్లు రాజమండ్రీ ముహూర్త నిశ్చయం కొరకు వెళ్ళవచ్చునని సెలవీయండి ' అనియేను.

శ్రీనివాసరావుగారంతట 'మర్జేమిటంటే, మళ్ళా యెప్పుడో చూడడ మెందుకు ? ఉండవలసిన సిద్ధాంతులందరూ ఇక్కడనే ఉన్నారుగా విచారించండి ' శుభస్య శీఘ్రం ' మన్నారు. మొన్న నారాయణరావుగారు రాజమండ్రి వచ్చినప్పుడు, నేను పుట్టిన తారీఖు అడిగితే, సెప్టెంబరు, మరేమిటంటే, జాతకపత్రం తీసి యిచ్చారు. జాతకం చాలా బాగుందన్నాడు మా సిద్ధాంతిగారు. అమ్మాయి జాత కానికి కూడా చాలా బాగాసరిపోయిందన్నాడు. రెండు జాతకాల్ని బట్టి ముహూర్తం రహితం చేయించడం ఉత్తమం. ఏమండీ సిద్ధాంతిగారూ !

సిద్ధాంతి :—చిత్తం ! అది తమతో మనవిచేయకుండా నేను చూశానండి. రేపు జ్యేష్ఠమాసంలోనే ఉంది. సర్వోత్కృష్టమైన ముహూర్తం. సప్తమశుద్ధి, గురుశుక్రబలం బాగుంది. కుజుడు ఏవిధంగానున్నూ దోషకారి కాలేదు; అన్ని బలాలు బాగున్నాయి అండి ! చాలా జయప్రదంగా వివాహం జరుగు తుంది. దాంపత్యం దివ్యంగా ఉంటుంది.

ఆనంద :—తమది పెద్దపూర్ణయ్యగారిమతమా, చిన్నపూర్ణయ్యగారిమతమా అండి ?

సిద్ధాంతి :—అయ్యా ! నేనుమాత్రం చిన్నపూర్ణయ్యగారిని స్ఫూర్తిగా అనుసరిస్తాను. ఏవంటారా, శాస్త్రంలో ఏవున్నా దృక్సిద్ధం లేకపోతే నిజమైన ఉపయోగం లేదండి !

మృత్యుంజయరావను నొక రాజమహేంద్రవరపు న్యాయవాది :— అయ్యా, దృక్సిద్ధం అనేది పాశ్చాత్యులు దూరదర్శినీ యంత్రాలు చూసి వ్రాసిన వ్రాతల్ని బట్టే కదా ? ఇప్పటి కింకా ' హైపీరియాననీ ' ' ప్లూటో ' అనీ కొత్త కొత్త గ్రహాల్ని కనిపెట్టుతున్నా మంటారు. కొన్ని కొన్ని మార్పులకు శాస్త్రీయమైన జవాబు కన్పించదాయెను. మనవాళ్లు, అంటే మహాఋషులు అతీంద్రియ దృష్టితో చూచి ఏర్పరిచిన లెక్కలన్నీ మార్చి, ఇప్పుడు దృక్సిద్ధాంతం కావాలి అంటారు. చివరికి ఈ దృక్సిద్ధాంతం నిలవకుండా ఎగిరిపోయే రోజు వచ్చినదాకా ఈ సిద్ధాంతాన్ని విడవరు కాబోలు.

తహశీల్ :—అది కాదండి. నేనూ కాస్త ఈ మధ్య జ్యోతిషం నేర్చుకోవడం ప్రారంభించాను. మనవాళ్లు ఏర్పరచిన లెక్కలు కొన్నాయి చూశాము, దృక్సి ద్ధాంతం రూపకంగా సరిచూడమనే సెలవిచ్చారు. అల్లాచేయకుండా ఆచారం అనీ సాంప్రదాయం అనీ ఆమాటలకు నిజమైన అర్థంగ్రహించకుండా ఒకటే పంథా మరీ, గుడ్డెద్దు చేనిలో బడ్డట్టు.

మృత్యుం :—చిత్తం. తమరు సెలవిచ్చినది నిజమే మరి. కాలాన్నిబట్టి మనం ఆకాశపటంలో ఏమి గమనించాలో, భూమిమీద వాటినిబట్టి ఏం మార్పులు

వస్తున్నాయో అన్నీ చూసుకుంటూ ఉండక్కర్లేకుండా, గానుగయెద్దులాగ తిరగాలి, అని సిద్ధాంత శాస్త్రాలు ఘోషించవండి. పాశ్చాత్య సిద్ధాంతాలు రోజుకోమాటు మారుతో వుంటాయి ఎందుచేత ? అసలు సిద్ధాంతజ్ఞానానికి ప్రాతిపదికమైన నిజం గోచరంచేసుకోకుండా ప్రత్యక్షప్రమాణమనే మాయా వాదానికి దాసులై నిజాన్ని రోజుకోసారి, నిముషానికోసారి మార్చుకోవడం వున్నదే, అది తప్పని నామనవి. మన వాళ్లు ఆ అసలు నిజమైనతత్వం పార లౌకికదృష్టిచేత తెలిసికొని, మార్గములు మనకుఏర్పరచారు. వాటిలో మనకు కావలసినవి తీసికొని తక్కినవానిని తీసివేస్తే ఎట్లాగండీ ?

శ్రీని :—మీరంతా సిద్ధాంతులు. మేము కొన్ని సంగతులు తెలిసికోవాలని వుంది. ఇప్పుడు గ్రహాలకి కారకత్వాలు కొన్ని యిచ్చారు. రాసులకు వేరువేరు భావాలు నిరూపించారు. అల్లా యివ్వడానికి తగిన ఆధారంఏమిటి ? శుక్రుడు స్త్రీగ్రహం అని మీరంటారు. పురాణాల్లో శుక్రుడు పురుషుడుకదా. చంద్రుడు అంతే. మరేమిటంటే, ఇది అంతా నాకో విచిత్రంక్రింద ఉంటుందండి.

డిప్యూటీకలెక్టరు :—అయ్యా శ్రీనివాసరావుగారూ ! వచ్చినపనిపూర్తిచేసి మీసిద్ధాంత చర్చలు ప్రారంభిస్తే బాగుంటుందేమో :

ఆసం :—అదే నా మనవి.

సుబ్బా :—మా సిద్ధాంతిగారికి కబురు పంపాను.

శ్రీరా :—భోజనానికి ఇంటికి వస్తారట, గోపాలపురం వెళ్ళారట.

సుబ్బా :—సరి, ఇక నేమి ? తమరందరూ ఈపూట నా ఆతిధ్యం స్వీకరించి నన్ను కృతార్థుణ్ణి చేయాలి. ఎన్నడూ రానివారు యీ నిమిత్తాన దయచేశారు.

డి॥ త॥ ' నేనందరికి ప్రయత్నం చేయించాను. క్షమించండి ' అనుటయు సుబ్బారాయుడుగారికడ వారందరు సెలవు తీసికొని డిప్యూటీ తహసీలుదారుగా రింటికి వెడలిపోయినారు.

## ౧౦

## దేశాంతర్గతుడు

రామచంద్రరావు కాకినాడనుండి రంగూను వెళ్ళినాడని తెలిసి, సుబ్బారాయుడి గారియింట్లో అందరు కంగారుపడిరి. సూర్యకాంతమ్మయు, జానకమ్మగారును కళ్ళ నీరు నింపుకొనుచు వాపోవజొచ్చిరి. సుబ్బారాయుడుగారు లోనికివెళ్ళి నాలుగు చీవాట్లు పెట్టిరి. ఆ రోజుననే బయలుదేరి లక్ష్మీపతియు, నారాయణరావును కాకినాడ వెళ్ళినారు.

కాకినాడలో రామచంద్రరావు సంగతి యంతయు వేటతెల్లమయ్యెను.

రామచంద్రరావు సూర్యకాంతము భర్త. ఇంటరు పరీక్షలో కృతార్థుడు కాలేకపోయినట్లు వార్తాపత్రికలలో ప్రచురింపబడుటయు, రామచంద్రునకు మతి

పోయినది. రామచంద్రుడు భౌతికశాస్త్రాదులలో నుద్దండుడు. అతనికి నింగ్లీషుభాష మాత్రము కొంచెము దూరపుజుట్టమైనది. పదార్థ విజ్ఞాన, రసాయన, వృక్షశాస్త్రములలో గ్రమముగా దొంబది, యెనుబదియాఱు నెనుబదియొక్క గుణము లాతడు సంపాదించెను. ఇంగ్లీషులో నూటికి ముప్పది మాత్రమే వచ్చినవట. తెలుగంత యన్యాయముగా లేదు. నలుబదియైదు గుణములు వచ్చినవి. కాబట్టి తప్పిపోయినను; మొదటితరగతి గుణములు వచ్చినవి. ఒక భాగముననే కృతార్థుడైనాడు.

నారాయణరావు కొత్తపేటలో వినినప్పుడే శాస్త్రపాఠములలో మొదటిగుణములు సముపార్జించి ఇంగ్లీషుభాషలో దప్పిపోవునని యనుమానించి లక్ష్మీపతి కది వెల్లడించినాడు. తుదకట్లే యయినది.

రామచంద్రరావు తండ్రికొక యుత్తరము వ్రాసిపెట్టి యోడనెక్కినాడు.

‘శ్రీ బాబయ్యగారి పాదాలకు వందనాలు. మనదేశంలో నిజమైన విద్యాదీక్షకు తావులేదు. మన దేశంలో చదువు అంతా గుమాస్తాలను తయ్యారుచేసే చదువు. దానికి తగిన విషయప్రణాళికే ఏర్పరచారు పరీక్షలకు. ఇంగ్లీషులో మార్కులు వచ్చి తీరాలి అని నిబంధన ఉండడం యొక్క ఉద్దేశం అది. నేను ఇంగ్లీషుపరీక్షలో నెగ్గవలసివస్తే శాస్త్రజ్ఞానానికి నీళ్ళు వదలుకోవాలి. ఈ మీ తనయుని పరిశ్రమను పాశ్చాత్యదేశాల్లో వచ్చిన ఖ్యాతి మీరెరిగే ఉన్నారు. మీకు నన్ను పాశ్చాత్యదేశం పంపడానికి ఇష్టము లేదాయెను. కనుక మీ పెట్టె మారుతాళంతోతీసి, అందులో ఉన్న అయిదువందల రూపాయలనోట్లు తీసికొని యోడనెక్కాను. ఈ దొంగతనానికి క్షమించండి. నేను ఎల్లాగో అల్లాగు అమెరికా చేరుకుంటాను. అమెరికా హార్వార్డులో చదువుతాను. అక్కడకు తాము ధనము పంపిస్తే అదృష్టవంతుణ్ణి. లేకపోతే అక్కడ కాయకష్టపడి ఎల్లాగో సంపాదించుకొని చదువు పూర్తిచేసుకుంటా. నేను ఈ జరిగిన విషయం అంతా చాలా జాగ్రత్తగా ఆలోచించి చేసినది. శ్రీ అమ్మగారి పాదాలకు ఆమె నిద్రపోతుండగా నిన్నరాత్రే నమస్కరించాను. మీ యిరువురి ఆశీర్వచనం నాకుంటే లోకాలు జయించగల్ను.

నమస్కారం
విధేయుడు మీ కుమారుడు,
రామచంద్రం

ఈ యుత్తరం చదువుకొనునప్పుడు మరల కనులలో నీరుతిరిగినది భీమరాజు గారికి. తల్లి మూల బండుకొని యతికరుణముగా నేడ్చుచునే యున్నది.

అప్పుడు నారాయణరావు, లక్ష్మీపతి, భీమరాజుగారు లోనికిబోయి యామె నోదార్పబూనిరి.

నారా:—అత్తయ్యగారూ! ఏమిటి మీరల్లా అధైర్యపడతారు! పట్నవాసంలో ఉన్నారు. ప్రపంచంసంగతి చూస్తున్నారు. సరోజినీదేవిగారివంటి ఉత్తమ

స్త్రీల యుపన్యాసాలకువెళ్ళి వింటున్నారు. ఆంధ్రమహిళాసంఘంలో మీరు పేరుపొందిన సభ్యురాలుగా ఉన్నారు. ఎంత మంది మనదేశములో యీనాడు పాశ్చాత్యదేశాలకిపోయి అత్యుత్తమ విద్యల నేర్చుకోవడంలేదు? మీరు వీరమాతలు. మీ అంతట మీరే 'నాయనా పాశ్చాత్యదేశాలకు వెళ్ళవలసి వుంటే వెళ్ళిరా' అనవలసింది.

లక్ష్మి:—పిన్నిగారూ! అక్కడకువెళ్ళి లోకప్రఖ్యాతి సముపార్జించటానికి పోచు కొన్నాడు, మా తమ్ముడు!

భీమ:—(భార్య దుఃఖంవల్ల ఎక్కడలేని ధైర్యముగలిగి) సరే, మీటింగుముందరి మాటలూ ధైర్యం, కష్టంకలిగి నప్పుడే అక్కఱకురావాలి. ఎందుకు ఏడ్పు? ధైర్యంతోవెళ్లాడు, శౌర్యంతో వస్తాడు!

రామచంద్రరావుతల్లి దుర్గమాంబగారు లేచి 'నాయనా నారాయణరావు, బాబూ లక్ష్మీపతీ! ఏంచెయ్యను. ఒక్కడేకొడుకు, ఒక్కటేకాన్పు. ఆడదాన్ని కబుర్లకయినా అక్కఱకురాను. మాశక్తిస్వభావం అంతే! ఏంచెయ్యను? నాతో రెండునెల్లనుంచి వాదిస్తున్నాడు. నేనన్నాను, చదువుకోసము పాశ్చాత్యదేశాలకు వెళ్ళాలా! గాంధీగారు 'పాశ్చాత్యవిద్య ఆత్మవికాసాన్ని చంపుతుంది. రామమోహనరాయివంటివాడు పాశ్చాత్యవిద్య లేకపోతే ఇంకను వేయిరెట్లు మహా ఋషిఅవును.' అని చెప్పలేదా? అని నేను వాదించాను. వాడు 'నువ్వుచెప్పిందంతా నిజం, అమ్మా! కాని మనం శాస్త్రపరిశోధనలలో నూతనవిషయం కనిపెట్టితే, ఇంగ్లీషువిద్యలో పెద్దపట్టా పొందితేనేగాని, ఆసంగతి లోకం ఒప్పుకోదు. కాబట్టి నేను జర్మనీకో లేక అమెరికాకో వెడతాను' అంటూవుండేవాడు.

భీమ:—ముందుకర్తవ్యం ఆలోచించకుండా ఇలాఅన్నాను, అలాఅన్నాను. అని కూర్చుంటే ఏమిలాభం?

అందఱుకలిసి వారి మేడయింటిలో మధ్య 'హాలులో' కూర్చుండినారు.

బుద్ధవరపు భీమరాజుగారు పూర్వకాలమునుండియు కాకినాడలో వర్తకముచేసి ధనికులైన పెద్దకుటుంబములవారిలో నొక కుటుంబమునకు పెద్ద. ఆయన వర్తకమునకు, లౌకికమునకు వీలయిన చదువుమాత్రమే చదువుకొన్నారు. కాని కుబేరునకు వన్నెదిద్దు వ్యాపారపు సరళి, సులువులు, చాకచక్యము, వ్యాపార యుద్ధనీతి సంపూర్ణముగా నెఱిగిన బ్రాహ్మణశ్రేష్ఠి. పట్టణములోనివారెల్ల వారి కుటుంబమును బ్రాహ్మణశ్రేష్ఠులనే పిలుచుచుందురు.

ఆయనకు లేకలేక రామచంద్రరావు విపరీత మేధాసంపదతో జన్మించినాడు. అతనికి వర్తకమున వైముఖ్యము దానికి తగినట్లు భీమరాజుగారికి వ్యాపారములో నష్టము తర్వాత నష్టమువచ్చి మూడులక్షలన్నర రూపాయలు మట్టిపాలయినవి. అప్పటినుండియు, మంచి గడుసరియైన భీమరాజుగారు వర్తకం, ఎగుమతి దిగుమతులు మానివేసి, చేతికందినంతమట్టుకు ధనము సేకరించుకొని ఇంపీరియల్

బ్యాంకులో రెండు లక్షల యిరువదివేలు నిలువచేసి, అవడ్డీవల్ల వచ్చిన ధనముతో సుఖముగా గాలక్షేపము చేయుచున్నారు. ఆయనకు భూములన్న నమ్మకములేదు. స్వసౌఖ్యము కొఱకు, కంపెనీ దొరలకు 'సప్లయి' కొఱకు, మామిడి మున్నగు ఫలవృక్షములు గల తోటనొకటి పిఠాపురం దగ్గర సంపాదించినాడు.

అట్టి భీమరాజుగారి యేక పుత్రునకు నాల్గువేలరూపాయల కట్నము, రెండు వేలరూపాయలు లాంఛనములతో నారాయణరావు నాల్గవ చెల్లెలినిచ్చి వివాహ మొనర్చినారు. సుబ్బారాయుడుగారన్న భీమరాజుగారికి గౌరవము, భీమరాజుగారన్న సుబ్బారాయుడుగారికి గౌరవము.

నారాయణరావు, లక్ష్మీపతి, భీమరాజుగారలాలోచించి రంగూనులో భీమరాజు గారి స్నేహితున కొకనికి తంతివార్త నిచ్చిరి.

తన కుమారుడు పాశ్చాత్య దేశములకువెళ్ళి ప్రఖ్యాతి గడించుట భీమరాజు గారికి సంతోషమే, కాని తనకు గావలసినంత యున్నది. పట్టి పేరు ప్రతిష్ఠలవలన కలుగు లాభమేమి? ఒక్కడే కుమారుడు, కానిదేశాలనుండెను, అక్కడ వానిని కనిపెట్టి చూచుటకెవ్వరు లేకపోవుదు. కొంచెము జబ్బుచేసిన తల్లిదండ్రు లరచేత ప్రాణము లుంచుకొనువారు. ఆ మారుదేశములు వా[illegible] [illegible]? ఎట్టివనో? వాడు ఎన్ని ఇబ్బందులుపడునో? [illegible]. అన్నిటికన్న పాశ్చాత్యదేశ వనితలు పొల్పడని పై పరీక్ష్యమేమి [illegible] రాజుగారి భయములు మన బావమరదుల చెవిలో కింపైన గద్గదికతో నెరుకుపెట్టినారు.

నారాయణరావునకు గుండె గుభిల్లుమన్నది. పాశ్చాత్యదేశముల కేగిన యువకులెందరో తెల్లని మేనులకు వలచి, టక్కరిమగువల హృదయములు ఆ శ్వేత కాంతల పాదములకింద ధారవోసికొనినారు. అట్టివారికి ఇంటికడ భార్య దానివవలె, రాక్షసివలె కన్పించును. ఎంతమంది భారతీయులు దీపముకడ శలభములవలె నశించి పోయినారుకారు? రామచంద్రుడు చిన్నవాడు, డబ్బుకలవాడు, సంస్కారహీనలు, పురుషుల వలపింపనేర్చిన మాయలాడులునగు దుష్టవనితలు వేలకువేలు పాశ్చాత్య దేశమున గలరని యాతని నమ్మకము. వారివలలలో భారతీయ యువకులెందరో చిక్కినారు. భగవంతుడెట్టి విపరీతముల నొనరింప నున్నాడో యని లక్ష్మీపతి చెవిలో నూదినాడు.

ఆ రాత్రియంతయు బావమరదు లిరువురు గాఢాలోచనలో నిదుర నెఱుగరు.

లక్ష్మి :—నీకు చాలా భయమురా బావా! మానవప్రకృతి యెల్లప్పుడు కుటిలముగా సంచరిస్తుందనా నీభావము?

నారా :—కాదోయి! స్థానబలము మనం ముఖ్యంగా గమనించవలసిన విషయం. స్థానబలిమివంటిదే స్థానవైపరీత్యమున్నూ.

లక్ష్మి :—సరే. నువ్వు ఒక్కడవు మదరాసులో ఉంటున్నావుకదా, మదరాసులో

కష్టివాళ్లు పోషన్చాలంటే ఎన్ని మార్గాలు లేవు? మనవారెవ్వరూ అక్కడ లేరు. అయి ఎందుకు నువ్వు తగలబడి పోతేదురా మరి?

నారా —నీ వాదన నాకు అర్థమై [illegible]యి. ఒకటిచూడు. [illegible] దేశంలో ప్రతివ్యాపారంలో, ముఖ్యజీవితాదర్శమైన సత్యమును సాధ్యమైనంత వరకు [illegible]గో కుండా గమనించేటట్లుగా మన్ని మన పూర్వనాగరికత తయారుచేసింది. అ నాగరకతయే ఈనాటికిన్నీ ఏదో రకంగా ఏదో రూపంగా సర్వత్రా వ్యాపించి ఉంది. అట్టి సంప్రదాయబలమే మన్ని ఇక్కడ కాపాడుతోంది.

లక్ష్మి :—సరే అదీ ఒప్పుకుంటాను. అయితే, నువ్వు పాశ్చాత్యదేశం వెళ్ళేవాళ్ళ సంగతి జాగ్రతగా ఆలోచించు. వాళ్ళలో మూడురకాల మనుష్యులు. డబ్బుండి. పాశ్చాత్యనాగరికత అనుభవిద్దామని, చదువుపనిమీదో ఆరోగ్యం వంకమీదో లేకపోతే స్వతంత్ర ప్రభువులైన మహారాజులలాగ సరదాగానో వెళ్ళేవాళ్లు మొదటిరకం.

నారా :—అవును బావా! అటువంటివాళ్ళు వెళ్ళి చేసేపని ఏముంది? మనదేశంలో ధనం తీసుకునివెళ్లి అక్కడతగలబెట్టడమే! మనదేశం బీదదేశం, పాశ్చాత్య దేశాలు భాగ్యవంతములైనవి. అందులో ఇంగ్లండు, ఫ్రాన్సు అమెరికాలు, మఱీని. వారికి విషయసౌఖ్యమే ఆదర్శం. అందుకోసం ఎన్ని చిత్రాలో సృజించుకొన్నారు. వాట్లకోసం పది ఖర్చుచేసేచోట వేయి ఖర్చు. కాని పాశ్చాత్యులు మనదేశం వస్తే మనదేశంలో అన్నీ వెట్టి చవుక. వారికి మన దేశంలో ఖర్చు పంటికింద పోకచెక్క.

లక్ష్మి :—అవును. ఇక రెండోరకం—ఉద్యోగం కోరి వీలయిన చదువుకొఱకు వెళ్ళేవాళ్లు. ఇంగ్లాండులో చదువులన్నీ అట్లాంటివే. మూడోరకంవాళ్లు పూర్ణమైన జ్ఞాన సముపార్జనమాత్రం కారణంగా పెట్టుకొని వెళ్తారు.

నారా :—అట్లాంటివాళ్లు ఆ వ్యామోహంలోపడి పాడయిపోయి జ్ఞాన సముపార్జనోద్దేశం మఱచిపోవ రటోయి మరి? ఆ హాని ఎదురుగా అమ్మవారిలా నోరు తెరచుకొని లేదూ?

లక్ష్మి :—అల్లా పాడయ్యేవాడికి నిజమయిన విద్యావ్యసనం లేదన్నమాటే!

నారా :—నువ్వుచెప్పిన కారణాలుగ్రహించక అనటముకాదు. నిజమే; శాస్త్రజ్ఞానం పూర్ణముగా సంగ్రహించుటే వ్రతంగా పెట్టుకొని వెళ్ళినవాడు ఉత్కృష్టజీవే! మన రామచంద్రుడు అవిధమైన తన్మయతలోనే ప్రయాణం సాగించాడు. పాశ్చాత్యదేశాలు వెళ్ళవలసివస్తే చిన్నతనంలో వెళ్ళడమే మంచిదని ఎరుగుదును. కామశక్తి మించి యౌవనంలోనే మనుష్యజీవితాన్ని కదల్చివేస్తూ వుంటుంది. ఆసమయంలో కామపరమైనమాయలకు మనుష్యుడు నిముషంలో లోబడిపోతాడు. చిన్నతనంలో కుఱ్ఱవాడు వాని దీక్షలోనే ఐక్యమైయుంటాడు. కాబట్టి వాడికి వాడివిద్యతప్ప వేరాలోచన కించిత్తయినా పుట్టనిమాట

నిశ్చయం. పైగా పరిపక్వమగుటకు సిద్ధమవుతూన్న అతనిహృదయానికి అపరిచితమయిన విషయాలన్నీ భయంకల్పించే పీడలు. వాటిని విరోధించ టానికి అతడుచేసే ప్రయత్నం కృత్రిమములేని సత్యహృదయంతో చేసేదే. అందుకనే చిన్నతనమే చాలా ఉత్తమం. కాని ఎంత చెప్పినా చెల్లాయి బాధపడుతుందని భయం నన్ను కదల్చివేస్తూంది బావా!

లక్ష్మి:—ఓయి వెఱ్ఱివాడా! యీ భయాలు నీబోటి ఉత్కృష్ట మానవునికి తగవురా!



## చిన్నవాడు

ఆరాత్రియంతయు నారాయణరావునకు నిద్రపట్టలేదు. సూర్యారావుపేటలో భీమరాజుగారి మేడమీద ఆరుబైటవేసిన మంచముమీద వెల్లకిలబరుండి నారాయణ రావు అశ్వినీదేవతలు, బ్రహ్మహృదయము, అనూరాధ, తుల, వృశ్చికము, ధ్రువుడు, మొదలగు తారామండలమునంతయు జొచ్చి చూచు చూపులతో గమనించుచుండెను. నక్షత్ర విరాజితమగు నయ్యాకాశకాండపటములో దన చిన్ననాటి కోర్కెలన్నియు నాతనికి మూర్తములై గోచరించినవి. చిరుతకోర్కెలతో దేశాలు గ్రుమ్మరదానును గోరువాడు. పాశ్చాత్యదేశము లాతని మనోలోచనాలకు దన చుట్టముల గ్రామముల రీతి దోచెడివి. సీమదేశములో రాణిగారు, రాజుగారుందురనియు, నచట నన్నియు బంగారపు మేడలనియు నాత డూహించుకొనువాడు. రాజమహేంద్రవరమునకు దూరమై గోచరించు పాపికొండలవెనుక సీమదేశమని వాదించువాడు తోడివాలురతో వీధులలో డబ్బులు, బేడకాసులు, పావలాలు రూపాయలు చిమ్మియుండునని భావిం చెడివాడు.

సీమదేశములోని భాగములే జర్మనీ, ఫ్రాంసు, ఇటలీ మొదలగు దేశములని యెంచెడివాడు. ఆ చిననాటి యూహాప్రపంచమంతయు దాను విన్న కథలలో నల్లి బిల్లికగా నల్లుకొనిపోయి యుండునది. రాములవారి పుష్పకవిమానముమీద తా నధివ సించి ఏకాలమును దేశాటన చేయుటయే కోరువాడు. ఆ నాటి కలలలో రాజకుమారిక రాక్షసులు, రాజులు, రాజ్యాలు కనబడ్డవి. తాను రెక్కలున్న గుఱ్ఱముపై స్వారి చేయుచునో, 'జయపరమేశ్వరా' యని తా దలంచుకొన్న చోటికి వాయువేగ మనో వేగములతో, దన్ను గొనిపోవు మంత్రపుబాంకోళ్ళపై నెగిరిపోవుచునో, తన తండ్రి గారి కథలలో రాజకుమారునివలె గత్తి పుచ్చుకొని రాక్షసుల నుక్కడగించుచునో యుండువాడు. రాజకుమారికలను వివాహ మాడువాడు.

ఎనిమిదిసంవత్సరముల ప్రాయమునాడు, నారాయణరావు కలలలో 'దేశము' 'స్వరాజ్యము' వినబడ్డది. తెల్లవారు మనదేశములోని ధనము కొల్లగొనుచున్నా రను భావములు చొచ్చి రా నారంభించినవి. బెంగాలులోని యువకులు చేయుచున్న వానికంటె భయంకరమైన బాంబులు తయారుచేసి భరతఖండముతప్ప, మిగిలిన

దేశములను భస్మీపటల మొనరింపవలెనన్న తీవ్రేచ్ఛలతో నాతని హృదయ మావేశ పూరితమైపోయినది. ఒకనాడాతడు ముఖముమీద 'వందేమాతరం' అని వ్రాసి కొని, తోడిబాలురకుగూడ వ్రాసి, పాఠశాలకు వెళ్ళినాడట! ఆ నాడాతని తరగతి యుపాధ్యాయిడు, వీరినందరిని బల్లమీద నిలుచుండబెట్టి యావ్రాత కడిగివేసికొన నాజ్ఞాపించెను. నారాయణరావు తన్నురిదీయవలెనేగాని మొగముమీది వ్రాత జెఱుప నన్నాడు. నారాయణుని తెలివితేటలు, వినయవిధేయతలు, రూపసంపదయు నుపాధ్యాయులందఱి యనురాగమును జూఱగొన్నను, అనాడు నారాయణరా విచ్చు జవాబులచే నుపాధ్యాయునకు వెఱ్ఱియెత్తిపోయినది. 'మొదట నోరుముయ్యి! తర్వాత మొఖంమీద రాత చెరిపెయ్యి. లేకపోతే నీవీపు చితకకొడతా!' అన్నాడు ఉపాధ్యాయుడు.

'మీరున్ను తెల్లవాళ్ళ స్నేహితులే! మాకు స్వరాజ్యం కావాలి. అందుకని నేను చెరపను. వీళ్ళెవ్వరూ చెరపరు' అని జేవురించిన మొగముతో బాలకుడగు నారాయణరావు సింహదమునివలె గర్జించినాడు.

ఉపాధ్యాయుడు తెల్లబోయినాడు. పేముబెత్తము దీసి రెండుదెబ్బలు వీపు మీద చురుక్కున జఱచినాడు. నారాయణరావు చెంగున బల్లపైనుండి యురుకుటయు, నుపాధ్యాయునిచేతినుండి బెత్తము లాగుకొని, ముక్కలుముక్కలుగ విరిచి పార వేయుటయు గనుమూసి తెఱచునంతలో జరిగినది. బాలకులందరిలో పొడగరియై, చక్కని దేహసౌష్ఠవముగల నారాయణరావు మోమున నపుడు వెలుగు నపూర్వ తేజము గాంచి ఉపాధ్యాయులవారు భయకంపితహృదయులై, మోము వెల్లనైపోవ, వ్రాన్పడిపోయినారు. బాలకులు భయాశ్చర్యములతో, ఏమిజరుగునోయని తేరిపార జూచుచుండిరి.

నారాయణరావు రండర్రా! వందేమాతరం అని కేకవేసి వీధిలోనికి దారిదీయ, బాలకు లాతనివెనుక 'వందేమాతర'మని కేకలువేయుచు వీధిని బడిరి.

ఆరాత్రి, సుబ్బారాయుడుగారు పుత్రుని బిలిచి యంతయు దెలిసికొని కోప గించిరి. ఉపాధ్యాయుడు నారాయణరావును సమీపించి 'నాయనా నేను పిల్లలుగల వాణ్ణి, నీ కిట్టిపనులు సేయుట కెవరు బోధించారో నాకు దెలియదు. నా యుద్యోగ మూడబీకివేస్తారు. తిండికి గుడ్డకు దూరమై ముష్టిచెంబు చేతికి వస్తుం'దని నీళ్లు తిరుగు కళ్లు తుడుచుకొనుచు వక్కాణించినాడు. నారాయణరావుకును గనుల నీరు తిరిగినది. అప్పటినుంచి పాఠశాలలో నాతడెప్పుడట్టి పను లొనరింపలేదు.

నారాయణరావు మొదటిఫారము చదువుచుండగా నైరోపీయ మహాసంగ్రామము ప్రచండోష్ణవాయువువలె విశ్వమెల్ల వీవదొడంగెను. నారాయణరావు లేత హృదయమున నాంగ్లేయులపై నపుడు జాలిపొడమినది. 'ఈనాడు వారికి రాజ్య వినాశము సంభవించి విపత్తు వచ్చినదట. పాపము తెల్లవారి బాలకులెందరో తండ్రులులేని బాలకులైపోదురట, కాన, వారికి మన మంతా సహాయం చేయాలి.'

అని వాదించాడు తోడిబాలురతో సరే యన్నారువారు. చందాలు వసూలుచేసి, తాను తల్లిగారినడిగి పదిరూపాయలు చందాపేసి, మొత్తము పదునేనురూకలు పెద్దకలెక్టరు గారు కొత్తపేటమకాముచేసినప్పుడు నిర్భయముగా వారిని దర్శించి, 'యుద్ధమునకు మా బాలకుల చందా' యని సమర్పించినాడు. ఆయాంగ్లోద్యోగి ఆశ్చర్యపూరితహృదయుడై ఈ నూలుపోగు వేయి మదుంగులుశక్తిగలత్రాడగుననియు, ప్రభుత్వమువారి తరపున నాచిన్నబాలకునకు ననేక నమస్కారములర్పించుచున్నాననియు, నాంగ్ల సామ్రాజ్యమున కానాడుసంభవించిన యాపత్తునకు భారతదేశము చూపు రాజభక్తి, యనన్యసామాన్యమనియు, నట్టి భక్తికి నీ బాలకుడే నిదర్శనమనియు నిండుసభలో నుపన్యసింపుచు, తనకడనున్న 'లాంబ్' కవిశేఖరుని 'ఎలీయా' వ్యాసములతో నారాయణరావును బహూకరించెను.

నారాయణరా వీయాలోచనలు తన్నలమికొన, హాయిగా నిదురగూర్కు లక్ష్మీపతిని గమనించి, యేల యిట్లీతనికి సుఖనిద్ర పట్టెనని యాశ్చర్యము జెందినాడు. ఒకరికి గష్టనుగు విషయ మింకొకరిని రవంతైన చలింపజేయదు. ఒక్కరిని సంతోషసముద్రమున నోలలాడించువిషయమే వేరొక్కరిని దుఃఖజలధిని ముంచును. ఏ సందర్భములోనైన హృదయ మావంతయు జెదరనీయుని తాను, రామచంద్రరాయుని ప్రసంగాణముచే నిట్లు కలత జెందుచుండ, లక్ష్మీపతి, తన మరదలి భర్త యిట్లు దేశములు తెగించిపోవుట కించుకైన జలింపక, గాటముగా నిదురించుచుండుట గాంచి, సృష్టిలో నొక్కొక్కరి ప్రకృతి యొక్కొక్కరీతి నుండునుగదా యని నారాయణరా వనుకొనెను. లక్ష్మీపతిని లేపుదమాయని యాతనికి గోర్కెజనించినది. కాని వెంటనే మరల్చికొనినాడు. వివిధములగు రంగులతో, విచిత్రములగు కలయికలతో మేళవింపై నిగూడార్థపూరితమగు మానవ జీవితమంతయు జక్కని చిత్రలేఖనమేయని యాతడనుకొన్నాడు.

కావుననే, ప్రకృతిని ప్రాతిపదికగా, నాధారభూతముగ నొనర్చుకొని కళాసృష్టి చేయవలసివచ్చినది. ప్రకృతి ననుకరించుటయు నొక కళాసాంప్రదాయమగుట సంభవించినదని, యాతడూహించుకొన్నాడు. సర్వదా మన కనుల యెదుటనుండి, మనకు జిరపరిచితములగు వస్తువులే ఛాయాచిత్రితమగుటతోడనే ఆనందము సమకూర్చుచున్నవని యాత డనుకొనెను.

ప్రక్కయంతయు జల్లబడిపోయి, హాయిగ జల్లగాలి వీచుచున్నను, నారాయణరావు తనకు నిదురపట్టుటలేదని వితర్కించుకొనినాడు. నిదురబోవునపుడు మనః ప్రవృత్తులడగిపోవునా ? ఆతురతవలననో, యే గాఢాలోచనా తీవ్రతవలననో మెదడు పనిచేయుటచే నిదురబట్టదు కాబోలు ? తన బావమరది ఖండాంతరములకు బోయి యశస్సు గణించివచ్చును. ఇందు విషాదకారణ మేమున్నది ? సూర్యకాంత మన్న దనకు నెక్కుడు ప్రేమ. ఆ బాలకు గష్టముకలుగు నేకార్యమైనదనకువిషాదము కలిగించును. కావుననే నేడు తానట్లు గజిబిజిపడిపోవుటకు గారణమైనది.

'ఏమిటా ఆలోచన! మీ ఆయనమీదేనా?'

'నువ్వు నన్ను వేళాకోళం చేస్తావేమిటే? వరసా తెలవదు వావీ తెలవదు!'

'నువ్వు వరస కాకపోవచ్చును. కాని బావగారు కాదా ఏమిటి?'

నిరుపమకు బావగారా! నిరుపమ తనకన్న కొంచెము పెద్దదిగా! నిరుపమ యా యాలోచన గ్రహించి 'బావగారని ఎందుకన్నా నంటావు? మనం ఇద్దరం కొంచెె మెచ్చుతగ్గు ఒకే యీడు. అందుకని బావగారన్నా తప్పులేదే!'

నిరుపమ నారాయణరావును సంతతము మేల మాడునది. నిరుపమ ఆడుపిల్లల పాఠశాలలో నయిదవ ఫారము చదుకొనుచున్నది. నారాయణరావా బాల హృదయము చూరగొనినాడోయన నిమేషమేని నాతని వదలక ఇంగ్లీషులో సమస్త విషయముల గురించి మాట్లాడునది.

శారద యిది యంతయు జూచి యించుక యక్కజమందినది. నిరుపమ శారదను జూచి—

'మీ ఆయన చాలా తెలివైనవాడే. ఏ సంగతైనా నే నడిగేటప్పటికి, అతి విపులంగా తెలిసేటట్లుగా మంచికథలా చెప్తాడే. ఎన్ని సంగతులు! ఎంతబాగా తెలుసును! మామాష్టరుగారు పుస్తకము చదువుకొనివచ్చి మా కందరకూ చెప్పితే నిద్రవస్తుంది. నాకు ఇంటిదగ్గిర చెప్పే మామాష్టరుగారు చెప్పినదానివల్లను పాఠం అర్థంకాక పోవడమూ ఉన్నది. కాని మీ ఆయన అద్భుతంగా పాఠం చెప్పగలడు. ఆయన దగ్గిర పాఠాలన్నీ చెప్పించుకుంటూంటే చాలా బాగా ఉండును.' అని పంచమ స్వనంతో పలికినది.

'చెన్నపట్నంలోనే ఉంటావు! అక్కడ అన్నీ చెప్పించుకోవచ్చును.'

'అదిగో అప్పుడే ఉడుకుపోతుతనం! ఎక్కడ వీలవుతుంది? మా నాన్నగారితో చెప్తాను. మీ ఆయనకు చాలా బాగా సంగీతము వచ్చునట. పెండ్లికూతురు చూపులకు వచ్చినప్పుడు ఫిడేలుమీద అద్భుతంగా వాయిస్తూ పాడినారటకాదూ! అమ్మ దొంగా! చెప్పావుకాదు. బొమ్మలువేయడంకూడా బాగా వచ్చునట!'

'ఏమో నాకేమి తెలుసునే నిరుపం! నువ్వు అవ్వికూడా నేర్చుకోవచ్చునులే!'

ఆ దినమెల్ల శారద తాను వినిన మాటలు, నిరుపమాదేవి పొగడ్తమాటలు దలచుకొనుచునేయున్నది. ఆయన పల్లెటూరి అనాగరికులలోనొక వ్యక్తియా కాదా! యని యామె తర్కించుకొనినది. ఆతని యుత్కృష్ట వ్యక్తిత్వమును ఆమెకు గోచరించినది. అంతకన్న నా బాల యాలోచింపలేదు. ఆలోచించుట కామె హృదయమునకు బరిపక్వస్థితి రాలేదు. నిరుపమ నగరవాసిని. అట్టి బాల కన్ని సంగతులు తెలియును. తనవారెల్ల నట్టులనిరేమి? నిరుపమ యీరీతిబల్కినదేమి? ఆరోజున ఆయన వాయించిన ఫిడేలు వాద్యము ఎంత అద్భుతమైనది?

పెండ్లి రెండవరోజు మధ్యాహ్నము జగన్మోహనరావు జమీందారు పెండ్లికుమారిత శారద కడకువచ్చి, ప్రక్కనే సోఫాపై అధివసించినాడు. శారద ఎంత

యందక త్తె? సినిమానటియగు సులోచనవలె నున్నది; శారదకీ యందమెక్కడ నుండి వచ్చినది? ఆమె తన కౌగిలిలో లతవలె నిమిడిపోవును. తన కిచ్చెదరను కొన్న యీ బాలిక నే డింకొకని భార్యయైనదా? ఎవడీ నారాయణరావు? ఈ సంబంధ మెట్లు తీసికొనివచ్చినారు? పందికిని బాలలక్ష్మికిని పాణిగ్రహణమట?

'శారదా! ఏమిటా గర్వము? మాట్లాడుట మానివేసినావు? మంచి పోత రించిన గిత్తలావున్న మొగుణ్ణి తెచ్చుకున్నానని గర్వమా ఏమిటి? ఎక్కడనుంచి తెచ్చారు నీకీ మొగుణ్ణి? కాకి ముక్కుకి దొండపండు కట్టినట్లు నిన్ను తీసుకెళ్ళి ఫట్టి బండాడికి కట్టిపెట్టారు? మామగారికి ఎల్లా నచ్చిందీ సంబంధం? అత్తకు నచ్చలేదుటగా? ఈ నీ బంగారు విగ్రహాన్ని తీసుకెళ్ళి ఆ రాక్షసుడివాళ్ళో పార వేసినారేమిటి?'

శారద యాతని పలుకులకు ప్రతిమాటచెప్పినదికాదు. ఆమె గుండెమాత్రము దడదడ కొట్టుకొనినది.

'మాట్లాడవేం. ఆ! నీమొగంచూస్తే నీకు వీడంటే అసహ్యమనేతోస్తుంది. కాదు మరి? కాస్తడబ్బు కాస్తచదువు వుంటే పెద్ద కుటుంబంవాడవుతాడా, నాజూకు వాడవుతాడా? ఈ పందిని చూసుకొని నువ్వు కులకబోతావాయేం: అల్లా ఒక్క నాటికి నీ మనస్సు పోతుందా?'

శారద కొక్కసారి కన్నుల నీరు తిరిగినది. అచ్చటనుండి లేచి, విసవిస నడిచి, మేడమీదికి పోయినది,

## ౧౩

## ముచ్చట్లు

వివాహము మంగళాంత మైనది. ఆ నాలుగురోజులు సుబ్బారాయుడుగారు సేలం సుందరి, వెంకటస్వామినాయుడు, మైగరు వరదాచారి, చౌడప్ప,బలరామయ్య, హరినాగభూషణం మొదలగు గొప్ప గాంధర్వనాయకులరప్పించినారు. ఆడు పెండ్లి వారు సంజీవరావు పిల్లనగ్రోవిపాట, సంగమేశ్వరశాస్త్రి వీణపాట పెట్టించినారు. ప్రసిద్ధికెక్కిన భాగవతులచే రాత్రులందు విడిదికడ హరికథలు చెప్పించిరి.

సదస్యమున కాంధ్రదేశములో పెన్ననుండి తెలివాహా నదివరకు గల ఘన పాఠులు, కావ్యవ్యాకరణ తీర్థులు, ధర్మశాస్త్ర కోవిదులు, తార్కికులు, మహాపండితు లెందఱో విచ్చేసినారు. కవులు గాయకులు విద్వత్ బృందములు క్రిక్కిరిసి పోయి నారు. సుబ్బారాయుడుగారు కాసుతో మొదలిడి నూటపదార్లవఱకు సంభావన లిచ్చి నారు. జమీందారుగారుకూడ భూరి సంభావన లిచ్చినారు. ఆ వివాహవృత్తాంతము లాంధ్రదేశ మంతట గథలుగా జెప్పికొనిరి.

రెండువందల యేబదిమంది బ్రాహ్మణులు వంటలకు, నీరు తెచ్చుటకు, వడ్డన లకు నేర్పాటు చేయబడిరి. వంట సుబ్బయ్యగారి నలభీమపాకము జగత్ప్రసిద్ధము.

అహో! యీ నిర్మలాకాశమున మిరుమిట్లు గొలుపు నీ వేలకొలది తారలు నిశ్శబ్దగీతికలు పాడుకొనుచున్నవి. ఈ నిశ్చలత ధ్వనిపూరితమయ్యు నిశ్చలత యెట్లయ్యెను? ఈ నిశ్శబ్దరాగాన, నీ కీచురాళ్లు, నిద్రలోని ఉచ్ఛ్వాసనిశ్వాస స్వనములు, దొడ్డిలోని యావుల కదలికలు, నక్షత్రమండలమునుండి రాలిపడు నుల్కలు, దారినిబోవు బండిగంట, యుదయించు చంద్రకిరణము, నెటనుండియో వినవచ్చు బాలకుని యేడ్పు-నివియన్నియు, నెట్లు సమన్వయింపబడినవో! ఒక్క రాగములోని స్వరకల్పనమైనవి.

నారాయణరావు హృదయమున నీయఖండ సృష్టిపై ప్రేమ పొంగి పొరలిపోయినది. ఆతడు భూమ్యాకాశముల నిండినట్లయినది. నీలగగనము, నిశ్చలతారకలు నాతనిలో లీనమైపోయినవి. తనకు ప్రాణవల్లభగా నిశ్చయింపబడిన శారదాదేవీస్వరూపమై ప్రకృతి తన్ను గౌగిలించుకున్నది.

శారదాదేవి నిరుపమాన సౌందర్యవతి. తానెంత పుణ్యమొనర్చెనో యీ బాలికను భార్యగా బడయుటకు. ఆమెతో దా నోలలాడనున్న స్వర్గసౌఖ్యము లాతనికి గోచరించినవి.

తన్ను జిరునవ్వుతో, దారానయనములతో, చంద్రకాంతి పుష్పములబోలు బుగ్గల సుడులతో జేరవచ్చు శారదలో లక్ష్మీపతిని, సూర్యకాంతమును, రామచంద్రుని విడివిడిగా జూచినాడు. వారలలో దనతల్లి గోచరించినది. అందఱునొక్క సంశ్లేషంబున చంద్రబింబమై గగనవీధి కాపథముల నెటకో తేలియాడుచు బోవుచున్నారు. తా నేరి యంకముపైననో శిరమువాల్చి, శీతలమై, హంసతూలికాసమమై, మెత్తనగు నా తొడలో కరగిపోయినాడు, ఆ తొడయే చంద్రబింబమైనది.

రెండుగంటలు లోనిహాలులోని గడియారము 'టంగు, టంగు' మని పాడినది. నారాయణరావు నిదురలో మైమఱచినాడు.

## ౧౨

## వి వా హ ము

రాజమహేంద్రవరములో సమస్తవైభవములతో శ్రీ శారదా నారాయణరావుల వివాహమహోత్సవము జరిగినది.

అప్పురిలో జమీందారుగారి మందిరములన్నియు గన్నుల పైకుంఠముగ నలంకరించినారు. రోడ్లు తోటలు పందిళ్లు వేయించినారు. జమీందారుగారి మేడలకు నాతిదూరాన రెండు మహా భవనములు మగ పెండ్లివారికి విడిద లేర్పరిచిరి. విడిదికడనుండి జమీందారుగారి మందిరములవరకునొక పందిరి. విడిదలకడను జమీందారుగారి మేడలకడను, చాందినీలు, గులోబులు, అగరునూనెల గాజుదీపాలబుడ్లు, తీగల పండ్లగెలలు, మెరుపుల పాదరసపుబుడ్లు, బుట్టలు, పూలతోరణములు, కొబ్బరికాయల గెలలతో పందిళ్ళలంకరించినారు.

జమీందారుగారి విశాలభవనములో విశాల సభాస్థలమున వివాహవేదిక సమర్చి నారు. చిత్రాలంకార శోభితమై యావేదిక దివ్యమై వెలుగొందుచున్నది. వివాహ సభామందిర మంతయు జుట్టములచే, సభ్యులచే గ్రిక్కిరిసిపోయినది. న్యాయవాదులు, జిల్లాకలెక్టరు, జమీందారులు, జిల్లాజడ్జీ, పోలీసు సూపరింటెండెంటు, ఇంక ననేకులు ఉద్యోగులు, పురప్రముఖులు సభనలంకరించినారు. ఆంధ్రదేశమునుండి పేరెన్నిక గన్న వారెల్లరు ఆనాడు సభాభవనమున గ్రిక్కిరిసినారు. అందఱకు బంపులు, దిండ్లు నమర్చినారు. పెండ్లి వారందఱు నొకయెడ నధివసించినారు.

పొన్నుస్వామి సన్నాయి మేళము వచ్చినది. మంగళ వాయిద్యములు ఘోరుమనినవి. 'అయం ముహూర్తస్సుముహూర్తోస్తు' అనుచు బురోహితులు మంత్రములు చదివిరి.

సభామధ్యమున నయిదువేల తులముల వెండిగంధపుగిన్నెయు, బంగారు పన్నీరుబుడ్డియు, బంగరు అత్తరువులదానును నొక దంతపుపీఠకపై నమర్పబడెను. సభలో నచ్చటచ్చట పీఠములపై సువాసన ధూపముల నెగజిమ్మ బరిణలమర్చినారు.

పండితోత్తములు సముద్ర గంభీర స్వనముల వేదఘోష సలుపుచున్నారు.

ఆడువారికి వివాహ వేదికకు సమీపమున తెరలమధ్య నొక స్థల మమ ర్చినారు.

సర్వాలంకార శోభితయై, పాలసముద్రమున జన్మించిన లక్ష్మీ బాలవలెనున్న పెండ్లికొమరిత, శారదను గంపలో గొనివచ్చినప్పుడు, పట్టు పీతాంబరములధరించి, వెడదయురమున హారములు శోభింప నారాయణరావు నాందీశ్రాద్ధమునకు లోనికి బోవునప్పుడు, జమీందారుగారు భార్యాసమేతులై సాలంకృతకన్యాదానముచేసి ధన్యు లగునప్పుడు, నూతన వస్త్రాలంకార శోభితులై వధూవరు లొండొరుల ప్రక్క నధివ సించినప్పుడు, మంగళవాద్యములుబోరన, విప్రాశీర్వాదములు దిశలునిండ నారాయణ రావు శారదకు మంగళ సూత్రధారణ కావించునప్పుడు వధూవరులు తలబ్రాలు పోసి కొనునప్పుడు జానకమ్మగారును, దక్కుంగల చుట్టము లెల్లరు నపరిమిత సంతోష మున నోలలాడిరి.

వివాహ సమయమున జమీందారుగారు భూరిసంభావన లిచ్చినారు. రాజ మహేంద్రవరములోని వితంతూద్వాహ మండలివారికి వేయిన్నూటపదాఱులిచ్చిరి.

జమీందారుగారి బంధువులు స్నేహితులు వధువునకు విలువగల బహుమతులు గొనివచ్చినారు. కొందఱు వెండిచెంబులు, కొందఱు కాఫీగిన్నెల దొంతరలు, గందపుబుడ్లు, వెండి సబ్బుపెట్టెలు మొదలగు రక రకముల పారితోషికము లొసంగిరి.

పెండ్లికొమరిత చుట్టములందరు నవనాగరికులు. ఆంధ్రదేశములోని సంపన్న గృహస్థులు. ఎల్లప్పుడు పట్టుచొక్కాలుధరింతురు. జుట్టు నున్నగాదువ్వుకొందురు. కంటి యద్దములజోళ్లు వారికి సార్వకాలిక భూషణములే. ఆడువారికే కంటియద్దము

లున్నవట. వారెప్పుడు ఊరేగింపులకు రారు, సభల నలంకరింపరు, వారందరకు సేవకులు, సేవకురాండ్రు పెక్కురుందురు. తమ బిడ్డలకు పాలిచ్చుకొను ముత్తయిదువులు వారిలోలేరు. కొందఱు బాలికలు కాళ్ళకు జరీపువ్వుల మొఖమల్ జోళ్లు సంతతము తొడిగికొని యుండుటచే వారి పాదములకు పారాణిపూయుటకు వీలులేక పోయినదట.

మగవారు పెండ్లివారితో బంక్తిభోజనమునకు రాలేదు. అచటి గాయకుల గానసభలు వారి హృదయము లాకర్షింపలేదు. స్వంత బ్రాహ్మణులు దారిచూప వారికి వేరుగా నేర్పరచియున్న భోజనశాల కరిగి భోజనముచేయుట, వార్తాపత్రికలు, 'నావెలు' గ్రంథములు చదువుకొనుట, సిగరెట్లు కాల్చుకొనుట వారి దినచర్యయై యుండెను.

మగ పెళ్ళివారు పల్లెటూరివారు. ఆచారాదికములు వారికి మెండు. ఊరేగింపునకు వారుసిద్ధము. వెలగల బనారసు చీరలు ధరించుట, దేహమెల్ల బంగారు నగలు ధరించుట, పాదములబసపుపారాణులు పూయించుకొనుట, పేరంటములకు దండ తండములుగా వచ్చుట, పెండ్లిపాటలు పాడించుట, పాడుకొనుట మున్నగు పెండ్లి తంతులెల్ల మగపెండ్లివారి యాడంగులే గుత్తకు గైకొనిరి. వియ్యపురాలికి, నాడుబిడ్డలకు నయిదురోజులు మొగంబులు కడిగించుట మొదలగు తంతులన్నియు క్రమముగా జరుగవలెను గాన, ఇష్టము లేకపోయినను వరదకామేశ్వరీదేవి ప్రతి వేడుకకు రావలసివచ్చినది.

మగపెళ్ళి వారిలో మగవారు అన్ని సభలకు హాజరు. వారి సంగీతప్రీతియు, దలలాడించుటయు, జేతులతో తాళము వేయుటయు వింతగా జెప్పుకొనిరి.

జమీందారిఫాయిలో జేరిన ఆడపెండ్లివారికి మగపెండ్లివారి ఆడువారు కాళ్లకు నగలతో పసపు పారాణులతో ముత్తయిదువులవలె కనిపించిరట, గజ్జలగుఱ్ఱములవలె దోఁచినారట!

'ఇంత పల్లెటూరివాళ్ళని మనం అనుకున్నామటమ్మా. వట్టి మోటు అడవి మనుష్యులవలె ఉన్నారు. ఈ సంబంధం ఎక్కడ తెచ్చారండీ అత్తయ్యగారూ!' అని వరద కామేశ్వరీదేవితో నొక దగ్గరిచుట్టము, సరోజని యనినది.

'అమ్మా! శారదను తీసుకెళ్ళి పల్లెటూళ్ళ పేడదొడ్లల్లో పడవేశారేమమ్మా?' అని శకుంతలాదేవి చిన్నవోయిన మోముతో ననినది.

'వదినా! మీ అమ్మాయికి మా అబ్బాయికన్న చాల గొప్ప సంబంధం తెచ్చారనుకున్నాము. చూడ ముచ్చటవేస్తోంది. మావైపు పనిచేసేవాళ్లు ఇంతకన్న చాలా నాజూకుగా వుండిపోతారే' అని జగన్మోహనరావు జమీందారుగారి తల్లి శివకామసుందరీదేవిగా రనిరి.

'అవునండీ పిన్నీ. వాళ్ళబట్టలు వాళ్ళే వుదుక్కుంటారట. పిడకలు చేసుకుంటారట. నీళ్లు తెచ్చుకుంటారట. పొలాలు వెళ్ళి గడ్డీగిడ్డీ కోసుకు మోపులుకట్టి

తెచ్చుకుంటారట ' అని జమీందారుగారి వేలువిడిచిన మేనకోడలు లలిత కుమారీ దేవి యనినది.

' ఆ నగలేమిటి ? ఆ బొట్లేమిటి ? ఆ చీరలేమిటి గాదిపలును నగలోసినట్లే! కోరి కోరి వెదికి వెదికి తెచ్చారే ! ' అనీ మరియొక శ్రీమతి ముక్కుపై వేలు వైచుకొనినది.

అందఱు వెడవెడనవ్వులు విరగబడి నవ్వుకొనినారు. మిసెస్ ప్రకాశరావు జానకమ్మ గారు గూడ వారి హేళనకు గురియైనది.

' ఆవిడేనా వియ్యపురాలు ! కూడా వచ్చిన పేరంటాలనుకున్నాను ! ' అని హైకోర్టు న్యాయవాది ఆనందరావుగారి భార్య ప్రమీలాదేవి యనినది.

' ఇంతకూ మా శారద అదృష్టం యిలా అయింది. ' అని వరద రాజేశ్వరీ దేవి కన్నుల నీరు నింపుకొనిది.

ఆ ప్రక్కనే సోఫాపైనధివసించి యీ సంభాషణ లాలకించు శారద హృదయము పరి పరివిధముల బోయినది.

ఆమెతోటి బాలిక యో ర్తామెకడనే వసించి యున్నది. ఆ బాలిక కేలనో నారాయణరావు చక్కనివాడని తోచినది. ఆ బాలిక మొన్న మొన్ననే వివాహమైనది. ఆమె వరుడు గూడ శ్రీమంతుడు, విద్యావంతుడే ! అయినను తేజస్సుతో నిండిన నారాయణరావు మొగము, నాతని రూపసంపద ఆ బాలికకు జూడ ముచ్చటయైనవి. ఆ బాలిక శారద పినతండ్రి కుమారితె. ఆమె పేరు నిరుపమాదేవి. ఆ బాలిక జనకుడు చెన్నపట్టణములో న్యాయవాదిగానున్నాడు. శారదకు, నా బాలికకు మిక్కిలి స్నేహము. ' శారద ! నీ భర్త ఇంగ్లీషుభాషలో చాల గొప్పవాడే ! '

' ఎల్లా తెలిసిందే నీకు ? ' క్రొత్త క్రొత్త ప్రపంచములో గన్నులు విప్పు నీ బాలికకు సిగ్గులుండరాదని వారి మతము. సిగ్గుపడువారిని గాంచి పల్లెటూరివారని వారిలో వారు నవ్వుకొందురు.

సంబంధము తండ్రి తెచ్చినాడు. బాబయ్యగారు తెచ్చిన సంబంధమునందు లోపము ఉండగూడదు. పెళ్ళివారందరూ పల్లెటూరివారే. పల్లెటూరి వారగుటయే లోపమైనచో బాబయ్యగారికది గొప్ప సంబంధమని యెట్లు తోచినది. బాబయ్యగారికి తనపై చాలప్రేమ. ఎందు కిట్టి సంబంధము తెచ్చినారు ? లోన సిగ్గుపడుచు.... పెండ్లి....చాల అందంగా ఉండెననియా ? అనుకొనినది. అంతలో ఆమె త్రపాహృదయయై ఆ యాలోచన మానికొన్నది. ఆమె మోము చిరునవ్వున ప్రఫుల్లమైనది.

' ఏమిటే శారదా ! చిరునవ్వు నవ్వుతున్నావు ' అని నిరుపమాదేవియన్నది.

' ఏమీ లేదే ? '

' వూరికెనే నవ్వుకుంటారటే ! '

' ఏదో ఆలోచన తట్టి నవ్వువచ్చింది. '

ఆయన స్వయముగా మహానసాధిపత్యము వహించిరి. సమస్తపాకములలో షడ్రుచులలో నాయనది అందెవేసిన చేయి. ఆయన పంచాయకూర వండి పోక ప్రొత్తిలో తొమ్మిదిరోజులు నిలువయుంచి, పదవరోజున దీసినచో నప్పటికప్పుడు వండిన కూరవలె బొగ లెగయుచు రుచికరమై, చెక్కుచెదరక యుండునట. అన్నమునకు, గూరలకు, జేరు పులుసులకు వేఱువేఱుశాలలు. పిండివంటల పందిరి వేఱు. పిండి వంటలకు చాలఘాటు బ్రాహ్మణులజట్టు వచ్చినది.

స్త్రీలకు, బురుషులకు వేర్వేరు భోజనశాలలు వర్ధనకై వేరువేరు జట్టులుండెను. సంబారములు జతనచేయుట కిరువదిమంది జమాజెట్టీ లేర్పరుప బడినారు. ఇదికాక ఘనబంధువులకు వేరువేరు వంటలు విడిగా బచనము చేయబడును.

పెరుగు బానలు నిలువచేయుటకు గొన్ని గదులు. కాయగూరలకు గొన్ని గదులు. ప్రసిద్ధులు పదునైదుగురు తమలపాకుబీడాలు కట్టుచుండిరి.

ఐదురోజులు రెండుపూటల మూడునాల్గు పిండివంటలు, వేపుడుగూరలు, కలగల్పులు, బప్పులు, పచ్చళ్లు, దప్పళములు,—చేసిన రకములు చేయకుండ సమారాధనలు దివ్యముగ జరిగినవి.

పెండ్లికి వచ్చిన చుట్టములకు, స్నేహితులకు, బండితులకు, నాశ్రితులకు సమస్త జనులకు నెచ్చట నేమియు గొఱతరాకుండ జమీందారుగారు వేయికనులతో గనిపెట్టియుండిరి.

నాల్గవనాటి రాత్రి పట్టణమంతయు నూరేగింపు టుత్సవము మహావైభవముగ జరిగినది.

జమీందారుగారి ఊరేగింపు యేనుగపై బంగారపుటంబారీ నమర్చి వధూవరుల నం దాసీనులజేసి యూరేగించినారు. అలంకృతములగు నాలుగు మదగజములు, ఒంటెలు, నొయ్యారపు నడల తురగములు, నాలుగు రణదోలు మేళములు, మైసూరు బ్యాండు, నౌబత్తు మేళములు, మోటారుకార్లు, చిత్ర విచిత్రములగు వేషములు, ఓడలు బండ్లు మొదలగు వాహనములు, నయిదువందల 'గ్యాసుదీపాలు,' కొబ్బరి కురిడీ దివ్వటీలు రెండువందలు, పూలచెట్లు, కాగితపు బుడ్ల దీపాల వరుసలతో, అఖండవైభవముతో గనుల పండువుగ నూరేగింపు టుత్సవము నడచినది. ఊరంతయు నూరేగింపులో నున్నది. మగ పెండ్లి వారందరు మోటారుబండ్లమీద నూరేగిరి. ఆడ పెండ్లివారెవ్వరు రాలేదు.

వివాహమునకు నారాయణరావు స్నేహితులందఱు నరుదెంచిరి. చాలమంది రాకపోకలకు ఖర్చులు నారాయణరావు పంపినాడు. ఆ యువకమండలి యంతయు పేకాటలతో సిగరెట్ల కాల్పులతో, వివిధ వాదములతో, నవ్య కవిత్వపు సభలతో, బెండ్లి యైదుదినములు వినోదించిరి. జమీందారుగారు వారి విషయమై యపరిమిత శ్రద్ధవహించి, వారికెప్పుడేమి కావలయునో అరయుచుండుటలో, సిగరెట్లుడబ్బాలందుబాటుచేయుటలో నేమరకయుండెను. నారాయణరావు తన మిత్రుల యవసర

ములకని పరమేశ్వరమూర్తి చేతిలోనిడిన నూరుపూకంతో టనిలేకపోయినది. రాజారావు, పరమేశ్వరుడు, ఆలం, ఇంకను చాలమంది అంతరంగిక మిత్రులు కుటుంబములతో వచ్చిరి. స్నేహమండలికి వలయు సౌకర్యము లొనగూర్చుపని లక్ష్మీపతి వహింపవలసి వచ్చినది. లక్ష్మీపతి యతిశ్రద్ధాపరుపై స్నేహబృందముచే లోటేమియు లేదనిపించినాడు.

ప్రాణస్నేహితులు, కొంచెము దూరపుమిత్రులు, మరీ దూరపుహితులు, లోనగువారికి నారాయణరాయ లక్ష్మీపతులు దలలోని నాలుకపలె మెలంగిరి.

ఒక స్నేహితుడు :—పెండ్లికూతురు అప్సరసవలె వుందిరా ?

ఇంకొకడు :—చాలా తెలివైన అమ్మాయిటరా, ఇంగ్లీషు, సంస్కృతం, తెలుగు క్షుణ్ణంగా వచ్చునట. ఫిడేలు, వీణ పాటల్లో అపరశారదాదేవే అన్నారు.

రాజా :—అది గాదోయి, నారాయణరావు అదృష్టవంతుడని అనవచ్చునన్నమాట.

పర :—చాలా అదృష్టవంతుడని ఈసభలో ఉపపాదన చేస్తున్నాను. సభవారు ఆమోదిస్తే ప్రకటనార్థము పత్రికలకు పంపుతాను.

లక్ష్మీ :—జమీందారుగారి శ్రద్ధ చాలా విపరీతంగా వుందోయి.

ఆలం :—అరే లక్ష్మీపతీ! మనికి రయిల్లో కనబడ్డప్పుడు ఇంత మంచివాడు అనుకోలేదు.

రాజే :—ఒరేయి నారాయణా! జమీందారుగారు నిన్ను పూర్తిగా ప్రేమించడం ప్రారంభించారు. ఆయనకళ్ళు నిన్ను తనివితీరా క్రోలుతున్నట్లు నీమీదే వుంటాయి.

ఓ స్నేహితుడు :—అసలు ప్రథమదృష్టి ప్రేమవ్యాపారంలా కనబడుతూ వున్నదిరా!

వేరేయొక మిత్రుడు :—జమీందారుగారు శాసనసభలో ఎప్పుడూ స్వరాజ్యపార్టీ తరఫున పనిచేస్తాడు. కాని ఆయనకు అసహాయోద్యమం ఇష్టంలేదంటారు.

లక్ష్మీ :—ఇష్టం లేకేమి ? ఆయన జయిలుకు వెళ్ళకపోయినా, 1922 సంవత్సరంలో అందరూ జయిలుకు వెళ్ళినప్పుడు శాసనసభలో అస్తమానం గవర్నమెంటును ఖైదీలవిషయం ప్రశ్నలు వేస్తునేవుండేవారు; ఓరే రాజేశ్వరుడు! మీ జస్టిసు పార్టీ పక్కలో బల్లెమై పానగల్లును దేకించేసేవాడు.

నారా —బావా! పానగల్లును దేకించగల మగవాడు ఇంతవరకూ పుట్టలేదు. ఇక పుట్టబోడు, ఆతనికి ఆతనే సాటి. ఆంధ్రవిశ్వవిద్యాలయం విషయంలో ఆంధ్రరాజధానివిషయంలో అతనికి ఉన్నపట్టుదల, దీక్ష ఇంకోడికి లేదు. ఆంధ్రాభిమానంఇంతా, అంతా అని కాదు. పైగా తనకు పార్టీమాటేలేదు. పైకి ఏమన్నా, క్రియలో అందరియందూ బ్రాహ్మణు డయ్యేది, బ్రాహ్మణేతరు డయ్యేది సమానప్రేమ ఆయనకు.

రాజే :—నారాయణరావుకూ జై! మా పార్టీ మర్యాదంతా కాపాడావురా.

నారా :—అవునురా, స్వరాజ్యపార్టీవాళ్ళు శాసనసభలకు వెళ్ళి చేసినపని యేమిటిరా

పర :—ఒరే అల్లాంటే నేను వప్పుకోను. గవర్నమెంటువారి మానసపుత్రుల మను కొని, దేశద్రోహులై దేశంకోసం మనవాళ్లు ఖైదులకు వెళ్ళి పడరానిపాట్లు పడుతోంటే చీమైనా కుట్టకుండా, రొల్లాయికబుర్లు చెప్పుతూ, ఉద్యోగాలకోసం ఏడ్చి ఖిన్నపోతో కాంగ్రెసును ఛండాలపు తిట్లు తిట్టిన మహానుభావులు కాదూ ఈ జస్టిసుపార్టీ సమరథులు ?

నారా :—నువ్వు చెప్పింది నిజం కాదనను. కాని, ఆదృష్టి స్వరాజ్యపార్టీవైపు మరల్చరా ? తాము శాసనసభల్లోకి వెళ్ళి వెలగబెట్టేది ఏమీ లేదని తెలుసును. వట్టి ప్రశ్నలు అడగడం తప్ప వీరుచేసిన మహత్కార్యం లేదు. వీర్ను సలిపిన గడబిడ అంతా వృథాయని తెలుసును. కాంగ్రెసులో వుండి ఖైదుకు వెళ్ళలేరు. కష్టపడలేరు. శాసనసభలలో సభ్యులమని విఱ్ఱవీగడం తప్ప ఏమున్నది ? సరియైనమార్గంచెప్పి దీక్షతో నడుచుకోండ్రా అన్న ఆ మహాత్ముణ్ణి మూలకుతోశారు. ఆయన యేర్పరిచిన బాటను నడిచేశక్తిలేక ఆక్షేపిస్తారు. శాసనసభల్లో యుద్ధాలుచేసి, శాసనసభలు ముక్కలు చేస్తారూ ! దేశంలో పోనీ, అసంతుష్టయినా కలుగజేశారా ? ఒక్కగాటిని నడవవలసిన దేశం భిన్నభిన్నమై ఎవరికివారే యమునాతీరే అయింది ! ఏమిటోయి, స్వరాజ్యపార్టీ వారుచేసిన అద్భుత కృత్యాలు ?

పర :—ఒరేయి ! నీకు అసలు నిరాకరణవాదం అంటే ప్రాణంగదా, పోనీ, మీవోటి గాళ్ళేమిచేశారు. ఖైదుకు వెళ్లివచ్చి ఏ మొహం పెట్టుకొని మళ్ళా కళాశాలల్లో చేరారు !

నారా :—నేను చేసినపని సరియైందని వాదించానటరా ? ఆరు నూరైనా, నూరు ఆరైనా, ఒకటేమార్గాన్ని నమ్ముకు వుండలేకపోయిన హృదయదౌర్బల్యానికి తలవంచుకొంటున్నాను. అంతే.

పర :—కాని తీవ్రవాదనంటే నీ కెంత ఇష్టమైనా స్వరాజ్యపార్టీవారు చేసిన, కార్యాలు కొంచెమయినా గమనించకపోతే ధర్మదూరంకాదురా !

నారా :—వాళ్లు అసలు చేయలేదని అన్ను. బార్డోలీతీర్మానం తప్పనీ, గాంధీగారికి మెదడులేదనిన్నీ, రీడింగు ప్రభువు రాజీకివచ్చినప్పుడు ఫత్వాఖైదీలు అంటూ తాను బట్టిన కుందేటికి మూడేకాళ్ళని కూచున్నాడనిన్నీ మన మహానుభావులు చేసిన హేళన - ఏకొద్దో కాంగ్రెసు దేశానికి అర్పించిన పవిని మంట గల్పడమే కాకుండా, దేశానికి విషమైందని నా వాదన.

ఈ సంభాషణ స్నేహితులందరు వినుచున్నారు. కొందరు విసుగుతో దూరముగాబోయి పేకాట మొదలుపెట్టిరి. కొందరు తాము సంభాషణలో బాల్గొనిరి.

స్నేహితులందఱకు ఆ అయిదురోజులుత్రుటిలో వెళ్ళిపోయినవి. పరమేశ్వర మూర్తి గృహప్రవేశమునకై కొత్తపేట వెళ్ళినాడు. తక్కంగల మిత్రులు, రాజమహేంద్రవరపురమునుండియే పని వినినారు.

జానకమ్మగారు కోడలిని జూచి మురిసిపోయినది. ఆమె పెద్ద వియ్యపురాలామెను జూచి 'ఏవమ్మా వదినా! సుఖపడాలని పెద్దకోడల్ని తెచ్చుకున్నావే ఈవాళే పెద్దమనిషి అయ్యేలాగుంది' అనినది.

'ఇదివరకు కోడలువచ్చి సుఖపెట్టింది. ఇప్పుడీ పిల్లవచ్చి సుఖపెట్టుంది. వాళ్ళ భార్యాభర్తలు కులాసాగా ఉంటే అదే పదివేలు' అనినది జానకమ్మగారు.

ఒక ఆవిడ :—మీ కోడలు చాలా నాజూకుమంతురాలు. జమీందారుగారి అమ్మాయి పనేమిచేస్తుంది? మీకు కోడళ్లు పని చెయ్యాలిటమ్మా అక్కా!

ఇంకోవనిత :—ఏవమ్మా అత్తా! పెళ్ళివారు అతి నాజూకువారు. ఒక్కరూ వచ్చి కూచోరు. పలకరించరు. ఇంత గర్వాలేవిటమ్మా? మన వాళ్ళని చూచి ఒకటే మూతులు ముడుచుకోవటము.

జానకమ్మ :—అందుకోసమే ఈ సంబంధము మావారికి ఇష్టములేకపోయింది. మెడలువంచి వొప్పించారు.

వెంకాయమ్మ, (నారాయణరావు, అక్కగారు. శ్రీరామమూర్తి చెల్లెలు) :—అమ్మా అదేమిటే అల్లాంటావు! నిక్షేపమువంటి సంబంధము. ఏమ్మొదికె మరద లంటే చాలా ఆపేక్ష. కోరుకొని చేసుకొన్న పెళ్ళికూతు రామెను.

సత్యవతి :—(నారాయణరావు రెండవయక్కగారు) అక్కయ్యా! భార్యాభర్తలకు మనస్సు కుదిరిన సంబంధము చేసుకోవాలి. లేకపోతే వాళ్ళిద్దరి బ్రతుకూ యమలోకము.

వెంకాయమ్మ :—నా తల్లీ, మీ ఖర్మం అల్లా కాలిపోయిందికాని, అన్ని సంబంధాలు భార్యాభర్తల ఇష్టంమీదే చేస్తున్నారటే?

జానకమ్మ :—మగవాడు గౌరవముచేయని ఆడదానిబ్రతుకు అధమాధమం. డబ్బ క్కర్లేదు, పిల్లలక్కర్లేదు; మొగుడు, ఆడదికూడా ఒకప్రాణి అని తలపే లేక కుక్కకన్నా హీనాకష్టంగా చూస్తే దాని బతుకు పేటలోబొల్లి పురుగు కైనా వద్దు.

సత్యవతి భర్త పరమకోపి; పట్టి అనుమానపు మనుష్యుడు. తన పెదను చూచి తాను భ్రమసే పిచ్చిమనిషి. ఏదోవంకపెట్టి భార్యను బాదగొట్టును. బావగారితో మాట్లాడినావనును. మరదివంక తేరిపారజూచినావనును. ఒకరోజంతయు తిండి పెట్టవద్దని తన తల్లికి నాజ్ఞయిచ్చి, గదిలో బెట్టి తాళము వేసినాడట. ఇద్దరు ఆడపిల్లలు, ఒక బాలకుడు, ఒక బాలిక చిన్నతనములోనే జబ్బులుచేసి పోయినారు. పెద్దపిల్ల పదేళ్ళది. సత్యవతి స్వప్నరూపి, తీర్చిన కనుముక్కుతీరుగుగల బంగారు శలాక వంటిది. వెన్నెల కిరణము, అందకత్తెయయిన భార్యను జూచినప్పుడు వీర భద్రరావు, వీరభద్రుడై నిష్కారణముగ బాదగొట్టును. సుబ్బారాయుడుగారికి జానకమ్మగారికి సత్యవతి పవిత్ర సంతతము మహావిషాదము కలుగజేయుచుండును. వారి జీవిత యానములో సత్యవతీ చరిత్రయే నీటిక్రింద దాగియున్న భయంకర

మగు శిలయైనది. పుత్రికకొరకై జానకమ్మగా రెన్ని గంగాయమునా ప్రవాహములు కన్నుల బ్రవహింపజేసినదో!

సూర్యకాంతము :—(నారాయణరావు రెండవచెల్లెలు) అక్కయ్యోయి! నేనూ చిట్టక్కయ్యా చిన్న వదినదగ్గరే ఉన్నాము నిన్నల్లాను. మొట్టమొదట ఏమీ మాట్లాడిందికాదే! మేమే తెగపలకరించాము. అప్పుడు మాట్లాడిందే. తన చదువుసంగతులు, సంగీతం సంగతి, వాళ్ళ చుట్టాలసంగతి అన్నీ చెప్పింది. మా యిద్దరికీ స్నేహం కలిసిపోయింది.

రవణమ్మ :—(నారాయణరావు పెద్దచెల్లెలు) ఒసేవు అక్కయ్యా, నాతో రెండు మాటలేవో చెప్పింది. అంతే. సూరీడుతో ఒకటే కబుర్లు. వాళ్ళిద్దరికీ ప్రాణస్నేహం కలిసిపోయింది.

వెంకాయమ్మ :—ఏమి కబుర్లు చెప్పిందేమిటే సూరీడూ!

ఇంతలో జానకమ్మగారి రెండవ వియ్యపురాలు, వెంకాయమ్మ అత్తగారు వచ్చి, 'ఏమండి వదినా, ఈరోజున యింకా పెళ్ళికూతుర్ని తల దువ్వడానికి తీసుకురాలేదు. ఊరిలో వార్నందర్నీ, బంతులాడించటమునకు పిలిచాము. మేమంతా ముస్తాబయ్యాము. మీరూ, మీ అమ్మాయిలు సోదిపెట్టుకు కూచున్నారు.

జాన :—మా పెద్దమ్మాయి, సూరీడూ వెళ్ళి పెళ్ళికూతుర్ని తీసుకువస్తారు. సత్యవతీ మాణిక్యం మీరంతానున్ను పెళ్ళివార్నందర్నీ పేరంటానికి పిలవండి. సావిత్రీ బాయి సంగీతపు కచ్చేరట! ఆడవాళ్ళకి ప్రత్యేకం. ఇది పెళ్ళికొడుకుగారి అరణ్యామెంటు. లెండర్రా, ఎవరిపనులు వారు చెయ్యండి. మూడయ్యింది అప్పుడే.

ఆ నాల్గవనాటిసాయంత్రం ఊరిలో ఆడవారికి మాత్రము అచ్చు కార్డులు పంపినారు. ఈ పద్ధతి అంతయు నారాయణరావు పరమేశ్వరమూర్తి లక్ష్మీపతులు చేసిన ఆలోచన. దగ్గరచుట్టాలను, పెద్దల ఇండ్లలో నాడంగులను మూడు మోటారు కార్లమీద జానకమ్మగారు, శ్రీరామమూర్తి భార్య, సూర్యకాంతము, మాణిక్యాంబ, శ్రీరామమూర్తి, అత్తగారు, వెంకాయమ్మ అత్తగారు వెళ్ళి పిలిచివచ్చినారు.

విడిదిలో మధ్య హాలంతి సౌందర్యముగ పెళ్ళికొడుకు బరమేశ్వరుడు నలంకరింపించినారు. వచ్చిన స్త్రీ మండలి వీలుగా కూర్చుండుటకు విచిత్రముగా నాసనము లమర్పించినారు. విసనకఱ్ఱలతో విసరుటకు బనికత్తెల నేర్పాటు చేయించినారు.

వేరేగదులలో వచ్చినవారందఱకు నుపాహారములు, కాఫీ, పండ్లు నిచ్చిరి. తాంబూలములు కర్పూరపు దండలు, చక్కని పూవులద్దిన ఖద్దరు రవికలు, వెండి కుంకుమబరిణెలు, పూవులగుత్తులు బొట్టుపెట్టి స్త్రీమండలికి నర్పించినారు. జడ్జీభార్య, ఆంగ్ల సబుకలెక్టరు భార్య, మొదలగు గొప్పవారందరును వచ్చిరి. ఈ పద్ధతి నవీనముగా నుండుటచే, ఆడ పెండ్లివారి వనితామణులందరూ విచ్చేసిరి. వచ్చిన బాలబాలిక లందరకు జక్కని వెండిగొమ్మ లర్పింపబడినవి. సెంటుబుడ్లు అందరకు

నిచ్చినారు. జేబు రుమాళ్ళిచ్చినారు. సావిత్రి ఆరోజున తన గానవిద్యా ప్రౌఢిమ నానంద ప్రవాహముల బరపినది. ఆమెకంఠము వీణతీగయినది. ఆ మధుర దివ్య గాంధర్వములో వధూవరు లిర్వురు లీనులై పోయినారు. సంగీత కళోపాసకులగు నీ నూత్న దంపతుల యానందములో దివ్యత్వము జూరగొన్నది సావిత్రి.

## ౧౪

## ఇ త ర ది నా లు

ఈ వివాహపు తంతునం దేమి విచిత్రమున్నదో కాని, యీ మూడుముళ్లు పడునప్పటికి సముద్రపుటుప్పు నడవియుసిరిక వంటి రెండు జీవితాలు, మిళితమై పోవును. ఏ కొండలలో పుట్టినవో, ఏ లోయలలో ప్రవహించి వచ్చినవో, ఏ మెట్ట లెక్కినవో, ఏ పల్లముల నింపినవో, రెండు జీవిత ప్రవాహాలు చెరియొకదారి నరు దెంచి, యీ పుణ్యవివాహ వేదికకడ సంగమించి ప్రయాగతీర్థమై పరిణమించును కదా యనుకొని నారాయణరావు అక్కజ పడెను.

తన్ను పెండ్లికొమరుని చేసినప్పుడు, తాను స్నాతకపు బీటలపై తల్లిదండ్రు లతో గూర్చుండినయప్పుడు మంగళస్నానము లాచరించి, పట్టు పీతాంబరములు ధరించి, వివాహవేదికపై పెండ్లిపీటపై నధివసించినప్పుడు, మంగళసూత్రద్వయము శారదాకంఠమున మూడుముళ్లు వైచినప్పుడు వర్ణింపగారాని భావవేగములో దేలి పోయినాడు. మంగళసూత్రధారణమైన పిమ్మట ఎదురుగా గూర్చుండినంతనే శారద యనిన నంత ప్రేమ తన్నేల యావరించినది ? తాను మాతృమూర్తియు, శారద చిన్న బిడ్డయువలె నాతనికి గోచరించినది. శారదయు దాను వేలకొలది జన్మముల స్నేహితులై, గాఢానురాగమున గలసి సంచరించినట్లు తోచినది. శారదాదేవి మహా రాజ్ఞియై రాజ్య మేలుచున్నట్లు, తాను సేవకుడై యామెకు బరిచర్యచేయుచున్నట్టులు భావము జనించినది. శారదయు దాను నక్క చెల్లెండ్రయి యుగాలవెనుక నొక్క మేఘ శకలములోనుండి విడివడిన కవలపిల్లలై యాడుకున్నట్లూహాలేశము కలిగి నది. తాను పురుషుడట, శారద ప్రకృతియట తాను పురుషోత్తముడట, శారద మహా సృష్టియట.

అతని కన్నులు చెమర్చినవి. తనివిదీర నాబాలికను జూడవలెననుకొనినాడు కాని, యక్కడ ఈ వింతజూడ జేరిన యీ ప్రజాలోక మేమనుకొనునో యని సిగ్గు పడిపోయినాడు. అతని హృదయము ద్రవించిపోయినది. అతని బ్రతుకును బుష్ప సౌరభము లావరించుకొనినవి. ఆబాలికను దనకడకు జేర్చికొని తన హృదయమున హత్తికొను కోర్కె పొలిమేరలు దాటినది.

'ఒరే పరం ! అభావాల కంతులేకపోయినదిరా ! నాకేనా, లేక ప్రతి పెండ్లి కొడుకుకూ అటువంటి యావేశము కలుగునా ? ఆ పిల్లకూ నాకూ మానవుడు విడ బరచజాలని బంధనము ఏర్పడ్డట్టేనా ? ఆ మంత్రములలో నెట్టి మాహాత్మ్యమున్న

దోరా! కొంచెం కొంచెం అర్థంఅయ్యాయి. ఆ మంత్రోచ్చారణ, వీడివడి ఉన్నట్టి రెండు జీవితాలను, ఏకంచేస్తున్నట్లు తోచింది. ఆబ్రాహ్మణులు ఋషులైనట్లు, జటా వల్కలాజిన ధారులైనట్లు నాకు కనిపించినదిరా. మా జీవితాలు రెంటికి అంటుగట్టి ఏక వృక్షం చేస్తున్న తోటమాలీ లనిపించిందిరా.'

'ఔనురా! ప్రేమోదయమైనతర్వాత వివాహం చేసుకొనే యూరపియను దాంపత్యాలకంటె, మన దాంపత్యాలే ప్రేమసౌఖ్యాల కెక్కువ నిలయంగా వుంటవి. ఎవరిమాటో ఎందుకు? వివాహంనాటికి నేను వయసువచ్చిన వాణ్ణే అయినా వివాహాత్పూర్వం నేను నా భార్యను చూచుకోలేదు. అదివర కెంతోమంది బాలికలను నాకు యిస్తామని వచ్చినారు. సరే అని నేను చూచుకోడానికి వెళ్లేవాణ్ణి. చూడగా చూడగా ఒక అమ్మాయి నాకు నచ్చింది. ఆపిల్ల చక్కని చుక్క. ఆరూపసంపద అలౌకిక మనుకో. అందంసంగ తలావుండగా ఆ పిల్ల సంగీతం పాడింది. ఓరీ! రాలు కరిగిపోయి నాకు కన్నుల నీరు తిరిగిందంటే నమ్ము. ఈ అమ్మాయి నాభార్య ఐతే నాజన్మం సార్థకం అవుతుందనుకొన్నా తీరా వారు కట్నం తక్కువ ఇస్తామన్నారు. మా తండ్రిగారు ఎక్కువ ఇమ్మన్నారు. దానితో అది చెడిపోయింది. నేను మా అమ్మచేత, మా నాన్నగారి స్నేహితులచేత మా నాన్నగారికి చెప్పించినా లాభంలేక పోయింది. నా గుండె ముక్కలయ్యింది. నేను నిర్మించుకొన్న ఆనంద ధామం కుప్ప గూలిపోయింది. తర్వాతవచ్చిన సంబంధాలలో ఇంకోపిల్లకూడా-ఆఅమ్మాయి అంత అందం కాదుగాని - మొత్తంమీద చక్కదనం, సంగీతం అదీ వున్నపిల్లే వాళ్ళు గొప్ప సంబంధంకోసం వల పన్నుకొని, ఆ చేపవలలోపడితే మాసంబంధం వదలివేద్దామనీ, లేకపోతే, రెండోరకంక్రింద మా బేరానికి వద్దామనీ అనుకున్నారు. ఆ పిల్ల నా గుండెల్లో రాగాలు పాడింది. నా నేత్రాలు నిమీలితలయ్యాయి. కాని వారికా సంబంధం దొరికింది. నాకా బాలిక దూరమయింది. ఆ దెబ్బతో నేనింక ఏ పెళ్ళికూతుర్నీ చూడనని ఒట్టుపెట్టుకున్నా చివరకు చూడకుండానే సంబంధము నిశ్చయమయింది. మంగళసూత్రంకట్టేటప్పుడు పిల్లఅంత బాగుండలేదని గ్రహించి చిన్న బుచ్చుకున్నాను. ఆనాటి యిద్దరు బాలికలూ అప్పుడు జ్ఞాపకంవచ్చారు? నిట్టూర్పువదిలా. కాని ఒరే నువ్వు చెప్పినట్లు మంగళసూత్ర ధారణంలో ఏమి మహిమ వుందో? అది మొదలు నా భార్య అంటే పరమప్రేమ జనించిందిరా!

పరమేశ్వరుడు చెమరించే కన్నులతో నారాయణుని కనుగొని అతనివీపు నిమిరినాడు. నారాయణుడు విషయం మార్చుటకు నుద్దేశించి 'మన పెళ్ళిళ్ళకు, మహమ్మదీయుల వివాహాలకు చాలా తేడావుందిరా!' అనినాడు.

'మహమ్మదీయుల వివాహాలు మతసంబంధం ఏమీలేని 'కంట్రాక్టులు'కావడం చేతనేమో, వాటిని రద్దుచేసుకోడం సులభంగా భావిస్తారు మహమ్మదీయ సోదరులు.

'అవును, మహమ్మదీయ వివాహం సంపూర్ణంగా 'కంట్రాక్టు' క్రిష్టియను చర్చి పెళ్ళి సగము మతసంబంధం. మన సంఘంలోమాత్రం వివాహం పూర్తిగా

ధర్మసాధనమైన కర్మ. స్త్రీ పురుష సంబంధం ఇంత పవిత్రం కావడానికి యెన్ని యుగాలు పట్టిందో! మానవుడు వట్టిజంతువులా, ఆ అతిపురాతన కాలంలో జీవితం ప్రారంభించి అడవుల్లో సంచరించే రోజుల్నుంచీ మానవజీవితం ఎంత విచిత్రంగా మారిపోయింది యీ పవిత్ర వివాహ సంస్థవల్ల?'

'నిజం, భర్త ఏరకంవాడయితే భార్యకూడా ఆరకంలో కలిసిపోతుందిగదా. వకీలు భార్య అయ్యేం దనుకో 'లా' మాటలు వింటూ వుంటుంది. క్లయింటు రావటం, భర్త కేసుల్లో వాదించడం, గెలవడం, ఓడటం, అనే భావాలలో ఐక్యం అవుతుంది. అదే డాక్టరు భార్య అయితే, రోగులు, రోగాలు, మందులు, ఇంజెక్షన్లు రాత్రీ పగలూ పని ఉండడం అనే ప్రపంచానికి రాణీ అవుతుంది. అలాగే ఉద్యోగస్తుని భార్య అయితే ఆవిడకు ఉద్యోగ ఛాయాలన్నీ అలవాటవుతాయి. అవును గాని నాకు మొదటినుంచి ఒక్క ప్రశ్నకు సరిఅయిన జవాబు దొరకడంలేదురా! ఏమిటంటే మగవాడి జీవితంవల్ల ఆడదాని జీవితం ఎక్కువ మార్పుచెందుతుందా, లేక ఆడదాని జీవితంవల్ల మగవాడి జీవితమా?'

'అది మంచిప్రశ్నే! నా అభిప్రాయం ఏమిటంటే, ఆడదాని జీవితం దర్పణం మీద స్వచ్ఛమైంది. మగవాడి జీవితపు రంగు తనమీద పడగానే, దానితో ఆమె నిండిపోతుంది. గృహనిర్వహణానికి సంబంధించిన సంసారవిషయాల్లో మాత్రం ఆడదాని వ్యక్తిత్వమే అధికంగా గోచరిస్తుంది. కాబట్టే యిల్లుచూచి ఇల్లాలిని చూడ మన్నారు. మగవాడు మృదుస్వభావం కలవాడైతే ఒక్కొక్కప్పుడు ఆడదాని స్వభావం పైచేయి కావడం, వాడి జీవితంలో ఆ ఛాయలు విశేషించి కనిపించడం కూడా తటస్థిస్తుంది.'

సుబ్బారాయుడుగారు తన రెండవకుమారుని వివాహమునుగూర్చి ఎన్నియో విచిత్రాలోచనలలో తేలిపోయినాడు. ఆయన నలుగురు కొమార్తలకు, పెద్దకొమరునకు, మంచి గౌరవముగల కుటుంబములుగా జూచి వారితో వియ్యమందినాడు. సంబంధములన్నియు ధనధాన్య సంపదలతో దులదూగుచున్నవే. చుట్టములలో ననేకవివాహములకు దాను బెద్దరికముదాల్చి చక్కగాజరిపించినాడు. అవియన్నియు నొక యెత్తు, నేడు నారాయణ వివాహ మొకయెత్తు. ధనమా చాల వ్యయమైనది. వ్యయమయినదని కాదు. అంతకు మూడురెట్లయినను ఆయన లెక్కచేయడు. ఆవల వియ్యంకునకుగూడ వివాహవ్యయమొక లకారము దాటియుండును. ఆయన జమీందారు గావున ఆయనకు లెక్కలేదు. జమీందారు గదాయని తనయెడల ప్రపత్తులలో నేమైన లోటుచేసినారా? ఒక పెద్ద మహారాజును గౌరవించినట్లు గౌరవించినారు. ఇంతకు దన వియ్యంకుడు నిషధయోగ్యుడు. కాని ఆడువాండ్రు, వియ్యపురాలు సరియైన మర్యాదతో సంచరించలేదని ఒకటే గోల. అది ఆమె స్వభావము కాబోలు. క్రొత్తలో నించుకంత పొరపున్నను, గాలక్రమమున వియ్యపురాండ్రిద్దరకు నెయ్యము కుదురవచ్చును.

ఆగర్భశ్రీమంతురాలై పెరిగిన కోడలు తన యింటికి వచ్చి కష్టపడునేమో ? కుఱ్ఱవాడు ఎక్కడో ఉద్యోగమో, న్యాయవాదిపనియో చేసుకొనును. వాడు సంపాదించుకొనకున్నను భగవంతుని కృపచేత వానికి అన్నవస్త్రములకు లోటులేదు. దాసదాసీజనమును బెట్టి చేయించుకొనుశక్తి యున్నది. నారాయణ దుర్వ్యయములకు లోనుగాకున్న జాలును. ఎట్టి కొఱతయు నుండదు. బుద్ధి బృహస్పతియయిన తనకుమారుడు, కుటుంబమునకు విఖ్యాతితెచ్చుచున్న తన నారాయణుడు సంపాదింప లేని అప్రయోజకుడగుటయేమి ! ఈ రోజులలో బ్రాహ్మణులకు ఉద్యోగములు దొరకనిమాట నిజమే. కాని సంపాదన కుద్యోగమే కావలయునా యేమి ? చెన్నపట్టణములో న్యాయవాదియై లక్ష లార్జింపవచ్చును. కుమారునకు మొదటినుండియు లా యన్న యసహ్యమనుట నిజమే. తనప్రోద్బలమువలననే కుమారుడు ఎంత ఇష్టము లేకున్నను న్యాయకళాశాలలో జేరినాడు. ఏది ఎట్లయినను ఆ విషయముల దాను తర్కింప బనిలేదు. గాంధీతత్వపూర్ణుడైన నారాయణుడు, ఏదియు వలదనియన్నను సరియే. ఆలోచింపవలసినది కోడలివిషయమే.

ఆ బాలిక ఎట్టిది యగునో ? సర్వసాధారణముగ నీ జమీందారీ కుటుంబములలో గర్వమెక్కుడు. జమీందారుల యింటి యాడుబిడ్డ తనవంటి సంసారియింట నతుకుట కష్టమే. తనయింట, నీటినుండి తీసిన చేపవలె బాధపడునేమో ? కాని బుద్ధి తెల్సిన పిల్ల గావున ఆమె అభిప్రాయము తెలిసికొనక వియ్యంకుడు తన కుమారుని అల్లునిగా నిశ్చయించియుండడు. కోడలికి నారాయణపై ఆపేక్ష కుదిరి యుండును. అందును నారాయణు డెట్టివారి హృదయమునైన చూరగొనగల గుణసంపత్తి గలవాడు. బాలికలు వీనిని భర్తగా బడయుట తమ జన్మములకు సార్థకతయని సంతసించు నంతటి రూపవంతుడు. ఇంతకు ఈ రాజసంబంధము మంచికి వచ్చినదో, చెడ్డకు వచ్చినదో ? అంతయు దైవాధీనము. ఎవరిప్రారబ్ధ మెట్లున్నదో ? ఆ పరమేశ్వరుని విలాసము లెవరికి దెలియును. నేటివఱకు దానుపట్టినదెల్ల బంగారమగుటయేగాని ఒక్క కార్యముగూడ గలసిరాకపోవుట యన్నదిలేదు. ఏనాటి కే విచిత్రములు జరుగనున్నవో !

సుబ్బారాయుడుగారు గంభీరహృదయుడు. ధైర్యస్థైర్యములాయన సొమ్ములే, చిన్ననాటనే తండ్రి పోయినను మనస్సు చెదరనీక నడిసంద్రమున నల్లాడు సంసారనౌకను చుక్కాని చేబూని చెక్కు చెదరకుండ గట్టున జేర్చినాడు. ఇతరుల దెందములు నొవ్వకుండ న్యాయమార్గమున తన పితృస్వమును వేయిరెట్లు వృద్ధిచేసి పిల్లజమీందారు డనిపించుకొనినాడు. 'గోదావరికి అద్దరిని ఇద్దరిని సుబ్బారాయుడుగారి మాటయు భీష్ముని మాటయు నొకటే' యనిపించుకొనినారు. నేల మాళిగలో నసంఖ్యమై మూలుగుచున్ననగదులో నిధ్నవదియైదు వేల రూప్యములు కొమరుని

పెండ్లికి వెచ్చించినాడు. తన యంతవాడైన పెద్దకొమరుని మనస్సేమనుకొనునో యని సందేహించనైనలేదు.

శ్రీరామమూర్తికి వెచ్చపెట్టుటన్న దలనొప్పియే కాని, అవసరము వచ్చి నప్పుడు మాత్రము వెనుదీయడు. తన సట్టుడు చెల్లెళ్ళ వివాహములకు, ముప్వురి చెల్లెళ్ళ పునస్సంధానమహోత్సవములకు, పండుగలకు బబ్బములకు సుబ్బారాయుడు గారు లెక్క తెలియని ఖర్చు చేయుచున్నను శ్రీరామమూర్తి అడ్డుపెట్టలేదు. సరి కదా తండ్రి మరచిపోయినచో దానే జ్ఞప్తిచేసి ఖర్చుపెట్టించెడివాడు.

సుబ్బారాయుడుగారు తాను వరశుల్కము గ్రహింపనని తొలుతనే స్పష్ట మొనర్చుటచే, జమీందా రల్లునికి నలువది యకరముల ఈనాముభూమి, తన జమీం దారీలోనిదిగాక, తన కున్న రైతువారీ భూములలోని సుక్షేత్రము, తణుకుతాలూకాలో తన గ్రామమునకు దగ్గరనున్న గ్రామములోనిది అరణ మొసంగినాడు. తన కొమార్తకు నిరువది యకరముల భూమి వ్రాసియిచ్చినాడు. మఱియు నిచ్చిన వస్తు వాహనములకు లెక్కయేలేదు. ఆమెపేరున బ్యాంకిలో ఏబదివేల రొక్కము నుంచినాడు.

సుబ్బారాయుడుగారుగూడ పెద్దకోడలికిచ్చినట్లు పదివేల రూప్యములు చిన్న కోడలి కాభరణముల నిమిత్తమిచ్చినారు.

## ౧౨

## గృ హ ప్ర వే శ ము

గృహప్రవేశమునకు పెండ్లికొమార్తతో శకుంతలాదేవియు, జమీందారుగారి వ్రేలువిడిచిన మేనకోడలు లలితయూ, వరదకామేశ్వరీదేవి పుట్టింటిచుట్టము సరోజినియు, జమీందారుగారి కుమారుడు కేశవచంద్రుడును వెళ్ళినారు. సుబ్బా రాయుదుగారు తన చుట్టములందరిని పదునాఱురోజుల పండుగ వఱకు నుండుడని కోరినారు. సుబ్బారాయుడుగారు బంధుసముద్రుడు. మర్యాదలు సలుపుటలో జనక మహారాజు ఆయనబందుగులు, జానకమ్మగారి బందుగులు, బిడ్డలచుట్టములు గలపి మూడువందలమంది వివాహమునకై చేరినారు. వారిలో ఎక్కురు రాజమహేంద్ర పురము నుండియే వెళ్ళిపోయినారు. కొన్ని కుటుంబములవారు కొత్తపేటవెళ్ళినారు. కొత్తపేటలో ఎనమండుగురు తెలుగు వంటబ్రాహ్మణులను ఇరువురు దాక్షిణాత్య బ్రాహ్మణుల నియమించి సుబ్బారాయుడుగారు వధూవరుల గృహప్రవేశ మహోత్స వము పెండ్లివలె జరిపినారు. ఒకనాడు కోనసీమలోని పెద్దలందఱు విందునకు అహ్వానింపబడిరి. వధువుతో వరుదెంచిన బంధువులకు రాజభోగము లర్పింపబడినవి.

వివాహమున నన్నియు ఖద్దరు వస్త్రములే యుపయోగించినారు మగ పెండ్లి వారు. తప్పనిసరియైనప్పుడు స్వదేశీవస్త్రములు, పట్టువస్త్రములు నిచ్చినారు. ఆడ పెండ్లివారు పెండ్లికుమారునికి, ఇతర మగవారికి ఖద్దరు వస్త్రముల నిచ్చినారు,

ఆడువారికి వారికిఁదోచినట్లు పట్టుచీరలు, రవికలు, విదేశీ చీరలు మొదలగునవి యొసంగినారు.

శారద కత్తవారియిల్లు విచిత్రముగానే యున్నది. తన తండ్రిగారి మేడలో నున్న సోఫాలు, మరదిండ్ల కుర్చీలు లేవు. ఒకటి రెండు తివాసీలు చిన్నవి యిచ్చట నున్నవేమో; తమ మేడలో అన్నియు తివాసీలే. గోడల కెన్నో చిత్రములైన బొమ్మలు అచ్చట తగిలించియున్నవి. చిత్రవిచిత్రములుగా నగిషీలు చెక్కినబల్లలు, మేజాలు, కుర్చీలు, బీరువాలు అలమారులు, పనితనముగల వెండి, ఇత్తడి, రాగి బొమ్మలు, చీనాదేశపువి, ఆగ్రా అజిమీరు లక్నోప్రాంతములవి, బర్మా కఱ్ఱచెక్కడపు బొమ్మలు, లక్కబరణులు, రవివర్మబొమ్మలు, పాశ్చాత్యతైలవర్ణచిత్రములు - తమ పెద్ద మేడనిండ నున్నవి. తన తండ్రిగారిది, తాతగారిది, తల్లిది, బామ్మగారిది ఇంకను బూర్వికుల బొమ్మలు దమ గదులనిండ నలంకరింపబడియున్నవి. ఇచ్చటనో, తన భర్తగది యొక్కటి మాత్రము చాల అందముగా నున్నది. ఇల్లంతయు సూర్యకాంతము చూపించినది. భోషాణములట: తంజావూరి బొమ్మలట: మామూలు కుర్చీలు, పేము పడక కుర్చీలు, ఆ కుర్చీలపై మామూలు పరుపుదిండ్లు. తమ మేడ యంతట తండ్రిగారు స్వంతముగా విద్యుచ్ఛక్తిచే దీపములు వీవనలు పెట్టించినారు.' అత్తవారింట 'లష్టరు' దీపాలట, పెట్రోమాక్సుదీపాలట! చీ చీ! ఇది ఏమిటమ్మా!

శకుంతలాదేవి చెల్లెలినిజూచి 'ఒసే శారదా! మా అత్తవారిమేడలో, మన మేడలోనున్నన్ని వింతలు విచిత్రాలు లేకపోయినా అదీ జమీందారీ కోటలాగే వుంటుందే. కాని ఇల్లాంటి పల్లెటూరికొంపలో పడ్డావేమిటే? వంద మంచాలూ, పరుపులూ ఉంటేమాత్రం జమీందారీదర్జా వస్తుందటే? వచ్చివచ్చి ఓ పల్లెటూరి వెంకయ్యగారి ఇంట్లో పడ్డావేమిటే? ఎంతో డబ్బుందిట, చాలా భూమి ఉందట ఏమి భాగ్యం? దర్జాపుట్టుకతో రావాలిగాని తెచ్చి పెట్టుకుందామంటే వస్తుందటే!'

'వీళ్ళ కట్లు, బొట్లు మాటలు అన్నీ చాదస్తంగా ఉన్నాయి అక్కయ్యా.'

'మీ పెద్దాడుబిడ్డ ఒకటే వడవడ వాగుతో వుంటుందేమిటే! నన్నూ, లలితనూ, సరోజినినీ కూచోబెట్టి వేదాంతం బోధించడం మొదలుపెట్టింది; రెండో ఆవిడ మన కుటుంబం సంగతులు అన్నీ అడగడం మొదలుపెట్టింది. అస్తమానం ఈ చెవినుంచి ఆ చెవికి నవ్వుతోనేవుంది ఆవిడ.

లలిత:—వాళ్ల చిన్నబుచ్చుకునేటట్టుగా మనం గబుక్కున లేచేవచ్చాంగా!

సరోజిని:—'ఏమే శకుంతలా! నీకు వేళాకోళాలు వెక్కిరింతలూను. వాళ్లూ మనమల్లేనే గౌరవం సాంప్రదాయం కలిగిన కుటుంబాలు. అందరికీ జమీందారీలు ఉంటాయా యేమిటే? దేశమంతా గాలించినా గుడిగుడి గుంచంలా ఒక పది జమీందారీకుటుంబాలున్నాయి! మీ నాన్నగారికి పదిమంది కూతుళ్లు పుట్టితే అందరికీ జమీందారీ సంబంధాలు ఎక్కడ తీసుకు వస్తారే?

శకుంతలా! నువ్వెప్పుడూ అందర్నీ హాస్యంచేస్తూనే వుంటావు. జమీందారీలు వుండక పోవచ్చుగాని ఎక్కడో పల్లెటూళ్ళ పద్ధతిలావుంది అనరుటే!

ఇంతలో సూర్యకాంతం అక్కడకు వచ్చుటచే వారిసంభాషణ ఆగిపోయినది. సూర్యకాంతం చిన్నన్నగారిని వెఱ్ఱిప్రేమతో ప్రేమించినది. తల్లిదండ్రులు, అక్కలు పెద్దయన్నయు నెందరున్నను నారాయణ క్షణము కన్పించకున్న సూర్యకాంతము బెంగపెట్టుకొనును. చిన్ననాటినుండియు సూర్యకాంతమును నారాయణరావే పెంచి నాడన్న నిసుమంతయు నసత్యము లేదు. ఆమె కించుకంత దెబ్బతగిలిన 'చిన్న న్నయ్యా' అని యేడ్చునది. అన్నగారిదగ్గరనే పండుకొనును. అన్నగారితోనె భోజనము చేయును. ఆమెకు రామస్మరణ 'చిన్నన్నయ్య! చిన్నన్నయ్య'. చిన్నన్నగారు చదువులకై కమలాపురం, రాజమహేంద్రవరము, చెన్నపట్టణము వెళ్ళినప్పుడు, జైలుకుబోయినప్పుడు సర్వదా గ్రుడ్లనీరుబెట్టుకొనునది. రాజమహేం ద్రవరము జైలున కన్నగారిని జూచుటకు వెళ్ళినప్పుడు నారాయణరావు 'జైలరు' ననుమతి నడిగి చెల్లెలిని దగ్గరకు దీసికొని చెవిలో దేశభక్తిని గూర్చియు, ధైర్య మును గూర్చియు చిన్న యుపన్యాసము నిచ్చినాడు. ఆమె విచారించినచో శ్రీ మహాత్మాగాంధిగారి హృదయము బాధ నొందుననియు, దన ముద్దు చెల్లెలు బెంగ పెట్టుకొని యింటిదగ్గర కండ్ల నీరునింపుచున్నదని తెలిసినచో దనమనస్సు వికలమై పోయి జైలు భరించుట కడుదుర్భర మగుననియు, దన ముద్దుచెల్లెలును దేశద్రోహి వలె జైలు వదలి రమ్మని కోరునంతటి దేశభక్తి లేనిది కాదనియు, జెప్పి యూఱ డించినాడు. అప్పుడు సూర్యకాంతము కళ్ళనీళ్ళతో చిరునవ్వు నవ్వినది. ఆమె వదనము వానకురిసి వెలిసి మబ్బులు మాయమైన పూర్ణిమాకాశమువలె సౌందర్య శోభితమైనది.

అట్టి ప్రేమపూర్ణమగు నామె హృదయము తన చిన్నన్నగారి పెండ్లికొమరి తను జూచినప్పుడెల్ల బరవశత్వములో మునిగ్పొంగిపోవును. తన చిన్నవదినగారెంత యందగత్తె! ఏమియూనొగసు. అంత సంగీతపాటకురా లెక్కడైన యున్నదా? చిన్నవదినను కౌగిలించుకో బుద్ధిపుట్టిన దాబాలకు. పెండ్లి అయిదురోజులు వీలయిన వేళలలో నొక్క నిమేషమైన కొత్తవదినగారిని విడిచి యామె యుండలేదు. ఆమెకు దాను తలదువ్వును. ఆమె తలలో పూవులు ముడుచును. ఆమె నగలు సర్దును. ఆమె యొడిలో దన తల నుంచును. ఆమె దగ్గరగా గూర్చుండును. 'ఒదినా! నువ్వు చాలా అందకత్తె' వనును. శారద కిదియంతయు వెట్టిగా గనుపించినది. సూర్యకాంతమును వెట్టిపిల్లయని యనుకొన్నది. కాని సూర్యకాంతము ప్రేమప్రవా హవేగమున శారద యుపేక్షాభావము చెదరగొట్టబడి కరగిపోయినది. భర్తృ బంధు కోటిలో సూర్యకాంత మొక్కరితయే యామె హృదయములో బ్రవేశించినది.

సూర్యకాంతము వదినగారికడ కరుదెంచి 'చిన్నవదినా! మా గుమ్మిడిపం డావును జూపిస్తా నన్నాను కాదూ? నువ్వు దాని అందంచూస్తే వదలలేవుసుమా,

రా! అప్పుడే పొలాలనుంచి మా ఆవులు గేదెలు, బండి యెద్దులు వచ్చాయి. తక్కిన పశువు లన్నింటినీ మా తోటలో పశువుల శాల్లోనే కట్టేస్తారు. వస్తావా?' యని యడిగినది.

ఆ సాయంత్రము చల్లని పిల్లగాలులు వీచుచు మల్లెమొగ్గల సౌరభ మెల్ల యెడల జల్లుచుండెను. నిన్ననే సూర్యకాంతము వదినగారికి దమ యింటివెనుక తోట జూపించినది. మల్లెజాతులు, సన్నజాజులు, గులాబుల కుటుంబములు, సంపంగెలు, జాజులు, మందారముల రకములు, ఏవేవో క్రొత్తరకముల పూవులు దొడ్డియంతయు నావరించి బారులుతీర్చి గీతములు పాడుకొనుచున్నవి. నారాయణ రావునకు దోటపనియన్న ప్రాణము. తాను సెలవులకు వచ్చినప్పుడు క్రొత్తక్రొత్త రకముల పూలచెట్లునాటుచుండును. అంట్లుకట్టుట, చిగురుల నంటుకట్టుట, కొమ్మలు కత్తిరించి వానికి జీవము బోయుట, మొక్కలలో గ్రొత్తజాతులను సృజించుట మున్నగు పను లాత డవలీలగ జేయగలడు. అతనికి స్నేహితులు తోటమాలియని కూడ బేరు పెట్టినారు.

అతడు మొక్కలతో మాట్లాడుకొనును; అతని హస్తస్పర్శకు, జల్లని మాట లకు జెట్లు సంతోషమున బొంగిపోవును. 'బోసు చెప్పినదానిలో ఇంతైనా అతి శయోక్తి లేదురా' అని స్నేహితులతో ననువాడు నారాయణరావు. గ్రాండిఫ్లోరా పూలచెట్లొక వరుసయును, చేమంతి జాతు లొకబారును, లెజిస్ట్రోమియాలు వివిధ వర్ణములపూలతో నొకవంకను గలకలలాడిపోవుచున్నవి. ఇంకను నేవేవో రకముల పూలట! భరతఖండములో నెక్కడ పెరుగునవియైన నారాయణరావు దాని నెంత ఖరీదుకైన దెప్పించి తోటలో బెంచుచుండును.

సింహాచలము సంపెంగలు — పచ్చ, తెలుపు జాతులవి కలవు. రసంగ సంపెంగ, కర్పూర సంపెంగ, సకలగుణ సంపెంగ, తీగసంపెంగ యాతని ముద్దు బిడ్డలు. ఎడ్వర్డు, కార్లెన్‌డి ఆర్డెను, ధవళమగు నమెరికాసుందరి, పాలెనీరాను మొదలగు నెనుబది రకముల గులాబుల ప్రాణప్రదముగా బెంచినాడు. బొడ్డుమల్లె, జంటమల్లె, బొసమల్లె, పందిరిమల్లె, చిరుమల్లె, కాకినాడమల్లెలు నక్షత్రములవలె విరిసి యాతని కన్నుల నార్ద్రములు సేయును. చెన్నపట్టణపు బొడ్డుచేమంతి, తెల్ల చేమంతి చిన్నది, సాదారకము. బొత్తాముచేమంతి, నీలపుచేమంతి, ఎఱ్ఱచేమంతి, అరచేతి పెద్ద జాతిచేమంతులు నాతని జీవితమున దీపు లూరజేయును. కదంబము కలదు, పన్నీరు వృక్షము లున్నవి, దేవపారిజాతము లున్నవి, పూవుదానిమ్మ లున్నవి.

సూర్యకాంతము చిన్నన్నగారి యుత్సాహములో దానును మునిగిపోవును. అన్నగారు చదువునకు బోయినప్పుడు తోటమాలితనము తన్నావరించినట్లు భావించు కొనును. తోటమాలులచే నీరు బోయించును. ఇవక పట్టనీయక కాపాడునట్లు

చేయును. ఉద్యానవనపాలికయై యన్నగారి యాజ్ఞ పాలింపుమంచినని గర్వము నొందును. ఆమె వనదేవతయే యయిపోవును.

శారద యా వనముచూచి ఆశ్చర్యమందెను. కొంచె మసూయ ఆమె లేత హృదయము నలమినది.

ఆనాడు బాలికలిద్దరు వనసంచార మొనర్చు నప్పుడు నారాయణరావు చూచినాడు. ఆతని బ్రతుకప్పుడు సువాసనా లహరీస్నాతమైనట్లయినది. ఆ యిరువురు బాలికలను దన యిరుసేతులనెత్తి ముద్దాడ నువ్విళులూరినాడు. ప్రపంచమంతయు నాతనికి ప్రేమస్నాత మయినట్లు తోచినది.

చల్లనీ యడుగులతో వారిరువుర నాతడు డాసి 'సూరీడూ! ఈతోటంతా చూపిస్తున్నావుటే' అని పలుకరించినాడు. పలుకరించి, తన చౌటవకు దానే యక్కజంపడినాడు.

కులుకు మిటారియగు తన శారదతో మాటలాడవలెనని పెండ్లి రెండవనాడే యాతనికి గోర్కె వొడమినది. కాని సిగ్గుపెంపున మాటలాడింప లేడయ్యెను. ఎట్టి సభలో నైన పులకలు పుట్టించు గంభీరస్వనమున నుపన్యాసములిచ్చు నారాయణరావాముహూర్తమున త్రపావశుడైనాడు. మఱునాడుదయమున మోటారులో భార్యా సమేతుడై యూరేగునప్పుడు 'నీకు కాలేజీలోచేరి చదవాలని ఉన్నదా' యని యెట్లో ప్రశ్నించినాడు.

శారద యాశ్చర్యపూరితయైనది. ఆమెకు నాగరికమర్యాద లన్న నెంతయు నిష్టమే. తానంతకుమున్న చూడబోయిన వివాహములందు నూతన వధూవరులు మాటలాడు కొనుట చూచినది. సంతోషము నొందినది. అటులనే తానును మాటలాడగలనని తలంచి లజ్జాకదుష్ణమై మోముకెంపెక్క, జిఱునవ్వు పెదవులు దాటకుండ నప్పళించుకొన్నది. నేడు భర్త తన్నట్లు మాట్లాడించునని యామె కలనైన దలపోయలేదు. తొలినాడు తన్నుజూడ వచ్చిన నారాయణరావును నిర్భయముగ జూచినది. అపుడపుడే పరిమళ మలముకొను హృదయమున నారాయణరావును మెచ్చికొన్నది. ఆతని రూపసంపద శారదమనస్సును గలకలలాడించినది. నారాయణరావు ఫిడేలుపై మధురముగ గానము చేసినప్పు డాశ్చర్యము, నానందము నామె నలముకొనియెను.

సంబంధము నిశ్చయమైనదని తెలిసినప్పటినుండియు దల్లియగు వరదకామేశ్వరీదేవి శారద చెవికడ నిల్లుగట్టుకొని విచారించినది. పల్లెటూరి సంబధము ఘటించిన భగవంతుని తీవ్రముగా దూలనాడినది. తనకును, శారదకును గ్రహచారమట్లున్నదని కంటనీరు పెట్టుకొనినది. చుట్టములలో స్త్రీలు ఒకరిరువురు తప్ప మిగిలినవారట్టిసంబంధము నిశ్చయమైనందుల కక్కజమందుచు వరదకామేశ్వరీదేవితో పాటు విచారించినారు. ఆ సంబంధమును నిందించినారు.

శారద లేతహృదయమున నా మాటలెల్ల గాటముగ నాటికొని ప్రత్యక్షమైన స్వామియెడ నిరసనభావమును వైముఖ్యమును ఘొలక లెత్తించినవి.. అట్టి మన స్థితిలోనున్న శారదను నారాయణరావు పలుకరించినప్పు డామె యించుక యులికి పడినదనిన వింతయేమి ?

ఆమెభర్తకు బదులుపలుకక మోముపంచికొన్నది. నారాయణరావు చిన్న బుచ్చుకొనియు, బాలిక సిగ్గుపడియుండబోలునని సమాధానపడినాడు.

'శారదా ! నీకింగ్లీషు బాగావచ్చునటకాదూ ! ఇంగ్లీషు చదువుకొన్న బాలికలు సిగ్గుపడరటగా ! నువ్వీయేడు 'స్కూలు ఫైనలు' పరీక్షకు వెళ్లుతావను కొన్నారే. అల్లాంటప్పుడు నాతో మాట్లాడడానికీసంకోచం ఏమిటి ?' నారాయణరా వింగ్లీషులోనే యామెనడిగినాడు.

శారద మారుపలుకలేదు. ఆమెనలముకొన్న ఆశ్చర్యపుదెర ఇంకను అలమి నట్లేయున్నది. ఆమె మౌనముద్ర వహించియే యుండెను.

'ఈ యేడు 'గవర్నమెంటు' పరీక్షలో మొదటి తరగతి 'మార్కులు' వస్తాయని మీ దొరసానిగారన్నది. నువ్వు చదువుకోని బాలికవలె సిగ్గుపవని ఆమె చెప్పిందే ? సిగ్గెందుకు నీకు ? ఆమెమాటే నిజంఅయితే, ఏదీమాట్లాడుచూద్దాం.' (ఇంకను ఇంగ్లీషుభాషలోనే)—

శారదకు బౌరుషము వచ్చినది. 'మద్రాసు యూనివర్సిటీవారి మెట్రిక్యు లేషను పరీక్షకు దరఖాస్తుపెట్టున్నాను. స్కూలుఫైనలు పరీక్షకు పాఠశాలలో జేరాలి కదా !' అనిన దింగ్లీషులోనే.

'అదీ ! అల్లాగు జవాబుచెప్పాలి. నీకు ఫిడేలంటే యిష్టమా, లేక వీణంటేనా ?'

'రెండూనూ !'

'ఆ రెండింటిలోను ఏది మంచిది ?'

'దేని కదే !'

'అల్లాంటే ఎల్లాగుమఱి. వీణమీదితానం ఫిడేలుమీద రాదు. ఫిడేలుమీది సంగతి వీణకు రాదు. వీణ ఒదుగు ఫిడేలులో లేదు. వీణలో ధ్వని ఫిడేలులో లేదు. ఫిడేలు—'

'అందుకనే దేని అందం దానిది. దాని అందం దీనికి, దీని అందం దానికి రాదు.'

'నీవు సంగమయ్యగారి కచ్చేరీ చూశావా ?'

'మా మేడకి వచ్చి ప్రతియేడూ పదిహేనురోజులు మకాంచేస్తూవుంటారు. ఆయన అద్భుత వాద్యము నాకు వినిపించి నా వీణపాటకు మెరుగులుదిద్దేవారు.'

'ఏమిటీ ! సంగమయ్యగారికే శిష్యురాలివా ! ఎంత అదృష్టవంతురాలివి.'

ఇంతలో నూరేగింపు విడిదికడకు వచ్చుటచే నా నూతన వధూవరుల సంభాషణ

యాగిపోయినది. నారాయణరావట్టులనే మూడు నాలుగు సారులు భార్యతో మాట్లాడి, ఆనందభావములో విహరించినాడు.

ఈనాడు తోటలో, భర్త సూర్యకాంతమునట్లు బలుకరించినప్పుడు, శారద కించుక రోతపుట్టినది. కనురెప్పపాటుకాలములో జనించి మాయమయిన యాభావము గ్రహించిన నారాయణరావు మనస్సు చివుక్కుమన్నది. సోదర ప్రాణయగు సూర్యకాంతము ననులేత మెదడకు వారిరువురి భావములు స్పష్టమై తోచినవి. అన్నా వదినెల మనోమాలిన్యము తుడిచివేయుటకో యన నా బాల - 'గుమ్మడిపండావును చూతము రం' డని తన చిన్నారి చేతులుసాచి వారిరువురి హస్తములు గ్రహించి బిరబిరగొనిపోయినది.

## ౧౬

## గృ హ మే ధి

సుబ్బారాయుడుగారింటివెనుక పెరటిలో నొక తూర్పువెలమల కుటుంబము, రెండు బీదకాపుల కుటుంబములు, అయిదు తూర్పుగొల్లల కుటుంబములు కాపుర మున్నవి. వారందరు సుబ్బారాయుడుగారి పాలేరులే. కాపులలో కుంకట్ల సోమయ్య యనునతడు పెద్దపాలేరు. సుబ్బారాయుడుగారు పాలేండ్ర కాపురమునకై శుభ్రమగు నిండ్లు కట్టించి యిచ్చిరి. సోమయ్య యిల్లు తక్కిన వానికన్న పెద్దది. సోమయ్య బహుకుటుంబీకుడు. వృద్ధుడయ్యు జబ్బసత్తువయు చక్కని కంటిచూపును గల్గి వ్యవసాయము చేయించుటలో పేరుగన్నకాపు. సోమయ్య తండ్రినాటనుండియు సుబ్బారాయుడుగారితండ్రికడ వారు పాలేరులుగా బ్రవేశించినారు. సంసారము బొత్తుగా జితికిపోయి, కడు పేదరికమున సోమయ్యతండ్రి వీరయ్య సుబ్బారాయుడు గారి తండ్రి శ్రీరామమూర్తిగారి నాశ్రయించి పాలేరుగాజేరి, తన తెలివితేటలచే, విశ్వాసముచే గ్రమముగా బెద్దపాలేరైనాడు. అప్పటికే సిగ యెగగట్ట నేర్చిన సోమయ్య, తండ్రికి కుడిభుజమై ఆతనికి దగిన కుమారుడనిపించుకొనుచు శ్రీరామ మూర్తిగారి కడ జీతము గొనుచుండెను.

ప్రథమమున సంవత్సరమునకు బదునెనిమిది బస్తాల ధాన్యమునకు బ్రవేశించిన వీరయ్య పోను పోను ఇరువదియైదు బస్తాలు, నేబది రూపాయల రొక్కముకూడ జీతముగా బుచ్చుకొని, తొంబదియేళ్ళ వృద్ధుడై చనిపోయినాడు. సోమయ్య నేడు పెద్దపాలేరు. సుబ్బారాయుడుగా రాతనికి పాలేరని పేరు మానివేసి గుమాస్తాయని పేరుపెట్టి నెలకు బదునేను రూప్యముల జీతము, బస్తా గింజలు చొప్పున నిచ్చు చుండెను.

తక్కిన పాలేళ్ళందరకుగూడ మంచి జీతములే యిచ్చుచు, సుబ్బారాయుడు గారు వాండ్రకు శౌచాదికమునలవరచిరి. దొడ్డిలోనున్నవారుగాక మాలలు, గొడులు నలుగురిశర పాలేళ్ళునుండిరి. ఇంటిలో అంట్లుతోముటకు, నీరుతోడుటకు, బిడకలు

చేయుటకు, దొడ్డిలో గాపురమున్న కుటుంబముల్లోని స్త్రీలనే నియమించిరి. వారికిని సంబళము లేర్పరచిరి. సోమన్నకోడలు ఇంటిలో నాడువారికి వలయు పనులన్నియు చేయుట, బియ్యము బాగుచేయుట, పిండిని విసరుట, బట్టలుసర్దుట, ఎక్కడివస్తువు లక్కడ నుండునట్లు చూచుట మొదలగు పనులను జేయుచుండును.

గొల్లవారిలో నచ్చమ్మ నమ్మకమిగు బంటు. దాని తల్లిదండ్రులు సుబ్బా రాయుడుగారి యింటనే యుండువారు. అచ్చమ్మతండ్రి గతించినాడు. తల్లి వృద్ధు రాలై యింటిపనులను జేయుచుండును. అచ్చమ్మ వివాహము జేసికొని భర్తనిల్లరి కము తెచ్చుకొన్నది. అచ్చమ్మ యిద్దరు చెల్లెండ్రు నటులనే భర్తల నిల్లరికము తెచ్చుకొని సుబ్బారాయుడుగారింటనే కాపురముండినారు.

వారి భర్తలు సుబ్బారాయుడుగారి పాలేళ్లు. వారి పిల్లలు గొడ్లకాపరులు, వారు పనికత్తెలు.

సుబ్బారాయుడుగారి దొడ్డిలో గాపురమున్న రెండవ కాపుకుటుంబము సోమన్న యల్లునిది. సోమన్నకు ముగ్గురు కొమరితలు నలుగురు కుమారులు. సోమన్న కొమరితలు కుమారులును గూడ నాల్గవతరగతివరకు జదువుకొన్నవారే. సోమన్న తన పెద్ద యల్లుని సుబ్బారాయుడుగారి దగ్గర పాలేరుగా బ్రవేశపెట్టి తన యింటి ప్రక్కయింటిలో గాపురముంచినాడు. తక్కిన యిరువురు కొమరితలను దొడ్డిపట్లలో నొకరికి, గోపాలపురములో నొకరికి నిచ్చి పెండ్లిజేసినాడు. వారందరు కడుపులు ఫలించి సుఖముగా గాపురములుచేయుచున్నారు. సోమన్నకు ముగ్గురు కొమార్తలు వరుసగా, బుట్టుటచే, నిక కొడుకు పుట్టడని నిరాశచెంది, బీదకుటుంబపు బాలునికి పెద్ద కూతునిచ్చి యిల్లరికము తెచ్చుకొన్నాడు. ఇప్పుడు సోమన్న పెద్దకుమారుడు సత్తెయ్య ఇరువది రెండేండ్లవాడు. చిన్నతనమున నారాయణరావుతో నాడుకొన్నాడు. నారాయణరావు రాజకుమారుడు, సత్తెయ్య బంట్రోతు. నారాయణరావు కలెక్టరు, సత్తెయ్య డఫేదారు.

సుబ్బారాయుడుగారి దొడ్డిలో గాపురమున్న వెలమలు పదియేండ్లక్రితము, సుబ్బారాయుడుగారి పనిలోజేరి వొళ్లువంచి పనిచేయుచుండుట చేతను, వారు కడియములో మంచి పేరుగన్న పూదోటలో బనిచేసియుండుటచేతను, సుబ్బారాయుడుగారు వారిని పూలతోటపనికి నియోగించిరి. ఆలమండగ్రామంలో మామిడితోటలో బనిచేసిన కుటుంబమును కొత్తపేట కనతిదూరముననున్న తన ముప్పది యకరములతోటలో గాపురముంచినారు.

సుబ్బారాయుడుగారి దొడ్డిలో గాపురమున్న అయిదు గొల్లకుటుంబములలో ఒక గొల్ల దూడల బెంచుటలో బేరుగన్నవాడు. అతని చేయి తగిలిన పశువుల దరికి రోగములు చేరవు. ఈతలుడిగినపసులు, అఱ్ఱుగడిగినయెద్దులు వారి దొడ్డిలో పింఛనుద్యోగులవలె, వార్ధకమున సుఖించుచుండును,

సుబ్బారాయుడుగారికి బసవులన్న బరమప్రాణము. మానవులకన్న వాని నెక్కుడు ప్రేమతో జూడవలెనని యాయన మతము. దొడ్డిలోని దూడలన్నిటి పేరులు పెట్టి ముద్దుగా బిలుచుచు గోముగా పెంచుచుందురు. ఏ దూడకైన నింపక కాలు నొచ్చినచో నాయన ప్రాణము విలవిల లాడిపోవును.

సుబ్బారాయుడుగారికి ఎనిమిదికాండ్లో స్వంతవ్యవసాయమున్నది. అయిదు వంగోలు జతలు, రెండు మైసూరు జతలు, సింధీజత యొకటియు, కేవలము సవారి బండ్ల కుపయోగించునవి కలవు. రెండు జతల దొబ్బిలి పోతులు, మూడు జతల బండిపోతులు, సంతతము వారికడ నుండవలెను. దొడ్డిలో గాపురమున్న వాని పిల్లలే పసుల కాపరులు.

మనుష్యులు పస్తుండినను, దూడలకు మేత తప్పగూడదని సుబ్బారాయుడు గారి మతము. వట్టిగడ్డి, జనుము దంటు, జొన్న చొప్ప, చిట్టు, తవుడు, ఉలవలు, సమస్తము సుబ్బారాయుడుగారి యింటిలో పుష్కలముగా నుండవలెను. పచ్చగడ్డి మేతకై పదియకరములభూమిలో బిల్లిపెసర పెంచెదరు. బీటినేలకూడ పుష్కలముగా నుండుటచే వారికి బసుగ్రాసలోపమెన్నడు నుండెడిదికాదు.

సుబ్బారాయుడుగారికి పాడిపశువులు విస్తారమున్నవి. వంగోలు ఆవులు ఎనిమిది, దేశవాళీ ఆవులు పన్నెండు గలవు. అయిదు పెద్ద గేదెలున్నవి. కొన్ని పాడిపశువులు, కొన్ని చూడివి, కొన్ని వట్టిపోయినవి. వారింట సర్వకాలముల పాడి పుష్కలముగా నుండవలెను. పాడిదూడలుగాక, వారింట గుమ్మిడిపండావులని యొకజాతి కలదు. సుబ్బారాయుడుగారి తాతగా రాజాతి నెక్కడ నుండి సముపార్జించిరో? ఆవు రెండడుగులన్నర యెత్తు, చిన్నతల, లేడి కళ్లు, పాలసముద్రమువంటి తెల్లని యొడలు, రేపుశేరు మాపుశేరు పాలిచ్చు కుండ పొదుగుతో గామధేనువువలె ముచ్చటగా నుండును. ఆ గుమ్మిడిపండావుచూడ కడుచిన్నదియై బొమ్మదూడవలె ముద్దులు మూటగట్టుచుండును.

వనలక్ష్ములవలెనున్న శారదా, సూర్యకాంతములతో నేగు నారాయణరావు త్రోవలోని మొక్కలను వర్ణించి చెప్పుచు పాడి పశువులపాకయున్న దొడ్డిలోనికేగెను. ఆ పెద్దపాకలో నొకప్రక్క గుమ్మిడిపండావులు రెండున్నవి. ఒకటి పాలిచుచ్చున్నది. రెండవది వట్టిపోయినది. తన్ను చూడగనే చెంగు చెంగున గంతులిడుచు జేరవచ్చిన దూడను నారాయణరావు ముద్దులాడదొడగెను. పసుల త్రొక్కిడిచే రొచ్చుగానున్న యా దొడ్డిని గాంచి ఏవగించుకొనుచున్న శారదకు, భర్త దూడనెత్తి ముద్దులాడుట మీదు మిక్కిలియై- 'వదినా యింటిలోకి వెళ్ళిపోదాం రావమ్మా' యని వెనుకకు దిరిగి, మగని యెడ్డెతనమును గూర్చిన తలపులతో నింటిదెసకు నడవసాగెను. శారదా చిత్తవృత్తి యెరుంగని సూర్యకాంతము ఆమె వెనుకనే పరువిడి, యామె కడ్డముగ నిలువబడి 'ఏవమ్మా వదినా, ఏమిటి! గుమ్మిడిపండు దూడను జూడ

కుండగనే వెళ్ళిపోతున్నా వేమిటి ? రా ! ' అని పిలిచినది. ' చూస్తూనే వున్నాగదా ' యన్నది శారద.

అంతకుమున్న వికలమనస్కుడై యున్న నారాయణరావు శారద వింతవర్తనమున కింకన్న నొచ్చుకొనుచు. ఆమెను వెనుకకు గొనితెచ్చుటకు నిర్బంధించు చెల్లెలితో ' సూర్యం ! నువ్వు ఇల్లారా ! ఇది కబురులు చెపుతోంది చూశావా ! దీనికి ' వరబాల ' అని నాన్నగారు పేరుపెట్టారా ? ' యనినాడు సూర్యకాంతము తల వంచికొనియున్న వదినదెస కొకపరియు, లేని వికాసము దెచ్చుకొను అన్నదెస కొకపరియు, జూడ్కి ప్రసరించి నిట్టూర్పువదలి యన్నగారి దగ్గరకు వెడలిపోయెను. శారద యేమనుకొన్నదో యక్కడనే యాగి, ' వదినా ఆచిట్టిపూడ నిట్లా తీసుకు రావమ్మా ' యన్నది. ఆ మాటకు సూరీడు మొగమింతయై రంతపుబొమ్మవలెనున్న యా పెయ్యదూడను సునాయాసముగ నెత్తికొని వదినగారికడకు గొనిపోయినది. నారాయణరావు నిట్టూర్చుచు నక్కడనుండి నెమ్మదిగా వెడలిపోయినాడు.

ఆ సాయంత్రమే సుబ్బారాయుడుగారితోట జూచుటకు నాడు పెండ్లివారందరును మోటారుమీద బయలుదేరినారు. సూర్యకాంతము, సత్యవతి, పరమేశ్వరమూర్తి భార్య రుక్మిణియు వారితో వెళ్ళినారు.

తోటలో మామిడిజాతులు, బత్తాయిలు, పనసలు, పోకలు, కొబ్బరులు, జామలు, దబ్బలు, నారింజ, ఉసిరి, సపోటాలు, జంబుమలాకా, గులాబీ జామ, పంపరపనాసలు, నిమ్మలు మొదలయిన వివిధ ఫలవృక్ష జాతులున్నవి. తోటలో రెండుమూడు కుటుంబములవారు కాపురమున్నారు. తోట కన్నులపండువై సువాసనలతో నిండియున్నది. చెట్టునబండిన కాశీజామపళ్లు, నారాయణరావు బెంగుళూరునుండి తెప్పించిన గింజలేని జామపళ్లు, పిందిగింజ జామపళ్లు, సపోటాపళ్లు, తోటమాలులు కోసి వారికెల్ల నర్పించినారు. దీపాలవేళకు మోటా రింటికి దిరిగి వచ్చినది.

నారాయణరావున కేదియో వ్యక్తముగాని భయమొండు హృదయమున ప్రవేశించినది. శారదవర్తనమునం దేదియో విశేషభావ ముండునని యాత దనుకొనెను. ఛీ ! తప్పు. అది భారతీయనారీమణులకు సహజమగు లజ్జయని మనస్సును సమాధానపరచుకొనెను.

నారా :—పరం ! మన స్త్రీ లెంత పాశ్చాత్య విద్యావతులైనా, వారిని పాశ్చాత్య నాగరికతా వాసన లెంత యలముకొన్నా, భారతీయ సంప్రదాయ వాసన వారి జీవితాన్ని వదలిపెట్టదురా ?

పరం :—ఏం ! ఆ ఆలోచన కల్గింది ? ఎవరైనా కనపడ్డారా ఏమిటిరా, పెద్దచదువు చదివి భారతీయ సంప్రదాయాలున్నవాళ్లు ఇవాళ ?

నారా :—ఒక ఆలోచన్లోంచి ఇంకోటితట్టిన వరుసలో ఆఖరు ఆలోచన ఇది.

పరం :—ఆగొలుసుకు మొదటిలింకె ఎక్కడ మొదలెట్టిందేమిటి ?

నారా :—అదేముంటుందిలే. ఏదో చిన్న ఆలోచన :

పరం :—అయినా, మన స్తత్వ పరిశోధనకోసం అడుగుతున్నా ?

నారా :—నేను చెప్పింది తప్పా ?

ఇంతలో లక్ష్మీపతి అక్కడకు వచ్చినాడు.

లక్ష్మీ :—ఏమిట్రా వాదించుకుంటున్నారు.

పరం :—చూడరా, వీడు ఒక పెద్దసిద్ధాంతం చేశాడు. నువ్వు వప్పుకుంటావా ? వప్పుకోవా ? అంటాడు. సరేరా, నీ సిద్ధాంతానికి ఉపపత్తులైన మొదటి ఆలోచన లేమిటిరా అంటే, వీడు ఇవీ అవీ చెప్పి తప్పించుకుంటాడు.

లక్ష్మీ :—అసలు వీడి సిద్ధాంతం చెప్పవోయి.

పరం :—ఈ రోజుల్లో పాశ్చాత్యవిద్య చదువుకున్న ఆడవాళ్ళ అంతరాంతరాల్లో భారతీయ సాంప్రదాయవాసన ఉండనే ఉంటుందట.

లక్ష్మీ :—అదా ! అదెప్పుడూ మావాడి వాదనల్లో ఒహటి.

పరం :—ఓరే ! నువ్వు గాంధిగారి భావాలన్నీ అద్భుతం, నిజం అంటావు. ఆయన ఏవన్నారూ, 'పాశ్చాత్యవిద్య లేకపోతే రామమోహనరాయలింకా చాలా గొప్పవాడయి వుండును' అని. దానిమీదేగా మోడరన్ రివ్యూ మొదలైన వాటికి కోపాలొచ్చాయి. అల్లాఅంటే అర్థం ఏమిటిరా లక్ష్మీపతీ ? పాశ్చాత్య విద్యవల్ల నిజమైన భారతీయ నాగరికత నశించిపోతుందనేనా ?

లక్ష్మీ :—అవును. నిజమే !

నారా :—'పాశ్చాత్యవిద్య వచ్చినా !' అని నేను అననే అన్నాను. అంటే మన వనితాలోకంవిషయంలో గాంధిమహాత్ముని సిద్ధాంతం పూర్తిగా అన్వయించు ననే నా అభిప్రాయం. అంతేగాని అది తప్పుఅని కాదుగదా. అంటే మన దేశంలో కాస్త తెలిసో తెలియకో సంప్రదాయం బ్రతికించిపున్నది ఆడవాళ్ళే అని.

పరం :—ఏవిటి బ్రతికించి ఉన్నది ? పక్కపాపిళ్లు, సినీమా ముస్తాబులు, విడాకుల రంధీ, వీటినేనా ?

నారా :—అన్నీ ఒప్పుకున్నా ! కాని యీ పైపైమోజులతో పాశ్చాత్యతత్త్వం పూర్తిఅయిందంటావా ?

పరం :—ఇంతవరకూ వచ్చినతరువాత పూర్తికాక మానుతుందా ? వాళ్ళ చదువు పూర్తిగాఎక్కినకొద్దీ తక్కిన ముచ్చట్లుకూడాతీరవూ ? తొందరపడతావేం ?

నారా :—కావచ్చును. కాని నేను ప్రస్తుత స్థితినిగురించే చెప్పుతున్నా.

ల —సరే ఇద్దరివాదనా వొక్కటే. ఇక పదండి.

# ౧౨

## మనుగుడుపులు

జమీందారుగారు వ్రాసిన యుత్తరమువల్లను తీసికొని వెళ్లుటకు వచ్చిన జమీందారుగారి చుట్టము గంగరాజు రంగారావు దేశముఖుగారి పట్టువల్లను, నారాయణరావుతో మనుగుడుపులకు నాతని యప్పచెల్లెండ్రు నలువురు, వదినెగారు, సూర్యకాంతము, అత్తగారు తరలివెళ్ళినారు.

సుబ్బారాయుడుగారు వధువువెంట వచ్చిన ఆడపెళ్ళివారి కందఱకు, రంగారావు దేశముఖుగారికి వెలపొడుగువస్త్రములు వెండిపళ్ళెములు ఫలములు మొదలగు బహుమతు లర్పించి పంపిరి. వారి నౌకరులకుగూడ దలకు మొలకు గట్టనిచ్చిరి.

అల్లునిజూడగనే జమీందారుగారి వదనము ప్రఫుల్లమయ్యెను. మధ్యహాలులో శ్రీనివాసరావుగారు, మృత్యుంజయరావుగారు, సీతారామాంజనేయ సోమయాజులుగారు, ఆనందరావుగారు, భాస్కరమూర్తిశాస్త్రిగారు, ఆనందరావుగారు, భాస్కరమూర్తిశాస్త్రిగారు, బసవరాజ రాజేశ్వర శ్రీ జగన్మోహనరావు జమీందారుగారు, రంగారావు దేశముఖుగారు, నారాయణరావు, జమీందారుగారు, నారాయణరావు రెండవ బావమఱది వీరభద్రరావు మొదలగు వారందఱు సోఫాలపై నధివసించి కొంతతడవు ఇష్టగోష్ఠి సల్పిరి. నారాయణరావు మాటలాడక యన్నియు వినుచుండెను. శ్రీనివాసరావుగారు తనవైపు తిరిగి తన్ను ప్రత్యేక మప్పుడప్పుడు ప్రశ్నించుచుండుటచే నారాయణరావు గంభీరములు నాలోచనా పూరితములునగు, సమాధానములు చెప్పుచుండెను. నారాయణరావు స్నేహితుడగు రాజేశ్వరరావు నాయుడుగూడ నప్పుడే వచ్చి యందఱకు నమస్కృతు లొనరించి యచ్చట గూర్చుండెను.

రైళ్ళవిషయమై సంభాషణ నడచుచుండెను.

శ్రీనివాసరావుగారు నారాయణరావును జూచి,

శ్రీని :—ఏమండీ నారాయణరావుగారూ! చూశారూ! మరేమంటే మనదేశంలో రైళ్ళు కంపెనీలక్రింద వుండడం లాభమా, ప్రభుత్వంక్రింద ఉండడం లాభమా?

నారా :—ప్రభుత్వంక్రింద ఉండడమే లాభం.

శ్రీని :—ప్రయివేటు కంపెనీలకువుండే లాభాపేక్ష ప్రభుత్వానికి వుండదనా మీయభిప్రాయం!

నారా :—ఆశ ఉండక పోవడమేకాదు. గవర్నమెంటు సాలీనావచ్చే నికరాదాయం వృద్ధిచేసుకొని తద్వారా ప్రజలకు ఇతర సదుపాయాలు చేయవచ్చు!

మృత్యుం :—అయితే రయిల్వేలుకూడ గవర్నమెంటు డిపార్టుమెంటై, ఎట్టిచేపు పద్ధతి అమలులోనికి వస్తే లాభాలనేని వుంటాయా అని.

జమీం:—అబుకారీ డిపార్టుమెంటు లాభసాటిగా లేదుటండీ?

శ్రీని:—రైల్వేలు ప్రభుత్వం చేతిలోవుంటేచూసారా? పెద్ద ఉద్యోగాలన్నీ ఇంగ్లీషు వాళ్ళకే కట్టపెట్టి వాళ్ళందరికీ జీతాలు విపరీతంగా యిస్తారు. మరేమంటే ఆసొమ్మంతా ఐ. సి. యస్. వాళ్ళ జీతాలలాగ అంతా ఇంగ్లండుకే చేరుతుంది.

రాజే:—కంపెనీ అయితే మాత్రం ఇప్పుడూ అవనే జరుగుతోంది గదా అండి.

నారా:—వారి ఉద్దేశం ఏమిటంటే, బ్రిటిషుప్రభుత్వం చేతిలో రయిల్వేలు ఉండడం లాభమా లేక హిందూదేశపు ప్రయివేటు కంపెనీ చేతిలో ఉండడం లాభమా అని.

శ్రీని:—అవును.

నారా:—బ్రిటిషుప్రభుత్వం హిందూదేశంలో వున్నన్నాళ్ళు రయిల్వేలు హిందూదేశంలో కంపెనీలకు యివ్వరు. ప్రస్తుతంహిందూదేశంలో అంత పెద్ద పెట్టుబడి పెట్టి రైల్వేలు కొనే కంపెనీలు తయ్యారుగాలేవు. ఇక రయిల్వేలు వెనుకటి షరతుల ప్రకారం ప్రభుత్వం చేతిలోకి ఎప్పటికైనా వస్తాయి. కొన్ని వచ్చాయి అప్పుడే.

జమీం:—రయిళ్ళ విషయం లెక్కలన్నీ నాదగ్గర వున్నాయి. ఇంతవరకు హిందూదేశంలో వేసిన రయిళ్ళవలన ప్రయివేటు ఇంగ్లీషు కంపెనీలకు, హామీ రూపంగానున్న, ప్రభుత్వంవేసిన రైల్వేలకు, నష్టనష్టం పైగా రాబడులను గవర్నమెంటుకు చాలా నష్టంవచ్చింది. (నారాయణరావు వైపుకు తిరిగి) ఆనక ఒకసారి నా స్వంత వ్రాతగదిలోకివస్తే ఆ లెక్కలన్నీ చూడవచ్చును.

నారా:—అలాగేనండి, నాకూ ఈ మధ్య ఆ లెక్కలన్నీ కావలసే వచ్చాయి.

జమీం:—అక్వవర్తు 'కమీషను' సంగతి ఎరుగుదువుగదా?

నారా:—అవును ఆ రిపోర్టులు చూడాలి.

మృత్యుం:—ఏమిటండీ ఆ కమిషను?

జమీం:—రైల్వేలు గవర్నమెంటు చేతిలోవుంటే ఎక్కువ లాభమా కంపెనీల చేతులలో ఉంటే ఎక్కువ లాభమా అన్న ఈ ప్రశ్నే!

నారా:—ఇతరదేశాలు ప్రస్తుతం భాగ్యవంతమైన దేశాలు. మన దేశం చాలా బీదది. పైగా పాశ్చాత్యదేశాల్లోనే ఇప్పుడు రైల్వేలు గవర్నమెంటుకు ఇచ్చి ప్రజాధీనం చెయ్యాలని రభసచేస్తున్నారు.

శ్రీని:—గవర్నమెంటు స్వాధీనం అయితే లాభాలసంగతి వేరే చెప్పాలా?

నారా:—చిత్తం, వస్తున్నాను. ముందు రయిల్వేలు లాభదాయకాలైనవి, అనే సంగతి మనం వప్పుకుంటే.

శ్రీని:—ఒప్పుకున్నాను ప్రస్తుతం.

నారా:—అయితే, దేశంలో ఏకొద్దిమందికో కంపెనీ రూపంగా వచ్చేలాభం, గవర్నమెంటుకు వస్తే ఆ రాబడి విలువ ఇతర పన్నులలో తగ్గించవచ్చు

# ౧౮

## వీణ

ఆ సాయంత్రము విహారమునకేగివచ్చి నారాయణరావత్తవారిమేడ చేరు నప్పటికి దివ్యనాద పూరితమగు విమలగాంధర్వమున దిశల నింపుచున్న దొకబాఘీ రాజేశ్వరు డా పాట విని 'ఎవరురా అంత అద్భుతంగా పాడుతున్నారు' అని అడిగినాడు.

'ఆ! శ్రీరామయ్యగారీమధ్య ఊళ్ళోలేరు. నేడే వచ్చారు. వారు ఫిడేలుతో పక్కవాయిద్యం వాయిస్తూ శిష్యురాలిని ఎంత విచిత్రంగా పాడిస్తారనుకొన్నావు?'

'మీ ఆవిడే నేమిట్రా!'

'ఆమాత్రం కనిపెట్టలేవురా! ఉండు, శ్యామ ఆలాపనజేస్తున్నారు. విను, విను. మాట్లాడకు.

'నాకు సంగీతమంటే తలనొప్పి.'

'అప్పుడే నీవు 'ఆస్వరిను' అంశకు వచ్చావుట్రా?' గదిముందరి వరండాలో దీపాలు ఆర్పివేసి రాజేశ్వరరావును, తానును పడకకుర్చీలపై కూర్చుండినారు.

తారకాకాంతులే 'శాంతములేక సౌఖ్యములేదు' అని పాడుచున్నట్లయినది. చీకటిలో గనబడని పూవుల సౌరభమే సంగీతమై విశ్వమంతయు నావరించిపోయినది. గులాబిపూల పాలగొంతుకనుండి వెడలు నా పవిత్రస్వనముతో బోల్చుటకు నారాయణరావున కీ ప్రకృతిలో నేదియు తలపునకురాలేదు. వేణువనస్వనములా, సెలయేటి గానములా, తుమ్మెద ఝంకారములా ఇవి యేవియు దగవని యాతడు తలయూచినాడు. కోకిలగొంతులు కావచ్చు ననిపించినది.

నారాయణరావు హృదయము ఆనందపూరితమై ప్రేమపూర్ణమైనది.

'నను పాలింప, నడచివచ్చితివో!

చిట్టి శ్రీరాముడు, నీలమేఘశ్యాముడై తొనలు తిరిగిన చిఱుచేతులతో చిన్న బంగారువిల్లు పట్టుకొని, నవ్వులు వెదజల్లుచు, నడచివచ్చిన ట్లాతనికి గోచరించినది. ఆతని కన్నుల నీరు తిరిగినది. ఆగొంతులో చిన్ని శ్రీరాముడేకలడు. శ్రీరామయ్యగారి కంఠములో దుష్టరాక్షస సంహారుడగు రఘువీరుడే కోదండపాణియై అనుజ సౌమిత్రులతో సాక్షాత్కరించుచున్నాడు. ప్రశాంతమగు నా సంధ్యారాగములో మిళితమగు శ్రీరామయ్యగారి కమానుకదుపులో శారదాదేవి గళమునుండి తొలుకాడు కలికి చెలువంపు తీయసవ్వడులు గలసి,-లత్తుకతీర్చిన చిన్నారి పాదాలపై పరికిణీయంచులు చిందులాడ, కనకకింకిణీనూపుర ఘల్ఘలారవముతో శీతనగ స్వచ్ఛహిమశకలముపై నృత్య మొనర్చు సుమాబాల విశ్వమోహనమగు కంఠ కుహూకారములు విరియించి నట్లయినది నారాయణరావునకు.

'ఎటులా బ్రోతువో తెలియా
ఏకాంత రామయ్యా—!'

ఆర్తరక్షకుడగు నా శ్రీరామచంద్రమూర్తి ఎంతచక్కని ప్రభువు! బ్రోచిన నాతఁడే బ్రోవవలయు. శ్రీ రామనీలమేఘము ఘర్మమునః కేదార్ల బూర్ణసస్యమ్ముల బండించుగదా! పరాప్రకృతి యగు సీతమ్మతల్లియు, పరమాత్మయగు శ్రీరామచంద్రుడును నవ్యయులు, సత్యచేతన ప్రదాతలు. 'బ్రోచినను, కబళించినను నీదే భారము ప్రభూ!' 'రామరామా! యని రంజిల్ల నావంతు నియతిమై రక్షింప నీది వంతు,' అని కనులుమోడ్చినాడు నారాయణరావు.

రాజేశ్వరుడు చెలికానివంక తిరిగి 'ఏమిరా నారాయుడూ! నే నిన్నాళ్లూ పెళ్ళిచేసుకోనని నివేశాను. ఏదోసంబంధము మానాయన తీసుకువస్తే ఆపిల్లకు, నాకూ ప్రేమ కుదురుతుందని నమ్మకంలేదు. మా నాయనతో ఏదో సాకులుచెప్పి తప్పించుకున్నా. మా నాయన పోయినతర్వాత నేటికి మా అమ్మ పెట్టిబలవంతం పెట్టింది. గొంతుక్కు పెలక్కాయపడినట్లయి తర్వాత చెప్తానులే అని పారిపోయి వచ్చాను.' అని పడకకుర్చీలో జేరగిలబడి కనులుమూసికొని నారాయణరావు నడిగెను.

రాజేశ్వరరావుది పచ్చని దబ్బపండుచాయ. తెలగబిడ్డయైన నతని నందఱు బ్రాహ్మణుడే యని తలతురు. అతడు శాకాహారి. స్వచ్ఛమగు పలుకు, మధ్యమోన్నతమై కండపుష్టి కలిగిన శరీరము. వంకర తిరిగిన ముక్కు, నమమైన నుదురు. కామపురుషార్థ పరతాస్ఫోరకములగు దీర్ఘ చక్రవాకలోచనములు. ఫ్రెంచిపద్ధతిని నగము మిగుల్చుకొన్న నల్లని మీసములు. చుట్టును జవ్వలేని సులోచనములు ధరించి, ముంగురులు నున్నగ వెనుకకు దువ్వుకొనును. ప్రసిద్ధ సినిమానటకుడగు 'రుడోల్ఫ వాలంటినో' పద్ధతి నాతడు పొడవుగా పెంచుకొను మొగచెంపలును, తీర్చినట్లున్న నల్లని కనుబొమలు నాతనిమోమునకు గాంభీర్యమును పులకియిచ్చును. అతడు ధరించునవి చిక్కని మీగడ తరకవంటి ఫ్రెంచి పట్టుచొక్కాలు. తెల్లటి లాగులను తొడుగును. కాళ్ళకు ఖరీదుగల లూఢియానా జరీ చడావులుండును.

నారాయణరావాతని నఖశిఖపర్యంతముఁ జూచి చిరునవ్వునవ్వి, తన ముదుక ఖద్దరుపంచె, ఖద్దరులాల్చి, ఖద్దరు సేలంకండువాలను జూచుకొని నవ్వుచునే పెదవి విరుచుకొని 'ఒరే రాజీ! నువ్వెప్పుడైనా అలంకారముతో లేనిసమయం ఉందిరా?' అని ప్రశ్నించెను.

'ఇంటిదగ్గిర లబ్బీలుంగీ కట్టానురా!'
'అది పట్టుదేనా?'
'ఆ!'
'నిద్దట్లో నీ జుట్టు చెరుగుతుందిరా!'
'పాపము శమించుగాక!'
'ఏదీ చెయ్యి! పారా హుషార్!'

'నామీద ఒక వ్యాసం రాయరా! ఒక కథ అల్లరా?'

'నీ వొక్కడిమీదనేనా? ఆ పరకీయనుకూడా కలపనా?'

'సెబాష్! కలిపితే యిక మజా అడిగావూ!'

'మరి దశావస్థల్లో ప్రస్తుతావస్థ యేద్తో చెప్పు?'

'మీ కవిత్వాల్లో విరహావస్థ లన్నిరెటిమాటా నాకుతెలియదుగాని 'ప్రళయం మట్టుకు తప్పేటట్టు లేదు.'

'ఎవరికి? నాయికకా, నాయకునకా? ఆ పూర్ క్రీచరుకా? మీ మోహప్రవాహాన్ని ఆ భర్త అరికట్టడనీ పైపెచ్చు సంతోషంతో ఓలలాడతాడనీ చెప్పావుగా! నీవానాడు చెప్పినమాటలు తలచుకుంటే నా కిప్పటికి ఒళ్లు జలదరిస్తున్నది. ఎంత అమానుషపు టూహ చేశావురా?'

'ఒరేయి! ఈ విషయములో మనం యిద్దరం ఏకాభిప్రాయులం కామనిన్నీ, ఆ భావాలు మనం చర్చించుకోవడం మానివేద్దామనిన్నీ అనుకున్నాంగా!'

'అవును! అందుకనే ఆయనమాట తలపెట్టవద్దన్నాను. కాని ఇప్పుడు నీ పెళ్ళిమాట ఎత్తావు కాబట్టి ఇప్పటికైనా ఈ హేయశృంగార ప్రబంధానికి స్వస్తి చెప్పి, పెళ్ళిమాట ఆలోచించడం ఉత్తమం.'

'నారాయుడూ! నువ్వు చెప్పే ముసలమ్మల సిద్ధాంతాలు నాకు గిట్టవు. ఎప్పుడో ఇక్ష్వాకులనాడు పుట్టిన వివాహాచారాన్ని యీ యిరవయ్యో శతాబ్దంలోకూడా పట్టుకు వేళ్ళాడమంటావునువ్వు. వివాహాలు లేని కాలంకూడా ఒకటి ఉండేదన్న మాట మరచిపోకు. ఏదో ప్రయోజనంకొరకు మధ్యలో కల్పించిన యీ ఆచారంతో ప్రయోజనం లేదనుకుని యిప్పుడు దాన్ని విడిచిపెట్టేవాళ్ళకు ఆక్షేపణ ఏముంది? స్త్రీ పురుషుల ప్రేమ సంబంధానికి ఇంత తంతెందుకు?'

'పెళ్ళిలేనికాలం ఒకటి ఉండేది అన్నావు. ఆ కాలం పాశ్చాత్యశాస్త్రజ్ఞుల వాదనప్రకారం మానవులు జంతువులులా సంచరించే రోజులు. కనక ఇప్పటి జంతువులసంగతి విచారిస్తే ఆనాటి వారిస్థితి మనకు గోచరిస్తుంది.'

'అది సరే! నా వాదానికే వస్తున్నావు.'

'తొందరపడకు. ఆకాలంలో మానవజాతి అంతా ఇష్టంవచ్చిన మగవాడూ, ఇష్టమువచ్చిన ఆడదీ వాంఛతీర్చుకోవడం, తర్వాత వాళ్ళకీ వీళ్ళకీ సంబంధం లేకుండా ఉండడం అని కదా నీ వాదన. నువ్వు అనుకునే జంతుత్వం జంతువులలో లేదు. మానవసంబంధంలేని జంతువులలో ముఖ్యంగాలేదు. భగవంతునివల్లనో లేక ప్రకృతివల్లనో వచ్చిన 'ఇన్‌స్టింక్ట్' (జంతుజ్ఞానం)వల్ల జంతువులు బ్రతకడం, జాతి వృద్ధిపొందడం అనేవి మాత్రమే అవి ఎరుగును. ఆ జంతుజ్ఞానంవల్ల ఇష్టమువచ్చిన తిండి తినవు. ఇష్టంవచ్చినట్లు కామం తీర్చుకోవు. దేహం కాపాడుకోడానికి తిండి, జాతి వృద్ధిపొందడానికి కామం, అని ఆ జంతుజ్ఞానమే వాటికి చెప్పింది. ఇష్టమువచ్చినట్లు తిండితిన్నా, కామం తీర్చుకున్నా జాతి నశిస్తుందని ఆ జంతుజ్ఞానమే

చెప్పింది. అందుకనే సాధారణపు కోతులలో ఒక మగకోతి కొన్ని ఆడకోతులు ఉంటవి. లేక ఉరాంగు ఉటాంగు మొదలైనవైతే, గోరిల్లాలాంటివి అయితే ఒక మగది ఒక ఆడది నీతిగా వుంటవి. ఆలాగే సింహం, పులి, తోడేలు, ఎలుగు. అదీకాకుండా జంతువులకు ఋతుకాలం అంటూ ఒకటి ఉన్నది. ఆకాలంలోనే కామ క్రియానిర్వహణం జరుగుతుంది. ఇదే జంతువులలో పెళ్ళివంటిది. '

'అయితే మన ఆవుల సంగతి, కుక్కలసంగతి ఏమిటి? ఆంబోతుకు ఈయావు ఆయావు అనిలేదు. ఎప్పుడు ఏ ఆవు ఎదపోయి సిద్ధంగాఉంటే, ఆ ఆవుతో పొర్లడానికి ఆంబోతు సిద్ధం. ఆ ఆవుకైనా ఏ ఆంబోతైనా సరే. కుక్కలలో ఒక్కొక్క ఋతుకాలంలోనే ఆడకుక్క రెండు మూడు మగకుక్కలతో సంబంధానికి సిద్ధం. చూలు నిలవగానే మానుకుంటుంది. తన పిల్లయిన మగకుక్క అయినాసరే! గాడిదెలు అంతే, పందులు అంతే. ఇప్పుడేమంటావు?'

'నువ్వు 'మన' అనడంలోనే జవాబంతా వచ్చింది. అయినా విపులం చేస్తాను. మనుష్యుని జీవితాల్తోకలిసిపోయినవి ఆలజాతులు, కుక్క, గాడెద, పంది, పిల్లి జాతులు. అందువల్ల చాలాభాగం వాటికి జంతుజ్ఞానము నశించిపోయింది. మనుష్యునికున్న మనస్సున్నూ లేదు. అయినా అవికూడా ఋతుకాలాన్ని మాత్రం అనుసరిస్తాయా, అనుసరించవా?'

'సరేరా! పెళ్ళి - అనే సంస్థ సంగతికానీ.'

'జంతు జీవితంలోంచి నెమ్మదిగా మనుష్యుడు తన మనోబలంవల్ల పైకి రాసాగాడు. మనస్సంబంధమైన జ్ఞానము వృద్ధి అయినకొద్దీ జంతుజ్ఞానము నశించినది. భోజన నిద్రామైథునములు మాత్రమేకాక అనేకవాంఛలు, వాటిని సంపాదించుకోడం పెట్టుకున్నాడు. కళలన్నాడు, లలితకళలన్నాడు, కృషివాణిజ్యాలు, యుద్ధాలు రాజ్యాంగాలు పరసాధన యిటువంటి వ్యాపారా లనేకం కల్పించుకున్నాడు. ఆయా వ్యాపారాలలో నిరంతర సాధనచేస్తూ, అద్భుతమైన నాగరికత నిర్మించుకున్నాడు. ఆహారనిద్రా మైథునాలుతప్ప వేఠే పనిలేనివాళ్లు అప్పటికీ యిప్పటికీ నువ్వనుకొనే పశుతుల్యులుగానే వుంటారు. తన మానవత్వం సార్థకపరుచుకోడానికి ధర్మార్థాలు సాధింప దలచుకొన్నవాళ్లు పశుప్రవృత్తయిన కామానికి ఒకహద్దు ఏర్పరచుకొన్నారు. నిరంతరం కామసేవకోసం, ఉదరపూజకోసం ఆలోచిస్తూ కూర్చోడానికి వాళ్ళకు వీలుపడదు. నిద్రాహారాలుకూడా మాని, దీక్షతో పనిచేసే మానవుడికి కామవిషయం కలలోకిగూడ రాదుగదా! అయితే ప్రజోత్పత్తి మూలకమైన కామంకూడా పురుషార్థమే కనక, దాన్ని బొత్తిగా వదలిపెట్ట నక్కరలేని సామాన్యగృహస్థులంతా, ఒక స్త్రీతోనే కామనిర్వహణం చేస్తూ, యితరపనులు చేసుకోడానికి మనశ్శాంతీ, తీరికా సంపాదించుకుంటారు. అంతే. కాని స్త్రీ పురుషులు స్వేచ్ఛా చారపరులయి నిరంతరం సంఘ సుస్థితికి భంగం కల్గించే కొట్లాటలు తెచ్చిపెట్టుకోగోరరు'

'ఒకస్త్రీతోవుండాలని నేనువొప్పుకుంటాగాని వివాహకర్మకాండంతాఎందుకు?'

'అమాటన్నావు, బాగుంది. జాతి క్షేమానికి, సంఘసుస్థితికీ ఒక-పురుషుడూ ఒక స్త్రీయే కూడివుండడం అవసరమని. ఒప్పుకొంటే నాకు చాలు. వివాహకర్మ మానుకొన్నా నాకు సమ్మతమే.'

'మరి ఎందుకు చేస్తున్నా రండీరూ యీకర్మను ?

'అది వేఱేసంగతి. వివాహం అర్థకామాలకే కాకుండా, ధర్మమోక్షాలకు గూడా సాధనమని నమ్మేవారు ఆపని చేస్తారు. వాళ్ళజోలి నీకెందుకు ? తానుతప్ప యితరంలేదంటూ, ఆత్మాభిమానంతో ముగ్గేవాడికి గృహస్థాశ్రమం, ఆత్మసాధన. తనచుట్టూ తాను కట్టుకొన్న గిరిని ఆలుబిడ్డలద్వారా విస్తరింపజేసుకొని, క్రమంగా విశ్వంతో ఐక్యభావం సాధించుకొంటాడు. గృహ్యసూత్రోక్తమైన కర్మలు సర్వభూతదయాళుత్వం మొదలైన ఉన్నతభావాలకు మెట్లవంటివి. ఇది అంతా మతానికీ, దేవుడికీ సంబంధించిన విషయం. నువ్విదంతా వేదాంతమంటావు. కాబట్టి ఆసంగతి మనకు వద్దు.'

'వివాహకర్మ అక్కరలేదంటే మనకిక తగాదాలేదు.

'లేకేమి ? మీ స్వేచ్ఛాచారులు వొక స్త్రీ ఒక పురుషుడు అనే నిబంధన ఒప్పుకోరుగా? మోజు తీరిపోగానే యెవరిదారి వారు చూచుకోవలసిందనేగా మీమతం?'

'అవునుగాని, స్త్రీకి గూడ స్వతంత్రంఅనేదివుంటే మేము చేప్పేస్థితి వస్తుందా, రాదా ?'

'ఆస్థితికి కారణం స్త్రీస్వాతంత్ర్యం అవునో కాదోగాని, ఆస్థితిమాత్రం అధోగతికి కారణమవుతుంది. 'జడ్జిలిండ్ సే' అమెరికాస్థితివ్రాశాడు చూడలేదూ ? విడాకులు పుచ్చుకోడానికి స్త్రీకి పురుషుడికీ సమానస్వతంత్రం వున్న సోవియట్ రష్యాలో, అమెరికాకంటె తక్కువ విడాకులసంఖ్య విన్నావో, లేదో ? కాబట్టి స్త్రీ స్వాతంత్ర్యం వచ్చినప్పటికీ, నీతి నియమాలనేవి వుంటే ధర్మరతి అనేదివుంటే నువ్వనుకొనేస్థితి యెన్నడూ సంభవించదు. ఆహారనిద్రామైథునాలకొఱకే మనం బ్రతుకుతున్నా మనుకొంటేమాత్రం ఆస్థితి తప్పకుండా వస్తుంది. అప్పుడు మన కీరాజ్యాలూ అక్కరలేదు. కళలు అక్కరలేదు !'

'ఒరే నారాయుడూ! నీ కీప్లీడరీ ఎందుకుగాని, సనాతనమత ప్రచారపీఠం ఒకటి పెట్టరా!' అనుచు రాజేశ్వరరావు నారాయణుని వీపు తట్టి వెడలిపోయెను.

## ౧౯

## ప్రేమస్వాతంత్ర్యము

రాజేశ్వరరావు చిన్నతనమునుండియు తిరుపతిరావుగారి శిష్యకోటిలోనివాడు. తిరుపతిరావుగా రేవిషయమునుగూర్చి సంఘముతో దాము పోరాడుచున్నారో, స్త్రీ పురుష లేవిధమున సంచరించవలె నని వాదించుచున్నారో అట్లే తాము సంచరించి

అకల్మషహృదయులనియు, దృఢవ్రతులనియు, ధీరచరిత్రులనియు పేరుపొందినారు. వారి యభిప్రాయములతో నేకీభవింపనివారుగూడ వారి త్రికరణశుద్ధిని మెచ్చుకొను వారే. ఆ తిరుపతిరాయనికి రాజేశ్వరుడు నమ్మిన శిష్యుడు

తల్లిదండ్రులు వివాహముచేసికొమ్మని యెంత పోరినను, అతడు మెన్నో సాకులు చెప్పుచు తప్పుకొనుచుండువాడు. తిరుపతిరావుగారు ఎప్పటికోడ నబద్ధము లాడవలదనియు, ఉత్కృష్టధర్మమగు స్వతంత్ర మసత్యముచే గలుషితమగుననియు రాజేశ్వరున కనేక విధముల బోధించినాడు.

రాజేశ్వరుడు రాజమహేంద్రవరము చదువుటకు వచ్చినప్పుడు నారాయణు నితో ప్రాణస్నేహ మేర్పడినది. నారాయణరావు రాజేశ్వరునకెన్ని సారులో తిరుపతి రావుగారి శుశ్రూష వలదని బోధించినాడు. పరమేశ్వరరావుమాత్రము తిరుపతిరావు గారి విధానము స్త్రీ పురుషసంబంధపు జిక్కు చక్కగా విడదీయు రాజపథముకావచ్చు ననియు, కొందరి జీవితము లా విధానమునకు సమర్పితములు గావలెననియు రాజేశ్వరు డప్లేలచేయరాదనియు నారాయణరావుతో వాదించువాడు. అది ఆత్మహనన మార్గమని మనకు తెలిసివచ్చినప్పుడు, ఆ జ్ఞానమును రెండు చేతుల ద్రోసిపైచి, కళ్ళకు గంతలు కట్టుకొని, మహావిషోరగ భయంకరజీవములు గడపి, విషవాయు పూర్ణమును, నగాధమునగు నరకకూపాన నేలబడవలయునని నారాయణరావు వాదించువాడు.

తిరుపతిరావుగారి స్నేహముచేయుచుండినచో రాజేశ్వరుని మోముచూడనని నారాయణుడు అదలించినను 'నీకు ఉడుకుబోతుతన మెందుకు? నువ్వుకూడా మా జట్టుచేరు. నువ్వూ ఘోటక బ్రహ్మచారివేగా!' అని రాజేశ్వరుడు వికటముగా జవాబిచ్చెను.

తిరుపతిరావుగారి చుట్టును పాశ్చాత్యవిద్యాదక్షులగు (విద్యాదగ్ధులా?) పెక్కుండ్రు చేరినారు. ఒకరి భార్యల నొకరు పొందవచ్చును. స్త్రీ స్వాతంత్ర్య సంపాదనము శిక్షాస్మృతిలో పరభార్యాసంభోగమునకు, గర్భవిచ్ఛిత్తికి నేర్పడిన శిక్షలు తొలగించుట, విడాకులచట్టము, స్త్రీలకు సంపూర్ణస్వత్వములతో ఆస్తి సంక్ర మింపజేయుచట్టమును, అన్నదమ్ములతోపాటు స్త్రీలకు పిత్రుస్వమున భాగమొసగు చట్టము నిర్మింపజేయుట మొదలగునవి వారికి ముఖ్యాశయములు.

పరస్త్రీ సంగమము దోషమని తలంచుట యజ్ఞానవిలసితమని వారి యభిప్రాయము.

ఆబృందముతో దిరుగు రాజేశ్వరుడు పవిత్రుడుగాడని యెవరు చెప్పగలరు? అత డందగాండ్రలో పెక్కుగావున ఆ సమాజములోని బాలికల కతనిపై మరులు జనించుట వింతకాదు.

కాని యా సంఘములోగూడ పెక్కు వత్సరములనుండి పరస్పరము ప్రేమించుకొనిన స్త్రీ పురుషయుగ్మము లెన్నియోకలవు. ఆ సంఘములో పూర్వ

జూచుకొని, ఆ కోర్టుపని దలచికొని సుబ్బయ్యశాస్త్రి నిలువునా నీరై పోయినాడు.

పుష్పశీలకు భర్తపై గాఢానురక్తి లేకున్నను అసహ్యము మాత్రములేదు. భర్తతో నీ యేడేండ్ల కాపురము లోకముతోపాటుగానే వెళ్ళబుచ్చినది. నేడామెకు నెత్తిమీది బరువు దింపినట్లయినది. హృదయమునుండి కత్తిమొన పెరికివేసినట్లయి నది. కళ్ళగంతలు విప్పినట్లయినది.

సుబ్బయ్యశాస్త్రికి భార్యయన్న వెఱ్ఱిమమకారము, ఇతరస్త్రీలపై సరదాలాటము. ఇతర వనితలకెప్పుడు నాతడు మాటయిచ్చి తప్పినదిలేదు. పుష్పశీలమాట కడుగు దాటినదియు లేదు. భార్య యాతనికి తుష్టిగూర్చు షడ్రసోపేతభోజనము. పరకాంత లాతని చపలజిహ్వకు ఫలాహారములు.

పుష్పశీల గర్భమింతవరకు ఫలించలేదు. ఆమె బ్రతుకున నిండియున్న కామ పరిమళము పూర్ణముగా నింక నెవ్వరిని జుట్టుకొనలేదు. ఆమెతో యౌవన మాధు ర్యము నరమూత కనులతో గ్రోలి చరితార్థ మొనరించు మధువ్రతుని కొఱకామె తపి యించుచున్నది. తన మంజులాంగ సౌకుమార్య సరసతావిలాసముల నెమ్మేన పెన వేసికొని మునుకలిడి, తెప్పదేల్చు పురుషవరుడామెకు బ్రత్యక్షము కాలేదు.

చెన్నపట్టణమునుండి వచ్చినప్పటి నుండియు రాజేశ్వరునకు బుష్పశీలను జూడవలెనను వాంఛ వేయి మడుంగులైనది. అది యాతనికి దపస్సయినది. సుబ్బయ్యశాస్త్రి యింటి కాతడెన్నిసారులు వెళ్ళెనో! కాని యాతనికంటి కామె తళుక్కుమనలేదు. పుష్పశీలకు గావలియుండు బ్రహ్మరాక్షసి యిప్పుడు సుబ్బయ్య శాస్త్రి వేలువిడిచిన మేనత్త. ఒకనాడు సుబ్బయ్యశాస్త్రి మేనత్తకు జ్వరమువచ్చినది. ఆ యాదివారమునాటి సాయంసమయమున రాజేశ్వరుడు మిత్రునింటికి 'టీ' వేళ కరుదెంచి తేనీరు గ్రోలుచుండ సుబ్బయ్యశాస్త్రి మేనత్త జ్వరముచే దనకు బెంగగా నున్నదని చెప్పినాడు. రాజేశ్వరు డదివిని తనదగ్గర నద్భుతమగు జ్వర నారాయ ణాస్త్రమువంటి పాశ్చాత్యౌషధ మొండు కలదనియు, నది రెండు మూడు మోతాదు లతో గుదుర్చుననియు జెప్పి, తానెక్కివచ్చిన 'సైకిలు' మీద నతివేగమున నింటి కరిగి యామందు పట్టుకొనివచ్చి యిచ్చెను.

సుబ్బయ్యశాస్త్రి చీకటి పడువరకు రాజేశ్వరు నచ్చటనే యుంచి మాట్లాడు చుండగ, లోననుండి పనిచేయు మనిషి వేగముగా వచ్చి 'చెల్లమ్మగారికి చెమటలు జడివానలా పోస్తున్నాయండి!' యని చెప్పెను.

స్నేహితు లిరువురు గుభాలున లేచి లోనికి బోయినారు. వారిరువు రచ్చటకు బోవునప్పటికి పుష్పశీలమ్మ యొక తెల్లని వస్త్రముచే నా రోగి ముఖము తుడుచు చుండెను. ఆమె తలయెత్తి రాజేశ్వరరావును జూచెను. రాజేశ్వరు డామెనుజూచెను. చెల్లమ్మగారికి జ్వరమును తగ్గెను.

రాజేశ్వరున కది మొదలుకొని పుష్పశీలాదేవి తప్ప ప్రపంచమున నేవస్తువు గోచరించుటలేదు. మనమున నింకొకభావము ప్రసరించుటలేదు. ఆతని జీవితసూత్ర మా బాలికా రూపసంపదను బెనవేసికొని పోయినది. భోజనము రుచించుటలేదు. నిద్రపట్టుటలేదు. గ్రంథములపై మనసుపోదు. టెన్నిసు మొదలగు నాట లాడనిచ్చ లేదు. స్నేహితుల సమావేశములు వెగటైపోయినవి.

రాజేశ్వరుని జూచినప్పటి నుండియు, పిపాసార్దితునకు జల్లని మంచినీళ్లు కనులబడినట్లయినది పుష్పశీలకు. ఠీవియైన నడకతో, ఫ్రెంచిమీసముతో, పురుషత్వము వెలిగిపోవు రూపసంపదతో, రాజేశ్వరు డామెకు జయంతునివలె బొడగట్టినాడు. దూరదూరాననే నాగరికతా సముజ్వలులగు యువకులజూచి సంతసించు నా యోషారత్నమునకు రాజేశ్వరుడు అతిలోకసుందరుడై, ముంగిటి పెన్నిధానమై తోచెను.

ప్రౌఢయగు పుష్పశీల నాటినుండి రాజేశ్వరు డనేక మిషలతో దనయింటికి వచ్చినప్పుడు భర్తకు దెలియరాకుండ దర్శన మొసగుచుండును. నర్మగర్భములగు చూపులతోడనే వారిరువురు నించుకించుక హృదయతాపోపశమన మొనర్చుకొనుచుండిరి.

భర్త కోర్టులో నొకగట్టి వ్యాజ్యములో మునిగియున్నరోజున రాజేశ్వరుని కేరీతినో చీటివచ్చినది. ముసలమ్మకు జ్వరము మరల వచ్చునట్లున్నదనియు దామిది వరకు ఇప్పించినమందు పట్టుకొని రావలసింది అనియు నాచీటి వార్త చెప్పినది. రాజేశ్వరుడు రెక్కలు గట్టుకొని యచ్చట వాలినాడు. కాని యతనితోడనే వచ్చినట్లు సుబ్బయ్యశాస్త్రియు నూడిపడినాడు. రాజేశ్వరుడు హృదయములో శాస్త్రిని నూరుహత్య లొనరించినాడు.

## ౨౦

## వేదాంతి

రాజారావు త్వరలోనే చెన్నపట్టణము వెళ్ళి కాలేజీలో జేరదలచినాడు, విక్టోరియా హాస్టలులో నుండుట కతని కాయేడు వీలులేదు. విశ్వవిద్యాలయమువారు నెలకొల్పిన వసతిగృహములో నాతడు విధిగా జేరవలసివచ్చెను. ఆయేటితో నాతని చదువుగూడ బూర్తియగును.

రాజారావు వైదిక సంప్రదాయము సంపూర్ణముగ నెఱపు వెలనాటి బ్రాహ్మణుడు. చిన్నతనములో నాతనితండ్రి వసుదేవశాస్త్రిగారు సంధ్యావందనము, పురుషసూక్తము, శ్రీసూక్తము, నమకము, చమకము నాతనికి నేర్పినాడు. వేదములో, గొన్ని సూక్తములు పఠింపించినాడు. కాని రాజారావున కాచదువునచ్చమిదండ్రి గారితో జెప్పకయే మోడేకుఱ్ఱునుండి పారిపోయి కాకినాడ జేరుకొని, కొందరు సంపన్న గృహస్థులయింట వారములు కుదుర్చుకొని, దయార్ద్రహృదయుడు, విజ్ఞాన

సముద్రుడు, భగవద్భక్తుడు, బ్రాహ్మమతాలంకారుడు, కళాశాలధ్యక్షుడు నగు శ్రీ వెంకటరత్నంనాయుడుగారి దయకు బాత్రుడై విద్యార్థివేతనమును సముపార్జించుకొన్నాడు.

తనయ్యు డెచ్చటికి బోయినదియు దెలియక యాతని తల్లిదండ్రులు బెంగగొనిపోయిరి. అతని తల్లి పేరమ్మగారికి మతిబోయి మూర్ఛ జనించినది. పిమ్మట నెలదినములకు మూడవ 'ఫారములో' తాను జేరినాననియు, బాగుగ జదువుకొనుచున్నాననియు, రాజారా వుత్తరము వ్రాసెను. దానితో దల్లిదండ్రు లిరువురు కాకినాడపోయి కుమారునిజూచి, కనుల నీరునింపుకొని, కుర్రవానిని వదలియుండలేక తాము సకుటుంబముగా వచ్చి కాకినాడలోనే వసింప నిశ్చయించుకొనిరి.

రాజారా వంతయద్భుతమైన తెలివితేటలు గలవాడుకాడు. ఎట్టులో కష్టించి పరీక్షలలో గృతార్థుడగుటకు వలయు తెలివితేట లాతనికడ నున్నవి. కాబట్టి యేపరీక్షయు దప్పకుండ నెగ్గుచుండెను. తుద కింటరుపరీక్షలో రెండవ తరగతిలో గృతార్థుడై మదరాసు వైద్యకళాశాలలో బ్రవేశము సముపార్జించెను. కాకినాడలో నాతని తండ్రి తన తెలివితేటలచే కుటుంబవ్యయమునకు సరిపడ పంపాదించుకొనుచు, భూమివలన వచ్చురాబడిని నిలువ వేసుకొనుచు, చిన్న చిన్న పద్దులమీద వడ్డీవ్యాపారము సలుపుకొనుచు కాలము బుచ్చినాడు. నేడు తన కొమరునకు మదరాసు వైద్యకళాశాలలో ప్రవేశము దొరకుట యాయనకు జాల సంతోషముగా నుండెను.

రాజారావు 'స్కూలుఫైనలు' పరీక్ష చదువుచుండినప్పుడే మంచిసంబంధ మొకటి వచ్చినది. పెండ్లి వైభవముగ జరిగినది. రాజారా వింటరుపరీక్షకుబోవుటకుముందే యాతనికి బునస్సంధానము జరిగినది. వైద్యవిద్యార్థియైన ప్రథమ సంవత్సరములోనే యుభయవంశ పావనియగు కూతురు పెన్నిధివలె జనించెను.

రాజారావునకు నారాయణరావునకు చెన్నపట్టణములో స్నేహమేర్పడినది. చిన్నతనములో రాజన్నశాస్త్రియగు నేటి రాజారావు సహజత్రపాశీలుడు. పదిమందితో స్నేహముచేయలేడు. క్రొత్తవారితో మాటలాడలేడు. చిన్నతనమున గాకినాడలో పెద్దలతో నెట్లుమాట్లాడెనో యెట్లు వేతనము సంపాదించుకొనెనో, పెద్దవాడైన రాజారావునకు గ్రాహ్యముకాలేదు. నారాయణరావు సహజధీరస్వభావుడుగాన సభాకంపమెఱుగడు. రాజారావు పిరికివాడు. సభలో నోరెత్తలేడు.

అట్టి రాజారావును, నారాయణరావు కోమలవిలాస కాఫీ 'హోటలులో' జూచినప్పుడు పలుకరించెను. ఆనాటినుండి స్నేహసముద్రుడైన నారాయణరావు, రాజారావు గదికి వెళ్ళుట ప్రారంభించియు, సినిమాలకు దీసికొని వెళ్ళియు, కాఫీ హోటలులో దన స్నేహితులకు విందులిచ్చినప్పుడు రాజారావునుగూడ లాగుకొని యేగియు, నాతని హృదయమును జూరగొని యించుకించుక బెదరుదీర్చినాడు.

రాజారావునకు దెలుగు కవితయందలి నేటి క్రొత్తపోకడలు రుచింపవు. స్వయమాతడెద్దియు రచింపనేరడుగాని పురాణములు చదువుకొనుటయన బరమప్రీతి.

వేదాంత గ్రంథములన్న ప్రాణమే. వివేకానంద రామతీర్థులు, అరవిందఘోషు జ్ఞానానంద ప్రేమానంద రాధాకృష్ణులు మొదలగు తత్వజ్ఞులువ్రాసిన గ్రంథములన్నియు బూర్తిగా జదివినాడు. చైతన్యుడు, రామకృష్ణ పరమహంస, హరనాధబాబా, రాధాస్వామి సత్సంగగురువు మొదలగువారి చరిత్రములు, బోధలు చదివినాడు.

నారాయణరావుగూడ వేదాంత విచారమున నత్యంత ప్రీతిగలవాడు. అతడు మన పురాణేతిహాసములేగాక, వేదములు, బ్రహ్మసూత్రములు, గీత, సాధు నిశ్చల దాసయోగింద్రుని విచారసాగరము, వృత్తిప్రభాకరముగూడ పఠించినాడు. యోగ వాసిష్ఠము, జ్ఞానవాసిష్ఠము, సీతారామాంజనేయ సంవాదము, అధ్యాత్మరామాయణము, ఉపనిషత్తులు, శంకరభాష్యము, పంచదశి మున్నగు తత్వవిచారగ్రంథముల సార మెఱింగినవాడు. మధ్వరామానుజమతముల పరిచయము సంపాదించినాడు. బుద్ధ పీఠకములు, జాతకకథలు, ధర్మపథము పఠికించినాడు. జెండవిస్టా, ఖురాను, బైబిలు, జైనసాంప్రదాయములు నవగతము చేసుకొన్నాడు; కారలుమార్క్సు, నీషే, షోపనహోరు, బెర్కిలీ, ఎమర్సన, బాకను, హల్డేను, ఎడ్వర్డు కార్పెంటరు, టాల్స్టాయి, రోలండు, బెర్నార్డుషా, ఎయిన్స్టేన, ఎడింగ్టన, ప్లాటో, అరిస్టాటిల్ మొదలగు పాశ్చాత్యవేత్తలభావములు హృదయస్థము చేసికొనెను.

నారాయణరావు రాజారావుతో నెల్లప్పుడు వేదాంతవిషయముల జర్చచేయుచు నానందము నొందును. రాజారావు తన జన్మమున నా నిమేషములే శుభముహూర్త ములని తలచి నారాయణుదాక కెదురు చూచుచుండును.

'మన ఆర్షవిజ్ఞానం ముందు 'డార్విన్' సిద్ధాంతాలు బాలశిక్షలవంటివోయి! ఆతని పరిణామవాదం కేవలం భౌతికం. వినికీ, చూపూకూడా లేని కీటకాలుందేవట ఆదిలో, పిమ్మట దృష్టి శ్రవణాది జ్ఞానంగల సరీసృపాలు ఏర్పడినవట. అపైని, పాలిచ్చే జంతువు లేర్పడి, క్రమంగా, కొంచెం మెదడు సంపాదించుకొని కోతులై, చివరకు మనుష్యులుగా పరిణమించినవట. జంతుకోటిలో యీ మెట్లన్నీ కనబడు తూనే వున్నాయట, ఈ మాత్రం కనిపెట్టినందుకు డార్విన వాళ్ళకొక ఋషి అయి పోయినాడు' అని రాజారావు.

'నిజమే. కాని, అనంతంగా కనబడే యీ సృష్టిలో ఒక క్రమవిధానాన్నీ, వికాసాన్నీ, పరిణామధర్మాన్నీ దర్శించి చెప్పగలగడం కూడా సామాన్యవిషయం కాదు. పురాణాల్లో చెప్పబడ్డ సర్గవిధానాన్ని విచారణచేసి, అంతరార్థం గ్రహించకుండా గుడ్డిగా ఆ ముసలమ్మ కథలనే నమ్మడంకన్న, ఆ కథల్ని కార్యకారణ సమన్వయా లతో ప్రమాణీకరించడం మంచిదంటావా, అనవా? అతీంద్రియజ్ఞానంగల మన ఋషులు చెప్పిన గంభీర సత్యాలకు, వాళ్ళు పరిశోధనాపూర్వకంగా ప్రత్యక్ష ప్రమాణా లతో వ్యాఖ్యానం చేస్తున్నారు' అని నారాయణరావు.

రాజా:—కావచ్చును. కాని కేవల ప్రత్యక్ష ప్రమాణం ఎంతవరకు ఉపయోగిస్తుం దంటావు.

నారా :—అలాకాదు. వాళ్ళుకూడా ప్రత్యక్షంనుంచి అనుమానాన్ని సాధిస్తున్నారు గాని ప్రత్యక్షంతో ఆగిపోవడంలేదుగదా.

రాజా :—నిజమే. ప్రకృతివిషయం ఇంద్రియగ్రాహ్యం, బుద్ధిగ్రాహ్యమూగనక, ఆ రహస్యం సాధిస్తారనుకో, బుద్ధికూడా మొదటి మెట్టులోనే వుంటుందిగాని, పైకిదాటిపోలేదు. బుద్ధికిగూడా గ్రాహ్యంగాని, ఆత్మానుభవైకవేద్యమైన పరతత్వం మాట ఏమంటావు?

నారా :—ప్రత్యక్షానుమానాలని కూడా గ్రహించని అంధవిశ్వాసం, శుష్కతర్కమూ కంటె వాళ్ళబుద్ధి వ్యవసాయం ఉత్తమమంటాను. వాళ్ళ నిరంతర పరిశోధనలవల్ల 'అటం' అనే మూలపదార్థాన్ని పట్టుకొన్నారు. ఇంకా లోతుకుపోయి అటంకూడా 'ఎలెక్ట్రాన్ల' సంఘాతమని గ్రహించారు. అయితే నువ్వనేది, ఈ యెలెక్ట్రాన్లు కూడా అనిత్య పదార్థాలే కాని నిత్యాలు కావుగదా. ఈ అనిత్యాలను పట్టుకొని ఎన్నాళ్లు ప్రాకులాడినా నిత్యమైన సత్యపదార్థాన్ని చేరలేదంటావు. సరే బుద్ధిమార్గాన్న పోగలిగినంతదూరం పోయినతర్వాత అక్కడ దారి దొరక్కపోతే ఇది కాదురా అని వాళ్ళూ మన దారికే వస్తారు. పరమాత్మసాధనలో వాళ్ల ప్రతిపదమూ అనుభవసిద్ధం చేసుకొంటున్నారు. ఇప్పుడిప్పుడే వాళ్ళుకూడా ఇది బుద్ధిగ్రాహ్యం కాదురా అని తెలుసుకొని, దూరదూరాన అఖండజ్యోతిని దర్శిస్తున్నారు. అప్పుడే 'ఎయిన్‌స్టీన్', 'ఎడింగ్టను' వంటి సాధకులు బయలుదేరారు. పూర్వం మనవాళ్ళెప్పుడో ఆ నిత్యపదార్థాన్ని యోగసాధనలచేత చేరారు. ఇప్పుడా మార్గాలన్నీ చీకటితో నిండి దుర్భేద్యాలుగా వున్నాయి. పాశ్చాత్య సాధకులు తిరిగీ విజ్ఞానదీపం వెలిగించి ఆదారికోసం వెదుకుతున్నారు. వాళ్ల సంపాదించిన విజ్ఞానమార్గంలో దానికి రాచబాటచేస్తున్నారు. అంతేకాని, మావాళ్లకు ఇవన్నీ పూర్వమే తెలుసునంటూ మనం చంకలు గొట్టుకుంటూ కూచుంటే, మనం యిక్కడే వుంటాం. వాళ్ల పురుషకారపరులు, మనం పండితమ్మన్యత్వంచేత తమస్సులో పడివున్నాము.'

ఇట్టి చర్చలు తరుచు జరుగుచు, రాజారావు నారాయణరావుల మైత్రికి దోహదము సల్పుచుండెడివి.

రాజారావు ప్రపంచములో దిరుగనేర్చిన వాడుకాదు. మిత్రులతో గలసిమెలసి తిరుగక వేఱుగా నుండును సహాధ్యాయినులగు యువతులను మోమెత్తిచూడడు. జుట్టు కట్టు మున్నగు వేషభాషలలో నాతడు శుద్ధశ్రోత్రియుడు. వేషధారులగు తోడి నాగరిక విద్యార్థు లాతనిగాంచి పల్లెటూరి సరుకనియు, ఛాందసుడనియు లోలోన నవ్వుకొనుచున్నను, సహాధ్యాయిను లాతనిని వింతమృగమువలె జూచుచున్నను, రాజారావా పెదవి విరుపులను, అవహేళనములను సరకుగొనక సంచరించెడివాఁడు.

ఆతనితో గాఢపరిచయమున్న కతిపయ మిత్రులు మాత్రమాతని సరళ హృదయము, వినయశీలము, మధురస్వభావము, గార్యదీక్షయు నెఱింగి యాతని నెంతయు ప్రీతిమై మన్నించుచుందురు.

## ౨౧

## నౌ కా వి హా ర ము

నారాయణరా వత్తవారింట మనుగుడుపులు గుడుచు మూడవరోజున నాతని యుత్తరముల ప్రకారము రాజారావు, పరమేశ్వరమూర్తి, లక్ష్మీపతి వచ్చినారు. జమీందారుగారు, నాడు తాను రైలులోచూచిన మిత్రులందరిని యల్లునితోదాటు మనుగుడుపు లన్నినాళ్లు తనయింట విందులకు రండని ఆదర పూర్వకముగ నాహ్వానించెను. ఆ విధమున నల్లునిచేగూడ వారికి వ్రాయించెను.

ఆరోజంతయు రాజేశ్వరరావుగూడ వారితో గడపెను. చిత్రలేఖనవిద్య పూర్తిగావించి నిరుద్యోగియై కాలము గడుపు పరమేశ్వరమూర్తి తనకు గురువగు అవనీంద్రుడు పంపిన యుత్తరము స్నేహితులకు జూపించెను. 'పొట్టకై ఎవరికో శరీర మమ్ముకొని, కళారాధన మొనర్ప నెంచిన వారికి కళాసరస్వతి సాక్షాత్కరింపదు. కళాధిదేవతనే నమ్ముకొన్నచో పొట్ట గడువకపోదు. నీకష్టమంతయు కళకే ధారబోసిననాడే నీవు కళాప్రతిష్ఠలతో పేరుగాంతువు. ఉద్యోగము లేకపోయె నని చింతింపకుము. నీవు అదృష్టవంతుడవు. గావుననే యీవిధముగా నీకు గళారాధనకు గావలసినంత సావకాశములభించినది. కళాస్రష్టవగుట కిదియే సమయము. కళారాధకుడవై లోకారాధ్యత గడించుకొనుము.

'నీకు సహాయమొనరించుపట్ల నే నేమాత్రము శక్తిపంచన చేయనని యెఱుగుదువు. ఒక్కసారి దేశ సంచారముచేసి, ప్రకృతిలోని బాహ్యాభ్యంతర సౌందర్యముల దిలకించిరమ్ము. ప్రకృతికంటె మంచి గురువు నీకెచ్చటను లభింపదు. విశ్వస్రష్ట కళానైపుణితో మానవ కళావిలాసము పోల్చి చూచుకొనుము. అంతియే కాని విషాదయోగము పాల్పడకుము, ధీరుడవుకమ్ము. నీవు నాదగ్గర దిగవిడిచివెళ్ళిన చిత్రములు రెంటిని నా స్నేహితులుచూచి సంతోషించి, కొనిపోయినారు. వారు సొమ్మిచ్చిన వెంటనే నీకు పంపుదును.'

ఈ యుత్తరము నారాయణరావు చూచి యాలోచనా నిమగ్నుడయ్యెను. ఆంధ్రదేశమునందే లలితకళయు వృద్ధియగు నుపపత్తులు కానరావు. ఏనాడు చక్రవర్తులు, మహారాజులు కాలగతులై మాయమయిరో యానాటితో నాంధ్రదేశ సౌభాగ్యము మన్నయినది యని యాత డనుకొనెను.

రాజే:—ఒరే పరం! ఏదో స్నేహితుడవు, వేస్తున్నావు! నువ్వుచెప్పిన ముక్కల్లా సరే అని ఊరుకున్నాము. నా కెప్పుడు తిన్నగా అర్థం అవలేదు; ఏమిట్రా మీ బొమ్మలవిషయం. ఆ పొడుగాటి వేళ్ళేమిటి? చచ్చిపోయిన వాళ్ళకులాగ

ఆకళ్ళేమిటి ? ఆ వంకరటింకర మనుష్యులేమిటి, ఆ విపరీతపు రంగులేమిటి? ఏమిటీ బెంగాలు సాంప్రదాయం ?

పరం :—అయితే చిత్రలేఖన ఎల్లా ఉండాలంటావు.

రాజే :—ప్రకృతి ననుసరించి ఉండనక్కరలేదట్రా ?

నారా :—అంటే నీ ఉద్దేశం ఏదో విపులిం జేసి చెప్పరా.

రాజే :—రవివర్మ బొమ్మలు తీసుకో ! వాటిల్లో మనుష్యులు మన మనుష్యుల్లా ఉన్నారు.

లక్ష్మీపతి :—కళ సృష్టేకాని అనుకరణంకాదు. అని కాదు మీ యిద్దరూ అనేది నారాయణా !

నారా :—అవును బావా; రవివర్మ మహావిష్ణువుకు, శివుడికీ నాలుగుచేతులు ఉన్నట్లు చిత్రించాడుగద. అల్లా ప్రకృతిలోఉన్నాయా ? లేవు. మఱి ఎందుకువేశాడు? పోనీ పాశ్చాత్య చిత్రలేఖకుణ్ణి తీసుకో 'రాఫెలు' రెక్కలతో ఎగిరివచ్చే దేవమూర్తుల్ని చిత్రించాడు. మనుష్యులకు ఎక్కడైనా రెక్కలుంటాయా ?

పరం :—రవివర్మ వేసిన కృష్ణుడు, చెట్లు, రాళ్లు, యమునానదీ నిజంగా సృష్టికి అనుకరణాలు కావు.

రాజే :—ఆయన ఊహచేశాడు.

లక్ష్మీ :—ఓరి వెఱ్ఱివాఢా ! అదేరా సృష్టి !

రాజే :—మఱికొందరు చిత్రకారకులు దృశ్య చిత్రాలంటూ, ఏ పాపికొండలో, గోదావరో, కృష్ణానదో చూచి అదేరకంగా వేస్తారుగదా అవి సృష్టా, అనుకరణమా ?

పరం :—అవి ఏవీ కావురా.

నారా :—ఎందుకంటే ? ఒకడు గోదావరిమధ్యకు వెళ్ళిచూస్తే ఎటుచూచినా నీరే కనపడుతుంది. అందుకని ఆనీరే పటంనిండా చిత్రిస్తాడు. అది గోదావరవుతుందా ? అలాగే ఒక పర్వత పాదాన ఎదురుగా నిలుచుండి తన కళ్ళ యెదుటనున్న ఆ రాతిగోడనే చిత్రిస్తే అది పర్వత మవుతుందా ? కాదు కాబట్టి దృశ్య చిత్రాల్లోకూడా దేశకాల పాత్రాల్ని వరించాలి.

రాజే :—సరే! బొమ్మవేయాలంటే ఏం జేస్తాడురా చిత్రకారుడు?

నారా :—ఏ చిత్రంలోనైనా ప్రధానంగా భావపూర్ణత వుండాలి.

పరం :—ఆ భావం రమణీయంగా వుండాలి.

లక్ష్మీ :—అందుకనేగా 'సౌందర్యమే ఆనందము' అని గానం చేసాడు 'కీట్సు?

రాజారావు :—లక్ష్మీపతి ! ఉండు, వాళ్ళిద్దరూ ఏదో చెప్తున్నారు. వొకమోస్తరుగా ఇంతవరకూ వాళ్ళవాదన శాస్త్రపద్ధతిగానే ఉంది.

లక్ష్మీ :—ఆ పద్ధతులన్నీ మద్దవతులయ్యాయిరా కుఱ్ఱవాళ్లు ! మద్ధవతులంటే మదవతులేగా ?

రాజా :—నీకు ఎన్ని చెప్పినా, మన బ్రతుకు వేళాకోళం కాదోయి బాబూ అంటే, ఏమీ తెలియదేమిటి నాయనా !

లక్ష్మీ :—నేను వేళాకోళంగా బ్రతుకుని చూస్తున్నానురా రాజేశ్వరుడూ : చాలా తీక్ష్ణంగానూ తీవ్రంగానున్నూ చూస్తున్నాను ! కాని ఆ బ్రదుకెక్కడా నాకు కనపడదు.

రాజే :—నువ్వుకూడా మా సంఘంలో జేరరా మరి.

నారా :—మీ సంఘం, ఒక బౌద్ధ సంఘారామం వంటిదిరా మరి. భిక్కులు, భిక్కిణీలు, జీవితం, ఆనందం, బాగుందోయి.

రాజే :—అసలు నే నడిగిన విషయానికి మీ రిద్దరూ జవాబియ్యలే దేమిటిరా ?

పరం :—కళ మనుష్యసృష్టి అనేనా ఇంగ్లీషులో అర్థం ?

రాజే :—అవును.

ఇంతలో జమీందారు గారా ప్రదేశమునకు వచ్చినారు, ఆయన స్నేహితులందరిని తన చిన్న లాంచిలో గౌతమీ విహారమునకు దీసికొనివెళ్ళినారు. ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్ర మావశ్యకమా కాదా యను చర్చ వచ్చినది. రాజేశ్వరరావు, లక్ష్మీపతియు నాంధ్రదేశమునకు ప్రత్యేకరాష్ట్ర మావశ్యకమని వాక్రుచ్చినారు. రాజా రావామోదించినాడు,

నారా -దేశమునకంతా స్వరాజ్యంతెచ్చే ప్రయత్నాలు మాని, ఆంధ్రరాష్ట్రంమాత్రం తెచ్చే ప్రయత్నం, నేను ఆమోదించను. ఎందుకంటారా, యావద్దేశబంధమోక్షానికి పాటుపడవలసిన ఉత్కృష్ట వ్యక్తులకు ఆంధ్రసమస్య సైంధవుడులాగ అడ్డు అవుతుంది. దేశపరిపాలన చేతికి వచ్చినతర్వాత మీ చిత్తము వచ్చినట్లు భాషనుబట్టో మరొకదాన్నిబట్టో రాష్ట్ర విభజన చేయడం సులభం. అనవసరపుఖర్చులతో నెత్తి బలువయిన యీరోజులలో రాష్ట్రవిభజనచేస్తే ఖర్చుకు డబ్బుండక భాగింపబడ్డ రాష్ట్రాలన్నీ దివాళా రాష్ట్రాలయితే ఏమి లాభం.

జమీందారుగారు :—స్వరాజ్యము అంటే నీ ఉద్దేశం సంపూర్ణ స్వాతంత్ర్యమనేనా ?

నారా :—ఏదైనాసరేనండి. సంపూర్ణస్వాతంత్ర్యత వచ్చినాసరే. లేదా, ఆస్ట్రేలియా కెనడాల వలె డొమినియను ప్రభుత్వము వచ్చినాసరే, ఏదివచ్చినా ఆదాయ వ్యయాలు సంపూర్ణంగా మనచేతుల్లోకివస్తే రాష్ట్రవిభజనలు మనకు సులువుగా అవుతవని ఉద్దేశం.

జమీం :—కాని ఈలోపుగా, మనవాళ్ళకి జరిగే అపరిమితమైన నష్టం సంగతి ఆలోచించు. అరవవాళ్ళవే గొప్ప ఉద్యోగాలన్నీ. అరవదేశంకోసం డబ్బు ఖర్చయినంత తెలుగుదేశ లాభానికి ఖర్చగుటలేదు.

నారా :—కాని రామారాయణంగారు మొదలగు తెలుగువారే మంత్రిత్వాలు నడుపుతున్నారు, నెమ్మదిగా నెమ్మదిగా పెద్ద ఉద్యోగాలలోకూడా మనవాళ్ళు చేరు

తున్నారు. ఒక పదిసంవత్సరాలపాటు మనం తొందరపడకుండా స్వతంత్ర సంపాదన దీక్షవహిస్తే, స్వతంత్రంతో అన్నిచిక్కులు మంచువిడిపోయినట్లు విడిపోవునని మనవి.

జమీం :—నే ననేది మన దేశానికి ప్రస్తుతం సంపూర్ణ స్వాతంత్ర్యము రాదని, వచ్చినా మనకు చాలా నష్టం. సంపూర్ణస్వాతంత్ర్యము రాకుండా డొమిని యను ప్రభుత్వం వచ్చేటట్లయితే మనం రాష్ట్రవిభజనకోసం చేసే ప్రయత్నా లన్నీ 'డొమినియను' ప్రభుత్వం వచ్చేందుకు ప్రయత్నాలవుతవి. పైగా కాంగ్రెసు తరపున గాంధీగారి ననుసరించి పని చేసేవాళ్లు ఏకారణంవల్లను ఇతర వెల్లువలలోపడరు. వాళ్ళమార్గం రాజమార్గమే. ఇక నాబోటివాళ్ళు: - మాకు గోఖ్లేగారి మార్గమే. ఏ పద్ధతులు మాకు నచ్చవు. నచ్చక ఇక ఏమి చేయము? ఈ పనులు మేము చేస్తాము.

నారా :—చిత్తం.

లక్ష్మి :—మావాడు, మనకు ఆంధ్రరాష్ట్రం ఆంధ్ర విశ్వవిద్యాలయం, ఆంధ్రహైకోర్టు అన్నీ కావాలనేరకమేనండి. ఆంధ్రప్రతిభ, ఆంధ్రపౌరుషము, ఆంధ్రవిజ్ఞానము తలుచుకు తలుచుకు పరవశుడౌతాడు. నేడు ఆంధ్రదేశ దురదృష్టంవల్ల ఆంధ్రులెవ్వరూ ఏ విషయంలోనూ ఆంధ్రదేశంలో ఉన్నంతకాలం పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవటంలేదని విచారిస్తాడు.

పరం:—ఆ! ఆంధ్రదేశానికి కుజుడో శనో రాజ్యంచేస్తూ ఉన్నాడు. లేకపోతే, పూర్వకాలంలో కోటీశ్వరులున్న దేశంలో నేడు పది లక్షలున్న సాహుకార్లు రుదు. మహారాజులు కవితాపోషకులై కృతులుగొన్న కాలంపోయి కవిత్వం పేరుచెప్పితే నిరసించే దిక్కుమాలిన కాలం వచ్చింది. అమరావతిలో నాగార్జున మెట్టలో, ఒరంగల్లులో, హంపీలో, మహాబలేశ్వరంలో విరిసిపోయిన శిల్పం నేడు నామమాత్రావశిష్టం అయింది. ఇంక ఎవరికైనా పేరొచ్చిందిఅంటే దేశం విడిచివెళ్ళారుగనుక, విశ్వదాత నాగేశ్వరరావుగారు, ఆచార్య రాధాకృష్ణగారు, నాగపురంలో లక్ష్మీనారాయణగారు, నియోగిగారు, చిర్రావూరి యజ్ఞేశ్వరచింతామణిగారు దేశాలు విడిచివెళ్ళి, మహోన్నతపదవులకువెళ్ళారు. బొంబాయి రామారీలని, రంగూనులో గౌడరెడ్లని, నాగపురంలో నాయుళ్ళనీ ప్రఖ్యాతిగన్నవారంతా యిలా తెలుగుగడ్డ విడిచివెళ్ళినవారే.

రాజేశ్వరరావు:—జిడ్డు కృష్ణమూర్తిగారో?

పరం:—అవును. ప్రపంచ విఖ్యాతిగన్న మహాజ్ఞాని.

రాజే:—తర్వాతవారిలో, పండిత వంగల శివరాము, పున్నయ్యగారు. ఇంకా ముఖ్యులు ఇంజనీరు విశ్వేశ్వరయ్య, దివాను నాగుమయ్య.

పరం:—అదేనండి! చిన్నచిన్న వాళ్ళైనకూడా దేశం విడిచిపోతే మన ఆంధ్రులు బయటికి వస్తారండి! దామర్ల రామారావు చూడండి!

లక్ష్మీపతి:—ఆంధ్రదేశం వదిలితే అరవ గ్రహబాధవదిలి పైకివస్తారో, యి పరమేశ్వరం.

జమీం:—పరమేశ్వరమూర్తిగారూ! మీరుచెప్పినదానిలో సత్యం ఉన్నట్లే తోస్తున్నది. కారణం మీరు చెప్పింది కాకపోవచ్చును. యశం సంపాదించుకోవాలంటే మనం మనదేశమేకాదు మద్రాసురాష్ట్రం విడిచిపోవాలండీ! అయితే పరమేశ్వరమూర్తిగారు! మీరు కలకత్తాలో ఎన్నాళ్ళు అవనీంద్రునిదగ్గిర చిత్రలేఖన నేర్చుకున్నారు?

పరమేశ్వర:—బి. ఏ. కలకత్తాలో చదవడానికివెళ్లాను. పాలీ, సంస్కృతం పుచ్చుకొని "అర్కియాలజీ" శాఖలో చేరుదామని ఉద్దేశం. అప్పటికి నాకు ఇష్టమైనది రామారావుగారి సంప్రదాయమే. నేను ఇంటరు తరగతిలో చదివిన రెండేళ్ళు ఆయనదగ్గర చిత్రలేఖనం నేర్చుకున్నాను. నా బొమ్మలు రెండు బొంబాయిలోను, ఒకటి చెన్నపట్టణంలోను అమ్ముడైనాయండి. తర్వాత కలకత్తావెళ్ళి, బి. ఏ. చదువుతూ, అవనీంద్రబాబు పాదాలకడ చిత్రలేఖనానికి దీక్ష వహించాను.

లక్ష్మీ:—అప్పుడువేసిన కొన్ని చిత్రలేఖనాలకు ఇంగ్లండు, 'వెంబ్లీ' లో కూడా ప్రఖ్యాతివచ్చిందండి మా పరమేశ్వరునికి. ఆస్ట్రేలియాకు వెళ్లినది ఒకబొమ్మ. ఆ రోజుల్లో పరమేశ్వరుని బొమ్మలెన్నో కలకత్తా ప్రదర్శనములో అమ్ముడయ్యాయి.

జమీం:—మీరిప్పుడు వేసినబొమ్మ లేవేనా ఉంటే నాకోబొమ్మ ఖరీదువేసి పంపించండి. ఖరీదుకు వెరవకుండా మంచి పెద్దరకమే పంపండి. మరీ చిన్నరకము పంపకండి. నా గ్రంథాలయం గదిలో కొన్ని బొమ్మలుకొని, పెట్టవలెననివున్నది. నారాయణరావూ మీరూ ఆలోచించి పంపించండి.

రాజే:—నారాయణరావు పరమేశ్వరుని బొమ్మలు నాలుగుకొన్నాడు. అతనికడ గొప్పచిత్రాలు ఉత్తమ చిత్రకారులవి యిరవైయున్నాయండి.

ఇంతలోకూడ వచ్చిన గుమాస్తా 'బాబుగారు! ఏడుగంటలయింది, పడవ తిప్పమని సెలవా?' అని వినయముగా జమీందారుగారి నడిగెను. రాజేశ్వరరావు 'ఓహో యీగాలి! గోదావరి సముద్రంలా ఉన్నదే కెరటాలతో' అని పాదములు నీటిలోనికి వ్రేలవైచెను.

## ౨౨

## గౌతమి

'శీతే సుఖోష్ణ సర్వాంగీ, గ్రీష్మేతు సుఖశీతలా, భర్తృయుక్తాచయానారీ సా భవేద్వరవర్ణినీ' నిజముగ నీ గౌతమీస్రవంతి వరవర్ణినియె. గౌతమి మాతవలె, సోదరివలె, ప్రియభామినివలె తనకు జల్లనై, స్నిగ్ధమై, అనురక్తయై తోచుచుండు టేలనో! ఆ నిర్మలవినీలనీరములలో నురికి, దేహమెల్ల నామె గౌగిలింప దన

హృదయమూలములకు నామె ప్రేమ చొచ్చుకొనిపోవ, నీటిలోని మత్స్యమై, యానీల జలములోనికణమై యైక్యమైపోయి తేలియాడుచు, మునుగుచు, బాహువులు సారించి యీదుచు, నీ గౌతమీ బాలికతో నాత డాడుకొన్నాడు. ఆమె కెరటాలతో పందెము వైచినాడు. లోతులలో మునిగి కన్నులు తెరచి, సూర్యకిరణములు చొచ్చుటచే గరుడపచ్చలయిన యా గాంభీర్యమున విస్తుపోయినాడు. ఆమె హృదయమున దన సర్వాంగ చైతన్యము నుపసంహరించి తరుశాఖవలె తేలినాడు. ఉబికిపోవు నామె వక్షములతో ఎన్నిసారులో చంటిపిల్లవానివలె నాడుకొన్నాడు. గౌతమీ దేవిలోని యనిర్వచనీయమగు నానందము తన యంతరాంతరముల జొచ్చుకొన నామెలో దాను లీనమైనాడు.

నారాయణరావీ యాలోచనలతో గన్నులరమూతలైపోవ నానందమయు డైనాడు. వారి లాంచి కొవ్వూరు లంకకడ నాగినది. వారందరు లంకలోదిగి, యా యిసుకతిన్నెలలో నధివసించి మంతనములు సలుపుకొనుచుండిరి. నారాయణరావు గౌతమీసమాహూతుడై బిరబిర లాల్చినివిప్పి, యద్దానిని, యుత్తరీయమును సేవకున కందిచ్చి, కట్టినవస్త్రము వెనుకకు విరిచికట్టి నీటిలోనికి బయిగిడినాడు. ‘ లోతులుం డును. జాగ్రత్తసుమీ ’ యని జమీందారుగారు హెచ్చరింప, స్నేహితులందరు ‘ నారాయణరావు గజయీతగాడని ’ ధైర్యముచెప్పి తాముగూడ నీటిలోనికి దిగిరి. ఒక్క రాజారావునకు మాత్రము ఈత రాదు. అతడొడ్డుననే చంటిపిల్లనివలె నీటిలో చేతులు తట్టుచు వినోదించుచుండెను.

గౌతమీ మాత కింకను వరదలురాలేదు. నిర్మల వినీలజలములతో నామె యొక మహాసరస్సువలె నున్నది. గోపీచందనపు బూతలవలె నిసుక తిప్పలచ్చ టచ్చట తలలెత్తికొనియున్నవి. దూరాన పాపికొండలు స్పష్టనీలలోహితములగు తమ శిఖరముల నా సంధ్యారుణరాగార్ద్రగగనములోనికి జొనిపి యానందించు చున్నవి. పశ్చిమమున లోహిత హరిద్రావర్ణ వికాసమై, మధ్య కర్పూరరాగపూరితమై, దిశాంచలముల నవ్యక్తారుణచ్ఛవీ సుందరమై యాకాశము హృదయమును ద్రవింప జేయుచున్నది. కెరటములహోరు షడ్జమమై, వాయుప్రసారము రిషభమై, పక్షుల కలకలారావములు పంచమమైపో ప్రకృతి మాత మధుర సంగీతమున జొక్కు చున్నది.

పరమేశ్వరమూర్తి నెమ్మదిగా తేలియాడుకొనుచు రాజారావుకడకు వచ్చి, ‘ ఓ ముగ్ధబాలుడా ! చూడవోయి యీ ప్రకృతి యందం ! నీలో నిద్రాణమైయున్న కవితాశక్తి మేల్కొలుపవోయి ! ఇందులో కరిగి మరిగి లీనమైపోవోయి ! నాట్యాయుడు అడుగో శివమెత్తి ఆడుతున్నాడు. వేయితీపులు నాలో ఒక్కసారిగా తలలెత్తుతున్నాయోయి ’ అనుచు హృదయము నొలుకవోసికొనియెను.

జమీందారుగారి చూపు లన్నియు నీటిలోనుంచివచ్చు సుందరమంజు శ్రీ మూర్తియగు నల్లుని మీదనేయున్నవి. విశాలాంసలుడై విపులవక్షుడై, గోమూర్ధ

కటిసుందరుడై, అల్పమధ్యముడై, గంభీర వదనుడై, ఉన్నత శరీరుడై, జలక్లిన్న ప్రకాశోజ్జ్వల హరిద్రరోహిత వర్ణుడై నీటిచుక్కలు ముత్యములవలె రాలుచుండ గట్టునకువచ్చి తడియార్చు కొనుచుండిన యల్లునిచూచిన యాయనకన్నులు చెమర్చినవి. ఈ బాలకు డవతారమూర్తి యన్ని యుబ్బిపోయినాడు. యమునాతీరము, బృందావనము, శ్యామసుందరుడు నాయన మనోవీధి దటుక్కున మెఱసి గోపికాభావ మాయన నావహించినట్లయినది.

రాత్రి యెనిమిది గంటలకు వా రంద రింటికి జేరినారు.

వారు గృహమధ్యశాలకు వచ్చునప్పటికి, అచ్చటి 'సోఫా' లపై జగన్మోహనరావును శారదయు దగ్గరగా గూర్చుండి మాటలాడు కొనుచుండిరి. శారద కిలకిల నవ్వుచుండెను. జగన్మోహనరావు మోము దరహాస ప్రఫుల్లమైయున్నది. వీరు లోన నడుగిడగనే శారద త్వరితముగలేచి లోనికి జివ్వున పారిపోయినది. జగన్మోహనరావు మోమున గ్రోధచ్ఛాయ లించుక పొలసి తొలగిపోయినవి. శారద లేచిపోవుట, ముందువచ్చిన జమీందారుగారికి నారాయణరావుకు మాత్రమే కన బడెను. జమీందారుగారి హృదయమునం దొకవిధమగు జుగుప్స జనించెను. మెరుపు వలె మెరసి మాయమయిన శారదాబాలిక నారాయణరావు గుండియలోఁ బాటపాడినది.

శారదపై నారాయణరాయని ప్రేమ నానాటికి గట్టలొరసి యఖండ గౌతమివలె పొరలిపోవుచున్నది. అత డందు మునకలిడుచు దేలియాడుచున్నాడు. వెడదలై, అర్ధనిమీలితములగు శారదా నయనము లాతని గలంచివైచుచున్నవి. అతని ఇరువది రెండేండ్ల వయసు ముమ్మరము సలసల వెరలియాడుచున్నది.

వయసులోనున్న స్త్రీ పురుషుల కొండొరులపై జనించు నీ వలపునకర్థ మేమో! చిన్నతనమున నొకచో బెరిగి యాటలాడుకొను బాలికా బాలకులకు మాత్రము ప్రేమలేదా? అవ్యక్త మధురము, సరళమునగు నా ప్రేమకూడ వియోగ మును సహింపదు. ఆ బాలికా బాలకు లిర్వురు నెప్పుడు గలసియుండ గోరుదురు. ఒండొరులు భుజములపై చేతులిడుకొని తిరుగుచుందురు. ఆ యాట పాటలందే, ఒకరినొకరు, 'ఏమోయి' యని నోరార బిలుచుకొనుటయందే వారికి దృప్తి. వారికి బరస్పర సౌందర్యముతో బనిలేదు. వారిరువురకు యౌవనోదయ మగుట తోడనే ఆ స్నేహము వలపుగా బరిణమించుటేలనో? వారి పల్కులు, చూపులు, చేతలుగూడ నూత్నవికారమును బొంది క్రొత్త తలపులు రేకెత్తించు టేలనో! అట్టి చిననాటి మిత్రుల యౌవన మొండొరులయందు వివాహముచే జరితార్థము కాని నాడు వారి జీవితములు దుఃఖభాజనములై పోవుట వినుచుందుము.

అవ్యాజమధురమగు నా చిననాటి స్వచ్ఛ ప్రేమమే తారుణ్యోదయమున కామావతార మెత్తనేల? ప్రాణిధర్మమగు నీ కామమునకుదోడు సౌందర్యలాలస యేటికో? అట్లని సుందరియగు ప్రతియువతిని ప్రతిపురుషుడును కామించునా? రతీచ్ఛవినా దేహసంశ్లేష మాత్రమున దృప్తిచెందు కామముండునా? తా నింతకు

మున్నెందరు సౌందర్యవతులను గాంచియుండలేదు? అట్టివారెల్ల తన హృదయమును జూర గొనరైరేల? ప్రథమదర్శన మాత్రముననే శారదపై దనకు జనించినది ప్రేమమా, కామమా? అపరిచితయు నజ్ఞాతయౌవనయునగు నీ శారద తనకు భార్య యైనంతమాత్రమున తన దేహమనఃప్రాణము లామెకై యిట్లు తహతహ జెందనేల? దీనిని జననాంతర సౌహృదమందునా? లేక దాంపత్యమే యనవలయునా? నా యీ చిన్ని శారదయు నేనును జన్మజన్మముల నొకరి నొక రిట్లు వెదకికొనుచు నేకమగు చున్నామా? ఈ సంయోగ వియోగముల కంతమెక్కడ? చరితార్థత యెక్కడ?

ఆలోచనాధీనుడగు నారాయణరావు భోజనముచేసి, యొంటిమై తాంబూలము వేసికొను శారదనల్లనజేరి, 'నాకు రెండాకులు రాసియిస్తావా?' యని యాచించెను. ఆమె యులికిపడి భర్తవంక నొకనిముషముచూచి, మారుమాటాడక యాలేత తమలంపుటాకులు చిలుకలు చుట్టనారంభించెను. నారాయణ సంతసముమై చిఱునవ్వు నవ్వుచు నచ్చటనే వేతొకయాసనముపై నధివసించెను.

నారాయణరావురూప మానాడు శారదకేలనో సుందరతరమై కన్పించినది. వివిధవర్ణ విద్యుద్దీపికల ప్రసన్న కాంతిలో నాతనిరూపము మఱింత మోహనమై కాన్పించినది. అవ్యక్తమధురములగు నూతనానుభవము లామెలో జాగరితములిగా నోపు లజ్జచే నామె కపోలము లించుక చెమర్చినవి. ఆమె పెదవులలో జ్యోత్స్నలు నాట్యమాడినవి. తలవంచియే, దీర్ఘములగు కంటిరెప్పలనెత్తి యాబాలిక భర్తను మరల గనుగొన్నది. తెల్లని పొందూరుపట్టుశాలీ ఖద్దరులాల్చీలోనుండి ముడులువడు నాతని దేహసుభగత్వము వెలిగిపోవుచున్నది. ఉబికి విస్తరించియున్న యాతని మెడ కండరములు తొనలవలె తిరిగియున్నవి. గంభీరమగు నాతనిముఖము, విశాల ఫాలము తీరైన ముక్కు, చెవులు, నాతనికి దేవసేనానియగు కుమారస్వామి సౌందర్యమును బ్రసాదించినవి. శారదాదేవి స్తోకవక్షము లుప్పొంగినవి. విభ్రమవతియైనది. సానురాగయై భర్తచేతిలో సుగంధ ద్రవ్యములు గూర్చిన వక్కపొడియు, దములపాకుచిల్కలు పెట్టుచు స్పర్శసుఖ మనుభవించినది. ఆ వ్రీడావతి శరీరము పుల్కరించినది. 'హాయి' యనుచు నామె హృదయ మానందపూరితమైనది.

నారాయణరావు మృదులమృదులమగు నాకరతలము గ్రహించి, 'నీచేతిరేఖలు చూడవలె' నని యామెపాణి చూడ నారంభించెను. మెత్తని గులాబి మొగ్గలవలెనున్న యామెచేతిలో రేఖలు స్పష్టములై యున్నవి. దీర్ఘములై లలితములగు నావేళ్లు తీగెలే. గోళ్లు ఎరుపులై సంధ్యారాగ తప్తములగు నక్షత్రములవలె ప్రకాశించినవి. నీలము పొదివిన తన చిటికెన వ్రేలి యుంగరము తీసి యాత డామె యనామికకు దొడిగి 'యెంతపదులో' యనుచు చిరునవ్వు నవ్వెను. ఆమె వజ్రపుటుంగరము తన కనిష్ఠికాంగుళికి దొడిగి 'చూచితివా? బిగు' వని మేలమాడుచు,

దీపికా కాంతిలో నద్దాని గాంచుచు నిది నా ప్రాణప్రదమని ముద్దిడుకొనినాడు. చెన్నపట్టణమునుండి చక్కని యుంగర మొకటితెచ్చి, 'యీ చిట్టి వ్రేలికి దొడిగి కొందు' నని ప్రేమపూర్వకముగా ననుజ్ఞ వేడికొన్నాడు.

శారద నెమ్మదిగా జేయి లాగికొన్నది. ఆమె గుండియలు దడదడకొట్టు కొన్నవి. 'ఇంత మెత్తని వేళ్ళకు వీణతీగెల నొక్కులు బాధకాదూ శారదా?' యని నారాయణరావు ప్రశ్నించెను.

'కుడి బొటనవ్రేలికి గోణము తగిలించుకొంటాను. ఎడమ చేతివేళ్ల నొక్కులు పడ్డాయి' యని యాబాలవామహస్తము భర్తకు జూపించినది. అత డా పాణిని గ్రహించి 'హృదయవచశ్శరీరముల సౌందర్యాన్ని బలియిస్తే కాని ఆనందాన్ని సృష్టించలేముకాదూ? ఎన్నిగంటులో? పాపము ఈ చిన్ని వేళ్ళకు ఎంతశ్రమో' యని యామె చేయి తన పెదవులతో నల్లన స్పృశించి కన్నుల నద్దుకొనెను.

శారద యపరిమిత త్రపామూర్తియై చేయిలాగికొని, చిరునవ్వు మోమును రాగరంజితముచేయ, మెరుపువలె నా మేడమీద నింకొక గదిలోనికి మాయమైనది.

నారాయణరావు హర్షప్రఫుల్లములగు నయనములతో దనచిన్నారిభార్య పోయిన దెస చూచుచుండెను.

ఇంతలో జమీందారుగారు లోనికి వచ్చి యాలోచనా మగ్నుడై యున్న యల్లుని వీపుపై చేయి నిడెను. నారాయణరావు ఉలికిపడి తలయెత్తి మామగారిని జూచి, చివాలున లేచెను. 'కూర్చోవోయి! నీ స్నేహితులంతా నీ కోసం కాబోలు చూస్తున్నారు. మాజగన్మోహనుణ్ణి ఆడిస్తున్నట్లున్నారు. అతడో వెఱ్ఱివాడు, గర్వి, దుష్టహృదయం కలవాడు. నీవు ఎఫ్. యల్., లో మొదటివాడవుగా మొదటి తరగతిలో నెగ్గినందుకు నాకు చాలా సంతోషం అయింది. నువ్వువెళ్లేటప్పుడే నేనూ చెన్నపట్టణం వస్తాను. నువ్వు హాస్టలులో ఉండడం మానివేసి, కీల్పాకులో నాబంగాళాఉంది. అందులోనే ఉండు. అద్దెకున్నవారిని ఖాళీచేయవలసిందని వ్రాశాను. వారున్నూ రేపు జూలై నెలలో వెడుతున్నారు. నీయిష్టంవచ్చిన కారొకటి చూడు. మాదివానుగా రదికొని, నీకు ఇస్తారు. 'డ్రైవరు' (మోటారునడుపువాడు) నొకణ్ణి చూచిఉంచారు. ఆకారు నీకు బహుమతీ.'

'నేనే ఒక చిన్నరకంకారు కొనుక్కోడానికి ఏర్పాటులు చేసుకున్నానండి?'

'నాముచ్చటకు నువ్వు అడ్డంచెప్పవద్దు.'

'చిత్తం.'

'శారదా!'

పక్కగదిలోనున్న శారద 'ఎందుకు నాన్నగారూ!' అని పలికినది.

'ఈలారా అమ్మా!'

శారద గుమ్మముకడకు వచ్చినది.

'కొంచెముసేపు క్రిందికివచ్చి వీణవాయిస్తావా! నీసంగీతపుగదిలోనేకూచో!

'ఇపుడు ; వాయించలేనండి.
'పోనీలే.'
'కాదు, ఇక్కడే నాగదిలో కూచుండి వాయిస్తానండి !
'సరేలే, నీకు కులాసా లేకపోతే ఇబ్బంది లేదులే !'
'ఇష్టములేక కాదండి ! క్రింది గదిలోకి ఎందుకని.'
'సరే ! సరే !'

శారద పరిచారికను బిలిచి సంగీతపు గదిలోనున్న వీణియ తెమ్మని యాజ్ఞ యిచ్చినది. జమీందారుగా రల్లునిఁ జూచి 'సంగీతపుగది ధ్వనిశాస్త్రవేత్తనొకణ్ణి కలకత్తానుండి రప్పించి తయారుచేయించినాను. చాలా చక్కగా కుదిరింది. పొడుగాటి హాలులా వుండడంవల్ల పదిమంది కూచొని వినుటకు వీలుగా ఉంటుంది. నీ స్నేహితులను పైకితీసికొని రావోయి' యని యనెను.

'చిత్త' మని నారాయణరావు స్నేహితులను మేడమీదికి బిలిచికొని రాబోయెను.

శారద వీణియ సారెలు బిగించి, శృతిమేళవించి, కలస్వనమున పాడనారంభించినది.

నారాయణరావు, స్నేహితులువచ్చి, మేడమీద మధ్యశాలలో నాసనములపై నధివసించిరి. జగన్మోహనరావు మాత్రము శారద శయనగృహములోనికిపోయి, యచ్చట శారదకెదురగ నొక దిండ్లున్న సోఫాపై నుపవిష్టుడై శారదను దేరి చూడసాగెను.

జగన్మోహనుని కుర్కురహృదయమునకు శారదా సౌందర్య మద్దములపెట్టె లోని పలలఖండమై కలచివేయుచుండెను.

జగన్మోహనుడు లోనికిబోవుట చూచి రాజేశ్వరరావు భ్రూయుగ్మము ముడిచినాడు.

నారాయణరావు, పరమేశ్వరుడు సంగీతలోలురై యా యానందలహరీ వేగములో దేలిపోయిరి.

అహో, విమల గాంధర్వమా ! నీవానందమూర్తివి ! నిర్మలకళారూపమవు. సాక్షాత్కరించిన పరదేవతవు. నీ దర్శనమాత్రమున పవిత్రతనొందని చేతనా చేతనము లున్న యవియే ! పరమశివుని డమరుక కింకిణీద్వయినుండి జనించిన నీయందాత్మ స్వరూపమే వ్యక్తమగును. ప్రాణదుగ్ధమునిచ్చు సురభీమ తల్లివినీవు !

ఆ సంగీతము దిశలనావరించి ప్రణవస్వరూపమయినది.

# ద్వితీయ భాగము

## ౧

## మంగళగౌరి

శ్రావణమాసము. గోదావరి గాలులతో, వర్షపాతములతో, ముసురులతో, సూర్యనారాయణుని దాగుడు మూతలతో, సర్వత్ర పొడచూపు శాద్వలహారిత వర్ణముతో వరదల బురదనీటి జేగురువర్ణముతో, నీలిమబ్బులతో, మంగళవారము నాడు వీధుల తేలియాడు మందగమనల కౌశేయ వివిధవర్ణములతో బ్రత్యక్షమగును.

ఆడువారి మంగళవారములనోము లీమాసమున నేల ఏర్పడెను ? వివాహమైన వెనుక నైదుసంవత్సరము లీనోము నోచుకొనవలెనట. నోముపట్టిన పిమ్మట నేవత్సరముననైన నుద్యాపనజేయవచ్చునట. పెళ్ళిలో 'సప్తపది' నాడు ఉద్యాపన చేసికొనవలెను. ఆ వధువునకు మంగళసూత్రము మెడనుగట్టి, కాళ్ళకు మట్టియలు దొడిగి,పాదాంగుళులపై మిఠాయినునిచి,పదుమూడుజతల యరిసెలు గిన్నెలోనుంచి, రవికెలగుడ్డ వాసెనగట్టి, పసుపుకుంకుమలతో వాయినమిచ్చి, యుద్యాపన చేసుకొనవలెనట. శ్రావణ మంగళవారమునా డుదయమున నభ్యంగన మొనరించి, మడితో మంగళగౌరీదేవి నారాధించి, కథ చెప్పుకొని, యక్షతల శిరస్సున నిడికొని, చలిమిడి గురుగులందు నావు నేతితో దీపాలు వెలిగించి, యాపొగతో కాటుకబట్టి నేత్రముల నలంకరించి, మహానైవేద్యము, సెనగలు నైవేద్యము సమర్పణజేసి, ముత్తయిదువులకు బసుపురాచి, బొట్టుపెట్టి, కాటుకనిచ్చి, గంధమలది, తాంబూలముతో సెనగల వాయన మీయవలెను.

శ్రావణ మంగళవారముల నూరిలోనున్న వనితామణు లొకరిపరిచయ మొకరు సంపాదించుకొని కుశలప్రశ్నము లొనర్చుకొనుచు, విడ్డూరముల నాడుకొనుచు, లోకాభిరామాయణము చెప్పికొనుచు, వీరిని వారిని ఆడిపోసుకొనుచు, నగల విషయ మడుగుకొనుచు గాలక్షేపమొనర్తురు. తమకున్న చీనిచీనాంబరముల బనారసు, బెంగుళూరు, మధురచీరల ధరించి, రవికల తొడుగుకొని, యత్తరువు లలంది. పూవులు ధరించి, నగల గైసేసికొని, జట్టులుగా మందగమనములతో నొయ్యారముతో దారిలో గ్రీగంటి చూపులతో దేవతాస్త్రీలవలె పేరంటములకు బోవుదురు. చేతనున్న 'రుమాళ్ళ' యందు సెనగలు మూటగట్టుకొందురు. మాతలు శిశువుల నెత్తికొనియే బయలుదేరెదరు. విలాసవతుల హావభావముల గమనించి యువ్విళు లూరుటకు వేషములు దాల్చిన కోడెగాండ్రు పనియున్న వారివలె నూరంతయు దిరుగుదురు. ఇంతలో నొక జడివచ్చిన బరుగిడలేక యెట్లో నొక పంచజేరి వాల్గంటుల జూచి దరహాస వదనులగుదురు.

క్రొత్తపేటిలో సూర్యకాంతమును, ఒక వత్సరము మానివేసినందున మాణిక్యమును నోముబట్టిరి. తమయింట నాచారమున్నదిగాన గోడలిచే నోము పట్టింపవలయునని సుబ్బారాయుడుగారు వియ్యంకునకు వ్రాసినారు.

పూర్ణిమమునందు శుక్రవారమున్నాడు జమీందారుగారియింట వరలక్ష్మీవ్రతము జరిగినప్పుడు జానకమ్మగారు పూర్ణాభరణభూషితురాలై వరలక్ష్మివలెనే వియ్యాలవారింటికి వెళ్ళినది. కోడలికి నిరువది కాసులును, వియ్యపురాలికి గోడలికి వెలగల చీరలును, బంగారు కుంకుమబరణియు నన్నూరు రూపాయలవెండి బొమ్మసామాను మొదలగునవి శ్రావణపట్టి పట్టుకు వెళ్ళినది. జమీందారుగారు, సోదరితో నాలోచించి యల్లునికి వేయిరూపాయల సరుకు లాషాఢపట్టీ పంపించినారు. కోడలిచే నోము నోపించి జానకమ్మగారు కోడలితోపాటు చారుమతీదేవీ కథవిని మూడవ వారము వరకు అచ్చటనే యుండుడని సుందరవర్ధనమ్మగారు కోరుటచే నాగిపోయెను.

రాజమహేంద్రవరములో శారదతో నామె పెద్ద పెద్ద వారిండ్లకు 'గాయ మీదవెళ్ళి వచ్చినది.

మంగళగౌరీదేవి కథవినినప్పుడు శారద మేనత్తను కథార్థము విపులముగా నడిగినది. బిడ్డలులేని భార్యాభర్తల తపస్సు, పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమగుట, 'అయిదువతనము లేనిబాలికయా, ఆయుస్సులేనిబాలుడా, వర' మన్న ప్రశ్న. బాలుడు కావలెనని కోరుటయు, బాలుడు జనించుటయు, కుమారుని గొనిపోవ యమునిదర్శనము, పదునారవయేట, పదునారవరోజు గొనిపోయెదనని యముని వాగ్దానము (పంద్రెండవయేట, పంద్రెండవ మాసాన, పంద్రెండవదినాన నని కొందరి మతము), ఆదినము వచ్చుముందు కుమారుడు మాతులునితో మృత్యువును దప్పించుకొనుమార్గము దొరకదాయని దేశములపాలగుట, వారట్లు పోవుచుండ, నొక నగర బాహ్యోద్యానవనమున గొందరు బాలికలు పూలు గోసుకొనుచుండ రాచవారి బాల యొక్క పూలు ఒలికిపోయి యెప్పటియట్ల చెట్లపై జేరుకొనుట, అది కనుంగొని మాతులుడా బాలను ఒప్పించి తన మేనయల్లునికి వివాహము చేయుట, ఆ బాలిక యింటికిబోయి, తల్లిదండ్రుల ఇచ్చచే నా బాలకునికి సరియైన కర్మకాండతో నతి వైభవముగ పెండ్లిచేయుట మున్నగు వివరముల నెఱిగికొన్నది. ఆబాలకుని మృత్యుదినంబు నాటిరాత్రి, మృత్యువు పంద్రెండు తలల యాదిశేషుడై వచ్చి నిదురబోవు యువకుని కాటువేయబోవుచుండ నచ్చట నా రాజకుమారి మిఠాయి యుండ నునిచెనట, శేషుడా యుండపై కాటువేసెనట. ఆ బాలికయొక యరిసెల పాత్రను జూపుటయు నా సర్ప మందు దూరెనట. తనకంచుక మూడ్చి యా పాత్రపై వాసెనగట్టినదట, అటువెనక భర్త దేశాలు తిరుగబోయెనట. భర్త దేశాలు తిరిగి వచ్చునప్పటికి ఆ పాము బంగారుపామై యుండెనట,

జానకమ్మగారు సర్వసౌందర్యాల వెలిగిపోవు కోడలినిజూచి ఆనందపరవశు రాలై నది. అటు నవమన్మధుడగు కుమారుడు, ఇటు సౌందర్యోజ్జ్వలయగు కోడలు, సాక్షాత్కరించిన రతీబాల. ఒకరికొర కొకరు జన్మించినారా ?

ఆ రాత్రి జానకమ్మగారు కోడలికి ఉప్పు మిరపకాయలు పారాణినీళ్ల దృష్టితీసి, పారాణినీళ్ల దొడ్డిలో దూరముగాను ఉప్పు మిరపకాయలను నిప్పులోను వేసినది. యెంత దృష్టితగిలెనో కాని ఘాటేమియు రాలేదట. ఈ వింతను వరదకామేశ్వరీదేవి చూచి వెడనవ్వు నవ్వుకొన్నది.

శారద కివియన్నియు జిత్రముగా నుండెను. అత్తవారింటివారు బూర్వ సంప్రదాయములతో, బూర్వాచారములతో మెలగుదురు. తన పెద్దత్తగారు నిప్పులు కడుగును, మైలపడితినేమోయన్న భయముచే బదిసారులు స్నానముచేయును. ఏ పర్వదినము వచ్చినను గోదావరికి స్నానమునకు బోవును. వంటవండుటకు వలయు జలమంతయు దానే తోడుకొనును. తక్కినవారి కొక నీళ్ళ బ్రాహ్మణుడు

ఆ మరునాడు జానకమ్మగారు కొత్తపేట వచ్చివేసినది.

జానకమ్మగారి కంత చేదస్తము లేకపోయినను ఆమెయు బూర్వాచారవతి యనియే యెన్నవలెను.

వంటయింటిలోనికి బిల్లలెవ్వరు వెళ్ళగూడదు. వారి భోజనాలగది వేఱు. ఉదయము వారికి వంటజేయవలసిన దచ్చటనే.

లక్ష్మీనరసమ్మగారు భోజనమువేళ మంచినీరు త్రాగిన చెంబులోని నీటితో జేయికడుగనీయదు. పట్టుబట్టలగాని, మడిబట్టలగాని కట్టుకొనకుండ భోజనము చేయరాదు. బొట్టులేకుండ నుండరాదు. ఆమె మోమోటము లేకుండ నెట్టివారిని లెక్కజేయకుండ నాచారము గమనించుడని బోధించుచుండును. శారద యత్తవారింటనున్న గృహప్రవేశపు రోజులలో ఆమె కాచారవిషయికములగు నీతు లెన్నియో పెద్దత్తగారు కఱపినది. తాంబూలము నమలుచు శారద పంటిలో దూరిన నలుసును చేతితో దీసికొని రుమాలుతో దుడుచుకొనుచుండ లక్ష్మీనరసమ్మగారు చూచి 'అయ్యయ్యో ! యెంగిలమ్మా, తల్లీ ! చేయికడుక్కోవమ్మా, ఆ రుమాలును పని చేసేది తడిపి ఆరేసేగుడ్డల్లో వెయ్యి' అని కోడలిచే నాపనులు చేయించినది.

'ఏమే అక్కా ! ఇంతచాదస్తం నీ కెప్పుడు తగ్గుతుందే !' యని జానకమ్మ పాటపాడుచునేయుండును. అయిననేమి లాభము ?

లక్ష్మీనరసమ్మ వేదాంతురాలు. ఎప్పుడును వేదాంత గ్రంథాలు చదువుచుండును, చదివించుకొనుచుండును. ఆమెకు జుట్టముల గ్రామములందు పలువురు శిష్యురాండ్రున్నారు. వారందరు గురువుగారిని దర్శించుటకు వచ్చుచునేయుందురు అప్పుడు గురువుగారి పాదాలకు నమస్కరించి, ఫలములు, రూపాయలు, వెండి

గిన్నెలు దక్షిణలిచ్చి వేదాంతపు ముక్కలు చెవిలో వేసికొని యానందించుచుందురు. నోరూర జక్కగా వేదాంతోపన్యాసాలు చేయగలదామె.

'జన్మం రజ్జుసర్ప భ్రాంతివంటిది; దారు పురుషభ్రాంతి, ఎండమావులునీరను భ్రాంతి కామక్రోధ లోభమోహ మదమాత్సర్యాలనే అరిషడ్వర్గాలూ చంపుకోవాలి. లేకపోతే ఎరుకలోబడి తనబిడ్డ, తనమగడు, తనయిల్లు, తననగలు, తన సంసారము అని జీవుడు భ్రమించి పుట్టుటా గిట్టుటా అనే మాయలోబడి, మూత్రపురీషాదుల్లో దొర్లి, అచలతత్వం గ్రహించలేక, ముక్తిపొందలేక ఉంటుంది. శుద్ధ నిర్గుణమైన అచలతత్త్వం గ్రహించాలి. పంచాక్షరి జపిస్తూఉండాలి' అని లక్ష్మీనరసమ్మగారు శిష్యురాండ్రకు బోధించుచుండును.

ఆమెకు బంచీకరణము కంఠస్థము. పండ్రెండు రాజులకథలు ఇంద్రజాలపు గథలు క్షుణ్ణముగా వచ్చును సీతారామాంజనేయము మంచినీళ్ళప్రాయము. శుద్ధనిర్గుణ తత్త్వ కందార్థదరువులు ఎల్లప్పుడు పాడుకొనుచునేయుండును.

శారద కివియన్నియు పల్లెటూరి గొడవలని తోచినది. తనతల్లి కెప్పుడిట్టి ఛాందసములులేవు. పట్టణవాసస్థులువచ్చి పల్లెటూళ్ళలో నెట్లు జీవింపగలరో యని యామె తలపోసినది. అత్తవారింటి కథలన్నియు దల్లితో మేనత్తతో దనయింట నున్న యితర స్త్రీలతో జెప్పి నవ్వించినది.

అత్తగారువెడలిపోయిన నాలుగురోజులలో శారద యుక్తవయస్కురాలైనది. జమీందారుగారింట మూడురోజు లుత్సవములు విందులు జరిగినవి. దినదినము పేరంటా ళ్ళు వచ్చేసినారు. పంచదారతో జిమ్మిలిగొట్టి పంచినారు. బ్యాండు మేళము వచ్చినది. పంక్తినాడు సూర్యకాంతము, మాణిక్యాంబ జమీందారుగారింటికి వచ్చి పంక్తి జరిపి వెలగల బహుమతులు, చీనిచీనాంబరముల నిచ్చి వెడలిపోయిరి. నగరమునందున్న వారినెందరనో స్త్రీ పురుషులను భోజనములకు బిలిచినారు.

నవనాగరికుడై వీరేశలింగాఖ్యుని ప్రియశిష్యుడైన జమీందారుగారు నేడు పల్లెటూరి వారితో వియ్యమంది ఛాందసపు పూర్వాచార పిశాచ గ్రస్తులైనారని పలువురు విచారించిరి.

యజ్ఞోపవీతముగూడ దీసివేసి అనుష్ఠానిక బ్రాహ్మసామాజికుడైన శ్రీనివాసరావుగారు మిత్రునిజూచి 'ఆడపిల్లకీడురావడమనేది శారీరంలో జరిగే ఒక మార్పుకు చిహ్నం. దానిని లోకానికి టాంటాంజేయడ మంత మొరకుదనం ఇంకోటుందా' యని ప్రశ్నించిరి.

'అదినాకు ఇష్టంలేదు కాని, అది మొరకు తనమని మనం గ్రహించింది పాశ్చాత్యుల సంపర్కంచేతనేనా! మనవాళ్ళ పూర్వాచారాలు అనేకం ఈ నాటికి మూఢత్వము, అని అనుకుంటున్నాము. ఇదివరదాకా మోటుతనము అని అనుకునేవి, నేడు నాజూకువి అయ్యాయి. మనవాళ్ళు స్త్రీ పురుష సంబంధ విషయము లయిన చర్యలన్నీ వెల్లడిగా ఉంచారా లేదా!'

'అదేగా నేను పనికిరాదు అనేది!

'ఉండవోయ్! కాని ఇప్పు డింగ్లీషువాళ్ళ ఆడవాళ్ళ మోకాళ్ళపైకి 'గౌన్లు తొడిగి వక్షోజములు సగం కనబడేటట్టుగా కట్టి తిరగడము, బట్టవుందా లేదా అన్నట్టుగా లంగోటీలు కట్టి మగవాళ్ళతో ఈత లీదడము, ఈ రకముగా ఉన్నారు. వాళ్ళనుబట్టి మనవాళ్ళుకూడా దుస్తులు అనుకరిస్తున్నారు. కాని అటువంటి దుస్తులు ధరించిన ఆడవాళ్ళను కౌగలించుకొని వందలకొలది జట్టులుగా నాట్యమాడ్తూ తిరిగే పురుషులు స్త్రీలదగ్గిర స్త్రీ రహస్యవిషయాల్ని సూచనగానైనా అనకూడదు. డాక్టర్లు మాత్రం పచ్చిరహస్యాలు మాట్లాడవచ్చును. మొగవాళ్ళే పురుళ్లుబోయవచ్చును, మనవాళ్ళో? కాస్త ఒళ్ళుకనబడితే సిగ్గులేని రట్టుమనిషి అంటారు. ఆడ డాక్టర్లు తప్ప ఎవ్వరూ రహస్య భాగాలు పరీక్ష చేయగూడదు; విడిగా మగవానితో ఉండ కూడదు. స్నానాలకుకూడా గోదావరిలో పురుషుడుండగూడదు. కాని సమర్తలని, గర్భాదానాలనీ ఉత్సవాలు చేస్తారు. ఇదంతా నీ దృష్టి పథంలోఉంది. ఒకటి మొరకు తనం, ఒకటి నాజూకుతనం అని వాటి నుదుటిమీద రాసిలేదోయి శ్రీనివాసు!'

'అలాగా?'

## ౨

## అమెరికా యాత్ర

రామచంద్రరావు జపాను చేరుకున్నాడు. జపానుదేశములో నొకనెల యాగి, యాదేశమునందున్న వింతలన్నియు దిలకించి, యానందించి మఱి యమెరికా వెళ్ళవలెనని సంకల్పము. రంగూనులో నుండగానే అతడు జపాను వెళ్ళుటకు అమెరికా వెళ్ళుటకు నారాయణరావుచేసిన కృషివల్ల 'అనుమతి పత్రములు' రంగూనులోనున్న ఆంధ్రులలో గొప్పషాహుకారగు పుల్లంరెడ్డిగా రిప్పించినారు.

రామచంద్రరావు తండ్రి భీమరాజుగారి స్నేహితుడగు అమరుచందు గిరిధారి లాలను గుజరాతీ వర్తకుడు రామచంద్రరా వోడదిగుటతోడనే యెదుర్కొని యాతని తనయింటికి తీసుకొనిపోయెను. గిరిధారిలాలుకు నమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, జర్మనీ, జపాను, ఫ్రాంసు, ఇటలీ, ఇంగ్లండు, రష్యా, చీనా మొదలగు దేశములతో వర్తక సంబంధ మున్నది. అతడును వివిధదేశములకు జాలసారులు ప్రయాణము చేసియున్నాడు. కాబట్టి ఆయన మనస్సులో రామచంద్రుని వెనుకకు బొమ్మని చెప్పుట కిష్టములేకుండెను. అయినను మిత్రుని యాదేశము చొప్పున రామచంద్రుని జూచి భోజనము అయిన వెనుక నిట్లనెను.

'రామచందర్! మీకు ముక్కుపచ్చలారిందిలేదు. మీరు చిన్నవాళ్ళు! దేషం కొత్తది. చాలా మాయకోరు ఉంటార్. మీరూ ఎనక్కిపోయి కాశీలో లక్నోలో కలకత్తాలో చద్వవచ్చును కాదుఅండి అక్డకూడా చాలా ఎక్వ చద్వుచెప్తార్ కాదా!'

'మీకు మాతండ్రిగారికీ ఉండే స్నేహాన్నిబట్టి అల్లా చెప్తారుకాని, నామనస్సు నిశ్చయం అయిపోయింది. ఇంక ఎంతమాత్రము నా సంకల్పము మార్చుకోలేను, మార్చను. మీరు పెద్దలు, నాతండ్రితో సమానులు. మీరుచెప్పడం, నేను వద్దనడం బాగుండదు ?'

'సరే! సరే! మీయిష్టం. పర్వాలేదు. నేను అంతా జాగ్రత్త కనుక్కుంటాను. మాచుట్టం ఒకాయన లాల్‌చంద్ జీవన్‌లాలు 'న్యూయార్కు' పట్నములో మకాం. ఆయనకు ఉత్తరం రాస్తా! మీకూ ఒకఉత్తరం ఇస్తాం.'

'చిత్తం! మీమేలు ఎప్పటికీ మరిచిపోను'

'మీ నాయనాగారు నాకు, మీకు యివ్వమని, డబ్బు పంపినారు! అది మీకు ఇస్తాను. జాగ్రత్తగా ఉండండి, చాలా చిన్నవాళ్లు.'

'చిత్తం! చిత్తం!'

మరునాడు పుల్లంరెడ్డిగారు అమృతలాలుగారి హర్మ్యమునకు విచ్చేసి రామచంద్రునిగూర్చి వాకబుజేసెను. పుల్లంరెడ్డిగారు, అమృతలాలుగారు చాలకాలము నుండి స్నేహితులు, ఒకరన్న నొకరికి గౌరవము.

పుల్లంరెడ్డిగారు అమలాపురం తాలూకా పేరూరు గ్రామవాసులు. చిన్నతనములో కూలికై రంగూను పట్నమువచ్చి సహజ మేధాసంపన్నుడగుటచే త్వరలో మేస్త్రీ అయి, ధనము నిలవచేసికొనెను. తాను గూలికికుదిరిన గుజరాతీ షాహుకారొక వ్యాపారమునకై తన్ను సింగపూరు పంపినప్పుడు, పుల్లంరెడ్డి తనకడనున్న ధనమంతయు నొడ్డి స్వయముగా వ్యాపారముచేసి సింగపూరునుంచి వచ్చులోపల నిరువది యైదువేలు లాభము నొందెను. తనషాహుకారు పనిగూడ చాలశ్రద్ధమై, లాభకరముగ నెరవేర్చి రంగూను వచ్చివేసెను. చదువురాని పుల్లన్న అంతటనుండి పుల్లంరెడ్డియై, షాహుకారు తనకొక యణాభాగమీయ, నాయన వర్తకములో భాగస్వామియయ్యెను. నాటినుండియు పుల్లంరెడ్డి పట్టినది బంగారమై, యాతనిధనము నాలుగు లక్షలవరకు బెరిగినది. నలుబదవయేట తన షాహుకారనుమతినీయ, దాను వేరుగావ్యాపారముచేసి పదియేళ్లలో నిరువదిలక్షలసంపారియు, 'రావుబహదూరు'నై, పాశ్చాత్యులచే 'పులియన్ రెడ్డి' యని వాకొనుబడుచు, దానకర్ణుడై రంగూను నాగేశ్వరరాయుడని ప్రఖ్యాతి వహించినాడు.

రంగూనులో నాంధ్రులందరును గూలిచేయువారలే. కొంతమంది మాత్ర ముద్యోగములు జేయుచుండిరి. వర్తకము చేయువారు మరియు దక్కువ. వారిలో గొలదిమందియే భాగ్యవంతులు. రంగూన్, మోల్‌మేన్ మొదలగు ప్రదేశములలో నెక్కువగాను, దక్కిన దేశమునం దచ్చటచ్చట చాల దక్కువగాను, ఆంధ్రులు బర్మాదేశమునకు వలసపోయినారు. సముద్రములుదాటి, దూరదేశములకు వర్తక మొనర్చుటకు మత ప్రచారమునకు రాజ్య స్థాపనకు పోయిన తొల్లిటి మనయాంధ్రుల సాహసోత్సాహములు దలంచుకొని, నేటి మన భీరుత్వమును, అలసతను, పురుషార్థ

శూన్యతను చూచుకొన్నచో సిగ్గగునుగదా! నేటికిని పొట్టలు చేతబట్టుకొని బర్మా, నేటాలు, మలేద్వీపము, అస్సాములకు బోవుచున్న కూలీలు తక్క మనలో పురుష కారపరులు కానరారు. బర్మాలో తెలంగులను నొకజాతివా రున్నారట. వా రేపల్లవుల కాలములోనో, చాళుక్యుల కాలములోనో, లేక కాకతీయుల కాలముననో ఆ సువర్ణ ద్వీపముజేరియుందురు. తన పదియవ యేటనే ఆంధ్రుల చరిత్ర చదివి వినిపించుకొని యున్న పుల్లం రెడ్డిగారు, రామచంద్రరావు సాహసమున కెంతయు మెచ్చుకొనిరి. రెడ్డిగారు నలువదియవయేట చదువను వ్రాయను నేర్చుకొన్నారు. అయినను తనకు భారత రామాయణాదులగు పూర్వకాలపు టాంధ్రగ్రంధములను, ఆంధ్రులచరిత్ర మొదలగు నూతనయుగపు గ్రంథములను జదివి వినిపించుటకు విద్యార్థిని నొకని నేర్పరచుకొన్నారు.

వెంకటరత్నం నాయుడుగారు మొదలగు మువ్వురు ముఖ్యులచే రెడ్డిగారికి నుత్తరములు వ్రాయించి పుచ్చుకొని, తన బావమరది బాలకుడనియు, నాతనికి వలయు సహాయమొనర్చి తన కుటుంబపు కృతజ్ఞతకు బాత్రులు గావలయుననియు వ్రాయుచు గమ్మలన్నియు నారాయణరావు రెడ్డిగారికిబంపించెను. రంగూనులోనుండి వార్తాపత్రిక నెలకొల్పి యనేకవిధముల నాంధ్రులకు సహాయమొనరించు అవటపల్లి నారాయణరావుగారికి గూడ నారాయణరా వుత్తరములు వ్రాయించినాడు.

రెడ్డిగారివలన, నమృతచందువలన, నారాయణరావుగారివలన, పెక్కువిధము లగు సలహాలనొంది రామచంద్రరావు జపాను వెళ్ళినాడు. టోకియో, యోకోహామా మొదలగు నగరములు, ధ్యానబుద్ధుని, ఫ్యూజియామా పర్వతమును రామచంద్రరావు దర్శించెను. జపాను విశ్వవిద్యాలయములను రసవిహారి బోసుగారి సహాయమున దర్శించెను. బోసుగా రనేక పరిశ్రమాగారములనుగూడ జూచుటకు సౌకర్యములు సమకూర్చినారు. బొమ్మలు, కాగితములు, గ్లాసు సామానులు, కత్తులు, సూదులు మొదలగులోహపుసరుకులు, బొత్తాములు, పూసలు, దువ్వెనలు, వస్త్రములు, రబ్బరు సరుకులు, మందులు, నింక నెన్నియో వస్తువులను జపానుదేశము భారతదేశమున కెగుమతిజేయుచున్నది. ఆ కర్మాగారములలో బెక్కింటిని రామచంద్రరావు కను గొనెను.

హిందూదేశము తన్నావరించిన దౌర్భాగ్యపిశాచమును వదల్చుకొని మరల సర్వతోముఖముగ నెప్పటికి విజృంభించగలదో యని రామచంద్రరావు నిట్టూర్పు నించెను. నారాయణరావునకు గొన్ని కుంచెలు రంగులుకొని రామచంద్రరావు పంపించెను.

రామచంద్రరావు అమెరికాకు వెడలుదినం సమీపించినది. రాజకీయకారణము వలన జన్మభూమిని విసర్జించి జపానుదేశమునుబెంపుడుతల్లి నొనరించుకొని,కలలలో, జాగ్రదవస్థలో గంగానదిని, కాశీపట్టమును, హిమాలయ పర్వతశ్రేణిని స్వప్నముల గాంచు రసవిహారుడు రామచంద్రరావును గవుంగలించుకొని 'బాబూ! అప్పుడప్పు

డీదేశము వచ్చు భారతీయులే నాకు భారతదేశము సుమా ! వారి మూర్ధములందు హస్తతలములందు నా వంగదేశపు పంటభూములను, శేఫాలికాజపాకుసుమములను నాఘ్రాణించుచు వారి కన్నుల కాంతిలో నా గంగానదీ పావనోదకముల దర్శించుచు, వారి నుదుటిలో నా దేశపు నీలగగనాల ప్రత్యక్షించుకొందు....

'పంజాబ్ సింధు మరాటా ద్రావిడ ఉత్కల వంగా !

వింధ్యహిమాచల, యమునాగంగా ఉచ్ఛలజలధితరంగా !

'నువ్వు బాలుడవు. నా దేశమాత ముద్దుబిడ్డవు. నా సోదరుడవు. అహో రామచంద్ర ! నువ్వు నాలుగేళ్ళకయిన మనతల్లి వొడిలో నాడుకొందువు. మనతల్లి మట్టిలో దొర్దుదువు. మన మాతయిచ్చిన ఆటవస్తువులతో గేరింతలాడుదువు ఆ పవిత్రవాయువులు పీల్చెదవు. ఆయమ్మ చనుబాలు గోదావరి పావనోదకాలు త్రాగుదువు. పో ! పో ! ఒక్కసారి నన్ను కౌగిలించుకో ! మరల నింటిదారి నిటువచ్చిన సంతోషించెదను. అమెరికా జేరిన వెంటనే నాకు జాబువ్రాయి.' అని యాతని నా తరణిలో దిగవిడిచి గట్టునకు విసవిస వెడలిపోయినాడు.

టంగ్ టంగ్‌మని గంటమ్రోగి తుదికూత నుచ్చైస్స్వనమునగూసి యాయోడ పెద్ద చప్పుడుతో యోకొహామారేవు వదలినది. రామచంద్రుడు రసవిహారిబాబు మొదలగు భారతీయుల సలహాచే మొదటితరగతి టిక్కెట్టు పుచ్చుకొన్నాడు.

అమెరికాదేశము బీదలను రానీయదు. డబ్బుగలవారిని గౌరవించును. విద్య నేర్చుకొనుటకు వచ్చినను సరియే, నిర్భాగ్యుడు అమెరికాదేశమున ఉపజీవిక్రిమి (ప్యారాసైట్) వలె సంచరించుటకు వీలులేదు. భరతభూమికన్న పెద్దదియైనను నచ్చట పదికోటుల జనులు మాత్రమున్నారు. వారికి అమెరికాచాలదట. అమెరికనులు రంగుజనులను తమ కుక్కలు,పిల్లులు, గుఱ్ఱములకన్న హీనముగజూతురు. నల్ల నీగ్రోలు, చైనా జపాను దేశముల పసుపుపచ్చని మంగోలియనులు, ఆదిమ నివాసులగు ఎఱ్ఱయిండియనులు, వివిధవర్ణములు కలవారైన హిందూదేశస్థులు వారి దేశములో నివసించి అమెరికనులు కాగూడదట. తాత్కాలికముగ కొలది సంవత్సరములు మాత్రము నివసించిపోవలయునట. నీగ్రోజాతివా దేదైన తప్పుచేసినచో, న్యాయస్థానములకు గొనిపోయి విచారించకుండగనే ప్రజలు వాని నురిదీయుదురు. లేదా స్తంభమునకుగట్టి 'కిరసను' నూనెలో తడిపిన కఱ్ఱలను దేర్చి కాల్చుదురు. వానిని గుఱ్ఱములకుగట్టి, చచ్చునంతవరకు రాళ్ళమీద నాగుఱ్ఱమును పరుగెత్తింతురు.

హిందూదేశ మమెరికనులదృష్టిలో నొకచిత్రభూమి. భారతీయులకు మతము లేదు. రాళ్ళను రప్పలను గొలిచి రౌరవాది నరకమునబడు మూర్ఖులతో భరతభూమి నిండియున్నదట. కాన కోటీశ్వరభూమియగు నమెరికా, భారతభూమికి క్రైస్తవ మతప్రచారకుల బంపుచుండును. భారతభూమిలోని రాజాధిరాజులైనను, అమెరికాలోని గొప్ప హోటళ్ళలో బసచేయుటకువీలులేదు. అమెరికారైళ్ళలో 'పుల్‌మాను' అను నుత్తమ తలగతి బండ్లలో ప్రయాణము సలుపకూడదు.

ఉత్తుంగములై లేచు సముద్ర వీచికల గమనించు చూపులతో రామచంద్రు డమెరికాను గూర్చి యాడిపోసిన పంజాబీయుడగు నొక సిక్కు-సోదరుని మాటలను దలపోయుచు నౌకా ముఖ్యోపరిభాగమున నడ్డముగా గట్టిన యినుపగొట్టపుకడ్డీల నానుకొని నిలుచుండి యుండెను.

జపానుదేశము విన్ననే కొన్ని వందలమైళ్ళదూరాన మాయమైపోయినది. రాత్రియంతయు వివిధాలోచనలతో నిదురరాక, పన్నెండుగంటలకు గొంచెము కన్ను మూసి, తఱువాత నావికులు మ్రోయించిన నాలుగు గంటల చప్పుడువిని మోము కడుగుకొని, శుభ్రవస్త్రముల ధరించి, యాబాలకుడు ఓడ పైతట్టునకుబోయి సముద్రమున సూర్యోదయాద్భుతము కనుంగొనవలెనని వేచియుండెను.

ఎటుచూచినను సముద్రమే. ఆ కనుచీకటిలో ఆకసము, నీరధి ఏకమైపోయినవి. ఊయెలవలె నా మహాతరణి యిటునటు నూగుచుపోవుచున్నది. ఓడలోని యంత్రముల పెనుమ్రోతలు రామచంద్రుడున్న తావునకు మద్దెలమ్రోతవలెమాత్రము వినవచ్చుచున్నవి. ఆ శ్రుతిమేళవింపులో, ఓడను ముందునకు ద్రోయు ఆకుచక్రములు నీటిలో నపరిమిత వేగమున తిరుగు కవ్వపుమ్రోతయు, ఓడ ముందుభాగమున ఉక్కు (కీల్) బద్దియ నీటిలో మహావేగముగ గోయుచుబోవు గంభీరనాదమును లీనమై ఉత్కృష్ట గీతికయై యాతని హృదయమును రంజించినది.

కలలలో, కధలలో, గ్రంథములలో, వార్తాపత్రికలలో వినబడిన విదేశకంఠములు, విదేశశబ్దములు నేడు వినిపించినప్పుడు, నూతనవర్ణములు, నూతన రేఖాప్రవాహములు, నవీన వస్తుసంబంధములు నేడు గోచరించునప్పుడు రామచంద్రుని కంతయు విచిత్రమై, విస్మయమై, మాయాపూర్ణమై కనంబడి, యాతడు నిస్తబ్ధుడై పోయినాడు. తాను మున్నెన్నడు విననివియు, నూహింపనివియు నగు నద్భుత సందర్భము లచట సర్వ సామాన్యములై తోచి యాతనికి గనులు మూయని కలలై పోయినవి.

ఇంతలో నెవరో యాతని భుజముపై తట్టినారు.

## 3

## జ పా ను

రామచంద్రరా వులికిపడి వెనుదిరిగి చూచెను. జపానులో రసవిహారుని గృహమునందు దనకు స్నేహితుడై ఆ యోడలోనే అమెరికా పోవుచున్న సర్దారు అర్జునసింగుగారును, చెంత నొక యమెరికాదేశీయుడును, ఒక అమెరికా బాలికయును నిలిచియున్నారు.

‘ అయ్యా ! ఈ బాలుడు మా హిందూదేశములో దక్షిణాపథమం దున్న ఆంధ్రదేశస్థుడు. ఉత్తమబ్రాహ్మణుడు. బుద్ధవరపు రామచంద్రరావు. మీ దేశము చదువునకు వచ్చుచున్నాడు. రామచంద్రరావ్‌జీ ! వీరు న్యూయార్కు-పట్టణవాసస్థులు.

రౌనాల్డుసన్నుగారు. సుప్రసిద్ధ డాక్టర్లు. వడ్డీవ్యాపారస్థులున్ను అనేక కంపెనీలలో పెద్ద షేర్లున్నవారును కూడ వీరికి దాసానుదాసులు. ఆమె వారి తనయ. ఆమె బి. యె ఆనర్సు హార్వర్డులో జదువుచున్న లియోనారా కన్య.

'రామచంద్రరావుగారు ! మాకు మిమ్ములను చూడడం చాల సంతోషం.

లియొ :—నమస్కారములు రామచంద్రరావుగారూ !

రామచంద్రునకు జాల సిగ్గువేసినది. పరదేశయాత్ర ప్రారంభించినది మొదలు రామచంద్రుడు విదేశీయులతో నవసరసంభాషణ నెన్నడు చేయలేదు. ఇంగ్లీషుభాష తప్ప మరే విదేశీయభాషయు రామచంద్రునికి రాదు. పెద్దవారితో జనువుగా మాట్లాడుట చిన్నతనమునుండియు నెరుంగడు. తండ్రికడకూడ భయభక్తులతో సంచరించువాడు. కాబట్టి రామచంద్రుడు నమస్కారమని మిన్నక నిలిచెను.

అర్జునసింగ్ :—రామచంద్రరావుగారు మెత్తనిహృదయము కలవాడు. మాదేశంలో గొంచెము తలయెత్తుకొని తిరుగు కుటుంబములలోనివాడు. అమెరికా దేశమునందు జ్ఞానము సరస్సులు కట్టియున్నదని యాయన నమ్మకము. ఆ జ్ఞానము మనసారగ్రోలవలెనని తలంపు.

డా. రౌనా :—రామచంద్రరావుగారూ ! బ్రాహ్మన్సు మీ దేశం వదలి, వెడితే నరకములో పడతారటకాదా ! మీ రేలావచ్చారు ?

రామ :—ఇప్పు డంతపట్టింపులు లేవండి.

లియొ :—కులము తేడాలు పుట్టుకతోనే ఉంటాయటకాదూ. వారు వీరిని వీరు వారిని వివాహము చేసుకోకూడదట, భోజన ప్రతిభోజనము లుండవట.

రామ :—అవునండి ! మ—మ—

డా. రౌనా :—మీ సిక్కులు గూడా హిందువులేనా అర్జునసింగుగారూ !

అర్జున :—హిందూదేశములోవున్న క్రైస్తవులూ హిందువులే.

లియొ :—ఏలాగు ?

అర్జున :—అమెరికాదేశములో జ్యూమతస్థులున్నారు. మహమ్మదీయులున్నారు. బౌద్ధులున్నారు. వీరందరూ అమెరికనులే. హిందూదేశములోని వారంతా హైందవులు.

డా. రౌనా :—(నవ్వుచు) ఆలాగా ! అయితే క్రైస్తవులూ, మీరూ హిందూమతస్థులు కారన్నమాట.

అర్జున :—మా మతం సర్వమత సమ్మతము. అన్ని మతాలను తల్లివలె హిందూ మతం కడుపులో పెట్టుకుంటుంది. హిందూమతంలోఉన్న లోటును తీర్పడమునకు శ్రీ నానకుసింగు గురుమహరాజ్ సిక్కుమతము ఉద్భవింపజేశారు. కాబట్టి సంఘసంస్కరణ రూపమైనది మా మతం. ఆలాంటి అంతర్మతాలే బౌద్ధ జైనమతములున్ను. ఇప్పటి బ్రాహ్మసమాజము, ఆర్యసమాజము, సత్సంగసమాజము మొదలైనవియున్ను.

లియొ :—ఈ సంఘ సంస్కరణ మతాలలో బ్రాహ్మణులున్నారా ?
అర్జున :—లేరు. ఈ మతాల్లో చేరినవారికి వర్ణభేదము వుండదు.
డా. రౌనా :—ఒక సంఘమువారికీ ఇంకోసంఘం వారికీ వివాహాలున్నవా ?
అర్జున :—లేవు. కాని ఏ పిల్లనైనా వారు చేసుకొనుట కభ్యంతరపెట్టరు. దానిని బట్టి వెలి తప్పులేదు.
లియొ :—ఆంధ్రదేశం అన్నారు. అదేమిటి ?
అర్జున :—హిందూదేశములో పదిహేనో పదహారో పెద్దభాషలున్నవి. అందులో ఆంధ్రభాష లేక తెలుగుభాష ఒకటి. ఆ భాష మాట్లాడేజనులు మూడుకోట్ల పైన వున్నారు.
లియొ :—అమెరికాలో ఏమి చదువుకొనుటకు వచ్చుచున్నారండి రామచంద్రగారూ ?
రామ :—ఆ౯ ఉ౯ లెక్క లండి.
లియొ :—ఏ విశ్వవిద్యాలయములో ?
రామ :—జపానులో స్నేహితులు 'యేల్' విశ్వవిద్యాలయములోనో లేక 'హార్వర్డు' లోనో చేరమన్నారు.
లియొ :—మీ దగ్గిర శిఫారసు ఉత్తరా లున్నాయా ?
రామ :—నాలుగైదున్నాయండి.
లియొ :—హార్వర్డులో చేరండి. నేను ఎమ్. ఏ. చదువుచున్నాను. విద్యుచ్ఛక్తి అభిమానశాస్త్రంగా. తర్వాత అమెరికాకు శాస్త్రపరిశోధనములో తండ్రి, మహావిద్వాంసుడు, విద్యుచ్ఛక్తిచే వూడిగంచేయిస్తున్న మంత్రవేత్త థామస్ ఎడిసన్‌గారి విద్యుచ్ఛక్తి కర్మాగారాలలో కృషిచేయవలెనని యూహ.
రామ :—అలాగాండి. హార్వర్డు బాగుంటే అక్కడే చేరుతాను.
డా. రౌనా :—మీ దేశంలో వైద్యసహాయం చాల తక్కువటకాదా ?
అర్జున :—అవునండి. మీ మిషనరీలు మా దేశదౌర్భాగ్యములన్నీ గ్రంథములలో వ్రాసినారు. పాపం మిషనరీలే లేకపోతే మాదేశం ఈపాటికి నీగ్రోదేశంవలె అయిపోయియుండును.

రామచంద్రుని వినయసంపదయు జ్ఞానసముపార్జనా తీవ్రోత్కంఠతయు డాక్టరు రౌనాల్డుసన్‌గారి హృదయమును జూరకొన్నది. రామచంద్రుడు చక్కని యింగ్లీషుభాషలో తన దేశస్థులు, తనమతము, తనదేశములోని రాజకీయాందోళన, గాంధిగారి వర్తమాన కార్యక్రమము మొదలైనవానినిగూర్చి ఆయనకు దెలిపినాడు. గాంధీమహాత్ముని యుపదేశములు ప్రజాసామాన్యమునకు బాగుగా నచ్చినవనియు, నుద్యోగవాంఛాపరులగు విద్యార్థులకు మాత్రము పదవులపై నాశవదలలేదనియు తెలిపినాడు.

డాక్టరు రౌనాల్డుసన్ అమెరికాకు బ్రథమమున వలసపోయిన 'పిల్‌గ్రింపాదర్సు' (యాత్రిక వృద్ధులు) సంతతివాడు. 'నీలిరక్తము' (అచ్చ రక్తము) ప్రవహించు

ఉత్తమకుటుంబములోనివాడు. కష్టపడి చదువుకొని అమెరికాలోని గొప్ప వైద్యులలో నొకడై భాగ్యవంతుడై గౌరవము సంపాదించుకొన్నాడు. సదయహృదయుడు. నీగ్రోల బానిసత్వము సంపూర్ణనాశనము చేయవలెనని వాదించు నానుష్ఠానిక క్రైస్తవుడు. క్రైస్తవమతము చర్చిమత మైనదనియు, యేసుక్రీస్తు బోధించిన మతము మహోత్కృష్ట మైనదనియు అందలి పరమార్థమును గ్రహించినవారు కొలది మందియే యనియు రౌనాల్డుసన్ వాదించును. 'హోల్మ్స్' మతగురువు బోధ రౌనాల్డుసన్ మహాశయునకు బూర్తిగా నచ్చినది. అన్నిశక్తులలో ప్రేమశక్తి దొడ్డది. ప్రేమయే భగవత్స్వరూపము సూర్యుడు మంచును గరగించునట్లు, ప్రేమ పాషాణ హృదయమునైన ద్రవింపజేయును. ప్రేమ జగమును వెలిగించు దివ్యజ్యోతి. ప్రేమ లేనినాడే క్రోధము, హింస, స్వలాభము, మాయ, అహంభావము, అసత్యము విజృంభించును. లోకమునందలి యుద్ధములు, దొంగతనములు, వర్తకకౌటిల్యము మొదలగు దుర్గుణములకు గారణము ప్రేమలేమియేయని యాయన స్నేహితులతో వాదించుచుండును.

పరదేశ స్వతంత్రత, యుద్ధరాహిత్యము, వర్ణభేదవిచ్ఛేదనము మున్నగు నాశయములతో పనిచేయుట కమెరికాదేశములో నెవ్వరు ప్రయత్నించుచున్నను వారికి రౌనాల్డుసన్ తన చేతనైన సహాయము జేయుచుండును. 'సణ్డర్‌లాండు,' 'హోల్మ్స్,' శాసనసభికుడు 'బోరా' మొదలగు వారాయన స్నేహితులు.

'రామచంద్రగారు! అమెరికాదేశ ప్రజలు విచిత్ర భావములు కలవారు. స్వతంత్రతకై ప్రయత్నించు ప్రజలకు జయము గోరుదురు. జయము గాంచినచో మిక్కిలి సంతసించెదరు. కాని ఫిలిప్పైనుదీవులను వారు వదలరు. వారి క్రైస్తవ మతము సర్వదేశముల వ్యాపింప కోట్లకొలది డాలర్లు ఖర్చుచేసెదరు. తమదేశస్థులకు క్రీస్తు ఉపదేశవాక్యముల నేర్పుటకైనను, రాగిడబ్బు ఖర్చుచేయరు తాము ఆంగ్లదేశముపై శరించి విడిపోయి స్వతంత్రత సముపార్జించుకొన్నారు. హిందూ దేశము స్వతంత్రతకై సర్వస్వము ధారవోయుచుండ, క్రైస్తు అపరావతారమనదగు మహాత్ముని గూర్చియు, హిందూదేశమును గూర్చియు నీలివార్తలు ప్రకటించెదరు. కాని ఎన్ని చెప్పినను చదువుకొన్న ప్రతి అమెరికనునకు హిందూదేశము మాయా సంపూర్ణము, సర్వమతజనని, సర్వకళాశ్రయము, సర్వాద్భుతనిలయము. ప్రతి హిందువుడు కవి, వేదాంతి, భక్తుడు, ఊహాప్రపంచసంచారి. కాబట్టియే, ప్రతిఏట అనేకులు అమెరికనులు హిందూదేశయాత్రగావించెదరు. కోట్లకొలది ధనము ఖర్చు చేసెదరు. క్రిందటివత్సరమునుండియే నేను, మా అమ్మాయి ఆసియాను దర్శించ ప్రారంభించినాము. అదివర కమెరికా ఖండములలోని దేశము లొకవత్సరము, యూరోపియను దేశము లొకవత్సరము చూచినాము.'

లియొనారా కన్యకతల్లి ఇటాలియను. అప్పటికే ప్రసిద్ధికెక్కి, సంపూర్ణ యౌవనములోనున్న డాక్టరు రౌనాల్డుసన్ గారికడ చికిత్సబడయుట కామె విచ్చేసి

నప్పుడు వైద్యుడు రోగియు నొకరి నొకరు ప్రేమించుకొన్నారు. 'మ్యారియానా,' కౌంటు గ్యాలెటీ ఫెబియానోగారికుమార్తె. తండ్రి ఇటలీదేశము తరపున రాయబారియై వాషింగ్టన్ పట్టణములో నున్నప్పుడు బాలికయగు మ్యారియానా ప్రభు కుమారికి హృదయరోగము సంభవించి హృదయరోగ చికిత్సాదక్షుడగు రౌనాల్డుసన్‌గారి వైద్యమునకై కొనిపోబడినది. దేహసంబంధమగు హృదయరోగమును మాన్పి, మనస్సంబంధమగు కామరోగమును గల్పించినాడు ధన్వంతరి రౌనాల్డుసన్. తమ కుమార్తెను అపరిమితముగ బ్రేమించు ఫెబియానో ప్రభుదంపతులు తుదకు వారిరువురి వివాహమునకు సమ్మతించవలసి వచ్చినది.

ఆ రౌనాల్డుసన్ దంపతుల గర్భమున చంద్రకిరణమువలె లియొనారా జనించినది.

లియొనారా స్వప్నకుమారి. మధుర మధురముగ సంగీతము పాడగలదు. 'లాటిను' దేశస్థుల 'బ్రునెటీ' (నల్ల జుట్టుగలవారు) యందము. 'నార్డు' జాతి వారి స్వర్ణకేశ సంపద, నిర్మలనీలదృష్టి, స్నిగ్ధశరీర ధావళ్యము నామెలో బ్రతిఫలించి, లియొనారాను అమెరికా బాలికలలో ఆనాటి అందకత్తెలలో రాణిని జేసినవి. ఆధ్యాత్మికానుభవ విషయములన్నియు నామె హృదయమును చలింపజేయును. హిందూదేశము, చీనా, జపాను, బర్మా, జావా, బలి, సింహళదేశముల చరిత్రలు, కథలు, కవిత్వము ఆ బాలిక బ్రతుకు మూలమంట గదలించివేయును.

తండ్రి కుమార్తె లిరువురు. భారతీయులతో స్నేహ మొనరింప ముచ్చటపడుచుందురు. ప్రసిద్ధ భారతీయు లమెరికా వచ్చినప్పుడు వారిని తమయింటి కతిథిగా బిల్చుచుందురు. రవీంద్రనాథుడు, మెహర్‌బాబా, ప్రేమానందస్వామి, కృష్ణాజీ మొదలగు వారాయన భవనమున కతిథులుగావచ్చినారు. తారకనాథదాసు, సుధీంద్రబోసు, లజపతిరాయి వారియింటికి తరచు వచ్చుచుండువారు.

రామచంద్రుడొక యుత్తమబ్రాహ్మణ కుమారుడు, భారతీయుడని వినినంతనె తండ్రికుమార్తె లిరువురు నాతనిస్నేహ మొనరించి తమ గృహమునకు దీసికొనిపోయి ప్రసిద్ధినొందిన హార్వర్డు విశ్వవిద్యాలయములో బ్రవేశపెట్టింప దలపోసినారు.

## ౪

## హార్వర్డు

శాంత మహాసముద్రము మహాసముద్రములలోనెల్ల విచిత్రమైనది. ఇందున్న దీవులు పెక్కులు. దీవులలోనిపంట అద్భుతము. ఇచ్చటనే బొప్పాయి, టొమాటో, పొటాటో, పొగాకు, సదాపనస, పంపర, అనాస, జీడిమామిడి మొదలగు జాతులు ప్రథమమున నుద్భవించినవి. నిర్మల శర్వరీగగనముల మినుకాడు నక్షత్ర కాంతులు సముద్రపునీటి మెరుపులలో బ్రతిబింబములైనవి. ఉబుకుతరంగముల గీతికలలో జ్యోత్స్నారేఖలు పొదిగింపబడినవి. ఆ మహానౌక యపరిమితవేగమున నడుచుచున్నది.

రామచంద్రునకు రౌనాల్డుసన్ తన స్నేహితులందరితో పరిచయము కలిగించినాడు. రామచంద్రుని విజ్ఞానమునకు వారంద రపరిమితానందము నొందుచుండిరి. ఎంతటి చిక్కులెక్కలనైన నాతడిట్టె విప్పి చెప్పగలడు. పదార్థ విజ్ఞానశాస్త్ర రహస్యము లన్నియు వానికి గరతలామలకములు. కావున నాతడు విద్యుచ్ఛక్తి విషయికమగు జ్ఞానమునెల్ల సముపార్జించుట యుత్తమమనియు, దనదేశమునకు, దనకు ఖ్యాతితెచ్చుట కింతకన్న వీలింకొకటి లేదనియు లియోనారా యాతనికి జెప్పి యొప్పించెను.

ఓడలోనుండియే రౌనాల్డుసన్ హార్వర్డు విశ్వవిద్యాలయమునకు వాయువార్త బంపి రామచంద్రుని ప్రవేశమున కంగీకారము సంపాదించెను.

అర్జునసింగు శాంతమహానీరధితీరములనున్న పట్టణములతో వర్తకముజేయు నొక చీనా కోటీశ్వరుని యుద్యోగి. ఆతడును స్వంతముగా గొంతవర్తకము జేయుచుండును. అర్జునసింగు నివాసము శాన్‌ఫ్రాన్సిస్కో నగరము.

కతిపయదినములకు నౌక శాన్‌ఫ్రాన్సిస్కో నగరము వచ్చిచేరినది. ఆమహా పట్టణము అమెరికా పడమటితీరముననున్న గొప్ప నౌకాశ్రయస్థలము. ప్రసిద్ధికెక్కిన రేవుపట్టణము. పశ్చిమతీరమున నిది మహాపట్టణ మగుటవలన ఇక్కడనే చీనా వారివి, జపానువారివి అనేకవేల కుటుంబములున్నవి. శాంత మహాసముద్రమున దిరుగు నౌకలు శాన్‌ఫ్రాన్సిస్కో వచ్చి యచ్చటనుండి పెనామాకాలువదాటి అట్లాంటికు మహాసముద్రోప శాఖయగు మెక్సికో సముద్రమునుండి న్యూయార్కు, బోస్టన్, ఫిలెడెల్‌ఫియా మొదలగు పట్టణములకు బోవును.

రామచంద్రరావు, అర్జునసింగు, రౌనాల్డుసన్, ఆయనకుమార్తె యందరు ఓడదిగి 'ది గ్రేట్‌వెస్ట్రన్' అను భోజన హర్మ్యమునకు బోయిరి. హిందూదేశ వాస్తుల ఆచారవ్యవహారాదులకంటె జపానుదేశస్థుల ఆచారవ్యవహారాదులు వేఱు ఈ రెంటికి నమెరికా సంప్రదాయములకు నెంతయో భేదమున్నది. అడుగడుగునకు నాయాభేదములు గాంచుచు రామచంద్రరావు విస్మయము పడుచుండెను. రెండు రోజుల కర్జునసింగు రామచంద్రుని 'హాలివుడ్డు' అను సినిమాపట్టణమునకు దీసికొనిపోయెను. నెలకు లక్షలకొలది డాలర్లు జీతములు గలవారు, సంవత్సరమున కొకసారి వివాహ విచ్ఛేదమును జేసికొని మరల నితరుల వివాహమాడువారు, మిక్కిలి బలసంపన్నులు, సాహసవంతులు, అందమైనవారు, నాట్యకళావేత్తలు, హాస్యరస చూడామణులగు ప్రసిద్ధ నటీనటుల సమూహములచట నున్నవి. ఆపట్టణ వీధులలో నుద్యానవనములలో, కర్మాగారములలో పట్టణములు, ఎడార్లు మహాసముద్రములు కొండలు నదులు గాలివానలు, ఎండలు, చీకటులు, మంచుప్రదేశములు, వేలకొలది సంవత్సరముల నాటివి, వందలకొలది సంవత్సరముల నాటివి, నాటివి నేటివి ప్రతిదినము పుట్టుచు మాయమైపోవుచుండును. సృష్టి మాయాతత్వమెల్ల నచ్చట ననుక్షణము కన్నుల గట్టుచుండును.

అప్పటనుండి మోటారులో, రైలులో ననేకవేలమైళ్లు పయనమొనర్చి న్యూయార్కు-పట్టణమునకు మన యాత్రికులందరు విచ్చేసినారు. రామచంద్రరావు మూడుదినములు రౌనాల్డుసన్ వైద్యశేఖరుని కతిథియై మర్యాదలు చూరగొనినాడు. రౌనాల్డుసన్‌గారి వైద్యాలయమునకు, వారి జనపదావాసమునకు లియోనారా కన్యయు, నిటలీనుండి తండ్రి కుమార్తెలకన్న ముందుగా వచ్చిన రౌనాల్డుసన్ సతియు, రామ చంద్రుని గొనిపోయిరి. వారి భవనములన్నియు స్వర్గలోకతుల్యములై యుండెను. రౌనాల్డుసన్ భారతీయ విగ్రహములను, చిత్రలేఖనములను, లక్క-బొమ్మలను, దెరలను, అలంకరించిన యొక శాలకు 'భారతీయ మందిర' మను నామకరణముం చెను. వేరొక మందిరము 'చీనామందిర' మట వేరొకటి 'గ్రీకుమందిర' మట ఇంకనొకటి 'ఈజిప్టు మందిర' మట. వీనియన్నింటి యం దలంకరించిన విగ్రహ ములకు, చిత్రములకు, బంగారు వెండి రాగి సామానులకు, గంధము, దంతము, పింగాణీ చెక్కడములకు, దెరలకు, గొన్ని లక్షల డాలర్లు రౌనాల్డుసన్ వెచ్చబెట్టి యుండును. తన తండ్రియు, నారాయణరావు ప్రోత్సాహముచే తన మామగారును బంపిన పదివేల రూప్యములకు సరియగు డాలర్లను రౌనాల్డుసన్ రామచంద్రుని పేర మంచి బ్యాంకిలో వేయించెను.

రామచంద్రరావు బి. యస్. సి. తరగతిలో చేరుటకు వలయు సౌకర్యముల నన్నియు జూచుకొని హార్వర్డు విశ్వవిద్యాలయమునకు లియోనారా కన్యతో రౌనాల్డు సన్ సతీమణితో గలసివెళ్ళి విశ్వవిద్యాలయములో జేరినాడు.

విద్యార్థు లనేకులు త్రోవబత్తెము మాత్రమెట్లో సముపార్జించుకొని, అమెరికాకు బోయి విద్యాలయములలో ప్రవేశించెదరట. అమెరికా ధనవంతుల కాటపట్టగుటచే, ఇంగ్లండుదేశమునకన్న నక్కడ నన్నివస్తువులను మిగుల గిరాకిగా నుండును. తక్కిన యూరపియను రాజ్యములకన్న ఇంగ్లండులో వస్తువుల విలువ ఎక్కువ. భారతదేశముకన్న యూరపియను దేశములలో వెల లధికము. కావున నచటి కేగిన విద్యార్థులు హోటళ్ళలో వడ్డించియో, సినిమాలలో ప్రేక్షకులకు దారిచూపియో, యించుకించుక సంపాదించుకొందురు. కొందరు సెలవులకు పల్లెటూళ్ళకుబోయి, యచట రయితులకడ గూలిపనిచేసి ధనము సేకరించెదరట. బీదవిద్యార్థు లిట్లెన్నియో యగచాట్లనుబడి చదువుకొందురు. కొందరు బాలురకు శ్రీరామతీర్థ వివేకానందు లేర్పరచిన యుచితవేతనములు దొరకునట. అమెరికాలోని భారతీయులను అమెరిక నులు చాల గౌరవము చేయుచుందురు. భారతీయులు అమెరికా ప్రజలగుటకు మాత్రము అమెరికను లొప్పరు. తమతో వర్తకము జేయుటకు, తమ దేశపు విచిత్రములు జూచుటకు, వేదాంతములగూర్చి ఉపన్యసించుటకు, తమ విద్యాలయము లలో జదువుకొనుటకు భారతీయులు విచ్చేయుట అమెరికనుల కెంతయు నిష్టము.

అమెరికాదేశమునకు బోయిన యాంధ్రుల సంఖ్య చాల స్వల్పము. వంగల శివరాముగారు పి. హెచ్. డి. రాజ్యతంత్రజ్ఞానమునందు పట్టమునంది, భరతదేశ

మున, కలకత్తా విశ్వవిద్యాలయములో, నటుతరువాత లక్నో విశ్వవిద్యాలయములో పండితులుగా జేరి ప్రఖ్యాతిబడసియున్నారు. బాపినీడుగారు ఎమ్. ఏ. వ్యవసాయశాస్త్రమున పట్టమునంది, భారతదేశమునందు వ్యవసాయమున నూతనమార్గములు నెలకొల్ప దీక్షతోనున్నారు.

ఎల్లాప్రగడ సుబ్బారావుగారిని రామచంద్రరావుగారు హార్వర్డులోనే సందర్శించినారు. చెన్నపట్టణములో నాయన వైద్యవిద్యలో ఎల్. ఎమ్. ఎస్. పట్టమునంది, హార్వర్డు విశ్వవిద్యాలయములో ఉన్నతవైద్యవిద్య బడయుటకు సంకల్పించి, యా విద్యాకృషిలో దన్మయులై, యుత్తమ పరీక్షలలో గృతార్థులై, వైద్యవిద్యలో సత్యసూత్రార్జన తపస్సులో లీనమైపోయినారు. ఆయన విద్యయే యాయనకు భార్యయట, తల్లియట బిడ్డలట, మరల భారతదేశమున కెప్పుడు రాగలడో? తన గురువుగారితో నేకమై 'బయో కెమిష్టరీ' విద్యలో ననేక నూతనపథములు కనుంగొని నూతన విషయముల ప్రపంచమున కర్పించుచున్నాడు.

రామచంద్రరావుయొక్క యుత్కృష్టధీశక్తిగాంచి హార్వర్డు విశ్వవిద్యాలయ పండితోత్తము లాశ్చర్యపూరితులైనారు. గణితశాస్త్రమున బ్రపంచ ప్రఖ్యాంతిగాంచిన కమింగ్సు పండితుడు రామచంద్రుని మేధాసంపన్నతకుమెచ్చి, యాతని దనయండ జేర్చుకొని వేయి కనులతో గాపాడుచుండెను.

౫

## గా ఢ స్నే హ ము

నారాయణరావు మదరాసులో బి. యల్. తరగతిలో జేరినాడు. టెన్నిసు, కాలిబంతి, క్రికెట్టు ఆటలలో నాతడు మొనగాడు. న్యాయకళాశాలలో నాంధ్రవిద్యార్థులందరు నారాయణరావును విద్యార్థిసంఘ కార్యదర్శిగా నెన్నుకొని ధన్యులైనారు. పరమేశ్వరుని తనకడ కొన్నినాళ్ళుండుమని నారాయణ కోరుటచే నా యువకుడును వచ్చి చెన్నపట్టణములో నాతని చెంతనే నివసించెను. ఆలం నారాయణుని వదలడు.

పరమేశ్వరునకు చిత్రవిద్యాసంబంధమగు ఉద్యోగమేదైన దొరకువరకు, విశ్వదాత యగు నాగేశ్వరరాయలు ఆంధ్రపత్రికా కార్యాలయమున నాతనికి బ్రవేశము ప్రసాదించిరి. కావున భారతికి కథలను బద్యములను వ్రాసియిచ్చుచు, దినమునకు రెండు గంటలు చిత్రవిద్యాపరిశ్రమము సల్పుమని నారాయణరావు బోధించెను. తానును బరమేశ్వరునకు వేవిధంబుల సహాయము జేయుచుండెదనని నెమ్మదిగా దెలిపినాడు. నారాయణుడు తీరికయైన వేళలందు పరమేశ్వరునితోగలసి, మహదానందరూపములై అద్భుతలేఖనామూర్తి మంతములగు చిత్రములు చిత్రించువాడు. పరమేశ్వరుడాంధ్రపత్రికా కార్యాలయమున బ్రవేశించినాడు.

పరమేశ్వరున కయిదుగు రన్నదమ్ములు. పరమేశ్వరమూర్తి తండ్రియగు వెంకటరమణమూర్తిగారు మునసబీచేసి యుపకారవేతనము (ఫించను) బుచ్చు

కొన్నారు. బహుకుటుంబి యగుటచే నాయన ధనమేమియు వెనుకవైచుకొనలేదు. కుమార్తె వివాహమున కొలువేలు కర్చుజేసినాడు. లంచములమాట వినబడినచో నగ్నివలె మండిపోవువాడు. నేడు ప్రభుత్వమువారిచ్చు వేతనముతప్ప నాయన కితరాధారములేదు. ఆరుగురు కుమారులకు జదువులుచెప్పించెను. నెలకువచ్చు మూడువందల రుపాయలు తిండికి, కడగొట్టు బాలుర చదువులకు, వృద్ధురాలగు తల్లివైద్యమున కాయనకు బప్పువలె కర్చయిపోవును. పెద్దకొడుకులు ముగ్గు రుద్యోగములలో నున్నను వారు తెచ్చు జీతములు వారి కుటుంబములకే సరిపోవును. అప్పుచేయుట యన్నచో నాయనకు దేహము కంపించిపోవును. ధనము లేనిచో పస్తుండును గాని ఒక కాని పద్దువ్రాయడు, నోటువ్రాయడు.

పెద్దకుమారుడు విశాఖపట్టణము కాలేజీలోనున్న ఉన్నత పాఠశాలలో చరిత్ర పాఠముల చెప్పు నుపాధ్యాయుడు, వరదరాజులు బి యె. యల్. టి. గారు. రెండవ కుమారుడు శ్రీ రంగనాయకరావు. ఎటులనో స్కూలుఫైనలు పరీక్ష పూర్తిచేసి, పెద్దాపురము మునసబు న్యాయస్థానములో లేకరియుద్యోగము తండ్రిగారి ప్రాపకముచే బొంది. తగులంచములుగొనుచు భార్యాబిడ్డలతో గాలపక్షేము చేయుచుండెను. మూడవయాతడు బి. యె. బి. యల్. పరీక్షలలో గృతార్థతనొంది అప్రెన్టిస్అయి, హైకోర్టు వకీలయి, అనకాపల్లిలో న్యాయవాదివృత్తి సలుపుచు, బదిరాళ్ళయిన నింటికి దేలేక, తండ్రిగారి ప్రాపకముచే నెప్పుడు మునసబీపని యగునాయని గడియలు యుగములుగా లెక్కపెట్టుచుండెను. పరమేశ్వరమూర్తి నాల్గవవాడు. పరమేశ్వరమూర్తి వెనుక నొక బాలిక ఉమ, ఆమె వెనుక నిరువురు కవలలు, రామారావు, లక్ష్మణరావులు వెంకటరమణమూర్తిగారి జన్మమును దరింపజేయ నుద్భవించిరి. వారిరువురు నాల్గవఫారము చదువుచుండిరి. ఇట్టి చిక్కులలో నుండుట వలననే వెంకటరమణమూర్తిగారు, పరమేశ్వరునికి అనేక విధములగు సహాయము తా మొనరింపజాల మనియు, కుమారుడు అందరితోబాటు తనకడనున్న ఎట్టిలో కలో గంజో పోయగలననియు, నితరస్థలములకు బోయినచో, పరమేశ్వరుడు తన కుటుంబమును దానే భరించుకొనవలయు ననియు మొగమోటము విడిచి జెప్పినారు.

పరమేశ్వరుడు నారాయణరావుకన్న రెండేళ్లు పెద్ద. పందొమ్మిదివందల ఇరువది రెండవ సంవత్సరము గాంధిమహాత్ముడు భరతదేశ దాస్యశృంఖలా విమోచనమునకని ప్రారంభించిన అసహాయోద్యమములోజేరి, పరమేశ్వరుడొక సంవత్సరము కారగారవాస మనుభవించెను. అప్పటి కాతని వయస్సు పందొమ్మిది. బి. ఏ. చదువుచుండెను. నారాయణరావునకు పరమేశ్వరునకు చెఱసాలయందు గాఢ స్నేహము కుదిరినది. చెరవదలి వచ్చినవెనుక వారిరువురి మైత్రి తీగెవలెనల్లుకొని పోయి వారిరువురి యాత్మలొకటి, దేహములుమాత్రము వేరైనవి. పరమేశ్వరుడు 1924 లో బి. యే. పూర్తిచేసెను.

నారాయణరావు పరమేశ్వరు లిద్వరు సర్వ కళోపాసకులు. నారాయణరావపరిమిత మేథాసంపన్నుడు. పరమేశ్వరునికి జ్ఞానశక్తికన్న సృజనాశక్తి మెండు. నారాయణరావునకు కళాసృష్టి శక్తికన్న, ధీశక్తిమిన్న. నారాయణరావు చూపు మాత్రాన నెట్టివిషయమును సర్వార్థములతో గ్రహింపగలడు. ఏ జటిలవిషయము నైన సులువుగ బోధపడురీతి నుపదేశింపగలడు, ఉపన్యాస మీయగలడు. నారాయణు నకు జ్ఞాపకశక్తి యత్యద్భుతము. శాస్త్రజ్ఞానములో 'ఎయిన్‌స్టెయిన్' మొదలగు పండితోత్తముల గ్రంథములాతనికి మంచినీళ్ళ ప్రాయములు. అర్థమయిన విషయములు తలచినంతమాత్రాన నాతని మనోముకురమున ప్రత్యక్షములగును. నారాయణ జ్ఞానపిపాసకు, ఈ శాస్త్ర మాశాస్త్రమని హద్దులేదు. అతని ధీకిరణము సర్వశాస్త్రములపై ప్రసరించును. రామన్‌గారి 'కిరణ' విషయజ్ఞాన మననెంత ప్రేమయో ఆంధ్రేతిహాస విషయమునందు నంత ప్రేమయే. న్యూటను, ఎయిన్‌స్టెయిన్, అడిసన్, గౌతమ కణాదులు, నాగార్జునులు ఆతనికి చిరపరిచితులు. మహాపండితుల సిద్ధాంతము లెంతశ్రద్ధమై గ్రహించునో, శోణానదిపైని వంతెనపొడవును, చీనాకుడ్య చరిత్రమును అర్మీనియను జాతివారి చరిత్రమును, సముద్ర మీనభేదములను, అవి యివి యననేల సమస్త వస్తుజ్ఞానమును ఆతడంత యాస్థమై గ్రహించును.

పరమేశ్వరుని జ్ఞానశక్తి నారాయణరావు మేధాశక్తి యంత యగాథముకాదు. ఇరువురి హృదయములు రసార్ద్రములే యగును కాని, పరమేశ్వరునియందు లలిత కళాశక్తి యెక్కువ విజృంభించియున్నది. ఇరువురు సౌందర్యోపాసకులే! ఇరువురు జ్ఞానప్రియులేకాని పరమేశ్వరుడు తుమ్మెద. నారాయణుడు తేనెటీగ. జ్ఞానామృత సంపాదనమున నిదియే వారికి గల భేదము.

నారాయణరావు గంభీరహృదయుఁడు. పరమేశ్వరుడు దర్పణ ప్రతిమాన హృదయుడు. ఒక రహస్యము దాచలేడు. ఒక భావము గుప్తపరచు కొనలేడు. అయినను అతని జ్ఞానమును సర్వతోముఖము. ఆతని జన్మలగ్నమున బుధు డున్నాడు.

పరమేశ్వరుడు లతవలె నెల్లకాలము నెవరినోయొక ధీశాలియగు స్నేహితుని జుట్టియుండును. స్నేహితులు లేనినా డాతడు ప్రపంచమున నొంటియై యుంటినని భావించును. కాని పెక్కు ఘంటిక లాతడొక్కరుడు ధ్యానస్థిమితుడై యుండగలడు. ధీరత్వమునగూడ పరమేశ్వరుడు తక్కువవాడుకాడు. కారాగృహవాసమన్న వెనుకంజ నిడలేదు. ఒక్కడు గోదావరిలో బాతువలె నీదుకొనుచు మైళ్ళకొలది పోగలడు.

పరమేశ్వరుని హృదయము వెన్నవంటిది. స్త్రీలలో స్త్రీవలె మెలగగలడు. ఆడువారికున్న నాజూకు లన్నిటిలో నాతడు నిధి. అన్నిరకముల పాటలు పాడ గలడు. అభినయము చేయగలడు. ఆడువేషము వేసినచో సుంధర స్త్రీ మూర్తియై, వనితలనే భ్రమింపజేయగలడు,

అతని మనస్సు మైనమువంటిది. ప్రాపంచిక సాధకబాధకము లాతనిమనస్సు నెక్కువ కలతబెట్టినను, అవి తాత్కాలికములై, క్షణభంగురములై మఱునిమేషమున నంతరించి పోవును. అతని మనమ్ము యథాసంతోషస్థితి నందును.

నారాయణరావు తన హృదయమున్నకు నచ్చిన వారితోడ స్నేహ మొనరించును; పరమేశ్వరు డందరకు స్నేహితుడే. కాని పరమేశ్వరుడు కొలదిమందికే తన సంపూర్ణ హృదయము ధారవోయును. ఇరువురును గాఢముగ ప్రేమింపగలరు. నారాయణరావు ప్రేమ యాతని బ్రతుకును మూలమంట గదల్చి యా జన్మాంతము దివ్యజ్యోతివలె వెలుగుచుండ వలసినదే. పరమేశ్వరుడు స్నేహితు డొకసారి తన్ను మరచినచో తానును మరచిపోగలడు.

నారాయణరావు స్నేహము తనకు లభించినందుకు బరమేశ్వరుడు సంతతము భగవంతునికి గృతజ్ఞత దెలుపుచుండును ఆనందము నొందును. కన్నులరమోసి తన్మయుడగును. నారాయణుడు నిజమా కాదా యన్న ప్రేమచే నాతని యొడలంటును ఆతని యొడిలో దలనుంచి యంతర్దృష్టివహించును. 'మీకు నారాయణరావు అన్న గారు భర్తగారా, భార్యగారా?' యని రుక్మిణి పతిని మేలమాడును.

౬

## కవిత్వము

పరమేశ్వరునకు 'భారతి' పత్రికలో నేబది రూపాయల జీతమును గరుణార్ద్ర హృదయుడగు నాగేశ్వరరాయ డేర్పరచెను. తన భార్యను దీసికొనివచ్చి. పరమేశ్వర మూర్తి మాంబళములో గాపురము పెట్టెను. మంచినెయ్యి రాజమహేంద్రవరము నుండి వచ్చినదని, తన తండ్రిగారు కొత్తపేటనుండి కమ్మని పప్పునూనెయు, గొబ్బరినూనెయు, బంపించినారని, నారాయణరావు పరమేశ్వరునకెన్నియో వస్తువు లందిచ్చుచుండును. రుక్మిణమ్మకు పట్టణముజూపించుమని, సినీమాకని నారాయణరావు తన మోటారును పరమేశ్వరునికి నాతని సెలవు దినములలో బంపుచుండును. పరమేశ్వరుని మంచిగృహము నద్దెకు తీసుకొను మని ప్రేరేపించి నారాయణు డా గృహమున వారికి వలయు మంచములు పీఠములు వంటసామానులు మొదలగునవి కొనియిచ్చినాడు.

రాజారావు తనకున్న కొద్దితీరుబడి కాలములో నారాయణరావుతోడనో, పరమేశ్వరు నింటనో, పరమేశ్వరునితో నారాయణరా వింటిలోనో, స్నేహితులతో నానందము ననుభవించువాడు. ఏ స్నేహితుడు కావలయునన్నను నారాయణరావు తన మోటారుతో బోయి యాతని గొనివచ్చువాడు. ఆలం నారాయణరావును కలిసికొనని దినమేలేదు. రాజారావు, ఆలం, పరమేశ్వరమూర్తి, నారాయణరావులు ఒకరి కొకరు గాఢమిత్రులైనారు.

పరమేశ్వరుడు ఆనాటి యువకవులు రచించిన పాటలు పద్యములు కలకంఠముతో మధురముగ పాడుచుండెను. ఆత డెన్ని సభలలోనో పాటలు పాడువాడు. తాను పాటలను పద్యములను రచించును. చిన్నకథలను వ్రాయుచుండును. తన రచనముల భారతిలో ప్రకటించుచుండును.

ఒకనాడు పాట నొకదాని రచియించి పరమేశ్వరుడు నారాయణరావుకడకు గొనివచ్చెను.

'ఓహో తాతా నీదేవూరు ?
నీ వేడపోతవోయ్ ?
ఊరులేదు వాడలేదు
దేశమంతా నీదేవూరు
ఊరిబైట చెరువుకాడ
చేరుతోనే పాదుకొంటవ్.
తాతా నీదేవూరు
నీ వేడపోతవోయ్ ?
గిత్తపైన యిల్లుచుట్టావ్
యింటి సామానంతా కట్టావ్
బిడ్డాపాపలుకూడా నడుస్తే
యిడ్డూరాలే రాజ్యాలన్నీ.
తాతా నీదేవూరు
నీ వేడపోతవోయ్ ?
బిచ్చమేసేతల్లి ఉంటే
విచ్చిపోయిన పూవే బతుకు
యేసాలేసి బైరాగవుతవు
సేతులుసూసి సుద్దులు సెపుతావు.
తాతా నీదేవూరు
నీ వేడపోతవోయ్ ?

పరమేశ్వరుడు పాట పాడుచుండగనే రాజారావక్కడకు వచ్చినాడు. ఆలము పాట ముగిసినవెనుక వచ్చినాడు. ఆతడు పరమేశ్వరుని మరల పాడుమన్నాడు. పరమేశ్వరుడు మరల పాడినాడు. సంధ్యారుణమధురిమలో పరమేశ్వరుని గొంతుక తారాశ్రుతిలో విరిసిపోయినది. పల్లెటూళ్ళలో వివిధవేషాల తిరుగాడు బిచ్చగాండ్ల గుంపులు వారి కనులయెదుట నిలిచినట్లయినవి.

బిచ్చమెత్తుకొను జాతు లెన్ని శతాబ్దములనుండియో బిచ్చము లెత్తుకొనుచునే యున్నవి. జంగములు, బుడబుక్కలవారు, బైరాగులు, గంగిరెడ్ల దాసరివారు, కొమ్మదాసరులు, కోయవారు, ఎరుకలవారు, పగటివేషగాండ్రు, విప్రవినోదులు,

మంత్రగాండ్లు, అడవిచెంచులు, ఆనాదిభాగవతులు, రామదాసులు, నూనెగుడ్డలవారు, అమ్మవారి దేవరలు, దాసులు, తోలుబొమ్మలవారు, దొమ్మరివాండ్లు, రుంజలవారు, కాశీపటములవారు, భటరాజులు, బీబీనాంచారివారలు, గంగానమ్మభక్తులు, జంగాలు మొదలైన బిచ్చగాండ్రు వారి మనస్సీమలో జట్టుజట్టులుగా ప్రయాణము చేయుచు తోచినారు.

రాజా :—నారాయణరావు! మనదేశానికి ఈ బిచ్చగాళ్ళు చెదపురుగులురా.

నారా:—అది నేను ఒప్పుకోనోయి.

ఆలం :—నేనూను!

నారా :—ఎందుకంటావా? అసలు వీళ్ళలో పూర్వంనుంచీ మనస్సులకు వినోదము కలిగించేవారు కొందరు, కొందరు దేశద్రిమ్మరిజాతులు, అడవిజాతులు. వారి వల్ల భూతవైద్యం ఎరుక చెప్పించుకోవడం మొదలయిన లాభాలు పొందు తున్నాం మనం.

రాజా :—అయితే ఆ భూతవైద్యం ఎరుకచెప్పడం నీకిప్పుడు నమ్మకమేనా?

నారా :—నేను బిచ్చగాళ్ళ చరిత్ర చెప్పుతున్నానేగాని నాకు నమ్మకం అన్నానామరి. విను! వీళ్ళంతా మనకు ఏదోలాభం కలుగజేసి, మనవల్ల లాభముపొందే వాళ్లు. రానురాను మనకు పాశ్చాత్యనాగరికత వచ్చి ఈ బిచ్చగాళ్ళ జాతు లలో ఉండే కళాసౌందర్యము అనుభవించడము రూపుమాసింది. జంగాలు పాడే బొబ్బిలిపాట, దేశింగురాజుకథ, సర్వాయిపాపడుకథ, బాలనాగమ్మకథ, మరాటీకథ చెన్నప్పరెడ్డికథ, కామమ్మకథ మనము వింటున్నామా? ఆకథ లలో చమత్కృతి కళాధిక్యత గమనిస్తున్నామా? పాటకజనం మాత్రం నేటికీ ఆకథలు విని ఒక అనిర్వచనీయానందం పొందుతూ, వారికితోచిన బహుమతులు యిస్తున్నారు.

ఆలం :—మా మతం ఎప్పుడూ ధర్మం చేయమంటుందిరా!

రాజా :—అసలే మనదేశం బీదదేశం. ఇప్పటికైనా వీళ్లువదలకపోవడం ఏమిటని?

పరం :—వాళ్ళెల్లా వదలుతారోయి? వాళ్ళకి ఆధారం ఏదయినా చూపించూ. వాళ్ళ కీవృత్తి మహాసౌఖ్యమా ఏమిటి? వాళ్ళపాట వినో, ఆటచూసో, మాటకు ఆనందించో ప్రతిఫలంక్రింద గుప్పెడు గింజ లిస్తున్నాం. అంతేనా?

రాజా :—అలా మనకు నువ్వుచెప్పే ప్రతిఫలం యివ్వకపోతే?

పరం :—ప్రతిఫలం ఇవ్వకుండా ఉట్టిముష్టి ఎత్తుకునేవాళ్లు చాలాతక్కువకాదటోయి. వాళ్ళయినా ఒప్రప్రథమంలో ఏదో ప్రతిఫలం యివ్వకుండా ఉండి ఉండరు.

రాజా ;—నేను చెప్పేవిషయం మీయిద్దరూ గ్రహించలేదు.

నారా :—ఉండరాపరమం! నువ్వనేది, రాజారావు! వాళ్ళిచ్చే ప్రతిఫలం, ఇవ్వని దానితో సమం. కాబట్టి బీదదేశమయిన మనదేశానికి వీళ్ళు బరువుచేటు. కనక యీ ముష్టియెత్తడం మానిపించి వెయ్యాలని. అదేనా నీవాదన?

రాజా :—అవును।

నారా :—సరే ఈ బిచ్చగాళ్ళకి నువ్విప్పుడేపైనా పని చూపిస్తావా ?

రాజా :—పని చూపించే, వాళ్ళని మాన్పించివెయ్యాలని.

నారా —అదేదోషం. పిచ్చకుదిరితేనేగాని పెళ్ళి కుదురదు, పెళ్ళికుదిరితేనేగాని పిచ్చకుదరదు. ఇప్పుడు వ్యవసాయంలోనూ, గోడకట్టు, బండితోలడం మొదలైన చిన్నచిన్న కూలిపనులలోనూ, పట్టణవాసంలో, 'ఫ్యాక్టరీ, కూలిమోత మొదలైన పనులలోనూ, కావలసినంతమంది జనం ఉన్నారు. కాబట్టి ఇప్పుడు ముష్టి యెత్తుకునేవాళ్ళకి పనులిచ్చేందుకు పనులులేవు. అది కాకుండా ఇదివరకు పనులుచేసే సర్వవిధములైన పాటకజనములోనే అందరికీ కడుపునింపే పనిలేక, పోటీలతో ఏదోరకంగా ఒకవిధమైన సగటుకూలి అందరికి దక్కుతోంది. ఆ సగటు కూలీవల్ల పాటకపుమనిషికి, ఏడాదిలో ఆరోవంతు రోజులకు పూర్తియైన తిండి, అనగా రోజుకు ఆరోవంతుతిండి దక్కుతోంది. ఇంక ఈ బిచ్చగాళ్ళుకూడా పనికిదిగితే, మనిషికి ఒకనెల తిండే సగటున వస్తుంది. ఎందుకంటే కూలిజనం ఎంతమంది ఉన్నారో అంతమంది బిచ్చగాళ్ళజనం ఉన్నారు.

రాజా :—అదంతా నేనూ ఒప్పుకున్నాను. కాని మనదేశంలో ఇంకా వ్యవసాయానికి రావలసిన భూమెంత వున్నది.

నారా —సుమారు ఇప్పు డున్నదానిలో నాలుగుపాళ్ళలో మూడువంతులు వ్యవసాయానికి వచ్చేటందుకు వీలైనభూమి మిగిలింది. అల్లా వీలులేనివి, కొండా, అడవి, ఎడారిభూమిన్నీ.

రాజా —మూడుపాళ్ళైనా ఉందా లేదా ?

నారా —ఉంది. కాని ఆ భూమినీ వ్యవసాయానికి తీసుకువచ్చేటందుకు కొన్ని వందలకోట్లు కర్చవుతాయి. అది ఎక్కడ ? ఇప్పటి గవర్నమెంటు యివ్వలేదు. లక్షాధికారులు తక్కువ. వారూ ఇవ్వడం కష్టం. దేశం మొత్తంలో డబ్బు హుళక్కి.

రాజా :—నువ్వు చెప్పింది, పాటకజనమే వీళ్ళ కళా ఉత్కృష్టత కానందిస్తున్నారు అన్నావు. వాళ్లు ముష్టివేసి వాళ్ళ రాబడిసగం చేసుకుంటున్నారుగా ఎల్లాగూనూ.

నారా :—కాని ఆ బిచ్చగాళ్లు పాటకజనం దగ్గిరపొందే బిచ్చం ఉన్నదే, అది డబ్బుగలవాళ్ళ దగ్గిర సంపాదించే బిచ్చంలో మూటిలో ఒకపాలే ఉంటుంది.

రాజ :—మన స్త్రీలు పాశ్చాత్య విద్యాధికులు కానంతకాలం బిచ్చగాళ్ళకు భయం లేదు. పాశ్చాత్యవిద్యకూడా మన యీ పూర్వసంప్రదాయ వాసనను మార్చలేదెప్పుడును.

పరం :—మీరిద్ద రేమన్నాసరేగాని, బిచ్చగాళ్ళు కళాభాగం. వాళ్ళలో ఉన్న రసాభిజ్ఞత మనలోలేదు. తోలుబొమ్మలవాళ్ళలో చిత్రకారులున్నారు. రామదాసు

లలో పాటగాళ్లున్నారు. జంగాలలో కథకులున్నారు. టిక్కెట్లుపెట్టి గారడీ చేసి డబ్బుసంపాదిస్తే మాంత్రికుడు, వీధిలోడోలువాయిస్తో బుట్టలో మనిషిని మాయంచేయిస్తే బిచ్చగాడూనా ? నా ఉద్దేశమునకు స్వరాజ్యమువచ్చి దేశం బాగుపడ్డాక ఈ బిచ్చగాళ్ళని బాగుచేసి, వాళ్ళ కళాసంబంధమైన వృత్తులలోకి ప్రవేశించిన దోషాలు మాయముచేసి, ఆ వృత్తులు వృద్ధిపొందేందుకు కళాశాలలు ఏర్పరచాలని ఆ ఆశయము నన్ను పులకరాలతో నింపుతూఉంటుంది.

రాజా :—మన పరమేశ్వరుడు ఏదో కలలుకంటూ ఉంటాడు.

నారాయణరావు బిచ్చగాళ్ళను తలచుకొని మనవారి ధార్మికత సార్వజనీనముగ దేశములోని ధనము పంచుచున్నవిధము ఊహించెను. హిందూదేశములో రష్యా రాజ్యపద్ధతి యవసరములేదు. అది ప్రాపంచిక సంబంధమైనది. మన దేశమాత్మో పలబ్ధికై పాటుపడునది. కావున రష్యా పద్ధతి నవలంబింప జాలదు. రెండు రాజ్యములూ ముఖ్యముగా వ్యవసాయ దేశములేయైనను మనుష్యుని యాత్మవికాసమునకు దోడుపడని పద్ధతులేవియును భారతవర్షములకు బనికిరావు. ఏ దేశమునకును బనికిరావు. భరతఖండము సర్వప్రపంచమునకును ధారబోయు బోధన మిదియే ! జపాను దేశము నిమేషమాత్రమున పాశ్చాత్యమార్గ మవలంబించినది. టర్కీ అనుకరించుచున్నది. పెరిసియా యామార్గము వెంట నడువనున్నది. కాని నూటయేబది సంవత్సరములనుండి పాశ్చాత్యనాగరికతాసారము మన రక్తనాళములలోనికి ఇంజెక్షను చేయబడుచుండినను, మనలోనున్న పూర్వసంప్రదాయవాసనల నది వశింపజేయలేకున్నది. ' అయ్యో ! నా తల్లి ! నీకీపాశ్చాత్యనాగరికతా విమోచన మెప్పుడో గదా ' అనుకొనుచు నారాయణరావు నిమీలితలోచనుడై నాడు.

పరమేశ్వరుడు ' ఏమర్రా ! మీరిద్దరూ ఆలోచనలలో పడ్డారు. ఆలం మాట్లాడడు. నాపాటను గురించి మంచీ చెడ్డా చెప్పారుకారు. కష్టపడి తయ్యారుచేశాను. కోకిల్లా పాడాను ? ' అని మిత్రుల నిరువురిని బ్రశ్నించెను ఆలం నవ్వుచు ' నిన్ను మా పారశీకకవి ఒమారు ఖయ్యాముతో పోల్చానురా, పో ' అన్నాడు.

నారాయణరావు ' కారువాడికి కబురుపంపినాను. వాడు కారుపట్టుకువస్తాడు. కాస్త కాఫీపుచ్చుకోండి. రాజారావు సిగరెట్లు కాల్చడు. మనకు త్రిరాజిల్సు ఉన్నాయి. పదండిరా సినీమాకు. డగ్లాసు ఫిలుము ' త్రీమస్కెటీర్లు ' వచ్చిందిరా పదండి. సుబ్బయ్యా కాఫీపట్టుకురా ! ' యని కేకవేసెను.

ఆలం :—నాకు ఫలాటాలు కోడిగుడ్లు కావాలిరా.

పరం :—ఈ కుంకాయికి ఒక జందెం తగిలించరా నాదాయడూ.

ఆలం :—మీ కందరికీ ముస్లీముమతం ఇద్దామని చూస్తూంటే !

నారా -తెలుగు తురకలకు, అరవ తురకలకు హిందువులతో దెబ్బలాట లేనేలేదు ాదర్రా ! మీ కందరికీ హిందూమతం ఇద్దామని మేము చూస్తున్నాం.

౭

## జగన్మోహనరావు

శ్రీరాజా క్రొవ్విడి బసవరాజ రాజేశ్వర శ్రీ జగన్మోహనరావు బహద్దరుగారు గంజాంజిల్లాలోని నారికేళవలస జమీందారుగారు, నారికేళవలస బరంపురమ్మునకు గొలదిమైళ్ళదూరములో నున్నది. జమీయంతయు బది గ్రామములు. సాలుకు ముప్పదివేలు రాబడి.

కాని జగన్మోహనరావు బహద్దరుగారు మహోదారపురుషులు. ధనమొకచోట కూడియుండుట వారికి బడదు. ఏరీతినైననేమి ధనము ప్రపంచములోనికి బంపుట లోకకల్యాణప్రదము. భోగకాంతలు, బ్రాందిషాపు యజమానులు, జూదరులైన స్నేహితులు మొదలగువారు ధూమశకటములవంటివారు. ధనమును దేశములో వెదజల్లుటలో వారు ప్రసిద్ధులు. వారి సాహాయము లేనిచో, నొకచోటనే పాదుకొని పనికిమాలినదగును. ఇది వారి అర్థనీతి. పరదేశములనుండివచ్చు చాంపేనుబోర్డియా, ఎక్షాబ్రాంది, విస్కీలు సేవించితిమేని మనకు విశ్వసౌందర్యమలభడును. సిగరెట్లు మెదడును శుభ్రపరచి జ్ఞానాభివృద్ధినిజేయును. నాట్యస్త్రీలను బ్రోత్సహించుట లలిత కళాభివృద్ధికే.

జమీలలో జమీరయితుల క్షేమము ముఖ్యము అని వారిముందు ఎవరయిన పలికిరేని ఆయన పకాలున నవ్వును. అట్లయినచో ప్రభుత్వమువారేల జమీందారీ పద్ధతి ప్రవేశపెట్టెదరు ? రయితువారీపద్ధతినే యుంచి యుందురు ! కాబట్టి జమీ ధనము చిత్తమువచ్చినట్లు జమీందా రుపయోగపరచుకొనవలయును. అప్పులు చేసిన జమీ పాడగుట యేలసంభవించును ? జమీలు జమీందారుల పాలినుండి తప్పింప కూడదట ! జమీందారులు శాశ్వతబ్రహ్మకల్పముగ జమీలగట్టుకొని యూరేగెదరా ? బ్రతికియున్ననాళ్లు ననుభవించవలెను. తరువాత వేరొకనికి బోవుగాక ? ఈ సంపద ఎల్లకాలము నొక్కరే యేల అనుభవింపవలెను ? జమీ లమ్మకూడదని శాసన మెందుకయ్యా ? అని జగన్మోహనరావు వాదించుకొని తన్ను తాను సమాధానపెట్టు కొనుచుండును. ‘ధనము ననుభవించుట నెఱుగని కాశ్మీరగార్దభములు, అనుభవించు నాబోట్లను భోగలాలసులనియు, విలాసపురుషులనియు నిందింతురు. దూషణ భూషణ తిరస్కారములు దేహమునకుగాని యాత్మకుగావు. నేను బహుసహస్ర నారీ పరివేష్టితుడగు గోపాలకృష్ణుడను’ అని యనుకొనుచు జగన్మోహనరావు విశాఖపట్టణములోని తనమేడనుండిదిగి, వీధిలో వేచియున్న కారులోనికి నెక్కెను. వాయువేగముతో, నాశకటము సముద్రతీరమున ‘డాల్ఫినుముక్కు’ పైపుననున్న ‘మాక్లిన్‌జేమ్సు’ అను నొక యూరేషియను గృహస్థునింటికడ నాగెను.

జగన్మోహనరావు పాలిపోయిన తెలుపునగలియు పసిమి వర్ణమువాడు. సున్నితపుగు పలుచని మేనివాడు. కోలనగు మోము, కొంచెము బుజ్జముక్కు,

ఫ్రెంచి మీసములు, పెద్దనోరు, చిన్న చెవులు, సూదివలెనున్న గడ్డము, ఉంగరములు చుట్టియున్న తుమ్మెదరెక్కలవంటి జుట్టు, విపరీతముగా నెత్తైన ఫాలము నా యువకునకు వింతసొబగు సమకూర్చినవి. ఆతనికడ జమీందారీ ఠీవియున్నది. జమీందారీ హృదయమున్నది. ఇంగ్లండు దేశములోనున్న ప్రభువులవలె దానుండ వలయునని యాతని కోర్కె. 'డైమ్లరు' కారు, 'పియానో' వాద్యము, గిండీ పోటీపందెములకు నొక 'యరబ్బీ' గుఱ్ఱము, నెలకు డెబ్బది రూపికలకొక యాంతరంగిక మంత్రి, వేసవికాలములో 'ఊటీ' ప్రయాణము 'గోల్ఫు' ఆట, ఇంగ్లీషు నాట్యము, పాశ్చాత్య వేషము - ఇది వారి రాచఠీవి.

విశాఖపట్టణములో ఆగష్టు నెలలో ఆనాటి సాయంవేళ తన డైమ్లరు కారు నుండి మ్యాకులీన్ జేమ్సుగారి ఇంటిలోనికి బోవగనె, యాతనిసహోదరి 'డయానా జేమ్సు' జగన్మోహను నెదుర్కొని తన రెండుచేతు లాతని కందీయ జగన్మోహను డా యువతిని బిగియార కవుంగిలించి తనివోవ ముద్దుగొనెను.

'మోహన్! కొంచెం ఆలస్యం అయిందే! నువ్వు సరిగా వేళకు వచ్చే వాడవు ప్రాణప్రియా?'

'ఒక చిన్న వ్యాపారంవల్ల ఆలస్యంఅయింది. ప్రియతమమైన డయన్! క్షమించు. ఎప్పుడు నీ పెదవుల ద్రాక్షసుధారసము త్రాగుదామా అని ఉవ్విళ్ళూరుతో నిముషానికొక యుగంగా లెక్కచూసుకుంటో చెన్నపట్నానుంచి వచ్చాను. రెక్కలు కట్టుకుని నీ దగ్గిర వాలా!'

'నీ గుఱ్ఱం బొబ్బిలిపందెములో మూడవదిగా వచ్చినందుకు చాలా సంతోషం అయింది. నీకప్పుడే తంతినిచ్చా! ముందు సంవత్సరం 'గవర్నరు' పందెములో మొదటిదిగా వస్తుంది.'

'ఆ! ఈయేడు గవర్నరు పందెంలో మొదటిదిగావచ్చిన 'హ్యాపీవారీయర్' గుఱ్ఱాన్ని స్వారిచేసిన బ్రౌను కిప్పుడే 'కంట్రాక్టు' ఇచ్చాను. ప్రసిద్ధికెక్కిన 'రెయినాల్డ్సు'కు గుఱ్ఱాన్ని తయారుచేయుటకు అప్పచెప్పివచ్చాను. షికారురా!డయన్.'

మరల నామె నాతడు గ్రుచ్చి కౌగిలించుకొని, గదగద, పెదవి, కన్నులు, మెడ, చెవులు ముద్దిడుకొనెను.

వారిరువురు కారులోనికిబోయి కూర్చుండబోవుచుండ 'జేమ్సు' తల్లి లోపలి నుండి వచ్చి త్వరితముగ దిరిగిరండని చెప్పిపంపినది. జేమ్సింకను వివాహము చేసికొనలేదు. తల్లిదే ఇంటి పెత్తనము. ఆమెయే డయానా జగన్మోహనులకు సంబంధము కలిపి యద్దాని నానాటికి వృద్ధిచేసినది. జగన్మోహనుడు డయానాకు నెలకు రెండువందలు జీతమిచ్చును. అప్పుడప్పుడాతడిచ్చు బహుమతులు మొత్తము సాలుకు మూడునాలుగువేల రూపాయల ఖరీదుండును.

డయానాకన్య సుందరి. ఆమె దేహకాంతి దంతమువలె స్నిగ్ధమైన తెలిపసిమి కలది. ఆమె పెదవులు రంగులేకయే ప్రవాళములవలె నెఱ్ఱనై తేనెలూరుచుండును.

పొట్టియైనను, మంచియవయవస్ఫుటత కలిగి ‘ చక్కని జంతువు ’ అని యూరేషి యను యువకులచే బొగడ్తలందిన దామె. ఈతలో, ‘ టెన్నిసు ’ బంతియాటలో, నాట్యములో నామె ముందంజ. పియానో యద్భుతముగ వాయించగలదు. ఆమె గొంతు హృద్యమగు ‘ సొప్రానో ’ స్వరము కలదియట. వాల్తేరులో జరుగు ‘ క్రిష్టమసు ’ వేడుకలలో నామెయే నాయకురాలివేషము వేయును. సంగీత ప్రదర్శనములో నామెదే ముందంజ. వాల్టేరు విశాఖపట్టణముల పాశ్చాత్యులలో, యూరేషి యనులలో నవనాగరికులలో నామె నాసించని పురుష డొక్కడును లేడు. అట్టి తరుణమున నామె శ్రీమంతుడగు జగన్మోహనుని వరించినది.

వారి కారు సింహాచలము రాచబాటపై నలమండ మొదలగు గ్రామములు దాటి భీమునిపట్టణము వెళ్ళినది. వారు బండిదిగి సముద్రతీరమున నడుచుచూ ఏకాంత ప్రదేశమునకుజని యూ సైకతముపై నధివసించిరి. వారపరిమిత మోహావేశులై యాచీకటిలో తారకా కాంతులలో సముద్రము గంభీర సంగీతము పాడు కొనుచుండునప్పుడు సర్వము మరచిపోయిరి.

కొంతసేపటికి వారు నర్మ సంభాషణము లాడుకొనుచు మందహాసముతో మరల బండినెక్కి యెనిమిదిగంటలకు విశాఖపట్టణమువచ్చి చేరుచు, వాల్తేరులో రొజారియొ యను గార్డు గృహముకడ నాగి గార్డు దంపతులను వారి బాలికను కనుగొని వచ్చిరి. ఆరోజున జేమ్సు ఇంటికడ జగన్మోహనునకు విందు. జగన్మోహనునకు గొడ్డుమాంసము తప్ప తక్కిన మాంసాహారము భక్షించు నలవాటు లేదు. మాక్లీను దన హృదయము చూరగొన్న రొజారియోకూతును, ఆమె తల్లి దండ్రులను వాల్టేరునుండి విందుకుబిలిచినాడు. వారికై మాక్లీను నాతని తల్లియు నుచిత వేషములతో నెదురుచూచుచుండిరి.

జేమ్సు మాక్లీను ఇంటి ముందరి వసారాలో గోడలకు నీటిరంగు చిత్రములు, పెద్దపులితలలు, బల్లెములు, బాణములు తగిలించి యున్నవి. పరుపు కుర్చీలు, బల్లలు, బల్లలపై చీనాదేశపు ఇత్తడి కూజాలు, కూజాలలో పుష్పములున్న కొమ్మలు అలంకరింపబడి యున్నవి. గుమ్మములకు డమాస్కసు తెరలు వేలాడదీయబడి యున్నవి. దూరముగా నా వసారాలో బల్లలపై దీపము లిరుప్రక్కల వెలుగుచున్నవి.

మనవా రందఱు కుర్చీలపై నధివసించిరి. ఆ రోజు మెయిలులో జరిగిన యొక వింతనుగూర్చి ‘ మిష్టర్ రొజారియొ ’ చిరునవ్వుతో డయానావైపు తిరిగి చెప్పుచుండెను. డయానా తల్లియు, ‘ మిసెస్ ’ రొజారియోయు దక్కిన వారికి వినబడకుండ నేదియో చెప్పుకొనుచుండిరి. జేమ్సు తనబాలిక ‘ఫ్రాంసెస్ ’ ను దీసి కొని తోటలోనికి నాలుగడుగులు పచారుచేయుటకు వెళ్ళి యానడకలో నామె చెవిలో ‘ నా హృదయం నీకర్పించాను. ఏమిచేసినా నీదే భార ’ మని యస్పష్టముగ గాఢ వాంఛా గద్గదికమైన స్వరమున జెప్పుచుండెను. జగన్మోహనుడు డయానా యందమ్ము కన్నులార గ్రోలుచు తన్మయుడగుచుండెను,

ఇంతలో దేశవాళీ క్రిస్టియను 'బట్లరు' వచ్చి యందరకు షెర్రీద్రాక్షాపానీయము గాజుగ్లాసులలో నందిచ్చెను. అందరు నది నెమ్మది నెమ్మదిగా త్రాగినారు.

దయానా దుస్తులుమార్చి భోజనసమయోచితమగు 'గౌను' ధరించుటకు లోనికి బోయినది. జగన్మోహనుడు, సేవకుడు తన దుస్తు లొక తోలుపెట్టెలో గొనిరా, నవి ధరించుటకు లోనికి బోయెను.

తొమ్మిదిగంటల కందరు విశాలమగు భోజన మందిరమునకు బోయి యచ్చట మందిరమధ్యమున నమర్చియున్న మేజాబల్లచుట్టు నధివసించినారు. బల్లపై తెల్లని దుప్పటిపరచి, యందు పది కొవ్వువత్తి దీపపుబుడ్లు వెలిగించినారు. బల్ల పెద్ద కోడిగుడ్డాకారమున నున్నది. ఒడిలో నే పదార్థముపడినను దుస్తులు పాడయిపోకుండ కప్పుకొనుటకై మడతలిడి యుంచిన తెల్లని రుమాళ్లు దీసుకొని యందరు నొడులపై నడ్డముగా బరచికొనిరి. ప్రధమమున వారందరు ద్రవపదార్థము పుచ్చుకొందురు. అయ్యది యెముకల రసములో బోపువేసినది. తర్వాత కోడిపిల్ల వంటకము 'కాబేజీ మధురము' మొదలగు రుచ్యములైన పదార్థము లొకటి వెనుక నొకటి తీసికొనివచ్చుటయు వారందరవి పుచ్చుకొనుచుండిరి. మధ్య మధ్య చాంపేను పానము సోడాతో కలిపి త్రాగుచుండిరి.

పదిగంటలన్నర యగునప్పటికి భోజనములు పూర్తియైనవి. పిమ్మట వారు చిత్ర చిత్రములుగ దయారుచేసిన చాంపేనుబ్రాంది, విస్కీ, బోర్డియో ద్రాక్షాది పానములు త్రాగి యానందించినారు.

దయానాను 'పియానో' వాయింపుమని జగన్మోహనుడు ప్రార్థించెను. వారందరు సంగీతపు గదిలోనికి బోవుటయు, దయానా పియానో వాయించుచు నతి శ్రావ్యముగ బాడినది.

పిమ్మట దయానా వాయించుచుండ ఫ్రాన్సెస్‌కన్య కొంతసేపు పాడినది. పాశ్చాత్య సంగీతము పాడుటలో వాయించుటలో యూరేషియను జాతివారు చాలా ప్రసిద్ధి చెందినవారు. యూరపియనుల సభలలో, వీరు పోయి మధురముగబాడి వారి హృదయముల రంజింపుచుందురు.

పాశ్చాత్య సంగీతమునకు భారతీయ సంగీతమునకు మూల మొక్కటియే యైనను భారతీయ సంగీత సంప్రదాయ మొకమార్గమున ప్రవహించి మహాద్భుతముగ విజృంభించినది. ఆమార్గముననే కొంతవరకు నడచిన పాశ్చాత్య గానవిద్యా సంప్రదాయ మంతటితో నాగిపోవ, నూతన సంప్రదాయమును నిర్మించి జర్మనుజాతి యా గానమునకు క్రొత్తజీవము పోసినది.

భారతీయ సంప్రదాయము రాగ తాళముల ననేకరీతుల వృద్ధిచేసినది. పాశ్చాత్య సంప్రదాయము శ్రుతిని వివిధమార్గముల బెంపొందించినది. వారికి శ్రుతి ముఖ్యము, శ్రుతి సర్వము. దానికై వారు రెండుమూడు రాగములనే తీసుకొన్నారు. భారతీయ సంప్రదాయము రాగము లెన్నియేని సృజించుకొన్నది. తాళభేదముల వృద్ధిచేసినది.

# ౮

## యూరేషియను సాంగత్యము

జగన్మోహనుడు భారతీయ గాన సాంప్రదాయము విని యానందించలేదు. పాశ్చాత్య గాంధర్వమేనియు నాతని హృదయము గరిగింపలేదు. బహాయికొరకు, గౌరవముకొరకు, మర్యాదకొఱకు నాతడు వినినట్లు నటించును. కాని మనస్సులో దనయాలోచనలలో నాతడు మునిగిపోవును. ఆడువారు, అందులో పడుచువారు కచ్చేరి చేయునపుడుతక్క, నాతడు గానసభల కేగడు. పాడునట్టి యామె కన్నుల దిలకించును, కంఠము, పెదవులు, వక్షము గమనించుచు వివిధభావపథముల విషయలోలుడై యానందించును. లోకము మాత్రము జగన్మోహనరావుగారికి సంగీతమన్న పరమప్రీతి యని ముచ్చటించుకొనుచుండును.

డయానా పాడుచున్నంతసేపు నామె గంభీర నిషాదకంఠము నాలకించుట మాని యామె కంఠ సౌందర్యము, గిరజాలవలె కత్తిరించియున్న యామెజుట్టు మెలికలు గమనించుచు, నా ప్రౌఢ తనకు ప్రియురాలగుటకు తానెంతటి యదృష్టశాలియోయని తన్నుదా మెచ్చుకొనుచుండెను. ఈమెను పెండ్లియాడుటయే ధన్యత యనుకొనెను. తనకన్న రెండేడులు పెద్దయైన నేమి, అట్లెన్ని వివాహములు పాశ్చాత్య దేశములలో జరుగుటలేదు? నిజమైన నాగరికత వారికడనేయున్నది. వారివలె జీవించుటకన్న మానవుని బ్రతుకున కింక నేమిసౌందర్యము కావలెను? ఈమె యూరేషియను బాలికయని కొందరు తన్ను నిరసించవచ్చును. ఇంగ్లీషు బాలికలకన్న నీమె మిన్నయైనపుడు ఈ స్త్రీరత్నము నేల గ్రహింపరాదు? చెన్నపట్టణములో జదువుకున్న ఈ బాలిక, విద్యావంతురాలు. తనతల్లి యొప్పుకొనక కొంచెము గడబిడ చేయుమాట నిజమే! ఆమె, యెంతసేపు, జమీందారీ యెత్తుగల సంబంధము కావలయునని కోరును. ఇంగ్లడుదేశములో గూలివాడీదేశములోని జమీందారులతో సమానము. వారితో సమానమగువారే యూరేషియనులు. అట్టిచో తల్లి యెట్లభ్యంతరము పెట్టగలదు? ఇక జాతి మతముల మాటయా? బ్రాహ్మణులకన్న యూరేషియను లన్నివిధముల గొప్పవారేకద! డయానా యెంత సంతసించును? ఆ సుకుమారశరీర, యా దివ్యసుందర విగ్రహ, తనకు బ్రియతమయగు భార్యయై, తన జమీకి రాణియై, తన భవనములో చక్రవర్తినియై సంచరించుచుండ చూచినవారు పరమ పవిత్రులై పోదురు. తన మేనత్తకూతురు ముద్దులమిటారి, శారదను తాను పెండ్లి యాడకపోవుటచే ఆ పల్లెటూరి పందకు, ఒరాంగు ఉటాంగు కోతి కీయవలసిన యగత్యము సంభవించినది యని మేనత్తకు కోపము గావున, తా నీ భూలోకరంభను పెండ్లిచేసుకొన్నచో మొదట నీసుచెందినను నన్నతి ప్రేమచే జూచు మేనత్త చివరకు నొప్పుకొనితీరును. ఇంక నామెభర్తయా? ఆయన యనుమతి యెవరికి గావలయును? తన బాలికను నాకిచ్చుట కిష్టము లేకపోయినదట.

ఆయనకు యిష్టములేక, తుదకు పొలముదున్ను దున్నపోతు కిచ్చి వివాహము చేసినాడు. అట్టివాని యంగీకారముతో దనకు నిమిత్తములేదు.

సంగీతము పూర్తియైనది. పన్నెండు గంటలయినది. డయానా 'గ్రామఫోను' తీసి 'హావైను' నాట్యగీత మొకటి తగిలించి జగన్మోహనుని నాట్యమునకు రమ్మనిపిలిచెను. జేమ్సు ఫ్రాన్సిసు కన్యనడిగెను. ఆపడుచు జంటలు పాశ్చాత్య 'జాజు' నాట్యానందములో మునిగిపోయినారు. పదునేనునిముషములట్లు పరమసంతోషపూరితులై నాట్యమాడి తక్కినవారితోబాటువచ్చి కూర్చుండిరి. 'జాజు' 'వాల్టుజు' మొదలగు నాట్యములందొక పురుషుడు నొక వనితయుగలసి నాట్యమాడవలెను. పురుషుడు వనిత నడుముచుట్టు గుడిచేయినుంచి కవుంగిలించుకొని యెడమ చేతితో నామె కుడిచేయి పట్టుకొనును. పల్లవాధరియు పురుషుని భుజముపై ఎడమ చేయి నుంపవలెను. ఆసంశ్లేషముతో తాళమునకు సరిపోవునటు లడుగులు గలుపుచు చిత్రగతుల నాట్యమాడెదరు.

జగన్మోహనుడు యూరేషియనులు కూడ మెచ్చునటుల నాట్యమాడగలడు. ఆతనితో నాట్యమాడుటయన్న యూరేషియను సుందరీమణులకు నెంతయో ప్రీతి.

వారందరు కూర్చుండిన వెనుక యూరేషియనుల దుస్థితిగూర్చి యావద్భారత యూరేషియను సంఘనాయకుడగు కాల్నెల్ గిడ్నీగారు కలకత్తాలో నిచ్చిన యుపన్యాసమునుగూర్చి చర్చ వచ్చినది. 'ప్రపంచములో నెవ్వరిస్థితియైన విచారకరముగ నున్నదన్న నది భరతదేశపు మన యూరేషియనుల స్థితి మనల భారతీయులు దరికి జేరనీయరు. పాశ్చాత్యులదృష్టిలో మనము సంకరులము. శుద్ధయైరోపీయరక్తము మనవారినాడుల( బ్రవహించుటలేదట. ఇటుల నీ రెండుజాతులచే నిరసింపఁబడిన మనము తీవ్రముగా మన కర్తవ్యము. మన భావి భాగ్యోదయమునుగురించి యాలోచింపవలయును. హిందూదేశములో మన జనసంఖ్య చాలాతక్కువ. మనమును కొలదికొలదిగ దేశమెల్లెడ నున్నాము. కావున మనవోట్లెవరికి నుపయోగములేదు. మనకు స్థానికసంస్థలలోగాని, శాసనసభలలోగాని సరియైన ప్రాతినిధ్యములేదు. మనవారెందరో రైలుకంపెనీలలో బండి నడుపువారుగా, గార్డులుగా 'టిక్కెట్టు' పరీక్ష చేయువారుగా, స్టేషనుమాష్టరులుగా, ఇంజను పారిశ్రామికస్థానములలో పనివారలుగా నియమింపఁబడియున్నారు. రైలుమార్గము లింగ్లీషు కంపెనీల చేతులలో నున్నంత కాలము మనవారి యుద్యోగములకంత భయములేదు. అవి యన్నియుఁ బ్రభుత్వము వారి చేతికివచ్చి ప్రభుత్వము ప్రజారాజ్యమైనచో మనగతియేమి? ఇప్పటికే రైళ్ళ కంపెనీలలో భారతీయు లెక్కువగా నియమింపఁబడవలెనని సంచలనము కలిగినది' అని చెప్పినాడు. 'గిడ్నీ జ్ఞాపకమున్నదా?' యని రొజారియో వ్రాక్రుచ్చెను.

జగన్మోహనుడు :—అవునండి. కాని యూరేషియనులు సర్వవిధముల యూరపియనులతో సమానము. వారిసంతతియే అయినప్పుడేల యూరేషియనులకు భయముండవలయునో నాకు గ్రాహ్యమగుటలేదు.

రొజారియో సతి:—మన దేశ మింగ్లాండుదేశము. ఎప్పటికైనా మనమక్కడకు వెళ్లవలసినవారమే. పాపం! ఇంగ్లీషు ప్రముఖుఁడొకఁడు సెలవిచ్చినసంగతి నీవు వినలేదు. 'అటు ఇంగ్లీషువారికి ఇటు హిందూదేశస్థులకుగూడ కాక యూరేషియనులు రెంటికీ చెడిన రేవడలై పోయినారు.'

జగ:—మీ రంత యనవసరముగా భయపడుటకు నాకు గారణము కనబడుటలేదని ఇదివరకే చెప్పినాను. ఈ బ్రిటిషు ప్రభుత్వముపోదు ఈ ప్రభుత్వమున్నంత కాలం మనకు భయములేదు.

జేమ్సు:—అలాగున మనం అనుకొనుటకు వీలులేదులే, రాజాబహదూరూ! ఏ నాటికైనా మనము భారతీయుల మనుకోవాలి.

ఫ్రాన్సెసు:—భారతీయులు మనల జేరనీయరని అంటున్నారుగాదా?

జేమ్సు:—అవును. అందుకనే మనం ఇంగ్లీషువారి ప్రియశిశువులముగాన భారతీయులకన్న గొప్పవాళ్ళము. మనల కూరుచుండబెట్టి వారందరు మనల బోషించవలయునన్న పిచ్చియాలోచనలిక మనం మానివేయవలయును. భారతీయులు వారి యభివృద్ధికై సలుపునన్ని ప్రయత్నములలో మనము పాల్గొనవలయును. ఆ యుద్దేశముతోడనే రైలులో నుద్యోగములుచేయు మనవారందరు తక్కిన భారతీయులతో గలసి పనివారిసంఘము లేర్పరచినారు. సమ్మెలు మొదలైనవాటిలో వారితోబాటు మనవారును కష్టపడి పనిచేయు చున్నారు.

రొజా:—జేమ్సు చెప్పినది బాగున్నది. మనం ఈ దేశములో బుట్టినాము. ఈ దేశములో ప్రాణాలర్పించి, ఈ మట్టిలో గలిసిపోవుచున్నాము. ఇంగ్లీషువారుకాని, ఫ్రెంచి జర్మను వారలుగాని మనల వారి యింటికి భోజనమునకు బిలుచుచున్నారా? మనతో సంబంధ బాంధవ్యముల నెరపుచున్నారా? మన కితరాధారములులేవు, రెక్కలేయాధారములు. అయినప్పుడు మనము భారతీయులు సలుపు స్వరాజ్యాందోళనములో వారికి వ్యతిరేకముగ బనిచేయకుండ, మన నాయకులతో మన సాధకబాధకములు చెప్పుకొని వారి ప్రేమ సంపాదించుకొనవలయును. ప్రభుత్వమువారికి మన కృతజ్ఞత, మన రాజభక్తి వెల్లడించి వారిదయకు బాత్రులమును గావలయును.

డయానా:—మీరు చెప్పినది బాగున్నదండీ. కాని తీరా కాలం సమీపించేసరికి వీరూ వారూ మనల ద్రోసిరాజనెదరేమో?

రొజా:—ఆ చిక్కు రాకుండగ తప్పుకొనుమార్గమే నేను చెప్పునది.

డయానాకు వీరి సంభాషణచే విసుగు జనించి తాను సీతాకోక చిలుక నాట్యమాడెదనని తెలిపి ఫిడేలు వాద్యము వాయించగల తన యన్నగారిని ఫిడేలును, తన తల్లిని పియానోను వాయింప నియమించి, గెరార్డు ప్లాండెల్లో రచించిన "సీతాకోక చిలుక" గీతముయొక్క స్వర ప్రస్తారము గుర్తుగల కాగితములు తెచ్చియిచ్చెను.

వా రిరువురు వాయించుచుండ డయానా సీతాకోక చిలుక రంగుగల సన్న శాలువ రెక్కలుగ బట్టి విచిత్ర నాట్య మొనరించినది. ఆ నృత్యమున వారందరు తన్మయులై యుండ టింగ్ మని యొంటిగంట కొట్టినది. నాట్యమాగినది.

జగన్మోహనుని మోటారు శకటముపై రొజారియో దంపతులు ప్రాంసెస్ కన్య వెడలిపోయిరి.

ఆ జగన్మోహనుడు డయానాకన్యతో మేడమీది గదులలోనికి బోయినాడు.

జేమ్సు ఆ చీకటిలో సోఫాపైన కూర్చుండి "స్పెన్సరు" చుట్ట కాల్చుచు నేదో యాలోచనలో మునిగిపోయినాడు.



## పొలం

సత్తెయ్యకు భార్య కొత్తగా గాపురమునకు వచ్చినది. పదునేడేండ్ల వయసు కత్తె. చామనచాయ. బిగువయిన యవయవములు, సోగచూపులు, స్ఫుటరేఖలుగల మోము, నవనవలాడు నూత్న యౌవనములో నున్న యామె, పంటలక్ష్మివలె నవత రించినది. సోమయ్య ఇల్లు పావనమైనది. ఆతడా పేదయింటిపడుచు రూపురేఖలకు వలచి కోడలుగా వరించి తెచ్చుకొనెను

'ఒక నూరు రూపాయలు కట్నంతెస్తే నిండిపోతాదా ? మన అదురుట్టం బాగుండాలి గాని, అదురుట్టం లేకపోతే కోడలు యెయ్యిరూపాయలు కట్నంతెచ్చినా అత్తింటిలో అడుగెట్టిందా అన్నీ భగ్గున మండిపోవడమే. మా కోడలు మాలచ్చే; చూస్తుండండి. మావోడి జల్మపావనం అయిపోతాది !' అని సోమయ్య తన చుట్టా లతో జెప్పికొన్నాడు. వెండివడ్డాణం, దండకడియాలు, పిల్లకాసులపేరు పెట్టికొని చిరునవ్వు నవ్వుచు 'పల్లెటూరి కాపుబాల యైనదా ? లక్ష్మి' యని అనిపించునట్లు సూరమ్మ సుబ్బారాయుడుగారి దొడ్డిలో ప్రత్యక్షమైనది.

జానకమ్మగారికి, సుబ్బారాయుడుగారికి నూత్నవధూవరులచే నమస్కారములు సేయించుటకు దీసికొని వచ్చినప్పుడు, సుబ్బారాయుడుగారు నూరు రూపాయలు వారి కిచ్చి, సంసారమునందలి కష్టసుఖములు వారికిబోధించి, భార్యమనస్సు నొవ్వకుండా పువ్వులలోనుంచి కాపాడుకొనుచుండవలయు నని సత్తెయ్యతో జెప్పుచు 'దీర్ఘాయు రారోగ్యాభివృద్ధిరస్తు, దీర్ఘసుమంగలీభవ, పుత్రపౌత్రాభివృద్ధిరస్తు' అని దీవించినారు. 'అమ్మాయీ, అత్తగారికి మామగారికి, మగనికీ మనస్సునొవ్వకుండా సంచరించు కుంటూ ఉండు. వారికి సేవచేసి మెప్పుపొందు. ఈ రూపాయలు పెట్టి వీరికి నగలు చేయించి పెట్టరా సత్తెయ్యా ! నీతల్లికడుపు చల్లగా, నీ అత్తకడుపు చల్లగా పిల్లల్నీ మనమల్నీ యెత్తి వేయి కాలాలకు మీరంతా చల్లగా వుండండి !' అని ఆశీర్వదించి జానకమ్మ గారొక చీరెయు రవికెలగుడ్డయు పసుపు కుంకుమ పళ్లు కొబ్బరి బొంద ములు పెండ్లికూతునకు నిచ్చినారు.

మరునాడు సోమయ్య యుదయముననే యూడ్చు పొలముల కలుపుతీయించు టకు వెళ్లినాడు. బుడమ, కొణామణి. అట్రగడా, అక్కుళ్ళు,కృష్ణకాటుకలు, సుబ్బా రాయుడుగారి ఇంటి కర్పుకై పాలాట్రగడము నూడ్చినారు. చేలన్నియు బాగుగా పెరిగినవి. ఇదివరకే యెనుబది ఎకరములకు కలుపుతీయించినారు. తక్కిన ఇరువది యకరములలో పదిమంది మాలవాండ్రు నితరులు కలుపుతీయుచుండిరి. సోమయ్య తాటియాకుల గొడుగు వేసికొని గట్టుమీద కూర్చుండి పని చూచుచుండెను.

మాలపెద్ద ముసలినాగడు 'యీ రోజుల్లో కుఱ్ఱోళ్లు పనిచేయగలరంట్రా. ఆడు, సూడు యెదవనాయాలు ! బుర్లేగాని, పనిలేదు. వంగండబ్బా వంగండి' యని కేకవేసెను

సోమయ్య:—ఒరేయి ! పోతుగోయ్ ! ఏవిట్రా అదీ ! కలుపు తెంపుతున్నావా మేస్తు న్నావా ? వెదవ బద్దకాలా ! యేళ్లలోంచి లాగరా ! మళ్లీ పెరగవంట్రా ! ఒరే నాగన్నా అడి పనిసూడరా. సరీగ్గా చెయ్యకపోతే ఈ వాళ కూలిసున్నే. ఆ ఆడపిల్లల్ని చూసి బుద్ధి తెచ్చుకోరా కుంకన్నా ! యీ పిరగేస్తాను !

నాగన్న:—బాబూ ! యీళ్లపని మజా అయిపోతోందండా ! పెద్దోళ్ళమాట యింటారా యావన్నా నా ?

సోమన్న :—ఒరే పెద్దమాలా మాంచి కథ చెప్పరా ! అది వింటూ పని సుఖగ్గా చేస్తారు ! మట్టగిడసల్లావున్నారు. పనంటే తొంగుంటారు.

నాగన్న :—మరి రాగంతో సెప్పేత్తాబాబూ ఆళ్ళందరిని కలిపి ఊకొట్టమనండీ !

అందరు :—తప్పక, ఆ ! ఆ........! (అని కూనిరాగంతో ఊకొట్టుచుండిరి)

నాగన్న కథరాగదీర్ఘంగా చెప్ప నారంభించెను.

'అనగనగా ఓదేచంలో ఓపట్టణముందా'

'ఊఁ....!'

'ఆ పట్టణానికి పరుగుదూరంలో పెద్ద మాలపల్లి ! ఆ పల్లెలో రెండువందల గుడిసెలు, ఓదానిపైన ఓటెక్కి, ఉక్కిరి బిక్కిరిగా ఉన్నాయా'

'ఆఁ.... !'

'ఓ మాలపల్లి పెద్దమాలోడు ! ఆడుపూర్వం రాజులనుంచీ ఆరికి కాపలాకాసు కుంటూ సాకిరీ చేసుకుంటూ, నమ్మకంగా పెబువుోరి మణుసొచ్చినబంట్రైఉన్నాడా'

'ఆఁ.... !'

'ఓ రా పెద్దమాల యెంకటిదాసుకు భూమి, బుట్ర, పశువులు, పెంకుటిల్లు, సిరీ సంపద యేసీ యెయ్యకుండా ఉన్నా ఓడు ఎట్టబణాతుగోసెట్టి, ఎండిపొన్నుకఱ్ఱ సేతబట్టి, యీదెంట యెల్తావుంటే యెల్లాగుండేది ! ఆతగాడికి మా బగితి, పొద్దత్త మానం బజినేలు, సమువుకోడం, పాతుగోవడమున్నూ, అతగాడికి దైభము గొంతెమ్మ ల్లాగో, పాండవులోరిలాగో, కిట్టమూరితిలాగో కనబడేవోడంట. అతగాడిమాట నిజమై పోవాల. అతగాడు యిగిబూతి పెడితే దెయ్యాలు గియ్యాలు పారిపొయ్యేవి.

సెమ్యెత్తితే రోగాలు సెదిరిపొయ్యేవి. అమ్మవోరిని పలుకరిస్తే 'వూ' అంట దంటా—'

'ఆఁ.............!'

'అతగాడికి ఓకొడుకు. ఆడికి దేముడ్లు దయ్యంగియ్యం బయంలేదు. ఆడికి దెయ్యాలకంటె బలం! రాచ్చసుడులాంటి శగితి, బల్లూకం - అంటే ఎలుగుబంటి లాంటి పట్టు! ఆణ్ణి సూ త్తే అందరికి బయమంటా!'

'ఆఁ-

'మరిగంటే ఆడిపేరు మరకడు! మరకడికి ఆడపిల్లంటే మఱసు, పయి టంటె పక్కలెగరేస్తాడు, రైకఅంటే రంకెలేస్తాడు. ఇంతకొప్పెట్టి యింత కుంకు మెట్టి, చెవిలో తురాయిపూవు, మెళ్ళోగందం అలంకరించుకొని, చీర ఎనక్కుకట్టి, సంకకింద తట్టెట్టి, సంతలో కోమటాయనతో యేళాకోళాలాడి, గొబ్బరిచిప్పలో గొబ్బరినూనె యేయించి తలకు రాసుకొని, నవ్వుకొంటో యెళ్ళేనల్లపిల్లని సూసినా డంటే ఆడంతే ఆగిపోతాడు, పాణమైన యిచ్చేస్తుడా—'

'ఆఁ—!'

'అయ్యబత్తిమాట తలచడూ, ఆడి మరియాద తలచడూ, ఆపిల్ల యెనక బడి లంచమిత్తానంటాడూ రయికలిత్తా నంటాడూ, సీరలిత్తా నంటాడూ, ముద్దెట్టే నాపిల్లా, నేనందంగా లేనుంటే అని మిణకరిస్తాడు, మీసం తిప్పుకొంటాడు'

'ఊఁ—!'

'కాలవరేవుకీ, పొలంలోకి, గడ్డికోతకాడికీ యేళ్ళేపిల్లల్ని సూస్తే, ఆంబోతు ఆవుల్ని సూసినట్లే. ఒంటిపిల్ల యెల్లిందంటే ఆడి మొగతనానికి కొండచిలవకి లేడిలా అయిపోతదే. నక్కపోతుకు కోడిపెట్టలా అయిపోతదా!'

'ఊఁ—!'

'ఆ మరకదాసుతండ్రి సెప్పినమాట యినడు, దర్మపెబువులు సెప్పినమాట యినడు, తలారి సెప్పినమాట యినడు, తన దాచ్చిణ్ణెం సెప్పినమాట యినడూ'

'ఊఁ—!'

'ఆపల్లెలో పెద్దోళ్లు, సిన్నోళ్ళు, ఆడోళ్లు, మొగోళ్ళు ఆ ముసలి మాల పెద్దతో మరకాయిసేసే దురంతాలు సెబుతుంటే, ముసలోడుపెద్దూ పిరిడిసి కళ్ళు సగం మూతలైపోగా, 'యీయాళ కాకపోతే రేపు, ఇంటికాడ కాకపోతే పొలంలో, మొగోడిసేత కాకపోతే ఆడదానిసేతే, ఆడికీ బుద్దొత్తది. ఆడు నాకొడుకుగాడు, మనిసిగాడు, ఆడిసేటు ఆణ్ణి కొత్తేస్తది' అని సెప్పినాడురా.'

'ఆఁ!'

'మరకడే' దున్నపోతంటే. ఆడికి పేగితులు, దురిబోదనుడికి శకునిగాడు కరుణూడులాగ! రాబణాసుడికి కడగరోముడు, కుక్కతలోడు కుంబకరుణూడు లాగ! పది పిచ్చకుక్కల్లాంటి బలగం ఉందిరా'

ఆఁ!

'ఆ మాలగూడేనికి పెద్ద యీరమ్మ సెరువుపక్కా, యెట్టి యీరన్నగుడి సుంది. ఓరందులో నీలాలు ఆడికన్నకూతురుంది. అది గంపేగంగన్న వారియంట. గంగన్న మరింకోమాలపల్లికి యెట్టివోడంట. దాన్నిసూత్తే మైనం గోరువంక సిగ్గు పడాలి. బేతాలుడు గుడిలో నున్నగా తోఁయిన దాకులా తళతళలాడేటి వొళ్ళు. లేత రావాకు అరసేతులు, సెంగలువుకాడ సేతులు, సెందురూడిలాంటి మొగమూ, నగచత్రాల్లాంటి పళ్ళు, పిల్ల రెపరెపలాడిపోతూ గున్నమామిడి సెట్టులా ఉండే దంటా!'

'ఆఁ!'

'ఒరే దానిమొగుడు వంగోలు కారాంబోతు; గోదావరికాలవలాగ మాసోకైన మనిసంట. నీలాలుపిల్లా దానిబరత గంగన్నా రాయిసెట్టు యేపసెట్టు, తాడిసెట్టూ, నల్లేరుతీగ, జంట పావురాలు ఒకళ్ళొకళ్ళు యిడవకుండా మూఅపేచ్చంగా, మోగంగా ఉండేవోరు'

'ఊఁ!'

'మొగుడు పనిమీద ఐదరాబాదెళ్ళితే, పుట్టింటికొచ్చింది. పెద్దపులికి ఆవు కనబడ్డట్టు, బెమ్మరాచ్చసికి మనిసి కనపడ్డట్టుగా, సక్కనైన నీలాలు మరకన్న కంట పడిందంటరా!'

'ఆఁ!'

'ఎప్పుడైతే నీలాలు పిల్లదాన్ని సూసినాడో ఆడి మనసు మనసులోలేదు. దీన్ని అనుభయించకపోతే జల్మం ఎందుకు? బలం ఎందుకు. ప్రాణం ఎందుకు అని అనుకున్నాడు. నీలాలు పిల్లదాని బాబుకి మామిడిపళ్లు, సెకరకేళీలు, సీరలు, రైకలు పంపించేవోడు. నీలాలు తండ్రి అవన్నీ పట్టుకుపోయి కోపంతో ఆళ్ళింటిలోనే పారేసి, యెంకటదాసుతో 'నీకొడుకు సేసే దురన్నాయానికి మితుండటంలేదు. ఆడికి నువ్వు బుద్ది సెప్పుకుంటే మాం అంతా సంతోషిస్తాము' అన్నాడు—!'

'ఊఁ—!'

'ఓ రోజున మరకడు, సెరువుకు నీరుకోసం ఒంటిగా ఎడుతూన్న ఆసక్కని పిల్ల నీలాలు దాన్నిసూసి 'ఓలే నీకంటిమీద నామణసు, నీ వొంటిమీద నాసూపు, నీసేతులు, నీ నడుము, నీఅందం నన్ను నీకుక్కను చేసినై. నువ్వూనేనూ మారు మనువు సేసుకొందం. నీమొగుణ్ణితోలెయ్యే. ఆడికి ఎంతసొమ్మయినా తప్పు ఇచ్చే స్కుంటాను. నేనంతగా దేన్నీ బతిమాలలేదే. నీకు దాసుణ్ణి. నీముందర నాబలం అంతా నీరయిపోయింది. నన్ను రచ్చించుకో' అని దణ్ణంబెట్టాడు. నీలాలు బయ పడి గజగజలాడిపొయ్యింది. 'ఓరన్నా, నీ తోడుబుట్టిందాన్ని. నాయనా నువ్వల్లా అనవచ్చునంటరా!' అన్నాదుండి.'

'ఈలా ఒకసారికి రెండుసార్లు, మూడుసార్లు దాన్ని దెట్టించినాడంటా - లొట్టలేసినాడంట. సివాల్న సీరకొంగు యిసిరపట్టి సేయిపట్టుకొన్నాడంట.'

'ఆఁ —!'

'సెయ్యి ఇదిలించుకోని సెలపెయ్యలాగ పోతూన్న నీలాల్ని, యిడిపోయ్యే దాని కొప్పుసూసి ఒళ్ళు బిగివొదిలేసినాడు. ఇది మామూలుగా లొంగదు. దీన్ని బలవొంతం సెయ్యాలిసినదే. మామూలుగా లొంగేదికాదురా మాగెట్టి మణను, దీని పొంకమైన ఒళ్ళు నా ఒళ్ళు నొక్కేస్కోవాల: దీన్ని ముదెట్టుకున్న వోడిజల్మమే జల్మం, అనుకున్నాట్ట.'

'ఆఁ—'

'ఆరి! ఓరోజు సీకటడేయాల కుప్ప నూరుస్తుండే అయ్యకి కూడిచ్చేందుకు ఒంటిగా పొలం ఎల్లే నీలాల్ని సూశాడు. ఆడి ఒళ్ళుపొంగి పోయింది. ఆడికళ్ళెఱ్ఱ బడినై. ఆడిగుండె జల్లుమందిరా నాయనా. పుంత దారిలో బైరాగుల సింతకాడ, ఆడు తనజట్టుతో దాంకోని ఉన్నాడు దారికడ్డంగా నిలుస్సోని 'ఓసీ! నాదాన! నీ కన్నులు కరిగిపోను. నీ గుండె మరిగిపోను, నాసేతుల్లోకి రాయే' అంటూ దాని మీద పడ్డాడు. ఆ సిన్నది లేడిలా ఒణికిపోయింది, బతిమాలింది. బయమెట్టినాది. ఎల్లా తప్పించుకొందో 'ఓలమ్మో, ఓలిబాబో, రచ్చించండో అన్నల్లారా!' అంటూ ఒకటే పరుగు ముందు నీలాలు, యెనక మరకడు! ఆడి సేగితులు! మరీ ఎల్లా వచ్చిందో యెంకటిదాసింటిలోకి వచ్చి పడ్డాదంటరా.'

'ఆఁ—!'

'యెంకటిదాసు 'ఏటినాతల్లి! నీకు భయం లేదులే' అంటూ గువ్వపచ్చిలా ఒణికిపోయే పిల్లను అదిమి పట్టుకొని, సల్లసల్ల కబురూలు సెప్తుతూ ఇంటి తలుపు యెయ్యబోతూ వుంటే మరకడుగాడు తలుపు తోసేస్కోని లోపలపడ్డాడు. ఆడు దెయ్యంపట్టిన రాచ్చసిలా వున్నాడు. అయ్యనుసూసి ఆగిపోయ్యేడు. ఆడిసేగితు లంతా గుమ్మందగ్గిర నిలబడ్డారంటట్రా?'

'ఆఁ—!'

'ఓరప్పు డెంకటదాసు 'రామా! రామా! అంటూ ఓరి యెదవన్నారాచ్చసీ' ఇంటిలోకి వచ్చావుంటే నీ పాణంపోతాది. నీ సేటుకాలం నీకింత తెస్తావుంది. నాకడుపుకు సెడ పుట్టినావురా! నాబగితికి యేరుపురుగువురా!' అంటూ రెండు సేతులూ సాసి మరకడి కడ్డంగా నిలబడి పోయాడు.'

'ఊఁ —!'

'తండ్రనిలేదు, దైభమనిలేదు, భయమనిలేదు, బగితనిలేదు; తండ్రిని తప్పించుకోని, గజగజలాడిపోతూ మూలనుంచోని ఉన్న నీలాలుమీద పడ్డాడు. తండ్రి లాగబొయ్యాడు, తప్పించ పొయ్యాడు; తండ్రిని ఒక తోపుతో మూలకు పడేసప్పటికి యెంకటదాసు గోనెబస్తాలాగు కూలబడి పోయినా డంట్రా'

'ఆ(—!'

'మరకడు పిశాచంలా అయిపొయ్యాడు. సీలాలు దానికోక యిప్పిపారేసి మూల కిసిరేసాడు. తళతళలాడి పోమే దానిఒళ్ళు ముడుసుకు పోయింది. ఒరే మరకడు పందయ్యాడు. యాగ్రము ఆయ్యాడు, అడివి దున్నపోతు అయిపోయాడు. తన బట్టయిప్పి పారేసికున్నాడు. తండ్రి సూత్తున్నాడని లేకుండా రాక్షసి ముండా కొడుకుల్లాంటి సేగితులు సూత్తున్నారని లేకుండా ఆ సిన్నదాన్ని కింద పండబారేసి మీదడి పొయ్యాడు—'

'ఊ(—'

'మూల సినిగిపోయిన గుడ్డలా, సేపురుగట్టలాపడి 'రామా! రామా! రామా! రామా! మహాప్పెబూ రచ్చించు, రచ్చించు' అంటూ కష్టమూసుకొని ఉన్న యెంకటదాసు కళ్ళుతెరసి చూసినాడు మరకడు దాని మీదడ్డము, ఆ పిల్ల సాయశత్తులా 'ఓరిబాబో! యెంకటదాసూ! తండీ రచ్చించో! రచ్చించో!' అంటు ఆడికిలొంగకుండా తిరిగి పోతమున్నా'

'ఊ(—!'

'హుమ్మని ఉగ్రుడై లేచాడురా యెంకటదాసూ! ఆడికి యెయ్యి యేనుగుల బలము వొచ్చినట్లయిందిరా! అమ్మవోరి జాతరకు యేటపోతుల్ని తెగేసే యేటకత్తి గోడమీదెట్టిందాన్ని తీసాడు 'అల్లల్లా భైరా హూం! ఆకాశ భైరాహుం అలలలలా! లలా! లలా! లలా!' అంటూ కత్తి మూడుసార్లు తిప్పి ఒక్క యేటుతో కొడుకు తలకాయ యేట యేసేసరికి తాటిసెట్టుమీంచి పండడ్డట్టూ, తలకాయ మూల్నిబడింది. మొండెము గిజగిజ కొట్టుకుంది. 'హుమ్మ! అలా! అలా!' అంటూ యెంకటదాసు ఆ రగతము ఒళ్ళంతా రాసుకొని 'నేనుభైరవుణ్ణి! నేను ఆంజనేయుణ్ణి! హుం!' అంటూ యీదిని బడ్డాడు. యెక్కళ్ళేని బలము, యెక్కళ్ళేని శగితి, పెద్ద పులిలా, మరకడిగాడి సేగితుల్ని యెంటాడించి, దపా, తపా, ధం అంటూ పారిపొయ్యెయాళ్ళని తరిమీ, తరిమీ యిద్దర్ని సంపేసినాడు. తక్కినోళ్ళు 'ఓలమ్మో' ఓ ఓ అంటూ తలోమీదా పారిపొయ్యేరు.'

'ఊ(—!'

'ఆ ఉగ్గరం తగ్గలేదు. పెజలు యేసకుయేలు మూగారు, పొగలేశారు. కొబ్బరికాయలు కొట్టినోరు, కోళ్ళనుజంపినోళ్ళు, రగతం మొగంమీద జల్లినోళ్ళు. అప్పుడు యెంకటదాసుకు పూనిన యీరబద్దుడు, చల్లారాడు. అప్పుడు యెంకట దాసుకు మెలకువ వచ్చింది. కొడుకుని, ఆడి సేగితుల్ని సంపినానని తెలుసుకొని యెంకటదాసు 'శీరామా సీతారామా నీ కరుణా!' అంటు మంచమెక్కి రెండు రోజుల్లో ఆ భగవంతుడిలో ఐక్యమై పొయ్యాడు. నీలాలు మరక దెప్పుడు తన సీరిప్పేసినాడో అప్పుడే మూరసపోయింది. ఆ మూరసలోంచి తెలివిరాలేదు. పేణం పోయిందిరా.'

'ఆఁ—!'

'ఓరి నీలాలు ప్రాణం ఒదిలేసింది అని నీలాలు తండ్రికి తెలిసిందోలేదో ఆపు కత్తి పుచ్చుకొని బయలుదేరి, దారికాసి పుంతకాసి మరకడు సేగితుల్ని యావన్మందిని సంపేసి తాను నదిలోపడి నీళ్ళలో కలసిపోయినాడురా!'

'ఆఁ—!'

## ౧౦

## పాలేర్లు

శంనోమిత్రః శంవరుణః శంనోభవత్వర్యమా
శంనఇంద్రో బృహస్పతిః శంనో విష్ణురురుక్రమః

భరతఖండము పంటభూమి. చరిత్రయను మాయాపటమును తొలగించి చూడ గలిగితిమేని యీ గడ్డపై బుట్టిన ప్రజలు తొలినాళ్ళనుండియు కర్షకవృత్తినే ప్రధానముగ నమ్మియున్నారని తేటతెల్లము కాకమానదని సుబ్బారాయుడుగా రాలోచించుచు కూర్చుండినారు. 'ఓ వరుణ దేవుడా! మా నాగేటిచాళ్ళను మేఘములను గొనివచ్చి తడుపుమా. ఓ యింద్రుడా! నీ సప్తవర్ణముల ధనువు మా మనముల కానంద మొనరింపుచుండ, మా పొలములను ఫలవంతముచేయుము, అను ఆర్యఋషుల సూక్తము లాయన హృదయమున ప్రతిధ్వనించినవి.

సుబ్బారాయుడుగారు దేశమున జరుగు విషయముల నన్నింటి నెప్పటికప్పుడు కనుగొనుచునే యుండిరి. ఆంధ్ర, కృష్ణాపత్రికల నాయన చదివెడువారు. ఆంధ్రదేశమున నే పత్రిక వెల్వడినను, దానిని సుబ్బారాయుడుగారు తెప్పించవలసినదే. ఆంధ్ర ప్రకాశిక తెప్పించినారు, మనోరమ తెప్పించినారు. ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజమునకు, విజ్ఞానచంద్రికా మండలికి నింక ననేక గ్రంథ ప్రచురణ సంఘములకు సుబ్బారాయుడుగారు చందాదారు. అన్ని గ్రంథములను బరిశీలనా పూర్వకముగ జదివి ఆయన మనన మొనర్చుచుండును. ఆయన సేకరించిన గ్రంథాలు బదివేల వరకు నున్నవి. అవి తన గుమాస్తాచే వరుస నేర్పరచి సంఖ్య నియమించి గ్రంథాలయము చేసినారు. ప్రపంచమున యేయేదేశముల నేయే పంటలు పండునో వాని కనువగు పరిస్థితులేవో తెలిసికొనుటకు, ఆయన భూగోళ పాఠ్యగ్రంథములు పరిశీలించినారు. కావుననే పాశ్చాత్యవిద్యలో గడిదేరిన నారాయణరావు, శ్రీరామమూర్తులు గూడ సుబ్బారాయుడుగారు తనతో జర్చచేయుచు చూపు వివిధ విషయజ్ఞానమునకు నచ్చెరువందువారు. నారాయణరావుచే నాయన ఇంగ్లీషులోనున్న అర్థశాస్త్ర గ్రంథముల జదివించుకొని యర్థము చెప్పించుకొని ఆతనితో నా యా విషయములు విపులముగ చర్చించి యర్థము జేసికొన్నారు. ఆయాదేశములందు భూములపై రాబడి యెంతయైనది, పన్నుల మొత్తమెంతయైనది, పన్నులకు రాబడికి గల సంబంధమేమో విపులముగ జర్చచేసినారు.

భరతదేశమున నన్నిటి ఖరీదులతోపాటు భూమి ఖరీదులును బాగుగానున్నవి. యుద్ధము మొదలిడిననాటినుండి ఖరీదులు మరియు పెరిగిపోయినవి. భూమిఖరీదులు బాగుగా నున్నవని ప్రజలు అధిక వ్యయము సేయనారంభించినారు. అధికవ్యయకారణమున నప్పులు పెరిగిపోవుచున్నవి. సుబ్బారాయుడుగారు దేశ మెక్కడకు బోవుచున్నదో యని యనుకొన్నారు. వడ్డీ విపరీతము. మారువాడీలు, దేశములోని షాహుకార్లు, నూటికి నెలకు మూడు నాలుగు రూపాయలవడ్డీ పుచ్చుకొనుచుండిరి. అర్ధరూపాయి, తప్పిన బదియణాలుకన్న నెక్కువ పుచ్చుకొననని యాయన ప్రతిజ్ఞ. అప్పు పుచ్చుకొనునప్పుడే షాహుకారు కమీషనట. నూరురూపాయలు పుచ్చుకొనువాడు నిజముగా పుచ్చుకొన్నది తొంబదిమైదే. తక్కిన యయిదు కమీషను. అదిగాక గుమాస్తాలకుమామూలు, దేవుడికి ధర్మానికిమామూలు. పుచ్చుకొన్న నిమిషము నుంచీ వడ్డీ పంజాబుమెయిలు వేగముతో వాయువేగముతో మనోవేగముతో పెరిగిపోవుచుండును.

‘అబ్బాయి, యీధరలున్నాయా! యీదేశానికి తగనిధరలు. మాయయుద్ధం ఎక్కడనుంచి వచ్చిందో ప్రపంచంఅంతటా ధరలు పెంచేసింది. పోనీ, మనవాళ్ళు యీ పదేళ్ళు, కాస్త జాగ్రత్తపడి ఋణాలు పణాలు తీర్చుకొని వెనకటివలెనే జీవనం చేసుకుంటూవుంటే రైతుకు పదిరాళ్లు వెనకబడివుండేవి. నువ్వు నాదగ్గిరకు అప్పుకు వచ్చావు. నువ్వు ఈధరలలో అప్పుతీర్చడం వుత్తమాట. ఇక భూమి అమ్మాలి. ఎవరైన ఉద్యోగంచేసి డబ్బు సంపాదించినవాళ్లు కొనాలి. అల్లాంటివాళ్ళు ఎప్పుడూ దొరుకుతారా? ఎక్కడ కావలిస్తే అక్కడ దొరుకుతారా? ఏమోయి వసంతయ్యా!’ అని సుబ్బారాయుడుగారు తన్ను బదులడుగుటకు వచ్చిన వసంతయ్య అను గోపాలపురం పెద్దకాపును పృచ్ఛచేసెను. వసంతయ్యకు నాలుగువేలప్పు భూమి తాకట్టుమీద కావలయునట.

‘స్వంత కమతం ఎప్పుడైనా లాభమిచ్చిందోయి? మాతండ్రి నాటినుంచీ మేమూ స్వంతకమతం చేయిస్తూనే ఉన్నామా, పల్లంసాగుపై ఒక్కసంవత్సరమైనా లాభించింది కనబడదు. ఎంతపంటయినా ఈ పన్నులు మింగేస్తున్నాయయ్యా. అదీ కాకుండా ధనం దేశంలోంచి ప్రతినిమిషము పోతోంది. దానితోటి మనకొంపలు మునిగిపోతున్నాయి.’

‘అదేమిటండీ బావయ్యగారూ! ‘వాడికేం పచ్చగాఉన్నాడు’ అని మనం అనుకునే ప్రతీవాడు లోపల లోతారమే కదాండి.’

‘ఏమిటంటావు దానికి కారణం?’

‘అప్పులండి మరి.’

‘ఎందుకా అప్పు అయిందీ అంట.’

‘తమరిందాకటనుంచి అన్నకారణమేనండి బావయ్యగారూ. ఒళ్లు తెలియకుండా అప్పులు చేశాము. నా చిన్నతనంలో వెండినగలేకాదండి. ఎట్లావచ్చిందండి

బంగారం. అప్పులు చెయ్యకపోతే ? యుద్ధంవచ్చిం దగ్గర్నుంచీ బంగారం కొనడం మొదలెట్టాము. మాకప్పులే, ఆడోళ్ళకిమాత్రం ఒళ్ళంతా బంగారం. '

' దానికేమిలే బంగారమైనా కనబడుతూంది. తక్కిన కర్చులమాట. '

' అవును బావయ్యగారు ! కుఱ్ఱాళ్ళకీ చదువుకర్చులు మావోళ్ళిద్దరూ రాజమండ్రిలో కాలేజీలో ఓడు, పెద్దస్కూల్లో ఓడు, వాళ్లు డబ్బు మింగేస్తున్నారండి బావయ్యగారు. '

' చదువుచెప్పించడం తప్పననుగాని, మనం చదువులికి కుఱ్ఱాళ్ళను ఎందుకు, పంపిస్తున్నాము. యుద్ధం రాకపూర్వం దేశంలో పై చదువులు చదువుకున్నవాళ్లు తక్కువ. చదువుకున్నవాళ్లు నలుగురే. వాళ్ళందరికీ తలాఒక ఉద్యోగం అయింది. వాళ్లు కాస్తపచ్చగా వుండడం, నెలకీ తప్పకుండా నాలుగురాళ్లు వస్తూవుండడం. మన రైతులుదగ్గిర ధాన్యంరోజులలోనేగా నాలుగురాళ్లు కనబడడం ? '

' చిత్తం ! '

' కాబట్టి మనవాళ్ళంజేసారు. ఉద్యోగాలు మన్ని పోషించాలికాని భూములు కాదనుకున్నారు. ఇక అసలే లేవలేనమ్మ అటకెక్కరానందని, చదువుల్లో తగలడి చక్కాబొయ్యాము. మనదేశంలో చదువంతఖరీదుగల వస్తు వింకోటిలేకుండావుంది. పూర్వం చదువుయొక్క లోపలివిలువ ఎక్కువ, పై విలువ ఇంటిని గుండంవేసి గోదావరిలో కలిపి దిబ్బచేసే ఖరీదు. జీతాలు నానాలు, పుస్తకాలు, హోటళ్ళు, కాఫీ హోటళ్లు, ఇంటినుంచి కుఱ్ఱాడు చదువుకునేవూరికి డబ్బు కాల్వకట్టాలిసిందే. ఈచదువుకి ఇంతా తగలేసి దానికి వడ్డీతీసుకు రాగలడా యికముందూ ? యింకా కొంచెం మీ బ్రాహ్మణేతరులలో ప్రస్తుతం చదులవులవల్ల లాభం వుండవచ్చులే. కాని ముందు ముందు ఈ చదువులు మనకొంపలు తీసే చదువులనీ, ఉద్యోగంకోసం చదవించడం అంత తెలివితక్కువ ఇంకోటిలేదనిన్నీ మనకు పూర్తిగా తెలుస్తుంది. అందుకని వ్యవసాయాన్నే నమ్ముకుందామా అంటే నష్టం నష్టం నష్టం. '

' నామట్టుకు నేను ముప్పయి యకరములభూమి వ్యవసాయం చేస్తున్నాను, నాలుగువందల ఏబయి పైచిలుకు వస్తాయి బస్తాలు. పన్నులకు మామూళ్ళకు ఎనభై బస్తాలుపోతాయి. పాలేళ్ళకు,దూళ్ళకి,కూలికి,విత్తనాలకి అన్నిటికి ఇంకోనూరుబస్తాలు పోతే యింక మిగిలే రెండువందల ఎనభై బస్తాలల్లో తిండికి మాకుటుంబానికి ధాన్యం మట్టుకు యాభై బస్తాలు పోతాయండి. ఇంకున్న రెండువందల ముప్పయిబస్తాలకు వచ్చే పదమూడువందల ఎనభై రూపాయలూ ఏడాదికిగడవాలి. దీంట్లోనే చదువులు, దీంట్లోనే గుడ్డలు రామ రామా ! బావయ్యగారు, ఆడవాళ్ళ గుడ్డలకి చాలవండీ మన పంటలు ? '

' అంతటితో అయిందీ ? మఠీ వ్యాజ్యాలు వల్ల కాళ్ళు, కక్షలతో క్రిమినలు కేసులు. కౌళ్లు కదపాలకు రిజిష్టర్లు, అమ్మకాలకు రిజిష్టర్లు, రిజష్టరీఖర్చులు, లంచాలు,

పురుళ్ళు పుణ్యాలు, రైళ్లు మోటార్లు - ఎన్నని ? ఈలోపుగా ఏపెళ్ళోవచ్చిందా యిక దానితో ముంపేగదా. '

' బావయ్యగారు. అదేనండి. మా మూడో అమ్మాయి పెళ్ళిఖర్చువచ్చి నెత్తిన కూర్చుందండి. ఇదివరకుచేసిన పెళ్ళిళ్ళకీ, వాటికీ కష్టపడి తీర్చానండి. మీకివ్వవలసిన నోటుబాకీ పదిహేనువందలు, ఈపెళ్ళికి కట్నం వగైరా ఖర్చులు అంతా నలభైయైదు వందలు కావాలండి. '

' సంబంధం ఎక్కడిదోయి ? '

' పూళ్ళండి. డబ్బు నిలవవుందండి, కొంద్రావుందిట. కొంచెం కుఱ్ఱవాడు మావాడితోపాటు రాజమహేంద్రవరంలో చదువుతున్నాట్టండి. కట్నం నాలుగువేలు, లాంఛనాలు పదిహేనువందలు. '

' పెళ్ళికర్చులు రెండువేలు. నాలుగువేల అయిదువందలేమి సరిపోతాయోయి?'

' ఇంటిదగ్గర బాకీ తీర్చడానికి వుంచిన పదిహేను వందలున్నాయండి. మా యింటావిడ వెయ్యిరూపాయ లిచ్చింది. '

' పెద్దరైతువు. నీకున్న ముప్పై యకరాలు నాకు తనఖా అక్కరలేదు. ఇరవై చాలు, వాయిదాలు పది. వడ్డీ మామూలు అర్ధరూపాయి. కావలిసే యింకో పదిహేనువందలు పుచ్చుకో. '

' వద్దండి బావయ్యగారు నేను చేసిన అప్పు నేనే తీర్చివెయ్యాలండి. మీ అప్పుతప్ప నేనింకోఅప్పు చెయ్యలేదు. మీదగ్గిరతప్ప నే నింకోళ్ళదగ్గిర తేను. '

తనఖాపత్రము వ్రాయుటకు ముహూర్తమేర్పరచుకొని వసంతయ్య వెళ్ళి పోయినాడు.

సుబ్బారాయుడుగారు దినదినము ఏ పొలమునకో పోవు నలవాటుకావున, నా సాయంతనము వసంతయ్యను బంపి, లోనికేగి, కండువావేసికొని, మంచి లంకాకుచుట్ట వెలిగించుకొని, చేత వెండిపొన్నుకఱ్ఱ బుచ్చుకొని, కిఱ్ఱుచెప్పుల జోళ్లు కిఱ్ఱుమని చప్పుడుఁ జేయుచుండ, గొందరు పాలేళ్లు కొలగాండ్రు నిరువురు కాపు స్నేహితులు, నొక క్షత్రియరైతుకూడ రా, గాలువ యవ్వలి పొలముఁజూచు కొనఁబోయెను.

సుబ్బారాయుడుగారి కనుదినము పొలములోకసారి త్రొక్కివచ్చుట యలవాటు. ఒకొప్పుడు తోటలజూచుటకై పోవును. ఏ పొలమెట్లున్నదనియు గమనించుచుండును. వంగతోటలు, జొన్న, మొక్కజొన్న, కంది, పెసర, మిర్చి, పసుపు వారి మెరక పొలములలో విరివిగా బండును.

చీకటిపడువరకు నాయన బొలముల దిరిగిదిరిగి దీపములు పెట్టిన వెనుక నింటికేగును. ఇంటికి వచ్చుటతోడనే మంగలి కాళ్ళుబట్టును. అటువెనక చలికాల మయిన, వేడినీళ్ళు, తదితర కాలములో జన్నీళ్లు నింటిలో నెవరో యొకరు తోడి పెట్ట స్నానమాడి, సంధ్యావందన మాచరించుకొనును.

సుబ్బారాయుడుగారి హృదయమున రషియను బోల్షవిక్కుల రాజ్యతత్త్వము మెరుపువలె తోచినది. ప్రపంచమున నెంతకాలము 'ఆస్తులు' నాడబ్బు, నాపొలము అని అనుకోగలరు. 'డబ్బులేనివాళ్లు ఆ స్తితిలేనివాళ్లు ఎక్కువ మంది వున్నారుకదా! వాళ్లు తలుచుకుంటే, డబ్బుగలవాళ్లు ఎక్కడఉంటారు? ఈ సైన్యాలన్నీ అడ్డుపడాలి కాని. మనుష్యు డెంత విచిత్రమైన హృదయం కలవాడు. ఒక్క రష్యాలో తప్ప ఎక్కడైనా సైన్యం ప్రజలూ తిరగబడ్డారా? తక్కిన రాజ్యాలలో రాజుల్ని తీసివేసి నప్పుడు తిరగబడ్డవాళ్లు రాజుక్రింద రాజుని ఆడించే ప్రభువులో లేకపోతే కోటీశ్వరులో కాని, సైన్యాలు అనగా తక్కువజీతం పుచ్చుకొనేవాళ్ళు తిరగబడలేదు. అంటే ఇంతకూ డబ్బులో ఒకవిధమైన సమ్మోహనశక్తి ఉంది. డబ్బుగలవాణ్ణి చూస్తే మామూలు మనుష్యు డెంతో భయపడిపోతాడు. కాలూ చేయీ కదపలేడు. రష్యాలో మరీ విపరీతమైనస్థితి ఉండాలి. లేకపోతే అల్లా ప్రజలు అంటే బీదవాళ్ళు తిరగబడి ఉండరు' అని యాలోచనా పథగామియై సుబ్బారాయుడుగారు భోజనము చేయుచుండెను.

'నారాయుడూ వాళ్లూ చెప్పడం పూర్వం హిందూదేశములో బోల్షవిజము లాంటి ఉత్కృష్ట రాజ్యపద్ధతి ఉండేదిట. ఎంతవరకు నిజమోకాని ఈ రోజున డబ్బువదిలే మహానుభావుడెవరు. గాంధీమహాత్ము డంటివాళ్లు ఏ పదిమందో?'



## వి ష బీ జ ము లు

శారద దినదిన ప్రవర్ధమాన యగుచున్నది. ఆమె సౌందర్యము ఇంకను సౌందర్యములఁ బ్రోవుచేయుచు జగన్మోహనమగుచున్నది.

తనయందమామె యెఱుగును. ఇంక అందగత్తె నగుదునని యామె గ్రహించినది. అందము తన్ను వీడి యుండకూడదు. ఉదయమున నిదురలేచినది మొదలు మరల రాత్రి నిదురగూరువరకు కామెకుఁ దాను సౌందర్యవతి నన్న చైతన్య ముండును. సంగీతము నేర్చుకొనునప్పుడు, పాఠములు చదువుకొనునప్పుడు, బజారులో కారుమీద పోవునప్పుడు, భోజనమప్పు డామె యితరులు తన యంద మెటుల చూచుచున్నారోయని పరికించుచుండును. ఏమనుష్యుడైన తన్ను తేరిపార జూచిన నామె హృదయము హాయియనును.

'పరపురుషుడు! శీలము' అనువాక్యముల యర్థమాబాలకింకను గోచరింప లేదు. ఆ వయస్సులో నేబాలకును వానియర్థము తెలియదు. వారిహృదయముల నింకను స్త్రీ పురుషుల పరమరహస్యవర్తనపుం బులకరము లొదవవు. వారి హృదయములలో కోర్కె, విరియుమొగ్గలో ప్రత్యక్షమగు చిరుపరిమళము బోలి యుండును. తానున్న స్త్రీత్వ మావయస్సులో సౌందర్యబోధ మాత్రమై యుండును.

దసరా పండుగులకు నత్తవారందరు వచ్చెదరని యామె విన్నది. అత్తవారిట్లు మాటిమాటికి వచ్చుచుండుట యామెకు సమ్మతముగాలేదు. డబ్బులేక వచ్చుచున్నారని కాదుగాని, యేదో వంకబెట్టి జమీందారులయింటికి దఱచు వచ్చుచున్నారా? అయినచో దనయత్తగా రొక్క-పర్యాయమే దమయింటికి వచ్చినది. తన మామగారు అసలురాలేదు. తన యత్తవారింటిలోను దర్జాగానే యున్నది. తమతోటకన్న వారితోట బాగున్నది

ఏదియెట్లున్నను శారద కత్తింటి వారిపై ప్రేమ కుదరలేదు. కావుననే చెన్నపట్నము వెళ్ళుచు రాజమహేంద్రవరములో దిగిన జగన్మోహనరావుతో శారద విరగబడి నవ్వుచు, గృహప్రవేశమునకు దాను వెళ్ళినప్పుడు కొత్తపేటలో నడచిన యపహాస్యపు బనులెల్ల వర్ణించి చెప్పినది.

జగన్మోహనుడు సౌందర్యరాశియగు మేనమరదలిని జూచినాడు, విస్తుపోయినాడు. పెద్దమనిషి అయినదని విన్నాడు. 'యౌవనోదయ మాత్రమున నాడువారిలో నెట్టి విచిత్రమైన మార్పులు వచ్చును' అని యాతడనుకొన్నాడు.

ఈ బాలిక, యీ జగన్మోహిని, తన రాణి కావలసిన యీ శారద, నొకపందికి నంటగట్టినారు. ఈ బాలికయే తనకు భార్యయై యుండిన దానింగ్లండు దీసికొని వెళ్ళియుండును. ఆమెను పువ్వులలో బెట్టికొని పూజించువాడే. జమీందారిణి యన్న నీమెయే. ఇంత అందగత్తె యగునని యెఱిగియున్నచో, నీ వివాహము చెడగొట్టియుందునే? అనేక మార్గము లున్నవే! అప్పుడు తన మేనత్తభర్త యేమిచేయును? తుదకు దనకీయక తప్పెడిదికాదు. తన స్నేహితురాండ్రగు యూరేషియను బాలికలు, వేశ్యాసుందరులు శారద ముందర 'గ్యాస్' దీపం ముందర, 'హరికేన్' దీపాలే.

ఆమెనుజూచి లోలో గుటకలు మ్రింగినాడు. అనతిస్ఫుటమైన స్నిగ్ధమైన యామె అవయవ విలాసము నావలిప పయ్యెద పావడలలో నాలోకించి మురిసినాడు. ఏదియోవంకతో శారదతో మాట్లాడును! ఆమెతో గూర్చుండియుండును! యామెను ముట్టుకొనుచుండును!

అతని యాందోళనమునకు శాంతి యాతని మేనత్త సమకూర్చినది. వరద కామేశ్వరీదేవికి మేనల్లుడన పరమప్రీతి. హృదయాంతరాళమున తన బిడ్డలపై నెంత ప్రేమయున్నను తన కుమారునికన్న, తన కుమార్తెలకన్న మేనల్లునామె యాదరముమై గాంచును.

'ఏమయ్యా మోహనం? వదినగారు విశాఖపట్టణంలో ఉన్నారా? నువ్వు చెన్నపట్టణం వెడుతున్నావా? అత్తయ్యఅంటే ప్రేమ గనక పాపం! యిక్కడ దిగావు. ఎన్నిసారులు చెన్నపట్నం వెడుతూ ఇక్కడ దిగకుండా వెళ్ళలేదు?'

'ఏమిటో అత్తా! పనితొందరులు! నేనూ మామయ్యగారికిమల్లే మాజిల్లా నుంచి శాసనసభ సభ్యుడుగా వెడదామని ప్రయత్నం. ఏవవుతుందో! అందుకనే

ఇప్పుడు చెన్నపట్నం వెడుతున్నాను. అయినా నిన్నూ శారదనూ చూడాలనిదిగాను. శారదా, అందాలరాశి అవుతూంది అత్తయ్యా '

వరదకామేశ్వరీదేవి :—ఏమిటో ! ఇంతకూ, నీభార్య కావలసిన బంగారుతల్లికి యిలా రాసిపెట్టివుంది. మీ యిద్దరికీ ఎంత యీడుజోడుగా వుండేది. సర్వ విధాలా మీ యిద్దరు తగివుందురు. నాకన్నులున్నూ ఆనందం పొందుతూ వుండును. నీ అందానికి మా శారదసాటి. మా శారద అందానికి నీఅందం సాటి. మన్మధుడూ, రతీదేవిలా వెలిగిపోతూవుండేవారు. ఒకరితాహత్తు కొకరు సరిపోతారు. మీ మామయ్యగారి ఉద్దేశం నాకుబోధపడలేదు. కాకి ముక్కుకు దొండపండు కట్టారు. మా అల్లుణ్ణి చూస్తే నాకు —

జగ :—అల్లా అనకు అత్తా ! అతగాడేం తక్కువ అందమైనవాడా యేమిటి ?

వర :—ఆ ! ఆ అందం ! పెద్ద రాక్షసుడు.

జగ :—శారద దేవకన్యకలా వుంటుంది.

వర :—అవును. ఈ నా గారాలకూచిని ఆ అత్తవారింటికి చేతులారా యెలా పంపింతునా అని తపించిపోతున్నాను.

జగ :—అయితే అల్లుణ్ణి ఇల్లరికం తీసుకొని వస్తావమ్మా అత్తా ?

వర :—ఇల్లరికం ? అతణ్ణిచూస్తేనే నాకు భయం. ఇంక రోజూ ఇంట్లోవుంటే, నాప్రాణాలు అప్పుడే పోతాయి.

తల్లికి జగన్మోహనునకు జరుగు సంభాషణయంతయు శారద వినుచున్నది. ఆమె కాసంభాషణ మించుకయు విడ్డూరముగా కన్పింపలేదు. ఆమె వినుచుండ తల్లి యెన్నిసారు లల్లుని తిట్టినదో ! హేళన చేసినదో ! ఆమె హృదయమున నత్త వారన్న నొకవిధమగు నసహ్యము జనింప నారంభించినది. సూర్యకాంతమన్న కరుణయు నున్నది. తాను గొప్పకుటుంబములో జనించినందుకు నెక్కువయని తలంచుచు తన హృదయమును జూరగొన్న సూర్యకాంతమును దలపోసికొని 'పాపము ' అని జాలిపడుచుండును.

తనభర్త ! మరి ? తండ్రి కంత యిష్టమేమో ? అందరును తెలివుందని చెప్పుకొనెదరు. ఈరోజులలో తాను చదివే నవలలో నాయికా నాయకులు ఒకరి నొకరు ప్రేమించుచున్నట్లు తా నెవరిని ప్రేమించుచున్నదో ? అందరు తా నపరిమిత సౌందర్యవతి యని చెప్పెదరు. ఇంత యందగత్తెయగు తనకు, తగిన అందగా డెవరో ? యని ఆమె పలుమారు తలపోసుకొన్నది.

'ఏమిటిశారదా ఆలోచిస్తున్నావు ? ' అని జగన్మోహనుడాబాలికను ప్రశ్నించి నాడు.

'ఏమి లేదయ్యా బావా ! '

వారిరువురి నచట వదలి వరదకామేశ్వరీదేవి లోనికి వెళ్ళిపోయినది.

'భర్తను గురించా ఆలోచిస్తున్నావు ? '

'ఛీ!'

'ఛీ, ఏమిటి? ఎందుకు ఛీ? పోనీ నాకెందుకుగాని, నువ్వింత అందం ఎక్కడనుంచి సంపాదించావు? నేను చాలా సినిమాలు వెళ్ళిచూశాను. జీనెట్ మాగ్డనాల్డు, మారియన్‌డేవీస్, మేరీయాస్టరు, నార్మాటాల్మిడ్జి, మీర్నాలోయ్ వీళ్లెవరూ నీముందర నిలవగలరాంట?'

'నువ్వెప్పుడూ పొగడ్తూనే ఉంటావు.'

'నాది పొగడ్తా? నేను నిజంగాచెప్తున్నాను. శారదా! ఇప్పుడు ప్రపంచానికంతా సుందరిని యెన్నుకుంటే నిన్నే 'మిస్ యూనివర్సు' అనగా విశ్వసుందరిని చెయ్యాలన్నమాట నేను ప్రపంచం చాలా చూశాను, అనేకమంది దొరసానుల్ని, ఇతరదేశం స్త్రీలని, జమీందారిణీలను, ఉద్యోగస్థుల భార్యల్నీ, ఎందర్నో చూచాను. ఎవ్వరు నీసాటిరారు శారదా.'

'అయితే నువ్వు నాన్నగారికిమల్లే శాసనసభలో సభ్యుడవు అవుతావా?'

'ఆ!'

జగన్మోహనుడు శారదదగ్గిరకు జేరి యామె నడుముచుట్టూ తన ఎడమచేయి చుట్టి 'శారదా మనం యిద్దరం ఒకరొకరికి బాగా సరిపోయ్యాము. ఈ పాపష్టి దేవుడు ఇల్లాచేస్తూ ఉంటాడేమిటో! ఇంగ్లండుదేశంలో ఇష్టంకాని పెళ్ళిళ్ళు రద్దు చెయ్యవచ్చును ఇక్కడ అల్లాలేదు. పెళ్ళి రద్దయితే మళ్ళీపెళ్ళి చేసుకోవచ్చును— ఆదేశాల్లో.

శారద మాట్లాడక మొగము చిట్లించుకుంది.

'శారదా నువ్వీయేడు 'స్కూలుఫైనలు' పరీక్షకు వెళతావటకాదూ. అయితే మన జమీందారులకు పరీక్షలెందుకు? చదువులు, ఉద్యోగాలకోసం కాదూ?'

'మా నాన్నగారు ఉద్యోగంకోసం చదివారోయి బావా మరి?'

'మీ నాన్నగారు జమీందారుగారు. ఆయన చదువుకోడం ఒక గొప్పే. కాని సాధారణంగా ప్రజలంతా ఎందుకు చదువుతారు. ఉద్యోగంకోసం గాకపోతే మరి?'

'డబ్బుగలవాళ్ళు గొప్పకోసమేగా చదివేది బావా?'

'వాళ్ళమొగం! కోమట్లు చదివితే గొప్పకోసమా ఏమిటీ?'

'మరెందుకు!'

'బడాయికోసం!'

'కాని మనబోటి జమీందారులు చదవడం సరదా! ఆ సరదాలేక చదవక పోయినా ఇబ్బందిలేదుగా.'

'సరేగాని నీకు చెన్నపట్నంనుంచి యేమిటి తీసుకురమ్మన్నావు నన్ను, శారదా?'

'ఏమీ అక్కర్లేదు బావా'

'శారదా నేనంటే నీకు ప్రేమేనా?'

శారదాదేవి మాట్లాడలేదు. చిరునవ్వు నవ్వినది. 'నాకేమీ తెలవదు బావా.'

'ఇంగ్లీషువాడు 'మాట్లాడకపోతే సగం ఒప్పుకున్న'ట్లన్నాడు. మరి ఏమంటావు? ఏదో చెప్పాలి.'

శారదాదేవి నవ్వుటమాని యేదేని యాలోచనలో మునింగినది.

'శారదా! నిన్ను చూసి మోహించని మగవాడు వట్టి దద్దమ్మ! నిన్ను చూచి ఋషులే ప్రేమిస్తారు. ఇక నాబోటి మేనబావ సంగతి వేరే ఆలోచించి చెప్పాలీ!'

ఇంతలో శారద తమ్ముడు శ్రీ కుమారరాజా కేశవచంద్రరావు, అయిదేండ్ల బాలుడు విసవిస పరుగెత్తుకొని యచ్చటకు వచ్చి,

'చిన్నక్కా! ఇవ్వాళ్ళ నాకుక్క మొన్న మనం చూసిన సర్కసులో కుక్క కన్న బాగా మొగ్గవేసిందే!'

'ఏమోయి చిన్నబావా! నువ్వు సర్కసు పెట్టావాయేమిటి?'

'పెద్ద సర్కసు పెట్టాను. మా నాన్నగారికి గుఱ్ఱాలున్నాయా? రెండు ఏనుగులు, మూడు సింహాలు కొంటాను—'

'ఎంతపెట్టి కొంటావు తమ్ముడూ?'

'నూరురూపాయలు కాదు, లక్షరూపాయలు పెట్టి కొంటాను?'

## ౧౨

## కేశవచంద్రరావు

శ్రీ కుమారరాజా కేశవచంద్రరావు శారద తర్వాత ముగ్గురు పుట్టిపోయిన వెనుక జనించినాడు. ఆడపిల్లవంటి యందముగల బాలకుడు. పనస తొనలవలె, వెన్నముద్దవలె మెత్తని బొద్దైన అవయవములుగల బంగారుబాబు. అల్లారుముద్దుగా పెరిగినాడు. పెద్దప్పపైకన్న చిన్నప్పపై నాతనికి ప్రీతి ఎక్కుడు. తల్లి వరదకామేశ్వరీ దేవి చేయు గారాబము విపరీతము. నేలపై అడుగుపెట్టనీయ దామె. అస్తమానము డాక్టరులకు కబురులపై కబుర్లు; ఆ బాలుడు చిఱ్ఱున జీదరాదు. కొంచెము దేహము వెచ్చబడినచో నిదురబోవదు. వరదకామేశ్వరీదేవి ప్రాణము లన్నియు నా బాలకుని మీదనే యుండును.

తండ్రిగారు కుమారుని జూచుకొని యానందములో మునిగిపోవుచుందురు. ఆయన బిడ్డలను దరికి చేరదీసి ముద్దులాడుట తక్కువ. ఒక్కొక్కప్పుడు, ప్రేమ వివశులై ఏకాంతమున, బిడ్డల నట్టె బిగియార కవుంగిలించికొని, తనివార మూర్ధాఘ్రాణ మొనర్చుటయు కలదు.

కేశవచంద్రరావు మాటలు ముద్దుల మూటలే. ఆ బాలకుడు కొందరన్న దరికి జేరును, కొందరన్న దగ్గరకు రానేరాడు. అతనికి నారాయణరావుపై శారద పెండ్లి చూపులకు వచ్చిన నాటినుండియు ప్రేమ జనించినది. పెండ్లిలో బావగారి నొక్క

నిమేషము వదలియుండలేదు. నారాయణరావు తన బావమరదిని దగ్గరకు తీసికొని యాతడడుగు విపరీతపు ప్రశ్నల కోపికగా జవాబులు చెప్పుచుండువాడు. చిన్న చిన్న కథల చెప్పువాడు.

నారాయణరా వెప్పుడు వచ్చిన నప్పుడు కేశవచంద్రుడు దగ్గరకు జేరుట జమీందారునకు పరమహర్షకారణమైనది. కాని, వరదకామేశ్వరీదేవికి బొమముడి తెప్పించినది. ఆ బండచేతులలో బిల్లవాడు నలిగిపోవునేమోయని యామెకు భయము కలిగెను. ఆ బాలకునితో రహస్యముగా దర్శి, నారాయణరావు బండవాడనియు అస్తమాన మాతనికడకు వెళ్లవద్దనియు, నాతని బండతనమే యా బాలకుని కంటుకొనుననియు, జెప్పినది.

'బావ బండవాడుకాడు! మంచివాడు. నాకు కథలు చెప్తాడు, ఇంకా ఎన్నో సంగతులుచెప్తాడు. బావ అక్కయ్యకన్న బాగా సంగీతము వాయిస్తాడుఫిడేలుమీద.'

తల్లి తెల్లబోయి కుమారునికి జవాబు చెప్పకుండ వెళ్ళిపోయినది.

ఆతని చిన్నహృదయములో, దన బావగారిని దండ్రిదక్క తక్కిన యందరును హేళనజేయు చున్నారని యస్పష్టముగా దోచినది. నేడా బాలకుడు, శారదయు జగన్మోహనరావును మాట్లాడుట చూడగనే, ఆతని హృదయమున జిరుకోపము వచ్చినది. జగన్మోహను డాతని జూచి 'ఏమండో కుమారరాజాబావగారు! నీ పుస్తకాలన్నీ ఏవోయి?'

'లేవు! ఎక్కడో ఉన్నాయి.'

'కోపం వచ్చిందా బావా?'

'రాలేదు.'

'మరి కోపంగా ఉన్నట్టున్నావే బావా?'

'అబ్బా! నాకు పనివుంది! ఒరే రాముడూ!'

'బాబు! అని నౌకరు రాముడు లోనికివచ్చినాడు. ఎత్తుకోమని కేశవచంద్రుడు చేతులు జాచుటయు, సేవకుడు రాము డా బాలు నెత్తుకొని బయటికి వెళ్లెను. శారదయు లోనికి బోయినది.

జగన్మోహను డక్లే యాసోఫాపై నధివసించియుండి, శారదా విగ్రహమును తలపోసికొనుచు కూరుచుండెను. ఇంకను జిన్నపిల్ల. శారద వైఖరిజూడ భర్తను ప్రేమించుటలేదని తోచుచున్నది. తన మేనత్తయు నల్లుని పూర్తిగా రోయుచున్నది. తెలిసియో తెలియకయో తనకు మేనత్త సహాయము చేయునట్లేయున్నది. కొంచెము బాగుగా పాచిక పారించినచో శారద యవలీలగ దన కౌగిలింతకు జేరును. ఈ సంగతి యితరులకు దెలిసినచో నెవరేమి చేయగలరు?

శారద యింటిలోనికిబోయి, సంగీతపు గదిలో తనగురువుగారు శ్రీరామయ్యగారు వచ్చియుండుటచే, ఫిడేలు తీసి సవరించికొని కమానుకు రజనురాచి తీగెలపై 'సస రిరి' యని ప్రసరింపజేసెను.

శారదాదేవి ఫిడేలును, తండ్రిగారు తమ స్నేహితుడొకడు యూరపుఖండము పోవుచుండ, హాలండునుంచి తెప్పించినారు. ఫిడేలువాద్య మరబ్బులది. అది సారంగికి సంబంధించినది. అచ్చటినుండి యరబ్బుల ప్రభుత్వము పాశ్చాత్య దేశములకు దన తేజస్సును బరపినపుడు ఫిడ్లేలును ఫ్రాంసు సృజించినది. పాశ్చాత్య దేశమే దాని జన్మభూమి యనునంతవరకు బెంపొందింపబడినది. ముఖ్యముగా ఫ్రాంసు, ఇటలీ, జర్మనీ, హాలండు దేశములలో ఫిడేళ్ళ నద్భుతముగ నిర్మించెదరు. కొన్ని కొన్ని ఫిడేళ్లు యేబదివేల రూప్యములు ఖరీదుగలవి యున్నవి. వానిలోని శ్రుతిధ్వను లతిసున్నితములు, నపరిమితమధురములు, నత్యంత గంభీరములై అతి సూక్ష్మములై యుండునట.

సారంగి భరతదేశమునకు ప్రథమమున క్రీ. వె. నయిదాఱు శతాబ్దులలో వచ్చినది. పదునెనిమిదవ శతాబ్దిలో ఫ్రాంసు వర్తకులు ఫిడేలు తీసికొని వచ్చినారు. పందొమ్మిదవ శతాబ్ది కది భారతదేశమున ముఖ్యములగు సంగీతవాద్యములలో నొక్కటియైనది. ఆ నాటినుండియు నీ వాద్యము తన వాద్యముగా, గాత్రమునకు వీణకు అనుకరణ వాద్యముగా, విజృభించి, యార్యసంప్రదాయ వాద్యమై పురాతనమైన వేణు వీణావాద్యముల కనుంగు చెలియ లైనది.

ఆంధ్రదేశమున నీ వాద్యము నెక్కువగా నాట్య విద్యాపారంగతులగు గణికల నాట్యమున, కనుకరణముగా నుపయోగించినారు. పండితులును దీనిని మహా వాద్యములలో నొకదానినిగా నంగీకరించిన నాటినుండియు దక్షిణాపథమున గోవిందస్వామి పిళ్ళయు, చౌడప్పయు, నాంధ్రమున కోటయ్యగారు, వారణాసి బ్రహ్మయ్య, బలరామయ్యగారలు, హరినాగభూషణముగారు, ద్వారం వెంకటస్వామినాయుడుగారు నీ వాద్యమున నుత్కృష్టత సముపార్జించి పేరెన్నిక నొందిరి. ఇంకను దక్షిణాపథమున, వాద్యముగ ఫిడేలు నానాటికి విజృంభించిపోవుచు, పాశ్చాత్య విద్వాంసులగు సౌనానిని మొదలగువారి వాద్యముతో దుల దూగుటకు సిద్ధులగు పండితుల గనుచున్నది. జపాను దేశమునను నీ వాద్యము పరమ వాద్యమైనది. హాలండు మొదలగు పాశ్చాత్య దేశములతో సమానమై, ప్రపంచమున కెల్ల నుత్కృష్టమగు నొకటి రెండు ఫిడేళ్ళతో సమానమగు నైదో, యారో ఫిడేళ్లను జపాను సృజించు కొనినది.

శ్రీరామయ్యగారు ఫిడేలునం నసాధారణ ప్రజ్ఞకలవారు. గాత్రమునందును బండితుడు. సంగీతపాఠములు శిష్యురాండ్రకు జెప్పి వారిని బ్రజ్ఞావంతుల జేయుటలో నమిత చాతుర్యముగలవారు. గానవిద్యా ప్రవీణులగు పండితులందరు నధ్యాపనమున సమర్థులుగారు. ఉపాధ్యాయునకు బూర్ణహృదయ ముండవలయును. దీక్షమగు మనస్సుండవలయును. శిష్యుని హృదయము, మనస్సు గ్రహించు తేజశ్శక్తి యుండవలయును. లేనిచో గురువెంత విద్యాపారంగతుడైనను శిష్యునికి విద్య

రానేరదు. ఆతని విద్య లోహ పేటి కాంతార్నిగూఢ గుప్తధనము వంటిదే. ఎమ్. ఎస్, సి. డీ. యస్. సి. మొదలగు మహోన్నత పరీక్షలలో నుత్తములుగా గృతార్థులైన మహానుభావులు కొందరు శిష్యులకడ నోరు విప్పలేరు.

శ్రీరామయ్యగారు పవిత్రహృదయుడగుటచే గొందరివలెగాక, తన విద్య పూర్ణముగా, శక్తిగల శిష్యుల కీయ సంకల్పించినారు. అట్టి మహానుభావునికడ విద్యనేర్చుకొనుటకు శారద యేమినోము నోచుకొన్నదో యని జమీందారుగారు పరమానందము నందుచుందురు.

ఆ రోజున శ్రీరామయ్యగారు శిష్యురాలికి 'ఎందరో మహానుభావుల' ను త్యాగరాజ కృతినేర్ప సంకల్పించినారు.

కుమారరాజా కేశవచంద్రరావునకు సంగీతమన్న చిన్నతనమునుండియు నిష్టమే. శారదకు పాఠము పూర్తిగా వచ్చినరోజున, మరల నాఖరుపరీక్ష చేయు నప్పు డాడింభకు డెట్లు గ్రహించునో సంగీతపు గదిలోనికి చల్లగా వచ్చికూర్చుండును. పాటయంతయు నగువర కచ్చటనుండి యమందానంద మొందును. తరువాత నొక్క నిముసమైన నచ్చట నుండడు.

ఆ రోజున నదివరకు బూర్తిగా వచ్చిన కృతిపాడునప్పు డా గదిలో కూర్చుండి, కొత్తపాఠము మొదలు పెట్టుటతోడనే యచ్చటినుండి కేశవచంద్రుడు విసవిస వెడలిపోయి ' రాముడూ ! ' అని కేకవేసెను.

' చిన్నబాబుగారు పిలుస్తున్నారు ! ' అని కేశవచంద్రు నాడించు సేవకుడు పరువడివచ్చినాడు.

బ్రాహ్మణ జమీందారు నింట నెవ్వరైనసరే సేవకులుగా నియమింపబడుదురు. కాని వెలమ, క్షత్రియ, కాపు, కమ్మ జమీందారుల యిండ్ల దాసీలు, కాసాలు వంశ పారంపర్యముగా సేనజేయుచునుందురు. జమీందారులను వారి సేవకులు ' బాబు ' లనియు గుమారరాజులను ' చిన్న బాబు ' లనియు బిలుచుచుందురు.

జమీందారు బిడ్డలగుటయే గారాము, అందులో లేక లేక జనించిన బిడ్డడగుటచే సేవకులందరు నాతని కన్నుసన్నల మెలగుచుందురు. బాలకుని యేడువనీయ గూడదు. బాలకు డాడుకొనుటకు వలయుసామాను లనేకములున్నవి. నడుపుటకు రైళ్ళు, మోటార్లు, ట్రాములు, ఇంజనులు, బొమ్మలు మొదలగు నాటవస్తువు లెన్నియేని యున్నవి.

కేశవచంద్రుడు బాలకుడయ్యు మితభాషి, పలికిన రెండుపలుకులు ముద్దులొలుకును. ఒకసారి యీడుకుమించిన గాంభీర్యము వహించి మిన్నకుండును.

తల్లి యాతని కొకప్పుడు శ్రీకృష్ణునివలె వేషమువేయును. ఒకనాడు అక్బరు పాదుషావలె వేషమువేయును. ఒకనాడు జార్జిచక్రవర్తి వేషము వేయును.

# ౧౩

## శా స న స భ

జమీందారుగారు చెన్నపట్టణము శాసనసభా సమావేశమునకై వెడలినారు. రైలుకడ కెదురువచ్చిన యల్లుని గుశలమడిగి యేదియేని విషయముల మాట్లాడు కొనుచు నింటికి బోయినారు. లా కాలేజీ యొంటిగంటకు మూసివేసెదరు కాన వీలయినచో దానొక పర్యాయము సమావేశమునకు వచ్చెదనని నారాయణరావు మామగారితో జెప్పినాడు.

సభికులందరు రెండుభాగములుగా గూర్చుందురు. ప్రభుత్వపక్షమువా రధ్యక్షుని కుడిచేతివైపునను, ఎదిరిపక్షమువా రెడమ భాగమునను పీఠములపై నధివసించెదరు. ప్రభుత్వపక్షమున మంత్రులు, గవర్నరు కార్యనిర్వాహకసభాసభ్యులు మంత్రుల పక్షమువారు శాసనసభకు ప్రభుత్వముచే నియమితులైన సభ్యులు నుందురు. ప్రభుత్వ విధానంలో జరిగిన పొరపాట్లు, తప్పులు, మాయలు ప్రపంచమున కెరిగించుటకు, ప్రభుత్వమువారి బడాయిని పటాపంచలు చేయుటకు, కష్టనిష్ఠురములు చెప్పుకొనుటకు, ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గము వారిని మంత్రులను ఎదిరి పక్షమువారు ప్రశ్నలడిగెదరు.

ఆ యా ప్రశ్నల నడిగెదమని సభ్యులు ముందుగనే తెలియజేయవలెను. ప్రశ్నకాలము వచ్చినప్పు డా ప్రశ్నకు సంబంధించు నితర ప్రశ్నలనుగూడ నడుగ వచ్చును. ఇట్టి ప్రశ్న చేయుచున్నానని సభ్యుడు తెలియజేయుటతోడనే యా జిల్లాలోనా శాఖాముఖ్యోద్యోగికి ఆ విషయమునుగూర్చి వివరముల కొరకు వ్రాసెదరు. వారే జవాబిచ్చెదరో యా జవాబే శాసనసభలో ప్రభుత్వసభ్యుడు వినిపించును. ఒక్కొక్క ముఖ్య విషయము వచ్చినప్పుడు ప్రభుత్వ వ్యతిరేకపక్ష సభ్యులు ప్రభుత్వ కార్య నిర్వాహకవర్గ సభ్యులను ప్రశ్నములచే గజిబిజి చేయుదురు. ప్రభుత్వ సభ్యులు మాత్ర మీ తాటియాకు జప్పుళ్ళకు వెఱవరు.

చెన్నరాజధానిలో బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్య తీవ్రముగా నున్నది. చెన్న రాజధానికన్న కొంచెము తక్కువగా బొంబాయి రాజధానిలో నున్నది. చెన్న రాజధానిలో బ్రిటిషుప్రభుత్వము వచ్చినప్పటి నుండియు బ్రాహ్మణులు ప్రభుత్వోద్యోగములు సముపార్జించి యుండిరి. అందు అరవదేశపుటయ్యర్లు, నయ్యంగార్లు నుత్తమోద్యోగము లన్నియు తమ కాణాచిగా జేసికొనిరి. మరియు దక్షిణాపథమున బ్రాహ్మణేతరులను బ్రాహ్మణు లతి నీచముగ జూచుచుండిరి. బ్రాహ్మణాగ్రహార వీధుల బ్రాహ్మణేతరులు వెళ్లుట యెంతయో కష్టతమమై యుండునది. బ్రాహ్మణునకు బ్రాహ్మణేతరునకు నెంత స్నేహమున్న నా బ్రాహ్మణేతరుడు బ్రాహ్మణుని యింటికి భోజనమునకు వచ్చినప్పు డింటిలో నందరు భోజనము చేసిన వెనుక, వీధి సావడిలో

భోజనము వడ్డించెదరు. కాఫీ దుకాణములలో బ్రాహ్మణులకు వేఱు, బ్రాహ్మణేతరులకు వేఱు.

రానురాను బ్రాహ్మణేతరులకు బ్రాహ్మణులన్న కోపము, ఉడుకుబోతుతనము, తమస్థితి వృద్ధిచేసికొనవలెనన్న యిచ్ఛయు జనించినవి. వైద్యశిఖామణియగు 'డాక్టరు నాయరు' యాజమాన్యమున బ్రాహ్మణేతర సమావేశములు జరిగినవి. ఉపన్యాసములు, వ్యాసములు, కొరడా చురుకులవలె కత్తిపోటులవలె తీవ్రముగ ప్రబలినవి బ్రాహ్మణేతర సమస్య యాంధ్రదేశమున కెగబ్రాకినది. త్యాగరాజశెట్టి, కూర్మా వెంకటరెడ్డినాయుడు, రాజాపానగల్లు, రామస్వామి మొదలియారు మొదలగువారు నాయకులై విజృంభించినారు. ఉద్యమస్థాపకుడగు డాక్టరు నాయరు చనిపోయినారు. ఇంతలో మహాత్మా గాంధిగారు దేశమోక్షమునకై సహాయ నిరాకరణోద్యమము మొదలుపెట్టిరి. బ్రాహ్మణేతర నాయకులు ప్రభుత్వపక్షము జేరిరి. మాంటాగూచెల్మ్సుఫర్డు రాజ్యవిధానము వచ్చుటతోడనే శాసనసభలో నెన్నుకొన్న సభ్యులలోనుండి మంత్రుల నియమించవలసివచ్చినది. బ్రాహ్మణేతర నాయకులు తమ్ము మంత్రుల జేయవలయుననియు లేనిచో మహాత్మా గాంధిగారి యుద్యమమునందు జేరెదమనియు బెదరించిరట. అప్పుడు వెల్లింగ్డన్ ప్రభువు పానగల్లురాజును ముఖ్యమంత్రిగా వెంకటరెడ్డినాయుడు, పరశురామ పాత్రోల నుపమంత్రులుగా నియమించెను.

మహాత్మా గాంధీ బార్డోలీలో సత్యాగ్రహోద్యమమును చౌరీచౌరా దౌర్జన్యము కారణముగా మానివేసినయపుడు దేశబంధుదాసు, పండిత నెహ్రూ గారలు స్వరాజ్య పార్టీ నేర్పాటుజేయ దేశమంతట నాపార్టీ వ్యాపించి శాసనసభలలో బ్రవేశించెను. కాని నిరాకరణవాదులే భరతదేశమున నెక్కువగా నుండుటచే స్వరాజ్యపార్టీవారొక్క నాగపురములోను, బెంగాలులోను మాత్రము శక్తిసంపన్నులు కాగలిగిరి. చెన్న రాజధానిలోగూడ నా పార్టీ విజృంభించు చిహ్నాలున్నవి. వారు ముఖ్యపక్షముగా మదరాసు శాసనసభలో ప్రభుత్వమువారి నెదుర్కొనుచుండిరి. జాతీయవాదులనువారు కొందరొక చిన్నపార్టీ గట్టి స్వరాజ్యపార్టీ వెనుక మద్దతుగా నుండిరి. అట్టి జాతీయపక్షమునకు మన జమీందారుగారు నాయకుడు.

ఆరోజుసభలో జమీందారుగారు కృష్ణా గోదావరిజిల్లాలలో రైతుల కష్టముల గూర్చి పెక్కు ప్రశ్నలడిగిరి. స్వామి వెంకటాచలశెట్టి మొదలగువారు మన జమీందారుగారికి బలము గలుగచేసిరి. అరగంటవరకు ప్రభుత్వమువారు ముళ్ళపై నడిచినట్లయినది.

ఇంతలో జమీందారుగారు నాంధ్రజిల్లాలను ప్రత్యేకరాష్ట్రముగా విడదీయవలయునను తీర్మాన ముపపాదించిరి.

'అయ్యా అగ్రాసనాధిపా! నేనీ యుపపాదన చేయుట రెండవసారి. అప్పుడప్పు డాంధ్రనాయకు లనేకులీ యుద్యమము నీసభలో బ్రకటించియే యున్నారు.

ఆంధ్రోద్యమ మిప్పటికి బదిపదేను సంవత్సరములనుండియు దేశమున వ్యాపించి ఆంధ్రుల నుత్సాహశీలుర నొనర్చుచున్నది. అఖిలభారత జాతీయ మహాసభవారు దాని నామోదించి యాప్రకారము వారి సంఘముల యేర్పాటులో ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకముగా విభజించిరి.

'ఆంధ్రరాష్ట్రము చెన్నరాజధానిలో గొంచె మెచ్చుతగ్గుగా సగమున్నది. పదునొకండు తెలుగుజిల్లాలు నేజన్సీయు నున్నవి. రెండుకోట్లపై చిల్లరజనమున్నారు. రాష్ట్రాదాయము సగము తెలుగుజిల్లాలనుండి వచ్చుచున్నది. ఆంధ్రదేశము అస్సాముకన్న, మధ్యరాష్ట్రముకన్న, పంజాబుకన్న పెద్దరాష్ట్రము. ఇప్పుడే చెన్నరాష్ట్రీయ పరిపాలనము రెండు రాష్ట్రపరిపాలనములవలె జరుగుచున్నది. పోలీసు, ఎక్సయిజు, రివిన్యూ, విద్య, డి. పి. డబ్ల్యు. అటవి, కారాగృహములు మొదలగునన్ని శాఖలపై రాష్ట్రాధికారులున్నను. రాష్ట్రాధికారులకు జిల్లా యధికారులకు మధ్య రాష్ట్రాధికారులతో సమానులగు నిరువురు ముప్పురధికారులుండియున్నారు. అఖిలభారతీయ ప్రభుత్వ సంబంధమగు పోష్టులు, తంతులు, రాబడి ఆదాయము, ఉప్పు పన్ను మొదలగు శాఖలను రెండు రాష్ట్రముల కేర్పరచినట్లే రాష్ట్రమున రాష్ట్రాధికారి చేతిక్రింద నిరువురు ముప్పు రధికారుల నేర్పరచినారు.

'న్యాయస్థానములవిషయములో మదరాసు నున్నత న్యాయస్థానమున సరిగా పని జరుపవలెనన్న నిప్పుడున్న న్యాయాధికారులకు రెట్టింపుమంది నింకను నేర్పరుపవలయును. ఒక్కొక్క వ్యాజ్యము పరిష్కరింపబడవలెనన్న పెక్కు సంవత్సరములు పట్టుచున్నది. అట్టియప్పుడు రెండు ఉన్నతన్యాయస్థానముల నేర్పరుప వచ్చును. నేను వేసి చూపించిన లెక్కలప్రకారము రెండురాష్ట్రములు చేసినచో కర్చెక్కువ యేమాత్రముకాదు.

'కలిసియుండుటచే నుద్యోగములకని, సౌకర్యములకని ఆంధ్రులను తమిళసోదరు లణగద్రొక్కి వేయుచున్నారని గోల యెక్కుడగుచున్నది. ఈ రెండు జాతులను విడిపోయినచో నిరువురు నపరిమిత స్నేహముతో సౌహార్దముతో నుండుటకు వీలున్నది.'

ఈవిధముగా జమీందారుగా రొకగంటన్నర మాట్లాడినారు. కొందరిటు కొందరటు మాట్లాడినపిమ్మట కాలముదాటిపోవుటచే ఓట్లుగైకొనుట ఆగిపోయినది.

మధ్య ఫలహారములకు లేచునప్పుడు జమీందారుగారు, శాసనసభా ఫలహారశాలనుండి యుపాహారములు దెప్పింప తనయల్లుని, నాతనితోవచ్చిన ముగ్గురు స్నేహితులను బిలిచి విందొనర్చెను. తనస్నేహితుల కనేకుల కల్లుని యాతని స్నేహితులను 'బరిచయ' మొనరించెను. వారందరు రెండుకారులలో వారి గృహములకు వెడలిపోవుచుండ ఆంధ్రపత్రిక తరపున శాసనసభా కార్యక్రమము బత్రికకు నివేదింప వచ్చిన పరమేశ్వరునితో జమీందారుగా రిట్లనిరి.

'చూశారూ, పరమేశ్వరమూర్తిగారూ! ఇల్లాగా ఉంటుంది. ఏదో అకాండ తాండవం. ప్రభుత్వమువారు సూత్రధారులై తమ యిచ్చవచ్చినట్లు మమ్మల్ని కీలుబొమ్మలనుజేసి ఆడిస్తూ తమ పబ్బం గడుపుకొనిపోతూవుంటారు. మాఅంటట మే మొక్క వ్యాపారంకూడా చేయలేము. ఎన్నికసభ్యులు ప్రభుత్వపక్షమువారికన్న అధికంగా వున్నారనుకొందాం. మావారొకవిషయము శాసనము చేయించాలనుకుంటే గవర్నరు, వైసురాయిగారల అనుమతికావాలి. తర్వాత దేశంఅంతా ప్రచురణము చెయ్యాలి; తర్వాత ప్రత్యేక సంఘంవారా విషయం తర్జనభర్జనచేసి నివేదిక తయ్యారు చేస్తే, దానికి శాసనసభలో ఎక్కువమంది ఒప్పుకొని నెకిపిస్తే గవర్నరుగారు, గవర్నరు జనరలుగారు, ఇండియా కార్యదర్శిగారు అనుమతులిచ్చి దస్కతులు చేస్తే అప్పటికది 'లా' అవుతుంది. ఎన్నిచోట్ల పురిటిలో సంధి కొట్టవచ్చునో ఆలోచించుకోవయ్యా!'

పర:—అందుకనేనండి మానారాయుడంటాడు. సరియైన స్వరాజ్యం దానంతకాలం ఈఫార్సు జరుగుతూనే ఉంటుంది. నిజమైన ప్రజాపాలన కవరాశంగల స్వతంత్రం ఉంటేచాలట. దాన్ని మనం ప్రజాస్వామికం (రిపబ్లికు) అన్నాసరే, వలసరాజ్య పరిపాలనా విధానము (డొమినియన్ స్టేటసు) అన్నా సరే నటండి.

జమీందారు:—అంతవరకు మనం ఏమీ మాట్లాడకుండా ఊరుకుంటే ప్రభుత్వం పెచ్చుమీరి పోదండీ? కాబట్టి గడబిడ చేస్తుంటే కొంతవరకయినా లాభం ఉంటుందా వుండదా?

నారా:—ఉండదని కాదండి; ఆ లాభం; అసలు భూమిరావలసి వ్యాజ్యాలు జరుగుతూంటే వరిఊడ్చలేదు, వరిలో కిచిడీసాంబా ఊడ్చలేదు. అని దెబ్బలాడితే వచ్చేలాభంలా ఉంటుందండి. వ్యాజ్యదార్లకు వ్యాజ్యం ఆలస్యమయినకొద్దీ ఫలసాయం నష్టం. ఒకవేళ ఫలసాయానికి కర్చులకు డిక్రీ అయినా అది వసూలు అవుతాయని వ్యాజ్యదారుకు ధైర్యం ఎల్లా ఉండకూడదో అంతే మనస్థితి అవుతుంది. దేశం అప్పులు ఎక్కువవుతున్నాయంటున్నాము. ప్రభుత్వం వారిదివరకు చేసిన అప్పులకు వడ్డీ పెరుగుతూ ఉంది. కొత్త ఋణాలు చేస్తున్నారు. మనం ప్రభుత్వంతో ఇప్పుడైనా రాజీపడితే ఈ పన్నులన్నీ బ్రిటిషుప్రభుత్వంపైన రుద్దడానికి, ధర్మం ఎల్లావున్నా, వ్యవహారంపల్ల వీల్లేకుండా చేస్తున్నవీ సభలు. అప్పుడు మనకు నష్టం కాబట్టే యావన్మందీ కలిసి యేదో ఒక స్వతంత్రతకు, ఏకతాటిమీద పనిచేస్తే నిముషంలో ప్రభుత్వంవారు రాజీకి చక్కావస్తారు. అంటుంది కాంగ్రెసు.

జమీం:—అవును, మన ఆశయాలు చాలా గొప్పగానే ఉంటాయి, నారాయణరావూ! కాని మానవ ప్రకృతికూడా మనం ఆలోచించాలి. ఒక్క చిన్న కుటుంబంలో నలుగు రన్నదమ్ములకు నాలుగు భావాలుండీ న్యాయమార్గాల వెళ్తారుగదా?

అటువంటప్పుడు ముప్పది మూడుకోట్ల జనం ఉన్న మన రాజ్యంలో మూడు కోట్ల భావాలైనా వుంటాయి. అందుకని దారులు రకరకాలుగా వున్నా 'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' అన్నటులుగా అందరూకలిసి ఒకచోటికే వెడుతున్నాం గనక మన గమ్యస్థానం చేరుకోవచ్చును. అట్లా కాక, ఒక పక్షంవారు తదితరులు అంతా తమ పక్షమే చేరాలని మూర్ఖపు పట్టుపట్టి కూచుంటే అసలు మన ప్రయాణానికి అడ్డంరాదా అని నేననేది.

నారా :—చిత్తం మీరు చెప్పింది నేను కాదనను. మహాత్మాగాంధిగారు మూర్ఖపు పట్టుపట్టినాడని మనం అనుకోడానికి సావకాశం లేదని నా మనవి. ఎందు కంటారా, పెద్ద జబ్బులకు పెద్దరకం మందులు, గట్టిరకం వైద్యం కావాలి. సర్వతోముఖం అయిన జ్ఞానంకలిగిన గొప్పవైద్యుడు జబ్బుకు తగిన వైద్యం సమకట్టుతాడు. మహాత్మాగాంధి, అట్టి వైద్యుడనే నిర్ధారణలున్నవి. కాబట్టి ఆయనమార్గము పూర్తిగా తొక్కక తలోవైద్యం చేస్తే దేశంయొక్క జబ్బు ఎల్లాకుదురుతుందండి.

జమీందారు :—దేశబంధుదాసుగారి పద్ధతికూడ మనం ప్రయత్నంచేసిచూస్తే మంచిది కాదా.

పర :—దానికి గాంధీగా రడ్డుపెట్టకుండా తప్పుకొని దాసుగారు మొదలగువారితో రాజీనామా చేసుకొని తాను ఖద్దరు, పంచమోద్ధరణ నెరవేర్చెదనని సంకల్పించుకొన్నారుగాదండి.

జమీం :—నిశ్చయమేకాని ప్రజలందరు స్వరాజ్యవాదులకు సహాయముచేయుటలేదు. అందువల్ల స్వరాజ్యపార్టీవారిబలం రెంటికిచెడిన రేవడలావున్నది. కాంగ్రెసు తమ చేతులలో లేదని ప్రజాదరణం చూరగొన్న నిరాకరణవాదులు, గడ్డి తట్టలో పడుకున్న కుక్కల్లా తాము తినకుండా ఇతర్లను తిననీయకుండా చేస్తున్నారు. తాము శాసనసభలకు సభ్యులుగావచ్చి జాతీయపక్షాన్ని బలపరిచి ప్రభుత్వము చేతబూని, ప్రజలకు అనుగుణమైనప్రభుత్వం చేయడం మంచిది కాదటయ్యా పరమేశ్వరరావుగారూ.

పర :—అల్లా ప్రభుత్వం ఒప్పకపోతేనండీ ?

జమీ :—ఒప్పరూ ఒప్పకుంటే గవర్నరు శాసనసభను రద్దుచేసి కొత్త ఎన్నికలు ప్రచురించాలి. అందులో మనవాళ్ళే తిరిగి ఎన్నుకోబడతారు. మళ్ళీమనవాళ్లే ప్రజలపక్షమై మంత్రులై మరల యుద్ధంచేసి విజయం పొందవచ్చుకాదా!

పర :—అప్పుడు గవర్నరుగారు ఒప్పుకోకపోతేనండి ?

జమీం :—ఈ ప్రభుత్వవిధానం రద్దుచేసి తాను తన కార్యనిర్వాహకవర్గపు మంత్రులు రాజ్యం చేసుకోనీండి. శాసనసభ వట్టి నాటకం అని ప్రజలకు తెలుస్తుంది.

నారా :—అదేనండి అట్టినాటకము అవి గాంధీగారుగ్రహించి, ఆ రోగము మూలానికే తగు చికిత్స చేయవలె నంటున్నారు! టైఫాయిడు జ్వరంవచ్చిన రోగిని

డాక్టరొకరు, మలేరియా కాదని తెలిసియు, ప్రపంచమునకిది టైఫాయిడుఅని నిర్ధారణచేయుటకు 'క్వయెనా' యిచ్చి యిచ్చి జ్వరం తగ్గలేదండి అని చూపించి, అప్పుడు టైఫాయిడు అని చికిత్సచేయదలచుకొన్నట్లు వుంటుంది కాదాండి. ఈ ఆలస్యంవల్ల రోగికి ప్రాణాపాయంకూడా రావచ్చుకదాండి.

జమీం :—మలేరియా యని నిజంగా అనుకుంటే.

నారా :—చిత్తం. అలా అనుకునే, ముప్పదియైదు సంవత్సరములు చికిత్సచేసినారు. ఇంకెంత కాలమండీ.

పర :—మనదేశం దివ్యమైనది. నాలుగురోజులు ఆలస్యంచేస్తే ఏమిరా?

నారా :—అవును. మనఆత్మలు ఆద్యంతరహితములు వైద్యమెందుకు?

## ౧౪

## శ్యామసుందరీదేవి

నారాయణ మరునాడు హైకోర్టులో శ్రీయుత అల్లాడి కృష్ణస్వామిఅయ్యరును, శ్రీయుత ఎస్. శ్రీనివాస అయ్యంగారును సంపూర్ణ న్యాయాధికారసభలో హిందూ ధర్మశాస్త్ర విషయమై సలుపువాదన వినుటకై యేగి, సాయంత్రము నాల్గింటివరకువిని యానందించి 'రామకృష్ణ లంచిహో' మను ఉపాహారశాలకు బోయి యచ్చట పూర్ణముగ మెసవి, తన కారునెక్కి తిన్నగ 'కీలుపాకు' లోని మామగారి భవనమునకు బోవునప్పటి కచ్చట సహాధ్యాయుడగు యరవ స్నేహితుడొకడు వేచియుండుట జూచెను. మామగారప్పటివరకు నింటికి వచ్చియుండలేదు.

నవ్వుమోముతో స్నేహితుని రెండుచేతులుపట్టి, యూపుచు, 'ఎంతసేపయ్యిందండీ, సాంబారయ్యరుగారూ?' యని ప్రశ్నించెను.

'నారాయణ్! నీ వరగంట లేటండిదా'

'తలవనితలంపుగా రెండుత్తరాలు వ్రాయవలసివచ్చింది. అందుచేత ఆలస్యం అయింది. క్షమించు!'

'ఆ, ఫరవాలేదుదా'

'ఒక పదినిమిషాల్లో వస్తున్నాను. కొంచెం కాఫీ, పళ్ళు పుచ్చుకోండిమీ. మణి! నా ఫలహారం అయిందీ, మణీ!'

'వరాం సార్'

'అవసరందా లేదయ్యా ఆవకాయరావుగారూ'

'పనికిరాదు సాంబారు అయ్యారూ!'

నారాయణ త్వరత్వరగా క్షురకర్మ జేసికొని లోనికిపోయి దుస్తులుతీసి స్నానజలముల 'నిర్వాణ' యను సువాసనాద్రవ్యమును గలిపి స్వదేశీ లవండెరు సబ్బు రుద్దుకొని, జలకమాడి, తన దుస్తుల గదిలోనికిపోయి, ఖద్దరుపంచెయు ఖద్దరు లాల్చీయుధరించి, ముందుజట్టులో 'యూడికొలోను' పూసికొని నున్నగా వెనుకకు

దువ్వి, సీతానగరం ఆశ్రమం అత్తాకోడలంచుల జరీఖద్దరు ఉత్తరీయం దక్షిణాది మడతలుబెట్టిన దానిని భుజమున వేసికొని కాళ్ళకు లూథియానా చెప్పులుతొడిగి, చేత నొక చక్కని బెత్తముధరించి, యవయవములన్ని ఛలఛల మన, రెండవ యర్జునునివలె స్నేహితుడు కూర్చుండు మధ్యమందిరములోనికి విచ్చేసినాడు. అంతకుముందే ఉపాహారపుగదిలో ఉపాహారము మెసవి, కాఫీత్రావి యా యరవ స్నేహితుడును గనిపెట్టికొని యుండెను.

మామగారిపెద్దకారును 'డ్రైవరు' తీసికొనివచ్చి ప్రాంగణము ముందుంచుట తోడనే మన స్నేహితు లిరువురు నెక్కి యందు గూర్చుండిరి. దేహము కదలని కదలికతో, కారు 'బొంయి.బొంయి' మనుచు పున్నెమలై రోడ్డు ఎగ్మోరు, 'హారిస్' వంతెన, రౌండుతానా, మౌంటురోడ్డు తిరువల్లిక్షేణిపోయి యచ్చట అక్బరుసాహెబు వీధిలో నొక చిన్న మేడకడ నాగినది.

అరవస్నేహితుడు :—నారాయణీ! వీళ్ళు ఇక్కడనుంచి ఇంకోచోటికిదా మార్తురు? ఈమేడ ఒకమోస్తరుదా ఉండును.

నారా :—అవును. ఈ ప్రాంతాలు అంత ఆరోగ్యంగా ఉండవు. వీళ్ళేమన్నా డబ్బు గలవాళ్ళేనా?

అర :—అంతపరవాలేదుదా. తండ్రి జిల్లా ముఖ్యవైద్యుడుగా ఉద్యోగంచేసి పింఛను తీసిదా చచ్చిపోయినాడు ఇప్పుడు తల్లి, నలుగురుకూతుళ్లు నలుగురు కొడుకులుదా. ఏభైవేలు మణీయిచ్చి పోయినాడు తండ్రి.

నారా :—వీళ్లు సరీగా మంగుళూరు దేశస్థులేనా?

అర :—వీళ్లు తెలుగు మైసూరు కలియక. అందరికీ ఇంగ్లీషు తెలుగు అన్నిభాషలు వచ్చునుదా. మంగుళూరు తల్లిగారిది. తండ్రి మైసూరు.

ఇట్లు మాటలాడుచు మన స్నేహితు లిరువురు లోనికిబోయిరి. లోనికి బోవునప్పటికి మధ్యమందిర మంతయు కన్నులపై కుంతముగ నలంకరించియున్నది. అచ్చట పేము సోఫాలపై రకరకములగు చక్కని తెరదుప్పట్లు పరచి వున్నవి. మధ్య నొక గుండ్రని బల్లయు బల్లమీద అల్లికరుమాలును, అందుపై చీనాబుడ్లు, అలిఘరు కూజాలు వానిలో వివిధజాతి పుష్పములు నున్నవి. అచ్చట నొకకుర్చీపై మేలు పసిడిపచ్చని పదునెనిమిదేండ్ల యీడు బాలకుం డాసీనుడై యుండెను. వీరిరువురును వచ్చుటతోడనే ఈబాలకుడులేచి 'నటరాజన్! వచ్చినారా?' యనిఇంగ్లీషున ప్రశ్నించుచు 'దయచేయండి' యనెను.

నట :—ఈయనే మా తెలుగు స్నేహితుడు నారాయణరావుగారు, ఫిడేలులో నిధి, నారాయణరావు! ఈ బాలకుడు మంగేశ్వరరావుదా ఇక్కడ బి. యే. జూనియరు చదువుచున్నారుదా.

నారాయణరావు మంగేశ్వరరావులు హస్తస్పర్శ గావించుకొనిరి.

మంగే :—నేను లోనికిబోయి మా యక్కగార్లను చెల్లెళ్ళను బిలుచుకు వచ్చెదను. ఇచ్చట గూర్చుండుడు.

అని యాతడు లోనికిబోయెను. నారాయణరావు చదువుకొన్న బాలికల సమీపించి వారితో మాట్లాడుట కిదే ప్రథమము. స్త్రీలు విద్యాధికులగుట, నారాయణ రావుకున్న ఉత్కృష్టాశయములలో నొక్కటి. స్త్రీవిద్య జాతీయముగా నుండవల యును. లేనిచో పాశ్చాత్య విద్యయైన నయమేమో కాని, ఏవిద్యయు లేక మూర్ఖతలో నుంచుట మంచిదికాదని, యాత డూహించినాడు. 'విద్య లేకుండ స్వచ్ఛ హృద యలై యుండినచో స్వరాజ్య పవిత్ర ముహూర్తము వచ్చినప్పుడు, వారికి నిజమైన పూర్వసాంప్రదాయ విద్యగరపుటకు వీలేమో' అని యాతని తండ్రి యనును.

ఇంతలో నలువురు బాలికలతో మంగేశ్వరరావు లోపలినుండి మందిరము లోనికి వచ్చినాడు.

నలువురు బాలికలు మెరుపుతీగెలు, నలువురు బాలికలు గౌతమీనది చిరు కెరటాలు.

వారి సౌందర్యమున, ఆర్యత్వము నిండియున్నది.

'నారాయణరావు, వీరు శ్యామసుందరీదేవిగారు, వీరు రోహిణీదేవిగారు, ఈమె సరళాదేవిగారు, ఈమె నళినీదేవిగారు, వీరు నారాయణరావుగారు.' అని నటరాజన్ స్నేహితునకు నాబాలికలకు బరిచయము గలుగజేసెను. అందరు ఒకరి కొకరు నమస్కృతులిడి, నాసనములపై నధివసించిరి

'నారాయణీ! శ్యామసుందరీదేవి ఫిడేలును, రోహిణీదేవి వీణను, సరళాదేవి జలతరంగము పియానో, యిస్‌రాజ్ చితారు, సారంగీ మొదలయిన వెన్నో వాద్యా లను; నళిని మురళిని అద్భుతముగా వాయించగలరుదా. వీరి తండ్రిగారు చూస్తివా! 'పింఛను' పుచ్చుకొన్న వెనక మైసూరులో జాలకాలముండిరి. అక్కడ ఆస్థాన విద్వాంసులుదా కుమార్తెలకు నేర్పినారూ చూస్తిరా? శ్యామసుందరీదేవిగారూ, ఈ నారాయణరావుదా చాల జాగ్రత్తగా, దీక్షగా విద్య అభ్యసించాడు. చిన్నతనా న్నుంచి రామస్వామి అయ్యరికిదా నూరురూపాయలిచ్చి యీ ఊరిలో నెలలు నెలలు విద్య నేర్చు కొన్నాడు. ఇట్టి మీ రిద్దరుదా కూడపలుక్కుంటే, ఇద్దరివిద్యా చాలా బాగుగా వృద్ధి అవునుదా నా ఆశయం' అని నటరాజన్ సంతోషమున జేతులు నులుముకొనుచు పలికెను.

శ్యామసుందరి యిరువదిరెండేడ్ల మిసిమిపసందుల ఛంపకీ సువర్ణగాత్రి. నారాయణరావును చూచి 'కొంచమాలస్యం కావడంచూచి మీరీ రోజున వచ్చుటకు వీలుకాదేమో అనుకొన్నాము' అన్నది.

నారా :—నేనే మా ఆలస్యానికి గారణము. క్షమించండి! మంగేశ్వరరావుగా రేవాద్యమన్నా వాయించగలరా?

నటే :—వాయించ కేమిదా ? అత నెప్పుడున్నూ నేర్చుకోలేదు కాని, అప్పచెల్లెళ్లు నలుగురూ నేర్చుకొనేవి వినికిడివల్ల చూ స్తిరా! అవి పట్టుకొని అన్ని వాద్యాలమీద వాయించగలడుదా.

నారా :—అలాగా ! బాగుంది. మీరు చాలా అదృష్టవంతులండీ, మంగేశ్వరరావుగారు !

మంగే :—మా నటరాజన్ ఏదో ఒకటి అంటూ ఉంటాడు లెండి.

రోహి :—నారాయణరావుగారు ! వాద్యాలన్నిటిలో ఏది మంచిదంటారు ?

నారా :—నా ఉద్దేశం వీణా ఫిడేలు రెండూను.

శ్యామ :—ఆ రెంటిలో ఏదని మీ అభిప్రాయం ?

నారా :—మీ రడిగింది చాల చిక్కుప్రశ్న. పురాతన చరిత్ర ప్రియులకు వీణ యెక్కువ ప్రీతికరము. సంప్రదాయ బద్ధులనుగూడ ఫిడేలు ప్రీతివంతుల చేస్తున్నది. వీణెలోని చమత్కారాలు ఫిడేలులో లేవు. ఫిడేలులోని అద్భు తాలు కొన్ని వీణెలో రావు. హృదయంలో నానంద మిమిడియున్నవారి కేదయినా పరమప్రియం. అయినా నామనస్సు వీణెతో నెక్కువ కలసి పోయింది. నేనింకా వీణె నేర్చుకోవాలన్న ఊహ మానలేదు.

నళిని :—(నవ్వుచూ) నారాయణరావుగారు కోమటిసాక్ష్య మిచ్చినారు.

అందరు ఘొల్లుమని నవ్వినారు.

నారా :—(హృదయపూర్వకముగ నవ్వుచు) అవును 'గాంధిగారా ? మాలవియ్య ?' అని అడిగితే ఏమి చెప్పమన్నారు ? నేనా ప్రశ్నకు తగు సమాధానమీయ లేను; కాని వీణంటె నామనస్సు పొంగినట్లు ఫిడేలన్న పొంగదు. వెంకట స్వామినాయుడు, బలరామయ్య, గోవిందస్వామిపిళ్ళలు మాత్రము నన్ను కరిగించివేస్తూవుంటారు.

లలిత :—ఫ్లూటో ?

నారా :—వేణాండి ? వేణువు దివ్యగానమే. కాని వేణువు పై రెండు వాద్యాలకు విద్వత్తులో తక్కువ కాదాండి. సంజీవరావువంటి అపరవేణుబ్రహ్మ వీణ ఫిడేళ్ళతో దానిని తుల్యము జేయవచ్చును. నళినీదేవిగారి పాట యెల్లా వుంటుందోవినాలి.

శ్యామ :—నారాయణరావుగారు ! మీ ఫిడేలు పట్టుకువచ్చారా ?

నట :—ఆ ! కారులో ఉంది. తెప్పిస్తా.

నారా :—మీ రంతా ముందు వాయి స్తే వింటాను; నాపాట ఎంతలేండి !

శ్యామ :—అల్లాకాదు.

నట :—మీ అక్కచెల్లెళ్లు ముందరదా పాడవలసిందని నేనుదా మనవి.

శ్యామ :—సరే.

మంగేశ్వరరావును, నళినియు, సరళయు లోనికిబోయి తాంబురా, వీణ, ఫిడేలు, వేణు, ఛితారు పట్టుకువచ్చినారు. రోహిణి తంబురాను ధరించినది. ఫిడేలును

శ్యామసుందరి తీసికొనినది. ఇరువురును శ్రుతి సరిచూచుకొన, శ్యామసుందరి పల్లవి నాలపించి, వాయించ నారంభించినది.

## ౧౫

## అక్కచెల్లెండ్రు

ఆ నలువు రక్కచెల్లెళ్ళ యందమునం దెక్కువ తక్కువలు నిర్ణయించుట దుస్తరము. నలువురు నొకేయచ్చున పోతబోసిన విగ్రహములు. చటుక్కున జూచినచో బోలికలలో నేమియు వ్యత్యాసమున్నట్లు సాధారణులు గ్రహింపనేరరు. పరిశీలనాదృష్టిగలవారు ఆ నలుగురు బాలికలకు ముక్కులు, అడుగుపెదవులు, గడ్డములలో భేదమున్నదనియు, గన్నులలోని పాపల రంగులు వివిధములుగా నున్నవనియును, నుదురుకొలతలు రెండవ నాల్గవ బాలికల కొకతీరునను, మొదటి మూడవ బాలల కొకతీరున నున్నవనియు. మొదటి యిద్దరి బాలలకు నుంగరముల జుట్టనియు, చివరియిద్దరి బాలలకు నున్నని సమకేశములనియు, పెద్దయామెయు ఆఖరి బాలయు నిద్దరు పొట్టివారనియు, మధ్య వారిరువురు పొడగరులనియు గ్రహింపగలరు.

శ్యామసుందరి కంఠము, కిన్నెరకంఠము, కలస్వనము, పంచమస్వర పూరితము.

రోహిణీదేవిగళము కాకలీస్వనము, నిషాదస్వరశ్రుతిగలది.

సరళాదేవిగొంతు, ధైవతస్వరశ్రుతి, వేణునాదపూరితము.

నళినీదేవిగళ మింక నేర్పడలేదు. కాని మధురమైనదగునని స్పష్టము.

శ్యామసుందరీదేవి వైద్యవిద్యయందు మూడవ తరగతి చదువుచున్నది. ఆమెచెల్లెలు రోహిణి రాజధాని కళాశాలలో బి. యస్. సి. ఆనర్సు మూడవసంవత్సరము చదువుచున్నది. మూడవ బాలిక యింటరు ప్రథమతరగతి, నాలుగవ బాలిక అయిదవ ఫారము.

శ్యామసుందరీదేవి కుటుంబముసంగతి నారాయణరావునకు నటరాజను సెప్పినాడు. రాజారావు తరగతిలో శ్యామతో మాట్లాడుచుండెనేగాని లజ్జాశీలుడగుటచే నామెతో దక్కిన వారందరు స్నేహముగా నున్నట్లుండలేదు. నటరాజన్ కూడ వైద్యవిద్యార్థి, ఆతడు శ్యామతో నామె కుటుంబముతో బాగుగా స్నేహ మొనర్చెను. శ్యామాసహోదరీబృందము సంగీతలోలమని నారాయణరావు పరమేశ్వరులకు దెలిసినప్పటినుండియు వారచ్చటకుబోయి యీ సంగీతము విని యానందింపవలయునని యనుకొనుచుండిరి.

పరమేశ్వరుడు స్త్రీలతో నంతలో స్నేహము చేయగలడు. నారాయణరావు తమంత తాము స్నేహము కోరివచ్చినవారితో గలసి మెలసి యుండగలడు. ఒక్క రాజారావునకే స్త్రీ లనిన తగని సిగ్గు.

నారాయణరావు నటరాజనులు వచ్చినగంటకుగాని పరమేశ్వర రాజారావులకు శ్యామఇంటికి వెళ్ళుటకు వీలు చిక్కినదికాదు. మన మిత్రులారోజున శ్యామఇంటికి వచ్చి సంగీతము వినుటకును, నారాయణరావు తన సంగీతము వినిపించుటకును నటరాజనే ఏర్పాటు చేసినాడు.

ఇంతలో రాజారావును బరమేశ్వరుడు నెక్కడకువచ్చిరి. ఈతడుకవి, చిత్రకారకుడు, విమల గానవిలోలుడు. అభినయమునం దారితేరిన కళా హృదయుడు. చిత్రచిత్రమగు విషయముల పాటలుగా గూర్పగలడు. అని పరమేశ్వరునిగూర్చి యెఱింగించిరి. రాజారావు నందరు నెఱింగినవారే.

సభయంతట పూర్ణమై పరిమళించినది. నారాయణరావు ఫిడేలువాయించినాడు. పరమేశ్వరు డభినయముతో, తీపియైన కంఠముతో బాటలబాడినాడు నటరాజన్ అరవపాటల మధురముగ వినిపించినాడు. శ్యామ, రోహిణి, సరళ, నళిని యందరు వారివారి కళాచమత్కృతి గనబరచినారు. రాచప్పను, కిట్టప్పను, బాలగంధర్వుని, ఫందేర్కరును అనుకరించుచు మంగేశ్వరరావు తియ్యనిపాట పాడినాడు.

విమల గాంధర్వము వియద్గంగాఝురియై సుళ్లుకట్టుచు, కరుళ్లువోవుచు, ఫెళ్లున విరుగుచు, పతనములై తూలుచు ఉప్పొంగుచు, ఊగుచు ప్రవహించినది. చిరువాగు లందు కలిసినవి. ఉపనదీ నదంబులందుజేరి త్రివేణులైనవి. శాఖానదు లందుండి వీడ్వడి వేరుదారుల శాలికేదారముల దడుప బోయినవి.

గానకళారహస్యము లావేళ పూలదోటలైనవి, నక్షత్రకాంతులైనవి, చంటిబిడ్డలనవ్వు లైనవి. చక్కని లేబెయ్యగంతులైనవి, సంధ్యాసమయ శ్రీ నటేశ్వర పాదకింకిణీతాళము లైనవి.

ఒకరినొకరు మెచ్చుకొన్నారు, ఎవరికివారు పరవశులైనారు. ఒకరినొకరానందవశుల గావించినారు. లయగతులజూపు వేడుకమై లయావిష్టుడై లయబ్రహ్మను ప్రత్యక్షము చేసినాడానాడు నారాయణుడు. కమాను వేగములో 'తానం తానం తానం అనంతా, నంతాననన, ననాం ననాం నాంనా అనాంతా,' యన్న తోడిరాగములోని తానం శ్రీబాలకృష్ణ పాదనూపుర ఘలంఘలిత మధురతర మధుగతీ వేగమై వారి నందరిని ముంచెత్తినది. అస్పష్టమధుర సూక్ష్మ స్వరధ్వనులలోనికి గొనిపోయి యణుమాత్రముజేసి, రానురాను విజృంభింపజేసి, బ్రహ్మాండము నావరింపజేసి సమస్త సృష్టిలయముజేసి కమాను ఆపివేసినాడు. శ్యామసుందరీదేవి పరవశయై చటుక్కున లేచి నారాయణరావునకు నమస్కరించి, 'అయ్యా విద్వత్తుమాట యటుండనిండు, ఈ పోకడులు, ఈస్వకపోలకల్పనా ప్రవాహము అద్భుతమైయున్నది. ఈ పద్ధతి ఎక్కడ నేర్చుకున్నారండీ' యని యడిగినది.

'అమ్మా! నే నెల్లప్పుడు ఫిడేలు వాయించు కొనుచునేఉంటాను. మన దేశమున ఒక్కొక్క యుత్కృష్టవ్యక్తి జన్మించి, సంగీతాది కళలలో పురాతన సంప్రదాయ జనితమగు నొకనూతన సంప్రదాయము నప్పటప్పటికి నెలకొల్పి, భవ

తారకమగునట్లు చేయుచున్నాడు. నేటివఱకు త్యాగరాజు ననంతరమున మరియొక వ్యక్తి జన్మింపలేదు. నేను పాశ్చాత్యగానవిశారదుడగు నొక ఫిడేలువాదనా కుశలుని కడ పాశ్చాత్యుల పోకడలు నేర్చుకొన్నాను. జపాను సంగీతము బర్మా, సయాము, పెర్శియా, రషియా మొదలగు వివిధదేశముల వాద్యవిశేషములు జాగ్రత్తగావిని స్వరముకూర్పు, వేగము, రాగము, తాళము పరిశీలించి క్రొత్తక్రొత్త పద్ధతులు రాగములలోనికి తాళములోనికి కూర్పులోనికి జొప్పించినాను.' అని నారాయణ ఇంగ్లీషున అన్నాడు.

'రాత్రి యెనిమిది గంట లయినది. మనము సెలవు పుచ్చుకొందమా' యని రాజారావు లేచినాడు. తక్కిన వారందరు లేచుటయు, నౌకరి కొకరు వందనము లాచరించుకొనిరి. నారాయణరావు, రాజారావు, పరమేశ్వరుడు, నటరాజన్ అందరు కారుమీద నెక్కి నెమ్మదిగా సముద్రతీరముననే ప్రయాణముచేయుచు నటనుండి వీధులు తిరిగినారు.

ఎవరిండ్ల వారిని దిగవిడచి నారాయణు డింటికిచేరినాడు. ఆతని హృదయము శ్యామసుందరీదేవిని గనుగొన్నప్పటినుండియు ద్రవించి పోయినది. శ్యామసుందరి తన చెలియలైనట్లు హృదయమునకు ప్రత్యక్షమైనది. తన కారుగురు చెల్లెళ్లను కొన్నాడు. శ్యామసుందరిలో సూర్యకాంతమును జూచినాడు. సూర్యకాంతము తన యప్పచెల్లెళ్లలో కడుగూర్చు చెలియలు. ఆమె యనిన ప్రాణమే తనకు. సూర్య కాంతము తనలో నొక యంశ. ఈ శ్యామసుందరి తనకు కొంచెము దూరపు చెల్లెలా! అవును. తన యిరువురు చెల్లెళ్ళ వెనుక చెల్లెలు. తన వాత్సల్యమును జూరగొన్నది సూర్యకాంతము. శ్యామకుకూడ నా వాత్సల్యమున నేడు చోటు దొరికినది.

కాని ఎక్కడి దీసంబంధము! ఏ జననాంతర సౌహృదమో ప్రత్యక్షమైనది. తాను తన చిన్నారి భార్యయగు శారదను ప్రేమించుకొన్నాడు. శారద తన దైవము. తన్ను బ్రోవ చనుదెంచిన దివ్యభామిని. ఆమె తన ప్రాణమునకు ప్రాణము. ఆమెను జూచినప్పుడు తన పురుషత్వ ముప్పొంగినది. తనలోని దివ్యత్వము ప్రస్ఫుటిత మైనది. ఆమెను కౌగలించుకొనవలె, ఆమెను బిగియార తనలో జేర్చుకొనవలె. ఆమె పెదవులు అమృతంపు సోనలని తాను కవన మల్లుకొన్నాడు. శారదను జూచి నప్పుడు ప్రేమ, దయ, హృదయమున సంగీతము, కపోలముల వేడి, దేహమున మత్తు, ఆత్మకు ఆనందముకలుగును. ఏ స్త్రీయైన దన్నట్లు పులకరమున ఓలలాడించ గలదా, తన్నట్లు పొంగింప చేయగలదా? అదియ ప్రేమకాబోలు, అదియే ప్రణయ మహిమ!

శ్యామసుందరిపై గలిగిన ప్రీతిలో ఆమె దేహము తనకు స్ఫురించదు. ఆమె తనకు చెల్లెలు.

పరమేశ్వరుడు దీర్ఘాలోచనాపరుడై ఇంటిదగ్గర కారాగినసంగతియు గ్రహించ లేదు. ఓరికవీ! కలలోంచి మెలకువ తెచ్చుకోరా యని నారాయణుడన్నాడు.

'ఒరే నేను కలకంటోంటే నువ్వింందాకటినుంచి తెగమెలకువగా ఉన్నావు కాబోలు. పక్కనే ఉన్నావుగాని ఒక్కమాటలేదే?'

'నువ్వేదో ఆలోచిస్తున్నావని!'

'నామీద పాపం, దయదలచి నన్నుకూడా కాస్త ఆలోచించుకో నిచ్చావన్న మాట. వహ్వా!'

'ఏమిటేరా నువ్వాలోచించేది? నేనూ ఆలోచిస్తూనే ఉన్నానులే!'

'అలాగా! ఈవాళ మా ఆవిడ నాపై అనుమానం పడుతుంది. నా హృదయాన్ని అద్దంలోని బొమ్మలా గ్రహిస్తుందిరా!'

'ఆ ఉపద్రవం ఎందుకు? నీమదిని యీవాళ కదిపి కదిపి మధించి ప్రేమ అనే విషమునో, అమృతాన్నో ఉద్భవింపజేసుకున్నావా?'

'ఒరే వాళ్లు అప్సరసలురా. వాళ్ళమధ్యవున్న ఋషులు నిష్కల్మషహృదయులై ఉండగలరట్రా. రోహిణీదేవిచెంత నేను చంద్రుణ్ణనుకున్నా!'

'పరమేశ్వర మూర్ధాభరణమ వనుకొన్నావు. పరమేశ్వరమూర్తివి కాక!'

'అహో అవునురా! నాకళ్ళు ఆమెకళ్ళు ఏకమయినవి. ఆమె వాయించి నంతసేపు నావైపుచూస్తూ పాడిందిరా. ఆమె కళ్లు సోగలా? వాగులా?'

'ఆమె అంత అందకత్తెటరా?'

'ఒరే! నువ్వా కవివి, చిత్రకళయందు నీకున్నా ప్రేమ. ప్రకృతిచిత్రాలు చాలాబాగా వేస్తావు. గానహృదయం కలవాడివి. గానమే జీవితం అంటావు నీకు తెలియదురా?'

'అరే పరమేశ్వరం! మనము మన జీవితాలు సార్థకపరుచుకోవాలంటే మనలో ఇదివరదాకా లోటయిన స్త్రీ హృదయసందర్శనం పూజానమ్రహృదయంతో చేసుకోవాలిరా. మన కిదివరదాక స్త్రీ అంటే ఒక వస్తువో ఏదో, మనది, అనే భావమే కాదుట్రా?'

'అవునోయి! నువ్వు ఇదివరదాకా అంటూనే వున్నావు. మనది త్రిశంకు స్వర్గం. మనం ఉత్కృష్టమైన పూర్వసంప్రదాయ కాలంలో, అంటే వేదకాలంలోనూ లేము, నవనాగరికులమూ కాము.'

'అయితే వీళ్ళెల్లాంటి వాళ్ళంటావు?'

'ఇప్పుడు మనం చూస్తున్నాం, పాశ్చాత్య నాగరికతావ్యామోహంలోపడి, రెంటికీ చెడ్డవాళ్ళయితే, బడాయి, టక్కులు, ప్రాపంచిక దృష్టికలవాళ్ళవుతారు. కాదూ—'

'కామరా మరి. అందంగాఉన్న చక్కని జంతువులూ, అవుతారు. తమ్మి ఇతర్లు చూచి ఆనందిస్తున్నారా లేదా అనే జాతి అలాంటిరకం అవునా కాదా అన్న సంగతి రాజేశ్వరుడికే తెలియాలి. రేపు మనవాడు వస్తున్నాడు మాట్లాడుతే రాజమండ్రి పరుగెత్తుతాడు. వాడిసంగతి బాగాలేదు.'

## ౧౬

## పు ష్ప శీ ల

రాజేశ్వరరావు బి. యే. మూడవతరగతి చదువుచున్నాడు. ఈయేడాతని చదువు తిన్నని మార్గమున నడచుటలేదు. తల్లికి జబ్బుచేసినదని వంకబెట్టి రాజమహేంద్రవరము పరుగెత్తిపోయి యచ్చట పుష్పశీల సాంగత్య మెప్పుడు దొరకునాయని యనేకమార్గముల నన్వేషించుచుండెను. పుష్పశీలయు ననేక చిత్ర విచిత్ర మార్గముల దన ప్రియుని గలుసుకొను నేర్పాటులు సేయుచు నావేశపరవశురాలై యున్నది ఆ రోజులలో బుష్పశీల భర్తపైచూపు ననురాగమునకు మితిలేదు, సుబ్బయ్యశాస్త్రగారును దన రసికతకును భార్యచూపు నపరితాను రాగమునకును మురిసిపోవుచుండెను.

మిత్రుడగు నొక వైద్యునిచే దన తల్లికి చాల జబ్బుగానున్నట్లు పత్రము నంది, యయ్యది తన కళాశాలాధ్యక్షునకు బంపి, రాజేశ్వరరావు మరి పదిరోజులు రాజమండ్రిలో మకాము వేసినాడు. పుష్పశీలాదేవి నొంటిగా గలిసికొనుటకు వీలు కుదరలేదు. సుబ్బయ్యశాస్త్రిగారి యింటిలోనివారు నమ్మకమైన బంట్లు. యజమానుని, నిధినిక్షేపములను, వస్తువులను, భార్యను నితరులు తస్కరింపకుండా వేయికన్నుల కాపాడుచుందురు. లంచములకు లొంగరు. మాయమాటలకు మరిగిపోరు.

పుష్పశీల తన హృదయ మితరులకు దెలియనీయకూడదు. ఆమె తన యింటిలోనైన ఏకాంతము సంఘటించవలయును; లేదా, యొంటిగా బయట కెక్కడికైన వెళ్లుటకు వీలుచేసికొనవలయును.

రాజేశ్వరుని కౌగలింత యొకనాడు రుచిచూచి, ఆనాటి ముద్దుల సువాసనల రుచుల తన పెదవులపై నింకను ఆఘ్రాణించుచున్నది. తన యీడువాడగు రాజి తనకు భర్తయై యున్నచో తన జన్మము తరించి యుండును. అహో! తన యౌవన మానాడు రాజేశ్వరుని కౌగలింతలో రాగాలు పాడుకొన్నది. భర్త తన కెప్పుడు నంత తీపియీయలేదే; ప్రేమయన నదియే. తానుకూడ నొక నవలలోని కథానాయికవలె నున్నది. తాను రాజేశ్వరుని నిక నెన్నటికీ నెడబాయకుండుట ఘటింపదా? రాజేశ్వరుని కలుసుకొను మార్గమే దొరకదాయె. పదిరోజులు పుట్టింటికేని పంపడు తన భర్త. అయినప్పటికిని పుట్టిల్లు రాజమహేంద్రవరమే కావున నప్పుడప్పు డచటికేగి యచ్చట రాజేశ్వరు నేల కలుసుకొనగూడదు? అది బాగుగా నున్నది.

ఆ రోజున తన హావభావవిలాసములతో పుష్పశీల భర్తను ప్రేమసాగరలీనుని జేసినది. సుబ్బయ్యశాస్త్రిగారికి ప్రపంచక మంతయు గాఢమధురమైతోచినది.... ఆడ వాళ్ళింత యానంద మీయగలరా ? వారి జన్మయే యానందము. వారులేని పురుషుని జన్మము మరుభూమియే.

'నీ కింత ప్రేముందా ? పుష్పం ?'

'నా బ్రతుకంతా ప్రేమేనండీ !'

'నువ్వు పుష్పంలా దివ్యమైన చరిత్రగలదానివిసుమా ప్రణయసుందరీ.'

'మీ మీద కవిత్వం వ్రాయాలి. ఇంతవరకూ అందరూ మగవాళ్ళే కవులు. నేను మీమీద పాటలు పద్యాలు వ్రాస్తాను. మారుపేరుపెట్టుకొంటాను. పత్రికకు పంపించనా ?'

'తప్పకుండా పంపించు. నువ్వు పంపించబోయే ముందర నాకు చూపిస్తూ వుండు. నాకు కవిత్వంరాదు. లేకపోతే నేనును నీమీద వందలకొలది పాటలు వ్రాస్తూ ఉందును.'

'ఓ సామి నిను జూసి
నీయెడద తీపినై
నిలువెల్ల ప్రవహిస్తు,
మంచుకొండై నువ్వు
మబ్బుబాలిక నేను,
నీపై ననవరతము
నృత్యాన సోలెదను'

'ఈ పాట బాగుందండీ ?'

'నువ్వు రాసిందేది బాగుండదు ? నాకు ఏది మంచిదో ఏది చెడ్డదో తెలియదు. కాని, ఇప్పుడు భారతి మొదలైన పత్రికల్లో ప్రచురింపబడే భావకవిత్వం కన్న తక్కువగా ఉన్నదా యేమిటి !'

మరునాడు భర్త కోర్టుకు వెళ్ళినప్పుడు, తన్ననవరతము కాపాడుచుండు పని మనిషి నెట్లయిన వదలించుకొనదలచి భర్తకొక యుత్తరమువ్రాసి పంపించినది. పనిమనిషి యా యుత్తరము పట్టుకొని జడ్జీ కోర్టుకని పోయినది. వీధిలోని బాలకు నిచే రాజేశ్వరున కొకయుత్తర మంపినది. రాజేశ్వరుడువచ్చి దొడ్డిగుమ్మమున దొడ్డిలోనికి ప్రవేశించినాడు. వంటచేయు చుట్టపుమేనత్త ముసలమ్మ కేదియో వంక బెట్టి పనికల్పించినది. వసారా గుమ్మమున లోనికిరప్పించి రాజేశ్వరుని మేడమీద గదిలోనికి బంపినది. తల నొప్పిగా నున్నదనియు, కొంచెముసేపు గదిలోనికిబోయి పరుండెదననియు జెప్పి, మేడమీద గదిలోనికిబోయి తలుపు వేసికొన్నది.

కొందరు స్త్రీలు తమకోర్కెను దెలిపియు దెలుపని కటాక్ష వీక్షణాదులచే దెలుపుచు, పురుషహృదయములు జూరగొని మనోభీష్టము తీర్చుకొందురు; కొందరు

తమ కోర్కెను భయముచే, లజ్జచే ప్రియునకు దెలియనీయరు; అపరిమితమగు బల వంతముచే వలె ప్రియుని యాశ్లేషములో నణంగుదురు. తామై బయల్పడి, కోర్కె నెరింగించుకొని ప్రియునకు వశలగు వనితలరుదు. అట్టివారి ప్రేమము గట్లు తెంచు కొని పాఱుచుండ దాని నెవరడ్డగలరు ?

పుష్పశీలకు రాజేశ్వరునిపై నట్టి వెట్టి జనించినది. ఎట్లయినసరే తనకోర్కె తీర్చుకొనవలెను. ఆమెకు సతతము రాజేశ్వరుడే ప్రత్యక్షమగుచున్నాడు. రాజేశ్వ రుని నవ్వులు, రాజేశ్వరుని వస్త్రువలుతిరిగిన ఛాతీదండలు మనోనేత్రమున దోచి యొడలు ఝల్లుమనుచుండెను.

నిమిష లో నలంకరించుకొన్నది. మోము కడిగికొని సుగంధ మలది కొన్నది. సువాసన పౌడిచే మొగము కై సేసినది. సన్నని చీరకట్టి, సన్నని రైక తొడిగి గదిలోనికి వెడలి పోయినది. తలుపు వేసుకొన్నది.

రాజేశ్వరుడు నిమిషమొక యుగముగా వేచియున్నాడు.

' నీవు రావనుకొన్నాను. ఆనాడు మీ ముసలమ్మకు జబ్బుచేసినప్పుడు వస్తే సమయానికి నీభర్తవచ్చాడు. ఈరోజున ఏమి అడ్డమో అనుకున్నాను.

' మీరు పరపురుషులు నేనిల్లా రాకూడదు. పొరపాటు నే వెళ్ళిపోతా '

' అయితే నన్నెందుకు రప్పించావు ? '

' ఎందుకో ? ప్రతిరోజూ మాయింటికిరావడం, మాయింటిముందర, యింటి అరుగుమీద మధ్యాహ్నము స్నేహితులతో మాట్లాడుతూకూర్చుండడము, కారణం నాకు తెలియక ఏమిటో కనుక్కుందామని అనుకున్నాను. '

' అల్లాగా ' అని రాజేశ్వరు డాబాలికను పొదిగిట నదుముకొన్నాడు. పెద వులపై ఫాలముపై ముద్దులిడినాడు. ఆబాలిక తప్పించుకొని పారిపోయి రొజుచు, చిరునవ్వు చవ్వుచు, నురస్థలమెగుర మంచముపై పడిపోయినది. రాజేశ్వరుడు నవ్వుచు మంచముపై నాబాలిక నదిమిపట్టి మెడ ముద్దుగొన్నాడు.

* * *

కాలేజీ కేగుటకింక నాలస్యము చేసినచో జాల నష్టమువచ్చునని సహాధ్యాయు లిరువురు మువ్వురు వ్రాయుటతోడనే రాజేశ్వరుడు రాజమహేంద్రవరమునుండి కదలివచ్చుచు, తన్ను గిండీకి బోవుదారిలో గలియుమని నారాయణరావుకు తంతి నిచ్చినాడు. ఆమాట పరమేశ్వరునకు దెలిపెను నారాయణరావు.

ఉదయమున మెయిలు వచ్చునప్పటికి తన కారుమీద నారాయణరావు ' సెంట్రల్ స్టేషను ' చేరునప్పటికి మెయిలుబండియు వచ్చినది.

సెలవులు పుచ్చుకొని స్వస్థలముల కేగుచున్న రెండుమూడు తమిళయ్యరు కుటుంబములు తప్ప తక్కిన వారందరు తెలుగువారే. వర్తకమునకు, హైకోర్టు పనికి, యాత్రలకు, వైద్యములకు వచ్చువార లాబండి మూడవతరగతుల నిండి యుండిరి.

బండి యాగుటతోడనే వందలకొలది కూలీలు బండిలోనికిబోయి ' వద్దువద్దు ' అనుచుండగనే చేతిమూటలులాగువారు, ' సామాను. దింపినతర్వాత బేరమాడవచ్చు ' ననువారు, ' మీరుదా బేరమేమిసామి ! నాను బీదవాడుదా, నువ్వుయిచ్చే కూలిదా నాకుపొట్ట ! సామి ? ' అనువారునై యుండిరి. చుట్టములను, స్నేహితులను, కలుసుకొనవచ్చినవారు, భోజనవసతిగృహముల తరపు మనుష్యులు, వీరియందరి రణగుణ ధ్వనితో నా ప్లాటుఫారము బోరు కలుగుచుండెను. నారాయణరావు విసవిస మధ్యతర గతి బండికడకు బోవుటయు నందుండు రాజేశ్వరుడు చిరునవ్వు నవ్వుచు దిగినాడు.

' ఏమిరా వచ్చావు ? మీ అమ్మగారి జబ్బు ఎల్లావుందిరా ? '

' నిమ్మదిగావుంది. అందుకనే వచ్చాను. '

' కళ్లు గుంటలడ్డాయి, మీ అమ్మగారికి రాత్రింబగలు పరిచర్యకాబోలు, వెఱ్ఱి కాయా ! దిగు నీపనిచెపుతా '

' కూలీ ! '

' చిత్తం సామి ! '

' సామాను కారుకు పట్టుకురారా ! '

' ఏవిస్తురు సామి ? '

' నీమెడ విరుస్తురుగాని రారా ! '

కూలివాడు సామానుతో రా, మిత్రు లిరువురు నారాయణ కారుకడకు బోయి కారువెనక సామాను కట్టినారు. ఆకారిరువురికే సరిపోవును. బండిని బాగుచేయుటకు, నవసరమైన నడుపుటకు నొక యువకుడు బండి వెనుకతట్టుననున్న యాసనముపై గూర్చుండ, నారాయణరావు కారునడుపుచు, గవర్నరుగారి భవనముదారిని సైదాపేటమీదుగా గిండీదారి పట్టించెను.

దారిలో రాజేశ్వరుడు తన యదృష్టమును వర్ణించినాడు. ' వెళ్ళినందుకు పని సఫలమయినది. నాజన్మం తరించిందిరా. ఓరే నారాయుడూ ఆ పిల్లఅందం నువ్వు కనివిని యెరుగవురా. అందమైన స్త్రీతో చెలిమిచేయని మగవాడిజన్మ వ్యర్థంరా ! '

' నీ ప్రేమతత్వంతో నాకు మతిపోతూవుంది రాజీ '

' నువ్వు వట్టి పిరికిపందవురా నారాయణా ! నీపిరికితత్వాన్ని నువ్వు ' ధర్మం ' అని పేరు పెట్టున్నావు. '

' ఒరే దద్దమ్మా ! నిన్ను, ముక్కలుకింద విరగగొట్టేస్తా. విను, వాదన సరీగా చెయ్యడం నేర్చుకో. ' నేను చేసింది తప్పు, నాదేహాన్ని నామనస్సును ఆపుకోలేకుండా ఉన్నాను. అది నాదౌర్బల్యం ' అని ఒప్పుకోక మమ్మల్ని పిరికివాళ్ళంటావు. ఇంతకీ నువ్వంటే నాకుండే ప్రేమచేత చెపుతున్నాను. నువ్వెలాంటివాడవైనా నాకుస్నేహితుడవే. పరస్త్రీ, పరునిభార్యను నువ్వు గంగలోకిదింపావు. ఇప్పుడైనా ఒడ్డుకుచేర్చు; లేదూ, నీయిష్టం. నేను చెప్పేదియింతే. '

## ౧౭

## రాజేశ్వరరావు

నారాయణరావు, పరమేశ్వరుడు, రాజేశ్వరునితో నొకరాత్రియైన గడపుటకు సాయంకాలము గిండీ హోస్టలుకు బోయినారు. రాజేశ్వరుడు స్నేహితు లిరువురితో, బుష్పశీలకు దనకుగల స్నేహము పూర్ణముగా వివరించిచెప్పెను. ఆమెలేని జన్మము తనకు దుఃఖభాజనమని తెల్పెను. ఎట్లయినను దనకామె కావలె. తనకు జదువు వలదు, ఆస్తివలదు. చుట్టములు స్నేహితులు వలదు, పుష్పశీలయే కావలెను. ఆమె తనదగ్గరనున్న జాలును.

భర్తకడ నామెయుండ దాను రహస్యముగా రాకపోకలొనర్చుట దుర్భరము. ఆమె పూర్తిగా దనది కావలె. ఎట్లయిన, ప్రపంచము తలక్రిందులుచేసియైన సరియే, యామెను గొనివచ్చెదనని యాత డుత్సుకుడై స్నేహితులతో నాడినాడు.

నారాయణుడు నిర్ఘాంతపోయినాడు. పరమేశ్వరుడు నిస్తబ్ధుడైనాడు.

నారా :—ఓరే! నీపైన క్రిమినల్ కేసు పెట్టి ఖైదులో వేయించవచ్చురా భర్త!

రాజే :—ఇంతకంటె ఆఖైదే మెరుగురా.

పర :—ఖైదుకు వెడితే నీకేమిసౌఖ్యం? పుష్పశీల రాదుగా నీతోఖైదుకు?

రాజే :—ఓరే నారాయుడూ! నువ్వు గాంధిమహాత్ముని శిష్యుడవు. దేశంకోసం ఖైదుకువెళ్ళావు. నువ్వూ, నీవంటి పవిత్రులు ఎల్లాగైతే ధర్మంకోసం, దేశం కోసం పదేపదే ఖైదుకు వెళ్ళడానికి సిద్ధమో, అల్లాగే నేనున్నూ నాకుధర్మం అని తోచిన యీ పవిత్రకార్యంకోసం జైలుకు వెళ్తాను. అప్పటికి దేశంలో దీన్ని గురించి ఆందోళనపుట్టి చట్టం మార్పుచేస్తారు. ఇతరదేశాల్లో ఇంకోళ్ళ భార్యను లేవదీసుకువెళితే శిక్షిస్తారా?

నారా :—ఇతరదేశాలలో పెళ్ళి సంపూర్ణ మతసంబంధమైన ముఖ్యధర్మం కాదు. వ్యక్తీ వ్యక్తీ ఏర్పరచుకొన్న షరతులతో కూడుకున్న ఒక ఏర్పాటుకాబట్టి, ఒకనిభార్యను ఇంకోడు తీసుకుపోతే, వాడిచేత భర్తకు నష్టపరిహారం ఇప్పిస్తారు. భర్తకోరితే వాడిపెళ్ళి రద్దుచేస్తారు. నీచజాతులకు మనదేశంలోనూ కులతప్పులూ, మారుమనువులూ వున్నవి. ఆర్యవివాహం మోక్షసంబంధమైన మతంతోకూడుకొన్నది. నాలుగాశ్రమాలు మానవుడాత్మతత్వం తెలుసుకోడానికై చేసేయాత్రలో మజిలీలువంటివి. అందుచేతనే ఒకసారి అయిన పెళ్ళి రద్దుకాదు. మతసంబంధమైన దోషాలన్నీ శిక్షాస్మృతిలో చేర్చారు.

రా :—నువ్వు న్యాయం చెప్పరా! మనం ఇప్పుడు జీవితాన్ని ధర్మదృష్టితో చూస్తున్నామా? మనం ఉదయంలేస్తే సాయంత్రంవరకు చేసేపనులు మతదృష్టితో చేస్తున్నామా! వట్టి అల్పభావాలతో సూపర్‌స్టిషన్‌తో చేస్తున్నాము,

అల్లాంటిఅప్పుడు పెళ్ళి రద్దుచేసుకునేందుకు వీలుండేశాసనం, పరపురుషుడితో విహరించడానికి స్త్రీకి స్వేచ్ఛయిచ్చే శాసనం ఇవన్నీ ఉండవద్దూ ?

నారా :—అవునులే ! ప్రభుత్వం తన యిష్టంవచ్చినవి శిక్షాస్మృతిలోజేర్చి ఇష్టంలేనివి వ్యాపార సంబంధం చేసిపెట్టిన స్మృతే యిప్పుడు మనకు. అది పోయినా నాఅభ్యంతరంలేదు కాని—వివాహం రద్దుశాసనం—నాకు ఏమీఇష్టం.... లేదు.

పర :—ఏమిటిరా ఆ నసగడం. విను మరి, ఇప్పు డన్నీ ప్రభుత్వంవాళ్ళు 'లా' లు చేశారు. ఇదివరకు ధర్మాలిప్పుడు అమల్లోలేవు. ఇక ఎన్ని 'లా' లు చేస్తే ఏమిభయం అంట ?

నారా :—(కోపంతో) అసలే మండిపోతోంది. మన దౌర్భాగ్యతవల్ల మనదేశం పరులపాలయింది. అందువల్ల వచ్చినకష్టాలు, దోషాలు తప్పనిసరిగా వచ్చినవే మన్ని వేపుకు తింటోంటే, మన్ని మనం బాగుచేసుకొని, శాసనాల చేతుల్లో బడని ధర్మాలనన్నా కాపాడుకోకుండా, యింకా తగులడాలీ ? నేను, పూర్వాచార పరాయణుణ్ణి, సనాతన వాదిని అనిచెప్పి మూర్ఖపు పట్టులుపట్టే దద్దమ్మను కాను. కాని అత్యుత్తమ ఉదార హృదయంతో, మతదృష్టితో, ఆత్మసామ్రాజ్యదృష్టితో వివేకానంద, మహాత్మగాంధి మొదలగు అవతార పురుషులు మనకిచ్చిన ఆదేశాల్ని ఆధారంచేసుకొని సంఘం బాగుచేసుకుంటే దేశాభ్యుదయ మంటాను. కాదా ?

రాజే :—కోపంమాని, ఇప్పుడు నావిషయం నువ్విచ్చే సలహాఏమిటోచెప్పు. పరమం ఇచ్చే సలహాఏమిటి ? చెప్పండీ. నేను ఉడికిపోతున్నా. చదువుమీదికి దృష్టి పోదు, నిద్రలేదు. ఆహారం సహించడంలేదు. చెప్పండి. లేకపోతే — ఏరో జునో 'హిందూ' పత్రికలో 'ఒక యువకుని మరణము — ఎస్. ఐ. ఆర్. రైలుపట్టాలమీద శవము, ఆత్మహత్య !' అని వింటారు.

పర :—ఛీ ! ఛీ ! నావళ్ళు జలదరిస్తోంది. నాకు గుండె దడదడ మంటూంది.

రాజే :—గుండెకాయ గంతువేసి నోట్లోంచి ఊడిపడలేదు కదా ! అడంగికానా !

నారా :—కుంకాయి ! వాడిజోలికి వెళ్ళకు. ఆదివారంనాడు నేనూ రాజూ, పరమం వస్తాము. ఆరోజున నీ సంగతి ఆలోచిద్దాం, మరి పడుకుందాం.

రాజే :—నారాయుడూ ! నాకు నిద్దురపట్టదు, మీకుమాత్రం నేను ఎందుకు పట్టనివ్వాలిరా !

నారా :—ఒరే ! నీబుర్ర చిదకకొట్టి నిద్దరోగొట్టుతా !

రాజే :—ఒరే ! నువ్వు చెన్నపట్టణంలోవున్న విద్యార్థిమండలా లన్నిటిలో బలవంతుడవైతే కావచ్చును. త్రోవలో అడ్డంవచ్చిన చంటిపిల్లవాడి మీదపడి సైకిలుమీదనుంచి దిగి, కుట్టాణి బెత్తం పుచ్చుకొని చావగొట్టిన యూరోపియను సోల్జరును మెడనొక్కి, గుడ్లు తేలవేయించి, దెబ్బలాటకు రమ్మంటే,

వాడు తెల్లబోయి నీకు దండంపెట్టి, క్షమార్పణ అడిగితే అడగవచ్చును,
కాని నీదెబ్బ నాకు నిద్దర తెప్పించగలదురా ?

అందరు నవ్వుకొనిరి. నారాయణుడు పండుకొనగనే నిదురపోయెను. పరమేశ్వరుడును, రాజేశ్వరుడును మాట్లాడుచునే యుండిరి. భళ్ళున తెల్లవారినది.

మృదుహృదయుడగు పరమేశ్వరు డనేక సాంత్వనోక్తులతో రాజేశ్వరుని హృదయమునకు శాంతి నొనగూర్చెను.

ప్రేమ మెవ రెఱుంగగలరు ? ప్రేమతత్త్వములో నెన్ని ఛాయలున్నవో ? చిత్తకార్తిలో కుక్కలకు కలిగే యిచ్ఛ ప్రేమపదార్థములో నొక కళయే. అందమైన వస్తువు నాసించుట ప్రేమయే. సౌందర్య పిపాసయు ప్రేమలో అంశమే ; కరుణ, ప్రేమజనితమే. ఆత్మలురెండు నేకమైపోవుట ప్రేమయొక్క ఉత్తమదశ. ఆత్మ నెరిగి పరమాత్మనెరుంగుట ప్రేమయొక్క పరమావధి.

‘ ఒరే ! సర్వవిధాలా నాహృదయం ఆకర్షించి, నాజన్మం సువాసనాలహరిలో ముంచి, నాకు ఉపాస్య అయ్యే బాలికను ప్రేమించడానికి మరి నేను ప్రేమింపబడటానికి ఇన్నాళ్లు ఎదురుచూస్తున్నాను. నీకున్న ఆశయం చాలాతక్కువది. నీకు చిఱుతపులిలా అందంగా ఉండి డాబుడీబుగావుంటే చాలు, నీమనస్సు ఆకర్షింపబడుతుందిరా రాజీ ! నాహృదయం అల్లా సరిపోదు. నాకు కళాపూరితమైన హృదయం కావాలి. కళాపూరితమైనరూపం కావాలి. రెండూ ఎక్కడ సమకూడతాయి. ఒరే రాజీ ! నాకట్టి బాలిక సాక్షాత్కరిస్తే నా కామెతో దేహసంబంధమే కావాలనికోరను. నన్ను ‘ మగతనం లేనివాడవు ’ అను, ఇబ్బందిలేదు. ‘ బడాయి ’ అను - భయం లేదు. లేదూ దొంగసన్యాసివి లోకాన్ని మాయచేస్తున్నావు అను, పరవాలేదు. నేను దేహసంబంధం అయిన సంతోషమునూ, పరవశత్వాన్నీ కోరను, పవిత్రుడనని చెప్పను, అలా చెపితే దొంగనవుతాను. దేహంమాత్రం అందంగావున్న ఇద్దరు బాలికలతో ఆవేశపూరితుడనై సంతోషం అనుభవించా. మళ్ళీ వాళ్ళను కోరలేదు. నారాయణుడంటి మహానుభావుడు తప్ప ఇంకోడు ‘ నేను పరస్త్రీని ఎరగను, ’ లేకపోతే ‘ కోరను ’ అని చెప్పలేడు. చెపితే వట్టిఝూటామాట అనుకో.

‘ అల్లాంటిసందర్భంలో, రాజీ ! రెండురోజులక్రితం శ్యామసుందరి చెల్లెలు రోహిణిని చూశానురా ! ఆమె నా కన్నివిధాల తగిన పరమపవిత్రురాలు, అందానికి అందమూవుంది. నా ఆశయాలకీ తగింది. నేను కలలోమాత్రం యుగయుగాలా చూస్తున్న నా స్వప్న దేవీమూర్తిరా ఆమె. ’ అని యిట్లు పాడినాడు పరమేశ్వరమూర్తి.

పాట కలబాల

‘ ఓచెలీ నీ వెవరు ఓచెలీ నీ వెవరు ?
కలబాలవా ? ప్రకృతి వలపులపాపవా
నింగిపై మేఘాల నీలియంచులమీద

చుక్కల్లో మినుకాడు సూక్ష్మకాంతుల్లోన
నాట్యమాడుచు దివ్యమందాకినీ దీప్తి
లీనమై యానందలీలలో సుడివోదు ?
ఓచెలీ నీ వెవరు
ఓచెలీ నీ వెవరు
కలబాలవా ప్రకృతి
వలపుల పాపవా ?'

'శ్యామసుందరి యెవరురా ? ఆ మంగుళూరు అమ్మాయి, మెడికల్ కాలేజీలో చదివేపిల్లేనా ? ఆ ! నేను ఎరక్కేం. వాళ్ళప్పచెల్లెళ్ళంతా మాంచి అందమయిన వాళ్ళు. అబ్బో ! వాళ్ళల్లో పెద్దాళ్ళు ముగ్గురిలో ఎవరైనా నాకు దక్కుతారేమో అని మహాప్రయత్నం చేశాను. శ్యామసుందరి గుట్టూ మట్టూ అన్నీ, రహస్యభటుల ద్వారా కనుక్కున్నా ఏమీ లాభంలేదాయె. శ్యామసుందరి చాలా విచిత్రమైనపిల్లరా. ఖద్దరు కట్టుంది, ఆ అమ్మాయి 1922 లో నిరాకరణంచేసి, మళ్ళీ కాలేజీలోచేరింది. మంచి పవిత్రమైన జీవితం. నాకూ మొదట అంతా మాయ అని అనిపించిందికాని, రహస్యంగా అంతాకనుక్కునేటప్పటికి నిజంతెలిసిపోయింది. నేను మీతో అక్కడికి వచ్చేందుకు వీలులేదు. నేనంటే శ్యామసుందరికి భయం !'

నిద్దరబోవుచున్న నారాయణుడెట్లు లేచెనో 'ఏమిటిరా 'శ్యామసుందరి' అని అంటున్నావు. నువ్వు ఎరుగుదువా ఏమిటి ?' అని ప్రశ్నించెను.

రాజే:—అదేమిటిరో ! ఆడవాళ్ళ పేరు చెప్పితే శుకమహర్షి కంగారుపడ్డట్లయింది నువ్వులేవడం. 'శ్యామసుందరి' అన్న పేరులో ఏముందిరా దద్దరిల్లిలేచావు!

నారా:—ఒరేరాజీ ! నోరుముయ్యి, వాగకు. శ్యామసుందరీదేవి చాలా పవిత్రచరిత్ర యని నే ననుకున్నాను. అది నిజమని నా నిద్దట్లో నాకు కలలో వినిపించి నట్లయింది. మెలకువ వచ్చే టప్పటికి నువ్వూ ఆముక్కలే అంటున్నావు. ఏమిటదీ....అంట ?

పర:—చాలా పవిత్రురాలు, మాంచి హృదయంకలదీ అని వాడు చెప్తాడురా. వాడు 'డిటెక్టివు' లను పెట్టికూడా నిర్ధారణ చేసుకున్నాట్ట.

నారా:—ఎల్లాగన్నా భారతీయ నారీమణులు పవిత్రచరిత్రలురా.

పర:—సరే ఒప్పుకున్నామురా.

రాజే:—ఇంతకూ నువ్వులేచి, పరమేశ్వరుడుచెప్పే అద్భుతమైన కథకు అడ్డు వచ్చావు వాడి ఆశయమైన కలబాల కనబడిందటగా రూపంతో, శరీరంతో అవతారం ఎత్తివచ్చిందిట.

నారా:—రోహిణీదేవేనా ? నిజంగా ఆ బాలికలంతా అద్భుతమైనవాళ్ళే. ఒరే రాజీ ! నువ్వు హోలీపై ఆదివారం పట్నానికివస్తే మనమంతా వాళ్ళింటికి వెళ్ళ వచ్చును.

రాజే —ఓహో! నన్నామె పూర్తిగా ఎరుగును. నేనంటే హడలు. ఆ కథంతా తర్వాతచెప్తా!

పరం:—ఏమీ లేదురా నారాయుడూ! వాళ్లు మామూలు 'సీతాకోకచిలుకల' ని అను కొని ప్లోపి వెయ్యాలని చూశాట్ట, కాని బెడిసికొట్టిందట. వాళ్ళు వీడంటే హడలి పోయారుట.

నారా:—(నవ్వుచు) ఆరీ పరమదౌర్భాగ్యదామోదరా!

పర:—నా పేరెత్తకు.

రాజే:—(నారాయణరావుతో) నీ పేరూఎత్తుకోకు. అంటే నన్నును అంతే!

నారా:—నారాయణుడు వట్టి దామోదరుడు కాడురా! జాగ్రత్త!

అందరు నవ్వుకొని పడకలు వేసినారు.

## ౧౮

## ద స రా

దసరా పండుగలకు నారాయణరావు, జానకమ్మగారు, సుబ్బారాయుడుగారు, సూర్యకాంతము, రాజమహేంద్రవరములో గాపురముచేయుచున్న రమణమ్మ లక్ష్మీ పతిగారలు, వెంకాయమ్మయు బిల్లలు, సత్యవతియు బిల్లలు, శ్రీరామమూర్తిగారు, ఆయనకుటుంబము, అందరును జమీందారుగారింటికి రాజమండ్రివచ్చిరి.

జమీందారుగారు స్వయముగావెళ్ళి వీరినందరిని దీసికొనివచ్చినారు. 'నేను రాను మీ వియ్యపురాలిగారిని తీసుకొని వెళ్ళు' డని సుబ్బారాయుడుగా రెంత నిరాక రించినను జమీందారు భల్లూకమువలె విడిచినారుకారు.

జమీందారుగారు సుబ్బారాయుడుగారి పెద్దయల్లుళ్ళ నిరువురను దీసికొని వచ్చుటకు జాల బ్రయత్నించిరిగాని వారు రామని స్పష్టముగా జెప్పివైచిరి.

జమీందారుయొక్కయు, సుబ్బారాయుడుగారి యితర స్నేహితులయొక్కయు బ్రాపకముచే లక్ష్మీపతికి గవర్నమెంటు ఆర్ట్సు కళాశాలలో నాచార్యపదవి దొరికినది. అప్పటినుండియు రమణమ్మతో, బిడ్డతో, దనతల్లితో లక్ష్మీపతి రాజమహేంద్ర వరమున గాపురము బ్రారంభించినాడు. జమీందారుగారి పెద్దమ్మాయి శకుంతలాదేవి వచ్చినది. పెద్దయల్లుడా పండుగ రెండురోజులు వచ్చునట. జగన్మోహనరావునకు, భర్తను కోరి యాహ్వాన మంపించినది వరదకామేశ్వరమ్మ. తానును తప్పక రావలసినదని వ్రాయుచు, కొమార్తె శారదచేగూడ వ్రాయించినది, చెన్నపట్టణము నుండి యానందరావుగారి భార్య వచ్చెను.

నారాయణరావునకు సెలవులు ముందుగనే యిచ్చుటచే, నాతడు కొత్తపేట వెళ్ళి, యచ్చటనుండి, రేపు మహార్నవమి యన దనచుట్టములతో గలసి వచ్చినా డ తవారింటికి.

జమీందారుగారి పెద్దయల్లుడగు డిప్యూటీ కలెక్టరుగారున్ను, చెన్నపట్టణము నుండి ఆనందరావుగారును పండుగనాటికి విచ్చేసినారు.

నారాయణరావు చెన్నపట్టణములో నున్నంత కాల మొక్కసారియైన నానందరావుగా రాబాలుని దనయింటికి బిలిచిన పాపాన బోలేదు. జమీందారుగారు శాసనసభా వ్యవహారములపై నచ్చటికి వచ్చినప్పు డానందరావుగారు తన కారుమీద జమీందారుగారి భవనమునకువచ్చి కలుసుకొని, యాయనను దనయింటికి బిలుచుకొని పోయినాడు. నారాయణరావుతో మాట్లాడనైన మాట్లాడలేదు.

జమీందారుగారి యింటిలో నారాయణరావుతో మాట్లాడునది యొక్క జమీందారుగారి యప్పగారు సుందరవర్ధనమ్మగారును, జమీందారుగారి బీదచుట్టములలో రంగమ్మ గారొకరును, నారాయణరా వన ఆపేక్షగానుండి గౌరవము చేయుచుండిరి. సేవకు లందరు నారాయణరా వన భయముతో ప్రేమతో మెలగుచుండిరి. పరిచారికలతో జమీందారిణి అల్లునిగూర్చి నిరసనగా మాట్లాడునపు డెల్ల వారామె యెదుట మౌనము దాల్చుచుండిరి.

ఆ భవనమంతటిలో జమీందారుగారి తర్వాత నారాయణరావన్న ప్రేమ కురిపించునది కుమారరాజా కేశవచంద్రరావే. కేశవచంద్రుడు బావగారిని వదలడు. బావగారి కడ భోజనమునకు గూర్చుండవలె. బావగారితో మాట్లాడవలె. బావమరది నిద్రకు దన గదికి బోవునంతవరకు కేశవచంద్రు డాతని కడనేయుండి, కబుర్లుచెప్పి యప్పుడు వెళ్ళి నిద్రపోవును. తనకడకు దక్క నితరులకడకు జనువుగాబోని కుమారుడు నారాయణరావునెడ సౌహార్దముతో మెలంగుట జమీందారునకు నాశ్చర్యసంతోషజనక మయ్యెను.

జమీందారుగారు నారాయణరావున కొక గదియు, పెద్దయల్లుని కొకగదియు, సుబ్బారాయుడుగారి కొక గదియు, స్త్రీ జనమున కొక గదియు, మేనల్లు డానందరావుగారి కొక గదియు, నీరీతి వచ్చిన చుట్టములందరికి గదు లేర్పాటు చేసెను. గదులన్నియు, బాగుగా నలంకరింపబడినవి. పడకగదులు మేడపైనను, క్రిందను దక్షిణవైపున నున్నవి. మేడపైన తూర్పునగూడ కొన్నిగదు లున్నవి. వెనుక భాగములకు ముందుభాగములకు సంబంధము. ముఖ్యమగు హుజూరు కచ్చేరీ జమీందారుగారు నివసించుభవనమునకుముందు నేబదిగజముల దూరములో నున్నది. హుజూరుకచ్చేరియొక మేడ. అచ్చట పురాతనములగు కాగితముల గది, 'మేనేజరు దివాను' గారి కచ్చేరి, హుజూరు తాణేదారుగారి కచ్చేరి, గుమాస్తాలచావడి, ఖజానా కొట్టు, సిరస్తాదారు కచ్చేరి మొదలగునవి యున్నవి.

జమీహుజూరు కచ్చేరీకి సింహద్వార మిన్నీసుపేటలో నొకవీధివైపున నున్నది. రాజాగారి మేడకు సింహద్వారము వేరొకవీధి నున్నది.

జమీందారుగారింట ఆశ్వయుజ శుక్లపాడ్యమీ దినమున కలశప్రతిష్ఠాపన మొనర్చి దశరాత్రములు పూజలు, హరికథలు, సంగీతపుకచ్చేరీలు జరుపుదురు.

జమీందారుగారు వీరేశలింగంపంతులు శిష్యుడగుటచే పూజాపురశ్చరణలపట్ల నుపేక్ష వహించియుందురు.

శ్రీరాజా విశ్వేశ్వరరావు (డిప్యూటీకలెక్టరు) గారు తోడల్లుని జూచుటతోడనే కొంచెము తల పైకెత్తి, క్రిందిచూపుచూచి మామగారికి దనకన్న, తోడల్లునిపై నెక్కుడు ప్రేమయున్నదని గ్రహించినాడు. ఆతనిహృదయమున నుడుకుబోతు తనము ప్రవేశించినది. ఎంతధనమున్నను, ఈ సామాన్యసంసారి బిడ్డపై మామగారి కేల యీ గౌరవమో తెలియదు.

ఆరోజున నారాయణరావుతో మామగారు వివిధవిషయములగూర్చి చర్చించుట జూచినాడు. నారాయణరావు చాల తెలివైన,వాడనియు, వింతవరకు ప్రతి పరీక్షయు విశ్వవిద్యాలయమునకు మొదటివాడుగా నుత్తీర్ణుడైనాడనియు బెద్ద యల్లునికి దెలియ జేసినాడు జమీందారు.

తోడల్లుళ్ళిద్దరకు సంభాషణజరిగినది. 'ఏమండీ ఖైదుకువెళ్ళివచ్చారే. మళ్ళీ కాలేజీలో ఎందుకు చేరారూ?' అని విశ్వేశ్వరరావు ప్రశ్నించెను.

నేను చేసింది పొరపాటేనండి అన్నగారు. నేను మా తండ్రీ, ఇతరచుట్టాలూ ఎంతచెప్పినా వినక, యింటరులో నెగ్గిన సంవత్సరము వేసంగికాలంలో సహాయ నిరాకరణంలోజేరాను. ఖైదుకు వెళ్ళాననుకోండి.'

'రాజమండ్రీ జైల్లోనే వున్నారా?'

'రెండునెలలు రాజమండ్రీ, నాలుగు నెలలు కడలోరు.'

'ఆలాగా!'

'అవునండి. జైలునుంచి వచ్చాను. జైలుకుముందు ఆరునెల్లు దేశం అంతా తిరిగి ఉపన్యాసాలు ఇవ్వడం, ఖద్దరమ్మడం మొదలైనప్రచారంచేశా. ఆతర్వాత జైలు. మొదట దిగేటప్పుడు పాశ్చాత్య విద్య మానేసి ఏ సంస్కృతమైనా నేర్చుకుందా మనుకున్నాను. లేకపోతే ఏ గుజరాతీ విద్యాపీఠంలోనో చేరదామనుకున్నాను. చిన్నతనము గనక గుండెధైర్యమెక్కువ. దేశానికి పరీక్షలు నెగ్గి సేవచేయడం, ఎక్కువవీలు అనే దురభిప్రాయం వదుల్చుకోలేక మళ్ళీ చెన్నపట్నంపోయి ప్రెసిడెన్సీ కాలేజీలో బి. యే. ఆనర్సులో జేరాను. 1923 వ ఏప్రియల్‌లో ఆనర్సు 'ఫిజిక్సు'లో నెగ్గేటప్పటికి ఇంతలో స్వరాజ్యపార్టీ ప్రాబల్యం ఎక్కువఐంది. అందుచే విసుకెత్తి లాకాలేజీలో చేరాను.'

'కోర్టులు పూర్తిగా విసర్జించాలి అని కదా మీ అసహాయవాదులు బోధించేది. మీరు లా కాలేజీలో చేరా రేమిటి అని ఆశ్చర్యంగావుంది!'

'ఎవరికన్నా ఆశ్చర్యంగానే ఉంటుంది. నేను న్యాయస్థానాల్లో న్యాయవాదిగా ఉంటానని చెప్పలేను. ఒకవేళ న్యాయవాదినైనా యెంతకాలమో! నామనస్సు ఇంకా నిర్ధారణ చేసుకోలేదు. మొత్తంమీద నా హృదయానికి పూర్తిగా వ్యతిరేక మయిన కార్యం చేస్తున్నానని మాత్రం నే నెరుగుదును.'

'నా మాట విని మీరు నిరాకరణం గిరాకరణం అన్నీ మాని, హైకోర్టు న్యాయవాదిగా చేరి ఏమునసబీకన్నా ప్రయత్నంచేస్తే నిముషములో అవుతుంది. అయితే జైల్లో ఎల్లా ఉండేదేమిటండీ ?'

'మొదట వెళ్ళినప్పుడు కొంచెం నాకు భయం వేసింది ఒక పదినిమిషాలు, అన్నీ వదలి వచ్చినందుకు. తర్వాత అలవాటు అయిఁది.'

'ఏంపని చేయించారు.'

'నాబోటి వాళ్ళకు నూనెగానుగు, మోట, పిండివిసరటం వేస్తారు. నేత, తాళ్ల పేనడం, చాపలు అల్లడం, గొంగళీల నేత మొదలైనవి ఉన్నాయి. తివాసీనేత ఉన్నది. రాజమండ్రీ జైల్లో అప్పుడే మోపలాలు వచ్చారు. వాళ్ళ నందరిని ఒక డేరాలో కాళ్ళకి కడియాలువేసి, ఒక యినుపమోకు వాటిల్లోంచిదూర్చి, కట్టివేసి పశువులకన్న కనాకష్టంగా చూసేవారు.'

'భోజనం ?'

'మాకు వేరే భోజనం ఏర్పాటు చేయించారు సాంబమూర్తిగారు. సీతారామ శాస్త్రిగారు విల్సనుగారి పదునాలుగు షరతులలాగ, జైలు ముఖ్యాధికారిని పదునాలుగు షరతులు కోరారు. దీపాలు, వ్రాతకు గ్రంథాలు, పాయిఖానా, మూత్రపుదొడ్డులు విడివిడిగా మనుష్యులకు కనబడకుండగా కట్టించడము, భోజనములో పప్పు, కూర, పులుసు విడిగా ఉండడము, నేయి, మజ్జిగలు ఇవ్వడము, తద్దినాలు పెట్టుకోనివ్వ డము, నెలకు రెండు త్తరాలు, నెల కో బంధుమిత్ర సందర్శనము, కాళ్ళకు కడియాలు తీసివేయడము, భోజనము హెచ్చించడము మొదలైనవి.'

'వాళ్ళిచ్చారా ?'

'ఎక్కడిస్తారు. రాజమండ్రిలో రాతకు కలాలు, కాగితాలు ఇచ్చారు. సబ్బులు, కంచాలు. నేయి, మజ్జిగ యిచ్చారు. ఎవరి దీపము వారిని తెచ్చుకో నిచ్చారు. అవన్నీ కడలూరులో తీసివేశారు. మళ్ళీ అక్కడ దెబ్బలాట; మళ్ళీ కొన్ని యిచ్చారు. ఇంతట్లో ఆరునెలలూ అయ్యాయి నేనూ బయటకువచ్చాను.'

'ఎల్లాగన్నా చాలా కష్టం అండీ ! మీ రెల్లా ఉన్నారో ! నాకు ఈ సహాయ నిరాకరణం వృథా అని దృఢమైన నమ్మకం ఉంది. మీరు ప్రభుత్వమువాళ్ళిచ్చినవి పరిపాలిస్తూ ఎక్కువ కావలెనని గడబిడచేస్తూవుంటే, నెమ్మదిగా నెమ్మదిగా అవే వస్తాయి. స్వరాజ్యమూ వస్తుంది.'

'అభిప్రాయాలు వేరులెండి. వానినిగురించి తేల్చుకోవాలంటే తెమలదు.'

వీరి సంభాషణఅంతా జమీందారుగారు నిశ్శబ్దముగా నుండి వినుచుండిరి. జైలునుగూర్చి నారాయణరావు చెప్పుచున్నప్పు డాయన కళ్ల చెమర్చినవి. ఆ పరిసర ములనే కూర్చుండి వినుచున్న సుబ్బారాయుడుగారు డగ్గుత్తికలు మింగినారు. విశ్వేశ్వర రావుగారికిని తోడల్లుని యసహాయ శూరత ఆశ్చర్యము గొలిపి, వానిపై కొంత గౌరవము నావిర్భవింప చేసినది.

విశ్వేశ్వరరావుగారికి అసహాయ వాదులు కాలము వృధజేయు పిచ్చివారని యనిపించినది.

నారాయణరావు వీరుడని జమీందారుగా రనుకొన్నారు. తా నిట్టిపుత్రుని కన్నందుకు జన్మము సఫలమైనదని సుబ్బారాయుడుగారు హృదయమున రహస్యముగా నుప్పొంగిపోయినారు.

తన్ను హేళనజేయుటకు సంగతులు తెలిసికొనుటకు గూడ తోడల్లు డట్లడిగినాడని నారాయణరావు గ్రహించుకొన్నాడు. నారాయణరావు నిష్కల్మష హృదయముతో సత్యమునే సతతము వాక్రుచ్చు స్వభావము కలవాడు. నిజముచెప్పు మానవుడు ప్రపంచమున మానవులలోకెల్ల బలవంతుడని యాతడు వాదించును.

ఆతనికి మామగారి హృదయము గోచరించినది. తండ్రిగారి హృదయము తెలియవచ్చినది. అల్పమానవునివలె తాను చేసిన యల్పకృత్యముల జెప్పుకొంటినేమో యని నారాయణరావునకు లజ్జ జనించినది. కాని యాతడు తన హృదయమును దరచి తరచి చూచుకొన్నాడు. దోషములేదని సమాధానపడినాడు.

చీకట్లు క్రమముగ నావరించినవి.

## ౧౯

## బ హు మ తి

శారద తన యత్తగారికడకే పోవునదికాదు. జానకమ్మగారు, తన వియ్యపురాలు తనతో మాట్లాడక పోవుటయు, దన కోడలు కూడ తమ గదులలోనికి రాకుండుటయు, దన వియ్యాలవారి చుట్టములు ముభావముగా మాట్లాడుటయు జూచినది. కాని సుందరవర్ధనమ్మగారు మాత్రము వేయికన్నుల జానకమ్మగారికి నామె కుమార్తెలకు మర్యాద కేమియు లోటు లేకుండ జరిపించుచుండెను.

భర్త మోటుగానున్నాడనియు రాక్షసియనియు జగన్మోహనుడు తన్నుగూర్చి జాలిపడుటవలన శారదకు భయమంకురించినది. భర్త బాగాచదివిన నేమిలాభమని జగన్మోహనరావు బావ అన్నాడు. దివ్యారోగ్య సంపన్నుడగు నారాయణుని విమల హరిద్రారుణవర్ణము, వెలవెలబోవు జగన్మోహనుని యనారోగ్యపు దెలుపు బసిమి ముందర నలుపేయని యామె యనుకొన్నది. దశమి నా డందరును గలసి భోజనశాలలో బట్టుబట్టలు ధరించి కూర్చుండినప్పుడు, సుబ్బారాయుడుగారు పచ్చనివాడయ్యు జమీందారుగారు, విశ్వేశ్వరరావు, సుందరరావు: జగన్మోహనరావుల ముందర నల్లనివానివలె గనబడెను. నారాయణరావు లక్ష్మీపతులు నీగ్రోలవలెనున్నారనీ తనతల్లి పెదవి విరుపుతో దనకు జూపించినది. భర్త బరంపురం వంగపండు చాయ పెద్ద జరీరుద్రాక్ష అంచుల తాపితాలు కట్టుకొని, విశాల వక్షముతో, విశాల ఫాలముతో వట్రువలుదిరిగిన దేహసంపదతో, విజ్ఞానము, ధైర్యము, బలము,

శాంతము వెదజల్లు తీక్షణములగు చూపులతో స్ఫుటములైన కనుముక్కుతీరుతో ప్రద్యుమ్నునివలె నున్నట్లు తన హృదయాంతరాళము విశ్వసించినను, తల్లిమాటలచే నావిశ్వాస మడగిపోవు చున్నది.

ఆ రోజున తాంబూలములు వేయునప్పుడు శారదనుబిలిచి, తండ్రి యాపూట శ్రీరామయ్యగారితో గలిసి జంత్రగాత్రముల నైపుణ్యము జూపుమనికోరెను. వీరందరికి నేను సంగీతము వినిపించ వలయును గాబోలు ననుకొని తండ్రితో 'నాన్నగారూ నాకేమీ యివ్వాళ పాడాలని లేదండీ' యనెను.

తన యిరువురు కుమార్తెలను కుమారుని జమీందారుగా రత్యంతము ప్రేమించినారు. వారుకోరునది కొండమీద కోతినైనను దెచ్చినారు. ఆ ముప్వురు బిడ్డలకు దండ్రియన్న భయము, గాఢప్రేమయు తండ్రికి సంతోషము గలుగజేయ వలెననియే ప్రయత్నించెదరు. తండ్రి తెల్లబోయినట్లు కనుపించగనే శారద 'సరేనండి నాన్నగారు తప్పకుండా పాడ్తాను' అని తండ్రియొడిలో తలనిడి కంట నీరు పెట్టుకున్నది. తండ్రి యామె నుదురు ముద్దిడుకొన బైకెత్తినప్పుడు శారద తల నెత్తనిచ్చినదికాదు. జమీందారుగారు 'సరేలేఅమ్మా' యని కొంచె మనుమానపడి, తలయెత్తి కంటనీరు తుడిచికొన్నట్లుండుటచూచి, యేమదియని చిన్న బుచ్చుకొని 'షోనీ అమ్మా నీకు బాగా లేకపోతే వద్దు, కచ్చేరీవద్దు. ఇంకోసారిలే' యన్నారు.

శారద చెంగున యచ్చటనుండి పారిపోయినది. ఏమది! తన ముద్దుల కుమార్తె యట్లు కంటనీరు పెట్టుకున్నది?

నారాయణరావు తన చిన్నారి పొన్నారి ప్రేయసికై పండుగ బహుమతి పట్టుకొని వచ్చినాడు, బంగారపు గొలుసులో ఆణిముత్యములు, నాయకమణియైన గోమేధిక పతకము మిలమిల లాడుచున్నవి. ఆ హారము వెల పదునెనిమిది వందల రూపాయలు. ముద్దులొలికి పోవుచున్నది. ఆ హారము దనంతట తాను భార్య మెడలో నలంకరింప దలచి యువ్విళ్లూరినాడు.

రంగమ్మగారితో రహస్యముగ శారదను మేడమీదకు దీసికొని రమ్మనియు, దా నొక బహుమతి యీయదలచుకొంటి ననియు జెప్పినాడు. రంగమ్మగారు శారద నేదేని వంకబెట్టి మేడమీదకు దీసుకొని వచ్చినది. నారాయణరావులేచి 'శారదా! ఈ బహుమతి నీకోసం పట్టుకువచ్చాను. పండగ బహుమతి' అని సుందరమగు నొక రజిత పేటిక, సీలనొక్కి మూతదెరచి, లోన మొఖమల్ పరుపుపై పవళించి యున్న యా హారము జూపించినాడు. శారద తెల్లబోయి యాపెట్టె నందుకొనక యటులనే నిలుచుండెను. రంగమ్మగారు 'పుచ్చుకోతల్లీ! పుచ్చుకో అమ్మాజీ! బాగుండదు పుచ్చుకోకపోతే' అన్నది. శారద చేయిచాచి యా పెట్టె పుచ్చుకొని, విసవిస నడిచి, గదిలోనికి బోయి తన పెట్టె తెరచి యందులో నా బహుమతి పెట్టె నునిచి తాళమువేసి క్రిందికి దిగిపోయెను. నారాయణరా వామె ధరించిన యెట్లుండునో చూడవలయునని కుతూహలము పడినాడు.

తన్ను మెచ్చిన నొక విచిత్రము జరుగునని రంగమ్మగారు తీసికొని వచ్చుటయు, భర్త బహుమతి నొసగుటయు శారదకు దిగ్భ్రమ కలిగించినవి. ఆమె యేమియు మాటలాడలేక, రంగమ్మగారిపై గోప తెచ్చుకొనలే. యవ్విషయమున నాలోచించుకొనుచు గ్రింద పడి దాచుకొనునట్టి గదిలోనికి పోయి యచ్చట గూర్చుండెను.

'చిన్నక్కా! ఏనుగు బాగా పరుగెత్తుతుందా? గుఱ్ఱమా!'

'ఏనుగు తమ్ముడూ.'

'మరి కీయిచ్చివదిలిపెడితే రెండూ ఒకమోస్తరుగానే పరుగెత్తుతున్నాయేమి?'

శారద నవ్వుకొనుచు 'ఈ యేనుగు ఈ గుఱ్ఱమూ అల్లాగే పరుగెత్తుతాయి తమ్ముడూ!' అన్నది.

'చిన్నక్కా! చిన్నబావ నీ కెప్పుడన్నా కథలు చెప్పావా!'

శారద మాట్లాడదు.

'చిన్నక్కా! చిన్నబావ నిన్ను చెన్నపట్నం తీసుకువెడతావా!'

'ఛీ! వూరుకోవోయి!'

'పోనీలే చిన్నక్కా, అంత కోపంవస్తే! నీ కన్న మా చిన్న బావే మంచివాడు.'

శారద కోపంతో నచ్చటనుండి విసవిస వెడలిపోవుచు జగన్మోహనుని రెండవ సభామందిరమునందు చూచినది. జగన్మోహనుడు 'ఏ యిల్లారా! ఏమిటి? ఎక్కడదాగున్నావూ? అంతా వెతికానే!'

శారద ఇంకను కోపముతో మౌనమూని యచ్చటనొక కుర్చీపైకూర్చున్నది.

'ఇంత కోపంగావున్నావే, ఎవరిపై నేమిటి? నా పైనికాదుగదా? ఇదిగో! నీకో బహుమతి పట్టుకు వచ్చినాను. పండగబహుమతి. ఎంత చిన్న గడియారమో, ఇది అసలు బంగారం గాజుకు అతికించిఉంది. ఈ గడియారముచూడు. ముద్దులు గులుకుతూ లేదూ శారదా?'

శారద యదిచూచి 'చాలాబాగుంది. మా నాన్న నా కిచ్చిన గడియారంకన్న బాగుందే!' యన్నది.

'చేయియేదీ?' యని జగన్మోహనరావు శారద మెత్తనిచేయి పుచ్చుకొని యా బంగారుగాజు చేతి గడియారము నామె చేతికిపెట్టి, యా చేయి నిటునటు త్రిప్పుచు నా చేయిని దన పెదవులకడకు గొనివచ్చి ముద్దిడుకొన్నాడు. శారద యొడలు ఝల్లుమన్నది. జగన్మోహనుడు శారద బుజముచుట్టు దనచేయివైచి యామెను దనకడకు లాగుకొని యామె తల తన హృదయమునకు హత్తుకొనెను. శారదహృదయము దడదడ కొట్టుకొన్నది. అతని హస్తమునుండి నెమ్మదిగా తప్పించుకొని యాబాలిక 'నువ్విచ్చిన గడియారము అమ్మకు చూపించివస్తా' నని లోనికి వెడలిపోయినది.

ఆ సాయంకాలము పై మేడపై నొంటిగా గూర్చుండి జగన్మోహనుని కౌగిలింతనుగూర్చె యాలోచించుకొనుచున్నది. జగన్మోహనరావు బావ చాలమంచివాడు, అందమైనవాడును కాని ఆతని కౌగిలింత తనకంత ఇష్టమేలకాలేదు? తియ్యని జలపరింత పొందినమాటమాత్రము నిజము. ఇరువురి బహుమతులలో నెవరి బహుమతి బాగున్నది? వారిచ్చిన బహుమతియు చాల యందముగా నున్నదనుట కామె హృదయ మొప్పుకొనక తప్పినదికాదు.

జగన్మోహనుడు చాల అందగాడని యామెకు జ్ఞానము నేర్పబడినది. కాని చదివిన ప్రతి నవలలో బలమైనవాడు, ఉత్కృష్ట గుణసంపన్నుడు, మేధావి. నిజమైన సౌందర్యవంతుడని వర్ణించినారు. చక్కని రవివర్మబొమ్మలుకాని, మోడరన్ రివ్యూలోని బొమ్మలు కాని అన్నియు దనభర్తను తలపింపజేయుచున్నవి. యిరువురిలో నెవరెక్కువ యందమగువారో యామెకు నిర్ధారణ కాలేదు. అయినను వారి కన్న జగన్మోహనుడే సుందరుడుకాకుండు టెట్లని యామె యనుకొన్నది.

జగన్మోహనుని పెండ్లి చేసికొనియున్నచో, దానొక జమీకిరాణియైయుండును. ఇప్పుడు పల్లెటూరిలో నుండవలసి వచ్చినది. భర్త ఉద్యోగము చేసినమాత్ర మేమి లాభము? బావ యెప్పుడును చక్కని కబుర్లు చెప్పుచుండును. ఎంతయోప్రేమ జూపియుండును. ఏమో? జగన్మోహనరావు బావకు తన్ను పెండ్లిచేసుకొనుట అంత ఇష్టములేదేమో అని భావించుకొన్నది. ఏది యెట్లయిన నీయత్తవారు తన కర్మముచే దనకు సంభవించినారని యక్కగారును తల్లియు నెన్నిసారులో యనుకొన్నారు. అది నిశ్చయమని యా బాలకు స్పష్టమై తోచినది.

## ౨౦

## తాత ముచ్చటలు

పండుగనాడు భోజనములైనవెనుక జమీందారుగారు స్వయముగా వియ్యంకునకు క్షీరాబ్ధి తాపితా బహుమతినిచ్చెను. బాలకుడగు కేశవచంద్రునిచే నల్లుళ్ళకు, మేనల్లుళ్ళకు, లక్ష్మీపతికి, శ్రీరామమూర్తికి బహుమతులనిప్పించెను. ఆడవారికి జమీందారిణియు, నాయమ కొమరితయునిచ్చిరి. అందరును క్రొత్తవస్త్రములధరించిరి.

పండుగ మరునాడు సుబ్బారాయుడుగారు కుటుంబముతో కొత్తపేటవచ్చి చేరిరి. సుబ్బారాయుడుగారి ముత్తాతగారి పెదకుమారుని కుమారుడు రాధాకృష్ణయ్యగారు దొడ్డంపేటనుంచి విచ్చేసిరి. డెబ్బదియెనిమిదేండ్ల వృద్ధు. బండి యెక్కడు. ఎంతదూరమైన నడవగల శుద్ధసత్వుడు. ధవళమై నరసిన మీసములు, జుట్టుతో, భీష్మునివలె నాజానుబాహుడగు మానిసి. సుబ్బారాయుడుగారికన్న నెక్కువసత్వము గలాడు.

'ఒరే సుబ్బారాయుడూ! పిల్లలు మేకలు కులాసాగా ఉన్నారురా! చూసి వద్దాము, మళ్ళీచూడ్డం పడుతుందోలేదో అని వచ్చాను. చిక్కావేమిటి? ఏమిటో

ఈరోజుల్లో నీఅంతీ చిన్నతనంలోనే ముసరితనాలురా. ఏరీ నీకొడుకులూ! వీడు పెద్దాడా! చిన్నాడా వాడు. నళగురేగా కూతుళ్లు నీకు. అది పెద్దదా. నేపిల్లలేరీ, శ్రీరామమూర్తీ? ఆగట్టికాయవెధవ నీకొడుకే! పరవాలేదురా నీసంతానమూ, సంతానం సంతానమున్నూ. ఏదీ నాకోడలు. రాజమండ్రీపెళ్ళికి వద్దామనుకుంటే విజయనగరం వెళ్ళాలిసొచ్చింది. నడిచి వెళ్ళవలసిందే. కాని ఈపట్టు రైలులో వెళ్ళాలి తప్పదని మా చలమయ్యచంపాడురా. వెధవరైలు. దానికన్న నేనేముందు వెళ్ళుదును. కాని అదీ ఒక చిత్రంగానే ఉంది. రైలెక్కడం అదేమొదలు. ఆస్తి ఏమాత్రం సంపాదించావు?'

'వుంది, బాబూ! నీ పెరగనిదేవుంది.

'నీపని బాగుందిఅన్నారులే. జమీందారుతో సంబంధంచేశావుట, సంతోషం. నీ రెండోకోడల్ని చూడాలి. రాజమండ్రీ వెడుతున్నా. నేనక్కడికివస్తానని నీవియ్యంకుడికి రాయి. వెళ్ళి చూసి మోటారెక్కి ద్రాక్షారం వెళతా.'

'నువ్వు ఒకవారం, పదిహేనురోజు లిక్కడుండాలి బాబూ!

'వీల్లేదురా!'

'అల్లాఅంటే పనికిరాదు!'

'సరిలే!'

తటవర్తివారి కుటుంబాలు పెద్దవే. అచ్చటచ్చట దేశమల్లావున్నవి. బాగా ఆస్తులు సంపాదించుకొన్నారు. రాధాకృష్ణయ్యగారికి మంచి ఆస్తివున్నది. కాని యాయన తదనంతరము కుమారులు నలువురు పంచుకున్నచో, తలకొక యిరవైయకరాలు వచ్చును. పైగా పెళ్ళిళ్ళకు, భూములు కొనుటకు అప్పులు చేసినారు. అవి పెరుగుచున్నవి.

'బాబూ! మీ అప్పులన్నీ తీర్చారా?'

'ఏమి తీర్చడమోరా, మనవాళ్ళ బతుకులు మారువాళ్ల చేతుల్లో అంతరిస్తాయనుకుంటాను. రామచంద్రపురం వాళ్ళకు ఏడువేలు తణకాలమీద ఇవ్వాలి. ఎవ్వణ్ణి చూసినా అప్పులే. దేశంఅంతా అప్పు నానాటికీ పెరిగిపోతోంది. ఎల్లాగో తీర్చుకోడం. నాలుగురాళ్లు మిగుల్చుకున్న వాడెవ్వడు కనబట్టంలేదు.'

'అవును. దేశంలో పండినపంటంతా ఏమవుతోందో. మనవాళ్లు - ఇదంతా రూపాయికీ కాసుకూ ప్రభుత్వంవారు ఏర్పాటుచేసిన మారకంరేటువల్లనే అంటారు. అల్లా కాకుండా మారకంరేటు తగ్గించి, వెండి ఖరీదుచేసి, మేలిమివెండి పట్టుకు వెళ్ళినవారికి, చేయుబడి ఖరీదుతీసుకొని, గట్టికి ఇతరలోహంకలిపిన ఖరీదు తీసివేసి, రూపాయ చేస్తే దేశం దౌర్భాగ్యం తగ్గుతుంది అంటారు. జపానులో అల్లాచేస్తారు. కనుకనే వాళ్ళదేశంలో వస్తువులు వెట్టిచవుక. అప్పులేదు, బీదతనంలేదు అని మా నారాయుడు చెప్పాడు.'

'ఏమిలెక్కలో! మా చిన్నతనంలో మేము జొన్నన్నంతిన్నాం, వరీతిన్నాం; వస్తువులు వెట్టి చవక. మనవాళ్ళందరికీ, మెరకాపల్లం అంతా కలిసి రెండువందల యకరం ఉంటే, స్వంతంగా వ్యవసాయం కాయగూరలు పండేవిరా! మానాయన జొన్నమోపు పొలాన్నుంచి మోసుకువచ్చేవాడు. మళ్ళీ దేశపాండేలంకూడా. లోకం అంతా గజగజ లాడేది. కుంఫినీరాజ్యం రానిక్రితం సంగతి యెరుగుదునని మా తాతయ్య రామయ్యగారు నాకు చెప్పేవారు. మీనాన్నా యెరుగును. మీతాత ఈఊరు దౌహిత్రం వచ్చాడు. ఇల్లరికంకూడాను. ఆరోజుల్లో మా తాతయ్యతండ్రి పల్లకీమీద వెడుతోంటే వీధుల్లో జనంకూచుని ఉండేందుకువల్లా! మీ తాతయ్యతాత మాతాతయ్య తండ్రి. తెలుసునా? ఆయన నవాబుదగ్గిరకు పల్లకీమీదేరావెళ్ళడం సుబ్బారాయుడూ!'

నారా:—ఏం తాతయ్యా, మీ తాతయ్యా వాళ్ళూ బాగా వడ్డూ పొడుగూ మనుష్యు లేనా?

రాధా:—ఒరే నారాయుడూ! నన్ను చూశావా, నాపొడుగు ముందర మా తాతయ్య గోపురంఅనుకోవాలి. వాళ్ళశక్తి, వాళ్ళసామర్థ్యం మాదగ్గిర ఎక్కడుందిరా?

నారా:—మీదగ్గిరున్నది మా దగ్గరలేదు తాతయ్యా!

రాధా—మీరా, మీరు వాలఖిల్యులే! మా నాయనగారు కరణీకం ఉఃష్ప పధ్నాలుగూ తిరిగీ పట్టమధ్యాహ్నం ఇంటికి వచ్చేటప్పటికి మా బామ్మావాళ్లు వడ్లుదంచి, బియ్యంచేసి, అన్నంవండి, అటకమీంచి గుమ్మిడికాయ దింపి, తరిగి కూర వండేవారు. వంటా అయ్యేది, మా తాతయ్య వచ్చేవాడుట. స్నానం, సంధ్యా వందనం అంతా అయ్యేటప్పటికి పన్నెండున్నర. అతిథీ అభ్యాగతీ, ఇంట్లో వాళ్లూ అంతా కలిసి యిరవై మంది భోజనాలు మగవాళ్లు.'

నారా—నేను చెన్నపట్టణం వెళ్ళేలోపుగా దొడ్డంపేట వచ్చి మనవాళ్ళందరిని చూసివెడ్తాను తాత్యయ్యా!

రాధాకృష్ణయ్యగారు ఉన్న నాలుగురోజులును సుబ్బారాయుడుగారు పినతండ్రికి తన పొలములు, దొడ్లు, పాకలు, తోటలు మొదలైనవన్నియు జూపించినారు.

తెలుగుదేశమేకాదు, భారతభూమియే యంత కంత కధోగతిలో బడిపోవు చున్నదని రాధాకృష్ణయ్యగారి మతము. మనుష్యుల కెప్పుడును జబ్బులే. అలసులు. పట్టుమని పది అడుగులు నడువలేరు. నూరు సంవత్సరముల మాట యటుండనిచ్చి డెబ్బదియేళ్ళు బ్రతికిన మగవాడేడీ?

'ఒరే సుబ్బారాయుడూ, మనదేశం చేసిన పూర్వకర్మవల్ల యింకా బతికి వుందికాని ఈరోజుల్లో జబ్బులకూ, వాటికీ దేశం నిర్మానుష్యమై యుండవలసిందే, ఏవంటావు?'

'అవును బాబూ! ఎల్లాగో దారీ తెన్నూ కనబడటంలేదు. చదువులు, నాగరికత, మోటార్లు, రైళ్లు, తిండిలో బలం తగ్గడం - ఈలాంటివన్నీ కూడు తున్నాయి.'

'అవునురా ఈ ఆనకట్ట వచ్చి మన కొంప మార్చింది. డెల్టాలలో ఉన్న జనం మెరకజనంకన్న భాగ్యవంతులు అని చెప్పుకోడమే కాని వాళ్ళంత బీదవాళ్ళింకోళ్లు లేనేలేరు. కాలవ మాగాణి అంతా నిస్సారం అయిపోయింది కాదుట్రా.'

'దానికి తగినట్లు మిట్టవియ్యం కూడాను.'

'సరిపోయె. మరేమీ! మీ యింట్లో దంపుడుబియ్యం ఉన్నందుకు చాలా సంతోషంగాఉంది. అయితే యిప్పటివాళ్ళ దబ్బులేకుండా, జవసత్త్వులు లేకుండా వుండడానికి సగం కారణం ఏమిటనుకున్నావు. వీళ్ళకి దైవభక్తి నశించింది. సంధ్యావందనం లేదు, దేవుడుగుళ్ళోకి వెళ్ళరు, పూజా పునస్కారాలు లేనేలేవు. యివన్నీ సగం దేశాన్ని తగలేస్తున్నాయి.'

నారా :—తాతయ్యా, నువ్వలా అంటావు ఎప్పుడు వుండేవంటావు, భయం భక్తి పూజా పునస్కారాలున్నూ ?

రాధా :—ఎప్పుడా ? మాకాలంలో.

నారా :—అయితే మా అంత అప్రాచ్యులు పుట్టడానికి కారణం మీకర్మా, మాకర్మా ?

రాధా :—మీదీ మాదీ కూడారా.

నారా :—మీదే అందాము. అలాఅయితే మాతప్పు కాదుగదా. మా భక్తిరాహిత్యానికి కారణము మీరు కాబట్టి, మేము చేసేది ఏమీలేదు. ఇక మేమే కారణము అందాము. అయితే ఎప్పుడో ఒకప్పుడు దీనికి కారణమైన దుష్కర్మచేసి వుంటాలిగదా! ఆ అప్పుడు భగవంతునిమీద భక్తిలేనివాళ్ళున్నారన్న మాటేగా. అప్పుడే వుంటే ఇప్పు డుండడంలో ఆశ్చర్యము ఏమీ లేదన్నమాట.

రాధా :—ఆ! తెలివైన ఘటమేరా నీ కొడుకు, సుబ్బారాయుడూ!

ఆ సాయంకాల మంతయు నారాయణరావునకు తాతగారు చెప్పినసంగతియే జ్ఞప్తికి వచ్చినది. తానుగూడ రాముడు, దేవుడు కాడని వాదించిన రోజులు జ్ఞప్తికి వచ్చినవి. తాను 'ఇంగర్‌సాలు' వ్రాసిన గ్రంథములు చదివి నిజమని నమ్మిన వత్సరము లెన్నియో! ఈనాటి యువకులు భక్తిరహితులైనారు. తాను దేశములు తిరిగినప్పుడు గుడులలో భక్త్యావేశము కలిగెడిది. తన స్నేహితులనేకులు పూజ సేయించుటననేమో యెరుంగరు.

భక్తియెందుకు ? మోక్షము కొరకా ? మోక్షమననేమి ? యని వాదించు వాండ్రు మోక్షము భగవంతునితో నైక్యమందురా ? మోక్షములేనిచో నష్టమేమి ? పుట్టుచు గిట్టుచు నుందుము. పుట్టుచు గిట్టుచ ననంతమువరకు భగవంతునికి దూరులమై సైతానువలెనున్న మాత్రమున భయమేమి ? అని వారడుగుదు రనుకొందము. భగవంతుడన నేమిటి ? బలవంతుడగు వ్యక్తి యందురా, ఆ బలవంతు నెవరు పుట్టించిరి ? కాదు; నామము రూపము, మొదలు చివర లేని - నేతి, నేతి, నేతియన

జెల్లు నొక్కొనొకటి యని యందురా, అది కాదన్న నేమినష్టము ? అని నారాయణ రావు హోరాహోరి వాదించువాడు. నేడాసంగతులన్నియు మనస్సునకు దట్టినవి.

ఈ బ్రహాండములో ననంతవిశ్వములో నొక సౌరకుటంబములో నొక చిన్న భూగోళములో నొక చిన్న పురుగువంటి తాను భగవంతు డనుట నిజమా ? 'శివోహం' అని తెలుసుకొనుటయే శుద్ధమోక్షమా ? నేను బ్రహ్మమునైన, సమస్తము బ్రహ్మము. కాని ఒక చక్రవర్తి నిద్రబోవుచున్నంతకాలము తాను చక్రవర్తి నను జ్ఞానములేక, తా నేమియో తెలియక మైమరచియుండి, మేల్కొనుట తోడనే దాను చక్రవర్తినను జ్ఞానమును బొందునట్లు, నీ బ్రహ్మము తన్ను తా నెరుగునా ? ఆత్మజ్ఞాన పరిపక్వముచే ఈ గ్రంథములన్నియు జదువుచున్నకొలది నేమో తెలిసినట్లుండును. ఏమి తెలిసినది ? మనకు తెలిసినట్లున్నదంతయు మాయకావచ్చును. నిజము గోచరించుట యుత్తమపురుషునికే కాబోలు. ఆస్థితి తనకీజన్మములో నున్నదో లేదో ? తన కొక్కవాసనయు వీడిపోలేదే. శారద తనకుగావలె.తన బందుగులు, తన యాస్తి, తన మిత్రులు తన చదువు, తన ! తన ! తన !

## ౨౧

## ఆడవాళ్ళ బ్రతుకు అధోగతి బ్రతుకు

మరునాడు సుబ్బారాయుడుగారి రెండవ కొమారితకడనుండి యుత్తరము వచ్చినది. సత్యవతి యిరువదియారేళ్ళ స్త్రీరత్నము. తీర్చిన కనుముక్కు తీరుకలిగి జామపండు చాయతో సుందరియని చెప్పతగిన వనిత. కాని బెంగచే కృశించి శలాకవలె నైపోయినది. భర్త రంపపుగోత, ప్రథమసంతానమగు నొక బాలిక తప్ప తక్కిన పిల్లలందరు పోయినారు. ఇప్పుడు మరల నెలతప్పి మూడు నెల లయినది.

వీరభద్రరావు కెప్పుడు ననుమానమే. ఛాందస బ్రాహ్మణుడు, కఠినహృదయుడు. చిన్నతనమున నెంత సంతోషజీవియో, నేడంత పరమ కోపియై నిప్పులు గ్రక్కుచుండును. అతని తల్లికిగూడ కుమారుడన్న భయము. చేయు నుద్యోగము పెద్దాపురమున. డిప్యూటీకలెక్టరు కచ్చేరీలో రెండవ గుమాస్తాపని. యేబదిరూపాయల జీతము ఖాయము. ఎనభై తాత్కాలికపు జీతము.

రివిన్యూపనిలో మంచి తెలివితేటలుగలవాడు. ఇంటిదగ్గర నెంత పులియో, కచ్చేరీలో అంతపిల్లి. పై యధికారులన్న గజగజలాడుచుండును. వారి మెప్పును బొంది ప్రాపకము సంపాదించుకొనుచుండును. గ్రామాధికారులపై తోడేలువలెపడును, తనదగ్గరకు బనియుండివచ్చినవారు పెద్దవారైనచో నిమిషమున వారిపనిచేసి పంపును. చిన్నవారైన కస్సుమనును, బుస్సుమనును. అట్టిచో నెవరైన దిరుగబడి 'యేమిటయా ! ఇదిగో వీళ్ళందరిని సాక్ష్యంవేసి పెద్దకలెక్టరుకు పిటీషనుపెట్టి డిప్యూటికలె

క్టరుగారికి ఇప్పుడే అర్జీదాఖలు చేస్తాను ఉండు ' అని యనెనా. తక్షణమే వీరభద్రుడు చిరునవ్వునవ్వి ' ఎందుకులే కోపం, విసిగిస్తే అన్నాను. ఇదిగో చూశావూ, అబ్బాయి! పొద్దున్నుంచీ పని చేస్తూవుంటా. చూశావూ! అలాంటప్పుడు కాస్త కోపమూ వస్తుంది. చూశావూ, తొందరపడకు, ఏమిటీ నీపని?' యని మేకపిల్లపై పోవును.

మంచి ఆస్తిగల కుటుంబము, గౌరవమైన కుటుంబమని యీయ, నిట్లు కొమార్త యగచాట్లు బడుచున్నదిగదా యని సుబ్బారాయుడుగారి మనస్సు కలత నొందుచుండును.

సత్యవతి నారాయణరావు తోబుట్టువులలో నెల్ల నందగత్తెయని యెన్నదగిన పూనోడి ఆమె. కన్నులు పరమకరుణాపూరితములై, శిశునిర్మలత్వమును గోచరింప జేయును. ఆమె లేడివలె సాధుహృదయ. సాధ్వి. పతిభక్తిపరాయణ. ఆ బాల తెలివియైనది. ఏ మానిసియైన యట్టిభార్య కావలయునని తప మొనరింపవలయు నంతటి సుశీల. కఱ్ఱతో మోది కుక్కనువలె భర్త కొట్టుచుండినపుడు కిక్కురు మనదు ' రామ! రామ! రామ!' యని మాత్ర మనుకొనుచు, నశ్రుధారలు తుడుచు కొనుచుండును.

సత్యవతి కొమారిత బంగారు బొమ్మ. తల్లి నోటిలోనుండి యూడిపడినది. తండ్రి తల్లిని గొట్టునప్పుడు విరగబడి యేడ్చును. ఒకనాడు ' నాన్నా! నాన్నా! అమ్మను చంపెయ్యకు, రక్తము వస్తూంది ' అని అడ్డంపడితే ఆమెనుగూడ ' చావ గొట్టినాడా కర్కోటకుడు.

జానకమ్మగారి పేర సత్యవతికూతురు నాగరత్నం ఉత్తరం వ్రాసినది. ' అమ్మమ్మా. ఈ రోజు అమ్మనుకొట్టిన దెబ్బలకి అమ్మ మూర్ఛపోయింది. రెండు గంటలు తెలివిరాలేదు. నాన్న డాక్టరుగారికోసం వెళ్ళగానే, ఈ ఉత్తరం మీకు రాయమని మాయింట్లోనే కాపురంఉన్న విజయలక్ష్మమ్మత్త యీ కార్డు యిచ్చింది, నీకు ఉత్తరం రాశాను. వాళ్లే పోస్టులో వేశారు. ఈ మధ్య నాన్నకు కోపం ఎక్కు వైంది. తప్పులు క్షమించవలెను. చిత్తగించవలెను. మనుమరాలు నాగరత్నం. '

ఈ యుత్తరము చూచుటతోడనే జానకమ్మగారు కళ్లనీళ్ల క్రుక్కికొనుచు వాపోవ జొచ్చెను. సుబ్బారాయుడుగారు చిన్నబోయి మనసున కుములుచున్న కోప మున, నేమి చెయ్యవలెనో యాలోచన తేలక కూరుచున్నారు. తన చిన్నతనములో నిట్టివ్యాపారము తన చెల్లెలికి జరిగియుండినచో దానేమి చేసియుండును. వానిని బోయి తొక్కి పాతరవేసి, తన చెల్లెలి నింటికి దీసికొనివచ్చి యుండునా? అయ్యో అది తప్పు. స్త్రీ పతివ్రత; పతిభక్తి పరాయణ. భర్తచంపినను సరే భరించ వల యును. తాను దుర్మార్గుడైనచో తన బావమరది తన్ను హతమార్చుటకు దా నొప్పు కొనునా? ఏది ఎట్లయినను దన బాలికగతి యంతియ. వెళ్లి తీసికొనివచ్చి తన యింటిదగ్గర నుంచుకొనిన లోకము హర్షించునా? పోనీ! లోకముకొరకు వెఱువక తీసికొనివచ్చి పంపించక యూరకుండినచో? తన ముద్దులబిడ్డ బ్రతుకథో గతియేకదా

ఏది ఎట్లయినను తన కొమార్త యనుభవింపవలసినదే ! అని యూహాలోకమున బడి సుబ్బారాయుడిగా రుస్సురని కూర్చుండి పోయిరి.

రాధాకృష్ణయ్యగారది విని 'ఏమిరా సుబ్బారాయుడు ! మా పినతల్లిని ఆవిడ మొగుడు యిలాగే వేపుకు తింటుంటే, రెండుసార్లు కాపురానికి వెళ్లిన రెండు సంవత్సరాలల్లో నూతిలో బడిందట. రెండుసార్లూ ఎవరో బతికించారటరా అబ్బాయి ! ఆ తర్వాత మొగుడిమీద తిరగబడి మహాశక్తి దేవతై వెధవన్నని పిల్లిలాచేసిందట. అల్లాగే నువ్వు చేసేదేముంది ? నేను చేసేముంది ? భార్యా భర్తలకు దెబ్బలాటవస్తే వాళ్లే సముదాయించుకోవాలి' యనెను

నారాయణరావీ సంగతివిని, తండ్రిగారితో చెప్పి, పెద్దాపురం వెళ్లినాడు. తన చిన్నక్కగారు మొన్ననే పండుగకువచ్చి, పెద్దాపురం వెళ్లినది. ఇంతలో నేమి మునిగినదో ! ఆడవాళ్ళను గష్టపెట్టు పరమ దౌర్భాగ్యులు, చనువుకొన్న పశువులు నున్నారు. వారికి శిక్ష యెటులో భగవంతుడు ఎరుగడుగాబోలు.

మధ్యాహ్నము రెండు గంటలకు నారాయణరావు పెద్దాపురం చేరుకున్నాడు. ఇంటిదగ్గర బావగారులేరు. తన చిన్నక్కగారు, మేనకోడలు నాగరత్నమునున్నారు. 'చిన్న మామయ్యా ! నిన్నే వచ్చింది మెలుకువ అమ్మకు. ఆకట్టుకట్టిందే. అమ్మకు తల పగిలిపోయింది. చేతిబెత్తంతో ఉగ్రుడైపోయి కొట్టాడు. మామయ్యా ! నన్నూ కొట్టాడు మా నాన్న' అని నాగరత్న మన్నది.

'ఒరే తమ్ముడూ ! నా కర్మానికి మీరంతా ఇదిఅవుతే ఏం లాభం. ఈ తెలివి తక్కువ మొద్దు మీకు ఉత్తరం రాయడం ఎందుకు చెప్పు ? అమ్మకీ, నాన్నకీ, మీకూ గుండెలు తరుక్కుపోవడంతప్ప ఏం లాభం వుందీ ?'

'ఎందుకు కొట్టాడే చిన్నక్కయ్యా ?'

'ఎందుకైతే ఏమిరా బాబూ ! నేను పూర్వజన్మంలో చేసుకొన్నపాపం నన్ను ఇల్లా బాధిస్తూంది. ఏదో కారణం. ఆయన మంచివారే. ఊళ్లోవాళ్లందరికి మంచే. అందుకనే ఆయనకొట్టిన సంగతి ఊళ్లోవాళ్లకి తెలియగానే నావల్లే తప్పుందనీ, నీ బావగారివల్ల తప్పేమీలేదనీ ఈ చుట్టుప్రక్కలవాళ్లు కొందరు అనుకున్నారు. నన్ను గురించి మీరనుకొనేది తప్పు అని వాళ్లతో నేను చెప్పగలనురా ? నా కర్మం.'

'అమ్మనీ పెద్దమామయ్య తీసుకువచ్చి దిగబెట్టగానే, అమ్మని ఏదో అని, నాన్న కోప్పడ్డాడు మామయ్యా ! అప్పణ్ణుంచి ఏదో ఒక కోపమే ?'

'అయితే నిన్ను అంత చావగొట్టడానికి కారణం ఏమిటె ?'

'ఏవుంది, పండుగకు వెళ్లి ప్రతిమగవాణ్ణీ చూశానట. ఇంకా ఏమో ఏమో అన్నారు. జవాబు చెప్పను నాయనా; చెపితే అప్పుడే ప్రాణాలు వదులుకోవాలి.'

'అదా ! సరేలే !'

'నా తోడు ! ఒట్టు ! ఒరే తమ్ముడూ ! ఏమన్నా తొందర పడతావేమో సుమా ! నేను నుయ్యో గొయ్యో - చూసుకుంటాను !'

ఒసే అక్కయ్యా ! నీ మొగుడు పశువు కాని మే మంతా పశువులం కాము. జన్మం ఎత్తినందుకు జ్ఞానం కలిగిన మనుష్యులులా సంచరించాలి. ద్విపాద పశువై పోవాలా ! ఛీ ! వెధవ జన్మాలు. కుక్కనయం, పందినయం. పెళ్ళాన్ని చావకొట్టి ఆమె చస్తే, మళ్ళీ పెళ్లిచేసుకొని, కొత్తగావచ్చిన పెళ్ళానికి అడుగులకు మడుగు లొత్తుతారు మగ సన్యాసులు. పురుగు జన్మ లక్కయ్యా. '

' ఒరేబాబూ నీకు కోపం వస్తూంది. నువ్వు బలం కలవాడవు చేయి చేసుకొని నన్నధోగతి పాలు చెయ్యకు. నా కష్టం నేను అనుభవిస్తానుగాని, నువ్వు ఇంటికి వెళ్లిపో. '

' ఒసే అక్కయ్యా ! నువ్వు వెఱ్ఱి అభిప్రాయం ఎందుకు పడతావు ? నేను బావను కొట్టలేను. కొట్టగలిగివుంటే అతనిపని దాగానేఉండును. నాకు బలంలేక కాదు. అట్టి నీచపుపనికి నేను దిగలేను. '

ఆ సాయంకాలమునకు వీరభద్రరావు వచ్చునప్పటికి పడకకుర్చీలో గూర్చుం డిన బావమరదిని జూచి తెల్లబోయి ' ఎప్పుడు వచ్చావోయి బావా ! ' యని ప్రశ్నించెను.

' మధ్యాహ్నం. '

' ఏం పనిమీద ? '

' చెన్నపట్నం వెళ్లబోతూ మిమ్మల్ని చూద్దాం అని వచ్చా !

' అల్లాగా ! ' అని లోనికిబోయి ' నాగరత్నం ' అని కూతుర్నిపిలిచి, ' ఎందుకు వచ్చాడే మీ చిన మామయ్య ? ' అని ప్రశ్నించెను.

నాగరత్నం గజగజ లాడిపోయినది. ఆమె కళ్ళనీళ్లు తిరిగినవి. నారాయణ రావు గ్రహించి లోనికిబోయి బావగారితో నిట్లనెను.

' బావా ! ముసుగుల్లో గుద్దులాట యెందుకు ? నాగరత్నం వాళ్ళమ్మకి తెలి యకుండా పక్కయింటివారు యిస్తే, కార్డుమీద మాయింటికి ఉత్తరం రాసింది. నేను వచ్చాను. నువ్వు చదువుకొన్నవాడివి. రేపు వియ్యమంద దలచుకొన్నావు. నిన్ను గురించి ప్రపంచం ఏమనుకుంటున్నదో నీకు తెలియటంలేదు బావా ! మన కుటుం బాలల్లో ఇలాంటిది ఎక్కడన్నా ఉందిటోయి ! '

' నాపద్ధతి అంతే. నన్నేమి చెయ్యమంటావు ? నాకు కోపం జాస్తి. దాన్ని చంపుకుందామని ప్రయత్నంచేస్తే చావదు. నన్నేమి చెయ్యమంటావు ? '

' రాత్రి మాట్లాడుదాములే. ఇప్పుడేమి మాట్లాడకు. '

తాను వాడుకొనుటకు కొన్న ' వెస్టు అండు కంపెనీ ' వారి ఎనుబది రూపా యల ఖరీదుగల ' బంగారు కీపుసేక్ ' అను చేతిగడియారము నారాయణరా వీయ బోగా నతడు వలదని వారించినాడు. నారాయణరావు బావగారిని తీక్ష్ణముగా జూచి ' బావా నువ్వంతకంతకు చాలా చిత్రం అయినమనిషివి అవుతున్నావోయి. మనం మగవాళ్ళం. ఆడవాళ్లు నీరసులు. ఎలా చూసినా వాళ్లు మన చేతిలో ఉన్నారు.

మనం దయ దలచి, ఆడవాళ్ళని మనుష్యులుగా ఎంచాము. అయినా వాళ్లు మనదృష్టిలో పశువులు, అంతే. వాళ్ళని చంపినా ఎవరూ ఏమనరుగదా? ఆఫ్రికా నీగ్రోలల్లో ఆడవాళ్లు వస్తువులేకదా బావా! బానిసలే ఆడవాళ్ళు? నిన్న మొన్నటిదాకా అరేబ్బీ, పెరిశియా, టర్కీ దేశాలల్లో ఉన్నట్లు. బానిసత్వం మనదేశంలో కూడా ఉండాలనా మనం ఈయోజన ప్రయత్నం చేయవలసింది. బావా నీహృదయం స్ఫటికంలా మంచిది. పదిమందిలో పేరు ప్రతిష్ఠ సంపాదించుకొంటు న్నావు. నీకోపం అంతా యింట్లో చూపిస్తున్నావు గాని, నీపై అధికారిపైన చూపించగలవా? అలాగైతే వెయ్యి రూపాయ లిస్తాను బహుమతీ నీకు. నీపై అధికారి నిన్ను కోపపడినా రాని కోపం, నీచేతిలో ఉండి నీకు దాసివలె వంగి ఉన్న భార్యపైన ఎందుకు వస్తుంది? అధికారిపైన వచ్చినకోపం అంతా ఏమయింది? అది మనము అణచివేసుకుంటాము, చంపివేస్తాము. ఆశక్తే మనం, మన క్రింది వాళ్ళపట్ల కూడా ఎందుకు చూపకూడదు? యుగపురుషుడు గాంధీమహాత్ముడు, క్రీస్తు, బుద్ధుడు మనకు బోధచేసింది ప్రేమకాదా బావా? మనం కోపం చంపుకుని ప్రేమచూపించడంవలన మనలను నమ్ముకొన్నవారు జన్మజన్మకు మనయందపరిమిత కృతజ్ఞత జూపిస్తారు. ఒకరియెడ ద్వేషంపూని వారిని హింసిస్తూ, తక్కిన యావ న్మంది విషయంలో ఎంతప్రేమ చూపినా, అది క్రోధస్వరూపమూ, అసత్యమూ అవుతుంది సుమా! క్రోధం రావడం, మనలో పశుత్వం ఇంకా చావలేదనే దానికి సూచన. నీకన్న చదువురాని యానాదివాడు గొప్పే!

‘నేను ఉపన్యాసం ఇస్తున్నాను. అని అనుకుంటావేమో? ప్రపంచంలో అందరికీ ఇలాంటి విషయాన్ని గురించి నేను ఉపన్యాసం ఇవ్వాలసివస్తుందా బావా?

‘బావా! నన్ను బాగా ఎరుగుదువుగదా? మామయ్యగారు అత్తయ్యగారూ ఈ విషయంలోనే నీతో కలహం పెట్టుకున్నారు. మావాళ్ళందరూ దుఃఖిస్తున్నారు. నీమనస్సుమట్టుకు నీకు బాగుందా? నేను చిన్నవాణ్ణే! అయితే నీకూ నాకూ ఉన్న చనువునుబట్టి చెప్పాను.

‘ఆడది, ఎల్లాగా దెబ్బలు పడుతుంది. ఎదిరించలేదు. అది పతివ్రతలకు ధర్మం! సహజం! కాని, వాళ్ళూ మనతోటివాళ్ళు అని ఆలోచించాలి. నేను నిన్ను వేడుకొనే దింతే.’

## ౨౨

## నాదీ భారం

బావమరిది మాటలు విన్నకొలదీ వీరభద్రరావుకు కోపము, నావెనుక లజ్జయు, నావెనుక విషాదము కలిగినది, అతడు మారుమాటాడలేదు. అతనికన్నుల నీరు తిరిగినది. ఇంతలో కోపము వచ్చినది. మరల నాపుకొన్నాడు. తానిచ్చిన యుపన్యా

సమునకు బావగారికి గోపము వచ్చునని నారాయణరా వనుకొనచుండెను. అందుకై యేమి చెప్పవలయునా యని ఘాతడాలోచించుచుండెను.

లోపల సత్యవతి యేద్ది యెట్లగునో యని లోన గజగజ పోవుచు, సత్వరముగ వంటజేసెను. వానమరదు లిరువురు కాళ్ళుకడిగికొని భోజనముల ముందు గూర్చుండిరి. వీరభద్రరావునకు భోజనము సహించలేదు. నారాయణరా వది చూచి 'బావా! నువ్వు సంతోషముగా భోజనము చెయ్యి. లేకపోతే నేను అన్నం వంటపట్టదు' అనెను.

భోజనములైన వెనుక వీరభద్రరావు నారాయణరావును 'మీ అక్కయ్యను మీ యింటికి తీసుకెళ్తావా?' అని ప్రశ్నించెను.

'అదేమిటిబావా! రెండురోజులేగా వచ్చింది మా చిన్నక్కయ్య? తర్వాత యేదోనెలలో తీసుకెళ్తాము. అన్ని రివాజులు తప్పించాలి అని మా అమ్మగారంటూనే వున్నారు. పురిటికి రాజమండ్రి తీసుకెళ్లాలని ఉన్నది. ఏమంటావు? నీ యిష్టం అయితే మావాళ్ళ యింటికి తీసుకువెళ్తాం. లేకపోతే హాస్పత్రిలోవుంచి అక్కడ పురుడు పోస్తాం లేకపోతే నేను చెన్నపట్టణం తీసుకొని వెళ్ళిపోతాను. ఆలోచించుకో. అమ్మా వాళ్ళూ వస్తారు.'

వీరభద్రరావుకు దానెందుకు దన యిల్లాలిని కొట్టినాడో తెల్లమైనది. జమీందారుగారు వచ్చి పిలిచినాడు. జమీందారు వీరభద్రరావుగారిని బంపుడని డిప్యూటీ కలెక్టరుగారి నడిగినాడు. డిప్యూటీ కలెక్టరుగారు వీరభద్రరావుగారిని దీసుకొని బోవచ్చుననియు దనకు పరమ సంతోషమనియు వీరభద్రరావు ఆఫీసులోకెల్ల మంచి గుమాస్తాయనియు దానును బ్రమోషనుకు వ్రాసినాననియు జెప్పినాడు. వీరభద్రరావు వెళ్ళవలెననియున్నను కలెక్టరుగారికి ముఖ్యమగు బనులుండుటచే, మకాంగుమాస్తా వీరభద్రరావు తప్ప నింకొకరు పనికిరారని యాయనకు తోచి వీరభద్రునితో 'నీవు వుండి నీభార్యను బిల్లను బంపు' మని చెప్పినారు. వీరభద్రరావు చేయునదిలేక, నిట్టూర్పులతో, హృదయమున ఝంఝామారుతముతో, భార్యను, గూతును జమీందారుగారితో బంపినాడు. జమీందారుగారు తన మోటారు తోలువానితో ముందు కూర్చుండి, సత్యవతిని, కొమార్తను వెనుకగూరుచుండబెట్టి, తన కారులో రాజమహేంద్రవరమునకు తీసికొనివెళ్ళి పోయినారు.

జమీందారుగారు పెద్దలు, పూజ్యులు అని తానెరుగును. వేఱుతలంపులు దలంచుట హైన్యమనియు నెరుంగును. పండుగ నాలుగు రోజులు వీరభద్రరా వనుభవించినది యమలోకము. ఎంత మంది పరపురుషులు జమీందారుగారి యింటికి వచ్చెదరో? భార్య వారిని చూమనేమో? వారు తేరిపార భార్యను జూచెదరు కాబోలు. ఇదివర కెప్పుడు భార్యను బుట్టింటికి బంపినను దానుగూడ వచ్చి, తనతో దీసుకొనిపోవునాడు. పండగనా డెట్లయిన దాను రాజమహేంద్రవరము పోవలయు

నని యెన్నియోవిధముల ప్రయత్నించినాడు. కాని డిప్యూటీ కలెక్టరుగా కాప్పుకొనలేదు.

యింటికి తనభార్యను పెద్దబావగారు శ్రీరామమూర్తి తీసికొనివచ్చి దిగబెట్టుట తోడనే భార్యపై మండిపడినాడు.

'నువ్వు దౌర్భాగ్యురాలివి! నువ్వు పెద్దాపురం సానిదానికన్న నీచురాలివి. ఆపళంగా పరుగెత్తుతావా? నీ మనస్సు చెడుమనస్సు కాకపోతే నువ్వలా తయ్యారవుతావా? నీచపుముండా! అక్కడ యెందరకు ఉత్తరాలు రాశావో....' ఇట్లు వినగూడని, వ్రాయగూడని యుచ్చరింపరాని కారుమాటలన్నాడు. వీధులో కాట్లాడు నూరకుక్కయై పోయినాడు.

నేడు వీరభద్రరావుకు దన నైచ్యమంతయు గనులగట్టినది. సత్యవతి తనకు చేసినసేవ, యామె ప్రేమ, యామె మెత్తని హృదయము జ్ఞప్తికివచ్చినవి. మరల ననుమానపు బిశాచము పీడించినది. భార్య యెవరో యొకనిని ప్రేమించుచున్నదని కాదు, తన్ను మాత్రము ప్రేమించుటలేదని యాతని భావము.

నారాయణరావు రెండురోజు లక్కడనుండి వీరభద్రరావుకు వేదాంతము బోధించినాడు. ఇతర దేశములలో స్త్రీలను జూచు విధ ముగ్గడించి నాడు. స్త్రీలను పూర్వమునుండియు భారతీయులు గౌరవించుచుండి రన్నాడు.

'బావా! మనకు స్త్రీ లెంత గౌరవనీయలోయి! మన నాగరికతను, మన గౌరవాన్ని, మన నీతిని, మనజాతిని కాపాడుచున్నది ఆడవాళ్లోయి బావా. ఖడ్గతిక్కన్న జ్ఞప్తికి తెచ్చుకో, రుద్రమదేవిని, తరిగొండ వెంకమాంబను, మొల్ల మొదలగు వీరవనితలను స్మరించుకో! మాంచాల భర్తకొరకై తపస్సుచేసి, భర్త భోగండాని వలలో బడితే, భర్తను కాపాడుమని దైవమును ధ్యానించి, భర్తపాదాలు స్మరించి స్మరించి ఉంటూ ఉన్నప్పుడు, బాలచంద్రుడు యుద్ధానికి అనుజ్ఞ అడగడానకి మాంచాల దగ్గరకువస్తే, మాంచాల కత్తినిచ్చి యుద్ధానికి పంపి, భర్త వీరమరణం పొందితే తాను సహగమనం చేసింది. మల్లమ్మాదేవి చరిత్ర తెలియదు బావా నీకు?'

కొన్ని గంట లాతని బొగడినాడు. 'నీ హృదయం చాలా మంచిదిబావా! నువ్వెందరకు ఉపకారం చెయ్యడం నే నెరగను! నీ బోటి మనిషి మా సహాయ నిరాకరణంలో జేరితే గొప్ప నాయకుడవు అవుదువు. నీ హృదయం ఈ ఉద్యోగంలో చేరడంవల్ల యిల్లా పాడయింది. కాని యిలాంటి ఉద్యోగాలలోఉండి తమ జీవితాలను న్యాయమార్గాన్ని నడిపే మహానుభావులున్ను ఉన్నారని యిప్పటివరకు ప్రజలు చెప్పుకోవడం లేదటోయి?'

మరునాడు నారాయణరావు బావమరదికడ సెలవు పుచ్చుకొని, యక్కగారికి దండ్రియిచ్చిన ఇరువది రూపాయలు సేత బెట్టి కొత్తపేట వెడలిపోయినాడు.

తల్లితో సంగతులన్నియు జెప్పి తాను తన బావమరది మనస్సును కొద్ది నెలలలో మార్చగలనని ధైర్యము చెప్పెను.

'నాయనా ! నువ్విలా అంటావు. ఎవరు మార్చగలరురా ఆ కర్కోటకుడి మనస్సు. అల్లాగే కుళ్ళి కుళ్ళి కృశించి, సత్యం ఏ గొయ్యో నుయ్యో చూచుకొంటుం దిరా నాయనా !'

'అదికాదు అమ్మా ! నువ్విలా కుంగిపోతా వెందుకే ! దానిబాధ తప్పించడం నాదిభారం. అతను ఈపట్టు నా చిన్నక్కయ్యను కష్టపెట్టాడా ! నేనువెళ్ళి అతని యింటిదగ్గిర నిరశనవ్రతం చేస్తాను. దానివల్ల అతని మనస్సు పూర్తిగాకరుగుతుంది.'

## ౨౩

## అ ఇ ఉ బ్ ఋ ఌ క్

చెన్నపట్నమునకు బ్రయాణమై, రాధాకృష్ణయ్య తాతగారు తోడరా, నత్త వారింటికి నారాయణరావు మధ్యాహ్నమునకు జేరుకొనెను. జమీందారుగారు తన యల్లుడు వచ్చుటకు ముదమంది, యల్లుని జ్ఞాతియగు తాతగారి నపరిమిత గౌరవ మొనర్చి తమ సంతోషమును వెలిబుచ్చి నాలుగు రోజులు తమ యింటికడ నుండ వలయునని బలవంతపరచిరి. కాని రాధాకృష్ణయ్యగారు తనకు జాలకార్యము లున్న వనియు, దాను త్వరితముగ జుట్టముల నందర జూచి యింటికి బోవలయు ననియు జెప్పినారు.

నారాయణరావా రాత్రి మెయిలుమీద చెన్నపట్నమునకు బ్రయాణమైపోవుట యాగినది. జమీందారుగారు మరియు బలవంతము పెట్టుటచే రాధాకృష్ణయ్యగారు మరుసటిదిన మంతయు నచటనే యుండిరి. జమీందారుగారు వారికి వెలగల యుడు పులు భక్తితో సమర్పించినారు. వారును శారదకు నొక వెండి గంధపుగిన్నె ఆశీ ర్వాదముతో చేతనిడి, తమ నారాయణునకు తగిన భార్య యని సంతోషించినాడు. లక్ష్మీపతి యింటికి బోయి చూచివచ్చి మోటారుబస్సుమీద మరునాడు రాధాకృష్ణయ్య గారు ద్రాక్షారామము వెడలిపోయిరి.

జగన్మోహనుడు, రాధాకృష్ణయ్యగారు వెళ్ళినప్పటినుండియు నాయనను గూర్చి శారదకడ, నావెనుక తన మేనత్తకడ హేళన ప్రారంభించెను.

'మామయ్యగారికి మతిపోయినట్టుంది. నానారకము అడివిమనుష్యుల్ని ఆయన గౌరవము చేస్తూవుంటారు.'

ఎంత ముసలివాడో ఆయన బావా ?'

నాకు చూస్తే భయము వేసింది. ఆ ముసలి మీ ఆయన తాతట గాడూ ? అనుకున్నారు.'

మీ ఆయనా, ఆ ముసలివాడూ కలిసి నుంచుంటే పెద్దకోతీ చిన్నకోతీ లా ఉన్నారు. నేను నవ్వుపట్టలేక పోయాను శారదా ! హహహ.'

శారద మాట్లాడలేదు. జమీందారిణి తన మేనల్లుని జూచి,

'నీవు పోల్చిన పోలిక సరిగా సరిపోయినదోయి!' యన్నది.

ఆ నాడు జమీందారుగారి చుట్టములలో నారాయణరావు కుటుంబమును గూర్చి చిత్ర విచిత్ర సంభాషణ బయల్వెడలినది. వేళాకోళములు, వెక్కిరింతలతో విరుగబడినారు.

ఆ సాయంకాలము జగన్మోహనుడు శారద కడకుజేరి 'శారదా! తోటలోకి షికారువెడదాము, రా!' అని అడిగెను. ఆ రోజు పున్నమ. ఆశ్వయుజ పూర్ణిమ ఆనంద కల్లోలిని. నీరములు ధవళములు నగు శారదా జ్యోత్స్నలు మీగడ తరకలై, మధురక్షీరతరంగములై యుబికిపోవును.

శారద వల్లెయని తోటలోనికి బయలుదేరినది. ఆబాలకు యౌవనము నానాటికి పూవునకు దావివలె జేరుచున్నది. ఆమెను సౌందర్యము వెన్నెలవలె నావరించి యున్నది.

పూవుతోటలోని సౌరభము, దిశల నావరించియున్న పండువెన్నెలయు శారదా సౌందర్యములో లీనమైపోయినవి.

శారదను శలభమును జూచు గౌళివలె జగన్మోహనుడు తేరిపారచూచుచు, వెనుకనడచుచు నా బాలిక నౌకవేదికకడకు గొనిపోయెను. సుగంధములగు వేడినీళ్ళ స్నానమాచరించి, పాము కుబుసమువంటి 'గ్లాస్గో' మల్లు పంచగట్టి, అట్టి లాల్చీయే తొడిగి, 'కూటికూర' పౌడి దేహమెల్ల నలది ఘుమఘుమ మనుచు, జరీపూవులుచేవారి పనిజేసిన ముఖమల్ పాదరక్షలు ధరించి తెల్లని దేహము వెన్నెలలో తళుకులాడ, ప్రక్కనే నడచు జగన్మోహనుని జూచుచు శారద ముగ్ధురాలై పోయినది. జగన్మోహను డామెకు నవమన్మధునివలె కన్పట్టినాడు. ఆబాలకుని బెండ్లిచేసికొని యుండిన నెంత చక్కగానుండెడిదో అని ఆమె నిట్టూర్పుపుచ్చినది. చిన్నతనమునుండియు దా నాతనినే ప్రేమించినానని యామె యప్పుడనుకొన్నది. 'ప్రేమించుట' యను విషయమా మెకు నవలల వలన తెలియునుగదా. ప్రతిబాలికయు నెవరినేని పురుషుని ప్రేమించునుగదా. ప్రేమలేని పురుషుని బెండ్లిచేసికొనినచో నామె గతియెట్లు? తన తండ్రిగా రట్టి ప్రేమకు దన్నెడసేసి వేరొక్కరికిచ్చి వివాహ మొనరించుట తన దురదృష్టముగదా! తాను జదివిన పెక్కు నవలలలో కథానాయకులకు నాయికనిచ్చి వివాహముచేయక తల్లిదండ్రులందరు నిట్లే యితరుల కిచ్చుటకు బ్రయత్నించినారు.

'శారదా! ఏమిటీ ఆలోచిస్తున్నావు? ఇదివరకు నీరక్తం ప్రవహించడమే పైకి కనబడుతుంది అనుకున్నాను. ఇప్పుడు నీ ఆలోచనలుకూడా కనిపిస్తున్నాయి ప్రియా'

'ఏమీలేదు బావా!

'శారదా! నీ అందం నా అందం కలిసిపోతే ఎంతబాగుండును. నేను నీ భర్తనైయుంటే రోజూ నీ పాదాలదగ్గర కూచుని నిన్ను ప్రేమిస్తూఉందును.

శారద మాట్లాడలేదు కాని యామె హృదయము జగన్మోహను డన్నమాటకు సంతోషముచే బొంగిపోయినది.

శారద నాతడు దగ్గరకు జేరిచి యామెచుట్టు చేయివైచి, యామె మోము పైకెత్తి తమితో ముద్దుగొనబోవుచుండ, కేశవచంద్రరావు గబ గబ నచ్చటికి బరువెత్తి వచ్చి 'చిన్నక్కా, నాన్నగారు నీకోసం చూస్తున్నారు.' అన్నాడు.

కేశవచంద్రరావుమాట వినబడుటతోడనే శారదా జగన్మోహను లిరువురు నులికిపడినారు. జగన్మోహనుడు తనచేయి శారదచుట్టునుండి తీసివేసి, దూరమునకు జరిగినాడు. శారదయు గబుక్కునలేచి, త్వరితముగ లోనికి వెడలిపోయినది.

జగన్మోహనుడచ్చటనే యొంటరియై కూర్చుండెను. అబ్బా! యీ పిశాచి బాలకుడు సమయానికి దాపురించుచున్నాడు. తాను జమీందారు బిడ్డయయ్యి వీనికి నా వెధవ పల్లెటూరి మొద్దంటే ఇంత ప్రేమ యేమిటి? ఆ తండ్రి పోలిక తగల బడింది కాబోలు. 'నిమిషంలో జారిపోయినది. ఇంకొకచిటికలో నామెను ముద్దు గొనియుండువాడే. ఎప్పటికైనా తనదే శారద!'

శారద లోనికి బోవునప్పటికి జమీందారుగా రొక పడుకకుర్చీపై నధివసించి యేవేని వార్తాపత్రికల జదువుకొనుచు, శారద వచ్చుటజూచి, యామెను దగ్గరకు లాగి కొని 'ఎక్కడకు వెళ్ళావమ్మా' యని ప్రశ్నించెను.

'తోటలోకి నాన్నగారూ'

'జగన్మోహనుడు నిన్ను కొట్టబోయాడు అని తమ్ముడు చెప్పాడేమిటమ్మా'

'కేశవచంద్రుడు తండ్రికడకుబోయి తండ్రిగారి చేతిమీద రెండుచేతులువైచి, తండ్రి మొగము చూచి, 'ఆ! బావ శారదను దగ్గిరగా తీసికొని కొట్టబోయాడు. అది కిటికీలోంచి చూచాను. రంగమ్మను కనుక్కోండి నాన్నగారూ!' జేవురించిన మోముతో పలికినాడు.

జమీందారుగారు కుమారునెత్తి యొడిలో గూర్చుండబెట్టుకొని, కౌగిలించుకొని, క్రిందికి దింపివేసెను.

'అమ్మాయీ! జగన్మోహనరావు తోటలో నున్నాడా!' యని యడిగెను.

'అవును నాన్నగారూ నేనూ బావా తోటలోకి వెళ్లాం. అదిచూచి బాబు బావ నన్ను కొట్టున్నాడు అనుకున్నాడు కాబోలు.'

'అదేలే! లేకపోతే ఏమిటి కాని, నువ్వు లోపలికి వెళ్లు తల్లీ! బాబూ! నువ్వు బువ్వ తిన్నావా? నిన్ను ఎవరూ పడుకోబెట్టలేదూ? తల్లీ, బాబుకు నువ్వు జగన్మోహనునితో మాట్లాడటమే ఇష్టంలేదు.'

శారద మరల వచ్చునేమో యని జగన్మోహను డచ్చటనే కూర్చుండి యుండెను. ఎంతకు నామె రాకుండుటయు, భోజనములవేళ దనుక నచ్చటనే యుండెను. శారద చుట్టు చేయి వేసినప్పు డాతని కన్ను లెఱ్ఱబడినవి. కాయము మోహావేశముచే వణికిపోయింది. ఆ వణకంతయు నెమ్మదించుకొనుచు, శారద యందమునుగూర్చి తలపోయుచు నా జమీందారు డటులనే యాలోచనాపరుడై పోయినాడు. వెనుక విజయనగరములో మనోహరి యను వేశ్యతో దాను సలిపిన క్రీడలన్నియు నాతని స్మృతిపథంబునకు వచ్చినవి. ఆ పిల్ల కన్నెరికమునకు లక్షాధికారులనేకులు ధనమిచ్చెదమన్నను, వారందరు సమర్పణచేసెదమన్న రొఖ్ఖముకన్న మిన్నగా తానర్పింప నీయకొనెను, తానే కన్నెరకముచేసి, యారాత్రి దా ననుభవించిన 'మహదానందము' స్మరించుకొనుచు, శారద తన కౌగిలి జేరినచో నంతకన్న నెక్కువ సంతోషము బొందువాడను గదాయని, తలంచికొని యుస్సురు మనియెను.

జమీందారుగారు తన కొమార్త శారద జగన్మోహనునితో నెక్కువ చనువు చేయరాదని యూహించుకొని శారదను జూచి 'అమ్మా నువ్వు జగన్మోహనరావుతో నంత చనువుగా నుండకూడదు. నువ్వీమధ్య చదువు తగ్గించినట్లున్నది. ఈయేడు తప్పక స్కూలు ఫైనలు పరీక్షలో నెగ్గాలిసుమా. మీ గురువుగారితో ఇంకా జాగ్రత్తగా చెప్పమని చెప్తాను. సరే లోపలికి వెళ్ళు' అని చెప్పినారు.

శారద తెల్లబోయి నెమ్మదించుకొని 'బాగానే చదువుకొంటున్నానండి నాన్నగారూ! తప్పకుండా పరీక్షలో నెగ్గుతానని ధైర్యంగావుంది' అని జవాబు చెప్పినది. ఆమె కన్నులలో నేలనో నీరు తిరిగినది.

జగన్మోహనరావు బావ తన్ను ప్రేమించుచున్నాడని తండ్రి గ్రహించినాడేమో యని యామె కొంచెము భయపడినది. ఆమె మాటలో చూపులో నిర్మలత్వము ప్రద్యోతమగుచున్నది. ఆమెహృదయము నిష్కలుషము. ఒక నిమేషము తనయను, దీక్షముగా జూచి యామెకు దెలియకుండగనే కనులు వాల్చి కొమారితను దగ్గరకు దీసికొని, యామె శిరంబు మూర్కొని ముద్దిడుకొనెను. శారద లోనికివెడలిపోయినది.

జగన్మోహను డంతకంతకు నధోగతిలో పడిపోవుచున్నాడనియు, విజయనగరములో కొందరు వారకాంతలతో దిగంబరుడయి యొకగణికా గృహంబున జలక్రీడలు సలిపినాడనియు జమీందారీవలన వచ్చిన రాబడి చాలక దినదినము వేలకు వేలప్పు చేయుచున్నాడనియు, యూరేషియను సాంగత్యమున వారికి ధనము దోచిపుచ్చుచున్నాడనియు, జమీందారుగారికి అస్పష్టమైన వార్తలు వినవచ్చినవి.

రెండవబావగారగు నారాయణరావు తనకు కథచెప్పుచున్నట్లు కలగనుచు కుమారరాజా కేశవచంద్రరావు నిదురఁగూరినాడు.

నారాయణుడు రాత్రి రైలులో వెళ్లుచున్నాడు.

వేగము! వేగము! రయిలు సంగీతము పాడినా? ఒక్కొక్కప్పుడు రైలుతాళము వేయుచున్నట్లు తనకుతోచును. ఎంత చిత్రమో? టక టక టక టక శారద మెరపువలె మాత్రము తోచినది. నారాయణుడు పాడుకొన్నాడు.

ఓహో కవిత్వమా, నీవు విశ్వమోహినివి. శివుని డమరుకమున జనించితివా?

'అ ఇ ఉ ణ్ ఋ ఌ క్.'

ఈ రయిలు చక్రముల చప్పుడు అందుండియే జనించినదా?

'అ ఇ ఉ ణ్ ఋ ఌ క్.'

'శ్రీ వాణీగిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాఙ్గేషుయే.'

కవిత్వము సర్వకళా స్వరూపము. కవిత్వము విశ్వస్వరూపము. సర్వసృష్ట్యాత్మకము. అఇఉణ్ఋఌక్ టకటకటకటక. అతడు నిద్రగూరినాడు.

# తృతీయ భాగము

## ౧

## పునస్సంధానము

నారాయణరావు బి. ఎల్. పరీక్షలో ప్రథముడుగా నెగ్గిన వెనుక హైకోర్టులో నొక సుప్రసిద్ధ న్యాయివాది కడ 'ఎప్రింటిసు' శుశ్రూషనడపి యా పరీక్షలోను మొదటివాడుగా 1928 సంవత్సరపు వేసవికాలములో కృతార్థుడైనాడు. శారదయు ప్రవేశపరీక్షలో విజయము గాంచినది. జమీందారుగా రామె 'నింటరు' పరీక్షకు జదివించుచున్నారు.

ఆ వేసవికాలములో భార్యాభర్తలకు పునస్సంధాన మహోత్సవం సంకల్పించి చుట్టముల నందరిని రప్పించినారు. నారాయణరావు స్నేహితులు చుట్టములుగూడ పెండ్లికి వచ్చినట్లే వచ్చినారు.

పునస్సంధానమున కింత మంది విచ్చేయుట నారాయణున కిష్టములేకున్నను తండ్రిగారి యిష్టమున కాతడెదురు చెప్పలేక పూర్వాచారము ప్రకారము చుట్ట పక్కములతో జమీందారుగారి గృహమునకు దరలి వెళ్ళెను.

ఉదయముననే భార్యాభర్తలు పీటలమీద కూర్చుండవలయును. గ్రామ గ్రామములనుండి బ్రాహ్మణోత్తము లెందరో విచ్చేసిరి. జమిందారుగారి సభామంటప మంతయు లోచనమోహనముగ నలంకరింపబడినది. చుట్టములు, స్నేహితులు, పండిత శ్రేష్ఠులు, పరివారజనము క్రిక్కిరిసి యుండిరి.

పూర్ణయౌవనముచే నారాయణరావు దేహము మిసమిసలాడుచుండెను. చిరు మీసములు తుమ్మెద రెక్కలవలె నల్లనై మోమున కొక వింతయందము గూర్చెను. కుమారస్వామివలె, మంజు శ్రీ వలె, శ్రీకృష్ణునివలెనున్న యాతని మూర్తి తెల్ల గంధపు బొమ్మవలె సభ్యులకన్నులకు జల్లనై హృదయములు మోహింపజేసినది. సంధ్యావందన మొనర్చి, తడిపి యారవేసిన క్షీరాబ్ధి దుకూలములు ధరించి, యున్నత మూర్తియు గోమూర్ధ కటియునగు నా యువకుడు, మత్తగజగమనముతో వత్సరాజు వలె నరుదెంచి, పీఠముకడ నిలుచుండెను.

శారద సర్వాభరణభూషితురాలై సరిగ బుటేదారియంచుల హోంబట్టు చీర ధరించి, తెల్లని మేల్పట్టు బనారసు (జంబరు) కంచుకము ధరించి, పూలుముడిచిన వాలుజడతోవచ్చి, భర్తప్రక్కనే నిలుచుండినది.

మంగళవాద్యములు బోరు కలిగెను. దంపతులను పీటలపై నధివసింపజేసిరి వసిష్ఠులవారు.

'ఓం కేశవాయస్వాహా ఓం నారాయణాయస్వాహా ఓం మాధవాయస్వాహా' అని వసిష్ఠుడాతనిచే నాచమనాదులు చేయించెను.

అప్పుడు వాలుజూపులతో నారాయణరావు భార్యను జూచినాడు. ఉన్మిషిత యౌవనయగు నామె వివిధాంగముల స్ఫుటత్వము దాల్చుచుండ వసంతమునాటి మల్లికాలతవలె మిలమిల లాడినది. ఆమె కన్నులు నిశ్చల నిష్కలయామినీ తారకల వోలె మెఱసినవి. ఆమె చెక్కులలో సుమస్సుందరీహాసములు ప్రసరించి పోయినవి. ఆమె బంగారు దేహము మేల్మిమెక్కి పాలసంద్రాన సంధ్యారుణ హేమము ంలమి నట్లయింది. నిర్యాపాసనాగ్నిని ఆ దంపతులు జరిపిరి.

ఆమె నడకలో నొక యొయ్యారము, చూపులకొక వెన్నెల, శరీరమున కొక దీప్తి యాలోచనల కొక యనంత సౌలభ్యము. ఆమెలోనే యొక దివ్యశ్రుతి ప్రత్యక్షమైనవి యని నారాయణరావు ప్రణయయోగమున గన్నులు మూసి ధ్యానించెను. మనసులో నామెను కౌగలించుకొన్నాడు. ఆమె తన ప్రాణములోని ప్రాణము, ఆత్మలోని యాత్మ యనుకొన్నాడు.

తనచేతిలో నామెయుదకము పోసినప్పుడామె యంగుళులు చంద్రకిరణములై యాతనికి దోచినవి.

పురోహితు డేమేమి తంతు చేయించెనో, యెప్పుడు మామగారు తనకు స్వయముగను తన భార్యకు నత్తగారు చేతను శుభ వస్త్రముల నిప్పించెనో, ఎట్లు తానా శుభవస్త్రముల ధరించెనో, యేవిధమున నాశీర్వచనము చేసిరో, హారతు లెత్తిరో యని యన్నియు నారాయణరావు గమనించలేదు.

పీటలపైనుండి లేచిన పిమ్మట నారాయణరావుతో పరమేశ్వరుడు, 'ఒరే నారాయణా! నీ మోము దివ్యమై కనిపించిందిరా, ఇందాక పీటలమీద ఏమిటి ఆలోచిస్తున్నావు. మీ రిద్దరూ కూర్చునిఉంటే, ఇంతకన్న పరమోత్కృష్టమైన దాంపత్యము ఎక్కడనైనా దొరుకుతుందా? అనుకున్నా అనిరుద్ధుడూ, ఉషాబాల లా కనబడ్డారురా మీ రిద్దరూ?' అన్నాడు.

'ఊహో, మొద లెట్టావు, మాగధస్తుతి?'

'అరే పోవోయి స్తుతియేమిటి? నీ భార్యలాంటి అందమైనపిల్ల, నీ వంటి మారసుందరుడు వున్నారట్రా. మీ రిద్దరూ సినీమాలో చేరి ప్రపంచానికి ఆదర్శ రంగనక్షత్రా లెందుకు అవరాదూ!'

'డగ్లాసు ఫైర్ బాంక్సు మేరీఫిక్ఫోర్డు అంటావా మేము?'

'ఆ అదే!'

'మన దేశంలోని నవీనతారలతో పోల్చావుకాదు నీ పుణ్యమా' అని లక్ష్మీపతి అందుకొని, 'మన దేశంలో నాటకాలు ఎందుకూ పనికిరాకుండా తయ్యారవుతున్నాయి, నానాటికీ' అన్నాడు.

నారా :—పరమేశ్వరుడు చక్కని పిల్లలా ఉండేవాడు. ఎప్పుడూ ఆడవేషమే వేస్తూ ఉండేవాడు.

పర:—నువ్వో, నువ్వు కృష్ణుడు అష్టమిడు, హరిశ్చంద్రుడు వెయ్యలేదట్రా కాలేజీలో.

నారా :—నా వేషాల కేమిగాని నువ్వుకూర్ద్రిగారి తరఫీదున ఇంగ్లీషు నాటకాల్లోకూడా ఆడవేషం వేసినవాడవాయెను.

పర :—లక్ష్మీపతికూడా ఆ రోజుల్లో బూడిద పూసుకున్నవాడేరా !

లక్ష్మీ :—ఆ ఏవో బంట్రోతు వేషాలేగా మనపాలిటికి.

నారా :—నేను వచ్చేటప్పటికే ఆ మహానుభావుడు వెళ్ళిపోయాడురా !

పర :—నువ్వుంటే నిన్ను వదలియుండునా ? నీ ఆటలు, నీ తెలివిడేటలు, నీ గొంతులో పాటఃచూచి నిన్ను సర్వవిధాలా గౌరవంచేసి యుండును.

లక్ష్మీ :—నాటకాలు పాశ్చాత్య దేశంలో ఉన్నట్టున్నాయిరా మనదేశంలో పర మేశ్వరం ?

నారా :—ఎట్లావుంటాయి బావా ! వాళ్ళకి డబ్బువుంది. వాస్తవమా అనే భ్రమ కల్పించడానికి తగిన పరికరాలు లక్షలు కర్చుచేసి సమకూర్చు కొంటారు. నిజమైన గుఱ్ఱం ఎక్కివస్తారు. రంగంమీద ఉత్తరధ్రువం కల్పిస్తారు. తెరలు రంగస్థలంలా కనబడతాయా ? అసలు ప్రకృతి అయిపోతాయి. నిజమైన గుళ్లూ, గోపురాలు, మేడలా, మిద్దెలూ అయిపోతుంది రంగస్థలం.

పర :—డబ్బుగలవాళ్లు కాబట్టే, పదిహేను రూపాయలు టిక్కెట్టుపెట్టినా వెడతారు. లక్షలకొలదీ డబ్బువస్తే, వేలకొలది జీతాలుయిస్తే, దేశంలోఉన్న తెలివైన వాళ్ళు ఇతర ఉద్యోగాలకి తిరగరు. అదీ ఒక గొప్పవృత్తే. ప్రభుత్వంకూడ 'సర్' మొదలైన బిరుదావళులు యిస్తుంది. ఇంతకూ మనదేశం బీదది.

లక్ష్మీ :—నారాయణుడు అనడమూ, నువ్వు తందాన తానా ! ఆ బాగుంది. అదంతా నేను ఎరగనిది కాదోయి. నా ఉద్దేశం, మన వీధి నాటకాలకన్నా వాళ్ళ నాట కాలు, ఎక్కువ అందంగా ఉంటాయని.

పర :—ఆగు, ఆగు ! మన వీధినాటకాలకిమల్లే వాళ్ళకి వీధినాటకాలు వుండేవి. వాళ్ళనాటకాలకిమల్లే మన సంస్కృత నాటకాలు లేవురామరి !

నారా :—తెలుగుదేశంలో ఉన్నాయిరా పరం ! సంస్కృత నాటకాలంటివి ?

పర :—లేవు, కాని యక్షగానాలూ, భామకలాపం, గొల్ల కలాపం, వీధినాటకాలూ ఉన్నై. సంస్కృతనాటకాలూ ఆడేవారు.

లక్ష్మీ :—తెలుగులో యిప్పుడు వచ్చాయి కాని పూర్వం లేనట్లు ఒప్పుకున్నారా ?

నారా: పర :—ఆ !

లక్ష్మీ :—సంస్కృత నాటకం, ఇంగ్లీషునాటకం వంటివేనా ?

నారా :—అవును. కాని మన సంప్రదాయం వేరు, వాళ్ళ సంప్రదాయం వేరు, అంతే ! తక్కిన 'ఫక్కీ' అంతటా ఒకటే. లోపల భావాలు వేరన్న మాట.

పర :—వాళ్ళ ఆశయం ప్రాపంచికం, మన ఆశయం అధ్యాత్మికం. అంతే తేడా.

లక్ష్మీ :—మన వీధినాటకాలు వాళ్ళకున్నాయా ?

నారా —' ఓపెరా ' లేదు బావా ? అది మన వీధినాటకానికి ఒక మోస్తరుగా సరి పోతుంది. ఆ ఓపెరా, సాధారణనాటకం రెండూ కలిపితే మన వీధినాటకం అవుతుంది.

లక్ష్మి —కాని ఎల్లా భరించగలవురా ఆ తందానతాన, ధిమికిట ధిమికిట. రాజుభార్య కూడా గంతులు వెయ్యడమే. సంభాషణా మాట్లాడడం వుండదు. అందరూ కలసి గంతులూ ! నువ్వు ఎవడవురా ? నువ్వు యెవడవురా ? అని పల్ల విని పట్టుకొని ' నువ్వూ ! యెవడవురా ? ' అని తణికితతోం అని యిటు గంతు, అటుగంతులో కథానాయికమైన చ ంద్రమతి తన్మయం ఐపోవడం. ఏమిటిది ? నాకంతా ప్రహసనంలా వుంటుంది. అదీ కాకుండా ఒక్కొక్క ప్పుడు ఈ పాత్రధారులు ఏ రాజువేషమో వేసికొని ' రాజు వచ్చే సభకూ పురప్రముఖు లందరూ కొలువ ' అని అంటూవస్తారు. అదేమి అభినయ మోయి వెట్టికాయా ?

నారా :—బావా ! నువ్వు చెప్పిన దోషాలు దోషాలు కాదోయి : అసలు దోషాలు వేరు. ' మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః ' అన్నట్లు వీధినాటకానికి ఏవి నిజమయిన అందం సమకూరుస్తున్నాయో అవే బాగా లేవంటావు ఏమిటి ?

పర :—లక్ష్మీపతీ ! వినరా వెట్టివాడా ! శాస్త్రం చెప్పినట్లుగా అభినయం చేసేటప్పు డుండే, నువ్వు ఏపాత్ర అభినయిస్తున్నావో ఆ పాత్రే అయిపోవాలి. అది కాకుండా రెండో ముఖ్యమయినసంగతి ఏమిటంటే, నువ్వు ఎప్పుడూ సంపూర్ణంగా ఆ పాత్రవు కావు కాబట్టి నువ్వు ఆ పాత్రను కాను, ఆపాత్రను అభినయిస్తున్నాను అని తెలపాలి. అభినయము ఒక కళ. దానివల్ల చిత్ర లేఖనంలోవలె మానవుణ్ణి ఆనందంలో ముంచివెయ్యాలి. భ్రమను కొల్ప డమే ముఖ్యసాధనంగాఎంచుకుంటే, ఈకళ ప్రాపంచికంలోకి దిగిపోతుంది.

లక్ష్మి :—ఒరే నువ్వు మాట్లాడింది కవిత్వం కాని వాదనకాదు. వాడి ఉద్దేశం నువ్వు చెప్పు, బావా !

నారా :—విను. భరతదేశంలో కళ లన్నీకూడా కళాస్రష్టయొక్క ఆశయము వ్యక్తీ కరిస్తాయి. ఇదే నిజము అయివుంటుంది అవి భ్రమ కొల్పడానికి ప్రయ త్నించవు. అది అభినయంలో చూపించాలంటే, వీడేసుమా హరిశ్చంద్రుడు అని భ్రమింప చేయడానికి ప్రయత్నించక, నా హృదయానికి హరిశ్చంద్రు డిట్టివాడు సుమా అని చెప్పుతూ నేను హరిశ్చంద్రుడి వేషం వేస్తున్నాను అన్నట్లు తెలియజేస్తూ, హరిశ్చంద్రుడు ఇట్లనవచ్చును. అని వ్యక్తీకరిస్తాడు. తర్వాత తానే హరిశ్చంద్రు డవుతాడు. అంటే తనఆశయంలో హరిశ్చంద్రు డిట్టివాడు. ఆ హరిశ్చంద్రుడే నేను అన్నట్లు అభినయం చెయ్యాలి.

లక్ష్మి :—మీరిద్దరూ ఒకేరకంగా చెప్పారు. ఇంకా విపులం చెయ్యాలి.

## ౨

## శోభన మందిరము.

ఎప్పటికిని సాయంకాలము కాదు. పేక ఆడినాడు నారాయణరావు: 'బ్రిడ్జి', 'చెస్సు' 'లిటరేచరు,' ఎన్ని ఆడినా తోచినదికాదు. హిందూదేశం అంతట, క్లబ్బులలో, గ్రంథాలయములలో, ఇండ్లదగ్గర, పాశ్చాత్యదేశమునుండి పందొమ్మిదవ శతాబ్దిలో దిగినదీ పేకాట 'బ్రిడ్జి'. ఆ ఆటలో మహారాజువంటిది. ఆ యాటలో మన ఆంధ్రులు శక్తిసామర్థ్యములు సముపార్జించుకొన్నారు. నెమ్మదిగా, ననేక భేదములతో 'బ్రిడ్జి' యాట దేశమంతటను, పల్లెటూళ్ళకును గూడ బ్రాకినది.

'బేస్తాట' ప్రత్యేక మాంధ్రులసొత్తు కాని డబ్బు మేజుపెట్టి యాడినచో నంత నష్టముండదు. అర్ధణా, అణా బేడ మేజుపెట్టి సంసారములు ధ్వంసము చేసికొనువారు కొందరు, కొందరదేవృత్తిగా ధనము సంపాదించుకొనువారు. జూదమే అని చెప్పదగిన 'రన్ మోరు' అనునాట కొందరు రహస్యముగా నాడుచుందురు.

ఈ ఆలోచనలతో నారాయణరావు బేస్తాటలో రెండు రూప్యము లోటుపడి, ఎపుడు ప్రొద్దు కుంకునాయని ఎదురుచూచుచు, హృదయములోని భావములు పరమేశ్వరునికి దక్క నెరికిని దెలియనీయక గడియ లెక్కిల్లో వెడలబుచ్చెను.

రాత్రి శుభముహూర్తము సమీపించినది. నారాయణరావు వంగపండుచాయ పట్టుతాపితాలతో వచ్చి పీఠముచెంత నిలిచినాడు. శారద వెలవెలబోవు మోముతో వెండిపళ్ళెరాన గుమ్మడిపండు, నారికేళబొండము, అరటిపళ్లు, ఖర్జూరఫలములు పసుపుకుంకుమ మంత్రాక్షతలు మొదలగు వస్తువులతో బ్రక్కనే నిలిచియుండ, భూదేవత లనుజ్ఞ నొసంగి మంగళపీఠములపై కూర్చుండ నియమించిరి. శ్రీ గణేశ్వరుని దంపతు లర్చించిరి.

కర్మణః పుణ్యాహవాచనము పురోహితులు జరిపించిరి. భార్యాభర్తలకు జమీందారు దంపతులు కట్నాల నొసంగిరి. దంపతులకు బ్రహ్మముడిని రచించినారు వసిష్ఠుః. దేవర్షులు ప్రత్యక్షమై దివ్యమంత్రములు పఠించినట్లయినది. మంత్రములు మిన్నుముట్టి దిక్కులగలసిపోయినవి. శుభముహూర్త మరుగుదేర మంగళవాద్యములు మ్రోగించినారు.

'ఆరోహోరు ముపబర్హ స్వబాహుం పరిష్వజస్వ' అని వధూవర సంశ్లేష సంయోగమంత్రము వసిష్ఠాది భూదేవతలు ప్రారంభించిరి. అహో! ఈ సంగమ ధర్మమును మహోత్తమ స్థితికి గొనిపోయినదా ఆర్యధర్మము? నారాయణుడు దివ్యుడే అయినాడు.

భార్య కెడమవైపున గూర్చుండి, కుడిచేత నామె తనువల్లిని చుట్టి, ఫలములతోనున్న పళ్ళెరమును బట్టుకొన్న దివ్యక్షణము లాతని నానంద తన్మయుని జేసినవి.

తం మే వాయో సమర్ధయ ఆశీర్వాదము లైనవి.

భార్యాభర్తలను లోనికి గొనిపోయి పాయసము ద్రావించినారు. వారి నిరువుర శోభన మందిరములో, శోభన తల్పాన కూర్చుండబెట్టినారు.

శోభన మందిరము దివ్యకళామయముగ సమర్పబడినది. గోడలు పాలరాతివలె స్నిగ్ధముగా. నందలాలు, ప్రమోదకుమార, అవనీంద్ర, దేవీ ప్రసాదరాయ, అసితకుమారాది చిత్రకారకుల చిత్రములు; దామెర్ల రామరాయలు, పరమేశ్వరమూర్తి మొదలగు నాంధ్ర చిత్రకారకుల చిత్రములు అందందు మనోహరముగ వ్రేలాడదీయబడినవి. విశాలమగు నా మందిరమంతయు రంగు రంగుల దీపముల శబల కాంతులచే దీప్తిమంతమైపోవ, పట్టుజాలరులు, కలంకారీ తెరలయందములు విరిసిపోవ, నిలువుటద్దములు తమ హృదయములలో మందిరాంతరములు వేనకువేలు సూప, దంతపుబల్లపై చందనపు వెండి రాగి విగ్రహములు; కొండపల్లి, నక్కపల్లి కట్టబొమ్మలు; ఆగ్రా స్ఫటికశిలాప్రతిమలు; లక్నో లోహసామాగ్రులు, మెరుగులీన, నాగది నల కూబరుని కేళీమందిరమై విలసిల్లిపోయినది. దంతపుకోళ్ళ పెద్ద పందిరి మంచము, చిత్రమగు తెరలతో, పాలసముద్రమువంటి దుప్పటితో, పట్టు ఉపధానములతో, నలంకారములతో చిత్రవిమానమువలె నున్నది. పరుపు హంసతూలికలతో కూర్చినది. ఒకచో రంగుదుప్పట్లుపరచిన బల్లపై, చెన్నపురిలో ఆంధ్రదేశములో దొరుకు చక్రకేళులు, బత్తాయిలు, సాతుకుడులు, అనాసలు, అంజూరలు, దానిమ్మలు, కాబూలి ద్రాక్షలు, కిసిమిసులు, నాగపూరు సంత్రాలు, కర్బూజలు, మామిడిపళ్లు, పచ్చవాలప్పణి, నేంద్రవాలప్పణి, మలైవాలప్పణి మొదలగు నరటులు, సీమరేగులు ఇంకను వివిధ ఫలములు; వేరొక బల్లపై మినపసున్ని, అరిసెలు, లడ్డు, బర్ఫీ, దూద్‌పేడా పాదుషా, జాంగ్రి, మైసూరుపాకు, రసగుల్లా, సందేష్, పకోడీ, కారపుపూస, జీడిపప్పు, బూంది, మొదలగు పెక్కు తినుబండారములు నున్నవి. బల్లలకడ సోఫాలున్నవి. అగరువత్తులు సుగంధపు బొగలు నెగపోయుచుండెను.

జమీందారుగా రీమందిర మలంకరించుటకై చెన్నపట్టణమునుండి నూరు రూకలు రానుబోను కర్చుల నిచ్చి యొక శిల్పిని తీసికొనివచ్చి నారట. కొన్ని లక్షల మల్లెమొగ్గలతో, కనకాంబరాలతో, గులాబులతో శోభన మందిరము మధ్య తూగుటుయ్యల నమర్చినారు.

అప్సరస్సమూహమువలె అలంకరించుకొని వనితాబృందమంతయు నా మందిరము చేరవచ్చెను. భార్యాభర్తలచే దంపతులకు తాంబూలమును రవికలగుడ్డలు పళ్లదక్షిణలు నిప్పించిరి.

నారాయణరావు హాసప్రఫుల్ల వదనముతో, మెరుపు లీను కన్నులతో భార్యకు నత్తరువు నలందినాడు, గంధము పూసినాడు, తాంబూలము కొనపంట గౌరికి యిచ్చినాడు మనసుందరుడగు నారాయణరా వప్పుడు ప్రణయమున మరియు సుందర సుభగత్వపూర్ణుడై ప్రకాసింప, వదినగారు శకుంతలాదేవి చెల్లెలి భర్తను జూచి

యాతడింత యందగాడా యనుకొన్నది. ఆమెకు తనపునస్సంధానము జ్ఞప్తికి వచ్చినది. నారాయణరావు చూపు హావభావ విలాసములు తనభర్త చూపలేదు ఏమిది! యీతనివంటివాడు తనవారిలో నెక్కడ, నెవ్వడు లేడుగదాయని మురి యుచు నామె తనమరది నేదేని వ్యాజమున ముట్టుకొనుచు, నాతనిచే తనచెల్లెలికి నత్తరు వలంపచేసినది. చెల్లెలిచే నతని కలదించినది. తాంబూలము లిప్పించినది సూర్యకాంతము జానకమ్మగారు మొదలగువా రానందమున నోలలాడినారు. జమీందారుగారి చుట్టపు సుందరీమణులు, నారాయణరావుచుట్టు మూగిపోయినా రావేళ.

శారదకు చైతన్యములేదు. ఆమె వదనాన నలముకొన్న విచార తమస్సును నారాయణుని తనుమనః ప్రభాజ్యోత్స్నలుకూడ పారద్రోలలేదు.

బాలికలు కిన్నరీ కంఠముల పాటలు పాడినారు. శారద మాత్ర మెంత వేడి నను పాటపాడినదిగాదు. వియ్యాలవారి పాటలు, శ్రీ రాధికా కృష్ణ గీతములు పాడి నారు కొందరు బాలలు - రాత్రి రెండవ యామము దాటునప్పటికి తలుపులు మూసి, అందరును వెడలిపోయినారు. శకుంతల శారద నావలి కొకసారి తీసికొని వెళ్ళినది.

నారాయణరా వరగంటవరకు హృదయము గబగబ కొట్టుకొనుచుండ మంచమునుండి దిగి యొక సోఫాపై కనుపెట్టికొనియున్నాడు. తన చిన్నారి భార్యకు మన్నస్సెట్టులున్నదో యని యూహించుకొన్నాడు. అతనిని తేనెతీపు లావరించుకొని పోవుచున్నవి.

ముప్పాతిక గంటయైనది. ఇంకను వధువు లోనికి రాలేదు.

నారాయణరావు లేచినాడు. గదిలోని యలంకారములు తిరిగి చూచినాడు. కాని యాతని దృక్కులకు శారదా విగ్రహము తప్ప నేమియు గానుపించలేదు. శారద సర్వాభరణభూషితురాలై యున్నది. ఆ బాలకు నా దివ్యమోహనమూర్తికి నలంకారములేల? సాయంసమయముననే కోసిన గులాబిపూవులతో నామె శిరోజ ములు కప్పివైచిరి. కట్టిన చీర ఎంత విలువగలదైన శారదా సౌందర్యము మ్రోల నగలతో బాటు వెలవెలలాడిపోయినది అనుకొన్నాడు. ఆమెను ముట్టినప్పుడెల్ల పులకరింపులు, మలయమారుతమునకు పుష్పభరితమాలతీలత జలదరించినట్టు అతని నావరించుకొన్నవి.

ఒంటిగంటయైనది. ఇంకను శారదను లోనికి బంపలేదు. గడియారమువంక జూచి నారాయణుడది యంతయు దంతులోని భాగమాయని సందేహించినాడు. అతని దేహము మధురాతిమధురమగు నొక మత్తుచే నావరింపబడినట్లయినది. తానిది వరకు జూచిన పునస్సంధానముల కిట్లాలస్యము చేసినారా?

లేచి యాతడు తల్పముపై పరుండినాడు. ఈ తల్పము పురాతన తల్పము వలెనున్నది. ఇయ్యది తన మామగారి పూర్వీకులదేమో?

ఒక దేశమున కొక యాచారముండునుగాబోలు. ప్రథమ సమాగమ సమయ ములందు ముగ్ధలగు బాలిక లెట్లు చరింతురో,

స్త్రీ పురుష సమాగమమింత మాయామోహితమ ... నప్పుం ... మూలమట్టు ముగ కదలించివేయునుగదా స్త్రీ పురుష సమాగమము! తన సర్వస్వము దారపోయ గలడు మనుజుడు స్త్రీకై. స్త్రీ పురుషుల ఈ ...
పోవునట!

తానెట్లు సంచరించవలయునో?

గడియారము మృదుస్వనమున రెండుకొట్టినది.

చటుక్కున శారదను లోనికంపి శకుంతలయు, వారి మేనత్తయు పైకివెడలి తలుపుపైనగొళ్లెము వేసినారు.

అంతయు నిశ్శబ్దము.

ఆ నిశ్శబ్దములో వెక్కి వెక్కి లోలోదుఃఖించు శబ్దము నారాయణరావునకు కర్ణగోచరమైనది. ఆతడులికి పడినాడు. శారదయే యేడ్చుచున్నది. ఏమది? సిగ్గుకాబోలు! భయమా? అది కొంత సేపటికి తగ్గునేమో? ఏమి చేయవలె ఆతనికి సిగ్గువేసినది.

ఆతడు నెమ్మదిగాలేచి శారద కడకు బోయి 'శారదా! ఇక్కడనిలుచు న్నావేం?' అని యడిగినాడు. శారద మాట్లాడలేదు. ఆమె యింకను భుజములు కదల్చుచు లోలోన నేడ్చుచున్నది.

ఆతని హృదయమున అనుకంప వెల్లివిరిసి యుబికి దిశల నాక్రమించుకొని పోయినది. ఆమెను దరికి జేరదీసికొన్నాడు. శారద కుంచుకొని పోయినది. ముకుళించుకొనిపోవు పుష్పమైనది.

'ఎందుకు నువ్వు ఏడుస్తావు పిచ్చిదానా! నిన్ను ప్రేమించి నిన్ను నాలో చేర్చుకొను ప్రేమమూర్తినిసుమా. నీ వంటి దివ్యసౌందర్యమూర్తి నాకు ప్రణయిని అయిందంటే నా అదృష్టంకాదా శారదా? ఈ నన్నావరించివున్న యీ పురుషత్వ సౌభాగ్యం, నా తెలివితేటలు, నా సమస్తం నీ పాదాలకడ అర్పిస్తున్నా. నే నింత వరకూ ఎవరినీ ప్రేమించలేదు శారదా? ఏ నాడు నిన్ను చూచానో ఆ క్షణంలోనే, నా హృదయేశ్వరి, నా జీవితేశ్వరి, ఈమే యనుకొన్నాను!' అన్నాడు.

శారద గుండె చెదరు నట్లేడవ దొడంగెను. నారాయణరావు చకితుడయ్యెను. ఆతని హృదయము కుంచుకొని పోయినది. ఆతడు తెల్లపోయినాడు. ఆ బాలిక గచ్చుటనే వదలివచ్చి యొక దిండ్ల కుర్చీపై కూర్చుండెను. అంచేతిలో మోమునాన్చి శూన్యమనస్కుడై శూన్యమగు దెసల జూచినాడు నారాయణరావు.

అరగంట అయినది. శారద యేడుపు తగ్గినది. నారాయణరావు శారదవైపు చూచుచు, నామెయందము తనివితీర గ్రోలుచు, హృదయమును సమాధానపరచు కొనుచు, నట్లేయుండెను. శారద తలుపు మూలనే నిలుచుండి యున్నది. పదు నైదేండ్లు నిండిన నవయౌవన సౌందర్యపూర్ణ! ఏమి యీ చిత్రము! లోకములో సిగ్గులున్నవి. కోపములున్నవి. కాని చదువుకొన్న నాం ప్రవేశ పరీక్షలో విజయము

గాంచినది. కళాహృదయ. ఏమిటి విచిత్రము? నారాయణరావా బాలిక నా యాలో చనలతో నట్లై తేరిపార జూచుచుండెను.

కొంతవడికి నారాయణరావు లేచి 'శారదా నువ్వు మంచము మీద పడుకో. ఇక్కడ ఇల్లా నిలుచుంటా వెందుకు' అని యామెను పుష్పమువలె నవలీలగ నెత్తి తన హృదయమున కదుముకొని ముద్దునిడబోవ నా బాలిక చటుక్కున మోము వెనుకకు త్రిప్పుకొన్నది. నారాయణరావు సిగ్గుపడి యామెను గొనిపోయి పర్యంక మున బన్నుండబెట్టెను. ఆమె మరుక్షణమున లేచి, మంచముదిగి, మరల గది గుమ్మము కడకేగి నిలుచున్నది.

అది యంతయు నభినయము కాదుగద. స్త్రీలు కేళీమందిరమున ప్రథమమున నిట్లే చరింతురుకాబోలు. అట్టియప్పుడు తా నేమి చేయవలెను? రాజారావుకాని, పర మేశ్వరుడు కాని వారి ప్రథమ సమాగమదినము వర్ణించి చెప్పి నప్పుడిట్టిరీతి చెప్ప లేదు! రాజారావును భార్యయు కొంచెము సిగ్గుపడిరో లేదో, తలుపువైచిన యర గడియకే వా రిరువు రొకరి కౌగిలింతల నొకరు మరిగిపోయిరట. పరమేశ్వరుని భార్య ఇంకను కొంచె మాలస్యము చేసినది. కాని, రెండు గంటలలో సంపూర్ణముగా ప్రాణకాంతు హృదయమున ద్రవించి పోయినదట. ఇంకను పెక్కురు స్నేహితులు చెప్పినారు. కాని ఈ వైపరీత్యమేమి?

'శారదా నువ్వు చదువుకున్నదానవు, తెలివైనదానవు ఏమిటీ సంగతి?' యని భర్త శారదను బ్రతిమాలినాడు శారద యంత మొండియైనదేమి?

శారద తన్ను ప్రేమించుట లేదేమో? యని యొక్క యశరీరవాణి ఆతని హృదయమునకు మెరుమువలె ప్రత్యక్షమైనట్లయినది. తాను కురూపియా? మూఢుడా?

అనురక్తి విరక్తులకు మనుష్యుని రూపముగాని, గుణగణముగాని, యాతని తెలివితేటలుగాని కారణములుగావు. పూర్వకర్మయే కారణము కాబోలు. ఈ మానవ హృదయ గ్రంథాంతరార్థములు కనిపెట్ట గలిగినవాడు మహానుభావుడు.

శారదకడకు మరల నారాయణరావు పోయినాడు. ఆ బాలిక నిలుచుండలేక యచటనే యా గదియంతయు బరచియున్న రత్నకంబళిపై కూలబడినది.

## రిక్తకాంక్షలు

అప్పటికి గడియారము మూడున్నర కొట్టినది. శారదకడకుబోయి యచ్చట కూర్చుండి 'ప్రాణేశ్వరీ శారదా! ఈ శుభముహూర్తం ఇల్లా గొడ్డువేళ కాకూడ దేమో? నువ్విట్లా పడుకోడం బాగుండదు. వచ్చి ఆ మంచముపైన పడుకో, నీకు ఇష్టం లేకపోతే నేనా సోఫాపైన పడుకుంటాను. మనం వృథాగా మేలుకొని ఉండం ఎందుకు?.........!'

ఆమె తలవంచి యట్లేకూర్చున్నది. 'ఒకటి మాత్రం మరువకు సుమా! నేను నీకు భర్తనయ్యాను కదా అని, నా అధికారాలుగాని, నా కున్న హక్కులు గాని నేను కోరను. నీకు యిష్టం లేదంటావా; నా మొగము నీకు మళ్ళీచూపను. నీ మనస్సు కష్టపెట్టుకొనకు. మనము చదువుకొన్న వాళ్ళము. నువ్వా పరీక్షలు నెగ్గు తున్నావు. నాగరికురాలవు.'

శారద మాట్లాడలేదు.

నారాయణరావు తిన్నగా పోయి, యొక సోఫాపై చదికిలంబడి నిట్టూర్పు నించి, హృదయ పుటమున పావకజ్వాలలు సెలరేగ, చేతితో మొగము గప్పుకొని యాసోఫాపై వాలిపోయినాడు.

శారద పరీక్షలో నెగ్గిననాటినుండి తాను విద్యావతి ననియు నాగరక వనిత ననియు విఱ్ఱవీగినది. నవలలో జదివినయట్లు చదువుకొన్న 'విద్యావంతురాలు' ప్రేమయొక్క తత్వము దెలిసికొనవలె. ప్రేమాస్పదుడు గాని పురుషుడు పరపురుషుడే. ప్రేమబంధనమే విధివిహిత మగు వివాహబంధనము.

ప్రేమాస్పదుడు గాని పురుషుని స్పృశించుటెట్లు? అమెరికా 'దొరసాని', యామె యుపాధ్యాయురాలు ప్రేమతత్వ మామెకు బోధించినది. పాశ్చాత్యదేశముల ముఖ్యముగా నమెరికాఖండములో పొరబడి వివాహముచేసికొన్న స్త్రీ పురుషులు ప్రేమ లేదని గ్రహించిన నిమిషమున నా వివాహము రద్దుచేసికొనెదరట, ఒకరి మీద నొకరికి ప్రేమలేదని తెలిసిన మరుక్షణము ఒకరి నొకరు ముట్టుకొనరట.

ఆమె ఇంటరు పరీక్షకు దీక్షతో జదువుచున్నది. ఇంటికడనే యుండి చదువుచున్నది. చదువుకొను నితరబాలికలతో స్నేహము కుదిరినది. చదువుకొను బాలలు వివాహము చేసికొనుటకన్న వేఱు పొరపాటు లేదట. పాశ్చాత్యవిద్య చదువుకొను బాలలకు హృదయమున మంచుతెరలు విడిపోవునట. మొరకులగు స్త్రీలకు ప్రేమ స్వరూపమే తెలియదు. వారు పశువులవలె నత్తవారిండ్లకు వెళ్ళెదరు. వారు భర్తకు సొత్తయి యాతడేమిచేసినను భరించి జీవితాదర్శముల నెరుంగక నశించి పోవు చుందురట. కాని చదువుకొను బాలలకు ప్రేమయన నేమియో తెలియును. వారి హృదయమున ప్రేమోదయము కాని యప్పుడు వారెట్లు వివాహము చేసుకొందురు? ప్రేమకుదిరినచో నా పురుషునకు వారు సర్వస్వము ధారవోయుదురట.

ఈ విషయములన్నియు నా బాలికలు చర్చించు కొన్నారు. తనకు వివాహమైనది. తాను భర్తను ప్రేమించుటలేదే! తన కుటుంబమ్ము వేరు. తన భర్త కుటుంబము తన తండ్రిగారికడ సేవకావృత్తి చేసికొనవలసిన పల్లెటూరి కుటుంబము చదువున్ననేమి? వారికి దర్జాలేదు. క్రిష్టియనులు, మొదలగువారు చదువుకొనుటలేదా! ఇక బలిష్ఠపు దేహమా? అది కూలివాండ్ర కందరకు నుండును. ఆ సంగతే తన మేనబావయగు రాజా జగన్మోహనరావు తనతో వేసారులు చెప్పియున్నాడు.

జగన్మోహనుని గౌరవము, ఆతనిదర్జా, రీవి తన యత్తవారికెట్లు వచ్చును? తాను జగన్మోహనుని ప్రేమించుచున్నదా? తాను చెప్పలేదు. తన్ను జగన్మోహన రావు బావ ప్రేమించుచున్నాడు. ఆతనికి ప్రేమించుట తెలియును. తక్కువజాతి వారికి ప్రేమించుట యెట్లు తెలియును. తాను జగన్మోహనుని ప్రేమించినది, లేనిది ప్రస్తుతము తనకు దెలియకపోయినను, తన భర్తను ప్రేమించుట లేదన్నమాట మాత్రము నిశ్చయము.

నెలలు గడిచినవి. ఇంటరు పరీక్షగ్రంథములు చదివించు నమెరికావనితామణి తనకు పాఠములు చెప్పు సందర్భమున జమీందారులు, ప్రభువులు నమెరికాదేశములో లేరనియు, ఈదినమునఁ బాకీపనిచేయు పురుషుడు రేపు అమెరికా దేశాధ్యక్షుడు కావచ్చుననియు, గావుననే జమీందారులన్న పదమే తన దేశములో నుపయోగింప రనియు జెప్పినది.

అప్పుడు శారద కా ఉపాధ్యాయినియెడ కోపము వచ్చినది. గాని భర్తయన్న నసహ్యాము పోలేదు. తనకు పునస్సంధాన మహోత్సవ మన్న మాట వినబడిన తోడనే యామె గజగజ వణకిపోయినది. తన కక్కఱలేదని తల్లిదగ్గర కంటనీరు పెట్టుకొన్నది. తల్లి జమీందారుగారి కడకుబోయి 'అమ్మాయి కిప్పుడు కార్యము చేయుట నా కిష్టము లేదండి' యని యన్నది.

'ఎందుచేత?'

'అదియింకా చిన్నపిల్ల.'

'పదహారో ఏడు జరుగుతూంది. పద్దెనిమిదేళ్ళ వరకు ఉంచడం బాగానే ఉంటుంది. కాని దాని యత్త పూర్వకాలపురకం. వియ్యంకుడుగారు కోరుతూ ఉత్తరము వ్రాశారు. వారిమాట కాదనలేక సరే అంటూ ఉత్తరం వ్రాశా!'

'అల్లాంటి చాదస్తపు పూర్వకాలపు సంబంధం యెందుకు చేశారు?'

'వాళ్ళు పూర్వకాలపు మనుష్యులయితేనేమి? వాళ్ళంత మర్యాదస్థులు ఉదార హృదయం కలవాళ్ళు మన నియ్యోగుల్లో ఇంకోళ్లలేరు. పిల్లవాడు మహారాజులకు అల్లుడు కాదగిన మహానుభావుడు. నిజంగా అటువంటి అల్లుడు నాకు లభించడం వల్ల నాజన్మ పావనమయిందని నా ఊహ!'

'మీకు మీ అల్లుడంటే మహాపక్షపాతం. ఏది ఎట్లాగయినా మీరీ కార్యంమాట ప్రస్తుతం ఆపుచెయ్యండి. అది నా ప్రార్థన.'

'మాట యిచ్చాను. బహుశా వేసవికాలందాక గడుపుతాను అమ్మాయి పెద్ద మనిషి అయి ఏణ్ణర్థం అవుతుంది. క్రిష్టమసు నెలరోజులలో వస్తుంది. అప్పుడీ శుభకార్యం చేయిస్తే బాగుంటుంది అని వ్రాశారు సుబ్బారాయుడుగారు. నిన్న సరేనని రాశాను. ఇవ్వాళ వేసంగి సెలవులదాకా వీలులేదు అని వ్రాస్తాను.'

అప్పటికి తాత్కాలికముగా శారద కా యాపద గడచినది.

కాని సుబ్బారాయుడుగారు మరల చైత్రమాసములో జమీందారుగారి కిట్లుత్తరము వ్రాసినారు.

దివి 5 ఏప్రియల్ 1928 సం. మకాం కొత్తపేట.

మహారాజరాజశ్రీ శ్రీమంత పరరాజగండ, మహాభట్టారక శ్రీ శ్రీ రాజా తల్లాప్రగడ లక్ష్మీసుందర ప్రసాదరావు బహద్దరు జమీందారు బావగారి సముఖమ్మునకు.

ఉభయకుశలోపరి

ఇక్కడ అందరూ క్షేమం, అక్కడ శ్రీ శ్రీ మహాలక్ష్మి సమానురాలగు అక్కగారి క్షేమమున్ను శ్రీ శ్రీ గం॥ స॥ వదినగారి క్షేమమున్ను శ్రీరస్తు చిరంజీవి సౌభాగ్యవతులగు మాకోడళ్లు శకుంతలమ్మ, శారదల క్షేమమున్ను శ్రీ శ్రీ మా అల్లుళ్లు కుమారరాజా కేశవచంద్రరావు క్షేమమున్ను బంధు మిత్రాదుల క్షేమమున్ను వ్రాయించ కోరుచున్నాను.

తర్వాత; చి॥ మా అబ్బాయి కార్యము తాము వెనక తమ ఉత్తరములో సెలవిచ్చిన ప్రకారము ఈ వైశాఖమాసంలో శుభముహూర్తములున్నవి. తారా చంద్రబలాలు మొదలు సమస్త విషయాలతో గొప్ప ముహూర్తం కుదిరింది. కాబట్టి తా మా ముహూర్తము పరిశీలించి యనుమతించవలయునని ప్రార్థిస్తున్నాను.

చిత్తగించవలెను.

విధేయుడు

త. సుబ్బారాయుడు వ్రాలు.

కుమారుని పునస్సంధాన మహోత్సవము త్వరలో జరుగవలయు ననియు, కోడలు తన యింటికి త్వరలో గాపురమునకు రావలయుననియు మురియుచున్న నారాయణుని తల్లి భర్తను దొందరపెట్టి యుత్తరము వ్రాయించినది.

వియ్యంకుని యుత్తరము జమీందారుగారు భార్యకు జదివి వినిపించి యీ పట్టు తప్పదన్నారు. శారద కాసంగతి తల్లి చెప్పుటతోడనే యొకటి రెండుసంవత్సరముల వఱకు దప్పిపోయినదని సంతోషించిన యా బాలిక విచారగ్రస్తురాలయి, తల్లితో నెట్లయిన నింకొక సంవత్సరమువఱకు నిట్టివి తలపెట్టకుండ జేయవలెనని మరియు మరియు గోరినది. తల్లి భర్తకడకు బోయి శారద యింకను జిన్నపిల్లయనియు నిప్పుడంత తొందర యేమి వచ్చినదనియు బాలికలకు బదునెనిమిదవ యేటి వరకు వివాహము చేయించవలనుపడదని వాదించినవారిలో మీరొకరు కాదా యనియు నామె భర్తతో వాదించినది. జమీందారుగారి కామె చెప్పుముక్కలన్నియు సత్యపూరితములని తెలియును. ఈ పల్లెటూరివారిట్టి తెలివితక్కువ లేల జేతురోయని యాయన విసుగుకొన్నాడు.

భర్త వ్యతిరేకముగ నున్నాడనుకొని ఇప్పుడీ శుభకార్యము శారదకే యెంత మాత్రము ఇష్టములేదని జమీందారిణి చెప్పినది. జమీందారుగారు అ౦౹ శారద

కిష్టములేదా ? అవును చిన్నపిల్ల ఇంకను చదువుకొనుపిల్ల. ఆటల సరదా ఐనా వదల్లేదు. సంగీతము అదీ పూర్తికాలేదు నిజమే. గట్టిగా 'వీల్లేదు' అని రాస్తాను.'

'శారద కళ్ళ నీళ్ళు పెట్టుకొని యేడ్చింది గూడానూ!'

'శారదకంటిలో నీరే! అదేమిటి? నావెఱ్ఱితల్లి, శారదకు గంటినీరెందుకు? సిగ్గుచేతనేమో? చదువుచెడిపోవునని భయమా? చదువుకొన్న బాలికలు త్వరలో భర్తలయిండ్లకు బోవుటకిష్టపడరు. అయిన నెంత యాలోచించినను శారద కళ్ళ నీరు పెట్టుకొనునంతటి భయమేమియు గనబడదే?'

భార్యయు, నితర చుట్టములు, తన వియ్యాలవారిని అల్లుని హేళనజేయుట జమీందారుగారు గ్రహించినారు. అట్టి సందర్భములో నెంత యాలోచించిన, నాయ నకు పునస్సంధాన మహోత్సవ మాపుచేయుట కిష్టములేదు. కార్యమొనరించిన మరునాడే కాపురమునకుబోవ నవసరములేదుకదా. కాబట్టి శారద యేకారణమునను భయంపడ నక్కఱలేదు.

శుభకార్యము తప్పలేదు. శారద మరియు గారాముచేసి పట్టుపట్టినచో జమీందారు దేదేని వంకబెట్టి కార్యము మాన్పించునేమో. కాని శారదయు అది బాగుండదని యాలోచించినది. తప్పక కార్యమైన నేమిచేయవలె? భగవంతుడెట్టి కిష్టము దెచ్చిపెట్టినాడు. పేరునకు భర్తయైనను ప్రేమలేమి, పరపురుషుడేకదా! పరపురుషుడెట్లు తన్నంటుట?

## ౪

## 'నామీద ప్రేమలేదా?'

నాలుగున్నరగంటల కులికిపడి నారాయణరావు లేచిచూడ శారద తలుపు దగ్గరనే తివాసీపై పరుండి నిద్రపోవుచున్నది. ఆమె కన్నుల చుట్టు నీరు ప్రవహించి యెండియున్నది. పూవులప్రోవు వెదజల్లినట్లు, చెదరిన పైట, చీర, జడతో జడ లోని పూవులతో, విడి విడి రాలిన గులాబి రేకులతో ఆ సుందరీమణి, తన యిల్లాల టుల పరుండవలసిన గతియేమి? ఆమెకు దనయెడల ఎంతటి అసహ్యతయో? తానొక రాక్షసునివలె నామెకు కన్పట్టినాడు కాబోలు. పాపమా బాలికను వృథగా తనకు గట్టిపెట్టిరిగదా.

ఇంతకు దన్నాబాల ప్రేమింపకపోవుటకు దనయెడల నేమిలోపము కనిపెట్టి నదో? ప్రేమ విషయమున లోపములు, తాపములు గణనకు వచ్చునా? నిజము నకు మన భావనయే కాని ప్రేమ యను వస్తువున్నదా? అటులనుటకు వీలులేదు. తా నీ బాలికను జూచినప్పటినుండియు బ్రేమించుచున్నానని యనుకొనుటలేదా?'అను కొనుటయే కాదు నిజముగా ప్రేమించుచున్నాడు కదా! ఆమెకొఱకు పరితపించు చున్నాడు. ఆమెకు దన హృదయమున బట్టము గట్టినాడు.

ఈ బాలికకు దానన్న ప్రేమ లేమియే నిజమయినచో దానేమి చేయవలెను? ప్రేమలేని బాలికతో గాపుర మెట్లు? తమ కుటుంబములలో స్త్రీ పురుషులకు ప్రేమోదయ మైనపిమ్మట వివాహములు జరుగుచున్నవా? వివాహములై కార్యములైన వెనుక, నూటికి తొంబది దంపతులు సంతోషమున గాపురములు సేయుచున్నారే! వారు ప్రేమించుకొనుట యెరుగుదురా? యువకునకు యువతి గావలెను. యువతికి యువకుడు గావలెను. మన వివాహములలో మీరిరువురు నొకరి నొకరు కోరుట కలహాటు పడుడి. ఒకరికొకరు స్నేహితులు కండి యని మనకు నేర్పినారు. ప్రేమ కూడ కుదిరినచో వారి దాంపత్య ప్రవాహము గంగానదియే. లేనిచో స్నేహితులు గానైన సంసారయాత్ర సాగించుకొందురు.

కాని యీ బాలిక తన్ను గోరుట లేదా! ఇంక నెప్పుడు తన్ను గోరదా!

మరల తుదిప్రయత్నము చేయవలెనని యాతడూహించుకొని పరమ కరుణా మూర్తియై భార్య కడకేగి నిదురబోవు నా బాలికను, వాయువు సౌరభము నెత్తికొని పోవురీతి గ నిపోయి. మంచముపై బరుండపెట్టి తనివిదీర ముద్దుగొనెను. శారదకు చటుక్కున మెలకువవచ్చి లేచి ' అమ్మయ్యో ' యని దిగబోయినది.

' ఎవరైనా వింటే నవ్విపోతారు. మంచముపై పడుకున్నట్లయినా కన్పించడం మంచిది. తెల్లవార వచ్చింది లేచి వెళ్ళిపోవచ్చులే........ఆఖరిసారి అడుగుతున్నాను నీకు నామీద ప్రేమ లేకపోవచ్చును. కాని అనేకమంది సంగతిచూడు. మీ నాన్నగారి పెళ్ళి అయినప్పుడు మీఅమ్మగారిమీద ప్రేమచేత పెళ్ళిచేసుకొన్నారా? అయినా ఎంత ప్రేమగా ఉన్నారు. మీ అక్కయ్య మీ బావని ప్రేమచేత పెళ్ళిచేసుకుందా? అయినా దంపతు లిద్దరూ ఎంత ప్రేమగా ఉన్నారో? పనసతొనల్లాంటి బిడ్డల్ని కన్నారు. ఆ-లా-గే మీ కుటుంబంలోనూ, మాకుటుంబంలోను. మన దేశం అంతలో జరుగుతున్నాయే. నువ్వు చేసే విడ్డూరం ఎక్కడా లేదు శారదా- నేను మామూలు తుచ్ఛలగుభర్తలవంటి వాడను కానే? నాభర్తృత్వం నీకు హేయం ఐతే పోనీ, నా స్నేహమున లోపమేమున్నది? నేను కలుసుకొన్న ప్రతివాళ్లూ నేనంటే స్నేహంగా ఉంటారే? '

శారద తలవాల్చికొని యట్లే మంచముమీద కూర్చుండి యున్నది. నారాయణరా వామెమనస్సు కరుగుచున్నదేమో యనుకొన్నాడు. ధైర్యముచేసి యామెపై చేయివైచి చెంతకు లాగికొనబోవ నామె గింజుకొని 'అబ్బా నా-కి-దే-మి-టి-బాబూ ' అన్నది.

' నారాయణరావు విన్నబోయి యామెను జుట్టియుంచిన చేతులు విడదీసి దీర్ఘముగా నిశ్వసించి '

' నువ్వు నెమ్మదిగా తలుపుతీసికొని వెళ్ళిపో. నేను తెల్లవారువరకూ ఇక్కడుంటాను ' అని మంచముపై పరుండెను. శారద గది గుమ్మముదగ్గరకు వెళ్ళి తన యక్కగారు పైన గొళ్ళెమువేసిన సంగతి జ్ఞాపకము రానట్లే యచ్చట నిలు

చుండి పోయెను. నారాయణరావది చూచి యచ్చటకు బోయి, తలుపులాగి చూచుటయు నది తీసియేయుండెను. తా నప్పుడు వచ్చి మంచముపై పరుండి నిద్రపోయి నట్లు నటింపసాగెను.

ప్రేమకు దివ్యచక్షువులున్నవి. కావుననే ప్రేమాస్పదులగు వారి హృదయమును మనమిట్టె గ్రహింతుము. నాటిరేయి తనమఱిదియు జెల్లెలు న త్తరువు లలదుకొన్నప్పుడు తనచెల్లెలు భర్తయగు నారాయణరావును ప్రేమించుటలేదని శకుంతలాదేవికి మెరుపువలె దట్టినది. ఆమె హృదయము చలించినది. నారాయణరావునందామెకు ప్రేమ వెల్లువవలె బొర్లిపోయినది. ఆతడు తన భర్తయయినచో దనజన్మం సార్థకమయి యుండును గదాయని యనుకొన్నది. అందమయినవాడు. నిజమైన పురుషుడు ఉత్కృష్టమగు తెలివితేటలు గలవాడు. అంతకన్న ప్రేమింపదగిన భర్త దొరుకుట కలలోనివార్త. శారద వెఱ్ఱిపిల్ల. తనభర్తకన్న శారదమగడు సర్వవిధాల పూజింపదగినవాడు. తా నదృష్టవంతురాలని సంతోషించవలసిన శారదకు భర్తపై నింత హేయభావము కలుగుటకు కారణము దానిపెంకితనమే. తామందరు ఈబాలిక హృదయాన్ని పాడుచేయలేదా! ఈ కన్నతల్లి యెదుట తాను, తనతల్లి, అందరూ, తన మరదిని, దేవతా మూర్తియైన తన మరదిని, ఆడిపోసుకొనలేదా?

శకుంతలాదేవి చెల్లెలి హృదయమును మార్పబూని యామెకు బుద్ధులు గరపుటకు యీవలకు దీసికొని వచ్చినప్పుడు చెల్లెలితో 'శారదా! అదేమిటే అల్లా వున్నావు?' అని పల్కరించినది. శారద మాట్లాడినదికాదు. తల్లీ నీ భర్త చాలా మంచివాడమ్మా. ఆతనంత సరదాగా అత్తరూ అదీ పూస్తూఉంటే పెంకిదానిలా మూతిముడుచుకొని కూచుంటారటే! తప్పుకాదూ. అల్లాంటి భర్తే నాకు దొరికి ఉంటే ఈ జన్మలో నాకింకేమికావాలి? నీఅంత అదృష్టవంతురాలులేదు. మగవాళ్ళ మనసు చాలా సున్నితంసుమీ. నువ్వు పెంకిచేష్టలు చేసేవు! జాగ్రత్త! ప్రేమతో నీచుట్టూ కోటగట్టగల శక్తిగలవాడు. ఎంత అందమయినవాడు, ఎంత తెలివైన వాడు. చచ్చు జమీందారీ సంబంధాలు మహామంచివి అనుకున్నావు కాబోలు. నాబాధలు చెవులారా వింటంలేదూ నువ్వు శారదా!' శకుంతల యామె చెవిలో నెన్నేని చెప్పినది. శారద రోషమున 'ఇదివరదాకా నువ్వుకూడా వాళ్ళను నా నా మాటలు అనలేదూ' వెక్కి వెక్కి యేడువ దొడంగినది. అంతలో శారద మేనత్త యటకు వచ్చినది.

శారద లోనికి వెళ్ళనని పట్టుపట్టినది. జమీందారిణి, కొమారితకు భర్తపై నయిష్టమని తెలిసి సంతోషించినది. కాని గర్భాదానము నాటిరాత్రి కొమార్త గదిలోనికి వెళ్ళదనుట నలుగురకు దెలిసినచో నేమనుకొందురో యని భయపడి 'లోపలికి వెళ్లు తల్లీ' యని మాత్రమన్నది.

మేనత్తయు నక్కగారును రెండుగంటలు బతిమాలి, కోపపడి, వాదింప నప్పటి కాబాల విధిలేక హృదయ ముచ్చిపోవునట్లు వెక్కివెక్కి యేడ్చుచు లోనికి

బోవ సంసిద్ధయైనది. ముద్దుల కూతునుగాంచి జమీందారిణియు గంప్ల నీరుక్రుక్కు కొనుచు, బిడ్డను కవుగిలించుకొనెను. శకుంతల ఆదుష్పరియై, కోపమున కన్నులు కెంపెక్క 'అమ్మా ! నీకేమైన మతిపోయినదటే ? ముత్తయిదువులంతా వెళ్ళిపోయి రెండున్నరగంటలు కావచ్చింది. తెల్లవారిపోతోంది ' యని కేకలు వేసినది.

'ఏమి కామేశ్వరమ్మా ! బాగావుంది నేర్పుతున్నావు కూతురుకు బుద్ధులు. చాలు చాలు. ఎవ్వరన్నా వింటే నవ్వుతారు. తమ్ముడికిచెప్పిసిందంటే మన గౌరవాలు దక్కవు. ఇల్లాంటివి ఎక్కడా వినలేదు. చూళ్ళేదు. శారదా ! ఇల్లారా ' యని యా బాలికచుట్టు చేయిచుట్టి తలుపు తెరిచినది. శకుంతల యొకవైపు 'ఊరుకో. అమ్మా అతను చూస్తాడు ' అని చెవిలో నూది లోనికి ప్రవేశింపజేసినది. అప్పుడు వారిరువురు తలుపులు మూసి బైట గొళ్లెము పెట్టినారు.

చెల్లెలి విపరీతావస్థకు బెంగగొనియున్న శకుంతలాదేవి కా రాత్రి యంతయు నిదుర పట్టలేదు.

శకుంతలాదేవికి నిరువది యొకటవ సంవత్సరము. ఇరువురు బిడ్డల తల్లి, ఆమె శారదవలె నందకత్తియు. కాని రెండు కాన్పులైన వెనుక బొద్దయి, కొంచెము స్థూలమైన దామె దేహము. అయినను మేలిమి బంగారు దేహము. చెల్లెలికివలె, దల్లికివలె దీర్ఘమై నొక్కుడున్న జుట్టు, విశాలములగు కన్నులు, చిన్న నోరు, శకుంతలాదేవి నందకత్తియగా, నుత్తమజాతి లోలాక్షిగా జాటుచున్నవి.

ప్రక్కనున్న గదిలో బరుండి యప్పుడప్పుడు వచ్చి, తలుపుకడ చెవియొగ్గి, విని మరల వెళ్ళి పరుండినది. తలుపు గొళ్ళెముతీసి వచ్చినది.

తెల్లవారగట్లనే శారద వచ్చి తన ప్రక్క బరుండుటయు, శకుంతల యులికి పడి లేచి, విద్యుద్దీపము వెలిగించి శారదను దేరిపారచూచి, యా దీపము మరల నార్పివేసి, శారదను గౌగలించుకొని పండు కొన్నది.

రెండవనాటి రాత్రి ముచ్చటలు జరుపుటలో నారాయణరా వత్యంతోత్సాహము సూపినాడు. శారద మామూలుగ నొకరీతిగా నున్నది. శకుంతలాదేవి నేడంతయు జక్కబడు నని యను కొన్నది.

నారాయణరావు తనకు దన భార్యకు జరిగిన ప్రథమ దినోదంతము పరుల కెరుక పరుపకూడదనియు, పరులూహింపనైన నూహింపకుండ చరింపవలయు ననియు సంకల్పించు కొనుటచే మరునాడు వసంతునివలె నలంకరించుకొని, మొదటి నాటికంటె మరియు నుత్సాహముగ చరింప మొదలు పెట్టెను.

శారదకు మాత్ర మిదియంతయు నాశ్చర్యము కలిగించినది.

ముచ్చట లన్నియు నైన వెనుక, ముత్తయిదువు లందరును వెళ్ళిన వెనుక శారద వెంటనే గదిలోనికి వచ్చి తలవంచుకొని, తలుపుమాటున జతికిలంబడి పోయినది. నారాయణరావు తాను దెచ్చిపెట్టుకొనిన యుత్సాహమంతయు మరిగిపోవ,

నిరాశావశుడై మోమువాల్చి, యొక దిండుల కుర్చీపై నాసీనుడయి యాలోచనా పరు డైనాడు. తన జీవితమంతయు నెడారియై పోవునని యాతనికి దోచినది.

తన నిర్మల చరిత్రమున కేమి కళంకములు రానున్నవో ?

తన హృదయదేవత యనుకొన్న శారద తనకు గాక పోయినదా ?

ఎట్లు ? తన యింటికడ మూడు రోజులును నున్నవికదా. అవి వేగించుటెట్లు? నారాయణుడు లేచి తన్ను ముంచివేయు నిరాశామేఘములను దరిమివేసి, భార్య పడియున్న తావునకు జిరునవ్వుతో జేరబోయి 'ఆనందమయీ అని పిలవనా, లేక ముగ్ధలలనా ! అని పిలవనా అని ఆలోచిస్తున్నాను, ఏమని పిలువను చెప్పు శారదా ? యని ప్రశ్నించినాడు.

శారద ముకిలించుకొని పోయినది.

'మన జన్మం ఇల్లా వృథా అయిపోవాలనా. నీ ఉద్దేశం ? అయితే సరే. నాకు ఇతరుల మనస్సులు కష్టపెట్టడం గిట్టదు. అది నా చేతకాదు. ఈ లాంటి అంద కత్తె నా భార్య అవుతుంది. ఆమెకు చదువు సంగీతం దివ్యంగా వస్తాయి. శ్రీ విష్ణులా హృదయంలో ధరించుకొంటాను, శివుడిలా అర్ధనారీశ్వరుణ్ణి అవుతాను. బ్రహ్మలా నా వాక్కులో ధరిస్తాను. అని కలలుకన్నా. నా కలలే రూపం పొంది నట్లుగా నువ్వునాకు హృదయేశ్వరిని అవడం నా జన్మం పావనం అయిం దను కున్నా ! నవ్వితే నక్షత్రాలు నర్తిస్తాయి అని వర్ణించుకున్న బాలికవునువ్వు. నువ్వు వీణా, నేను ఫిడేలు వాయించుకొంటూ కిన్నర మిథునంలా వుందా మను కొన్నాను. ప్రతి పరీక్షలోనూ ప్రథముడుగా నెగ్గుతూ, అనేక శాస్త్రాలలో పాండిత్యం సంపా దించు కొన్నందుకు అనురూపమైన విద్యావతివి నాకు లభించావని మురిసిపోయాను.

'నాకు అలవడిన కవిత్వం చిత్రలేఖనం నీ వల్ల చరితార్థ మవుత వను కొన్నా. నా రాణిని నానా భాషల్లో పాడుకొందామనీ, నా దేవిని నానా వర్ణాల నానా భంగుల చిత్రించు కొందామని, నా ఆత్మేశ్వరితో నానా పరమార్థ ప్రణయలీలల దివ్యణ్ణాదామనీ పొంగిపోయాను. జన్మ జన్మాలకూ నిన్ను ప్రేమించడానికి, నీకు తక్కువైన ప్రేమనుకూడా సర్దడానికి తగినంత ప్రేమ నాలో కట్టలు తెంచుకొని పొర్లుతూవుంది. ఈ ప్రవాహంలో నిన్ను తేల్చివేస్తాను. క్రమంగా నా దాన్ని చేసు కుంటాను. దివ్య ప్రేయసివి నువ్వల్లా, కొంచెం సుముఖంగా వుండు. వుపేక్షతో నైనా సరే నా ఆరాధనను అంగీకరించు. అంతేకాని, నువ్వింతటి వైముఖ్యం తాల్చి మన యిద్దరి బ్రతుకులు మరుభూముల్లో ఇంకి నశించే మహానదుల్ని చేయకు.'

౨౫

## నాకు ప్రేమ లేదు

భర్త ప్రేమతో దివ్య శాంతమూర్తియై తన్నట్లు నిర్దేశించి చెప్పినంతకాలము శారదమాట్లాడలేదు. ఒకసారి రెండుసారులు భర్త చెప్పినమాటలు నచ్చి కొంచెము

మెత్తబడినది. కాని జగన్మోహనుని మాటలామె కా సమయముననే స్పష్టముగా బొడగట్టినవి. 'ప్రేమలేని మనుష్యుని ముట్టుకొనుట కూడా తప్పేసుమా శారదా !' యని యాతడు పదేపదే యన్నముక్క పిడుగువలె జెవిలో వినబడినది.

నారాయణరావు స్త్రీలతో నొక విధమున చనువుగా నుండును. నే డెటుల శారదతో మాట్లాడగలిగెనో యతనికే తెలియదు. మరల నాతనినోట మాటరాలేదు. ఉస్సురని వెడలిపోవజూచుచు 'మాట్లాడవేమి శారదా !' యని జాలిగ ప్రశ్నించెను.

శారద భయమునిండిన హృదయముతో నిజముచెప్పిన ఈయన వదలునను ఆశతో కంపితస్వరమున 'నాకు ప్రేమలేదు' అని గబుక్కున కన్నుల నీరునిండ నేడ్చినది.

నారాయణరావును కొరడాతో మొగమున గొట్టినట్లయి చివుక్కున వెనుకకు జరిగి మెదడు రక్తహీనమైపోవ, తూలి, లేచి, అచ్చటినుండి వచ్చి వచ్చి, సోఫాపై కూలబడినాడు. ఇక నేమున్నది ? సర్వము ముగిసినది. అంతయు నల్లబడిపోయి నది. ఆ ముక్కలే తనకు జన్మాంతము దుఃఖితుడవు కమ్ము అని విధించిన శాపము. తాను కట్టుకొన్న దివ్యభవనము కూలిపోయినది. తన బ్రతుకు నిరర్థకమై పోయినది.

* * *

నారాయణరావు రాపడిన గుండెతో లోతులేని నవ్వుతో గపట నాటక మాడుచు నత్తవారింటికడ, కొత్తపేటలో దనయింటికడ, తక్కిన యామిను లెట్టులో వేగించినాడు. మిత్రులకైన దెలియనీయలేదు. పునస్సంధాన మహోత్సవ మిట్లు ముగిసినది.

తనయింటికడ తండ్రి సత్యనారాయణ వ్రతము సంకల్పించినారు. ఎటుల జరిగినదో, ఏమి జరిగినదో !

శారద పుట్టిల్లువచ్చి చేరినది. ఆమెకు దాను భర్తయెడజేసిన మహాపరాధము అవగతమైనది తన తండ్రికిని, తన భర్తకును దోష మొనరించినాను అన్నభావము వ్యక్తావ్యక్తమై యామెకు దోచినది.

బాలకుడగు కేశవచంద్రుని హృదయమున, నేదియో అనిష్టము జరిగినదన్న యాందోళన కలిగి పెద్దక్కగారి కడకేగి 'చిన్నబావ మంచివాడు పెద్దక్కా' యనెను. శకుంతల తమ్ము నెత్తుకొని, ముద్దుపెట్టుకొన, కేశవచంద్రుడు పెదవులు తుడుచు కొనుచు 'పెద్దక్కా చిన్నబావ మంచివాడు కాడా' యని ప్రశ్నించెను.

'అయితే మీ పెద్దబావగారు మంచివారు కారన్నమాటేనా ?'

'కారు'

'ఎంచేతా ?'

'ఏమో ?'

అతడు శారదకడకేగి చిన్నక్కగారి మోము తీక్షణముగ నాలోకించుచు.

'చిన్నక్కా ! మా చిన్నబావ దేవుడి అవతారము కాదూ ! నిజంగా నేను నమ్ముతా' నని యనెను.

శారద అతనిమాటల కులికిపడెను.

శకుంతల తన చెల్లెలినిజేరి 'శారదా! మీ ఆయన చెన్నపట్టణం వచ్చేటప్పుడు మనవూరు వస్తారుటే?' యని యడిగినది. శారద తనకు తెలియదని సూచించునట్లు తలత్రిప్పినది.

శకుంతలకు మరదిపై ఆపేక్ష యినుమడించినది. నిర్మలహృదయముతో దల్లికడ, చెల్లెలికడ, మేనత్తకడ, తండ్రికడ నాతని పరిపరివిధముల బొగడజొచ్చినది. శారదకు దన సహోదరి మాటలు కష్టములై యామెను జేరుటకు సందేహించుచు, నీలైన దప్పించుకొనుచు మెలంగ జొచ్చినది.

రానున్న భయంకరమగు విపత్తు తప్పినట్లయినది. భర్త బలవంతము చేయునేమో యని యామె భయంపడినది. కాని యాత డంత నెమ్మదిగ సంచరించుటచే నామెకు హృదయమునుండి పెద్ద బరువు తీసివేసినట్లయినది.

చదువువిషయమై ఎక్కుడు శ్రద్ధవహింప నారంభించినది. పూర్ణకంఠమున సంగీతము దివ్యకిన్నరస్వరముతో నర్తనసేయ, దనలోనే మోహమావరించిపోవ త్యాగరాజు భక్తిగీతములు మరియు నానందముగ బాడుకొనజొచ్చినది.

శకుంతల శారదను జూచి ఈసును, మెప్పు నుట్టిపడ, 'నీ వదృష్టవంతురాలవే చెల్లీ! నీకు మహారాజ కొమార్తెలు కోరితే దొరకని మగడు దొరికాడే తల్లీ. పాడుకో! నాకంఠం ముక్కలయిపోయింది. మీ బావకు నాకూ ఏప్పుడూవచ్చే వాగ్వివాదంతో గొంతుకలో అపశ్రుతి వచ్చిందే. వీణ వాయించుకోవటమే లేదు. పిల్లలిద్దరూ ఎప్పుడూ అల్లరే.'

శారద తన యక్కగారి పిల్లలను సంతతము నాడించునది. ఈ రోజులలో నా బంగారు తొనల బాలిక లిద్దరిని ఒక్క నిమిషము వదలలేదు.

* * *

జమీందారుల యిండ్లలోని ఆడువా రిట్లులే సంచరింతురా? లేక తనకుమాత్ర మిట్లు జరిగినదా? సంగీతముపై మనస్సుపోలేదు. తమ తోటలోనికిబోయి చెట్లతో దన హృదయము విప్పుకొన్నాడు. చెట్టు చేమలను జేరబోయి 'చూచినారా నా చెలిని' అని యడిగిన కావ్య నాయకుల చేష్ట లాతనికి జ్ఞప్తికి దగిలి నవ్వు వచ్చినది. గులాబులు, మల్లెలు, సంపెంగలు, లెజిస్ట్రోమియనులు, బోగెన్విల్లాలు తన్నుజూచి కరుణ ఒలికించుచున్నట్లు తోచినది నారాయణరావుకు.

తండ్రిగారికి, మామగారికి, అన్నగారికి నారాయణరావు రాజమహేంద్రవరములో న్యాయవాదవృత్తి ప్రారంభింపవలెనని కోర్కెయున్నది. తాను అందుకు వల్లెయనవలెనని కుతూహలము నందినాడు. ఇప్పుడెట్లు? న్యాయవాదవృత్తి యెందుకు? శ్రీ గాంధీమహాత్ముడు మరల కాంగ్రెసును నడుపుచు ఖైదులకు బొండని యాదేశమిచ్చినను బాగుండును. సమస్తము విడిచి సన్యసించిన బాగుండునేమో? శ్మశాన వైరాగ్యమా? తనలో వాంఛపోయినదా? 'తలలు బోడులైన

తలపులు బోడులా.' ఏరీతినైన దేశసేవచేయవలెను. ఏమియున్నది? గ్రంథాలయములా? ఇప్పుడు వాని రుచి పోయినది. ఖద్దరు ఉత్పత్తియా? ఓ, 'ఫ్యాక్టరీ' పెట్టుటయగును. ఆస్పత్రి పెట్టుదమన్న వైద్యవిద్యకు దూరమైపోయెను. రాజు అదృష్టవంతుడు. వాడు పరీక్షలన్నిట గృతార్థుడై మదరాసులో పెద్ద ఆస్పత్రిలో వృత్తి నేర్చుకొనుచున్నాడు.

పరమేశ్వరుని హృదయము మెత్తనిది. ఆతడు సంతోషజీవి. కష్టములున్నవని గుర్తింపలేడు. అంతములేని యెడారివలె కన్పించు తన జీవిత మింక గడ తేరుటయెట్లు?

తన జీవితములోని కళ నశించిపోయిననేమి? సంగీత, సాహిత్య, చిత్ర లేఖనములతో తన కేమి పని?

ఒకరోజున చటుక్కున లేచి 'నాన్నా! నేను దేశయాత్ర చేసివద్దామని ఉంది' యని నారాయణరావు తండ్రికి విన్నవించెను. తండ్రి యాశ్చర్యమంది 'చదువుకుంటూ దక్షిణాదంతా చూసివచ్చావుకాదుట్రా?' అని ప్రశ్నించెను.

'ఈ పట్టు ఉత్తరాది చూస్తాను నాన్నా.'

'ఉత్తరాది అంటే?' ఉత్తరాది యన్న సుబ్బారాయుడుగారికి దెలియక కాదు. పుత్రుడడుగుటయే యాయన కాశ్చర్యమైనది.

'కాశీ, ప్రయాగా అన్నీ తిరిగివస్తాను.'

'ఒక్కడవూనా?'

'పరమేశ్వరుడూ నేనూ వెళ్తాము!'

'ఎన్నాళ్ళు?'

'నెలో రెండు నెలలో!'

'ఆలోచిద్దాములే.'

'అదికాదు నాన్నా! తర్వాత నేను పట్టా పుచ్చుకొని వృత్తిప్రారంభిస్తే దేశం చూచుటకు వీలుండదు.'

'చూద్దామన్నాను కాదుట్రాబాబూ.'

ఆ సాయంకాలము సుబ్బారాయుడుగారు భార్య నొంటరిగాజూచి 'చిన్నబాబు కాశీ అదీ వెళ్ళివస్తాడుట, తర్వాత వాడికి వీలుండదు. దేశాలన్నీ తిరిగివచ్చి వృత్తి ప్రారంభిస్తే బాగానే వుంటుంది' అని తెలియజేసెను. జానకమ్మగారికి గుండెలో రాయిపడినది. ప్రయాణాలంటే మాటలా? మరునాడు పురోహితునకు గబురుపంపి సుబ్బారాయుడుగారు శుభముహూర్తము పెట్టించెను. సుబ్బారాయుడుగారు భార్యయు, వదినెగారును ఇదివరకె కాశీ వెళ్ళి వచ్చినారు. అందుచేతనే జానకమ్మగారు ఎట్టులో కుమారుడు వెళ్ళివచ్చుటకు నియ్యకొన్నది.

నారాయణరావు పెట్టెలు పరుపు మొదలగునవి సర్దుకొని తండ్రియిచ్చిన నాల్గు వందలరూపాయలు పుచ్చుకొని, లెక్కకావలసినప్పుడు తనకు తంతివార్త నిమ్మను

తండ్రిగారికి దల యూపుమ తల్లికడకు వెళ్ళినాడు. కుమారుని దరికి జేరదీసికొని శిరస్సు మూర్కొని 'నాయనా! రామలక్ష్మణులులా నాకిద్దరు వరప్రసాదులు పుట్టారు జాగ్రత్తగా వెళ్ళిరా. మీమీదే ప్రాణాలు పెట్టుకుని ఉన్నాను. నువ్వు దుందుడుకు మనిషివి. రైలుకదులుతోంటే ఎక్కుతావు. వాడికీ వీడికీ అపత్తు వచ్చిందని పరుగెత్తుతావు. జాగ్రత్తరా తండ్రీ!' యని యామె యాశీర్వదించి కుమారుని పంపెను.

శుభకార్యమునకై వచ్చిన బంధుగులు, అక్కగార్లు చెల్లెళ్ళు, ఎవరియిళ్ళకు వారు అప్పుడే వెళ్ళిపోయినారు. సూర్యకాంతమున కేమియు దోచుటలేదు. ఆ బాలిక యన్నగారికడకువచ్చి 'నువ్వు వెళ్ళిపోతున్నావా అన్నయ్యా! నాకసలే తోచదు' అన్నది. నారాయణరావు చెల్లెలిని దగ్గరకు దీసికొని 'సూరీడూ! నీకేమిటి తెచ్చి పెట్టను?' అని యడిగినాడు

'నీకే తెలుసును అన్నయ్యా! అన్నిటికన్నా నువ్వు దబ్బునరావడం కావాలి చిన్నన్నయ్యా!'

'అల్లాగా తల్లీ'

ప్రేమ పదార్థము దాగదు. ఈ బాలిక, తన చిట్టి చెల్లెలు ప్రేమంపుముద్ద. ఆమె హృదయము నవనీతము. ఈ బాలికను వివాహము చేసికొన్న రామచంద్రుడే పూర్ణముగ నదృష్టవంతుడు. వీరిరువురి జీవితము చూడ ముచ్చటయగునుకదా?

'క్వినైను బైసల్ఫేటు' మాత్రలు, 'క్వినైను సాలిసిలీసు' 'టించరు అయిడీను' 'టించరు బెంజాయిను' 'లైజాలు' 'హైడ్రోజన్ పెర్ ఆక్సైడు' ఆనందభైరవి, శీతాంశురసము, సన్నిపాతభైరవి, పైత్యాంతకరసము, సుఖవిరేచన మాత్రలు, 'పెర్మాంగనేటు' మాత్రలు, 'కాలొమెల్' మాత్రలు, అమృతాంజనము, 'ప్రోడయేరియా' మందు మొదలగు నౌషధములు, అరువది యడుగుల గట్టిత్రాడు, వంటగిన్నెలసెట్టు, నెయ్యివీశెడు, వీశెడుపప్పునూనె, కొంత బియ్యము, పచ్చి కారపుపొడి, ఎండుమిర్చి, చింతపండు, కొన్నికూరలు, ఆవకాయ, మాగాయ, పాత చింతకాయ, నిమ్మకాయ, గోంగూరపచ్చడి, చారుపొడి, కారప్పొడి, చాకు పెద్దది యొకటి, చిన్నదియొకటి, గాలితుపాకి, కత్తికత్తి, రెండునెలలకు సరిపోయిన బట్టలు, రెండు దోమతెరలు, ప్రయాణపు మడతమంచములు, చిన్న పరుపులురెండు, రెండు తోలుపెట్టెలు, రెండు దేవదారుపెట్టెలు సర్ది సిద్ధమైనాడు నారాయణరావు.

ఈలోన నారాయణరావు పరమేశ్వరమూర్తికి దనతో దేశయాత్రకురమ్మనియు ఖర్చులన్నియు దానే పెట్టెదననియు, భార్య నామె బుట్టింటిలోనగాని, యాతని తల్లి దండ్రులకడగాని దిగబెట్టి రావలయుననియు, నీ సమయము దాటినచో మరల పరమేశ్వరునకు దేశయాత్ర చేయుటకు వీలు దొరకదనియు వ్రాసినాడు. పరమేశ్వరమూర్తి వెంటనే దేశోద్ధారక నాగేశ్వరరాయని కడకుబోయి, సెలవుపుచ్చుకొని, భార్యను దీసికొని, యామె పుట్టిన గ్రామమగు బెజవాడలో వదలిపెట్టి, నారాయణరావును రాజమహేంద్రవరములో గలిసికొనెను.

వారశూలలు, రాహుకాలము, గుళికకాలము, వర్జ్యము లేకుండగను, నక్షత్రము, వారము, తిథి, రాశిసహితము చేసి తారాబలము చూచుకొని, పుష్కర సమయముహూర్తమున తల్లిదండ్రులు, పెదతల్లి మొదలగు పెద్దల పాదములకు నమస్కరించి, చెల్లెలిని ముద్దుగొని మోటారుపై బయలుదేరినాడు నారాయణరావు. ప్రయాణ మగుచుండ ముత్తైదు వెదురుగ వచ్చినది.

ఆ సాయంకాలము 'ప్యాసెంజరు' బండికి పరమేశ్వరమూర్తి రాజమండ్రి స్టేషనుకు రా, నారాయణరా వాతని దన బావమరది లక్ష్మీపతి యింటికి దీసుకొని పోయెను.

ముగ్గురు స్నేహితు లారాత్రియంతయు నిష్టాగోష్ఠి కాలముపుచ్చిరి. లక్ష్మీపతి దానును రావలయునని ముచ్చట పడెనుగాని సెలవు దొరకుటకు వీలులేనందున ఆగి పోవలసి వచ్చెను.

మరునా డుదయము రమణమ్మ తెల్లవారగట్లనే, వేపుడుకూర, ఉల్లిపాయ పోపుతో కాల్చిన వంకాయ పచ్చడి, ఆవకాయ, పెరుగు, వేడియన్నముతో భోజనము పెట్టినది అన్నగారికి బరమేశ్వరునకును మేనత్తకు నమస్కృతులిడి యామె యాశీస్సులంది, రమణమ్మను తనదగ్గరకు జేరదీసికొని 'రమణా! నీకు, బాచిగాడికి చిత్రాలు పట్టుకొస్తానేవ్' అని యామెతో జెప్పి లక్ష్మీపతి వెంటరా నారాయణరావు పరమేశ్వరునితో 'నిన్నీసు' పేటనుండి పెద్దస్టేషనుకు రెండు జట్కాలమీద బయలుదేరెను. 'ఇంటరులో వారిద్దరు ఖురదారోడ్డు స్టేషనుమీదుగా పూరి (జగన్నాథం)కి టిక్కెట్టు పుచ్చుకొన్నారు, పది 'గోల్డుఫ్లేకు' సిగరెట్టు డబ్బాలు, పది 'త్రీకాశిల్సు' డబ్బాలు పుచ్చుకొని, ఇవి గ్రథ .లు కొని, మెయిలునెక్కి, లక్ష్మీపతి చేతిని రూడించి మెయిలుబండి సాగగా దానితో వారును సాగినారు.

౬

## ఉత్తర హిందూదేశ యాత్ర

భరతదేశము ఆదియుగములనుండియు ప్రపంచమునకు నాగరికత, మానవ ధర్మము, ఆధ్యాత్మిక తత్త్వవిచారము నేర్పుచునే యున్నది. సేతుహిమాచల పూర్వ పశ్చిమ సముద్ర పరివృతమగు భరతదేశమున నెన్నిజాతులు, నెన్నిరాజ్యములు, నవతరించి వృద్ధియై యుత్కృష్ట సంప్రదాయముల సృజించి, నశించిపోయినవో? ఒకజాతిలోనుండి వేరొకజాతి జనించినది. నూతనజాతుల దనలో జేర్చుకొన్నది. పూర్వ సంప్రదాయముల విజృంభింప జేసినది.

భిన్నత్వమున నేకత్వము, నేకత్వమున భిన్నత్వముసూచింపుచు భగవంతుని విశ్వరూపసందర్శన మన్నట్లు విజాతీయునకు భిన్నతా దూషితమైతోచుచు, మహానది వలె నెటనుండి యెటకు బోవుచున్నదో భారతీయ మహాచరిత్ర! నారాయణరాయ పరమేశ్వరులకు పూరీ మహాపట్టణమున, కోణార్కులో, భువనేశ్వరములో గన్పిం

చిన గాంగకళాచమత్కృతియు ఉత్తమ నాగరికతయు వారి నాలోచనాపూరితుల, నానంద వికసితులను జేసినది.

భరతదేశములో సూర్యునకు ప్రత్యేక గుడులు రెండుమూడు చోటులనే యున్నవి. ఒకటి యోఢ్రదేశములోని కోణార్క. కాని కోణార్క దేవాలయము నకు బ్రతిష్ఠ జరుగలేదు. మహారాజు సూర్యదేవునకు దేవాలయము సంకల్పించి తన యాస్థాన మహాశిల్పి నా కార్యమున నియోగించెనట

ఆస్థాన శిల్పికొక పుత్రుడున్నాడు. ఆతడు తండ్రికడ శుశ్రూష సలిపి జనకుని యుత్కృష్ట శిల్ప చమత్కృతియు, శక్తియు నభ్యసించి, దేశదేశములకు బోయి అందందుగల శిల్ప సాంప్రదాయముల గమనించి వచ్చెదనని తండ్రి యను మతి కోరినాడట. తండ్రి యితరదేశముల శిల్పులలో భావనయందు, బనితనము నందు తన్ను మించినవారు లేరని పుత్రుని యాత్రాకౌతుకము మాన్పజూచెనట. కుమారున కది తండ్రియందు దోషమనిపించినది. కాన తండ్రికి నమస్కరించి, 'తండ్రీ! మనకెప్పుడును గర్వము హానికర' మని చెప్పి చలమున విదేశయాత్ర సాగించినాడట.

ఇచట తండ్రి దేవాలయము నతి విచిత్రముగ నిర్మించి శ్రీ విమానమున శిఖరము వరకును గట్టినాడట. ముఖమండపములు, భక్తమందిరము, వివాహ మండపము, క్షేత్రపాలకాలయము, పరిసేవిత దేవతాలయములు నిర్మింపబడినది. సింహ గజాశ్వాది మృగములు, నద్భుత సుందరవనితా విగ్రహములు దేవతాశిల్పములు మున్నగునవియెల్ల నా శిల్ప చక్రవర్తియు నాతని శిష్యులును జెక్కి యమర్చినారు. దేవళము నద్భుతమై విరాజిల్లినది. కాని కూపస్థమండూకమువలె నున్న యా శిల్పికి శ్రీ విమాన శిఖర పద్మశిల నమర్చు నుపాయము తెలియలేదట. ఆతడంతట మహారాజుతో నిజము వచింపక తనకొక ముఖ్యావసరమగు కార్యమున్నదని చెప్పి, యితరదేశ శిల్పుల నారహస్య మడిగి తెలిసికొనుటకు బయలుదేరి పోయినాడట.

ఇంతలో దైవజ్ఞులు పదునయిదు దినములలో మంచి ముహూర్తమున్న దనియు కొన్ని సంవత్సరములవరకు నట్టి ముహూర్తము మరల దొరకదనియు, మహారాజునకు విన్నవించినారట. మహారాజు సమయమునకు శిల్పి దేశాంతర గమనుడగుటకు వగచి, యాతని శిష్యులలో శిఖర మమర్చగలవా రుండిరాయని పృచ్ఛ చేసి యేరును లేకుండుటకు జింతాకులుడై, తన శిల్పికై చారుల బంపినాడు.

ఇంతలో నాస్థాన శిల్పి కుమారుడు తన యాత్ర ముగించుకొని నిజపురికి తిరిగివచ్చి యీ సంగతులన్నియు విన్నాడు. తండ్రిగారికి నపఖ్యాతి వచ్చునట్లున్న దని భయంపడి యా కార్యమునకు దానియ్యకొని, వలయు సన్నాహము లన్నియు నొనర్చుచుండెను. జనకున కలవికాని యీ కార్యము తాను సాధించినచో నభిమాని యగు నాతనికి కోపము రాగలదని సంశయించి, ఆ కుమారశిల్పి ప్రచ్ఛన్నుడై యుండి తనవారి కెవ్వరికి నిజస్థితి తెలుపకయే కార్యమునకు బూనుకొనెను. పది

పంద్రెండు బారువుల బరువుగల శిఖరశిలను. విమానమూలమున ప్రక్కగా నొక యిసుకదిబ్బపై పెట్టించి, మహారాజుతో రోజునకు వేనకువేలు బండ్లు సముద్రము నుండి యిసుక తెప్పించి యాదిబ్బ యెత్తువేయించ కోరెనట. బళ్ళువచ్చి యిసుక దిబ్బ నెత్తు జేయుచున్నకొలది యీ బాలశిల్పి, యాశిఖర పద్మశిల యా దిబ్బమూపు పైననే యుండునట్లు చూచుకొనుచుండెను. మూడు దినములలో బర్వతమువలె నా యిసుకదిబ్బ శిఖరముకన్న నెత్తుగ నూటయిరువది నాలుగడుగులు సువ్వున లేచినది. విమాన శిఖరశిలయు నా దిబ్బమూపుననే యున్నది. అప్పుడా విమానశిల కడుగుననుండి విమాన శిఖరమునకు గట్టి దూలపు కమ్మీలు చేర్పించినాడాబాలశిల్పి.. రాతికి ఇటునటు తాళ్ళుకట్టి, కమ్మీలపై జరిపించి శిఖరముపై నాశిఖర శిలనమర్చి కమ్మీలు లాగించివేసినాడు.

రాజు ఈ మహా కార్యకౌశలము దినదినము వచ్చి చూచుచు, కార్యసాఫల్యమునకు సంతోషించుచుండెను. విమాన శిఖరశిల నమర్చురోజున దేశదేశముల నుండి జనమువచ్చి ఆ చిత్రము చూచి ఆనందించిరి. ఆ వచ్చినవారిలో నాస్థాన శిల్పియు నున్నాడు. ఆతడు వచ్చినవార్త నేరు నెరుగకుండ నాశిల్పి విన్నబోయిన మోముతో ఆ జన మహాసముద్రమున జేరి విచిత్రమును జూచుచుండెను.

శిఖరశిల నమర్చుటయు మహారాజు మెడలో హారమువేయ ఆ బాలశిల్పి వంగి నమస్కరించి మరునాడు శుభముహూర్తమునకు సర్వము దేవాలయమున సిద్ధము జేయ నాతడా గుడిలోనే పండుకొన్నాడు.

కుమారుని గుర్తించలేదా తండ్రి. చిన్ననాడిల్లువదలిపోయిన ఆ బాలున కిప్పుడు మీసములు పెరిగినవి. పురుషుడైనాడు. దేహమంతయు గట్టిబారినది. అట్టి కుమారుని గుర్తించక తన్నిట్లవమాన బరచిన యీ ద్రోహిని హత్యనొనరింప వలయునని దుర్బుద్ధిజనించి, యా రాత్రి గుడిలో నొంటిమై నిద్రించు దన కుమారుని బాకుతో పొడిచినాడు. బాలకుడు హృదయమునుండి రక్తము స్రవింప ఆహా యని నిదురలేచి యా దీపము వెలుతురున దండ్రిని గుర్తించి 'తండ్రీ నన్నేల బొడిచినావు. నన్నానవాలు పట్టలేదా! అయ్యో! ప్రాణములు పోవుచున్నవి. స్వామికార్యమునకై యీ శిఖరము నేనెక్కించవలసివచ్చినది. జనకా! రేపటిదినము సర్వోచ్చమగు ముహూర్తమట. అబ్బా బాధ! ఈ బాకు పీకివేయుము. నా తండ్రీ! గురుదేవా! నీ చేతిలో నే మరణించినందులకు సంతసమే. నీకివే నా చరమప్రణామము' లనుచు ప్రాణములు విడిచినాడట.

తండ్రి కుమారు నానవాలుపట్టి, గుండె తరుగుకొనిపోవ, తాను చేసిన మహా నేరమును, గుమారుని చంపుకొన్న క్రూరకర్మమును నిందించుకొనుచు తన ఘోర కృత్యమునకు గుండెపగిలి యచ్చటనే చనిపోయెను.

మరునాడు శుభముహూర్తమున ప్రతిష్ఠ జరుగలేదు. మరి యెప్పుడును జరుగలేదు.

ఆ కథ విని పరమేశ్వరునకు గన్నుల నీరు తిరిగినది. నారాయణరావట్లనా యని నిట్టూర్పునించినాడు. కోణార్కులో, జగన్నాధములో, భువనేశ్వరములో దేవాలయములకు శ్రీవిమానములెత్తైయుండును. అంతకన్న మధ్య మండపము, అద్దానికన్న ముఖమండపము చిన్నవి. గోపురములు చిన్నవి. గుడియంతయు మొక్కజొన్నపొత్తివలె నుండును, మూలమునుండి శిఖరమువరకు రాళ్ళతోడనే కట్టెదరు. ఎఱ్ఱయిసుకశిల, సుందరశిల్ప లాలిత్య మారాతిలో రూపించునట్లు వేరొక రాతిలో రూపింపలేరు. గాంగశిల్పులు స్త్రీ రూపరచనమున దన్మయులైనారు. బ్రహ్మ - పూవులతో, లతలతో, లేతయాకులతో, తేనెలతో, లేడికన్నులతో, చుక్కల తళుకులతో, వెన్నెల వెలుగులతో స్త్రీమూర్తిని సృజించినాడన్న మాటను ఆశిల్పులు నిక్కువము చేసినారు. గాంగులు ఆంధ్రులు. ఉత్తరాంధ్ర శిల్పులు గాంగ శిల్పులు.

భువనేశ్వరములో రాజారాణి, పరమేశ్వర, మార్కండేయేశ్వర, లింగేశ్వరుల దేవాలయములలోను, కోణార్కులోను ముఖలింగములో సాక్షిగోపాలములో, గాంగ శిల్పుల శిల్పలాలిత్యము ప్రత్యక్షమగుచుండును. గుడియంతయు లతలు చెక్కియుండును. మధ్యమధ్య విగ్రహములు పొదిగింపబడును. దాక్షిణాత్య దేవాలయముల రీతి వేఱు. చోళ, పాండ్య, చాళుక్య దేవాలయములలో గర్భగుడిపైనుండి శిఖరమువరకు గట్టిగా రాతికట్టడమో, యిటుక కట్టడమో కట్టుకొనిపోదురు. కాని గాంగ దేవాలయములకు, దేవాలయ పాదమునుండి శిఖరమువరకు లోన గుల్లగా కట్టుకొనిపోదురు. తెనుగు చోడుల దేవాలయములలోనూ గర్భాలయము గుల్లగానే యుండును.

భువనేశ్వరములో రెండువందల దేవాలయములున్నవి. ప్రతి దేవాలయమునకు మిక్కిలి లోతుగల కోనేరు లున్నవి. ఎచ్చటనుండియో జలము వచ్చునట్లుచేసి, యా జలము పొలముల కుపయోగించునట్లా శిల్పు లమర్చిరి. జగన్నాధమునందు మొండిజగ్గని యందము దిలకించి, సాక్షిగోపాలము, శ్రీకూర్మము దర్శించి, నారాయణరావు పరమేశ్వరమూర్తులు కలకత్తా చేరుకొన్నారు. కలకత్తాలో మ్యూజియము, దక్షిణేశ్వరము, కాళీఘట్టము, సర్వవృక్షవనము, జంతుశాల, విక్టోరియా మందిరము, జైనమహా భవనము, బోసుగారి వృక్షశాస్త్ర పరిశోధక భవనము, మొదలైనవి చూచినారు.

శ్రీ రామకృష్ణ పరమహంస నిర్వికల్పసమాధి నందిన పంచవటి, మాత దేవాలయము, ఆ భక్తమూర్తి, యవతారపురుషుడు మెలంగిన యా పవిత్రస్థానము చూచునప్పటికి నారాయణ పరమేశ్వరులు పులకరించిపోయిరి.

ఈ మహాపురుషుడు సర్వమతములు హిందూమతములోనివే యని లోకమునకు దెల్పుటకు, సర్వమతములవారికి ఆత్మ విద్యాభిక్ష మామతమే పెట్టినదని తెల్పుటకు అవతరించెనని, నారాయణరావు పరమేశ్వరునకు దెలిపెను. రామకృష్ణునకు చదువురాదు. ఈశ్వరచంద్ర విద్యాసాగరులవంటి పండితు లా పరమహంసకు

జోహారులన్నారు. కేశవచంద్రసేనువంటి మహానుభావు లాతని పాదములకడ నాత్మజ్ఞానము సముపార్జించుకొన్నారు.

'శ్రీ రామకృష్ణ పరమహంసకు వివేకానందస్వామి అర్జునుడంటివాడురా. నరనారాయణులే వారిరువురున్నూ. ప్రతిమతంలోనూ కొన్నికొన్ని ఆచారాలు బయలుదేరుతవి. ఆ యాచారాలనూ, చిహ్నములనూ అనుసరిస్తేగాని మోక్షంలేదు అనుకోవడమంత మూర్ఖత ఇంకోటిలేదు. నామాలుపెట్టి, గండభేరుండంచులపంచెలు కట్టి, విష్ణ్వాలయాలలోకి వెళ్ళి, విష్ణునిమాత్రం కొలిచేవాడు వైష్ణవుడనిన్నీ, తలంతా గొరిగించుకొని గడ్డంపెంచుకొని మహమద్ వారుమాత్రమే దైవముయొక్క మతము బోధించేవారనిన్నీ, ఖురానుమాత్రమే మతగ్రంథమనిన్నీ ఒక్కదైవమే యున్నాడనిన్నీ, రెండు దేవుళ్ళు లేరనిన్నీ నమ్మేవాడు మాత్రమే మహమ్మదీయుడనిన్నీ; బాప్టిజం పుచ్చుకొని, యేసుక్రీస్తు దేవుని కుమారుడనీ, ఆతని ద్వారానే మోక్షం వస్తుందనీ, ఏసును నమ్మకుండా వున్నవాడికి నరకం అనిన్నీ, నమ్మేవాడే క్రైస్తవ మతస్థుడని వాదించడంకంటె పరమ ఛాందసం లేదురా పరం.'

'మన మహర్షులు మాత్రమే చెప్పగలిగారురా, సర్వమతాలు పైవాన్ని చేరు కుంటాయి' అని.

'అలా అనకు. క్రీస్తుగాని మహమ్మదుగాని అలా చెప్పలేదనా నీ ఉద్దేశము. కాదు! ప్రతి అవతార పురుషుడు అలాగే చెప్తాడు.'

'నువ్వనేది, సరియైన జ్ఞానముతో సంచరించేవాడు, సత్యాన్ని కొలిచేవాడు, ఏ మతం వాడైనా సరే మోక్షము చెందుతాడు అని రామకృష్ణ పరమహంస ప్రపంచానికి బోధించిందే నిజమంటావు అంతేనా?'

'అవును మరి. ఆయన మహమ్మదీయుడై అల్లాను ప్రార్థించి భగవంతుణ్ణి సాక్షాత్కరింప జేసికొన్నాడు. క్రైస్తవుడై జెహోవాను స్వాధీనము జేసుకొన్నాడు. రాధ అయి శ్రీకృష్ణునీ, హనుమంతుడై రామునీ సాన్నిధ్యము పొందాడు. అందరూ ఒక్క పరమాత్ముని మహాభావమే కాదుట్రా?'

బేలూరు మఠంచూచి, చందా యిచ్చి, కలకత్తానుండి బయలుదేరి, మన యాత్రికులు గయ వెడలినారు. ఫల్గునీ నదిలో స్నాన మాడినారు. శ్రీరామగిరి దర్శించి శ్రీరాముడు ప్రతిష్ఠించిన మరకత రత్న ఘటిత స్ఫటిక లింగమును దర్శించినారు. బుద్ధగయ కేగి యచ్చట సిద్ధార్థుడు బుద్ధుడైన ప్రదేశములో గూర్చుండి, యా పరమ పురుషుని ధ్యానించి, యా దేవాలయ రచనా చమత్కృతికి సంతసించినారు. ఇదే బౌద్ధులకు ముఖ్యమగు ప్రథమ దేవాలయము. బుద్ధ భగవానుడు నిర్వాణ మొందిన వెనుక నాతని దేహమునకు దహనసంస్కారము లైనవి. అప్పు డా తథాగతుని వపువులోని బొమికలు, దంతములు మొదలగునవి బరిణెలలో నుంచి వానిని వివిధ దేశములకు నాయన శిష్యులు పంపించినారట. ఆ బరిణెల నందిన మహారాజులు వానిని పవిత్రస్థలమునందు స్థాపించి వానిపైన రాతితో, నిటుకతో

మట్టితో దిబ్బలు కట్టిరి. వానిపై శిల్పము లుంచిరి. అయ్యవి స్థూపములన్నారు. ఆ స్థూపములు పవిత్ర నిర్మాణములైనవి. భక్తులు వానిపై వారి కళా ప్రజ్ఞ యంతయు జూపించినారు. వానికి తోరణములు, చుట్టును శిల్పములు చెక్కిన కంచెలు నేర్పరచిన మహారాజులు వానికై కోట్లు వెచ్చము చేయించినారు. తర్వాత బుద్ధునికై దేవాలయమును నిర్మించినారు. అట్టి దేవాలయములలో బుద్ధ గయ యొకటి. అచ్చటను శిల్పములు తీర్చిన రాతికంచెయున్నది. స్థూపముల జూచియే, దేవాలయము లేర్పరచినారని కొందరి మతము. కాని పరమేశ్వరుడు బుద్ధునికి బూర్వమే దేవాలయము లున్నవని వాదించును.

గయనుండి మొగలిసరాయి మీదుగా శ్రీ కాశీపట్టణము చేరినారు. గంగా నదిలో స్నాన మాచరించి, విశ్వేశ్వరుని, బిందుమాధవుని, ఢుండి (గణేశ్వరుని), యన్నపూర్ణ విశాలాక్షిని, గవ్వలకొక్కను. వారణనదిని, అసి నదిని దర్శించి కేదార ఘట్టములో శ్రీ విజయనగరం మహారాజావారి భవనములో బసజేసినారు. స్నేహితు లిరువురు కాశీ విశ్వవిద్యాలయము దర్శించినారు. 'ఒక్క మహానుభావుడు బిచ్చగాడయి కోటులు సముపార్జించి యీ మహోత్కృష్టమైన విద్యాలయం కట్టించాడు; పవిత్రుడు మదనమోహనుడు. ఈవిద్యాలయానికి బిసెంటమ్మ అసలు పునాదివేసింది అహో! ఏమి చిత్రంరా మానవుని ప్రకృతి?' యనినాడు పరమేశ్వరుడు.

'ఈ మహాక్షేత్రము ఎన్ని వేల సంవత్సరములనుండి సర్వ మానవలోకాన్ని పవిత్రం జేస్తోందీ. శ్రీరామచంద్రు డీ పుణ్యక్షేత్రాన్ని దర్శించినాడా, ఓరే పరమేశా! మనదేశంలో ఉన్న ఇతరపుణ్యక్షేత్రాలు తర్వాత తర్వాత వచ్చినవేమోకాని ఈమహా క్షేత్రం మాత్రం మహా పురాతనంరా!' అని అనినాడు నారాయణరావు.

## ౭

## భారతీయుల ప్రాచీన నాగరికత

'ఈ విద్యాలయానికి లక్షలు ఖరీదుచేసే యీ భవనాలు ఎందుకు నిర్మించాడో పూర్వ సంప్రదాయాభిమానియగు మదనమోహన పండితుడు?'

'ఒరే నారాయణా! ఒక్కటిమాత్రం ఉందిరా. పాశ్చాత్యవిద్యే పరమావధి అనే ఈరోజుల్లో, ప్రభుత్వంనారికోపానికి గురికాకుండా జాతీయతను పోషించడానికి వీలైనంతవరకు పోషించే ఈ విద్యాలయం ఒకటి సృష్టించాడురా మహానుభావుడు.'

'నువ్వుచెప్పింది నిజమే. వెనక ఆనాటి కాశీ విద్యాపీఠము, నలందా, తక్షశిల, అజంతా, నాగార్జున పర్వతము, ధాన్యకటకము, నవద్వీపము మొదలగు పరిషత్తులవంటి విద్యాపీఠాలు ప్రస్తుతం మనం పెట్టలేమురా. 1921 ఆ ప్రాంతాల్ని పుట్టిన గుజరాతు, కలకత్తా, ఆంధ్రజాతీయ విద్యాలయాలు పేరుకుమాత్రం ఉన్నాయి. మహానుభావుడు శివప్రసాదగుప్తగారు నిలిపిన విద్యాలయం గుజరాతు విద్యాపీఠం మాత్రం ఇంకా నిలిచాయి. ఎప్పుడో మళ్ళీ నిజమైన విద్యాపీఠాలదర్శనం? ఆంధ్ర

విశ్వ విద్యాలయం బెజవాడనుంచి వెళ్ళిపోయేటట్టు ఉంది. విశాఖపట్టణం వెళ్ళిపోతే రాయలసీమవారు తప్పుకుంటారట. బెజవాడ ఆంధ్రదేశానికి మధ్యపట్టణం. అన్ని దేశాలనుంచి వచ్చే రైలుమార్గాలున్నై. పవిత్రమైన కృష్ణవేణినది ప్రవహిస్తూ ఉన్నది '

'అబ్బాయి ఈ సబబులన్నీ విచారించేవాళ్లు ఎక్కువమంది వుండరురాజాబూ! రేపో యెప్పుడో శాసనసభలో విశాఖపట్టణం విశ్వవిద్యాలయ ప్రధానస్థానం కావాలి అని బిల్లు పెట్టున్నారు. ఆమోదిస్తారు. సరే, దానికికాదు. వీరు ఇంతాచేసి మద్రాసు విశ్వవిద్యాలయంకన్న ఇందులో ఏమి కొత్తదనం వెలగబెట్టారు. అనే·నావిచారం."

కాశీనుండి సారనాధువెళ్ళి యచ్చట పురాశిల్ప రక్షణశాఖవారు స్థూపమును త్రవ్వి బయలుపరచిన సంఘారామకట్టడములు చూచినారు. శృంగ ఆంధ్రరాజ్య కాలముల విజృంభించి, గుప్తరాజ్యకాలమున పేరొందిన యాస్థూపమును మహాబోధి సంఘమువారు వృద్ధిపరచుచు నూతన సంఘారామము నిర్మించుచున్నారు. బుద్ధుని విగ్రహములు, మంజుశ్రీ తారావిగ్రహము లచ్చట శిల్పకళా చమత్కృతి వెదజల్లు చున్నవి. అశోకుడు బౌద్ధమతావలంబియై, భక్తుడై, సర్వ సర్వం సహా మండల ములో హింసకు చోటులేకుండ చేయుటకు, తథాగతుని బోధ లోకమెల్ల ప్రజ్వలింప జేయుటకు దీక్షవహించిన దినములలో నాస్థూపము ప్రారంభింపబడినది. అశోకుని శిలాస్తంభ మచ్చట నొకటియున్నది. రానురా నాసంఘారామము వృద్ధినందినది. ఆ స్థలము వేణువనము. బుద్ధుడై యాలోకపావనుడు దేశములనెల్ల సత్యమార్గమును బోధించి యా వేణువనాన ఆశ్రమ మేర్పరచుకొని లోకమెల్ల మార్తాండుడు వెలుగు వెదజల్లురీతి, తన బోధను ప్రకాశింపజేయుచుండెను.

పరమేశ్వరుడా ప్రదేశమంతయు దిరుగుచుండెను. నారాయణరా వాస్థూప మున కెదురుగ పద్మాసనోపవిష్టుడై యర్ధనిమీలిత నేత్రుడై, యా బుద్ధపరమాత్మను ధ్యానించుకొనుచుండెను. ఆతని వాక్కుల అమృతధారలు నారాయణరావు కర్ణముల బ్రతిధ్వనించినట్లయినది. పరమేశ్వరుడా పవిత్రమూర్తి పద్మాసనధారియై జ్ఞానము ద్రతో 'ఓం మణి పద్మీహమ్' అని జ్ఞానోపదేశము చేయుచున్నట్లు భావించినాడు.

కాశీనుండి ప్రయాగ వెళ్ళి, త్రివేణీ సంగమములో మన స్నేహితులు కృతావ గాహులైనారు, త్రివేణీ సంగమములో రెండువేణులే కలియుచున్నవి. మూడవవేణి యంతర్వాహినియట. యమున నీలగాత్ర, గంగాదేవి ధవళశరీర, సరస్వతి సువర్ణ చ్ఛాయావర్తి. యమున కూర్మవాహన, గంగ మకరవాహన, సరస్వతి పద్మ వాహన.

ఆ సూర్యతనయ కూర్మవాహన మంగీకరించి యెన్ని వేలేండ్లు గడచెనో, నేటికిని యమునా కచ్ఛపములా నీలంపు లోతులలో నీదులాడుచు, తేలికొనుచు, మునుగుచు సంచరించును. యమునకంటె గంగ లోతుతక్కువ. సరస్వతి లోతు నకు కాలమే ప్రమాణము. గంగ మహావేగమున ప్రవహించును. యమున గంభీ

రముగా నెమ్మదిగా చరించును. లోతులేని గంగయు, లోతుగల యమునయు సంగమించినచోట నా యువకులిరువురు స్నానమాడి, ఊరు జూడబోయిరి. పండిత మోతీలాలుని భవనము, విశ్వవిద్యాలయములు, కోట, పురాతనాశ్వత్థ నారాయణము దర్శించినారు. కోటలోని యశోకుని స్తంభము గమనించినారు.

వారిరువురు ప్రయాగలో గంగను పెద్దబిందెలలో బట్టి రైలుమార్గమున రాజమహేంద్రవరము లక్ష్మీపతికి బంపినారు.

అలహాబాదునుండి లక్నో, హరిద్వారము, హృషీకేశము దర్శించినారు. వియత్పథము వదలి గంగాదేవి హృషీకేశముకడ నార్యావర్తములోనికి కుడియడుగు పెట్టినది. అచటి ఋషుల యాశ్రమములు దర్శించినారు. రామతీర్థస్వామి గంగలో గలసిపోయిన ప్రదేశము చూచినారు. ఆ మహాభాగుని దలపోసికొని నారాయణరావు పరమేశ్వరుని జూచి 'ఈ పరమఋషి హిమాలయములో దిగంబరుడై సుమేరువు నధిగమించినాడురా! ఆ మహానుభావుడు రచించిన గ్రంథాలు పోయాయి. దేశాలు తల్లడిల్లజేసి వివేకానందుని యాత్రను సంపూర్ణముచేసి యవతారం చాలించాడురా. ఏమి మేధావి. లెక్కల ఎం. యే., చిన్నతనంలో పది లెక్కలిచ్చి, ఎనిమిది చెయ్యమంటే, పదీచేసేవాడు సగంకాలంలో.

'సత్య స్వరూపుడగు పరమాత్మను కనుగొన్న ఆ మహానుభావునకు లెక్కలు గిక్కలూ ఒక లెక్కటరా నారాయణం?'

కతిపయి దినాలల్లో ఢిల్లీ చేరుకొన్నారు కుతుబు మినారు, అశోక చక్రవర్తి నాటిన యినుప కంబము, జుమ్మామసీదు చూచినారు. మహమ్మదీయ శిల్పచమత్కృతి గమనించినారు. క్రొత్తఢిల్లీలో తయారగు భవనములు చూచి 'జీవము లేని యీ కళాచమత్కృతి యీ కాలమునకు దగినట్లే యున్నది' యనుకొన్నారు. మ్లేచ్ఛ చక్రవర్తులు ఢిల్లీ చుట్టును నున్న వివిధస్థలముల గట్టిన కోటలు, మహాభవనములు చూచినారు. అక్బరు కట్టిన ఫతేపూరుసిక్రీయును, ఫైజాబాదును, హుమయూను గోరీని మొదలగునవన్నియు జూచినారు. ఫతేపూరు సిక్రీలో రెండురోజు లున్నారు. అక్బరు చక్రవర్తి చరిత్రయంతయు దలపోసికొనినారు.

'ఓరే నారాయుడూ! ఈ భవనములో దిరిగిన అనార్కలీ చరిత్రమంతయు దలపుకు వచ్చుచున్నది. వివిధదేశాలనుండి వచ్చిన యప్సరస్సమానలగు సుందరీమణు లెందరీ మందిరాల తిరిగినారో? అస్పష్టమధురములయి వారిమాటలు పాటలు ప్రతిధ్వనిస్తున్నవిరా.'

'కవిత్వం! కవిత్వం! నారాయణా! నువ్వొక సర్దారువు. నువ్వు దర్బారునకు వెళ్తూవుంటే జనానా మేడలమీద ఒక కిటికీలోనుంచి రెండు లేడికన్నులు నీ వైపు చూశాయి. నువ్వు తలెత్తావు! ఆ లోచనాలు నవ్వినై —'

'ఆ! ఏవిటి తర్వాత తర్వాత.'

'తర్వాత నీ కొంకొక సిద్దీ కబురు తెచ్చాడు. రహస్యమార్గాలవెంట నువ్వు కోటలోకి వెళ్లావు. ఒక సిద్దీ బానిస బాలిక నిన్నో మందిరంలోకి తీసుకువెడితే, అక్కడ ఒక చక్కని చుక్క పరిశియా బాలిక, అందం ఒలికిపోతూవున్న దేహాన్ని పట్టియిచ్చే ఢక్కా వస్త్రాన్ని కట్టుకొని, ఓరగిలి, ఒయ్యారంగా పడుకొని ఉంటే, నువ్వు చూసి ఆనంద మూర్తివై ఆమె పాదాలకడ వాలావుట. ఆమె తన దానిమ్మ పువ్వులాంటి పెదవుల్ని విరుచుకొని - గబుక్కునలేచి, ఎవరు నువ్వు, ఇక్కడకు ఎందుకు వచ్చావు - అని చప్పట్లు చరిచిందిరా.

'కథలు చెప్పటంలో మా నాన్నగారి తర్వాత నువ్వేరా! నన్నుగురించినకథ వినడానికి నాకే ముచ్చటగా ఉంది. తర్వాత చెప్పుమరి. మొండిలేచి కుట్టకుండా వుండాలంటే.'

'చప్పట్లు కొట్టిందో లేదో! ఎక్కణ్ణుంచి వచ్చారో యమభటుల్లాంటి వాళ్ళిద్దరు సిద్దీలు- నాలుగు బెత్తల వెడల్పుఉన్న కరవాలాలు పుచ్చుకొని- నువ్వు గజగజలాడావు.'

'అమ్మయ్యో!'

'వీణ్ణి లాక్కెళ్ళి పాతాళగృహంలో ఇనప కొట్టులో వెయ్యండి అందామె. నిన్ను తీసుకొనిపోయి అల్లాగే ఇనపకొట్టులో పడేశారు.'

'ఆ అవతారములోకూడ ఖైదే మనకు?'

'ఆ! ఇంకా ఎన్ని అవతారాలల్లో ఖైదో. ఇనపకొట్టులోవేసి, నీళ్ళు, రొట్టీ మాత్రం ఇస్తూఉండేవారు. నాలుగోరోజున రాత్రి పన్నెండు గంటలకు నవాబుయొక్క నాలుగువందల ఒకటోరాణి కావడానికి చూస్తూఉన్న ఆ బాల, కటకటాల తలుపులు తీసి, లోపలికివచ్చి, నిన్ను కౌగలించుకొని ముద్దు పెట్టుకొంది. నువ్వు తెల్లపోయి సంతోషంతో ఒళ్ళుమరిచావు. భోజనం అదీ దిట్టంగా పెట్టూ ఉండడం, రాత్రిళ్లు నీ కొట్టులోకి వచ్చేది, లేదా, తన శయనమందిరానికే తీసుకొనిపొయ్యేది. ఒక రోజున నవాబుకు ఈ సంగతి తెలిసింది. మహానుభావుడు కాబట్టి తన కక్కుర లేదని ఇద్దర్నీ-'

'నరికించేశాడా!'

'అంతేనా మరి? ఏనుగులచేత తొక్కించడానికి ఆజ్ఞ ఇచ్చాడు. తర్వాత నవాబుకు పాంచాలంలో రాజులు తిరుగబడ్డారని వార్తవచ్చింది. మీ ఇద్దరిగొడవా మరచిపోయి సైన్యాలతో వెళ్ళాడు కాపలా ఉన్నవాళ్ళకు లంచాలిచ్చి మీ రిద్దరూ దక్షిణదేశాలకు పారిపోయి కృష్ణదేవరాయల కొలువులో చేరారుట.'

'మాంచి కథరా!'

ఢిల్లీనుండి బయలుదేరి మథుర, బృందావనము, ఇంద్రప్రస్థము, కురు క్షేత్రము, హస్తినాపురము మొదలగు దివ్యక్షేత్రము లన్నియు జూచినారు. ఈ పవిత్ర ప్రదేశముల భగవంతుడు శ్రీకృష్ణుడు చరించినాడు. పాండవులు కౌరవులు

రాజ్యమునకై పెనంగినారు. మహాభారత మంతయును వారి మనోనేత్రములకు గోచరించినది. కురుక్షేత్రమున అభిమన్యు యుద్ధమును స్మరించి మన యాత్రికులు కన్నుల పడిపోనిరి.

బృందావనములో వారికి మీరా కథ స్మరణకు వచ్చినది.

'పురుషుఁ డెవ్వండిచట ?'
పురుషుడాతడొకండె పురుషోత్తముండు.
పురుషు డాతడొకండె
పొలతులము మనమంత,
దివ్యపురుషుని ప్రేమ
తేజఃప్రదీప్తులము,
పురుషు డెవ్వం డిచట ?
సాధుపాదాలపై
నా బ్రతుకుపువునుంతు
పూజగై కోవేర
పొలతులను బ్రోవరా !
పురుషు డెవం డిచట ?'

అని పరమేశ్వరుడు పాడినాడు.

## ౧

## బృ ం దా వ న ము

స్నేహితుల కిరువురకు మీరాబాయి దివ్యచరిత్రము కనులగట్టినది. మీరాబాయి శ్రీకృష్ణుని కొనియాడుచు బృందావనము వచ్చినది. అప్పుడు బృందావనమున కొక మహాత్ముడు వచ్చి యుండెను. ఆస్వామి తా నున్నంతకాలము బృందావనములోనికి స్త్రీలను రానియ్యవలదని యాజ్ఞనిడుటయు, ప్రజ్ఞావంతుడగు నాసన్యాసి యాజ్ఞ పూర్ణముగా నిర్వర్తింపబడుచున్నది. ఇంతలో మీరాదేవి బృందావనము ప్రవేశింపబోవు చుండ 'నిలు నిలు' మని అడ్డగించినారు.

'ఎందుకు నాయనా ఆపుచేశారు ?'

'తల్లీ ! నువ్వు స్త్రీవి. బృందావనములో ప్రవేశించవలనుపడదని మా గురువు గారి ఆజ్ఞ !'

'మీ గురు వెవరూ ?'

'హిమాలయంలో తపస్సుచేసి మహత్తులు సంపాదించిన మహాఋషి మా గురువు శ్రీ శ్రీ రూప గోస్వామి !'

ఆలాగా ! అయితే ఈ పాట వినిపించండి ఆయనకు' అని శ్రీ మీరా 'పురుషు డెవ్వడు ? శ్రీకృష్ణు డొక్కడే పురుషుడు, భక్తులందరు స్త్రీలు, పురుష

నిలో లయమగుటకే తపస్సులు భక్తియున్ను' అని పాట పాడినవట. శిష్యులా పాటను గురువుగారికడకు బోయి వినిపించుటయు నాస్వామి నిర్విణ్ణుడై యర్థము గ్రహించి 'యేది నా తల్లి' యని పరుగెత్తివచ్చి యామె పాదాలబడి 'తల్లీ సత్యసూత్రము నాకనుగ్రహించి నా గురువైనావు. మూర్ఖుడను క్షమించు. స్త్రీలు మోక్షం భంగం చేసేవాళ్లు. ప్రకృతి స్వరూపిణులు అనుకొని, వీళ్లను చూస్తే పురుషుని హృదయం మోసపడిపోయి దగ్ధమగునని తప్పుదారిని పడ్డాను' అన్నాడు.

ఆకథ స్మరించుకొనుచు నా పాట పాడుకొనుచు, తులసివనము, యమునా ఘట్టము, కాళీయహ్రదము, గోవర్ధనము మొదలగునవి దర్శించినారు.

'కృష్ణా కృష్ణా! గోపకుమారా!
బృందావన సంచారా!
మురళీమోహన, మృదుపదనర్తన
మోహనలీలా కారా!
సుందరనందకుమారా!
కృష్ణా కృష్ణా

యని పరమేశ్వరుడు పాడుచు 'నారాయణా! యీ వెన్నెలగడియల్లో యమునాతీరాన్ని రాసక్రీడాలోలుడైన శ్రీ వేణుగోపాలుని చూద్దామురా' అన్నాడు.

నారాయణరావా మాట వినిపించుకోలేదు. శ్రీ గోపాలకృష్ణ పరమేశ్వరుడు దివ్యబాలుడై యీ ప్రదేశముల నాడుకొన్నాడా? మోహార్తులగు వ్రజసుందరులకు సర్వసమర్పణ నేర్పినాడా? ప్రేమయనగా స్త్రీపురుషుల పరస్పరవాంఛయేనా? మోహావేశమున తాను ప్రేమించు బాలికనే దేవస్వరూపమున నెంచి పూజించెదరా? ఎంత మౌఢ్యము. ప్రేమికులకు ప్రేమ భక్తియే కాదా! నిజమైనప్రేమ ప్రతిఫలము కోరదు. నాథుడితరులను ప్రేమించుచున్నాడని కించపడదు. ఐక్యమే పరమావధిగా గోరును. ఆ ఐక్యభావము సార్థకమగుట ఒక భగవంతుని పాదముల మ్రోలనేకదా.

చిన్నతనాన ప్రేమయే భక్తియని, భక్తియోగము గరపిన నందబాలుడు, వెన్నముద్దలదొంగ, రాధికా హృదయనాథుడు, గోపికా మనశ్చోరుడు, కురుక్షేత్రాన మహావేదసారము, ఉపనిషత్తుల నవనీతము, సాంఖ్యామృతము కలియబోసి, నిగ్గుతేల్చి సర్వమతాభిప్రాయాలు సమన్వయించి నరస్వరూపుడయిన వివ్వచ్చునకు బోధించి. లోకానికి యుగయుగాలకు సందేశ మిచ్చినాడుగదా. ఈ మహాభావము నిలువెల్ల దివ్యామృతముచే నింపుటలేదా? ఆపుకోలేని మధురావేశము పవిత్రాంబువులై నయనాంచల బిందుధారలై జన్మము పూత మొనర్చుచున్నది

'ఒరే పరమేశ్వరం! సాంఖ్యవిచారం ఉత్కృష్టమైనదేరా! కాని సాంఖ్యము ఏమి చెప్పింది? ప్రతియాత్మయు పురుషుడు, అతడే సాక్షీభూతమగు పరమాత్మ, వ్యక్తిలోని మనస్సు, అహంకారము, బుద్ధి, ఇంద్రియములు అన్నియు ప్రకృతి. తెలియనివ్యక్తికి సాక్షీభూతుడగు పురుషుడు మరుగుపడి ప్రకృతిచేత

గప్పబడి తనబిడ్డలు తనయిల్లు వాకిలి అని మోసపోయి, గిట్టుతూ, పుట్టుతూ ఉండును. కాని జ్ఞానముచేతనూ, యోగముచేతనూ నువ్వు నిన్ను తెలిసికొంటే అప్పుడు పురుషునికినీ ప్రకృతికినీ సమ్యక్‌స్థితికలిగి అంటే నిశ్చల సమాధికలిగి జన్మ రాహిత్యము సంభవిస్తుంది సాక్షీభూతుడగు పురుషుడు ఏమిన్నీ మార్పులు చెందడు. ప్రకృతియే మార్పులు చెందుతూ ఉంటుంది. పురుషుడు కుంటిమగని వంటివాడు. ప్రకృతి గుడ్డిభార్య. ప్రకృతికి పురుషుడు దారిచూపిస్తూ వుంటే ప్రకృతి పురుషుని మోస్తూ ఉంటుంది.'

'ఈసాంఖ్యధర్మంలో ఉండే లోటేమిటి? శ్రీకృష్ణ డెల్లా ఆలోటు తీర్చాడు?'

'కపిల మహర్షి యింతవరకును బోధించి, ఆ బోధ సంపూర్ణంచేయలేదు. కాని ఒక్కొక్క ఆత్మ ఒక్కొక్క పురుషుడుగదా. అంటే విశ్వంలో కోటాను కోట్లు పురుషులు వివిధ వ్యక్తిత్వాలతో ఉంటే ఈ పురుషుల శక్తి యేమిటి? ఆద్యంతరహితులై సర్వ బ్రహ్మాండ స్వరూపులే అయితే, వీళ్ళందరినీ నడిపే నాయకు డొకడుండాలి. వీళ్ళందరినీ సృష్టించిన వాడొక డుండాలి కదా! అల్లా కాకపోతే ఇన్నికోట్ల ఆత్మలు ఇన్ని బ్రహ్మాండాలు అవుతారా? కాబట్టి శ్రీకృష్ణుడు ఉపనిషత్తులకు పొయ్యాడు. ఉపనిషత్తులు ఏమన్నాయి ఆద్యంతరహితమై అనిర్వచ నీయమైన బ్రహ్మమున్నది. ఆ బ్రహ్మము స్థితి ఎంతటి జ్ఞానవంతులున్నూ ఊహించ లేరు. ఆ బ్రహ్మపదార్థములోనుంచి మూలప్రకృతి జన్మించింది. ఆ మూలప్రకృతి వలన ఈ సృష్టంతా ఉద్భవిల్లింది. సృష్టిలోని ప్రతివ్యక్తియు, ప్రతిప్రాణిన్నీ బ్రహ్మమే. నక్షత్రాలు, ఆకాశం, భూమి, పురుషులు, స్త్రీలు, కుక్కలు, గుట్టాలు అన్నీ అన్నీ. ప్రకృతి ఉండడంవల్ల ఈ సృష్టిలో వ్యక్తిత్వం. ఆదిరహితం చేసుకుంటే బ్రహ్మలో లయం.

'శ్రీ కృష్ణపరమాత్మ ఏమన్నాడు? అన్నీ ఒకటే చెపుతున్నాయి. కాని సంపూర్ణంగా ఏదీ వ్యక్తీకరించడంలేదు. సృష్టికలిగిన కారణం నీకువలదు. అది చిదానందము. కాని సృష్టివుంది. సృష్టిలో పురుషుడు ప్రకృతి సాంఖ్యంలో చెప్పి నట్లే కాని ఈ పురుషుడు, ఈ ప్రకృతిన్నీ ఒక్క పురుషోత్తముని స్వరూపాలే. అన్నీ ఒకటే, సాక్షీభూతుడగు పురుషుడు, ప్రకృతిస్వరూపం, అన్నీ పురుషోత్తముని అవతారాలు. నిజమైన లయంవచ్చి నప్పుడు ప్రకృతి పురుషునిలో లయమై పురుషుడు పురుషోత్తమునిలో లయం అవుతాడు. అని చెప్పాడు.'

'ఒరే నారాయుడూ! మనం భగవద్గీత ఇంకా విపులంగా చదవాలిరామరి.'

ఆగ్రా వచ్చారు, ఇరువురు యాత్రికులునూ! ప్రియవధూమణిపై ప్రణయము మూర్తించినట్టి ప్రణయినీ విరహము ముద్దకట్టినట్టి, కన్నీటిబిందువులు ఘనీభవించిన యట్టి,నిర్మల హృదయము నీడై ప్రతిఫలించిన యట్టి తాజమహాలు ప్రథమ దర్శనము వెన్నెలలో నొనరించెదముగాక యని యమునాతీరమున కారాత్రి వెడిలినారు.

ప్రపంచమున మానవుడు సృజించిన సప్తాద్భుతములలో నిది యొకటియట. సమస్త రేఖలు, వంపులు, ఎత్తులు, సమ్మాలంకారములు సంపూర్ణస్వరూపము ఒక్క శ్రుతిలో మేళవించిన మహారాగమునలె తాజమహాలు కాళిందీతీరమున సౌందర్యము మొలకలెత్తినది

ఉదయారుణరాగము తాజమహాలు శిఖరములపై ప్రసరించినప్పుడు చూచినారు. మధ్యాహ్న నిశ్చలతలో గమనించినారు. నక్షత్రకాంతిలో బరికించినారు. చూచినకొలది నొక వింత యానందము, తీరని తృష్ణ వారికి నుద్భవించినది.

నాల్గవనాటిరాత్రి స్నేహితు లిరువురు బయలుదేరినారు. పరమేశ్వరుడు తాజమహాలును పదునేను చిత్రములుగా చిత్రించినాడు. ఆరాత్రి నారాయణరావు తాజమహాలు గీతము పాడుటకు సంకల్పించుకొనెను. పరమేశ్వరుడు తల నాకసము దెస కెత్తి నక్షత్రముల గమనింపుచు గూర్కబోయెను. ఇరువురు యమునాతీరమునకు బోయినారు.

· నారాయణరావు ఫిడేలు మేళవించి కమాను తీగలపై నానించి కదిపినాడు.

సపారీ

యమునా కల్యాణి. కల్యాణిరాగము, యమునారాగము, కల్యాణి పరమాత్ముని శక్తి: శిల్పశక్తి ప్రత్యక్షము. యమునా ఝరీవేగము ప్రేమప్రవాహము. రెండింటికిని సంయోగము. అదియే యమునాకల్యాణి. నారాయణరావు యమునాకల్యాణి రాగ మాలాపించి, రూపకతాళమున తానము ప్రారంభించినాడు.

క్షీరశిల కరిగిపోయినది. యమునానది ప్రవహించుటమానినది. తాజమహాలు మాయమై యచ్చట షహజహాను, ముంతాజరాణి, పద్మాసనాసీనులై తోచినారు. అంతయు మధురమైనది. పరమేశ్వరు డాయానందములో లీలానంత స్వరమై యూగుకొన్నాడు........

దయాలుబాగు సత్సంగులకు మక్కా. అచ్చట వారి సద్గురుమహారాజు నివసించుచుందురు. ఇప్పటివా రైదవగురువుగారు, సాయెబ్జీ మహారాజువారు ? నాల్గవ గురువుగారి కాలములో నీ యాశ్రమము ప్రారంభింపబడి నేడు సర్వతోముఖముగ విజృంభించి యున్నది. సత్సంగమతము ముఖ్యముగా మూడు విషయములు బోధించుచున్నది. మతము, సంఘము, పారిశ్రామిక విషయములు. పరమాత్మ శబ్దస్వరూపమై యున్నాడు. 'రాధాస్వామి' అని ఆయనశబ్దము. ఆశబ్దమైనను మన ముచ్చరింపజాలని. మనము వినజాలని అతీంద్రియశక్తికే గోచరించునట. కాని అస్వరూపమున భక్తులకొరకు పిండాండములో అనగ ఈ ప్రపంచములో నట్టిరూపమున దర్శనమైనదట. 'రాధాస్వామిదయాళునకు' రూపములేదు. ఆయన శబ్దమాత్రము. ఈ విశ్వమంతయు మూడుభాగములుగ విభజింపబడి యున్నదట. పిండాండము,

బ్రహ్మాండము, శుద్ధచైతన్యము. పిండాండము భౌతిక సంబంధము. బ్రహ్మాండము మనస్సంబంధమైనది. ఈ మూడు విభాగములు ప్రతి జీవునిలో నున్నవి. పిండాండ విభాగము అందరకు దెలియును. బ్రహ్మాండములో ప్రథమము జ్ఞానచక్రము భ్రూమధ్యమున నుండును అందుండి ఆత్మధార సహస్రారము, జ్యోతిర్నారాయణము, సున్న, మహాసున్న, వంకనాళములకు బోవునట. ఆపై శుద్ధ చైతన్యము. అందు ప్రథమము భ్రమరగుహ, దానిపై సత్యలోకము, ఆగమ అలకలోకములు. అన్నిటి కన్న పైన రాధాస్వామిధామము. అరిషడ్వర్గముల బారద్రోలి, రాధాస్వామి దయాలుని కృపవల్ల సులభముగ పిండాండము బ్రహ్మాండము దాటి శుద్ధ చైతన్యము జేరు యోగమార్గము సద్గురువు దెలిపెదరట. మనమా రాధాస్వామి దయాలుని పాదముల నమ్మియుండి, శబ్దములు పాడుచు, యోగమాచరించుచు, సంతులతో సత్సంగ మాచరించుచు విశుద్ధజీవనము చేయుచుండినచో, ఈమూడు ముఖ్యవిభాగ ప్రదేశము లలోనున్న వివిధోపలోకములను దాటుచుబోయి సంతులు పరివేష్టించియుండు సంతి సద్గురువు వారిధామముచేరుదుము. అచ్చటనుండి సంత సద్గురువే నిన్ను రాధాస్వామి ధామము చేర్చగల శక్తిగలవాడు. వివిధ ధామముల జేరునప్పు డచ్చటనుండి 'సంత దివ్యులు' వివిధ ధ్వనులతో వివిధవర్ణ తేజస్సులై కన్పించెదరట. ఇది దయాలు బాగు సద్గురు మహారాజువారు బోధించు ఆధ్యాత్మిక తత్త్వము.

రెండవది సంఘసంస్కరణ. ఏమతమువారైనను సత్సంగులు కావచ్చును. వారికి జాతి మత వర్ణ వివక్షలుండరాదు. భోజన ప్రతిభోజనములకు వివాహములకు వర్ణము లడ్డమురావు. యువవివాహములు చేయవలయునుగాని, బాల్యవివాహములు పనికిరావు. అర్థములేని యీనాటి ఆచారము లన్నియు త్రోసివేసి, శుభ్రతయే యాచా రములకు ముఖ్యసూత్రముగా బరిగణింపవలయును.

ఎప్పుడు జాతిమత వర్ణ వివక్షలుండవో, కలిమిలేముల తేడాలు నుండరాదు. సంఘమంతయు సంఘముకొరకు బాటుపడవలయును. ఆస్థియంతయు సంఘముది. సంపాదనయంతయు సంఘముదే. కావున సంఘమే వ్యక్తుల కుటుంబముల బోషించును. ఈ మహాసూత్రము నాచరించుటకై, దయాలుబాగులో వస్త్రములు ఊటకల ములు, కత్తులు, గ్రామఫోనులు, రంగులు, సీసాలు, గరిటెలు, గడియారములు, వెన్న, జోళ్ళు, పెట్టెలు మొదలగు నన్నిరకములగు సామానులు పాశ్చాత్యదేశము లతో సమానముగ నొనర్చుచున్నారు. ఏదేశమునకు వలయు వస్తువుల నాదేశమే చేసికొనవలయునను ధర్మమును దయాలుబాగువారు మనకట్టెదుట కనబరచుచున్నారు. అహో దయాలుబాగా! నీకు నమస్కారములమ్మా, సద్గురూ! నీకు జయమగుగాక! అన్నారు వారు. నారాయణరావును బరమేశ్వరుడును దయాల్‌బాగులో నివసించి సద్గురువుగారి బోధనలు విని సంతసించి, వారి యాధ్యాత్మిక తత్త్వము భగవద్గీతా బోధతో సమానము మాత్రము కాదని నిశ్చయించుకొనిరి.

౮

# స్నేహితులకాహ్వానము

రాజేశ్వరరావు బి. యి. పరీక్షలో నెగ్గి కృతార్థుడై పని నేర్చుకొనుచున్నాడు. అతని ప్రాణమంతయు రాజమహేంద్రవరములో సుబ్బయ్యశాస్త్రిగారి యింటిలో నున్నది. ఒకసారి దక్షిణాదికి బోవలసివచ్చినది. ఒకసారి మలబారు తీరమునకు వెళ్ళినాడు. మొదటిసంఖ్యలలో గృతార్థుడు కావలసిన యా యువకుడు, పరీక్షలో నెగ్గుటయే కష్టమైనది. ప్రభుత్వపు నౌకరీదొరుకుట దుర్లభము. కావున హైదరాబాదు సంస్థానములోనో లేక జిల్లాబోర్డులోనో యుద్యోగము సముపార్జింప నాతని కోరిక.

ఆలం, రాజారావు మున్నగు మిత్రులు రాజేశ్వరుడు మకాముచేసిన వై.ఎమ్. సి. ఎ. లో జేరినారు. ఆలం బి. యల్. పరీక్ష నెగ్గినాడు. 'అప్రెంటిస్' పరీక్షలో జేరి యడ్వకేటయి చెన్నపురిలో గృతార్థుడగుటకు నారాయణరావు ఆలంను తన దగ్గరనుంచుకొని, కృషిచేయించినాడు. ఆలంకు నారాయణరావన్న ప్రాణమే. అతనికి బ్రాహ్మణతురకయని స్నేహితులందరు పేరిడిరి.

ఆలం బి. యల్. తరగతిలో జదువుచున్నప్పుడు ట్రిప్లికేనులో వర్తకము చేయు నెల్లూరు మహమ్మదీయ వర్తకుని కొమార్తె నిచ్చి వివాహము చేసినారు; వివాహము నెల్లూరిలోజరిగినది. నిక్కా ఉత్సవమునకు మన మిత్రబృందమంతయు విచ్చేసినారు. ఆంధ్ర తమిళ దేశములలో హిందూమహమ్మదీయసమస్య లేనేలేదు. మహమ్మదీయులు హిందువులు సోదరులవలె మెలంగెదరు. మహమ్మదీయుల హృదయములలో నీర్ష్యాగ్ని ప్రభుత్వమువారు అనేక రీతుల రగుల్కొల్పిరి గాని యది రాజినదికాదు. మహమ్మదీయులు హిందూదేవాలయములను గౌరవించుచున్నారు. హిందువులు మసీదులకడ వాద్యములు వాయించరు. తెలుగుదేశముల మహమ్మదీయుల సోడాషాపులలో బ్రాహ్మణులుకూడ షర్బతులుత్రాగుచుందురు. కిళ్లీలు కొందురు. మహమ్మదీయ యోగుల గోరీలకు బోయి హిందువులు పూజలు చేయించుచుందురు.

ఆలం స్వస్థలమగు నేలూరి కెన్నిసారులోపోయి, నారాయణరావు మొదలగు మిత్రు లాలంగారి యింటిలో మకామువేసి, భోజనమునకు మాత్రము హోటలునకు బోయి, తక్కిన ఫలహారాదు లాతని యింటనే భుజింపుచుండిరి.

ఆలం మంచివస్తాదు. కుస్తీలో నేర్పరి. కాలిబంతిలో, హాకీలో, 'వెనుకటి' యిద్దరి యాటకాళ్ళలో నొకడు. వెనుకనుండి యాతడు బంతిని కొట్టినచో అది అవలి కక్షవారి 'గోలు' (బంతి దాటిపోకుండ కాపాడవలసిన రెండుకట్టలమధ్య స్థలము) వరకు పోయెడిది. అందుకని ఆలంకు 'ఫుట్‌బాల్ పులి' యని పేరు

వచ్చినది. ఈ కాలిబంతి యాట వలననే ఆలం నారాయణరావులకు స్నేహము వృద్ధియైనది.

ఆంధ్రదేశ మేయాటలయందును పేరు వహింపలేదు. కాలిబంతికి కలకత్తా, క్రికెట్టునకు బొంబాయి, చెన్నపట్టణము, లాహోరు మొదలగునవి. హాకీకి పంజాబు, టెన్నిసునకు మదరాసు, కలకత్తా, పంజాబు, అలహాబాదు మొదలగునవి. ఆంధ్రులలో నేడు కొంచెము టెన్నిసు, కాలిబంతి, హాకీ క్రికెట్టులు వృద్ధినందినవి.

కాని యాంధ్రులలో గొందరు వీరులు వివిధ క్రీడలలో పేరుగాంచినారు. క్రికెట్టునందు నాయుడు, సి. యస్. నాయుడు, రామస్వామి, బాలయ్య మొదలగువారు; టెన్నిసు ఆటలో రామస్వామి, నారాయణమూర్తి, కృష్ణస్వామి మొదలగువారలు. ఏది ఎటులయిన నాంధ్రులు నిద్రమత్తువారు. సహజమగు క్రీడా కౌశల మున్నను అది వృద్ధిచేసికొనరు. పరదేశములకు బోయి పేరు సముపార్జింపరు.

ఆలంకు ఆటలన్న ప్రాణము. ఆతనికి రాజ్యాంగవ్యాపారము లవసరములేదు. మత విషయములమాట మనసు చొరదు. ఆర్థిక వ్యవహారము లాతని నంటవు. ఆటలు! ఆటలు! హిందూపత్రిక నాటల వార్తలకే చదువును. తక్కిన పుటలు చదువడు. సినీమా కేగుటయైన నాతడు మానును గాని ఎమ్. యు. సి. లో గాని, ఎం. సి. సి. లో గాని, ఎస్ ఐ. ఎ. లో గాని బంతియాట యాడుచున్నచో వెళ్లట తప్పదు. ఇంగ్లండు దేశమునుండి గిల్లీగానుగారి నాయకత్వమున హేట్, మెర్‌సర్, పాండామ్ మొదలయిన ' క్రికెట్టు ' ఆటగాండ్రు వచ్చినప్పు డాలం చెన్నపట్టణములో చూచుటకు ముందు బొంబాయి వెళ్ళి చూచివచ్చెను.

రాజే :—ఒరే ఆలం! నారాయణా పరమేశ్వరం ఎక్కణ్ణుంచిరా నీకు ఉత్తరంరాస్తా ?

ఆలం :—నాకు సాంచీ నుంచి ఉత్తరం రాశారు. అందులో పరమేశ్వరం కవిత్వమే రాశాడు. నిన్ను తిట్టారురా యిద్దరూ! నేనూ నటన్ రాజారావూ అజంతా వచ్చి కలుసుకుంటే, అజంతా, ఎల్లోరా, నాసిక, ఔరంగాబాదు, ప్రతిష్ఠానము, కార్లే, కన్హేరీ, ఎల్ఫాంటా, పూనా, వాతాపి, బీజపురం, పండరీపురం, హైదరాబాదు, ఒరంగల్లు, పాలంపేట, అవన్నీ చూచి అక్కడి నుండి బెజవాడ మీదుగా ఇళ్ళకు చేరుకోడంట, ఈ యాత్రలన్నీ రెండు నెలలు పట్టుతవట. మనం అంతవరకూ ఉండలేకపోతే అజంతా ఎల్లోరాలన్నా చూచి వెళ్ళిపోవచ్చునట.

నటరాజన్ :—నన్నర్జంటుగా రమ్మనమనిదా తంతి యిస్తుడు ఆలం! ఎందుకుదా ? అని వస్తును. తీరాచూస్తి దీనికీదా. రాజేశ్వర్! నువ్వుకూడా బయల్దేరుదామరి.

రాజే :—నేను నిజం చెప్పాలి. మాయిల్లువదలి చాలారోజులయింది. మా అమ్మగారు బెంగపెట్టుకుందనీ నువ్వువేగిరం రావాలి అనీ మావాళ్లు ఉత్తరాలు, టెలిగ్రాములు పంపారు. కాబట్టి మీరంతా వెళ్ళండి.

రాజా :—ఏమోయ్ రాజీ! నాకు మాత్రం ఇంటికి వెళ్ళాలనిలేదుపోయి. మా వాళ్ళని పిల్లలను చూసి చాలా రోజులైంది. మా అమ్మ బెంగ పెట్టుకుంది. పైగా నేను అమలాపురంలో దుకాణం పెట్టాలని నిశ్చయించుకున్నాను. అశ్రద్ధ చేసేందుకు వీలులేదు. నాకు మాత్రం వచ్చేందుకు వీలుందా. అయినా బయలుదేరుతున్నానా లేదా?

నట : —నాకూ తీరుబడిదాలేదు. ఇప్పుడుదా మా హాస్పత్రులు నిండా పనిలో ఉంటును.

ఆలం —ఏ రైటరుకో లంచమిస్తే సరి—

రాజా —అంతమంది డాక్టర్లున్నారు. నీవే అవసరమా?

ఆలం :—అబ్బాయిలు! ఎవ్వరూ ఏమీ అభ్యంతరం పెట్టేందుకు వీలులేదు. ఇంక మూడురోజుల్లో బొంబాయి మెయిలుమీదో, ఎక్స్‌ప్రెస్ బండిమీదో ప్రయాణం. రాజేశ్వరుని బడాయిమాటలు ఎవరెరుగరురా? రాజమండ్రీలో గులాబి పుష్పాల సువాసన ఇక్కడకు కొట్టి వీడికి వెఱ్ఱెత్తుతోంది.

రాజే : —నాకు కోపం తెప్పించకోయ్!

ఆలం :—నవాబులు ఒకళ్ళ బెదిరింపులకు బెదరరు. పుష్పం మనదైతే ఎప్పుడైనా దొరుకుతుంది కాదుట్రా రాజీ.

రాజే :—ఒరే ఆలం! జాగ్రత్తరోయ్, నీపని శ్రుతిమించి రాగాన్ని పడుతోంది.?

ఆలం :—గ్రామఫోనువాళ్ళను పిలిపించరా మరి!

నట :—రాజీ అపశ్రుతిదా అవుతాడేమో.

రాజా :—మీకంతా వెఱ్ఱియెక్కినట్లుంది. మీకందరికీ మెదడు శస్త్రం చెయ్యించాలిరా. ఆ నాచుపట్టిన మెదళ్ళన్నీ కాస్త బాగుచేసి మళ్ళీ పెట్టేస్తాను. ఏవంటారోయి!

రాజే :—డాక్టర్లు కురుపులు కడుక్కుంటూ, మాత్రలు నూరుకుంటూ కూచోక, వేళా కోళాలు కూడానూ?

రాజా :—ఇటుకలు పోతపోసే యింజనీర్లకన్న వైద్యులు నయమోయ్

ఆలం :—రెండూ రెండే. ఒకడు నాచేతిమాత్ర వైకుంఠయాత్ర అంటాడు. రెండో వాడు నేకట్టిన వంతెనా, అది బద్దలయి నీళ్ళలోగంతెనా?

రాజా :—కొంపలు మాపే తమ లాయరుద్యోగం చాలా గొప్పది కాబోలు. ఏమీ ఎరగని వాళ్ళకు తలమార్చుడాలు నేర్పి, సంసారాలు దిబ్బచేసేదెవరో?

నట :—మీరంతా ఒకటేదా. మా రైతుల రక్తం పీల్చడానికిదా పుట్టారు. మీరు మా దేశంలో ప్రవేశించిన చీడపురుగులవంటి వాళ్లుదా.

రాజా :—ఈ అసలయిన రైతుబిడ్డ ఈ నటరాజన్ ఏమిబాగా మాట్లాడుతున్నాడు. ఒరే రైతూ! నీ తెలివితక్కువ తనాన. నీ శక్తి లేకపోవడం మూలాన పరరాజ్యాలవాళ్లు వచ్చి మన దేశం ప్రవేశించడం మనలందరినీ రక్తం పీల్చడం కలిగింది. ఓరీ అరవ రైతూ.

ఆలం: అచ్ఛా అచ్ఛా, బహుత్ అచ్ఛా హై! సుల్తాన్‌వారి ఆజ్ఞ హేమిటి చెప్తారట్టా!

రాజే:—నేను రావడం సుతరామూ వీఱలేదు.

ఆలం —అయితే ఒక సంగతి చెప్తాను వినండి. మనవాళ్ళకి నేను ఉత్తరప్రత్యుత్తరాలు రాస్తూ ఉంటాను. వాళ్లు ఎప్పుడు హైదరాబాదు వస్తారో అప్పుడంతా హైదరాబాదు వెళ్ళి కలుసుకుందాము. అక్కడ చూడవలసినవి చూసి, ఒరంగల్లు, పాలంపేట చూసి అందరం బెజవాడ వద్దాము. ఏవంటారు.

రాజే:—తురకాడు తురకాడేరా! హైదరాబాదులో మనవాళ్ళని కలుసుకోవాలేం? షరం నహీ హై?

ఆలం:—హహ్హహ! ఎక్కడ నేర్చుకున్నావురోయి తురకం?

రాజే:—నాకు వచ్చిందోయి. రాజేశ్వరుల వారికి ఇబ్బందిలేదు. ఎటువచ్చీ నటరాజన్‌గారికి మనం యిబ్బంది పెడ్తాం.

నట:—నువ్వు రావడందా! హాజరుదా?

* * *

రాజేశ్వరరావు మేఘాలమీద రాజమండ్రీలో వ్రాలినాడు. వచ్చినప్పటినుండియు పుష్పశీలయే కలవరింత! ఆమె నెటుల కలుసుకొనుటా యను విరహవేదనయే.

రాజేశ్వరుడు చదువుకొను రోజులలో పుష్పశీల కడనుండి యుత్తరములు చిత్రముగా తెప్పించుకొనువాడు. తానొక స్నేహితునికి వ్రాసి యచ్చటినుండి యొక బాలకునిచే నామె కా ఉత్తరము అందునట్లు చేయువాడు. ఆమె తన ఫొటోలు రెండు అతనికి బంపినది. వానిని 'దాస్ బ్రదర్సు' వారికడ నలభై రూపాయిలిచ్చి పెద్దవి చేయించినాడు. తన గది యలంకరించుకొన్నాడు. ఆమె చిన్న చిత్ర మొకటి తీయించి, తన యుంగరములో నిమిడించుకొన్నాడు. ఇంకొకటి వాచి గొలుసులో బెట్టుకొన్నాడు. ఇకనేమి? లోపల బయట నంతట పుష్పశీలయే. విశ్వమెల్ల బుష్పశీలా మయమే.

వీరిరువురి సంబంధము నెమ్మదిగా లోకమెల్ల బ్రాకుచు ప్రవహింపుచున్నది.

పుష్పశీలకు రాజేశ్వరుడన్న వెఱ్ఱియెత్తిపోవుచున్నది. భర్తకుగాని యింటిలోని ముసలమ్మకుగాని తెలియునన్న భయముచే అతిజాగ్రత్తగా మసలినది. భర్తపై అనురాగము చూపించ ప్రారంభించినది. తన లీలా విలాసములలో నాతని ముంచెత్తునది. తన భర్తలో రాజేశ్వరుని యూహించుకొనునది. ఈ కౌగలింత, ఈ ముద్దాతని కిచ్చి ననేకదా జన్మము సార్థకము. ఈ ముసలికోతికి తన యీవిలువ గల కౌగిలింత, ముద్దు ధారపోయవలసివచ్చుచున్నది. భగవంతు డింత నిర్దయుడేమి యనుకొన్నది.

ఛీ! ఛీ! మనిము చేయు నీ పాపకార్యమునకు భగవంతుని దలచుటేల! యను కొన్నది. ఇందు పాపమేమున్నది? శుద్ధమైన ప్రేమే వివాహమని భర్త రహస్యముగా తెచ్చుకొన్న నవలలో నున్నదిగా! ఆ నవల ' స్వతంత్ర ప్రేమ ' సంఘాధ్యక్షునిచే వ్రాయబడినదియట!

# ౧౦

## దేశయాత్రా విశేషములు

శారదకు మనస్సేమియో బాధించుచునే యున్నది. మొదటి మూడుదినములు భర్త తన్ను బ్రతిమాలినాడు గాని తరువాత తాను గదిలో నున్నదియు లేనిదియు గమనించకుండ నిదురించినాడు. ' అమ్మయ్యా వదలినా ' డని సంతోషించినది. పిమ్మట కాలము గడచి వారములు ప్రవహించిపోయిన కొలది శారదకు మనస్సు పరిపరి విధముల బోయినది.

భర్త దేశయాత్రకు బోయినాడు. ఏ దేశముల దిరుగుచున్నాడో యని తన తండ్రి ప్రొద్దస్తమానము దిగులుపడుచుండుటవలన, నామెకు భర్తపై కోపము కలిగినది. కాని ఆటలలో సంగీతములో చదువులలో భర్తమాటే మరచిపోవుచుండును.

ఇంతలో నక్టోబరు నెలాఖరున భర్త కొత్తపేట వచ్చినాడనియు గాశీ సంతర్పణ తలపెట్టినారనియు నుత్తరములు వచ్చినవి.

చెన్నపట్టణమునుండి యప్పుడే వచ్చిన జమీందారుగారు భార్యనుజూచి ' అల్లుడు రాజమండ్రికు వచ్చినప్పుడు మన యింటికి వచ్చినాడా? ' యని ప్రశ్నించెను.

' రాలేదండి. ఈ ఊరు వచ్చినట్లే మాకు తెలవదండీ '

' ప్రొద్దున మెయిలులోవచ్చి యిక్కడ గంగపూజ చేసికొని, బావమరిదిగారి యింటిలో భోజనములుచేసి స్నేహితులతో గొత్తపేట వెళ్ళినాడట '

' మన యింటికి ఎందుకు రాలేదో? '

' ఎందుకు రాలేదని అనుకునేది? అతని యిష్టం. '

' మూడు నెలలైనది ఇల్లు వదలి. ఇచటికి వచ్చికూడా మన యింటికి ఒకసారైనా రాకపోవడం ఆశ్చర్యమే! ఎప్పుడూ అలా సంచరించేవాడు కాదే! ' అని సుందరవర్ధనమ్మ గారనినది.

ఒకవేళ కొత్తచేత సిగ్గుపడినాడేమో? అల్లుడు రాకుండుట కేదియో కారణముండియుండునని యనుకొనవలె. ఏమి కారణమై యుండును! తన భార్యకు అల్లుడన్న బొత్తిగ నిష్టములేదన్న సంగతి గ్రహించినాడు. అనేక పర్యాయములామె కల్లుని గుణగణములు వర్ణించినాడు. అతని గౌరవించనిచో దనను గౌరవించనట్లే యని నొక్కిచెప్పినాడు. ఆమెమాత్రము ప్రసక్తివచ్చినపుడెల్ల నల్లునియందు

నిరసనము చూపుచునే యున్నది. ఉదారహృదయుడైన తన యల్లుడు ఇట్టి క్షుద్ర భావములకు జోటిచ్చువాడుకాడు. భార్యగాని యితరులుగాని అల్లుడు తన యింటికి వచ్చుటకు సిగ్గుపడునంతటి యగౌరవము సలిపియున్నచో నట్టివారికిని దనకు నా నిముషముతోసరి, యని యనుకొని భార్యనుజూచి. 'అతని మనస్సు పరమో త్కృష్టమైనది. అతడు చిన్న చిన్న వానికి మనస్సు కష్టపెట్టుకోడు! ఇంతవరకు ఈ ఊరు వచ్చినప్పుడు మన యింటికి రాకుండా ఉండలేదు. నువ్వెప్పుడైనా అతనికి మనస్సు నొచ్చు కార్యము లేమియు జేయలేదుకదా?' అనెను జమీందారు.

'అబ్బే లేదండి!'

'అతని హృదయం మనవాళ్ళలో ఎవరివల్లనైన కష్టపడిందంటే వారు నాకు కానివారు. ఈ జన్మంలో వాళ్ళకూ నాకూ ఏ సంబంధమూ ఉండదు.'

'అంత విచిత్రంగా మాట్లాడుతారేమిటి? అతన్ని అగౌరవపరచేవాళ్లెవరండి' వరదకామేశ్వరీదేవి లోన కంపించినది. తానేమియు పొరపాటున యల్లుని బాధించ లేదుగదా?

కాశీ సంతర్పణకు జమీందారుగారు భార్యను సోదరుని, కుమారుని శారదను వెంటదీసికొని కొత్తపేట వెళ్ళినారు.

ఎప్పుడు రాని వియ్యపురాలు వచ్చినదని కామేశ్వరీదేవి యడుగులకు మడుగు లొత్తించిరి వియ్యాలవారు. శారదా నారాయణరావులు పీటలపై కూర్చుండవలసి వచ్చినది. దంపతు లిరువురు గంగా పూజ సలిపినారు. పీటలమీద కూర్చున్న బావగారికి కేశవచంద్రుడు ఇద్దరు వస్త్రముల నిచ్చినాడు. కుమార్తెకు, తల్లి సూర్య కాంతముచే పసుపు, కుంకుమ, చీర రవికయు నిప్పించెను. హారతి నిచ్చిరి. బ్రాహ్మణ సమారాధన జరిగినది. సంభావన లిచ్చిరి. వచ్చిన చుట్టము లందరకు గంగ చెంబు లీయబడినవి. జానకమ్మగారి యక్కగారును బ్రతికియున్నంతవరకు సరిపోయినంత గంగ పట్టుకొని వచ్చినాడు కుమారుడని సంతసించినది.

భోజనములైనవెనుక సుబ్బారాయుడుగారి రెండవ భవనమగు మేడలో జమీందారుగారు, శ్రీరామమూర్తిగారు, సుబ్బారాయుడుగారు, నారాయణరావు, నతని స్నేహితులు, తదితరులు నింకను బెద్దలు తాంబూలము వేసికొనుచు కూర్చుండినారు. అలమును, రాజారావును, జమీందారుగారు తన యల్లుని యాత్ర విషయమై అడిగి నారు. కాశీ సంతర్పణకై బెజవాడనుండి వచ్చునపుడు పరమేశ్వరుడు తన భార్యను కొత్తపేట తీసికొనివచ్చినాడు. ఆతడును విశాఖపట్టణములో కాశీ సంతర్పణమును సంకల్పించినాడు.

విశాఖపట్టణమునుండి ఆహూతులై పరమేశ్వరుని తలిదండ్రులును, ఆతని అనుజులు, చిన్న చెల్లెండ్రు వచ్చినారు. రాజారావు తల్లిదండ్రులు భార్య సూరమ్మయు బిడ్డలును, వచ్చిరి.

ఢిల్లీ, ఫతేపూరు సిక్రీ, ఆగ్రా మున్నగు ప్రదేశములందరి వింతలు చెప్పి, దయాలుబాగు చరిత్రమంతయు జెప్పి యచ్చటనుండి జబ్బలు పురమునకు బోయి నారమని నారాయణరావు చెప్ప నారంభించెను.

'జబ్బలపురము దగ్గరనుండి నర్మదానది లోయ చూద్దామని వెళ్ళాము. ఆ పాలరాతి కొండల్ని తొలిచి ఆ నది ప్రవహించే సొంపు, మన గోదావరి పాపి కొండల్ని దొలిచి ప్రవహించు ప్రదేశముయొక్క అందంతో సరిపోతూ ఉన్నదండి. ఆ గుబుర్లు, అడవులు, కొండలు, జలప్రవాహము, నీలాకాశం మమ్మల్ని సమ్మోహింప చేశాయి.'

అక్కణ్ణుంచి భోపాలు వెళ్ళాము. భోపాలు తర్వాత స్టేషను భిల్సా. అక్కడ సాంచి స్థూపము హిందూదేశములో అందమైన స్థూపాలల్లో ఒకటి. ఆ స్థూపము చుట్టూవున్న మహాద్వారములందున్న విచిత్ర శిల్పసంపద ఇంకోచోట లేదండి. ఆ మహాద్వారాల్లో ఒకటి ఆంధ్ర చక్రవర్తుల ఆస్థానపుశిల్పి ధాన్యకటకము నుండి వెళ్ళి, నిర్మించి, చెక్కి వచ్చెనట.'

'సాంచీనుంచి ఉజ్జయిని వెళ్ళాము. శ్రీ కాళిదాసాది మహాకవుల పొగడ్తల నందిన ఉజ్జయిని అద్భుతం అయిందండి. దశకుమారుల చరిత్రము, వాసవదత్త, మేఘసందేశము, కథాసరిత్సాగరము వర్ణించిన మహాకాళేశ్వరుని గుడి, మొదలయిన వన్నియు జూచి యచ్చటనుండి అహమ్మదాబాదు వెళ్ళాము. శ్రీ గాంధిమహాత్ముని సబర్మతీ ఆశ్రమము చూశాము. శ్రీ మహాత్ములవారిని దర్శనము చేసుకున్నాం. ఎక్కి కదిలిస్తే కదిలే 'మినారెట్' చూసినామండి. అట్లాంటివి రెండుండేవిట. ఒకటి ఒక యింజనీయరు విప్పి మళ్ళా కట్టినాడట. అందువల్ల కదలుటమానినది. రెండవది పైకెక్కి ఇటునటు కదిల్చినచో కదిలిపోవును. నీరు గిన్నెనిండుగా పోసి మినారట్ కదిల్చినచో నీ రొలికిపోవును.'

'అహమ్మదాబాదునుండి కథియవారు వెళ్ళి శ్రీ గాంధిమహాత్ముని జన్మస్థానమగు పోర్ బందరుపురము, శ్రీ గాంధిమహాత్ముడు పుట్టిన గృహమును గనుకొని యానందపూర్ణుల మయ్యాము. అక్కడనుంచి ద్వారక వెళ్ళాము. ద్వారకనుండి తిరిగి అహమ్మదాబాదు వచ్చి, అచ్చటనుండి ఆబూ పర్వతం వెళ్ళాము.'

'ఆబూ స్టేషనునుండి ఆబూ పర్వతానికి మోటారుబస్సున్నది. మోటారు మీద నాలుగువేల అడుగుల ఎత్తున్న ఆబూ పట్టణానికి వెళ్ళాము. అచ్చటినుంచి తిన్నగా 'దిలావర' జైన దేవాలయములు చూశాము. అహో ఏమి యాదేవాలయ శిల్పసౌభాగ్యము. ఎంత చూసినను తనివితీరదండి. అంతా పాలరాయి చెక్కడమే. ఆ ప్రదేశం అంతా రూపాయలుపరచి జైనభక్తుడు కొన్నాట్ట. ఎన్నికోట్లు ఖర్చు చేయించి ఆ గుడి కట్టించాడో!'

'దిలావరాన్నుంచి అచలేశ్వరం వెళ్ళి అచ్చట పూజారి బ్రాహ్మణునియింటిలో మకాంచేసి, రొట్టెలు పాలు ఫలహారంచేసి పడుకున్నాం. మరునాడు పొద్దున్నే

దత్తాత్రేయ శిఖరానికి వెళ్ళాము. అయిదువేల అడుగులఎత్తు ఆశిఖరం. పైన ఒక పెద్దరాయి, ఆరాతిపైన ఒక గుడి వుంది.'

'ఆబూపట్టణంనుంచి చిత్తూరు వెళ్ళాం. చిత్తూరు మార్వార్ మహారాణాలు సంగరాణా, భీమసింగు, లక్ష్మణసింగు, హమీరు మొదలగువారు మహాప్రతాపవంతులు పరిపాలించిన ఆ మహాపట్టణము చూచినప్పుడు కన్నుల నీరు తిరిగినది. అక్కడనుంచి తిన్నగా బరోడా వచ్చాము. బరోడాలో నాగి, గైక్వారుగారి భవనములు తోటలు మొదలగునవి యన్నియు జూచి సూరతు వచ్చి యచ్చటనుండి బార్డోలీ వెళ్ళాము. బార్డోలీ ప్రజల వీరత్వమంతయు మొదటినుండి వినియున్నందున, ఆదేశంచూసి, ఆ ఊళ్ళో నాయకులను కలుసుకొని, అచ్చట ఒకరోజాగి, తిన్నగా బయలుదేరి 'జాల్‌గాను' వచ్చి చేరాము.'

'జాల్‌గాను దగ్గర బొంబాయినుండి ఢిల్లీకిబోవు జి. ఐ. పి. రైలు ముఖ్యమార్గమున్నది. జాల్‌గాన్‌నుండి మోటారు చేసికొని తిన్నగా అజంతాకుపోయాము.

'అజంతా చూచి పరమేశ్వరుడు మూర్ఛపోయాడు. అతని ఆనందానికి మేరలేకపోయింది. చిత్రకారులకది కాశీపట్టణం. ఇప్పటికి రెండువేల సంవత్సరాలకు పూర్వంనుంచి పధ్నాలుగువందల సంవత్సరాల క్రితంవరకూ ఆరువందల సంవత్సరాలు వృద్ధిపొందింది.'

'భోగిరానది సాత్పురా కొండలలో పుట్టి ఆ కొండలను రెండు మూడు మైళ్ళు తొలుచుచు ప్రవహించింది. ఆ లోయలో ఒక్క అర్ధచంద్రాకృతిని ఉన్న వంకరలో, యిరువది యెనిమిది గుహలు తొలిచినారు.'

'ఆగుహలన్నీ ఒక్కతరాన తొలిచినవికావు. అవి కొన్ని చైత్యాలక్రింద, కొన్ని విహారాల క్రిందనున్నవి. చైత్యం అంటే గుడివంటి గుహ. విహారము బౌద్ధభిక్షువులుండే గుహ. కొన్నికొన్ని విహారాలలో వేయిమంది సౌఖ్యముగా కూర్చుండవచ్చును. ప్రతి గుహయందూ బుద్ధదేవుని విగ్రహమున్న గర్భమందిరముంది. అట్టి గుహల్లో చాలావాటిలో గోడలకు లోకప్పుకు, స్తంభాలకు మట్టి మొదలైనవి కలిపిన ముద్ద పూసి, దానిపై దివ్యమైన చిత్రలేఖనం చిత్రించినాడు. ఆరంగులు నేడు వ్రాసినట్లుగా ఉన్నవి. బుద్ధజాతక కథ లెన్నియో అందు చిత్రించి ఉన్నాయి. బోధిసత్వుని మూర్తులు, బుద్ధుని మారుడు పరీక్ష చేయుటయున్నూ చిత్రించి ఉన్నది. ఇవికాక అలంకార చిత్రవిన్యాస సంపద ఇంతా అంతా కాదండి. ఏనుగులు, పక్షులు, జింకలు, మనుష్యులు, పళ్ళు, కమలములు మొదలగు పూవులు అన్నియు అలంకార విన్యాసములోకి తీసికొనివచ్చి ఒక్క అద్భుత చిత్రప్రపంచం అల్లారండి.'

'అజంతాలో వారంరోజులున్నాము. అక్కడనుంచి మహమ్మదాబాదుగా ఎల్లోరా గుహలకు వెళ్ళాము. ఎల్లోరా గుహలలో ముఖ్యమైన వదహారవ గుహను రాష్ట్రకూటుల రాజగు మొదటి కృష్ణరాజు దొలిపించినాడు. ఎల్లోరాలో జైనగుహలు,

బౌద్ధగుహలు, హింమాగుహలు ఉన్నవి. అన్నింటికన్న విచిత్రమైనవి హిందూ గుహలే.'

'కృష్ణరాజుకు కుష్టురోగము అంకురించినదట. యెట్టి ఘనవైద్యులున్నా ఆరోగము కుదర్చ లేకపోయినారుటండి. ఇంతలోగా ఒక ముసలి బ్రాహ్మణుడు ఒకరోజున వచ్చి, 'ప్రభూ ఎల్లోరా గుహలోని శివ ప్రీతికరమగు నొక చిన్న కందరములో ఒక 'జల' వెలసింది. అద్దాని సేవించి నీలకంఠుని ప్రార్థించినచో మీకు రోగం నివృత్తి అవుతుం'దని చెప్పి యెక్కడికో వెళ్ళిపోయాడుటండి.'

'తన రాజధాని మాన్యకేతనం వదలి, రాష్ట్రకూటరాజు తిన్నగా ఎల్లోరా వెళ్ళి అచ్చట మకామువేసి, శివుని ప్రార్థిస్తూ ఆశిలల్లోంచి పుట్టిన నీరు తాగాడుటండి. ఆతనికి కుష్టు సంపూర్ణంగా పోయిందట. అప్పుడు శ్రీ పరమేశ్వర ప్రీతికరంగా కైలాసమే ఆ కొండలో నిర్మించాలని ఆ ప్రభువుకు నిశ్చయం కలిగి శిల్పులలో పేరుపొందిన యొక మహానుభావుణ్ణి రప్పించి, కైలాసంవంటి దేవళం ఈ కొండలో దొలిపించాలి అని అన్నాట్ట. ఆశిల్పి కైలాసగిరికి ప్రయాణంచేసి, ఒక ఏడాదిలో తిరిగివచ్చి, అనేక శిల్పులను పోగుచేసుకొని, ఆ దేవాలయం నిర్మించాట్టండి కొన్ని సంవత్సరాలికి.'

'సుమారు నూరడుగులపైన ఆ కొండప్రక్కగా దొలిచి అందులోనే గుడి. మండపం, గోపురం, రెండుధ్వజస్తంభాలు, రెండుఏనుగులు, యాత్రికులమందిరాలు, విహారమండపం అన్నీ చెక్కారు. ఒకే రాయి గుడిఅంతా. సింహాలమీద ఏనుగుల మీద శరభాలమీద సాళ్వాలమీద గుడి నిలిచియున్నట్లు చెక్కారు.'



## ఆంధ్ర మహారాజ్య చిహ్నములు

నారాయణరావు తన యాత్రలనుగూర్చి చెప్పుచున్న కొలది. జమీందారుగారు, సుబ్బారాయుడుగారు మొదలగు చుట్టపక్కములత్యంత సంతోషముతో వినుచుండిరి. ఇంతలో గ్రామస్థులును, నారాయణరావు నెలకొల్పిన గ్రంథాలయ కార్యదర్శియు, నధ్యక్షుడును వచ్చి యందరకు నమస్కృతులిడి కూర్చుండిరి. వారు నారాయణరావును బరమేశ్వరుని తమ యాత్రలగూర్చి యుపన్యాసముల నిమ్మని కోరుటకు వచ్చిరి. జమీందారుగా రల్లుని తప్పక యొప్పుకొమ్మని చెప్పినారు. నారాయణరావు వల్లెయనెను.

'ఒకేరాయి. పైనుంచి యింకొక శిల తీసికొనిరాలేదు. ఇది సరిగదా, ఇక ఆ శిల్పంయొక్క అందం ఇంతని వర్ణించడానికి వీలులేదండి.'

అక్కడకు వచ్చినవారిలో నొకరు 'ఎంతకష్టంఅండి చెక్కడం. ఆ రాతిలోనే అంతా, ఒకేరాయి. లోపలా పైనాకూడా చెక్కాలంటె ఎంత కష్టం. మా గొప్ప శిల్పం అండీ' యనినాడు.

'గుహలన్నీ ముప్పై ఉంటాయి. ముందు బౌద్ధ గుహలు, తర్వాత హిందూ గుహలు, తర్వాత జైనగుహలు బయలుదేరాయి. హిందూ గుహలలో దశావతారం అన్నగుహలో చాలా గొప్ప శిల్పం ఉందండి!'

ఆ సాయంకాలం సభలో పరమేశ్వరుడు మాట్లాడినాడు. నారాయణరావు కంఠముకన్న పరమేశ్వరుని కంఠము ఉపన్యాసము లిచ్చుటలో నెక్కువ గంభీరత దాల్చును. ఆతడు వేలకొలది జనమును దన వాగ్ధారలో ముంచి యెత్తుకొని పోగలడు. నారాయణరావు గొంతుక యుపన్యాసములో మధురముగా నుండును. ధారాశుద్ధిగలది. ప్రతివిషయమునుగూర్చి లెక్కలు మున్నగు వివరములు చెప్పుచు శ్రోతల హృదయము చూరగొనును.

పరమేశ్వరుడు లేచి 'మానవుని హృదయం విశాలం అవ్వాలంటే దేశాలు తిరగడం ఒకమార్గం. ప్రతివిద్యార్థియూ, ప్రతిరైతుకుర్రవాణ్ణి చివరకు ఆంధ్రదేశ మైనా పూర్తిగా తిరిగి రమ్మనాలి. ఆంధ్రదేశం మాత్రం తక్కువవుందా. ఋషి కుల్యానదికడనుండి కంచీవరకు, సముద్రం ఇటు అటు, ముచికుందనది భీమనది మొదలైనవి ఎల్లలు. మనదేశం ఏలినవాళ్లు ఆంధ్రులు. మొదట మనకు చరిత్రలో తెలిసి ఉన్నంతమట్టుకు ఆంధ్రులు ఆఖరి కాణ్వాయన చక్రవర్తిని చంపి, తాము చక్రవర్తులై రాజ్యంచేశారు. ఆరువందల సంవత్సరాలు. తర్వాత ఇక్ష్వాకులు, సాలంకాయనులు, బృహత్కాలాయనులు, పల్లవులు రాజ్యంచేశారు విజయవాడలో, వేంగిలో, కాంచిలోను. తర్వాత గాంగులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డులు, వెలమలు, క్షత్రియులు, తెలగాలు, కమ్మవారు, గొల్లలు, కోమట్లు, బ్రాహ్మణులు రాజ్యాలు చేశారు.

'ఆంధ్రమహారాజ్యముయొక్క చిహ్నాలలో అమరావతి, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, గోలి, ఘంటశాల, నాగార్జునమెట్ట ముఖ్యమైనవి. ఆంధ్రశిల్ప మత్యంత ప్రాభవము పొందినది. అంత ఉత్తమశిల్పము నాటికి నేటికి లేదని వక్కాణింప వచ్చును. అంతయు పల్నాటి పాలరాతిలో చెక్కారు.

'ఆంధ్రశిల్పంయొక్క గొప్పంతా చెన్నపురి, లండను, బెర్లిను వస్తుప్రదర్శన శాలల్లో ఉన్నది.

'పల్లవులున్నూ తమయొక్క చిహ్నాలు కాంచీపురంలో, మహాబలిపురంలో అక్కడక్కడా నిలిపారు. విజయవాడలో వారు నిర్మించినట్టి దేవాలయం కృష్ణ ఒడ్డునే కొండమీద నున్నది.'

ఆతని ఉపన్యాసం వరదలనాటి గోదావరి నదివలె ప్రవహించుచున్నది.

'మహాబలిపుర శిల్పంలోని గంభీరత అతి విచిత్రమైనది. అర్జునుని తపస్సు, కోతులగుంపు, యేనుగుల శిల్పవిన్యాసం మాధుర్యం వెదజల్లు చుండును. అచ్చట రాతిరథములు, ఒకేరాతిలో దొలిచినవి ఆ గుడులు పరమాద్భుతములు. పంచపాండ

వుల రథములు, ద్రౌపదిరథము నున్నవి. ఆ పట్టణ మంతయు సముద్రమున మునిగి పోవుచున్నది.'

'చాళుక్యుల శిల్పము దేశమంతయు వెదజల్లబడియున్నది. పాదామిలో, కళ్యాణిలో, ద్రాక్షారామములో, రాజమహేంద్రవరములో, సింహాచలములో ఇంకా అనేక స్థలములలోనున్న దేవాలయములలో విగ్రహములలో చాళుక్యుల శిల్ప చమత్కృతి కనబడుతుంది. చాళుక్య దేవాలయములు దాక్షిణాత్య దేవాలయములంత పెద్దవికావు.'

'కాకతీయుల శిల్పకళా ప్రాభవము ఓరుగల్లులో, పాలంపేటలో, అమ్మకొండలో దర్శనమిస్తుంది. కాకతీయులు శ్రీ నటేశ్వరుని నాట్యమహానందము చూపించుకొన్నారు వారి శిల్పములో'

'విజయనగర సామ్రాజ్యము హంపి, తాడిపత్రి, పెనుగొండ, గుత్తి, మాచెర్ల, లేపాక్షులలో జూడగలము. హంపీదృశ్యములు జూచిన యేమానవుని గుండెలు తరుగుకొనిపోవు ?'

'మన హృదయములు విశాలత నొంది సర్వమానవప్రేమవిలసితాలు కావలెనంటే కళాపూజకన్న ఇంకోటిలేదు. ఇంతమందిలో భద్రాచలము ఎంతమంది వెళ్లారు ? భద్రాచలము వెళ్ళుటే ఒక చక్కని యాత్ర. గోదావరిలో పడవలలో ఒక వారమురోజులు ప్రయాణము. ముందు, ముందు మోటారు లాంచీలు వస్తాయి అనుకోండి. ఆ పాపికొండల్లో పడవమీద ప్రయాణముచేస్తూ తిప్పలమీద వండుకుంటూ, వెన్నెల్లో తిప్పలమీద పవళిస్తూ కొండలు, అడవులు, గోదావరీ నీలపు లోతులు తన జీవితములోనికి ఆకర్షిస్తూ ప్రయాణము చెయ్యటము ఎంత ఆనందమో ఆలోచించండి.'

'అజంతా లోయలో జలజల ప్రవహించే భోగీరానది ఒడ్డున నిలుచుండి, ఆ జల ప్రవాహము పాడు పాటలు వింటూ గోడల్లా పై కెగసిఉన్న యా కొండల మధ్య కనబడే ఆకాశము చూస్తూ అర్ధచంద్రాకృతిగా ఉన్న ఆ విచిత్ర కందరముల గమనిస్తూ, సంధ్యారుణకాంతులు ఆకాశాన ప్రసరిస్తూ కొండ శిఖరాన్ని ఎరువు చేస్తూంటే, ఆ దివ్య ప్రపంచములో పురాతన శిల్పి చెక్కిన విగ్రహాలకు మల్లే అలా నిలుచుండిపోయాము.'

'వాతాపి నగరములో పశ్చిమ చాళుక్యుల శిల్ప చమత్కృతి ఉన్నది. కన్హేరీ గుహలు గ్రీకుల 'లేబ్రిను' ల వలె ఉంటవి. కార్లేగుహలు అతిపురాతనమగు ఆంధ్ర బౌద్ధగుహలు. రెండువేల రెండు వందల సంవత్సరాలి క్రిత మా గుహలలో నిర్మించిన దారుఫలకములు నేటికినీ చెక్కుచెదరకుండా ఉన్నవి. నాసికలోని గుహలలో ఆంధ్రరాజుల శాసనములు చెక్కించినారు. ఔరంగాబాదు గుహలలో కూడ మంచి విగ్రహములు చిత్రలేఖనములున్నవి, నానాఘట్టములో ఆంధ్ర శాతవాహన ప్రభువుల శిల్పాలున్నవి.'

'బీజపురములో బోలుగుంబాజ్ అనేది ప్రపంచములోనున్న పెద్ద గుమ్మట ములలో నొకటి. ఆ గుమ్మటములో పైకెక్కి గుమ్మటమున కావల నీవల నిద్దరు మనుష్యులుండి ఎంత కేకవేసినా వినబడదు. గుమ్మటము గోడపై, పెదవి యొకరూ, చెవి యొకరూ ఆన్చిరహస్యసములు గుసగుసలు సల్పినచో గూడ స్పష్టముగా వినబడును.

'దౌలతాబాదుకోట అజేయము. తినుబండారములు చేరనీయక మాడ్చవల సినదే కాని మానవమాత్రుడా దుర్గమును శౌర్యముచే చేరలేడు. ధాన్యపు రాశివలె అయిదువందల అడుగుల ఎత్తున ఉన్న కొండను, వరికుప్పవలె చెక్కినారు. కొండ చుట్టూ సమతలానికి నూరడుగులలోతు కందకం నూరడుగుల వెడల్పు ఉంటుంది. సమతలానికి పైన గోడలాచెక్కిన కొండభాగం ఎత్తు నూటఏభై అడుగులు, కొండంతా కోటగోడలు. కొండశిఖరంపై చిన్నకోట, కోటమధ్య రాజభవనం. భవన శిఖరంమీద ఫిరంగి.'

'త్ర్యంబకంలో గోదావరి పుట్టింది. కోట్లకొలది సంవత్సరాల యీడున్న ఆకొండలు నాలుగువేలు, అయిదువేలు అడుగులఎత్తు. సగం ఎత్తువరకు కంకరా, అడవులూ ఆవరించిఉంటాయి. తక్కినభాగం అంతా నల్లటిరాయి. అల్లాంటి ఒక కొండ వెయ్యి, పదిహేనువందల అడుగులఎత్తు ఎక్కాము. ఆపైన ఒక చిన్నగుహ, కోనేరున్ను, కోనేటిపక్కను ఒక గోముఖవిగ్రహం ఉన్నది. ఆ గోముఖంలోంచి చుక్క చుక్కలా గోదావరినది పడుతోంది. అసలు అక్కడ అన్నీ కొండలలోంచి ప్రవహించే జల ప్రవాహాలే. అవి అన్నీ గోదావరి అన్న పేరుతో ఉన్న చిన్న యేటిలో కలుస్తాయి. అక్కడినుంచి ఇరువదిఐదు మైళ్ళ దూరంలో వున్న నాసిక వచ్చేటప్పటికి గోదావరి రెండువందల అడుగుల వెడల్పున గొప్ప నదియైనది. ప్రతిష్ఠానంలో నాలుగువందల అడుగుల వెడల్పు. నిజామాబాదులో ఆరువందల అడుగుల వెడల్పు. భద్రాచలం దగ్గర మైలు. రాజమహేంద్రవరముకడ రెండు మైళ్ళు, ధవళేశ్వరముకడ నాలుగుమైళ్ళు, డెల్టాముఖమున ముప్పదిమైళ్ళ వెడల్పున్నది.'

'పిమ్మట పండరిపురము, హైదరాబాదు, గోలుకొండ, ఒరంగల్లు మొదలగు ప్రదేశముల వింతలన్నియు కనులకు గట్టునట్లు పరమేశ్వరమూర్తి వర్ణించిచెప్పెను.'

నారాయణరావు వివిధ దేశ ప్రజల యాచార వ్యవహారములు, వివిధ దేశము లలో బంటలు, ప్రజల కట్టుబొట్టులు, వర్తక సరళి మొదలైన విషయములగూర్చి యుపన్యాసము నిచ్చినాడు. ఉత్తరదేశ ప్రజలు సిక్కులు, కాశ్మీరదేశస్థులు, పంజాబీయులు, పఠానులు, సరిహద్దు పరగణాలవారు చాలా బలమైనవారు. సంయుక్తపరగణాలవారు, మధ్యపరగణాలవారు, బిహారీయులు, రాజపుత్రులు, మహారాష్ట్రులు, ఆంధ్రులు రెండవరకమువారు. ఆఖరిరకము వంగము, అరవ, మలయాళమువారు. కన్నడులు రెండవరకమునకు, ఆఖరిరకమునకు మధ్యనుందురు.

అందమున మొదటివారు కాశ్మీరదేశస్త్రీలు. మంగుళూరువారు, మైసూరు వైష్ణవులు తరువాత. తర్వాత మళయాళీవారు రాజపుత్రస్త్రీలు, కొంకణీయులు, గుజరాతీ, మహారాష్ట్ర ఆంధ్ర వంగ మొదలైన తక్కిన దేశములవారు తర్వాత. దాక్షిణాత్య స్త్రీ లాఖరున వచ్చెదరు.

కట్టులలో ఆంధ్రస్త్రీల నేటి కట్టు చాలా అందమైనది. తర్వాత మహారాష్ట్రపు కట్టు, అయ్యంగారి కట్టు తర్వాత. కద్దై వారీలు రాజపుత్రస్థాన స్త్రీలు పరికిణీలు కట్టె దరు. సిక్కులు కాశ్మీరదేశస్థ వనితామణులు లాగులు తొడుగుకొనెదరు. గుజరాతీ, ఉత్తర హిందూస్థానం, వంగదేశముల లలనలు చిన్న చీరలు కట్టెదరు. ఒకశాలువ పైన కప్పుకొనెదరు. అందరి కట్టుకన్న అసహ్యమగు కట్టు ఉరియాదేశ స్త్రీలు కట్టెదరు.

శుచిలో మలయాళీలు మొదట, ఆంధ్రులు రెండవవారు. తర్వాత తమిళ బ్రాహ్మణులు. తర్వాత కన్నడులు. తర్వాత మహారాష్ట్రులను వంగదేశపువారిని చెప్పవలెను. రాజపుత్రస్థానీయులు పంజాబు కాశ్మీరదేశస్థులు నాలగవవారుగ వచ్చె దరు. ఉరియా దేశపువారు ఆఖరువారు. మురికిగుడ్డల ధరించి పసుపునూనె కారు చుందురు.

ఆంధ్రులు కన్నడులు. భోజనమైన వెనుక మాత్రం తమలపాకులు ఉపయో గించెదరు. తక్కిన వారందరు కాలనియమరహితముగా పొగాకుతో నుపయోగించె దరు. పొగాకు మసాలాల రూపమున వాడుదురు. వంటలలో ఎక్కువ ఖరీదుగల భోజనము గుజరాతీ భోజనము. పంజాబీయులు తరువాత. ఔత్తరాహులు లావెనక వచ్చెదరు. వంగ మహారాష్ట్ర ఆంధ్ర కన్నడ దేశములవారిని తర్వాత చెప్పవలె. అరవదేశం, మళయాళ దేశంవారు తర్వాత. ఉరియావారాఖరున వచ్చెదరు. పిండి వంటలలో దక్షిణాదివారు, గుజరాతీవారు కన్నడులు మొదట. తర్వాత వంగ దేశస్థులు, ఔత్తరాహులు. తర్వాత మళయాళీలు తెలుగువారు. ఆఖరున ఉరియా వారు. వంటకములలో ఆంధ్రులు ప్రథములు.

ఆచారము తెలుగువారి కెక్కువ. స్నానము చేయవలె, ఆ రోజున ఆరవేసిన బట్టయుండవలెను. ఒకసారి మయిలపడిన మరల స్నానము చేయవలెను. మరల ఆరవేసిన బట్టకట్టవలెను. విడిచిన వస్త్రము మయిలపడును. తక్కిన అన్ని దేశము లలో నిన్న ఆరవేసినబట్ట నేడు పనికివచ్చును. ఒకసారి స్నానముచేసి మడిబట్ట కట్టుకొన్న యెడల మరల మరల మయిలపడుట యుండదు.

దక్షిణాత్యులకు, మళయాళులకు, ఆంధ్రులకు, కన్నడులకు, ఔత్తరాహులకు దృష్టిదోషముున్నది. మహారాష్ట్ర ఘూర్జర, కాశ్మీర దేశస్థులకు పంక్తిదోషము మాత్రమే.

ఆంధ్రులు, దాక్షిణాత్య, మళయాళ, మహారాష్ట్ర, కన్నడ, ఔత్తరాహ, ఘూర్జర, బ్రాహ్మణులు మాంసాదులు తినరు. వంగ, ఓఢ్ర, కాశ్మీర, సారస్వత

బ్రాహ్మణులు మత్స్యములు భక్షించెదరు. మాంసమును ఒకొక్కప్పుడు భక్షింతురు.

ఆ యా విశేషము లుపన్యసించుట పూర్తియగుటతోడనే యధ్యక్షులు, నారాయణరావు పరమేశ్వరమూర్తి మొదలగువారు దేశయాత్రలకుబోయి, జ్ఞానము సముపార్జించి, ప్రజలకు తెలియజెప్పుట యత్యుత్కృష్టమగు కార్యమని వచించి సభ ముగించెను. అందరకు కృతజ్ఞతా పూర్వక నమస్కృతులు కార్యదర్శి సమర్పించినాడు.

## ౧౨

## నారాయణరావు సాహస కృత్యములు

రాజేశ్వరరావు సుబ్బయ్యశాస్త్రిగారి భార్యతో నెచటికేని పోయెనను వార్తయు, నమలాపురములో రాజారావు భార్యకు చాల జబ్బుగానున్నదను వార్తయు రెండు నొకేసారి నారాయణరావుకు కొత్తపేట చేరినవి. స్నేహితులందరు వెడలిపోయిరి. చుట్టము లందరు వెడలిపోయిరి! నారాయణరావు చెన్నపట్టణమున కాపురము పెట్టుటకు నిశ్చయించెను.

సుబ్బారాయుడుగారు కుమారుని మాటకడ్డము పెట్టరు. ఇరువురుపుత్రులు నింటికడనుండకుండ వెడలిపోవుట ఆయనకుగాని, జానకమ్మకుగాని యెంతమాత్ర మిష్టములేదు. అయినను దామాబాలుని యిష్టమునకు వ్యతిరేకము సెప్పలేక నిట్టూర్చి యూరకుండిరి. నారాయణరావు తన పెత్తల్లికూతురు, చిన్నతనంలో భర్తను గోల్పోయిన యొక నిర్భాగ్యవనితను దనతో జెన్నపట్టణమునకు దీసికొని బోవ నిశ్చయించినాడు. ఆమె ఉండి గ్రామములో నున్నది. సూర్యకాంతముగూడ చెన్నపట్టణము వచ్చెదనన్నది.

సూర్యకాంతమున కేకారణముననో శారదా నారాయణరావుల సంసార ప్రవాహము పుట్టకమునుపే నశించిన సంగతి గోచరించినది. ఆమె కన్నగారియెడ గల ప్రేమబలమే యామెకా సంగతి గోచరింపజేసినది.

కావున శారద కాశీ సంతర్పణకై కొత్తపేట వచ్చినప్పు డామెతో యథాలాపముగా జెప్పినట్లన్నగారి యద్భుతచర్యలు కొన్ని చెప్పినది. రాజమహేంద్రవరములో గోదావరిలో నిరువురు కాలేజీ విద్యార్థులీతకు వెళ్ళినారట నారాయణరావు గజీతగాడు. ఆ పరిసరములనే ఆత డీదులాడుచుండెను. ఇంతలో కాలేజీ విద్యార్థులలో నొకరు ఈదలేక మునిగిపోవుచు నొక్క కేకవేసెనట. నారాయణరావా కేక విని రెండుబారలలో నచ్చటకు నీదుకొనిపోయి, మునిగి, యా బాలునిపట్టి, పైకితేల్చి నిముషంలో నొడ్డునకు తెచ్చి చేర్చెనట ఆ బాలునిపొట్ట నొక్కి నీరుసడల్చి, యూపిరి యాడునట్లు వైద్యముసల్పి చలిమంట వేయించి, యా బాలునెత్తుకొని, రెండునిముషలలో నిన్నీసుపేటలో వైద్యముచేయు నొక వైద్యుని యింటికి గొని వచ్చెనట. ఆ బాలుడు బ్రతికినాడు.

వేరొక పర్యాయము చెన్నపట్టణములో నొక పిల్లవాడు, 'రైలు వచ్చుచున్నది. పోవలదని యందరు మందలించుచున్నను వినక పట్టాలు దాటుచుండ రైలు వచ్చిపడినది. ఆ బాలుడు రైలుక్రింద పడిపోవునాడే కాని, ఆ చెంతనే యున్న నారాయణరావొక్క అడుగున నురికి, ఆ బాలుని ఎత్తి యావలకు హనుమంతునివలె నొక్కగంతు వేసెనట. లేనిచో నిద్దరును రైలుక్రిందపడి ముక్కలు ముక్కలయి పోయియుండువారే!

కొత్తపేటలో నొక నూతిలో ఒక యావు పడిపోయినదట. దాని నేవిధముగ దీసినను నడుము విరిగిపోవలసినదే. అది పోట్లావగుటవలన నెవ్వరు నూతిలో దిగుటకు సాహసించలేదు. నారాయణరావు చొరవచేసి దిగి, యడుగునుంచి తాళ్లు పోనిచ్చి ముందుకాళ్ళదగ్గర వెనుకకాళ్ళదగ్గర నడుముకు బిగ్గములుకట్టి, పైకి తాళ్ళందిచ్చి యడుగునుండి సహాయము చేయుచు, ఆవును లాగివేసినాడట.

అన్నగారి సాహసకృత్యము లిట్టి వెన్నియో శారదకు సూర్యకాంతము చెప్పినది.

'వదినా! మా అన్నయ్య పూర్వం మనం వినేకథల్లో ఉండే రాజకుమారుడి వంటివాడు. ఎంతమందికి సహాయం చేశాడు! మా నాన్నగారికి ఉంది ఎంతోబలం. మా నాన్నపోలికే, మా అన్న. ఒకసారి గోదావరి పొంగి ఒక ఊరు కొట్టుకుపోతే అందులో ఒక ముసలమ్మమాత్రం ఒక గుడిసెలో చిక్కడింది. పడవలు లేవు. గుడిసె మునిగేటట్లు ఉంది. మా నాన్న ఈదుకుపోయి ఆ ముసలమ్మనిబట్టి, నాలుగు మైళ్ళ దిగువకు గట్టుకు చేర్చాడట.'

ఆ రాత్రి తానును తన చిన్నక్కగారును గది నలంకరించినారు. శిల్ప హృదయము కల నారాయణరావు చెల్లెళ్ళ మనిపించుకొన్నారు.

మనస్సులో గుబగుబమను భయముతో శారద యాడుబిడ్డలచే దలదువ్వించుకొని, తోటలోని పూవుల ముడిపించుకొన్నది. ఆ రాత్రి గదిలోకి బోవుట కామెకు గుండె దడదడ మనుచునేయున్నది. కాని భర్తపై నంతరాంతముల నెచ్చటనో కొంచెము కరుణ జనించినది. నారాయణరావు పదునొకండు గంటలకు వచ్చి, పక్కపై పండుకొన్నాడు. శారదవచ్చి యక్కడున్న సోఫా నానుకొని నిలుచుండి భర్తను వాలుచూపులతో చూచినది. సూర్యకాంతము వర్ణించిన మహాభాగుడు, వీరోత్తముడు ఎదుట మంచముపై కరుణార్ద్రమూర్తియై వాలిపోవుట చూచి విచారముతో నా బాలిక కంపించినది. స్త్రీ పురుష సంపర్కము లేనిచో ఏదైన కబురులు చెప్పుచు కూర్చుండిన సంతోషమగు నేమో?

దేశయాత్రా విశేషముల నుపన్యసించు నా సభలో తన భర్త మహాప్రవాహము వరదలు కట్టించిన వాగ్ధార నామెను విచిత్రానంద పూర్ణను జేసినది. భర్త స్నేహితుడగు పరమేశ్వరరావుగారు ఎంత మధురముగ గంభీరముగ మాట్లాడినారు. మన

దేశమున నిన్ని వింతలుండునా? అవి ఎరింగి, అట్టి దివ్యప్రదేశములకు బోవుటయు ఉత్తమ ప్రష్టియే!

ఉపన్యసించునపుడు దివ్యమూర్తివలె, ఆ యా కాలముల దేశమున చరించిన మహోత్తమ పురుషునివలె శారదకు నారాయణరావు దర్శనమిచ్చినట్లయింది.

ఆ సోఫాలో పడుకొని యాలోచించుకొనుచు నామె యట్లనే నిదుర కూరినది.

మరునాడు శారదయు, జమీందారుగారును జమీందారిణియు, జమీందారుగారి యప్పగారును రాజమహేంద్రవరము వెడలిపోయినారు.

నారాయణరావు రాజారావు భార్య పుట్టింటి గ్రామమగు రామచంద్రపురము బోయినాడు.

రాజారావునకు నిరువురు సంతానము. ఒక కొమరితయు, నొక కుమారుండును జనించినారు. రాజారావు భార్య సూరమ్మ మంచి సౌందర్యవతి. నెమ్మదిగల యువతి. అందరకు తలలోన నాలుక. అత్తమామల ప్రాణము. భర్తహృదయము సంపూర్ణముగ గుర్తెరిగి, అద్దానిని చూరగొనిన పతివ్రతా శిరోమణి.

రాజారావమలాపురమునుండి రామచంద్రపురం వెళ్ళినాడు. నారాయణరావు రామచంద్రపురములో మిత్రుని గలిసినాడు.

సూరమ్మ నీళ్ళాడిన తర్వాత రెండవ రోజునుండి జ్వరము వచ్చుచున్నదట. మలేరియాకు; బాలింత జ్వరమునకు, రాజారావు ఇంజక్షను లిచ్చినాడు. చంటిపిల్లవాడు క్షేమముగ నున్నాడు. జ్వరము నూట అయిదువరకు వచ్చుచుండుటచే రాజారావు తడిగుడ్డలు పొత్తికడుపుమీద వేయించెను. అత్తగారు వాతము చేయునేమోయని భయపడుచుండెను.

నాలుగురోజులలో జ్వరం నెమ్మదించినది. నెమ్మదించిన వెనుక, రెండు రోజులుండి రాజారావు పథ్యము పెట్టించినాడు. నారాయణరావా ఆరురోజులు మిత్రునిదగ్గరనే యుండి, అతనితో గ్రంథకాలక్షేపము చేయుచు, నాతనికి రెండవ ప్రాణమువలె నుండి తర్వాత కొత్తపేట వచ్చి చేరెను. పరమేశ్వరాదులు వెడలిపోయిరి.

కొత్తపేట వచ్చునప్పటికి హైదరాబాదునుండి రాజేశ్వరరావు వ్రాసిన యుత్తరము వచ్చినది.

'నేనేమి చేసేది, నారాయణా! నాకూ మతిపోయింది. ప్రపంచంలో ప్రేమ లేదనుకున్నాను. స్త్రీకీ, పురుషుడికీ ఒకరి దేహంమీద ఒకళ్ళకు కోర్కె కలగగమే ప్రేమ అనుకున్నా. ఇప్పుడు నా సంగతిచూస్తే నాకే ఆశ్చర్యం వేస్తూంది. నేను ఇదివరకు చక్కని బాలికలతో స్నేహంచేసి వారి మనస్సులు చూరగొన్నాను. గాని, ఇదేమిటో నా కర్థం కాలేదురా.'

'అల్లా ఉంటో ఉండంగా, ఇక పుష్పశీలాదేవికి నేనంటే పిచ్చే! 'నిన్ను వదలి ఒక్కనిముషం అన్నా ఉండలేను. నాకీ భర్త వద్దు' అని మొదలుపెట్టింది.

మొదట భర్త కావాలి నేనూ కావాలి అంది. శ్రుతిమించి రాగాన్ని పడింది. ఇద్దరము ఇక విడిగా ఉండడం పడతేదు. కాబట్టి బయలుదేరివచ్చి ఈ హైదరాబాదులో మమ్మెవరూ పట్టుకోలేని మేడలో వున్నాము. మేమే నిజమయిన భార్యాభర్తలము. నీ స్నేహము వదలుకోలేను. నా యీ భార్యనూ వదలుకోలేను. నీ సదభిప్రాయం నాకు ఉండాలి. నీ కొక్కడికే నా అడ్రసు ఇస్తున్నాను. నాకు అవసరం వచ్చినప్పుడు వేయి రూపాయలవరకు నువ్వు ధనం సప్లయి చేయవలసి ఉంటుంది.'

'మా ఆనందం ఎవరికి కలుగుతుంది? నువ్వు నా మాట విను. శ్యామ సుందరి నువ్వంటే ప్రాణం యిస్తుంది నువ్వు దేశాలు తిరిగినన్నాళ్ళు నిన్ను గూర్చి నీస్నేహితుల్ని ఎంత వాకబు చేసింది. ఇంక ఊరుకోకు.

'పుష్పశీలా, నేనూ కలలోగూడ ననుభవించని మహదానందంలో ఓలలాడు తున్నాము. నేను హైదరాబాదు వచ్చేటప్పుడు పదివేల రూపాయలు వసూలుచేసి తెచ్చుకున్నాను.'

'రెండు మూడు సంవత్సరాలు యీ ఆనందంలో మునిగి తన్మయుడనై తేనే గాని నాకు తృప్తిఅవుతుందని తోచదు. అంతవరకూ ఇంకయేమీ తలపెట్టను. ఆవల! తృప్తి అప్పటికీ తీరదూ, యెంతకాలమో అంతే.'

'ఆ సుబ్బయ్యశాస్త్రిని చూస్తే నాకు జాలి. అతను ఏంజేస్తాడు? అతన్ని పెంచిన సంఘాన్ని అనాలి. కాని, ఏదీ తెలియకుండా మా సమాజం చేర కూడదు. అది చాలా అపాయం.'

'ఇదివరకు సుబ్బయ్యశాస్త్రిని దగ్గరకు రానిచ్చేదికాదు. నాకొంకే వాడికి పై పై మోజులుచూపి మురిపించింది. అందుకు నన్ను క్షమార్పణ అడిగింది.

'ఆహో నారాయణరావు! పుష్పశీల పువ్వుల కుప్పోయి. పుష్పాలలోని లాలిత్యమురా! నారాయణా! నన్ను నువ్వు అభినందించాలి. నేనంటే మీరందరూ ఉడుకుబోతుదనంగా ఉండాలి.'

'పరమేశ్వరుడి జన్మం, ఒక పెద్ద రాజీనామాసుమా. వాడి హృదయమూ వాడి జన్మమూ సౌందర్యంకోసం తపస్సు చేస్తూవున్నవి. భార్యవల్ల వాడి కవి లభ్యంకాలేదు. వాడి వరస చూస్తే శ్యామసుందరి పెద్ద చెల్లెలితో ప్రాణస్నేహము చేస్తునట్లున్నాడు.'

'నే నెందుకు ఈలా రాస్తున్నాను? నాతోపాటు మీరందరూ ఈ మహో త్కృష్టమైన ప్రేమానందంలో మునిగిపోయి ప్రేమనిర్వాణం పొందాలి అని.'

ఇట్లు,
అభినంద్యుడయిన ప్రేమదక్షుడు,
రాజీ.

ఈ ఉత్తరం రాజి ఒడలు తెలిసియే వ్రాసినాడా ? నిజమైన ప్రేమతత్వం ఏమిటి ? అది మానవునకు అనుభూతమగుటయెట్లు? తనకు దన శారదయన్న పరమప్రణయ మనుకొన్నాడు. ఆమె తన ఉపాస్యదేవత అనుకొన్నాడు. కాని, నక్కకు ద్రాక్షపండ్లవలె, ఆమె తనకైనది. ప్రపంచము తనకు మిథ్యయైపోయినది. తన్ను దేశయాత్రకు బంపినదా బాలికా విముఖతయేనా ? ఆ పరమ సౌందర్యరాశి భర్త హృదయము నిట్లెంతకాలము బంపపు గోతపెట్టునో ? ఒకవేళ నామె తన్నెప్పటికిని ప్రేమింపనిచో తానేమి చేయవలసినది ?

సంఘముయొక్క దౌర్భాగ్యస్థితి యట్లున్నది. వివాహములు నిజముగా ఇనుప ముళ్ళబోనులా ? ఒకసారి వివాహమయినచో, నది రద్దగుటకు వీలులేదు. పుష్పశీల ఏమిచేయవలెను ? మనదేశమున వివాహములన్నియు పుష్పశీలా వివాహములేనా ?

## ౧౩

## మదరాసు కాపురము

నారాయణరావు చెన్నపట్టణమున గాపురము పెట్టినాడు. మైలాపురిలో మంచి యిల్లద్దెకు దీసికొని, రెండువేల రూప్యములు పెట్టి న్యాయశాస్త్ర గ్రంథములు, హైకోర్టు తీర్పులు నాతడు కొనెను. ఇల్లంతయు బరమేశ్వరుని సహాయముతో నలంకరించెను. మామగారి యింటిలో నుండనని యాతడు దెలిపినాడు. సూర్యకాంతమును, పెత్తల్లికొమార్త బంగారమ్మను గూడ గొనివచ్చెను.

'అడ్వకేటు' నారాయణరావుగారు న్యాయవాదివృత్తి ప్రారంభించినారు. ఇంటిలో ముందు నారాయణుని కార్యాలయము. నాలుగు బీరువాలలో న్యాయశాస్త్ర గ్రంథములున్నవి. ఖద్దరు రంగుదుప్పట్లు పరచిన బల్లలు సోఫాలు కుర్చీలు నున్నవి. మందిరమంతయు నీలధూసర వర్ణములచే నలంకరింపబడినది.

ప్రక్కను గుమాస్తా గదియు, వెనుక రహస్యాలోచనపు గదియు నలంకరించినారు. ఆ వెనుక ఆడువారుండు స్థలమున్నది. దాని వెనుక విడిగా వంటయిల్లున్నది. వంటయింటిలోనికి బోవుమార్గమునకు, బైనగప్పును అమర్చినారు. నారాయణరావు న్యాయవాదవృత్తియందలి మెలకువలు నేర్చుకొనుటకు, వృత్తియందనుభవము సముపార్జించుటకు, నొక పెద్దవకీలుకడ జేరినాడు. నారాయణరావు బి. యల్. పరీక్షలో మొదటివాడుగా కృతార్థుడైన సంగతియు, తక్కిన పరీక్షలన్నిట మొదటివాడుగా జయమందిన సంగలితియు నా వకీలునకు దెలియును. రెండు మూడు అప్పీళ్ళలో బనిచేయుమని చెప్పినప్పుడు, నారాయణరావు జయరామయ్యగారి హృదయమున నద్భుతము నిండునట్లు పనిచేసి, యాయన చేతికిచ్చినాడు. ఒక అప్పీలులో నాయనగూడ తెలిసికొనజాలని యొక విషయము పట్టుకొని అప్పీలు వాదముకు బలము చేకూర్చినాడట. జయరామయ్య ముందు ముందీ బాలుడు

హైకోర్టులో ముఖ్య న్యాయవాదియై, న్యాయసింహాసనముపైన నధిష్ఠింపగలడని యనుకొనెను.

అన్నగారు శ్రీరామమూర్తి పంపిన చిన్న అప్పీళ్ళు రెండు తయారుచేసి దాఖలుచేసినాడు. న్యాయవాదప్రముఖుడగు జయరామయ్యగారు తాను దగ్గరనుండి నారాయణరావు నొక చిన్న అప్పీలు వాదించుమన్నారు. నారాయణరావు బాగుగా నా యప్పీలు వాదించుటకు సిద్ధపడియే వచ్చియుండెను.

న్యాయమూర్తియు నీ బాలకుని వాదన యెట్లుండునో చూచెదముగాక యని, నారాయణరావునకు ననుమతి యొసంగెను. పది నిమిషములలో నా చిన్న యప్పీలు విషయ నిర్ధారణచేసి, పరస్పర సంబంధము చూపి, విషయములను బలపరచు న్యాయ శాస్త్రమున బూర్వపు దీర్పులనుజూపి, వాదము ముగించి కూర్చుండెను. న్యాయ ప్రభువును ఆ బాలుని చమత్కృతికి, భాషకు, విషయనిర్ధారణ ప్రజ్ఞకు జాల మెచ్చు కొన్నాడు. ఇతర న్యాయవాదులయినచో నరగంటలో చేల్చజాలని యా యప్పీలు పదినిమిషములలో ముగించినాడు. ఎదిరి వకీలువాదమునకు నలుబదియయిదు నిముషములు పట్టినది. ఆతని వాదన పేలవమై తోచెను నారాయణరావు గొంతుక గంభీరమయినది దానికి తగినట్లు దివ్యోత్తమాంగుడు. ఎక్కడెక్కడి విషయములు కరతలామలకముగ గ్రహించగల మహామేధావి. ఎదిరి న్యాయవాది చేసిన అడ్డు వాదనను అయిదు నిముషములలో ఖండించినాడు, కూర్చున్నాడు నారాయణరావు.

తత్‌క్షణమే న్యాయమూర్తి నారాయణరావు పక్షమున దీర్పు జెప్పినాడు. గురువుగారగు జయరామయ్యయు నితర న్యాయవాదులును నారాయణరావు నభినందించిరి.

న్యాయశాస్త్రములో, న్యాయవాదములో నెంత మునుగుదమన్నను, మనస్సే మియు నెక్కుటలేదు తాను బాగుగా పనిచేయుచున్నట్లు కనబడుటకుగాను జయరా మయ్యగారి యింటికడ నపరిమితావేశముతో, మంచినిపుణతతో, ఓర్పుతో బనిచేయును. ఇంటికడ కలతనొందుచు, కలలలో మునిగిపోవును.

కలలు! కలలు! ఏ కలగన్న నాకలలో నెచ్చటనో శారద ప్రత్యక్షమగును. ఇదివరకు పండుకొనుట తడవుగ నిద్రపట్టునది నారాయణునకు. ఇపుడు గంటయు, రెండుగంటలు స్వప్నప్రపంచములో నివసింపవలసి వచ్చుచుండెను. నాతిగల బ్రహ్మచర్యము! శారదకు ప్రేమకుదురునో కుదరదో? కుదరనిచో దన కర్తవ్య మేమి? ఒకవేళ భార్య అన్యాసక్త కాదుగదా! నిజమైన కర్మయోగి పవిత్రకాలమున నొక పుత్రుని, పుత్రికను గనవలెను. భార్యనైనను మోహమున దాకగూడదు. అది మహాదోషము. తా నా విధమున నుండలే నప్పుడు దోష మగును కదా! తన భార్యయే అట్టి దోష మాచరించుచుండ దాను సహించవలసినదేనా?

ఇది చిన్నతనములో వివాహముచేయుటవలననైన దోషమా? వైద్యశాస్త్రము బాలికకు పదునారవయేట పెండ్లి యుక్తమే నన్నది. కొందరి కా యీడున హృద్ధ

దము వికసించక పోవచ్చును. ఇంతకు భార్య పరపురుష నాశించినచో దన కర్తవ్యమేమి? తన హృదయాంతరమున నామె యట్లాశించుట దోషమనియే తోచు చున్నది. ఇతరులు దోషమాచరించుచుండ వారి నామార్గమునుండి త్రిప్పగలవా రుపేక్షింపరాదు. ఒకరిమోక్షమున కొకరు కారణమగుట కలదేని, యొక్క గురువు నకు మాత్రమే యట్టి పని శక్యమగును. తాను శారదకు గురువా? ధర్మశాస్త్రము భర్తకు గురుస్థానము చెప్పినది నిజమే. తన భార్యయెడల దనకట్టి యర్హతకలదా?

తెలిసీ తెలియని ధర్మవిచార మొకప్రక్క, భార్యపై తనకున్న పూర్ణకాంక్ష యొకప్రక్క 'నాతో కాపురం చేయడం ఆమెకు కష్టం, కంటకం, దుర్భరం. ఆమె నాయింటిలోనుండ నా ప్రేమ విజృంభించి పోతూవుంటే నా మనస్సుతో యుద్ధం చేస్తూ, ఆబాలికను ముట్టకుండ అసిధారా వ్రతంచేయడం మరీకష్టము.' ఏది ఎట్లయి నను శారద తనయింటికి రాకుండుట యుత్తమము. అట్లయినచో నా బాలికను రక్షించవలసిన తన కర్తవ్యము నెరవేర్చుకొనుట యెట్లు? తనతో కాపురము చేయు చుండ గ్రమముగా భార్యకు దానన్న ప్రేమ కలుగదా.

వనిత యొక పురుషునిగాని, పురుషుడొక వనితనుగాని ఒకసారి ప్రేమించి నచో జన్మాంతమయ్యది యట్లుండ వలసినదే కదా? అట్టిచో పరపురుషానురక్త యగు శారద కా ప్రేమ నశించి తనపై మరల ప్రేమ గలుగుటయెట్లు? ఒకవేళ తనపట్ల అయిష్టమేకాని. యితరునిపై నామెకు ప్రేమ లేదేమో. అట్లగుచో నా బాలి కను ప్రసన్న నొనర్చుకొనుట తగునుగాని, నీ దారి నీవుచూచికొమ్మని వదలివేయుట, తనకును నామెకును హానియే. కావున తనకడ కామెను దీసికొనివచ్చుటయే కర్తవ్యమగును.

ఈ యాలోచనలతో నిదురపట్టక విద్యుద్దీపము వెలిగించుకొని, పుస్తక మేదియో చేతనుంచుకొని ఎదుటిగోడపై, పరమేశ్వరుడు చిత్రించిన యొక చిత్రఫల కముపై జూపులు నిలిపి, అన్యమనస్కుడైయున్న యన్నగారి కడకు, సూర్య కాంతమువచ్చి, 'అన్నయ్యా! ఏమిటి ఆలోచిస్తున్నావు! నాకొక్కదానికీ ఏమిటీ తోచడంలేదు. అవును కాని, అన్నా! దబ్బున వదిన్ని తీసుకురావు? ఇద్దరం ఎంతో స్నేహంగా ఉంటాం అన్నయ్యా' అన్నది. ఆ ముద్దరాలి పలుకు శ్రుతిగా గ్రహించి నారాయణరావు చెల్లెలిని దగ్గరకు దీసికొని, యామెకన్నుల గనుంగొని 'సూరీడూ! నీ కడుపంతా ప్రేమమ్మాతల్లీ! రామచంద్రరా వదృష్టవంతుడు.' అనెను. సూర్య కాంతం నవ్వుకొనుచు ప్రక్కగ నిలుచున్నది. ఇంతలో నామె నగుమోమునందు విచారమేఘము లావరించినవి. కళ్ళనీరు తిరిగినది.

'తల్లీ! రామచంద్రరా వెప్పటికప్పుడు జాబురాస్తున్నాడాలేదా? మా అందరి కన్నా విద్యావంతుడూ, ప్రయోజకుడూ అయి ఇంకో ఆరునెలలకి వచ్చి వాలుతా డమ్మా?' అని ముద్దుచెల్లెలి నూరార్చెను.

నారాయణుడు సూర్యకాంతమును కెప్పటి కప్పుడు రామచంద్రుని కబుర్లు చెప్పుచు, నాతని కామెచే నుత్తరములు వ్రాయించుచు, నామెను ధైర్యము గొలుపుచుండెను. నారాయణరావు కోర్కివలన రామచంద్రరావు తన ఛాయాచిత్రములు, నాలుగునెలలకొకటితీయించుకొని పంపుచుండెను. సూరీడు అనేకవిధముల దీయించుకొన్న తన ఛాయాచిత్రంబులాతనికి బంపుచుండుసు.

పాశ్చాత్య విద్యాపండితుడై, పడమటి దేశములనుండి వచ్చిన వానిభార్య పాశ్చాత్య విద్యలలో ప్రవీణురాలు కావలయునని, క్రొత్తపేటలో నౌకరునుపు నేర్పరచి సూరీడుకు విద్యచెప్పించినాడు చిన్నన్నగారు. వాను వెళ్ళినప్పుడెల్ల నామెకు నాంగ్లభాష గరపుచుండెను. ఆమె యేగ్రంథమైన ధారాళముగ చదువనేర్చుకొన్నది. రామచంద్రరావు వచ్చునప్పటికి సూర్యకాంతమును ప్రవేశపరీక్షకు బంపవలెనని నారాయణరావు యత్నించుచుండెను.

శారదకన్న సూరీ డొకయేడు చిన్న. రామచంద్రరావు నారాయణరావుకన్న చిన్న. సూరీడు యౌవనవతియైన నాటినుండియు, నేపుగా నెదుగుచున్నది. సూరీడు మోము రాజపుత్ర బాలిక మోమువలె నుండును. ఆమెకళ్లు కాటుకకండ్లు. గంభీరమైన మోము. మోమున రేఖలు లాలిత్యమును అంతకన్న స్ఫుటత్వమును, సుందరతనుదాల్చినవి. సూరీడు మోముచూచినచో, రాజ్యము లేలగల వీరాంగనలు స్ఫురించెదరు. రుద్రమదేవి, విమల, అహల్య, ఝాన్సీ లక్ష్మీబాయి, చాందిబీబీ మొదలగు వా రామె వదనాన ప్రత్యక్షమయ్యేదరు. అయినను ఆమె హృదయము, జీవితము ప్రేమచే, గుణచే నిండి మథిత నవనీత స్నిగ్ధమై, సౌందర్యార్ద్రమై యుండును.

ఆమె పెండ్లినాటినుండి రామచంద్రరావును దన జీవితమునకు కథానాయకుని జేసికొన్నది. ఆమె ప్రేమించినను, గోపించినను, సంతోషించినను, అసహ్యపడినను అన్నియు గంభీర ప్రవాహమువలె ప్రవహింపవలసినదే! ఆమె భావములకు లఘుత్వములేదు. చిన్న తనమునుండి తండ్రి చెప్పిన కథలన్నియు, నామె మనమున హత్తుకొని పోయినవి. శ్రీమతి భండారు అచ్చమాంబగారు రచించిన అబలా సచ్చరిత్ర రత్నమాల చదువుకొన్నది. భారతి, శారద మొదలగు మాసపత్రికలు చదువునది, ఆమె లేతభావములలో, వారికా హృదయములో, రూపొందిన యాశయములలో యన్నగారియందువలె దేశసేవాసక్తి తలయెత్తినది. భరతమాత పే రామెకు పులకరింపు. ప్రతిసభకు తల్లిదండ్రుల యనుమతినిచ్చల్లితోడనో, యక్కగారితోడనో జనునది.

ఇంటిదగ్గర చేయనవసరము కాకున్నను పైపనుల నన్నింటిని నిముషమున జేయును, పుస్తకముల జదువుకొనుట యామెకిష్టము. కష్టపడి వీణవాయించుట నేర్చుకొన్నది. దానియందు తనుమాత్రము కౌశల్య మేర్పడినది. అయినను పట్టుదలతో నేర్చుకొన్నది. ఇరువది త్యాగరాయ కృతులు, హిందీపాటలు, సంసారి

సుబ్బారావుగారి యెంకిపాటలు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి పాటలు, అభినవాంధ్ర కవిత్వ జనకుడగు గురజాడ అప్పారాయ విరచితములగు పాటలు, విశ్వనాధ సత్య నారాయణ మహాకవి పాటలు నేర్చుకొన్నది. గొంతుకలో సమమైన ఒదుగు, అత్యంత మాధుర్యమును కలదు. రెండును ఏకమై అపారమై, తేనెవాకలు కట్టును.

తన జీవితము భర్తృప్రీతి పాత్రముగ మార్చుకొనవలయుననియు, నతని హృదయ మానందమున నోలలాడించవలయుననియు దనకే తెలియని దీక్ష బూని నది. బొమ్మలు వేయుట పరమేశ్వరునికడ నేర్చుకొన్నది. పార్శీబాలికబోలి, గుజ రాతీ వనితవలె మహారాష్ట్ర యువతివలె నలంకరించుకొనుట నేర్చుకొన్నది.

అన్నగారితో దనకు పియానో వాద్యము నేర్పించుమని యన్నది. అమెరికా నుండి వచ్చు భర్తకు గొన్ని ఇంగ్లీషుపాటలు పాడి వినిపించినచో, నెంతయో యానంద మొనగూడునని సిగ్గున నామె యాలోచించుకొన్నది.

## ౧౪

## రామచంద్రుని విద్యార్థి దశ

హార్వర్డు విశ్వవిద్యాలయములో భారతీయ విద్యార్థు లొక వసతిగృహ మేర్పరచుకొన్నారు. అందు రామచంద్రరావును జేరినాడు. అమెరికాలో నిరుపేద, హిందూదేశమున భాగ్యవంతుడు, భారతీయు లమెరికాలో జదువవలెనన్న మిక్కిలి భాగ్యవంతులు కావలెను. కాబట్టి భారతీయ విద్యార్థులు తమ దేశపు సన్యాసులవలె మితాహారమాత్ర తృప్తులై అమెరికాలో జీవించుచుందురు. వారందరిలో రామ చంద్రరా వెక్కువ ధనము వెచ్చించుచుండెను.

అమెరికాలో భారతీయులను హీనముగ జూచువారున్నారు. విచిత్ర జంతువు లుగ జూచువారున్నారు. ఆధ్యాత్మికదృష్టి ప్రపంచమునకు నేర్పునట్టి శక్తిగల దివ్య దేశమునకు జెందిన యుత్తమ పురుషులుగ జూచువారున్నారు.

రామచంద్రరావు సెలవు దినములలో నమెరికా దేశ మంతయు జూచుటకు బోవువాడు. అచటి విహారవనములు నదీపాతములు లోయలు జూచి వచ్చెను. పెక్కు కర్మాగారములు, పరిశ్రమ మహాప్రపంచములు సంచార మొనర్చెను.

ఎఫ్. యే. లో నింగ్లీషులో కృతార్థుడు గాకున్నను, లెక్కలలో ఆంధ్ర విశ్వ విద్యాలయమునందు ప్రథముడుగ గడతేరినాడు. అమెరికా వచ్చిన వెనుక హార్వర్డు విశ్వవిద్యాలయమునందు లెక్కలలో నాతని మేధాసంపన్నతకు మెచ్చి యింగ్లీషు భాషా పరీక్షకు జదువవచ్చునని ప్రత్యేకముగ ననుమతి యొసంగిరి. ఇంగ్లీషుభాషలో నెగ్గుట కారునెలలు పట్టినది. రామచంద్రరావు ఈలోన బి. యస్. సి. ఆనర్సులో జేరి చదువుటకు అధికారులు ప్రత్యేకానుమతి నొసంగిరి. లెక్కలలో పదార్థ విజ్ఞాన శాస్త్రములో నమెరికా విద్యార్థి ప్రపంచమున నాతని సమానులు డి. యస్. సి క్లాసు లలో కూడ లేరట.

రామచంద్రరావువచ్చి రెండేళ్ళపై నాలుగునెలలు అయినది. రెండేళ్ళలో నా యువకుడు లెక్కలలో జూపిన తెలివితేటలు మిక్కుటము. అతనికి తెలిసిన కొన్ని లెక్కల విజ్ఞానము ప్రపంచములో గొందరికి మాత్రమే తెలియును. ఆతడు జవాబుగోరె ప్రచురించిన గణిత ప్రశ్నలకు జవాబిచ్చువారు కనబడక పోయినాడు. గణితాచార్యు డాతడన్న మంచి గౌరవము చేయును, ప్రేమమున నాతని మెచ్చును. అతనికి ఎం. యస్. సి. బిరుదము నిచ్చుట కింకను ఆరునెలలు వ్యవధి యున్నది.

ఈ రెండేళ్ళలో రామచంద్రరావు, రొనాల్డుసను దంపతులను దర్శించుటకు స్నేహితురాలగు లియోనారాతో గలిసి వెళ్ళుచుండును. రామచంద్రరావును లియొనారాయు హార్వర్డు విశ్వవిద్యాలయములోనే చదువుచుండుటచే వారమున కొక సారియైన గలుసుకొనుచుందురు. లియోనారా రామచంద్రరావుల స్నేహము నానాటికి వృద్ధినందినది.

లియోనారాకన్యక నెమ్మదిగా రామచంద్రునిపై సోదరునికన్న నెకుక్కువప్రేమము జూప నారంభించెను. అది పురుషుని వాంఛించు ప్రేమయని యామె గ్రహింపలేక పోయినది. రామచంద్రరా వెన్ని విశేషములనో జెప్పువాడు. భరత దేశమును బొగడువాడు. వేదాంత సారమును గూర్చి యేదియో మాట్లాడువాడు. ఆమె తన స్నేహితురాండ్రను గొనివచ్చి రామచంద్రరావునకు వారితో బరిచయము కలుగజేయు చుండునది. రామచంద్రరావునకు నాట్యము నేర్పుచు నాతనితో నత్యంత స్నేహమై వదలకుండునది.

'రామ్, మా అమెరికను బాలకులవలె, మీ భారతీయు లాటలాడ రేమిటి?'

'నారా! మీరు సంపూర్ణ స్వతంత్రులు. అడుగడుగున మీ రగౌరవము పొంద నవసరములేదు. మీ స్వాతంత్ర్యము, మీ యభివృద్ధి, మీకున్న గౌరవము ప్రపంచమున నేదేశమున కున్నది? స్వతంత్రము లేని యప్పు డమెరికా కున్న స్థితి యేమిటి? నేటికి నాటికి హస్తిమశకాంతరము భేద మున్నది. నేడు కనడావలె నుండవలసిన దేశము, దేశము లన్నిటి కన్న మిన్నయై, ప్రపంచమునకు షాహుకారై, యుద్ధ పరిశ్రమలో ముందంజయై విజృభించి, ముఖ్యమైన పరిశ్రమలకు వ్యవసాయములకు ప్రథమదేశమై ఒప్పారుచున్నది. మీవలె మాకు ఇట్టి సంతోష కారణములేదు ఇది ఒకటి. రెండు, మా దేశములో ప్రబలిన మెట్టవేదాంతము మమ్ము పురుషకారహీనులైన జడులను చేసి వైచినది. మేము వెనుకటి వారమూ కాము, ఈ కాలములోనూ లేము.'

'నువ్వు మాట్లాడినదంతా అధీరత సూచిస్తూ ఉన్నది. ఆంగ్లేయులు మీ దేశము ఆక్రమించడం ఉత్తమం అని నా అభిప్రాయం.'

'అది నిజమే చెల్లీ! ఏ మహాచక్రవర్తి కాలంలోనో దేశం అంతా ఏకచ్ఛత్రాధి పత్యంక్రింద వచ్చినా, ఆరోజు పోవడంతోనే, మళ్ళీ దేశం ముక్కలయ్యేది. అంటే దేశంలో సంయోగశక్తికన్న వియోగశక్తి ఎక్కువ ఆవరించి యుండు స్థితికి

వచ్చింది. కాని బలవంతులగు ఆంగ్లేయులు మా దేశం ఆక్రమించుకొనడంచే అన్ని ఉపజాతులవారము, అందరము - ఒకటి అయ్యాము. ఇంకా కావాలి, అంతవరకూ ఆంగ్లదేశస్థులు మా దేశం వదలి వెళ్ళరు.'

'అవును, నువ్వు చెప్పింది నిజమే అన్నా! చూశావూ! అమెరికా మొదట చిన్నచిన్న రాజ్యాలుగా ఉంది; ఫ్రెంచివారు ఇంగ్లీషువారు వారిలోవారు యుద్ధం చేసుకున్నారు, చాలాకాలం. అలాంటిది, అమెరికా ఇంగ్లండుతో విరోధించి తిరగ బడినప్పుడు అందరూ ఏకమయ్యారు. కెనడా ఇంగ్లీషువారిక్రింద ఏకమయ్యింది. ఫ్రెంచివారూ ఇంగ్లీషువారూ ఏకమయ్యారు. అల్లాగే దక్షిణ ఆఫ్రికాలో ఆంగ్లేయులహూ డచ్చివారికి సంయోగం కలిగింది.'

లియోనారా రామచంద్రరావుల స్నేహము నానాట గూఢమాయెను. లియోనారా బాలవచ్చి సోదరప్రేమ వెల్లిగొన రామచంద్రుని యొడిలో గూర్చుండి యాతనికి ముద్దులిచ్చును. మొదట నామె యట్లు చేయుట రామచంద్రునికి జాల సిగ్గు జనింప జేసెడిది. కాని యందు కలవాటు పడినాడు. రానురాను రామచంద్రునకు లియోనారా తనచెంత నున్నంతసేపును పరమ హర్షముగ నుండెను. ఆమె సంభాషణ యాతని మనఃపథము వికసింప జేసెను. నానాదేశముల వార్తలు వారు చర్చించుకొనువారు. ఒక్కొకప్పుడామె తండ్రియు వారితో జేరువాడు.

రామచంద్రరా వమెరికా వచ్చిన కొన్నినెలలవరకు లియోనారాకుగాని, యామె తలిదండ్రులకుగాని, తనకు వివాహమైనదని చెప్పుటకు సందేహించుచుండెను. తర్వాత నొకనాడు తనకంతకుముందే మూడేళ్ళక్రింద వివాహమైనదనియు తనభార్య ఛాయాచిత్రము తన బావమరది యగు నారాయణరావు పంపినాడనియు దెల్పెను. వారంద రాశ్చర్యపూరితులైరి.

అప్పుడు వారందరు సూర్యకాంతము చిత్రము చూచినారు. నారాయణరావు మంచి ఛాయా చిత్రకారునిచే దీయించి పంపిన ఆ చిత్రఫలకములో సూర్యకాంతము చక్కని భంగిమములో ప్రత్యక్షమైయున్నది. రొనాల్డుసన్ రామచంద్రుని చూచి 'రామచంద్ర! మిస్ మేయో చెప్పినట్లు అతిబాల్య వివాహములు మీలోనున్న వన్నమాట!' అని యనెను.

రామ :—ఆ! ఉన్నవి! మేయో చెప్పినవి ఇంకా చాలా నిజమైనవి ఉన్నవి.

రామచంద్రునికి తన దేశము నెవరైన కొంచెము నిరసించినట్లు తోచినచో జివ్వున కోపము విషాదము సంభవించును. పరదేశమున నుండుటచే వానిని జంపుకొని మాట్లాడును. అప్పు డాత డెంతయు విచారమునబడి తప్పుదైపోవును.

రొనాల్డుసన్ :—మూడు నెలల బాలలకు, మూడు నెలల బాలురకు వివాహము జరుగుచున్నమాట నిజమేనా?

రామ :—అవును, అక్కడక్కడ కొన్ని అలాంటివి జరుగుచుండును, కాని చాలా

రౌనా :—అదీ చాలా విచారకరమైనది కాదూ ?

రామ :—మీదేశంలో అంతకంటే విచారకరమైనవి జరగటం లేదంటూరా ?

రౌనా :—అనను. కాని చూడు. మా ఉద్దేశంలో ప్రపంచానికి నాగరికత నేర్పింది భారతదేశం. అటువంటి దేశము నేడిట్లు అధోగతిపాలై ఉంది అంటే మా కెంత విచారంగా ఉంటుందో ఆలోచించు ?

రామ :—నిజమే, హీనస్థితిలో మానవుడికి అన్నీ దుర్బుద్ధులు పుట్టుతూ ఉంటాయి. కాని ఈనాటికీ మా వివాహములు మంచివా, మీ వివాహములు మంచివా యన్న సంగతి నిర్ధారణ కాలేదు. జడ్జి లిండెసేగారు వ్రాసిన వ్రాతల్ని చూశారుగాదా ?

రౌనా :—అతడూ మేయోవంటివాడే !

రామ :—గాంధీ మహాత్ముడు చెప్పినట్లు ఇద్దరూ పాయికానా పనిచేసినారు అనుకోండి. అది అవసరమే కాని లిండెసే వ్రాతయంతయు యదార్థకథనమైనను, ఆతడు తేల్చిన పర్యవసానం మాత్రం తప్పుఅయి ఉండవచ్చును. మేయో రాసినరాతలు, ఒకటి రెండు అంశాలు తప్ప తక్కినవన్నీ శుద్ధ అసత్యాలు. నీచమైన భావాలతో కూడివున్న ఆ చెడురాత మా దేశానికి విరోధులు వ్రాయించారు ఆమెచేత.

లియోనారా యీ సంభాషణ యేమియు వినుటలేదు. ఆమె రామచంద్రుని చుట్టూ కల్పించుకొన్న కథ కొంతవరకు కూలినది. ఎందుకు దానిట్లు మనస్సున క్రుంగిపోవున్నదో యామెకు తెలియదు. ఈ హైందవ యువకునకు దనకు సంబంధ మేమి ? దేశము కాని దేశము విద్యకై వచ్చినాడు. తాను, తన కుటుంబము ఆ బాలుని చేరదీసినారు. సద్గుణములు కలవాడు. ఉత్తమ భారతీయ కుటుంబమునకు జెందినవాడు అని కదా ?

అప్పుడా బాలికకు దానీ బ్రాహ్మణ యువకుని ప్రేమించుచున్నానా యని లీలగా ననుమానము తగిలినది. లోననణగియున్న రహస్యభావములన్నియు బైకి దేలి, యామె మనో నేత్రమునకు గోచరించినవి. ఈ యువకునకు వివాహము కాక యుండినచో, దా నాతని వివాహమాడి, యాతనితో భారతదేశమునకుబోయి, ఆదేశమునకు ప్రేమనిధానపు గోడలై, యాదివ్యభూమిలో పెరుగుచు, ఆ మాత పరమపవిత్ర రహస్యాలలో భాగము పంచుకొనగోరినది. ఆ బాలికయు నా దేశమున సౌందర్యవతియే. పరిపూర్ణ యౌవన. పరిమళార్ద్ర మధురగాత్రి. ఏది యెట్లయినను రామచంద్రరావు తనవాడు. ఆ బాలకుని ప్రేమ యెట్లుండునో ? భారతీయుల ప్రేమ యుద్వేగమయినదట. అతివిచిత్రమైనదని స్నేహితురాం డ్రనుకొనుమాటల యర్థము తెలియలేదు. తనచుట్టు జుమ్మని తేనెటీగలరీతి దిరుగు నమెరికను యువకులందఱొకవిధముగానే కనుపింతురు. రామచంద్రుడు తనయెడ సంచరించువిధమే వేరు.

వారందరు తనతో నాటపాటలనుగూర్చి ఎక్కువగను, శాస్త్రములనుగూర్చి తక్కువగను ప్రసంగింతురు. వారు పరదోషాన్వేషణపరులు. కవిత్వ చిత్రలేఖనము లను గూర్చి వారు మాటలాడునపుడు బేలవముగా నుండును. రామచంద్రుడు మాట లాడినపుడెంత సాధారణవిషయమైనను ఏదో యద్భుతమగు లోతులు కలిగి యుండును. ఏదో విచిత్రపు దృక్పథము నాతడు చూపును. ఇది యంతయు నా బాలకునిపై దనకుగల ప్రేమ ప్రభావమా ? లేక భారతీయులలో నది సహజమా ? తన శీలము చెడకుండ నీ బాలుని వలచి, వలపించి, ప్రేమ ప్రవాహ రహస్యములు గ్రహించవలయునని, లియొనారా తలచెను. రామచంద్రుని ముఖము దీక్షగా గమ నించుచు నట్లనే యాలోచనా నిమగ్న యగుచుండును.

రౌనా సతి :—రామచంద్రా ! మా దేశస్థులు హిందూదేశం అంటే పులకరింపులు పొందుతారు. ఇంగ్లీషువారి చేతుల్లోంచి మీరు తప్పించుకు వెళ్ళకూడదు అని అనుకుంటారు. కొందరికి హిందూదేశం పాడైపోతుందని భయం. కొందరికి ఇంగ్లీషువారికి నష్టం వస్తుందని భయం. చాలామంది ఆమెరికను లకు హిందూదేశము స్వతంత్రత సముపార్జించుకోవాలనిన్నీ, ఇప్పుడు గాంధీమహాత్ముడు మొదలిడిన యుద్యమం క్రైస్తవ ధర్మయుతమైనదనిన్నీ, ఆంగ్ల హృదయమును జూరకొని, వారికి తమ చర్యలు తప్పని తోపింపజేసి, ఆంగ్ల సామ్రాజ్యములోనో, వెలుపలనో వారితో స్నేహముగా ఉండడం ఉత్తమమని అనుకుంటున్నారు. గాంధిగారి బోధలే యీ మార్పుకు కారణం.

రౌనా :—ప్రియా ! ఎంత చక్కగా విపులపరచి చెప్పినావు ! మా అందరి ఉద్దేశం అదే. రామచందర్ ! గాంధీగారి మార్గమే ఉత్తమమైనది. ఆంగ్ల పరిపాల కుల నేమాత్రము ద్వేషింపక వారి ప్రాణమే మనప్రాణ మనుకొని వారి హృదయము మార్చుటకు తలచిననాడే మీరు నెగ్గిపోయెదరు.

## ౧౫

## గురువు వెదుక్కుంటూ వస్తాడు

నారాయణరావునకును శ్యామసుందరీ దేవికిని రానురాను స్నేహము గాఢ మైనది. వీలయినప్పుడెల్ల నాతడా బాలిక గృహమునకు బోయి సంగీతముగూర్చి మాట్లాడుటయో, సంగీతము వినుటయో, వినిపించుటయో చేయుచుండును. శ్యామ సుందరీదేవితో మాట్లాడునప్పుడు చెల్లెళ్లు ముగ్గురు నెమ్మదిగా నచ్చటనుండి మాయ మగువారు.

'చెల్లీ ! సంగీతములో నెన్ని స్వరములనైన కల్పించవచ్చును. కాని పాశ్చాత్యులును, మనమున్నుగూడ పన్నెండు స్వరాల్ని మాత్రం గ్రహించాము. పన్నెండింటికి మించినవి, కొద్ది తేడాలు మాత్రముండును, కాబట్టి సర్వస్వరములు పన్నెండు స్వరాల్లోనే యిముడుతున్నాయి. తక్కినవి సూక్ష్మములు.

'ఒక్కొక్క స్వరానికి మూడూ నాలుగు శ్రుతులుంటాయికాదా అన్నగారూ?'

'అవునమ్మా. కాని శ్రుతియొక్క ధ్వని అతి సూక్ష్మము. శాస్త్రవిధానాన రచితమైన యంత్రసహాయాన్ని ఆయా శ్రుతుల్ని వినగలం. అంతే. మూడు నాలుగు శ్రుతులు కలిసి వినబడిన మొత్తపుధ్వని ఒక స్వరం అవుతుంది.'

'అయితే అన్నగారూ! మన సంగీతానికీ పాశ్చాత్య సంగీతానికీ ఏమిటీ భేదా అంటారు.'

'ఏమున్నదమ్మా చెల్లీ! కాకలినిషాదం ప్రతిమధ్యమము చతుశ్రుతి ధైవతములు అపశ్రుతులట. అయినా పాశ్చాత్యులు రెంటినీ ఉపయోగిస్తారు. మనవాళ్లు ఏదో ఒకటేరాగంలో వాడ్తారు. అంతే అసలు ముఖ్యమైన కిటుకు పాశ్చాత్య సంప్రదాయంలో శ్రుతికి, అపశ్రుతి కలిగించి, ఆ అపశ్రుతికీ, శ్రుతికీ, సమీకరణంచేసే స్వరాలు మధ్య మధ్య రానిస్తూ రెంటికీ శ్రుతికలిపిస్తుంటారు. అందుచేతనే వట్టి స్వరకల్పనలో భావనిర్ధారణ చేస్తామంటారు.'

'పదార్థ విజ్ఞానశాస్త్రం ప్రకారం స్వరస్వరూపం, శ్రుతిస్వరూపం మీరు బాగా చదివినారుకదా, స్వరంనుంచి స్వరం చటుక్కున గంతువేసి వెళ్లుతుందా? లేక ప్రవహించివెళ్లుతుందా?'

'పెద్దప్రశ్న అడిగినావు చెల్లీ! ఇప్పటికి ప్రసిద్ధ శాస్త్రజ్ఞులుకూడా ఆ అనుమానం నివర్తించలేకుండా ఉన్నారు. స, రి, గ, మ అని మనం స్వరములు పలుకుతాము. 'స' కీ 'రి' కీ ఉండే సంబంధం యేమిటి? 'స' లోనుంచి 'రి' వస్తూందా? ఈలాంటి అనుమానాలు. కాని నెమ్మదిగా గవాయిపద్ధతిగా పాడితే 'స' నుంచి 'రి' కి గంతు వేసినట్టుగా ఉండదు. ఇంతకూ నా అభిప్రాయంలో స్వరాలకు ఒకదాని కొకటి సంబంధం లేదని. కాని సినిమాలో బొమ్మలు విడివిడిగా ఉన్నప్పటికీ, చటుక్కున తిరుగుట మూలాన్ని వెనకటి బొమ్మయొక్క ఛాయ మనస్సులోంచి పూర్ణంగా మాయం కాకుండానే, కొత్తబొమ్మ వస్తోంది. మనదృష్టి ఒకదానిమీదనుంచి ఒకదానిమీదకు గంతువేస్తూవున్నా అంతా ఒక్కబొమ్మే అయినట్లు కనబడుతుంది.

'ఇంకా స్వరంలో ఉండే గమ్మత్తు ఏమిటంటే, ఒక స్వరం పలికి, మన గొంతుక మరొక స్వరంలోకి వచ్చేటప్పటికి, ఈ రెండు స్వరాలమధ్య కొన్నికొన్ని అవ్యక్త స్వరాలు గర్భితమై వుంటాయి. యింద్రధనస్సు చూడు: ఊదా, నీలం, ఆకుపచ్చన, పసిమి, వంగపండు చాయ, ఎరుపు, మళ్ళీ ఊదా. అసలు రంగులు మూడు. కాని ఎరుపులోంచి నీలం పుట్టుతుందా. కాని ఎరుపునుంచి నీలానికి వచ్చేటప్పటికి, ఊదా, నీలి, మధ్యను ఉన్నై. నీలిలో నించి పసిమికి వచ్చేటప్పటికి రెంటి కలియక ఆకుపచ్చన ఉంది. ఆ మధ్య రంగులు ముఖ్య వర్ణాల కలియికే.'

'కాని, ఒక తెలుపులోంచి అన్నిరంగులు వచ్చినట్లు, ఒక మహాస్వరంలోంచి అన్ని స్వరాలు రావడంలేదా అన్నా!'

'అదిమాత్రం నిజం. అదే అఖండశ్రుతి స్వరూపం సుమా!

'శ్రుతి చాలా చిత్రంకాదు అన్నా! మొన్న శ్రుతిలోనే అపశ్రుతి యిమిడి ఉందన్నావు ఏమిటి?'

'నా అర్థం ఏమిటంటే, ఈ సృష్టిలో అవ్యక్తమై అనిర్వచనీయమైన పరబ్రహ్మ స్వరూపము తప్ప తక్కిన వన్నీ ద్వంద్వాలేకాదూ! వెలుగునీడ, మంచిచెడ్డ, అలాగు. శ్రుతి అపశ్రుతికూడా అట్టి ద్వంద్వమే. శ్రుతిలో అపశ్రుతి సతతము గర్భితమయ్యేఉన్నది. శ్రుతి ఉంచుకు వెడుతూఉంటే ఎక్కడపడితే అక్కడ అపశ్రుతి రావచ్చు కాదూ చెల్లీ. సైకిలు ఎక్కబోయేవాడున్నాడు. వాడికి సమ్యక్స్థితి (బేలన్సు) ఉన్నది. ఎక్కడపడితే అక్కడ బేలన్సు తప్పిపోవడానికి వీలుందా లేదా? ఎక్కడనుంచివస్తున్నది ఆ అపశ్రుతి? శ్రుతిలోనుంచే! అలాగు వెలుగులోనుంచే నీడ!'

శ్యామసుందరీదేవి నారాయణరావుతో నిటుల గంటలవెంబడి సంభాషించుచు, నాతని వదలజాలకుండును.

శ్యామసుందరీదేవి యింతవరకు నేరిని బ్రేమింపలేదు. ఆమె సుగుణఖని. ఆమె ప్రతి జాతీయోద్యమమునందు బాల్గొనుచుండును. ఆమె శ్రీమతి కమలా చటోపాధ్యాయికి స్నేహితురాలు. జాతీయవారములందు, గాంధీవారములందు ఖద్దరు వాడవాడకు దిరిగి యమ్ముచుండును. స్వదేశవస్తువుల నమ్ముచుండును. గ్రామగ్రామములకు శ్రీమతి ఆచంట రుక్మిణీదేవి మొదలగు దేశనాయికల యాజమాన్యమున దిరిగి, కల్లుత్రాగవద్దనియు, హిందూ మహమ్మదీయ సమ్మేళన మున్నగాని దేశమునకు స్వరాజ్యము రాదనియు బోధించుచుండును.

శ్యామసుందరీదేవి తెలుగు బాగా మాట్లాడగలదు. తెలుగే యామె మాతృభాషయా యనిపించునట్లు మాట్లాడగలదు. ఆమె సగము కర్ణాటాంగనయయ్యు భారతీయ భాషలలో తెలుగే యుత్తమ మని వాదించును.

శ్యామసుందరి హృదయము పవిత్రమైనది. ఆమెకు పురుష లనేకులతో స్నేహమున్నను మనస్సులో నిసుమంతయు వికారముకలుగదు. అంతరాంతరములనైన గోర్కె జనించనులేదు, తీగెలు సాగను లేదు.

అట్టి శ్యామసుందరి నారాయణరావన్న వెఱ్ఱి ప్రేమలో మునిగినది. పవిత్రహృదయ యగుటచే నారాయణరావన్న నింత భ్రాతృప్రేమ కలుగుటకు గారణ మేమని చర్చించుకున్నది. అతడు తన సోదరుడని దృఢనిశ్చయము చేసికొన్నది.

ఇదివర కేయువకుడూ ఆమెతో నొంటిగానుండి మాట్లాడలేదు. అందులో పరుడగు నొక యువకునితో నొంటిగా గంటలకొలది సంభాషించుట ఇంతవరకామె జన్మలో జరుగలేదు.

శ్యామసుందరినిగూర్చి లోకము మాత్రము గుసగుసలు సల్పుచునేయున్నది. 'అనేకమంది విద్యార్థిను లున్నారు. కాని యీ విచిత్ర మెచ్చటను జూడలే' దను

వారు. 'ఆ బాలకు బరపురుషవాంఛ యుండక లేర ' దనువారు, నిట్లు పలువిధము లుగ చెప్పుకొనుచుందురు. అట్లనుకొనుచున్నారని శ్యామసుందరికిని తెలియును. ఎంతమంది యేవిధమున ననుకొన్న నేమి తన పవిత్రత తనకున్న జ్ఞానని యామె చిరునవ్వు నవ్వుకొన్నది. దేశమునకై తాను సలుపు సేవ కేమియు నాటంకము రాకూడదని యామె దృఢప్రతిజ్ఞ పూనినది.

అట్టి శ్యామసుందరి నేడు నారాయణరావు పేరుచెప్పిన పులకరించిపోవును. ఆతని గొంతుక వినుచు గంటలకొలది యట్లుండిపోగలదు. ఆతని మోముచూచుచు పారవశ్యముననుభవించును. ఆ సమయములో నొరుల కామె యదృశ్య. నారాయణ రావుతో బరమేశ్వరుడు వచ్చినప్పుడెల్ల పరమేశ్వరునికి దన చెల్లెళ్ళను, దమ్ముని ఒప్పగించునది. తానును నారాయణరావును నెమ్మదిగ నామె చదువుకొను గదిలో జేరి, యనేక విషయముల జర్చించుకొనుచుండువారు. ఒక్కొక్కప్పుడు నారాయణ రావు పేముసోఫాపై కూర్చుండియుండ, తానాతని ప్రక్కనే కూర్చుండి మాట్లాడు చుండును. ఆమె నారాయణరావును ముట్టినను అతడు చలింపక, ఆమెకు దనపై నున్న సోదరప్రేమకు సంతసించుచుండును.

ఒకనాడు నారాయణు డామెనుజూచి 'చెల్లీ ! నీ ఆశయాలు, నీ చరిత్ర చిన్న తనాన్నుంచి నాకు చెప్పు ' మని యడిగెను.

'ఏముంది అన్నా ! చిన్నతనాన్నుంచి గొప్ప సంగీతపాఠకురాలిని అవుదామనినీ, గొప్ప కవిత్వం వ్రాయగలదానిని అవుదామనినీ, దేశంకోసం సర్వస్వము ధారపోయాలనినీ. కలలుకంటూ ఉండేదాన్ని. మా అమ్మగారు నాన్నగారుకూడా నన్ను 'స్వప్నబాల ' అని అంటూ ఉండేవారు.

'మా నాయనగా రుద్యోగంవిషయంలో మారినప్పుడల్లా చిన్నబిడ్డనై ఉన్నప్పుడు, దారి, చెట్లు చేమలు, ఆకాశం అన్నీ నన్ను ఆనందంలో ముంచేస్తుండేవి. నేను ఆటకుబొమ్మలు తెమ్మనిగాని, ఆడుకునేందుకు వెళ్ళాలనిగాని మారాంపెట్టేదాన్ని కాదట. ఇతర పిల్లలతో ఆటకు వెళ్ళేదాన్ని కాదట. అస్తమానము చెట్లు చేమలు చూడడం, గ్రామఫోనులో పాటలు వినడం మహా ఇష్టంట. త్యాగరాజుగారి 'రామాభిరామా ' నన్ను చిన్నతనాన్నుంచి పులకరింప చేస్తూండేది అన్నా. '

నారా :—చెల్లి ! రామాభిరామా కృతి నాకు వెర్రెత్తిస్తుంది. అది ఒకటి, 'ఆరగింపవా పాలు ' ఒకటి, 'ననుపాలింప నడచివచ్చితివా, ' ఒకటి, వీటికి నేను తన్మయంలో మునిగిపోతా చెల్లీ !

'మనము పూర్వమునుంచినీ అన్నాచెల్లెళ్ళమేమో తెలియదు. ఇన్నాళ్ళనుంచి కలియకుండగా తిరుగుట ఏమో ? ఎన్ని సంవత్సరాలు వృథా అయిపోయినాయో ?

'అమ్మా ! అన్నిటికీ కారణము లేకుండా ఉండదు. కర్మయొక్క విచిత్రము అదీ ! '

'కర్మ అనేది విధి (ఫేట్) అనేది కాదు, కదా?'

'కాదమ్మా కాదు! కర్మకూడా ఆత్మతోపాటు అనాది సిద్ధమైందే! అది మూడు భాగాలుగా విభజించారు. ప్రారబ్ధ, సంచిత, ఆగాములని. ప్రారబ్ధం పాత కర్మలు కారణముగా వచ్చినది. అది ఎవ్వడికీ తప్పదు. మహాత్ములకున్నూ, రామ కృష్ణపరమహంస వంటి జీవన్ముక్తులకున్నూ తప్పదు. రామకృష్ణపరమహంసకు కంఠములో వ్రణము వేయడము విన్నావు కాదూ?'

'ఆ విన్నాను,'

'ఇక సంచితము ప్రస్తుత కర్మ. దీనియొక్క ఫలితము ఇప్పుడున్నూ ముందున్నూ సంభవిస్తూ ఉంటుంది. ఆగామి అనేది ముందు వచ్చేది. ఇప్పటి కోర్కెలు ఇప్పటి భావాలయొక్క ఫలితము. నువ్వు జ్ఞానివై కర్మయోగివైతే, ప్రారబ్ధము అనుభవిస్తూ సంచితము ఆగామి కర్మలను నశింపు చేసుకుంటే జీవన్ముక్తురాల వౌతావన్నమాట.'

'ఆ రెంటిని నశింపు చేసుకొనుట ఎల్లాగో? నేను రామకృష్ణపరమహంస సుభాషితాలు గ్రంథాలు చాలా చదివాను. నాకు స్పష్టముగా తెలియలేదు!'

'నాకుమాత్రం తెలుస్తుందా చెల్లీ! ప్రాపంచికమైన యీ మిడి మిడి జ్ఞానంతో ఎంత చదివినా మన జ్ఞానం ఊహామాత్రం! అసలు జ్ఞానం కించిత్తయినా సము పార్జించా లంటే మొదట మహాత్ము డొకడు గురువు కావాలి.'

'గురువు వచ్చిందాకా మన కేమీ లాభంలేదన్న మాటేనా?'

'అలాకాదు. నీకు ఆ తహతహ ఆ జిజ్ఞాస ఎప్పుడు ఉంటుందో, ఏ సాధు వాక్యాలో వినికాని, చదివికాని, కర్మమార్గంలోకాని, యోగమార్గంలోకాని ప్రవే శించాలని వెర్రిపుట్టుతుంది. అప్పుడే నీలో నీవే ఏదో పద్ధతి పెట్టుకొని గురువుకు ఎదురుచూస్తూ వుంటావు. ఆ యెదురు చూట్టంలో జ్ఞాను లన్నవాళ్ళని వెళ్ళి ఆశ్ర యిస్తూన్నా వుంటావు. ఆ యెదురుచూసే గురువు నిన్ను వెదుకుకుంటూనే వస్తాడు.'

'కళావిషయంలో మీ కోసం నేను ఎదురు చూచినట్లు!'

'నే నెంతవాడిని! పాపిని. ఏ విషయంలోనూ నేను గురువుగా ఉండలేను.'

## ౧౬

## జగన్మోహనుని పెండ్లి

కర్నూలు వాస్తవ్యులు రామరాజు సుబ్బరామయ్యగారి కొమార్తనిచ్చి వివాహము చేయుదుమని జగన్మోహనరావు జమీందారుగారి కడకు రాయబారులు వచ్చిరి. సుబ్బరామయ్యగారు లక్షాధికారి. వారి అమ్మాయికి జమీందారీ సంబంధము చేయవలెనని కుతూహలముకలిగి యాంధ్రదేశమంతయు గాలించుచుండ బాలిక రజస్వలయైనది. ఇంతలో జగన్మోహనుని సంబంధము వారికి దెలియవచ్చినది. బాలిక చెన్న

పట్టణమున మిషనరీల బాలికా పాఠశాలలలో నాగ్గవఫారము చదువుచున్నది. అంద మైన పిల్ల. అధునాతన నవనాగరికతాభిప్రాయములు పూర్తిగా వలపరచుకున్న బాలిక.

జగన్మోహనరా వా బాలికను జూచి, యామెతో మాట్లాడినాడు. ఇరువురకు పరస్పరము నిష్టము కుదిరినది.

సంబంధము నిశ్చయమై, ఆ సంవత్సరము మాఘమాసములో ముహూర్త మేర్పరచినారు. ముహూర్తము దగ్గరకు వచ్చినది.

'వీరేశలింగం పంతులుగారు ఆంధ్రదేశ నాయకమణిగా ప్రఖ్యాతివహించారు. ప్రసిద్ధమైన కార్యాలు చేశారు. అయితే ఇప్పుడేమన్నా పని జరుగుతోందాండీ. ఆయన ఏవి తప్పులని గొడ్డలిపుచ్చుకు కొట్టారో, అవన్నీ. మొలకలెత్తాయి. పదిరెట్లు విజృం భించాయి. ఆయన మొదట పెట్టినవి ఆయనతోనే నశించాయి. కట్నాలు మానిపించే మహానుభావు లెవరన్నా ఉన్నారా?'

'రామమోహనరాయి, కేశవ చంద్రసేను, దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, విద్యాసాగరులు ఇటువంటి మహానుభావులూ నేడు గాంధీగారు, ఇవి తప్పు తప్పు అని ఖండిస్తు వుండడము. ఒకళ్ళో ఇద్దరో అలా నడుచు కోవడము, అంతే. అవన్నీ షట్బల్చెట్టి మఖలో మాడడము, చూడండి. మా జమీందారు బాబుగారు నేను బ్రహ్మసమాజకుణ్ణి. నేను విధవా వివాహము చేసు కుంటాను, నేను కట్నాలు పుచ్చుకోను అన్నాడు నిన్నటివరకూ. ఇవ్వాళ్ళ? ఎదిగిన పిల్లనే అనుకోండి. చేసుకుంటున్నా ఆరువేలరూపాయల కట్నము ఏమిటీ? వెధవ కబురులు ఎన్నైనా చెప్పవచ్చు; చెయ్యడమేది?'

'ఓరబ్బో! గోడలకు చెవులుంటాయి. గట్టిగా మాట్లాడకు. తద్దినాలు మానే శాడు. ధర్మకార్యాలు తగలెట్టాడు. యజ్ఞోపవీతము తీసేసాడు. కాని అంతే! ఈ పెళ్ళికి చూడు, ఎన్నివేలు కర్చవుతాయో బ్రహ్మసమాజమువాడైతే, వెధవపిల్లని చేసుకోవాలి. కట్నము పుచ్చుకోకూడదు. ఒక రోజులో ఏ వెంకటరత్నము నాయుడు గారి యాజమాన్యాన్నో వివాహం చేసుకోవాలి, మగవాడైతే! ఏమంటావు?'

అని జమీందారీ తాబేదారులిద్దరు మాట్లాడుకొనుచు కూర్చుండినారు విశాఖ పట్టణం హుజూరు తాబా ఆఫీసులో.

జమీందారీ ఉద్యోగులందరు పొట్టు పొట్టయి పోవుచున్నారు- డబ్బు పోగు చేయుటలో, సరంజాములు చేయుటలో, శుభలేఖలువ్రాయుటలో అలంకారములు సమకూర్చుటలో, ఆటువంటి యింక నెన్నియో పనులలో.

జగన్మోహనుడు అడిగినచోట నడుగకుండ 50 వే లిప్పుచేసినాడు. పది గ్రామములలో రెండు గ్రామములు తనఖాపెట్టినాడు. కట్నాలని నజరానాలని ఇరువది వేల రూపాయలు రైతులనే గానుగాడి ప్రోగుచేసినాడు.

కర్నూలు పోవుటకు ప్రత్యేక ధూమశకటము. చుట్టములు స్నేహితులు గొప్పకుటుంబములవారే పిలువబడిరి విదేశీయబ్యాండు తెప్పించినారు. పాటకచ్చేరీలు

పనికి రావట. ఒకరోజే వివాహము. విశాఖపట్టణములోను, చెన్నపురిలోను ఉన్న జగన్మోహనరావుగారి స్నేహితులగు యూరేషియను కుటుంబములవా రాహ్వానింప బడిరి. వారికై పటకుటీరము లేర్పరుపబడెను. ఒక పెద్ద సినిమాహాలులో వారి భోజనములకు నాట్యమునకు నేర్పాటుచేయబడెను.

శారదయు, నామెతల్లియు వివాహమునకువచ్చిరి. బళ్ళారిలోనున్న శకుంతలా దేవియు వివాహమునకు విచ్చేసినది.

తోడల్లునకు శుభలేఖవచ్చినను, నారాయణరావునకు గబురేలేదు.

వివాహవిధి నిమిషములో జరుగవలెను. అనవసరములగు తంతులన్నియు మాన్పింపబడినవి. సంబంధమునకై దేశదేశములు వెదకిన సుబ్బరామయ్యగారు జగన్మోహనుడు కోరిన షరతులన్నిటికి ఒప్పుకొనెను.

పెండ్లికూతునకు జగన్మోహనుడన్నియు పాశ్చాత్యాభరణముల నిచ్చెను. '

సుబ్బరామయ్యగారు రప్పించిన చెన్నపట్నపు సన్నాయి మేళము విడిదికడ గానము చేయరాదు. కొందరికి బల్లలమీద భోజనములు.

ఊరేగింపు టుత్సవమునకు ముందు ఐరోపీయబ్యాండు, (వాయించువారు నల్లవారే) తరువాత పెండ్లికుమారుడు కొమరితయు గూర్చున్న రెండుగుఱ్ఱముల బండి, వెనుక పదునైదు గుఱ్ఱపుబండ్లు.

పెండ్లికుమారు డప్పుడే యింగ్లండునుండి వచ్చిన యింగ్లీషు యువకుని దుస్తులు ధరించి టోపీ చేతనుంచుకొని కూర్చుండెను. ఆ పెండ్లి కొమార్తకు, నింగ్లీషుబాలిక వివాహమునాడు ధరించుదుస్తులు ధరింపించినాడు వరుడు. ఆదుస్తులు స్నేహితులగు యూరేషియనులు తెప్పించినారు. వారి ఆడవారు వధువు నలంకరించినారు.

ఊరేగింపులో యూరేషియనులు బండికొక స్త్రీయు పురుషుడుచొప్పున పదమూడు బండ్లలో నున్నారు. వెనుక రెండుబండ్లలో పెండ్లికొమారుని చుట్టములు, జమీందారిణి, శారద, శకుంతలాదేవి, శకుంతలాదేవి సంతానము, పెండ్లికుమారుని తల్లివంకవారు, తండ్రివంకవారు పదునైదుగురు.

కర్నూలులో నిది పాశ్చాత్య వివాహమాయని టిచ్చపడిరి.

జమీందారిణి మేనల్లుని వివాహపు బద్ధతుల నన్నింటిని మెచ్చుకొన్నది.

జగన్మోహనుని తల్లి శివకామసుందరీదేవి జమీందారిణి :—'అందుకనే మావాడంటే అందరికీ గౌరవం వదినా.'

ఆమె అన్నగారిభార్య శేషమాంబ :—ఎంతచక్కగా ఉన్నదండీ, వెధవ పల్లెటూరి పెళ్ళిళ్ళూ చేస్తారు.

వరదకామేశ్వరీదేవి :—శారదా! చూశావా? నీ పెళ్ళికిన్నీ బావపెళ్ళికిన్నీ తేడా. ఇదీ నిజంగా జమీందారీ వివాహమంటే.

శారద :—చాలా బాగాఉన్నది. ఎంతో శాంతంగా ఉన్నది. ఇంగ్లీషువారి వివాహ మల్లేనే ఉంది. కాదుటే అక్కయ్యా ?

శకుంతల :—వెట్టి నలుగులు అవీలేవు. కాని ఏమిటో మొత్తంమీద నాకు అన్నీ కలిసి వికారంగా కనబడుతోంది.

శారద :—బావకు ఇంగ్లీషువాళ్ళ పద్ధతులన్నీ తెలుసు.

శకుంతల :—ఎందుకే నువ్వూ మీ బావా ఇంగ్లీషువాళ్ళో ఇంగ్లీషువాళ్ళో అని యిద వడం ?

శారద :—నువ్వు గాంధీగారి మతంలో చేరావుటే అక్కయ్య ?

శకుంతల :—నువ్వదృష్టవంతురాలవు కాబట్టి నీకు 'నాన్ కో ఆపరేషన్' భర్త దొరికాడు. నువ్వు నిముషంలో జేరడానికి వీలుంది.

శారద మౌనము.

వరద :—అదేమిటే శకుంతల! వెట్టిమాటలు. ఎక్కడ నేర్చావు ? శారదను నువ్వు దెప్పడం బాగాలేదు. దాని మనస్సు ఇదివరకే పాడై పోయినది. గోరుచుట్టుమీద రోకటిపోటువంటి మాటంటావు. ఊరుకో తల్లీ.

శకుం :—ఊరుకో అమ్మా! నీసంగతి నాకేమీ అర్థం కావటంలేదు. నేనూ చూస్తూ ఉన్నాను. నల్లేరుమీద బండివెళ్ళినట్లు మామరిదిగారిమీద ఒకటే చాడీలు. వాళ్ళిళ్లు, వాకిళ్లు, వాళ్ళకుటుంబాలు, మర్యాదలు, తలక్రిందులా తపస్సుచేసినా మనకి రావు. ఇంటికి వచ్చినవాళ్ళని మనం చూడనే చూడము. మొన్న మనం వెళ్ళినప్పుడు వాళ్ళుచేసిన మర్యాద మహామహావాళ్లుకూడా చేయరు. వాళ్ళందరి హృదయం ప్రేమతో నిండి వుంటుంది.

శివకామ :—ఎవరికోసం చేస్తారమ్మా కోడలా ?

శకుం :—ఎందుకు చెయ్యాలి అత్తా ? వాళ్ళకు మీరుచేసిన ఉపకారం ఏమిటి ? మీ కుటుంబాలన్నింటిని ఏళ్ళతరబడి ఉంచి పోషించగల భాగ్యం ఉంది, సిరీ ఉంది, సంపదా ఉంది. వాళ్ళింటినిండా బిడ్డలు. ఒక్క మా మరిదిగారి కుటుంబంలోనే ఉన్నారు ఇరవైమంది చంటిబిడ్డలు. నాకు ముచ్చట వేసి పోయింది. ఏదీ మన జమీందారీ కుటుంబాలల్లో చూపించు పదిమంది ఉన్న కుటుంబాన్ని.

శారద :—(కొంచెము కోపమున) పేడనీళ్ళతో అన్నంకడుక్కుంటావా మీఇంటిలో?

శకుం :—(మూతి ముడుచుకొని కనుబొమలు దరిదీసి) పేడనీళ్ళతో కడుక్కొం టున్నారో లేదో ముందు నీకు తెలుస్తుంది. పేడనీళ్ళతో కడిగిన అన్నం తినడానికి ఇష్టంలేక అత్తవారింటికి వెళ్ళవుకాబోలు. మన అత్తయ్యఆచారం తక్కువా. అంతమాత్రాన్ని ఆవిడ పల్లెటూరి మొద్దు అయిందా ?

వరద :—ఏమిటి శకుంతలా అది ? ఊరుకోఅమ్మా శారదా! ఎందుకూ ఈ గడ బిడ నువ్వు పెద్దమ్మాయీ!

శకుం:—ఎందుకా? పొద్దున్నుంచి నారాయణరావు నారాయణరావు అని అతన్ని ఆడిపోసుకోవడమే. మన యింటికి వచ్చినప్పుడల్లా యిదేవరస. విని విని చెవులు తడకలుకట్టి అన్నాను. నారాయణరావువంటి అల్లుడు తపస్సు చేసినా దొరకడు. విన్నావా అమ్మా. బాబయ్యగారు ఎందుకు కోరితెచ్చుకున్నారు? మన సంబంధంకోసం శారద మామగారిని హేమాహేమీలు వెళ్ళి ఒప్పించారు. నీకు ఇష్టంలేకపోతే బాబయ్యగారితో నిజంచెప్పు. ఇలాంటి తెలివి తక్కువలు చేస్తే జరిగే నష్టం నాకు తెలుసును. జరిగిన సంగతులు తెలిశాయి. తర్వాత విచారిస్తావు.

అందరూ తెల్లబోయినారు. వరద కామేశ్వరీదేవి కొమరిత గంభీరవాక్యముల కదరిపడి శారదవంక చూచినది.

శారద యచ్చట లేదు.

శారద చురచుర కోపముతో వెడలిపోయి, విడిది మేడలో దమ కిచ్చిన గదిలో పందిరిమంచముపై బరుండి, కంట నీరుదిరుగ వాపోయెను. ఆదారినిపోవు జగన్మోహనున కది వినబడి గది తలుపు త్రోసికొని లోనికివచ్చి మేనమరదలిని జూచి, పట్టరాని తమకమున నొక్కగంతున నా మంచముదగ్గరకుబోయి, యామెను బిగ్గ గవుంగిలించుకొని మోహావేశమున వణకుకంఠముతో 'శారదా! ఎం....దు....కు....ఏ....డు....స్తున్నావు' అని యడిగెను.

శారద యేడ్పు మాని మాటలాడక యాతని బారినుండి తప్పించుకొని, గోడవైపుకు దొర్లి 'యేమీలేదు బావా' అన్నది. జగన్మోహను డా దివ్యసుందర విగ్రహము ఏడ్పుమోమున మరియు సుందరతరముగగన్పట్ట, తమి నాపలేక, మంచముపైకి బ్రాకి, యామెను తనవైపుకు లాగికొని, యామె బుగ్గలను కంఠమును చెవులను జడముడిని ముద్దిడుకొని, మోము తనవంకకు ద్రిప్పికొని, పెదవుల ముద్దిడబోవుచుండ శారద చటుక్కున విదల్చుకొని, 'ఏమీలేదుబావా' అన్నది. ఇంతలో శకుంతల చెల్లెలిని వెదకుచు నచ్చటికి వచ్చినది.

## ౧౭

## 'పిల్లలంటే ప్రాణం'

శ్యామసుందరీదేవి తండ్రి సీమర్తి గోపాల కృష్ణయ్యగారు. మైసూరు వాస్తవ్యుడు. తెలుగు వెలనాటి బ్రాహ్మణుడు. ప్రసిద్ధ బ్రాహ్మసమాజికుడు. చెన్నపురి ప్రభుత్వపు బెద్ద వైద్యశాలలో ముఖ్యవైద్యులలో నొకడు ఆయన దక్షిణదేశమున జిల్లా వైద్యశాలలో నుపవైద్యులుగా నున్నప్పుడు, మైసూరుదేశపు వైష్ణవ వితంతు బాలికను బ్రహ్మసమాజ పద్ధతిని వివాహమాడెను. ఉద్యోగము విరమించి తనభార్య గ్రామమగు మంగుళూరులో నామెకు సంక్రమించిన మేడలో నుండినాడు. ఆయనకు నలుగురు కొమరితలు నలుగురుకుమారులు జనించినారు, కుమారులలో బెద్దవాండ్రు

ముగ్గురు విదేశములకు పోయినారు. పెదకుమారుడు యింజనీరింగులో నుత్తమ విద్య బడసి కాశీ హిందూ విశ్వవిద్యాలయములో నాచార్యుడుగ నున్నాడు. రెండవ కుమారుడు ఇంగ్లండులో వైద్యవిద్య నభ్యసించి ఇప్పుడు దక్షిణార్కాటు జిల్లాలో జిల్లా వైద్యుడుగా బనిచేయుచున్నాడు.

మూడవ కుమారుడు జర్మనీలో కర్మాగారవిద్య బడయుచున్నాడు. నాలుగవ కుమారుడు చెన్నపురిలోనే చదువుకొనుచున్నాడు.

ఆంధ్రులు పూర్వకాలమున వివిధదేశములకు వలసపోయినారు. విదేశములతో నోడబేరము సలిపినారు. దేశముల జయించినారు. క్రీస్తుపుట్టిన పిమ్మట నయిదారు శతాబ్దులలో కొందఱాంధ్ర బ్రాహ్మణులు మళయాళదేశమునకుబోయి నంబూద్రీలయినారు. తంజావూరు, మధుర నాయకుల కాలములో దక్షిణాపథమునకు తెలుగు బ్రాహ్మణులు, నాయకులు, కమ్మవారు వలసపోయినారు. హైదరాబాదు పరిసరముల నుండి కొందఱు బొంబాయి కరిగి యచ్చట వృద్ధినొంది, కామాఠీలని పిలువబడుచున్నారు. తరువాత నాగపురము, కళ్యాణి, అహమ్మదాబాదు, జబ్బలుపురము, కలకత్తా, కాశీ, ప్రయాగాది ప్రదేశముల నాంధ్రు లుద్యోగవర్తకాదులకై పోయి యచ్చటనే నిలిచిపోయినారు. ఇంటిలో తెలుగు మాట్లాడుకొందురు, పైకివచ్చినప్పుడే ఆదేశభాష మాట్లాడుకొందురు.

అటులనే గోపాలకృష్ణయ్యగారి పూర్వీకు లెప్పుడు మైసూరువచ్చినారో తెలియదు. గోపాలకృష్ణయ్యగారి భార్య అయ్యంగారి యువతియైనను నామెకు తెలుగు బాగుగా వచ్చుటచే భర్త యిష్టము ప్రకారము బిడ్డలందరకు తెలుగు నేర్పినది. కావుననే శ్యామసుందరీదేవి కుటుంబము వారందరికి తెలుగు, అరవము, కన్నడము బాగుగవచ్చును. హిందూదేశమున మైసూరు వైష్ణవులు సౌందర్యములో రెండవవారని ప్రసిద్ధినందినారు. నాజూకుతనము, జ్ఞానము, సౌందర్యము కలియు త్రివేణీసంగమములో వారే యఖిల భారతదేశమునకు బ్రథమపీఠము వహింపగలవారు. అట్టి తల్లికిని, తెలుంగు తండ్రికిని జనించిన శ్యామసుందరి మొదలగు నా బాలికలందరు నందమున భారతీయ రాణులనందగినవారు.

ఆంధ్రదేశ మొకనాడు బెంగాలు పంజాబుదేశములవలె సంఘసంస్కరణోద్యమములో నిలంబడి పేరువహించినది.

ఒకనాడు పరమేశ్వరమూర్తి, ఆలం, రాజారావు, వారి యరవస్నేహితుడగు నటరాజన్ శ్యామసుందరి యింట జేరినారు. నారాయణరా వింక నచ్చుటికి రాలేదు. ఆనాడు జమీందారుగారు వచ్చుటచే నారాయణరావు మామగారితో మాట్లాడుటకు వెళ్ళుచు స్నేహితులను తరువాతవచ్చి కలిసికొందునని చెప్పి, కీలుపాక్‌లో మామగారి యింటికి మోటారుమీద బోయినాడు.

అనేక విషయములగూర్చి సంభాషించిన వెనుక, శ్యామసుందరీదేవి తన తండ్రినిగూర్చి మాటవచ్చి యిట్లు పలికినది,

'మా తండ్రిగారున్ను వీరేశలింగకవిగారి శిష్యుడండీ పరమేశ్వరమూర్తి గారు! చిన్నతనములోనే భర్తను గోల్పోయిన మా తల్లి యామె తల్లిదండ్రులకు దెలియకుండ, చెన్నపురిలో శ్రీ వీరేశలింగము పంతులుగారి యాజమాన్యమున విధవావివాహ సంఘమువారు నెలకొల్పిన వితంతు బాలికాశ్రమమునకు బారిపోయి వచ్చి యచ్చట చదువుకొనుచు ప్రవేశపరీక్షలో ప్రథమతరగతిలో నుత్తీర్ణురాలైనది. మాతల్లియిన అండాళ్ళదేవిగారితెలివితేటలూ, చక్కదనమూ చూచిమాతండ్రి ఆమెను వివాహమాడినాడు.' అంత రోహిణీదేవి తన యింటజేరిన స్నేహితులకందరకు టీ పానీయమిచ్చెను.

శ్యామసుందరీదేవి యందము నానాట బెరుగుచున్నను కొంచెము చదువెక్కువ యగుటచే జిక్కిపోసాగినది. రోహిణీదేవి సంపూర్ణ యౌవనము దాల్చినది. సరళాదేవికి వయసు పరిమళించుచున్నది. నళినికి బ్రాయము తొలకరించినది. ఆ మిసిమి మిటారిబాల, కన్నుల, సహజమగు నవ్వుల కాంతులు మరియు వెలుగుచుండ వదనాంచలముల హాసములు ప్రసరింపుచుండ నల్లరిమాటల నందరిని మేలమాడసాగినది.

సరళ యేరితోడను సాధారణముగ మాట్లాడదు. మితభాషియగు రాజారావును అనెయు వైద్యవృత్తినిగూర్చియు, వేదాంతమునుగూర్చియు మాట్లాడుకొనువారు. రాజారావు అమలాపురములో వైద్యవృత్తి నారంభింప వెడలిపోయిన వెనుక, నేటికి పరమేశ్వరమూర్తి భార్యకు గర్భస్రావ మగునంత గడబిడయగుటయు, రాజారావుకు తంతినంప నాతడు చెన్నపురి కరుదెంచెను. రాజారావు వృత్తినవలంబించిన తర్వాత నా బాలిక లాతని చూచుటకదే మొదలు గావున నాతడు రాగానే,

'నమస్కారమండి రాజారావుగారూ! ఎప్పుడు వచ్చారు?' అని ఒక్కసారిగ నడిగినారు.

'రెండురోజు లైందండీ.'

'ఇప్పుడాండి మాకు కనబడుట డాక్టరుగారూ' అని శ్యామసుందరీదేవి ప్రశ్నించినది.

రాజా:—పరమేశ్వరమూర్తి భార్యకు జబ్బుచేసింది, కొంచెం కంగారుపడ్డారు. నారాయణరావూ, ఆతనూను నాకు తంతినిచ్చారు. నిన్న ఉదయం వచ్చాను. నిన్నసాయంత్రానికే కొంచెం సుగుణమిచ్చింది.

శ్యామ:—జబ్బుచేస్తే నాకు తెలియపరచారు కాదే నారాయణరావుగారు కాని, పరమేశ్వరమూర్తిగారు కాని, పోనీలెండి.

వర -క్షమించాలమ్మా దేవిగారు! మొన్న, నేనూ నారాయణరావు మూడుసారులు కాలేజీకి 'ఫోనులో' మాట్లాడినాం. మీరింకా పెద్ద ఆస్పత్రినుండి రాలేదట. తర్వాత ఇంటికి కారు పంపాము. మీరు షికారుకు వెళ్ళారట. నిన్న రాజారావు రావడంవల్ల ఆగడబిడలో ఉన్నాము.

శ్యామ :—ఏమిటండీ జబ్బు ?

రాజా :—గర్భస్రావము అయినంత పని అయింది. ఇదివరకు మూడుసార్లు ఇంతే. ముందు రాకుండా ఉండడానికి 'వై బర్నం' 'అశోక' 'సెడాన్స్' మొదలైనవి వాడుతున్నాను, మీరు కొంచెం చూస్తూఉంటారు గనుక భయం ఏమీ లేదు.

శ్యామసుందరీదేవి అయిదవ సంవత్సరం ఎం. బి. బి. ఎస్. పరీక్ష చదువుచున్న దాయేడు. 'పని ఆట్టే చేయించకుండా ఆమెకు కావలసినంత విశ్రాంతి ఇస్తూ, నే చెప్పిన మందును ఇస్తూ ఉంటే ఏమీ ఇబ్బంది లేదన్నాను. ఏవంటారు మీరు ?' అని రాజారా వనెను.

శ్యామ :—అవును లెండి. తప్పకుండా చూస్తూ ఉంటాను. నా కిదివరకు ఎప్పుడూ చెప్పినారు కాదే పరమేశ్వరమూర్తి అన్నగారు.

రాజా :—అతను సిగ్గుపడ్డాడేమో ?

శ్యామ :—కాబోలు.

రోహిణీదేవి రెప్పవాల్చక పరమేశ్వరునివైపు జాలిచూపుల జూచుచు 'అన్నగారికి చాలామంది పిల్లలు పోయారని విన్నాను. పాపం!' అన్నది.

రాజా :—ఇదివరకు ముగ్గురు కుమాళ్ళు పుట్టి పోయినారు. ఇతనికి పిల్లలంటే ప్రాణం. మా నారాయణరావన్నా, ఇతడన్నా పిల్లల్ని వదలరు! చంటిపిల్ల అయి పోతాడు పరమేశ్వరమూర్తి వాళ్ళతోపాటు.

రోహి :—ఆయన హృదయం వెన్నవంటిదని మేమంతా అప్పుడే గ్రహించాము.

పర :—నారాయణ హృదయం పన్నీరే!

రాజా :—కాని అవసరం వస్తే 'వజ్రాదపి కఠోరాణి' అయిపోదటోయి ? ఆతనూ నువ్వూ ఒకటే!

పర :—అదా నాయనా! నువ్వు గ్రహించింది.

నట :—అదిదా అడుగండిమీ, ఏదిటిదా డాక్టరు చెప్పుదురూ ? అవసరము వచ్చినప్పుడుదా మంచి గట్టిదని. అంతదా! ఏమిరా పరమేశ్వరమూర్తిగారూ అవళదానేనా ?

పర :—అవళదా! నల్లసొల్లారుదా మీరు.

నళినీదేవి:—ఏమండీ! ఆయన హృదయం రాయివంటిదని చూపించండి.

రాజా :—మా వాడు నారాయణరావుకు 'బాస్వెల్' లెండి.

పర :—ఆ విధంగాకూడా కీర్తికాంత వరిస్తుంది. కాదటోయి డాక్టరూ ?

రాజా :—తప్పక

నళిని :—చెప్పండి కవిగారూ!

సరళ :—మధ్య మధ్య చిత్రలేఖనకూడా చెప్పండి.

నట :—వహ్వా!

పర :—మేము మొన్న యాత్రలు చేసినపుడు రైలుక్రిందబడిన ఒక బొంబాయి వుద్యోగస్తుణ్ణి రక్షించాడు నారాయణం.

నళిని :—ఏవిటదీ ?

పర :—వినవమ్మా చిట్టి చెల్లీ ! కంగారు పెట్టక ఊ కొట్టు. నారాయణరావంత పెద్ద కథానాయకుణ్ణి కాకపోయినా నేనూ కథలు రాస్తూవున్నా.

నళిని :—ఊ

నట :—అచ్ఛా !

పర :—మన్మాడుస్టేషనులో ఆ రోజున వందల కొలది జనం వున్నారు బొంబాయి మెయిలు కోసం.

పర :—( చిరునవ్వు నవ్వుచు ) అల్లరిఅమ్మాయీ ! మేము నాసిక వెడుతున్నాము. ఇంతలో రైలు వచ్చింది. ఇంకా పూర్తిగా ఆగలేదు. వేగంగావుంది. మన బొంబాయి పెద్దమనిషి ఒక్కగంతువేసి బండి పట్టుకొనబోయాడు. పట్టుతప్పి రైలుకూ 'ప్లాట్‌ఫారం' అరుగుకీ మధ్య పడ్డాడు.

నళిని :—రామ రామా ! ఊఁ ! తర్వాత.

పర :—కాస్తయితే నలిగి పోవలసిందే కాని, నారాయణరావు గబుక్కునవంగి 'గోడ ప్రక్కనే కదలకుండా పడుకో' అని కేకపెట్టాడు. ఆ మనిషి అది వినిపించుకోకుండా రైలు క్రింద దూరిపోయాడు. ఆ దూరడంలో ఒక్క కాలు తీసుకో లేకపోయాడు. చక్రం ఆ పాదం మీదనుంచి పోయింది. పాదం పచ్చడి. రైలు వెళ్ళిపోయింది. స్మృహతప్పి ఆ మనిషి పడి పోయాడు. జనం వందలకొలది దూకి ఆ మనిషిచుట్టూ చేరారు. ఒక్కళ్లూ సహాయానికి వంగరు.

నళిని :—అబ్బా ! ( ఒడలు జలదరించును. )

పర :—నారాయుడు చటుక్కున వంగి, ఆరడుగుల పైచిలుకున మంచి లావూ భారీ వున్నవాణ్ణి చంటిపిల్లవాడిలా ఎత్తి ఒక్కగంతుతో ప్లాటుఫారం ఎక్కాడు. గబగబ రెండవ తరగతి వారి విశ్రాంతి గది దగ్గరకు తీసికొనివెళ్ళాడు. రాయివేసి రక్తం స్రవించకుండా రక్తనాళాన్ని గట్టిగా కట్టాడు. నేను వెనకాలే పరుగెత్తుకొని లైజాల్ బుడ్డి, పళ్ళెము, నీళ్ళకూజా, దూది, గుడ్డలు మా దగ్గిర ఉన్నవి పట్టుకు వెళ్ళాను. అవి వాడికిస్తే-

నళిని :—( చిరునవ్వునవ్వి ) మధ్య మిమ్మల్ని వీరుణ్ణి చేసుకున్నారే !

పర :—( నవ్వుచూ ) తప్పదు 'మంచిపని చేశావురా' అని 'నీళ్ళు' అని పొలికేక పెట్టి, కాలు కడిగి నేను తెచ్చిన లైజాలు నీళ్ళలోవేసి పాదం అంతాకడిగి తనజేబులో ఉన్న చాకుతో కాలికి ఉన్న బూటుకోసి తీసివేశాడు. టించరు అయోడిన్ వేసి గుడ్డచుట్టాడు. ఇంతలో డాక్టరు వచ్చాడు.

# ఆంధ్రులు డాంబికులు

నళిని :—మా అక్కకన్న బాగా పస్తుమైడు (మొదటి వైద్యసహాయం) చేశారే! చాలా సంతోషంగా ఉంది. తర్వాత.

పర :—తర్వాత ఏముంది అమ్మా! మేం వచ్చేశాం మా అడ్రసు ఇచ్చి వచ్చాము కాదూ. మొన్ననే ఉత్తరం రాశాడా బొంబాయి పెద్ద మనిషి.

రాజా :—ఇంకా మీ నారాయణరావు వీర కృత్యాలంటే వర్ణించవోయ్ కవీ!

శ్యామ :—డాక్టరు అన్నగారూ! నారాయణరావుగారికి బాగా యీతవచ్చునటకామా!

రాజా :—పరమేశ్వరుడికీ వచ్చును.

పర :—మా నారాయుడి యీత గజీతలెండి. ఒకమాటు రాజోలుదగ్గర, పడవ రేవు దాటి వస్తూవుంది. గాలిబాగా వీస్తూంది. గోదావరి కెరటాల్తో ఉబికిపోతూ వున్నది. నారాయణరావూ నేను నర్సాపురం నుంచి స్టీమరుమీద వచ్చి రేవులో దిగుతున్నాము. ఘొల్లు మన్నారు. ఏమిటా అని చూస్తే ఎల్లా మునిగిందో ఆ పడవ మునిగింది. నారాయుడు ఎట్లాఉరికాడో, ఎల్లా బారలమీద వాయువేగంతో వెళ్ళాడో యిరవై గజాల దూరంలో ఒకరితర్వాత ఒకళ్ళను నలుగురిని పట్టుకోడం, వెనకాలే వచ్చిన పడవకు అందివ్వడం చేశాడండి. ఇద్దరు మనుష్యులు స్పృహతప్పి పోతే ఒడ్డునపడేసి పొట్టనొక్కి ఊపిరి తిత్తు లాడించి వాళ్ళను బ్రతికించాడు డాక్టరుగారు వచ్చేలోపుగా.

రాజా :—అప్పుడే కాదటోయి ప్రభుత్వంవారు బహుమతీ యిచ్చారు.

పర :—ఇస్తే ఆ పడవవాడికి పంపించాడది. ఇంకా వున్నాయి వాడి వీరకృత్యాలు.

నళిని :—మరి కానీండి.

పర :—కలకత్తాలో మేము నడిచి వెడుతూ ఉంటే, ఒకసార్జెంటు సైకిలుమీదవస్తూ నారాయుడికి తగిలి క్రిందపడ్డాడు. పడి 'ఫంవాలుడా' అంటూ లేచి 'నీబుర్ర బద్దలుకొట్టాను' అని మీదకు వచ్చాడు. నారాయుడు నవ్వుతో నుంచోని మనిషి ఎప్పుడువచ్చి చేయెత్తి కొట్టబోయ్యాడో మెరుపువేగంలా ఆ చెయ్యిపట్టుకొని వాణ్ణి వెనక్కు తిప్పి చెయ్యి మెలిపెట్టి వదిలేసి 'అనవసరంగా మీదకురాకు. తప్పు దగ్గరవుంచుకొని పగిలితే ఎవరూ ఏమనవదరు. పో' అని తోవచూపాడు. దెయ్యంలా ఉన్న మనిషి పిల్లి అయ్యాడు, మాట్లాడక సైకిలు ఎక్కిపోయ్యాడు. అది చుట్టుపక్కల వాళ్ళంతా చూస్తూ ఉన్నారు. ఒక్కసారివచ్చి నారాయుడిచుట్టూ మూగారు.

రాజా :—ఇదిగో వచ్చాడు నారాయణం వెయ్యేళ్లాయువు.

పర :—అయితే త్రిదశవర్యుడవై పోరా నారాయుడా!

నారాయణరావు :—( లోపలికి వచ్చుచు ) ఆలస్యమయింది క్షమించాలి. నళినీ సరళా కన్యలలో ఎవరైనాసరే, యీ అన్నకు ఒక్క అవున్సుడు మంచినీళ్ళు ఇస్తే చాలా సంతోషిస్తాను.

రాజా :—మీ మామగా రేమన్నారోయి ?

నారా :—ఉండు ఈ దాహం తీర్చుకోనియ్యవయ్యా.

నళినీదేవి లోనికిబోయి మంచినీరు దీసికొని వచ్చి యిచ్చినది. నారాయణరావు దాహము తీర్చుకొని కూర్చుండెను. మంగపతిరావు, నారాయణరావునుజూచి 'రేపు మాయన్న వచ్చుచున్నాడు' అనెను. 'ఏ అన్న ?' యని నారాయణరావు పృచ్ఛజేసెను.

'మా రెండవ అన్నయ్య'

పర : నారా :—చాలా సంతోషము.

రాజా :—మాకు శల్యవిద్యలో ద్వితీయోపాధ్యాయుడుగా ఉండేవారు.

శ్యామ :—(నారాయణరావును జూచి) అన్నగారూ ! నటరాజన్ మీ ఆంధ్రులు వట్టి డాంబికులు అని వాదించాడు. నాకు జ్ఞానం వచ్చిన తర్వాతనే చెన్నపట్టణము వచ్చాము. కనుక నాకు ఆంధ్రుల చరిత్రా, వారి స్వభావాలూ యేమీ తెలియవు. చిన్నతనంలో తెలుగుదేశంలోగూడ ఉన్నామట.

నారా :—ఒకసారి మీరంతా మాదేశంవస్తే బాగుంటుందని నా ఉద్దేశం. మా ఇంటికి కొత్తపేట, అతిధులుగా రండి. దేశం, దేశంలోని ఆచార వ్యవహారాలు, దేశంయొక్క వర్తమానచరిత్ర అన్నీ జాగ్రత్తగా గ్రహించగలరు.

:—మన ఆంధ్రుల్ని నటరాజన్‌గారు చెక్కివదిలారు. మీరు దానికి సమాధానము చెప్పరేమండీ అన్నయ్యా !

పర —మన ఆంధ్రులకు ఉత్సాహం యెక్కువ. సమయం వచ్చిందంటే ఉత్సాహంతో వేలకువేలు జనము సిద్ధము. ఉత్సాహం తగ్గుటతోడనే కనుచూపు మేర దూరాన్ని మళ్ళీ ఎవరూ కనబడరు.

రాజా :—ఉత్సాహంకూడా ఎక్కువకాలం ఉండదండి.

పర :—దేశం అంతా గ్రంథాలయాలు అన్నారు ఎక్కడచూస్తే అక్కడ గ్రంథాలయాలు, కృష్ణదేవరాయ, వసురాయ, గౌతమి, రామమోహన, మోహనదాసు, తిలకు మొదలగు పేర్లతో దేశం అంతా గ్రంథాలయాలు, గ్రంథాలయ మహాసభలు, గ్రంథాలయ పత్రికలు. ఇప్పుడుచూస్తే ఏవో నాలుగో అయిదో బాగా పనిచేస్తున్నవి. తక్కినవి నామమాత్రావశిష్టముగా కొన్ని, కొట్లాటలతో చప్పగా నశించిపోయినవి కొన్ని.

నారా :—పత్రికలు రోజుకు రెండు బయలుదేరి నాలుగు నశిస్తున్నవి. ఎప్పుడో ఒకనాడు భీమాకంపెనీలు అలాగే బయలుదేరి నశించిపోయినవట.

పర :—బందరులో, పంచదార యంత్రాలయము, రాజనరేంద్రనగరిలో కాగితాల యంత్రాలయం, గుంటూరులో ఇనుపకర్మాగారం, ఏలూరులో గోనెగుడ్డ కర్మాగారము అలాగే అనేక కంపెనీలు బయలుదేరి మాయమైపోయినవి కొన్ని, మరిగిపోతున్నవి కొన్ని.

రాజా :—1920 సంవత్సరములో ఊరికి ఒక జాతీయ కళాశాల బయలుదేరినది. యిప్పుడు కొనఊపిరితో శారదా నికేతనం, ఒకటి ఉన్నది. బందరుజాతీయ కళాశాల ఎల్లాగో గాలం గడుపుతో ఉన్నది కాదురా నారాయణరావూ ?

నారా :—ఆశ్రమాల్లో పల్లెపాడు ఆశ్రమం ఏమయింది ? ఆ మహానుభావుడు దిగుమర్తి హనుమంతరాయుడు పోవడంతోనే, ఆ ఆశ్రమం నశించింది.

శ్యామ :—ఇది ఏమిటి ! అన్నగార్లు అంతా మనదేశాన్ని పట్టుకొని దూషిస్తున్నారే.

నారా :—దూషణ పూర్తికావాలి శ్యామసుందరదేవీ ! కానీ పరం !

పరం :—తిట్టులు నువ్వే పూర్తి చెయ్యలేకపోయినావట్రా ? సరే ! ఒకసారి గబుక్కున దేశంఅంతా పరపతిసంఘాలు. ఎన్నో నశించాయి. కొన్నిసంఘాలు దివాళాలు తీశాయి. పోనీ, మూడురూపాయలవడ్డీకి మారువాడీదగ్గర అప్పు తీసుకరావడం మానేరా అంటే అదీలేదు.

శ్యామ :—దీని కంతకూ కారణం ?

నళి :—ఫీజు యిచ్చి ప్లీడర్ని పెడితే పిచ్చెత్తి యెదిరిపార్టీ తరపున వాదించి ఎక్కడికో లేచిపోయిన వకీలులా వున్నారు పేరంతా.

నారా :—హృదయదౌర్బల్యం. వెన్నెముక బలంలేకపోవడం, పట్టుదల హుళక్కి. నమ్మకము సున్న. అహంభావము అతిజాస్తి. ఒక్క నాయకుడులేడు. అంతా నాయకులే. పెద్దలయెడ మర్యాదలేదు !

పర :—అందుకనే జ్యోతిషంలో మన దేశానికి రెండువందల సంవత్సరాలనుంచి కుజుడు రాజయ్యాడు. మనదేశంనుంచి ఇతరదేశాలకి వెళ్ళితేనేగాని మన వాళ్ళకు పేరురాదు. బంగాళీవాళ్ళు, మహారాష్ట్రులు, పాంచాలురు, ఉత్తర హిందూస్థానంవారు వాళ్ళ దేశాల్లోనే గౌరవం పొందుతున్నారు.

నారా :—ఇంకో పెద్దకారణం ఉన్నది. పూర్వం మహారాజుల ఆదరణం ఎక్కువ ఉండేది ; ఇప్పుడులేదు. ఆంధ్రదేశంలో కొన్ని పెద్ద జమీందారీలు ఉన్నవి. వారు మరీ పెద్దవారు. వారి పూర్వీకులపేరు నిలబెట్టక ధనం ఎన్నివిధాలో నశింపుచేయుట ఉద్దేశం గల కొందరు మహానుభావులు వున్నారు. వివిధ ఉద్యమాలకు సహాయంచేసే మాన్యులూ వున్నారు. తక్కినవారు 'నన్ను ముట్టుకోకు నామాలకాకి' అని అంతఃపురాల్లో కూర్చుంటారు 'ఆంధ్రా పేపరుమిల్లు' విషయంలో ఒక్క మహారాజు పూనుకుంటే ఈ పాటికది ఎంతలాభకారి అయివుండును ? దేశానికి ఎంత ఉపకారం అలాగే బందరు పంచదార ఫ్యాక్టరిన్ని. ఈ పెద్ద జమీలులేని ప్రదేశం రైతువారీదేశం;

అందరూ చిన్నరైతులు. వారు తమకు మించిన బ్రతుకు బ్రతుకుతూ మారు. వాళీల దగ్గిర, షాహుకార్లదగ్గిర అప్పుతెచ్చుటలోనే దేశోపకారంచేస్తూ వున్నారు.

పర :—ఇదిగోనమ్మా సోదరీ! రేపు డిశంబరు 15 వ తారీకున చెన్నపురిలో ఆంధ్ర నవవాఙ్మయ సభ జరుగుతూవున్నది. అదిచూద్దు కాని. ఆంధ్రుల ఉత్సాహం కార్య శూరత్వమున్నూ.

సరళ :—ఇంక వారంరోజులే ఉంటా!

రోహిణి :—మా మంగపతి ఇంగ్లీషులో కవిత్వం వ్రాస్తాడు. అతడు రావచ్చునా?

పర :—తప్పకుండా రావచ్చును.

శ్యామ :—ఏమిటీ కవులసభ?

పర :—ఇప్పుడు ప్రస్తుతం రెండు ఉద్యమాలు భాషావిషయంలో ఉన్నాయి తెనుగు దేశంలో. ఒకటి గ్రాంధికభాష, పూర్వ సాంప్రదాయ కవిత్వం. రెండు, వ్యావహారిక భాషా, నూతన సాంప్రదాయ కవిత్వం. దీన్నే భావకవిత్వం అనికూడా అంటారు.

నట :—నాబదులు పరమేశ్వరమూర్తి నిండా బాగుగా వాదించినాడుదా.

పర :—ఉండవయ్యా! అరవవాళ్ళపని తర్వాత చెప్తాను. సంతోషించకు. అరవము అని అరుస్తారుదా మీరు. మమ్మల్ని మేము నిందించుకుంటోంటే సంతోషిస్తున్నాడు నటరాజ[illegible] ఇందాకటి నుంచిన్నీ.

రోహిణి :—భాషను గూర్చిన వాదం ఏమిటది.

పర :—ఏ ముందమ్మా. గ్రాంధికవాదం, వ్యావహారికవాదం ఇప్పుడు దేశంలోవున్న పరిస్థితులు చెప్తా. పూర్వంనుంచీ వచ్చినగొప్ప గ్రంథాలన్నీ పద్యాలల్లో ఉన్నాయి. భారతం, భాగవతం, ప్రబంధాలు అవి ఏమిటో తర్వాత చెబుతా! ఆ పద్యాలతోపాటు గద్యమూ ఉన్నది. నన్నయ్యభట్టు భారతంవ్రాసిన కవులలో మొదటికవి. తెలిసి వున్నంతవరకు ఆంధ్రభాషలో గ్రంథమువ్రాసిన మొదటికవి. వాగనుశాసనుడు, అని పేరు ఆయనకు. ఆయన సంస్కృతంలో తెనుగుభాషను విధిస్తూ వ్యాకరణం వ్రాశారు. తర్వాత చాలామంది వ్యాకరణాలు వ్రాశారు అప్పకవి మొదలైనవాళ్లు. ఆ మొదటివ్యాకరణాన్ని అనుసరిస్తూ ఏదో కవి స్వతంత్రాలు అక్కడక్కడ చూపిస్తూ తర్వాత కవులంతా ఆ వ్యాకరణాన్ని అనుసరించారు. కాని 1850 దాటేవరకు తెలుగులో వచనగ్రంథం సరియైంది ఒకటీ పుట్టలేదు. చిన్నయసూరి, వచన నన్నయ అయ్యాడు. బాలవ్యాకరణం వ్రాశాడు. ఆయన నీతిచంద్రిక అని పంచ తంత్రాన్ని తెలుగువచనంలో భాషాంతరీకరణం చేస్తూ పూర్వగ్రంథాలలో వుండే గద్యభాషే వ్రాశాడు. వీరేశలింగకవి, ఛిలకమర్తి లక్ష్మీనృసింహకవి

యింకా అన్నేకు లా భాషను అనుసరించారు. దానికి గ్రాంథికభాష లేక వ్యాకరణయుక్తమైన భాష అని అంటారు.

రాజా :—అబ్బ! గుక్కతిప్పకుండా ఒక్క బిగిని ఉపన్యాసం ఇచ్చాడు!

పర :—కాని 1914 ఆ ప్రాంతాల్ని ఒక ఉద్యమం బయలుదేరింది. గురుజాడ అప్పారాయకవి, సెట్టి లక్ష్మీనరసింహాకవి మొదలైనవారు దానికి మొదటి వారు. గిడుగు రామమూర్తిగారు ఆ వాదానికి అర్జునుడు. వాళ్ళనేది ఏమిటి? పద్యాలమాట అటుంచండి. కాని పూర్వంనుంచి ఉత్తమ తరగతులవాళ్ళు ఉపయోగించిన భాష మనకు ఆదర్శం అవ్వాలి వచనరచనకు. ఇంగ్లీషు భాష వచనం ఎప్పటికప్పటికి రాజసభలో మాటలాడుటబట్టి మారుతో ఉంటుంది. మనదేశంలో ఉత్తమకులాల భాషనుబట్టి మార్చుకోవాలి లేక పోతే భాష ఎదగడం మానును. ఎదుగుట మానితే చచ్చిపోతుంది. భాషను రైలుపట్టాల మీద నడువ మన కూడదు. భాష ఒకవ్యక్తి, ఒక ఆత్మ. అది యుగాలు బ్రతకాలి. అనేక యుగాలు బ్రతికి ప్రాణము వదిలింది కాబట్టే సంస్కృతం మహానిధి అయింది. వేదభాష వేరు, పురాణభాష వేరు, నాటక భాష వేరు. ఊరికే ఎదిగి హిమాలయాన్ని కూడా మించాలి భాష. వ్యవహారికంలో ఉండే భాషే ఆలాగు ఎదుగుతుంది. ఆ భాషే మన వచన భాష చెయ్యాలి అని వాదిస్తున్నారు.

రాజా :—రెండవ ఉపన్యాసం అయ్యింది. ఇంకా!

పరం :—పూర్వకవులు మహారాజులను నాయకుల్ని చేసి, మహారాణులను నాయికలను జేసి గ్రంథాలను సృష్టించారు. కాలాన్నిబట్టి సృంగారం ముఖ్యరసం చేశారు. వారు వ్రాసినవి పురాణాలు, మహాగ్రంథాలు, ప్రబంధాలు, బాగానే ఉన్నవి. ఇంక అవే అనుకరిస్తే పేలవమైపోతాయి అని యువకులు కొత్త మార్గాలు తీశారు. ఇంగ్లీషుభాష ఒకటి చాలా ఉద్బోధంకలిగించింది. ఈ క్రొత్త కవిత్వానికి మార్గదర్శకులు గురుజాడ అప్పారావుకవి. బొబ్బిలి పాట అదీ చూడండి. ఎంత మాధుర్యంగా ఉంటాయో! కాబట్టి క్రొత్త మార్గాలు తీయండయ్యా అన్నారు. తమ భావాల్ని తమ ప్రేమనీ, ఆశ్రయించి వ్రాసేవారు, జానపదుల జీవితాల్ని దర్శింపచేసేవారు, పురాతన ఆంధ్రుల మహాచరిత్రలు స్మరింపచేసి పులకరింపులు కలుగజేసేవారు ఈ రకాలుగా ఉన్నారీనాటి కవులు.

## ౧౯

## ఆంధ్ర నవకవి సమితి

ఆంధ్ర నవకవులకూటమి ' అని పెద్ద యక్షరములతో పచ్చయప్ప కళాశాల సింహద్వారముపై పెద్ద అట్ట కట్టినారు. మధ్య సభామందిరమును వేదికయు మనో

హరముగ నలంకరింప బడినవి. అలంకారాది సమస్త యాజమాన్యము నారాయణ రావు నెత్తిపైన బడినది. వరదరాజస్వామివారు అధ్యక్షులు. ఆహ్వాన సంఘాధ్య క్షులు ఆంజనేయకవి. ఆహ్వాన కార్యదర్శి నారాయణరావు. పరమేశ్వరమూర్తి, రోహిణీదేవి మొదలగువారు ఆహ్వానసంఘసభ్యులు. అనేకమంది కళాశాలా విద్యా ర్థులను ప్రోగుజేసి, వారలకు ఉత్సాహము గలిపి నారాయణరావు కార్యక్రమ మంతయు విచిత్రముగ నొనగూర్చెను.

కూటమి మూడురోజులు. సమస్తమగు కర్చులకు నారాయణరావు మున్నూరు రూపాయలు చందా వేసెను. జమీందారుగారు నూరురూపాయలిచ్చిరి. నాగేశ్వర రాయులు నూరు, అల్లాడి కృష్ణస్వామయ్యగారు నూరు రూపాయలు, ఇంకను వకీళ్ళు, షాహుకార్లు మొదలైనవారందరు చందాలు వేసినారు. సుమారు రెండు వేల రూపాయలు ప్రోగుచేసి నారాయణరావు, ఆహ్వాన సంఘము వారికిచ్చి సరళను, యువకవియు భారతీ పత్రికా స్థానములో వ్రాయసకాడునగు రామలింగరావును గోశాధి పతులజేసి, జాగ్రత్తయని వారికప్పగించినాడు.

సమయములో సమయమని చిత్రకళా ప్రదర్శనము, కవుల ఛాయాచిత్ర ప్రదర్శనము, నవీన కవుల ముద్రితాఽముద్రిత గ్రంథముల ప్రదర్శనము నేర్పాటు చేసెను. చిత్రకళాది ప్రదర్శనములకు కళాహృదయుడగు కజిన్సు పండితుని నేతగా నాహ్వానించెను.

ధనాభావముచే సభలకు రాజాలరని యెంచిన కవులకు రానుపోను ఖర్చులీయ బడునని తెలియజేయుచు తానే తన 'స్వంతములోనుంచి' ధనమును బంపినాడు.

ఆహ్వానము లచ్చువేయించినారు. కార్యక్రమములు ముద్రించినారు. ధనము లోటగునేమో! తనకు మించిన కర్చు తగులబాటగునేమో! యని యువకుల గొందరిని నాటకమాడ నేర్పరచినాడు.

చిత్రకళా ప్రదర్శనమునకు దేశదేశ చిత్రకారుల కాహ్వానము లంపినారు. శాంతినికేతము నుండి నందలాలుగారు, కలకత్తానుండి అవనీంద్రనాథ ఠాకూరుగారు, లక్నోనుండి అసితకుమార హవల్దారుగారు, పంజాబునుండి అబ్దుల్ రహమాన్ చౌగుతాయిగారు, బరోడానుండి ప్రమోదకుమార చటోపాధ్యాయులు, మైసూరునుండి వెంకటప్పగారు, బొంబాయినుండి సాలోమానుగారు, అహమ్మదాబాదునుండి కన్ను దేశాయిగారు, మణిభూషణగుప్తగారు ముజుందారు, సుధాంశుచౌదరి, దేవీ ప్రసాద రాయ చౌదరిగారలు మొదలగువారును; ఆంధ్రదేశములో రాజమహేంద్రవరపురము నుండి వరదా వెంకటరత్నంగారు, శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారు, చామ కూర భాష్యకార్లుగారు భీమవరమునుండి అంకాల సుబ్బారావుగారు, గ్రంధి శేషారావు గారు, తంగెళ్ళమూడి వెంకటసుబ్బారావుగారు, గుంటూరునుండి గుఱ్ఱం మల్లయ్య గారు, అనిశెట్టి సుబ్బారావుగారు, చెన్నపురినుండి కవుతా రామమోహనశాస్త్రిగారు, కేశవరావుగార్లు, గుజరాతునుండి కవుతా ఆనందమోహనశాస్త్రిగారు విశాఖపట్టణము

నుండి వరిశెట్టి రామారావుగారు, కాకినాడనుండి చామకూర సత్యనారాయణగారు, నరసాపురమునుండి వెన్నా శేషగిరిరావుగారు, ఏలూరునుండి చంద్రుపట్ల బాపిరాజు రామారావుగారలు, పెనుగొండనుండి వెంకట్రావుగారు యింకను వారిచిత్రకారకులు తమ తమ చిత్రములను ప్రదర్శనమునకు బంపిరి.

ఆహ్వానము లంగీకరించి ఆంధ్రదేశ వివిధ మండలాలనుండి రాయప్రోలు వారు, విశ్వనాధంవారు, తల్లావఝ్ఝులవారు, కురుగంటివారు, దేవులపల్లి వారు, వేదుల వారు, నండూరివారు, కాటూరివారు, మాధవపెద్దివారు, దువ్వూరివారు, పింగళివారు, మునిమాణిక్యులు, కవిరాజులు, మొక్కపాటివారు, నోరివారు, నాగేంద్రరాయలు, చింతావారు, పంచాగ్నులవారు, కరణంవారు, కోలపెన్నువారు, మల్లంపల్లివారు, తుమ్మలవారు, భావరాజువారు, కవికొండలవారు, మల్లాదివారు, పువ్వాడవారు, త్రిపురారిభట్లవారు, అనేకులు సభల నలంకరించినారు.

పచ్చయప్పకళాశాలా భవనములో కవులసభలు జరిగినవి. నానాప్రాంతాగతు లయిన సుప్రసిద్ధ కవులు తాము క్రొత్తగా రచించిన పద్యములు, పాటలు మనోహర ముగ జదివి వినిపించినారు. సాయంకాలముల గోఖలే భవనమున గొప్ప ఉపన్యాస ముల నిచ్చినారు. ఉత్తమ గాయకులు సంగీతము పాడి వినిపించిరి. ఒకనాడు కూచిపూడివారి భాగవత ప్రదర్శనము, ఒకనాడు జంగం కథ దేశినాట్యములు మున్నగు వినోదములు ప్రదర్శింపబడినవి. రసజ్ఞులు విమర్శకులు కవితావిషయముల గూర్చి చక్కని ఉపన్యాసములు చేసిరి. ఒకనాడు శ్యామసుందరీదేవి చెల్లెంద్రతో పాట కచేరి చేసి, సభ్యుల నానందమున నోలలాడించినది. ఆసమయమున నారాయణ రావు ఫిడేలుతో వారి ననుసరించెను. పరమేశ్వరుడు తాను రచించిన ఏలపాటలు సహజమధురతా పూర్ణస్వనమున సాభినయముగ బాడి వినిపించెను. అతిథులందఱకు హిందూయువజన సమాజ భవనమున ముప్పొద్దుల షడ్రసోపేత భోజనములు ఫల హారములు నమర్చిరి.

అధ్యక్షులవారు మధురముగ, గంభీరముగ ఉపన్యాసము గావించినారు. కవి త్వము జీవితమూలము కదిపిరావలెను. పైనుంచి తెచ్చిన అలంకారము కారాదు. కవి బ్రతుకులో భాగమై అది మొలకెత్తవలెను. ఈరీతి వారు గంగా ప్రవాహము వోలె, సముద్ర కెరటములరీతి నుపన్యాసము లిచ్చినారు.

భావకవిత్వము అనుమాట పనికిరాదన్నారు కొందరు. భావములేని కవిత్వం ఏది ? ఆపదము తప్పకతీసివేయుడని ఉపదేశించిరి. కాని భావమన అర్థముకాదు. రసస్వరూపమైన భావమే సరిఅయిన పదమనియు, భావమన హృదయము, మనస్సు అనియు, భావజ్ఞుడా యర్థమును గోచరింప జేయుననియు, కవి జీవితమును ప్రతి ఫలింప జేసికొన్న కావ్యము భావకవిత్వమని కొందరు వాదించిరి. అందరు భావ కవిత్వమన్న (సబ్జెక్టివ్) కవియే నాయకుడైన కవిత్వమనిరి.

ఇరువురు భారత భాగవతములు పూర్ణకవిత్వం కాదన్నారు. సంస్కృతము నుండి ఆంధ్రీకరణము చేసినంతమాత్రమున అది కవిత్వమా యనిరి.

కాని ఆ యిరువురను ఖండించి మనల మన మెంత మెచ్చుకొనుచున్నను భారత భాగవతాది మహాగ్రంథకర్త లవతారమూర్తులని పూజింపవలె నన్నారందరు.

పాటలు వ్రాయవచ్చునన్నారు. పాటలను కవిత్వమని ఒప్పుకొన్నారు.

ఇక నెట్టిభాష ఉపయోగించవలెనన్న ప్రశ్న వచ్చినది. వ్యాకరణయుక్తమగు భాష నుపయోగించదలచినవారు పద్యములకు పాటలకు నుపయోగింప వచ్చుననియు, వచన గ్రంథములకు దప్పక వ్యావహారికమే యుత్తమమనియు వచించినారు.

పరమేశ్వరు డిట్లు వాదించినాడు. 'భాష పెరుగుతుంది. భాషకూడా ఒక వ్యక్తి. భాషకూ పుట్టుక, వృద్ధి, చావు అని మూడు స్థితులున్నాయి. ప్రపంచంలో ఎన్నో భాషలుపుట్టాయి, పెరిగాయి, నశించాయి. కొన్ని, చనిపోయినచెట్టు, రాయి, లోహము మొదలయినవి శిల్పస్వరూపముతో నాణెములును నగలు మొదలయిన రూపాలతో జీవించిఉన్నట్లు, సలహా భాషలక్రింద జీవించి ఉండవచ్చును. కాని అవి నిధులు, జీవభాషలుమాత్రము కావు. సంస్కృతం చూడండి అనేకవేల సంవత్సరాలు జీవించింది. నేడు మహానిధియై వున్నది. అలాగే లాటిను గ్రీకు, హెబ్రూ మొదలగు భాషలు. మీరు ఎప్పుడు భాష ఎదుగులేకుండా వ్యాకరణం ఏర్పాటుచేసి శాసిస్తారో అప్పటినుంచి వృద్ధిపొందడం మానివేస్తుందేమో. అలాగే సంస్కృతాన్ని శాసించగానే ప్రాకృతంవచ్చింది. అది శాసించబడగానే పాళీ వచ్చింది. అదీ శాసించబడగానే వంగభాష, బిహారీభాష, ఉరియా, హిందీభాష మొదలైన భాషలు వచ్చాయి. అలాగే తెలుగునుశాసించకండి. అప్పుడే రెండురకాలభాషలు, గ్రాంధికం వ్యావహారికం వచ్చాయి. ఈ రెంటికీ గట్టులు దూరం అవుతున్నాయి. ఏలాగో వంతెనగట్టాము. ఇక కట్టలేనంతదూరం అయితే ఇంకో క్రొత్తభాష తయారవుతుంది. ఆభాష సంస్కృతంలా నిధి కావచ్చును అనుకుంటారేమో ఆ అదృష్టం సంస్కృతం దివ్యభాష గనుక దానికి పట్టిందికాని ప్రతిదానికి పట్టదు.' ఈరీతిగా మాట్లాడినాడు.

వ్యావహారికమును కావ్యభాష యనినారు. కాదు వచనకావ్యములు వ్యావహారికములోననే యుండవలెనని మరికొందరు వాదించిరి. కావ్యలక్షణాలు ఉండవలెను. కాని, భాష ఉపాధి. అదియును కావ్యానికి ముఖ్యాంగము కాబట్టి ఏభాషనైనా ఉపయోగించవచ్చునని, అది కావ్యములో లీనమైపోవలెనని తీర్మానము జయమందినది. నారాయణరావు చిత్రకళనుగురించి మాట్లాడినాడు, చిత్రకళామహాసభలో.

'కళ ఆనందస్వరూపం. ఒక వ్యక్తిలో జనించిన ఆనందం కళాస్వరూపంతో వ్యక్తం అవును. ఆ వ్యక్తమైన కళ సూచనమాత్రం కాక సంపూర్ణముగా ఆనందమును వ్యక్తీకరించాలి. ఆనందం ఎలా కలుగుతుంది? సృష్టి మన దృష్టిపథములోనికి వచ్చినప్పుడు అనగా సృష్టిలో ప్రతి పూర్ణమగు విషయం నీ దృష్టి

పథాన్ని పడినప్పుడు నీకు ఆనందం కలుగుతుంది. దివ్యమై పరబ్రహ్మస్వరూప మైనది ఆదిశ్రుతి. ఆశ్రుతి, ప్రకృతిలో అనేకరకములగు శ్రుతులుగా వ్యక్తమవు తుంది. రంగులు రంగుల కలయిక, స్వరములు వాని కలయిక, వస్తువులు వాని కలయిక, పరిమళాలు వాని కలయిక, రేఖలూ వాని కలయిక, హృదయములు, జీవితములు మనస్సులు చరిత్రలు వీని కలయికలు, ఆత్మలు వాని కలయిక ఇవి శ్రుతి స్వరూపాలవుతవి.

'ప్రపంచంలో వ్యక్తుల జీవితాలు భిన్నభిన్న శ్రుతులతో వుంటవి. ఎవ్వని శ్రుతినిబట్టి వానికి తగిన ఆనందం కలుగుతుంది.

'ఆ ఆనందం వ్యక్తీకరించే శక్తి పూర్వకర్మ సముపార్జితం. అలా వ్యక్తీ కరించలేనివాడు ఆ వ్యక్తీకరణము గోచరించినప్పు డానందిస్తాడు.

'వ్యక్తీకరించగలవాడు స్రష్ట. అట్టి కళా సృష్టినిచూచి ఆనందించువాడు కళాభిజ్ఞుడు.

'సంగీత హృదయంకల వ్యక్తి ఒక చిన్న సెలయేటి పతనంలో సంగీతం విన్నాడు అనుకోండి. అతని హృదయంలో ఆనందం పుట్టింది. ప్రస్రవణగాన సదృశ మగు పాట రచించినాడతడు, అది విని మన మానందిస్తాము.

'ఒక కొండ, కొండప్రక్క మహానది, నీలాకాశం, సాయంత్రపు బంతి రంగు మేఘాలు, ఒక చిత్రకారుడు చూసినాడనుకోండి. అతనికి ఆనందం కలుగు తుంది. ఆ ఆనందం ఒకకొండను మహానదిని మేఘాలను చిత్రించి వ్యక్తీకరిస్తాడు. ప్రకృతిలో అపశ్రుతిభూయిష్ఠములైన వానిని చెట్లులు చేమలు ఏమన్నాసరే వుంటే పరిహరించి ఎక్కడైన రేఖలరాగంలో సంపూర్ణత లేకపోతే, ఏచెట్టో పుట్టో, పడవో సరియైన స్థలములో కల్పించి చిత్రంవేస్తాడు. అదిచూచి ఆనందిస్తాము.

'కవీ అంతే.

'మనము ప్రకృతిని చూసి అనుకరిస్తున్నామనుకుంటున్నారేమో, కాదు. ప్రకృతిదృశ్యం చూసినప్పుడు ఆనందం పొంది, ఆ ఆనందం శ్రుతిలోఉంచి, అట్టి శ్రుతులు నాలిగింటిని కలియజేసి, ఒకచిత్రం సృజింపవచ్చును.'

'కళావిషయం ఇది ప్రకృతియేనా అని భ్రమింపచేసేదికూడా కావచ్చును. కుక్కకూత నేను కూశాననుకోండి. మీరంతా సంతోషిస్తారు. కాని ఆ ఆనందం చాలా హీనమైనది. కుక్కకూతలోంచి అపశ్రుతి తీసివేసి శ్రుతియుక్తంచేసి గాన కళకు చేర్చవచ్చును. అపశ్రుతి తీసివేయడం, ప్రకృతిలో దొరికిన కొవ్వురాయి అగు వజ్రమును సానబెట్టి తళతళ మెరయు రత్నమును చేయుటవంటిది.'

ఈ రీతిగా నారాయణరావు గంభీరోపన్యాసము గావించెను. ఆనందము నాలుగు రకములుగ నుండునట. భౌతికము, మానసికము, హృదయజము, పార లౌకికము. చక్కని బాలికను పొంక మగు నవయవములతో, దినమొలతో రచిం చినచో శరీరానందము కలుగునట. లతలు పండ్లు అలంకారములుగా చిత్రించినచో

వాని యద్భుతమునకు మనస్సు సంతోషించుననియు, అట్టిదే స్వరకల్పనయుననీ, అరడు వచించినాడు. కరుణ, భయానకము, విషాదము మొదలగు రసము లుప్పతిల్లు చిత్రవిషయములు హృదయమును కలందును భగవంతుడు, మహాత్ములు, అవతారములచరిత్రలు, ఉత్తమచరిత్రలు, గాథలు సాంఖ్యము, కర్మయోగము, భక్తి యోగము, మొదలగునవి పారలౌకికములు, ఆత్మానందము నిచ్చునని నారాయణరావనెను.

## ౨౦

## క్లి ష్ట స మ స్య

సభలన్నియు బూర్తియైనవి. కార్యక్రమ మంతయు సర్వోచ్చముగ జరిగినదనియు, చిత్రకళా ప్రదర్శనము, కవులకూటమి, బొబ్బిలికథ, భాగవతము, తోలుబొమ్మలు, నాటకము ఉత్కృష్టములై యున్నవనియు ఆంధ్ర, హిందూ, స్వరాజ్య, భారతి మొదలగు పత్రికలన్నియు వాకొన్నవి.

చిత్రపటములలో అత్యుత్తమ చిత్రమున కొకటి, పౌరాణిక చిత్రములలో నుత్తమమగు దానికొకటి, మానవజీవిత విషయములు రచించిన చిత్రములలో నుత్తమమున కొకటి, మొత్తము మూడు బహుమానములు, రెండువందలు, నూరు, నూరు రూపాయీలచొప్పున నిచ్చినారు. ఆంధ్రనారీమణులలో నుత్తమచిత్రము వేసిన వారికొక బహుమతి నూరు రూపాయలు, ఆంధ్ర చిత్రకారకులలో నుత్తమ చిత్రకారులకు రెండు బహుమతులు నూరు రూప్యముల చొప్పున నిచ్చిరి.

ఆ యేడు ప్రచురింపబడిన నవీనగ్రంథములలో నుత్తమ గ్రంథమునకు అయిదు నూర్ల రూపాయలు బహుమతి నిచ్చినారు.

ఉత్తమ కథానకమునకు రెండు వందలు, ఉత్తమ పద్యకావ్యమునకు రెండు వందలు, ఉత్తమ గీతికా కావ్యమునకు రెండువందల రూపికలు బహుమతుల నిచ్చినారు. రెండవ తరగతి బహుమతులుగా వెండిపెట్టెలు, బంగారు పతకాలు వెండి గిన్నెలు అయిదువందల రూపికల ఖరీదు గలవి అర్పించినారు.

నవీనకవుల ఛాయాచిత్రములు, వారివారి కవిత్వములలో నొక్కొక్క పాటతోగాని పద్యముతోగాని చేర్చి ఒక గ్రంథము ప్రచురించుటకు నారాయణరావేర్పాటుచేసెను.

నాటకమునకు పందొమ్మిది వందల రూపాయలు వచ్చినవి. భోజనములకు ఫలహారములకు నారువంద లైనవి. అద్దెలకు మూడు వందలు, అచ్చులకు నూటయేబది. దండలు ఛాయాచిత్రములకు నూటఏబది రూపాయలు. భాగవతులకు, తోలుబొమ్మవారికి, బొబ్బిలిపాటవారికి, రానుపోను కర్చులకు బహుమతులకు నాలుగు వందలైనవి. మొత్తము చిల్లరకర్చులతో నాలుగువేలు సమావేశమునకు కర్చయినది. నారాయణరావునకు కొందరికవుల రానుపోను కర్చులతో చేతిసొమ్ము మూడువంద

లైనది. ప్రదర్శనమునకు రెండువందల పాతికరూపాయలువచ్చినవి. మొత్తముమీద సొమ్ముమిగులలేదు. కాని ఇట్టి ఉత్కృష్టమైన సభాకార్యక్రమము ఎప్పుడు నెక్కడ జరుగలేదని లోకమంతయు ననుకొన్నారు.

నారాయణరావేదో యొకపని కల్పించుకొని తనహృదయమును గలంచుచున్న వేదన మఱచిపోవ యత్నించుచుండెను. తన మామగారు మొన్నవచ్చి, క్రిష్టమసుకు శారదను కొత్తపేటకు బంపవలయునని సుబ్బారాయుడుగారు వ్రాసినట్లును, దానట్లు పంపుటకు నిశ్చయించు కొంటిననియు దెలిపినారు. శారదను కొత్తపేటనుండి తాను చెన్నపురి తీసుకొని రావలయునట. ఆమె పరీక్షకు వెళ్ళుచుండుటచే దానామెకు పాఠములు బోధింపవలయునట. ఆమె మదరాసులో జదివి రాజమహేంద్రవరములో జరుగు పరీక్షకు 1929 మార్చి నెలలో వెడలునట. తన మామగారు తీసికొని వెళ్ళెదరట.

ఆమెతో నెట్లు తాను కలిసియుండుట ? పులిమీద పుట్ర యనునట్లామెకు గురువై బోధించుటా ? ఇంతకు నా బాలిక యొప్పుకొనునా ? తండ్రిమాట యన్న తప్పదు కాబోలు. ఆమెయే తల్లితోడ జెప్పి యీ మార్గ మేర్పరచినదేమో ? అంత యదృష్టమా ? ఇది మామగారి యాలోచనయే యగును. తప్పదు. తమ యిద్దరి వైఖరియుదెలిసి యిట్లాచరించలేదుగదా ? తనపైనింత ప్రేమయేలనో మామగారికి ? ఆయన అమృత మూర్తి.

దివ్యసౌందర్యగాత్ర యగు నా బాలిక యిట్లాచరించినదేమి ? ఆమె దుష్ట హృదయ కాలేదుకద ! ఛీ ! తానెంత దుర్మార్గుడో ! పవిత్రచరిత్ర లగు భారత నారీ మణులలో నొకరితనైన తుచ్ఛుడగు పురుషు డనుమానింపదగడు. తన యంతరాత్మ యీ బాలిక పవిత్రచరిత్ర యని పాటలు పాడుకొన్నదే. పోనిమ్ము, తనప్రేమయంత గంభీరమై నిర్మలమై, ప్రవహించుచుండ తన చిన్నారిభార్య, తన ప్రేమమందిర పూజా పీఠస్థదేవి తన్ను తిరిగి ప్రేమింపదా ?

ఆ బాలికను ప్రేమచే ముంచివైచి, ఆమెను దన హృదయకమలమున కమలా బాల నొనర్చుకొన వలయును.

'ఆమె హృదయం నొవ్వకుండా సంచరింపగలనా ? మే మిద్దరమూ ఇచ్చట ఈ సముద్రం ఒడ్డున ఉండిపోగలమా !

'నీకు నాకూ జోడు అయితే
మల్లెపూల తెప్పగట్టి
తెప్పమీద తేలిపోదం పదరా'

అన్నట్లు మా దివ్య ప్రణయాన్ని తెప్పగట్టి తేలిపోలేమా ?' అతని కన్నుల నీరు తిరిగినది.

తన ప్రేమ మవ్యాజమేనాయని నారాయణరావు హృదయములో ప్రశ్నించు కొన్నాడు. ప్రేమలేని పశువుకన్న తుచ్ఛకామియగు మానవుడుమేలని వివేకానందు

డనినాడే? కళంకపూర్ణమగు ప్రేమనైన నెరిగిన వ్యక్తియే, ఏనాటికైన భక్తి నెరుంగ గలడని కదా వివేకానంద మహర్షి యనినది.

కావున సకామమగు ప్రేమయు యుక్తమేనని యర్థమిచ్చునుగద. తుద కివి యన్నియు నీశ్వరప్రేమగా పరిణమించి చరితార్థములగునని నారాయణుడు భావించు కొన్నాడు.

భార్యయెట్లును తనతో సంసారమున కిచ్చగించుటలేదు గదా! అవకాశము దొరికినందుకు తా నీ సమయముననే యన్నియు వదలి యే హృషీ కేశమునకో, యే హిమాలయ నగశ్రేణికోపోయి, యచ్చట గురు మహారాజును వెదకి జ్ఞానవిద్యనేర్చి కొని యేల తపస్సు చేయకూడదు? ఏ నాటికైన ఏ జన్మమునకైన నా మార్గమునే వెదుక వలయునుగదా? క్షణికమై, యనిత్యమైన యీ నీచపుం బ్రతుకు ఏల వదల లేము? రాళ్ళను గాలికన్న తేలికచేసి యాకాశమున కెగురవేయుట యెట్టిదో యీ జన్మమును దరింపజేయు ప్రయత్నమట్టిది. తానంతటి యదృష్టవంతుడా? ఛీ! తన దురదృష్టపు జీవితమునకు వెలుగు పొడచూపు మార్గము గోచరించినను దాని ననుస రించు ధైర్యము చాలకున్నదే! రామచంద్రా! భక్తపరాయణా! నీదే భారము.

ఇంతలో పరమేశ్వరమూర్తి యచ్చటకు వచ్చినాడు. వారిరువురు సముద్ర తీరమున గలిసికొన వలెనను సంకేత మేర్పరచు కొన్నప్పుడు, యువతీ కళాశాల కెదురుగ కలసికొందురు.

రాజారావు అమలాపురం వెడలిపోయినాడు. పరమేశ్వరమూర్తి భార్య రుక్మిణీ క్షేమముగనున్నది. ఏది యెట్లయినను మంచిదని యామెకు సంపూర్ణా రోగ్యము కలుగువరకు దన యింట నుండవలెననియు పరమేశ్వరుడు తన యింట భోజనము చేయవలెననియు నారాయణరావు మిత్రుని బలవంతముజేసెను.

'పర! జనవరినుంచి శారదను గొనివచ్చి కాపురం పెడుతున్నాను.'

'మంచిది మంచిది! చేయి యేది. నాకు సంతోషంగా వుందిరా!'

నారాయణరావు శారదను బ్రేమించుచున్నంత గాఢముగ నారాయణు నామె ప్రేమించుట లేదనియు, తన మిత్రుడందులకై మిక్కుటమగు బాధ ననుభవించుచు న్నాడనియు బరమేశ్వరుడు గ్రహించినాడు. తానుమాత్రము రుక్మిణి తన్ను ప్రేమించి నంత దా నామెను ప్రేమించుచున్నాడా? పరమేశ్వరుడు తాను నిర్మలుడనని చెప్ప లేదు. మన సెప్పుడును బంకిలమ్మగు చుండును. కొంచెె మందమయిన వనిత కనబడినప్పుడెల్ల పరమేశ్వరుడు వికారము పొందును. ఆమెను భావనాలోకమున వివస్త్రజేసి యవయవము లన్నియు మనోనేత్రముచే బరీక్షించుకొనును. అతడు శిల్పి.

రుక్మిణి కురూపి కానేకాదు, దివ్యసౌందర్యవతియు గాదు. ఒక్కొక్కప్పు డామె సౌందర్యము ఉత్తమముగ గన్పట్టును. భర్త కిసుమంత కోపము రానీయదు. సంసారము చేయుటలో కొద్దిలో కొండలు చూపగలదు. ఆమె పొదుపరి. కాని యనవసరమగు కర్చు చేయకుండుటలోనే యా పొదుపు. భర్త తెచ్చిన ధనములో

షడ్రసోపేతమగు భోజనము, గృహాలంకారములు పోను ధనము మిగిల్చి, భర్త స్వంతకర్చులకు బదిరూపాయల్లు నెలకిచ్చి, నెలకు ఐది, పదిహేను 'సేవింగ్సు బ్యాంకి 'లో ధనము నిలువచేయును.

భార్య యెదుట నున్నచో బరమేశ్వరుని కామెయే మనోజ్ఞమూర్తివలె గోచరించును. పరమేశ్వరు మోహము మహావిలక్షిత సముద్రము వంటిది. అప్పుడాతని భార్య ఆనందములో గరిగిపోయి యాతనిలో నైక్యమైపోవును.

రుక్మిణికి, సూర్యకాంతమునకు ప్రాణస్నేహము కుదిరినది.

'వదినా ! నీకు చిన్న పాపాయి పుట్టినప్పుడు నన్ను రోజూ యెత్తుకోనిస్తావా, నేనే నమ్మో్మ నీళ్లు పోస్తా ! ఉగ్గు పెట్టడం నా చేతకాదు. అక్కయ్యల పిల్లలని నేనే ఎప్పుడూ ఆడించేది. పరమేశ్వరంఅన్నయ్యకి మా చిన్నన్నయ్యకీ చంటిబిడ్డలన్న అంత ప్రేమ యేమిటి వదినా ?'

రుక్మిణికి రాబోవు ఆనందస్మృతి గన్నీరై ప్రవహింప, మోము ప్రఫుల్లమై వెలుగ, సూర్యకాంతమును దన హృదయమునకు హత్తుకొని యాబాల నుదురు ముద్దిడుకొన్నది.

పరమేశ్వరమూర్తి తన చుట్టములలో నిరువుర యువతులతో గౌరవమను మానము పడవలసినరీతి సంచరించినట్లు తన భార్యకు తోచినది. అప్పుడు రుక్మిణీ పడినబాధ వర్ణనాతీతము. పరమేశ్వరుడది గ్రహించినాడు భార్యకడకు బోయి యామె పాదములపై దన మోమునుంచి కన్నీటిచే వానిని దడిపినాడు.

నిజముగ నొక బాలికతో నాతడు రెండు మూడుసారులు ఆవేశపూర్ణము భయంకరము నగు కలయిక ననుభవించి యధోలోకమున బడినాడు. ఆమెభర్త మోటువాడు. ఆ బాలిక భర్తయెడ హృదయమున నసహ్యించుకొనుచుండియు, తెచ్చిపెట్టుకొనిన హాసముచే మోము వైవర్ణ్యముచెంద, నాతనితో గాపురముచేయుచున్నది. చిన్నతమునుండియు బరమేశ్వరుని ప్రేమించినది. ఆమెయే పరమేశ్వరునిపై దనకు తమియున్నదని భావము ప్రకటన జేయుచుండినది. ఆ బాల చక్కని యవయవస్ఫుటత్వము కలిగి, యందముగ నుండును. పరమేశ్వరుడు పంకిలజీవితుడైనా డామెతో.

పరమేశ్వరుడు సంపూర్ణముగ నధోలోకవాసి కాకుండ నాతని రక్షించునది సౌందర్యపిపాసా పూర్ణమగు నాతని హృదయమే ! అందమయిన వనిత కానిచో నాతనికి మనస్సు చలింపదు. ఆవనితచుట్టునున్న విషయములు నందమైనవి కావలెను. భావముననైన అపశ్రుతి కానరాగూడదు. కావుననే యాతడు ఒక్కబాలతో మాత్రము భౌతికానంత మనుభవించినాడు. ఆ సంతోషము పంకిలమైనదను అపశ్రుతియే ఆతని గలంచివేయ అచ్చటనుండి పరనారీ సాంగత్యము సంపూర్ణముగ మానినాడు.

రోహిణీదేవితో నాతడు స్నేహము చేయుటకు వీలు కలిగినప్పు డా బాలికకు దన హదయము సమర్పించు కొన్నాడు. రోహిణీదేవియు బరమేశ్వరు దన్న

హృదయాంతరమున గలగిపోవునది. అతనిమాట లామెకు మైమరపు కలిగించును. హృదయములో మధురిమములు ప్రవహించును. అతని కోర్కెయు నామె కవగత మైనది. ఆమె భయమును జెందినది పరవశయునైనది. ఇట్టి యశోవంతు డాతని ప్రేమ నంతయు దన పాదములకడ ధారపోయుచున్నాడన్న మోదమామెను గరగించి వేసినది.

వీలయినప్పుడెల్ల నాతని నొంటిగా గలసికొనునది. అక్కగారు వైద్యవిద్యాలయమునకో, వైద్యశాలకో పోయినప్పుడు తన స్నేహితుడగు నారాయణరావు రాకుండ పరమేశ్వరు డొక్కడే వచ్చువాడు.

కాని రోహిణి ధర్మహృదయ. ఆతడు వివాహితుడు. భార్యతో సుఖముగ గాపురముసేయుచున్నాడు. తా నవివాహిత. కావున పరమేశ్వరుని గీత దాటి రానివ్వ కూడదని దృఢనిశ్చయయై యానాటినుంచి నిర్మలమగు ధైర్యముతో నాతని ప్రేమయు పూజను గైకొని యానందించునది. అట్టి ప్రేమను పెరుగనిచ్చినచో తా మిరువురు కూడ గీచుకొన్న గీతలు దాటి, పరవశులై ఐక్యమైపోవలసివచ్చునేమో యన్న భయ మామెకు గలుగలేదు.

పరమేశ్వరునకు నామె యభిప్రాయము తెలిసి యతిజాగ్రత్తగనే యుండెను. ఆశాప్రవాహములోనికి దా నతివేగమున లాగికొనిపోబడుచున్నాడనని యాతడు గ్రహింపలేదు.

## ౨౧

## ఇష్టాగోష్ఠి

నారాయణరావు పరమేశ్వరమూర్తి శ్యామసుందరీదేవి, రోహిణీదేవి కవుల కూటమినిగూర్చి సముద్రపుటొడ్డున మాట్లాడుకొన్నారు.

ఇప్పుడిప్పుడు వచ్చుయువకవులలోనింకను స్వాతంత్ర్యము జూపువారున్నారు. మొత్తముమీద ఆంధ్రదేశంలోని నేటి కవిత్వము ప్రేమతోనిండి నీరసత్వములోనికి దిగినదని యొక కళాభిజ్ఞుడు భారతిలో వరుసగా నాలుగు వ్యాసములు వ్రాసి యువ కవుల నందరిని యెత్తిపొడిచినాడు. వేషములో నాడుతనము కనబడినట్లు కవిత్వము లోను ఆడతనమే కనబడుచున్నదట. ఆయనకు మొన్న జరిగిన కవులకూటమి వంటివి జరుగవలెననియే యభిప్రాయమట. కాని యీ యువకవులు తమ చుట్టు వేనకువేలు విషయములుండ నీసృష్టిలో నాడుదియు మగవాడునుదక్క నింకేమియు లేనట్లు కవిత్వము వ్రాయుట ఉపజ్ఞాశూన్యతను బ్రకటించు చున్నదని యాయన వాదించినాడు.

నారాయణరావు ఆకళాభిజ్ఞునితో నేకీభవించలేక పోయినాడు.

పరమేశ్వరు డావాదమును ఖండించినాడు 'ప్రేమ యుత్కృష్టమగు విషయము. నీ ప్రియభామినిపై జూపించు ప్రేమ యీ జన్మములోనో మరి కొన్ని

వేల జన్మాలకో భగవంతునిపై, ప్రేమగా మారుతుంది. లీలాశుకుడు చింతామణిపై ప్రేమచే, మహాభక్తుడుగా మ్మారి పరమభాగవతుడైనాడు.'

నారాయణరావు శ్యామసుందరినిచూచి చిరునవ్వుతో 'చెల్లీ! సృష్టిఅంతా భగవంతుని స్వరూపంకద, అలాంటిది, కరుణాదిరసాలచే మానవజీవన శోధన మొనరింపక ప్రేమప్రేమియని వెఱ్ఱిపద్యములు వ్రాయుట హృదయదౌర్బల్య సూచకం గాదూ? నీ ప్రేమ గొప్పగా ఉండాలి. వ్రాయి! రెండు మూడు మహాప్రేమ సూక్తాలు. తక్కినవి తిండిలేక మాడు బీదవాళ్ళనుగూర్చి వానిసలకన్న అధమాధములుగ నున్న మాలవాళ్ళను గూర్చి మనసులు కరిగేటట్లు కవిత్వం రచించు. మానవలోకాన్ని ఈశ్వరాభిముఖం చేసేదే కవిత్వం అని వాదించినాడు.

శ్యామసుందరి వారిరువురకు చక్కగ సమాధానము కుదిర్చినది. 'ప్రేమ, ప్రపంచంలోని మహోత్తమ విషయం. అది ప్రాపంచికత్వానికి ఉత్తమ విషయం అయినట్లు కావ్యవిషయములోనూ, మహోత్తమము. తక్కినవి జీవితంలో స్త్రీ పురుష సంబంధం తర్వాత వస్తాయి. కావ్యంతోనూ అంతే. ఏ విషయం వ్రాసినా కావ్యంమాత్రం అయిఉండాలి. అవునా అన్నా, అవునా పరమేశ్వర్?' అని నవ్వినది.

నారాయణరావు మనస్సు సంకటపడునప్పుడెల్ల శ్యామసుందరిని కలుసుకొని యామెతో నన్ని విషయముల జర్చించుచు నానందమునొందును.

ఆడువారికి మగవారికి పవిత్రమగు స్నేహముండుట సహజమనియు దానిని మనము అసహజమగు మన బ్రతుకులచే పంకిలమ్మొనరించు కొనుచున్నామనియు, కావుననే నేడు పురుషులకును వనితలకును పవిత్రస్నేహ ముండుటకు వీలులేకుండ నున్నదనియు నాతడు పరమేశ్వరునితో ననినాడు.

రష్యాదేశపు స్థితినిగూర్చి ప్రసంగము వచ్చినది. 'నిజమైన ప్రజాస్వామిక ప్రభుత్వం ఏది అంటే బోల్షివిజ మనే చెప్పాలి. ఆస్తి అందరికి సమము కావింప బడవలె. అంటే ఆస్తి అంతయు ప్రభుత్వముది. ప్రజలు తమతమ విధులు నిర్వర్తించాలి. వారివారి పనులనుబట్టి జీతము టిక్కెట్ల రూపమున ఇవ్వాలి. ఆ టిక్కెట్లను బట్టి నీకు కావలసిన వస్తువును తెచ్చుకొనవచ్చును. ఒకవేళ తిండి చాల దందువేమో. ప్రతి మానవునకు భోజనాదికముల మితి యేర్పరచవచ్చు' నని నారాయణరావన్నాడు.

పర:—మనయంతట మనము, ఉత్సాహము పుట్టి పనిచేయలేముగా. మనకు వచ్చే లబ్ధి భోజనముమాత్రమే. అంటే గొప్పగొప్ప కార్యములు చేయడానికి ప్రచోదనం ఏదీ!

నారా:—ఎందుకు కలగదురా ఏమమ్మా చెల్లీ నువ్వు చెప్పు, ఈమధ్య బోల్షివిజము పుస్తకాలు చాలా చదివావు.

శ్యామ :—ఉత్కృష్టకార్యాలు చేసేవాళ్ళకు ఎక్కువ టిక్కెట్లు ఇస్తారు. పైగా ధనపూర్ణమైన ఇంగ్లండు మొదలైన దేశాలల్లోకూడా గొప్పగొప్ప శాస్త్రజ్ఞులు అద్భుతములు కనిపెట్టారంటే డబ్బుకోసమా ? ఆ ఉత్సాహం వారిలో సహజంకాబట్టన్నీ పేరుకోసమున్ను. ఇప్పుడు రష్యాదేశానికి ఏమన్నా లోటు ఉన్నదా !

నారా :—బాగున్నదమ్మా ?

పర :—కాని శ్యామచెల్లీ ! ఒకటి ఆలోచించు. ఏనాటికైనా బోల్షివిజము చనిపోతుందిసుమా. ఎవడిబాగు వాడు విచారించుకోవడమే మానవస్వభావం. కాబట్టి నెమ్మదిగా నెమ్మదిగా ధనం రహస్యంగా పోగుచేసుకుంటాడు. ఇప్పటికి రష్యాలో ఎన్ని కేసు లల్లాంటివి చూడడంలేదు ?

శ్యామ :—అదికాదు ! ఒకవేళ ఆగుణం సహజం అనుకున్నా. దేశంలో ఉన్న ఆస్తి అంతా కలేసి పంచుకోడం మంచిది.

నారా :—' జాయంటు ' కుటుంబముల్లె.

పర :—అబ్బాలాయరు ! ప్రపంచం అంతా జాయంటు కుటుంబం చేస్తావా ! నీ బోల్షివిజము ఏ దేశానికి ఆదేశానికి ఉంటే చాలా ? లోకమంతా ఒక్కటే రాజ్యం జేయాలా ?

శ్యామ :—ప్రపంచం అంతా కలిసే ఉండాలనిగా, లెనిను, స్టాలిను, ట్రాట్స్కి మొదలగు వాళ్ళు వాదించేది, ఉన్నధనమంతా ప్రోగుచేసి జనాభానిపట్టి దేశాలు పంచుకోవడం, ఏదేశంలో ఏపంట, ఎంత పండునో లెక్కలువేయడం, ప్రపంచానికి కావలసినంత పంటమాత్రం పండించడం, అది దేశాలన్నీ పంచుకోడం. ప్రతిపంటా అంతే ! ఆలాగే బంగారు మొదలగు లోహాలు, ఆలోహాలన్నీ శాస్త్రవృద్ధికోసం. నాణేలు అవసరంలేదుగా ! ప్రపంచం అంతా కలిసి అంగారకుడిదగ్గరకు వెళ్లుటకు ప్రయత్నం మొదలైనవి చేయవచ్చును. ఈలాగే సర్వశాస్త్రజ్ఞానమూ వృద్ధిచేయాలి.

నారా :—లేమా, భగవంతునిగూర్చి తెలుసుకొనుట కన్నిజాతులకు సౌకర్యము కలుగజేయ వచ్చును.

పర :—ఓహో మీ యిద్దరిస్వప్నమూ చాలా బాగుంది. అయితే, తెల్లవాడు నల్లవాడిని దగ్గరకు రానిస్తాడా ? పచ్చవాడికి పచ్చవాడిపచ్చకిట్టదు. చీనాకు జపానుకు యుద్ధం రాదంటారా !

శ్యామ :—అన్నా, అదేమిటి మీ వాదం ! వినండి, ప్రపంచమంతా బోల్షివిజం వ్యాపించడానికి కొన్నియుగాలు కావచ్చును. ధనం ఉన్న షాహుకార్లకు శక్తిఉన్నంతకాలం, రాజ్యాలు వదలరు. కాని ప్రపంచంలో ఎక్కువసంఖ్య ఎవరు ? కూలి నాలి చేసుకునేవారేకదా ? బీదవాళ్ళగు వారు తలచుకుంటే ఏమిచేస్తారు షాహుకార్లు ?

రోహిణి :—మనదేశం ముప్పదిమూడుకోట్లు ఏంచేస్తున్నాము తుపాకీముందర ?

శ్యామ :—ప్రపంచంలో తుపాకీ పట్టుకునే వాళ్ళంతా బీదవాళ్ళేగా ! రష్యాలో వాళ్లు తిరగబడితేనేగా షాహుకార్ల యొక్కయు, ప్రభువుల యొక్కయు రాజ్యం కూలబడింది.

పర :—ధనంయొక్క ఉత్కృష్టత ఏమిటో చెపుతా విను. ధనవంతుడు తన ధనసంపాదన ప్రయత్నంలో దేశానికి అనేక లాభాలను సమకూరుస్తాడు. దానివల్ల లోకానికి కావలసిన వస్తువులన్నీ తయారవుతాయి. అమెరికాలో, ఇంగ్లండులో, జర్మనీలో, ఫ్రాంసులో అంతే! ఇనుప చక్రవర్తులు, కిరసనాయిలు సార్వభౌములు, బిస్కట్ల మహారాజులు, మోటారు రాజాధిరాజులు వగైరా! వగైరా! వీరంతా ఉండడంచేత దేశదేశాలకు అవస్తువులు సరఫరాఅవుతున్నవి.

శ్యామ :—అన్నా, నువ్వు చెప్పే వాదనలో అన్నీ దోషాలే.

నారా :—1919 సంవత్సరంలో యూరపుఖండంలో మహాయుద్ధం ఆఖరయింది. ప్రపంచం అంతా విప్లవం వచ్చేటట్టు కనబడింది కాని అమెరికావాళ్ళు బంగారం పట్టుకువచ్చి యూరపు అంతా వెదజల్లినారు. దానితో యుద్ధంవల్ల అలసిన ప్రజలంతా, 'బాగుంది! మనస్థితి బాగుంది' అని సంతోషించు తున్నారు. తాత్కాలికంగా కనబడిన ఆ పరిస్థితులకు పునాది యేది? అమెరికా అప్పుయివ్వడం మానివేసింది. కోటీశ్వరుల కోట్లు కరిగి పోయాయి. ఆ కరగడం మహావేగంతో జరుగుతోంది. వర్తకాలు హుళక్కి అవడం మొదలుపెట్టాయి. ఇంక వచ్చేది ఏముంది, ప్రపంచంలో ఉన్న షాహుకార్లందరికీ దివాలా వచ్చేటట్టు ఉంది.

'సరే? కూలివారు పైకివచ్చి రాజ్యాలు ఆక్రమిద్దాము అనుకున్నారు. ఇటలీ, జర్మనీ, ఇంగ్లండు దేశాలలో. కాని ఇంక ఎక్కడా కూలివారిలో కట్టు లేదు. కూలీలూ సామాన్య ప్రజలూ లేవడం చూచారు, ధనవంతులు హడలిపోయారు. కోటీశ్వరుడు దగ్గరనుంచి కొద్దీ గొప్పో కలవాళ్ళంతా భాయిభాయి అని ఏకమయ్యారు. ఫాసిజమ్ అని కట్టుకట్టి ఒక సర్వాధికారితో రాజ్యం ఏర్పరిచారు. దానికి జాతీయ సాంఘిక వాదమన్నారు. ఇక ముందు అన్ని రాజ్యాలు అల్లాగే అవుతాయి.

'అసలు ప్రపంచానికి వచ్చిన చిక్కేమిటో చూడు. కావలసినంత తిండి తయారు అవుతోంది. అంతా పంచితే అందరికి పూర్తిగా ఆకలి తీరుతుంది. కాని ఎన్నికోట్ల మంది ప్రజలు మలమల లాడిపోవుటలేదు? ఏమిటీ ఆ లోటు? తయ్యారైన పదార్థాలని పంచేమార్గం సరిగాలేదు. ధనికవర్గం ఆ పని యేనాటికీ చేయలేదు.'

శ్యామ :—పనిలేని కూలీ లెన్నికోట్లున్నారు. వివిధ దేశాల్లో? ఎలాగు వీరికందరికి తిండిపెట్టడం!

రోహిణి :—మన ఆంధ్రదేశంలో జమీందారీ రైతులపని మహా అన్యాయంగా ఉన్నది కాదూ?

పర :—అవునమ్మా, ఉన్నది ! అన్ని జమీందారీలు అల్లా ఉన్నవా? కొన్ని జమీలు హృదయం తరుక్కుపోయేటట్టున్నది.

నారా :—1908 సంవత్సరమునకు పూర్వమే రైతులను బలవంతంచేసి యెక్కువశిస్తు ఏర్పరచుకొని ముచ్చిలికాలు వ్రాయించుకొన్నారు. కొన్నికొన్నిచోట్ల ముప్పదిరూపాయల శిస్తు నేను ఎరుగుదును. ఎన్నివేలమంది రైతులు దివాళాలు తీశారు. మా అత్తగారి మేనల్లుడొక జమీందారు. ఆయన జమీ ఎంత కంగాళిగా ఉండాలో అంతయిదిగా ఉన్నది. ఎంతమందో రైతులు బాకీలు చెల్లించలేక జైళ్లలో ఉన్నారు. క్కొందరి భూము లాఖరయ్యాయి. కొందరు దివాళాలు దాఖలు చేసినారు. చెంతనేవున్న రైతువారీ గ్రామాలస్థితి యింతకంటె నయం. ఈ జమీందారుల పూర్వీకుల కాలంలో శిస్తులు యింత అన్యాయముగా ఉండేవికావు.

పర :—కొన్ని జమీందారీలలో, ఈనాం మొఖాసాగ్రామాలల్లో, (అసలు మొఖాసా దార్లు ఈనాందార్లు మాయమైపోయారు.) పంటలు పండనిరోజుల్లో. ధనం చిక్కువచ్చిన రోజుల్లో శిస్తు తగ్గించి పుచ్చుకోరేమి ? జమీందారు రైతులకు తండ్రి. కాని తన తండ్రిత్వము, తిండిత్వములోకి దింపాడు.

రోహిణి :—కొందరు జమీందారులు రైతులంటే పడిచచ్చిపోతారు. వాళ్ళబాగే తమ బాగని చూచుకుంటున్నారు. మా తండ్రిగారి స్నేహితుడొకడున్నాడు అలాంటి ఆయన

పర :—నారాయణరావు మామగారో ? ఆయన జమీచూస్తే ముచ్చటైపోయి నది. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి యేబదివే లిచ్చారు. పంట పండని రైతును బాధపెట్టరు. సర్వేలు చేయించుకున్నారు. ఎప్పటికప్పుడు రైతులకు—రైతు వారీ రైతులకు ప్రభుత్వంవా రిచ్చినట్లు—పట్టాలు యిచ్చారు. జమీందారీ ఉద్యోగులు లంచాలు తినకుండా నారాయణరావు మామగారు స్వయముగా ప్రజలను తనిఖీచేస్తూ ఉంటారు. ఆయనకు చేతులెత్తి మొక్కనిరైతులేదు.

శ్యామ :—అవును విన్నాము. అన్నా ! నారాయణరావూ ! మా చిన్న వదినను ఎప్పుడూ చూపించుట ? చాలా అందమైన బాలిక అని ఈ అన్నయ్య చెప్పినాడు.

పర: —రేపు క్రిష్టమసుపండుగ వెళ్ళినతర్వాత ఇక్కడికి కాపురానికి తీసుకొని వస్తున్నాడు.

రోహిణి :—ఏమిటన్నా చెప్పావుకావు ?

నారా :—చెప్పుదామనుకుంటున్నాను. సరి, పరమం చెప్పేశాడు.

ఇంతలో మంగపతిరా వచ్చుటకు వచ్చినాడు. మంగపతిరావు నారాయణ రావునుచూచి చిరునవ్వునవ్వి లోనికి బోయినాడు.

మంగపతిరావు గాంధీగారి అహింసావ్రతము ఆడుదాని మతమని వాదించును. శక్తిహీనులమగు మనం ఈ అహింసా వ్రతంలో బడి మరింతశక్తి పోగొట్టుకొని

నశించి పోవుదుపని యీ బాలుని వాదన. ఏమీ తెలియని కుట్టివాళ్ళు, 'సరియైన దారి చూపండి నేడుస్తాం. బాంబులు తయ్యారుచేస్తాం. రివాల్వరులు గురిచూస్తాం. యుద్ధంచేసిం రాజ్య సంపాదిస్తాం' అని వాదించారు.

'ఈ కుట్టివాండ్రు సరియైనమార్గం లేక తప్పుదారిని పడుతున్నారు. మీరటు కుటకేసు చూస్తున్నాంకాదా? శ్రీ మహాత్ముని తత్త్వం వీళ్ళకేమి తెలుసును చెల్లీ. ఈతని మనస్సు నెమ్మదిగా మార్చివేయాలి. లేకపోతే ఓరాత్రివేళ యెక్కడికో పారిపోతాడు. చివరకు వురికంబ మెక్కుటకు సిద్ధం అయిన తర్వాత ఎవళ్ళమూ ఏమీ చెయ్యలేము' అన్నాడు నారాయణరావు.

. ఆతడు తనయింటికి బోయి బోల్షవిజము ప్రత్యక్షముచేసిన మహాచిత్రకారుని చిత్ర మొండు తన చిత్ర సంపుటినుండి తీసి చూచినాడు.

వేలకొలది పురుషులు, స్త్రీలు ఒడలు తెలియక రాక్షసులు చేయతగిన పనుల జేయుచున్నారు. నలిగిపోవుచున్నారు, బిడ్డలు, స్త్రీలు.

మహాశక్తివలె యంత్రము దిశల నావరించి యున్నది. ఇట్టి ప్రచార చిత్ర మునుగూడ నెంత విచిత్రముగ చిత్రించినా డీ శిల్పి!

వర్ణములు, రేఖలు, లోతులు, బరువులు లయ సామ్యసంకలితములై మహోత్కృష్ట శ్రుతిలో లీనమైపోవుచున్నవి.

శిల్పి, మహాభాగుడు. ఒక్కగీతలో, ఒక్క రంగులో, ఎన్ని సమూహములు. ధీశాలి కందనిలోతులు చిత్రించగలడు!

ఆత డాచిత్రము తదేకదృష్టితో జూచుచు, అటులనే నిలుచుండిపోయినాడు.

# చతుర్థ భాగము

●

## ౧

## భర్తయే గురువు

క్రిష్టమసు సెలవులలో నారాయణరావు తన భార్యతో జెన్నపురికి వచ్చెను.

ఆతడు మైలాపూరులో వెనుకటి చిన్నమేడ వదలి, నెలకు నూరురూపాయ లిచ్చి పెద్దమేడ నద్దెకు బుచ్చుకొనెను. ఆ మేడచుట్టు తోటయున్నది. విశాలమైన భవనము.

పరమేశ్వరుని భార్యకు బురుడు చెన్నపురిలో బోయుట కాతడేర్పాటుచేసెను. చెన్నపురిలో కాపురము బెట్టినప్పుడే యాతడొక నియ్యోగి వంటలక్కను గుంటూరు జిల్లానుండి రప్పించుకొనెను. ఆమె యిదివరకే తూర్పుగోదావరి జిల్లాలో నధికారు లకు వంటచేసినది. మంచి మనసుది. నెలకు బదునైదు రూపాయలు జీతమును, యేడాదికి నాలుగు పంచెలు నిచ్చుట కేర్పాటు చేసికొని యాత డామెను గుదిర్చెను.

శారదను క్రిష్టమసు సెలవులలో మంచిరోజుచూచి యత్తవారింటికి దీసికొని వచ్చుటకు సూర్యకాంతమును సుబ్బారాయుడుగారును వెళ్ళినారు. ఆమెకు జమీం దారుగారు వెల పౌడవు చీరలు, పసుపు, కుంకుమ, రెవికలు, నగలు వెండిబిందెలు, వెండిగంగాళము, వెండిచెంబులు, వెండిగిన్నెలు, వెండిబొమ్మసామానులు, వ్రాత బల్లలు, కుర్చీలు, సోఫాలు, పందిరిమంచము, చిన్నమంచము, పెద్ద ఉయ్యేల, యింకను నెన్నియో సామానులు సారె యిచ్చినారు. కొన్ని చెన్నపురికి గొనిపోవు టకు రాజమహేంద్రవరములోనే యుంచినారు.

లాంచిమీద మోటారుకారులమీద వారు కొత్తపేట చేరిరి. భార్య వచ్చి నప్పుడు నారాయణుని హృదయము దడదడ కొట్టుకొన్నది. రాత్రి గది లోనికి వచ్చినప్పు డాతడు కదలు హృదయముతో, కంఠాన తీపులతో, కన్నులలో వెలుగులతో భార్యవంక జూచినాడు. కాని యా బాలిక మాట్లాడలేదు.

నారాయణరా వుదారహృదయుడై నొసలు ముడిచి, పెదవులు బిగించి, ముక్కుపుటములు విస్ఫారితములు గాగా, తన పందిరిమంచముపై యట్లనే పరుండి యుండిపోయెను.

భార్యాభర్తలు చెన్నపురి కాపురమునకు వచ్చినప్పటినుండియు ఆ బాలికను బలుకరించుట యెట్లు, ఆమెకు చదువుజెప్పుట యెట్లని యాలోచింప దొడగెను.

వారముర్రోజులు గడచిపోయినవి. తానుచెప్పుటమాట యటుండనిచ్చి, శారద పరీక్షలో గృతార్థురాలు కావలయుననియు, జెల్లెలు సూర్యకాంతము ప్రవేశపరీక్షలో గృతార్థురాలు కావలెననియు సంకల్పించి, భాస్కరమూర్తిశాస్త్రులగారివంటి యొక

విద్యాశేఖరుని, హిందూ ఉన్నత పాఠశాలలో బనిచేసి పింఛను బుచ్చుకొనుచున్న బి. ఏ., యల్. టి. ని నెలకు ఏబదిరూపాయలు వేతనమిచ్చి చదువుచెప్పుటకు కుదిర్చి నాడు.

శ్యామసుందరీదేవియు, నామె చెల్లెళ్లను నారాయణరావింటికి జూడవచ్చి నారు. వారందరు, సీమరేగు, ద్రాక్ష, దానిమ్మ, అంజూరా మొదలగు ఫలములు, జీడి, పిస్తా, బాదం, మొదలగు పప్పులను, పటికబెల్లమును, పసుపు కుంకుమమును పట్టుచీరయు, రవికయు దీసికొని వచ్చినారు.

సూర్యకాంత మదివరకే శ్యామసుందరీదేవి యింటికి వెళ్ళుచు వారితో బరమ స్నేహమున మెలగుచుండెను. 'శ్యామక్కా' యని యొకసారి 'డాక్టరక్కా' యని మరియొకసారి సూర్యకాంత మామెను బిలుచుచుండును. 'అందరము యెన మంద్రక్క చెల్లెంద్ర' మని యామె యనుచుండును. శ్యామసుందరి తల్లిని, 'పిన్నీ పిన్నీ' యని పిలుచుచు ప్రాణమిచ్చుచుండునది.

నారాయణరావా నలుగు రక్క చెల్లెంద్రకు పుట్టినదినమని పండుగలని పేరులు చెప్పి బొమ్మలు, చీరలు, రవికలగుడ్డలు, వెండిసామానులు బహుమానముగ నిచ్చు చుండెను.

శారద వీరంద రెట్టి చుట్టములో యనుకొని సిగ్గుచేతను, గర్వముచేతను చాల ముభావముగ సంచరించినది. శ్యామసుందరి యది యంతయు సిగ్గనుకొని, యామెతో సౌహార్దమున మాట్లాడినది. వారందరు 'శారదవదినా! వదినా! చిట్టి వదినా!' యని వివిధరీతుల బల్కరించిరి. 'మా అత్తగారు కులాసాగా ఉన్నా రమ్మా? వదినగారూ!' అని నళినియన్నది ఉన్నారని శారద యుత్తరమిచ్చినది.

వారంద రామెను నెయ్యముమై వీడుకొని వెడలిపోయిరి.

శారదకు చెన్నపట్టణమున భర్తజీవితము విచిత్రముగ గనిపించినది. అతడు తెల్లవారుగట్ల దండెములు, బస్కీలు తీసి ముద్రలు తిప్పుచు శరీర వ్యాయామము చేయును. వ్యాయామము చేసిన గంట కాతడు చన్నీళ్ళలో స్నాన మాచరించి రెండు యిడ్లీ పుచ్చుకొని, పాలుత్రాగి, సిగరెట్టు కాల్చుకొని, ఖద్దరుదుస్తులు ధరించి కచ్చేరి హాలులోనికి బోయి యచ్చట తన యప్పీళ్ళు మొదలగునవి చదువుకొనును. మామగారు షాహుకార్ల ఖాతాలు కొన్ని యిప్పించినారు. అన్నగారు పంపించిన యప్పీళ్లు, శ్రీనివాసరావుగారు పంపిన యప్పీళ్లు, తండ్రిగారువచ్చునట్లుచేసిన యప్పీళ్లు, నారాయణరావుకు పుష్కలముగ పనియున్నది. అప్పీళ్ళ విషయమై వచ్చిన పార్టీలతో సంప్రతించి, యచ్చటనుండి మోటారుమీద తన గురువగు ఒకీలునింటికి బోవును. పదింటికి ఇంటికి తిరిగివచ్చి భోజనముచేసి దుస్తుల ధరించి తిన్నగ ఉన్నత న్యాయ స్థానమునకు బోవుచుండును.

నారాయణరావు కీ కొలది మాసములలోనే నెలకు రెండువందలు వచ్చు పనులు స్వయమైన కాతాలవలన నేర్పడినవి. గురువుగా రీతని పనిచూచి మెచ్చు

కొని పెద్ద వ్యాపారములలో సహాయ న్యాయవాదిగా పనిచేసినందుకు నూరు, నూట యేబది యిప్పించుచుండిరి.

కోర్టుపనియగుటతోడనే, యింటికివచ్చి, సూర్యకాంతమున కొకగంట చదువు చెప్పును. తరువాత స్నానముచేసి దుస్తులు ధరించుటతోడనే, యెవరో యొకరు స్నేహితులు వచ్చెదరు. వారిని తీసికొనియో, తా నొంటిగనో కారులో విహారమునకు బోవును. వచ్చినప్పు డాతని స్నేహితుడగు పరమేశ్వరమూర్తికూడ నుండువాడు. ఒక్కొక్కప్పుడు, సూర్యకాంతమును శారదను విహారమునకు కారుమీద బొమ్మని తాను నడచి సముద్రపు టొడ్డునకు బోవువాడు. నడచివెళ్ళినప్పుడు మాత్ర మతడు తిరిగివచ్చిన వెనుక మూడవసారి స్నాన మాచరించువాడు.

శారద చెన్నపురికి వచ్చిన పదిరోజులకు జమీందారుగారు కొమరితను జూచుటకువచ్చిరి. శారద య త్తవారింటికి వెళ్ళునప్పుడు భర్త మేధాసంపన్నులగు వారిలో మేధావి యనియు, నాతడే యామెకు జదువు చెప్పుననియు బోధించి పంపినాడు. కావున 'నుపాధ్యాయుని బెట్టినావెందుకు నీవు చెప్పిన సరిపోవునుగదా' అని జమీందారుగా రల్లుని బ్రశ్నించిరి.

'నాకు సరీగాతీరుబడిలేదు. ఉన్నప్పుడెల్ల చెప్పుతూఉంటానండి' ఆముక్కలనుట కాతని హృదయము తల్లడిల్లిపోయినది.

నారాయణ రావొకనాడు సూర్యకాంతముతో 'మీ వదిననుకూడ చదువుకునేందుకు రమ్మని చెప్పమ్మా' యని వచించెను. సూర్యకాంతము పోయి శారదను దీసికొని వచ్చినది.

శారద క త్తవారింటికి వచ్చుటకే యిష్టము లేకపోయినది. ఆమెకు భరింపరాని దుఃఖము వచ్చినది. తండ్రిమాట కెదురాడి యెరుగదు. తమ్ముడు కేశవచంద్రుడు 'చిన్నక్కా! నువ్వన్నా వెళ్ళి బావను దీసుకొని రా' యని కోరినప్పు డామెకు ఏవియో యాలోచనలు జనించి కన్నుల నీరు పొరలివచ్చినది. తల్లి కంట నీరు పెట్టుకొన్నది. మేనత్త విచారించినది. జమీందారుగారు తనయను చెంతజేర్చికొని 'తల్లీ స్త్రీలు జన్మము నెత్తినప్పుడే భర్త యింటికై నిర్దేశింపబడ్డారు కదా! నువ్వు చదువుకొన్నదానవు. నీ కొరులు చెప్పవలెనా! వెళ్ళమ్మా, నువ్వు చెన్నపట్టణములోఉందువుకాని. మీ మామగారితో చెప్పాను. నేను ఎప్పుడూ వస్తూఉంటాను. నువ్వు మార్చి ఆఖరు వారంలో ఎలాగు ఇంటికి వస్తూనేఉన్నావు. అక్కడ వాళ్ళ సూర్యకాంతము ఉండనే ఉండును. బావ సుందరరావు అతని భార్య పిల్లలూ వాళ్లూ వుంటారాయెను. అక్కయ్యను వచ్చి చూడమని వ్రాస్తున్నాను.' అని బుజ్జగించినారు.

ఏనాటికయిన అత్తవారింటికి, భర్తకడకు వెళ్ళక వలనుపడదని యామెకు తెలియును. భర్తతో గాపురము తప్పుబెట్టని యామె యాలోచించుకొనలేదు. భర్త తనకడకు రాకుండ తప్పిన జాలుననియే యామెకోరిక. భర్తకడకు తాను వెళ్ళినచో

నాతడు తన్ను ప్రేమించుట మొదలిడినచో నానెట్లు బ్రతుకుట ? వెల్సురఫి రచించిన 'మోహార్ద్రమగు స్నేహము' అను నవల తాను చదివినది. అందులో నాయిక తన జీవితమును ప్రేమార్పితము చేసినది. పోనీ, తానెవరినైన నట్లు ప్రేమించు చున్నదా ? జగన్మోహనరావు బావను దాను ప్రేమించుటలేదు. అది నిశ్చయము. జగన్మోహనరావు బావ తన్నతిగాఢముగ ప్రేమించుచున్నాడని తనకు దెలియును. ప్రేమ యననేమి ? పురుషుని జూచినను తలచినను, ఆతనిలో నైక్యమైపోవ గోరుట యేకదా ! తానెవరినైన ప్రేమించినదా ? జగన్మోహనరావు బావపట్ల మంచి స్నేహమున్నది. ఆతనితో గంటలకొలది మాట్లాడ మనసగును. ఆతడు చెంత-నున్నప్పుడు తన్ను సంతోషమునముంచివేయును. తన తల్లిదండ్రులపట్ల తమ్ముని పట్ల మాత్రము తన కట్టి భావములేదా ? అంతకు మిక్కిలి తానే పురుషుని ప్రేమించుటలేదు.

భర్త చదువుకొనినవాడు. మోటుమనిషికాడు. తాను జూచినంతవరకు నొరులజోలికి బోవని కరుణార్ద్రహృదయుడు. ఆతని జూచినవారెల్ల మెచ్చుకొను చున్నారు. అటువంటి యప్పుడు తన కిష్టముగాని ప్రేమను అతడు గోరునా ?

చిన్నతనమునుండియు దన్ను పెంచిన పుష్పవనము, గోదావరిగాలి తనకింక-దూరమైపోవును తన చిన్నితమ్ముడు ఇంక తన్ను విచిత్రములగుప్రశ్నలువేయడు. ఈ పరిచారికలు, ఈ చుట్టములు వెనుకనే యుండిపోదురు. ఏమిటిది ! చదువుకొన్న వా రిట్టుల బెంగ పెట్టుకొననగునా ?

శారద అత్తవారింటికి వెళ్ళి పదిరోజులు మాత్రమే యున్నది. ఇంతలో జెన్నపురి వెళ్ళిపోవలసివచ్చినది భర్త మొదటితరగతి జంటసీటుల పెట్టెలో తనతో ప్రయాణము చేసెను. వారన్న నందరకు ప్రేమయే ! ప్రయాణములో ఎన్నో సౌకర్యములు ! తన మనస్సేమియు నొవ్వని విధాన పువ్వులలో ప్రయాణము జరిగినది.

భర్త తన్ను జదువునకుబిలిచినాడని ఆడుబిడ్డ కబురుతెచ్చుటతోడనే, యామె హృదయము కలతనొందినది. ఆశ్చర్యమందినది. ఆమె నారాయణరావుకడకు సూర్యకాంతముతో వచ్చి మేడమీది గదిలో సూర్యకాంతము కుర్చీప్రక్క కుర్చీలో గూర్చుండిపోయినది. తన గంభీరమగు గొంతుకతో నారాయణరావు సర్వసౌందర్య సంపన్నయగు శారదకు పాఠములు ప్రారంభించినాడు.

ఎట్లుగడచినదో యొకగంట. శారద పరవశురాలయిపోయినది. తన మధుర కంఠముతో జ్ఞానము తేనెవాకలు కట్టునట్లు భర్త బోధించునప్పుడు శారద విభ్రాంతయైపోయి విన్నది. అంతయు జెప్పినవెనుక నాత డామెను ప్రశ్నలు వేసినాడు. మొదట చెప్పలేక డగ్గుత్తిక పడినది. కాని నెమ్మదిగ నెమ్మదిగ భయముతీరి యన్ని ప్రశ్నలకు జవాబు చెప్పినది.

'ఇక వెళ్ళవచ్చు' నని నారాయణరావు లేచి క్రిందికి దిగి వెళ్ళిపోయినాడు. శారద యిట్టి బోధన మెన్నడు వినలేదు. దూదివలె విడబరచి వెనుకకుబోవుచు

ముందుకు సాగుచు పాఠమంతయు హృదయమున హత్తిపోవునట్లు చెప్పినారు. ఇదివర కెవ్వరును ఇంత బాగుగా చెప్పలేదు.

'చూశావా వదినా! మా అన్నయ్య ఎంతబాగా చెప్పాడో. నేను తప్పక ఈయేడు పరీక్ష నెగ్గితీరుతాను. మీ పరీక్షలు మా పరీక్షలు ఒకమాటే.'

'ఇవాళ చాలాబాగా అర్థమయింది సూరీడూ.'

ఆరోజున శారద కేలనో హృదయము సంతోషమున పూర్ణమై, ఆమెను వివశత్వమున కదిల్చివేసినది.

నారాయణరావు తాను భార్యను ప్రేమించుచున్నట్లు కనబడకూడదు. యిది యంతయు మామూలుతంతుగ జరిగిపోవుచున్నట్లామెకు దెలియవలెను. తన హృదయము, జీవితము ఆ బాలికపై ప్రణయముచేనిండి, జగమెల్లనుబికి, సృష్టినంతయు నాక్రమించుకొన్నదని యామెకెట్లు తెలియును. తెలియుటయు వలదు.

ఈ ప్రేమ మహానిర్ఝరి గోచరించి భయంపడినదా యీ బాలిక? ఆమెలో నేమియున్నది తన్నిట్లాకర్షించుటకు! అందమైన రూపరేఖావిలాసము లుండవచ్చును. అట్లందమయినవా రితరులు లేరో? శ్యామసుందరి సౌందర్యమున శారదకు జోడుగా గలదు. శారదకన్న సరళహృదయ, గంభీరమానస, విజ్ఞానసంపన్నురాలు ఆమె ప్రేమలో మించివేయ దలచుకొన్నచో నెవ్వరు నిలబడగలరు. అయిన నాబాల తనలో నిట్టి ప్రణయభావము జనింపజేయులేకపోయినది. ఈ శారదలో నేమున్నదో! ఆమె ఆత్మసంస్కార మెంత యున్నతమో!

శారద చెన్నపురి వచ్చినవెనుక శ్యామసుందరిలో దీప్తి యెక్కువ అయింది. ఆ యిరువురకు దనకు నేమి సంబంధము? శారద భార్యయేమి? ఏ యదృష్టమున శారద భార్య యయినది, ఏ పూర్వపుణ్యాన శ్యామసుందరి మిత్రురాలైనది?

శ్యామసుందరి వైద్యకళాశాలనుండి వచ్చి యింటిలో నొక పడకకుర్చీపై చదికిలంబడినది. ఆమెకు పరీక్షాదినములు సమీపించుచున్నవి. రేయింబవళ్ళు నిద్రాహారములు మాని యామె విద్యాదీక్షితయైనది. చదువు, చదువుమధ్య నిద్ర, నిద్రమధ్య నారాయణరావుమాత్ర మామెకు సతతము గోచరించును.

నారాయణ యన్నచో దనకింత మైత్రియేలనో యామె కర్థముకాలేదు. నారాయణరావును దాను ప్రేమించుటలేదుగద! అయిననేమి? అట్టి మహాపురుషుని, పూర్ణవ్యక్తిని ప్రేమించుటకన్న తన జన్మమునకు సార్థకత యేమున్నది? అతడు పరాధీనుడు; అయిన నాతని తన యంతరాంతముల ప్రేమించి యానందపరవశయై కరిగి యాతని యాత్మాంతఃపదంబుల ప్రవహించి పోవుటకన్న తరణోపాయము లేదు. అని అనుకొనుచు ధ్యానముద్రయైనది.

శ్యామసుందరి చిన్నతనమునుండియు గంభీర హృదయ. ఈశ్వరోన్ముఖమానవసేవ చేయవలెననియే యామె వైద్యశాలయందు జేరినది. దేశసేవచేయు శ్రీ సరోజినీదేవి, శ్రీ కస్తూరిబాయి మొదలగు వనితామతల్లులవలె దనజన్మము

సేవకై యర్పణమున్ని సంకల్పించుకొన్నది. వీలయినప్పుడెల్ల రాట్నము వడకును వెల్లెంద్రచేత వడకించును.

ఆమె నిమీలిత నేత్రయై, హృదయమున దక్షిణహస్తతల మదుముకొని, ధ్యానించుకొనుచు యా పడకకుర్చీపై నట్లే పండుకొనియున్నది—

శారదకు భర్తయే గురువైనాడు. ఆయన పాఠముచెప్పిన విధానము స్మరించు కొనుచు తన పడకగదిలో సోఫాపై మేనువాల్చి కన్ను లరమూతపడగా, ఏమేమో పుల్కరింపులు. ఏవియో మధురతరంగాలు తన్నెచ్చటికో తేల్చిపోవ, ఒంటిగా ఆమె ఆ రీతిగనె పవళించియున్నది.

౨

## వె ఱ్ఱి త ల్లి

ఇంతలో రుక్మిణికి బురుడు వచ్చినది. నెలలు నిండిన వని తోచుటతోడనే నారాయణరావు పరమేశ్వరమూర్తు లాలోచించుకొని రాజారావును రప్పించుకొనిరి. రాజారావు తా నెరిగియున్న విద్యావంతురాలును నిపుణురాలునగు నొక యూరేషి యను దాయి నేర్పరచినాడు. వారు చేయవలసిన విధు లన్నియు నొనర్చి, శ్యామ సుందరీదేవితో నవసరమైనపుడు వచ్చి కనుంగొనుచుందుడని చెప్పి తాను వెడలి పోయినాడు.

రుక్మిణి సుఖముగ నాడపిల్లను గన్నది, పరమేశ్వరుని మో మానంద ప్రపుల్లమైనది. ఈ బాలికయైన బ్రతికి బట్టగట్టిన తాను ధన్యుడే. తనకు శిశువులన్న నెంత యానందమో యంత విషాదము గూర్చినాడు విధి. ఈ బాలికయైన బది కాల ములు సుఖముగ బ్రతికినచో తన కంతియే చాలును.

'ననూ పాలింపా, నడచి వచ్చితివో
నా తల్లి - ఉమా శివా —ననూ
వనజనయన, హిమ - గిరి తనయ జననీ
నీలశరీరద్యుతి నిండించీ విశ్వమెల్ల
ననూ పాలింప...............'

అని పాడుకొన్నాడు. బాలిక యొడలు తొనలు కట్టియున్నదట.

'పరమేశ్వరం, నీ కూతురు మలయమారుత రాగాన్ని ఏడుస్తూఉన్నదిరా! మంచి సంగీత పాటకురా లయ్యేటట్లున్నది. అచ్చంగా నీ పోలికే. వెళ్ళి చూడు. నక్షత్రం మంచిది, ఏమీ దోషాలు లేవు' అని నారాయణు డన్నాడు.

శారద బాలికను జూచి కిలకిలలాడినది.

'ఏమి బుగ్గలమ్మా నీ కూతురుకు రుక్మిణమ్మగారూ' అని మేలమాడినది.

'నా - మేనకోడలు బుగ్గలయీ వెమ్మ' అని సూరీ డన్నది.

'ముష్టిపిల్ల! మంత్రసానికి శబ్బిచ్చి కొనుక్కోండి' -అని వంటలక్క రామమ్మ అన్నది.

'ఒరే అబ్బాయీ! దీనికి ఏం పేరు పెడతారో చాలా పెంకిపిల్లలా ఉందిరా' అని నారాయణరావును జూచి యాతని పెత్తల్లి కొమార్త బంగారమ్మ అన్నది.

'వెఱ్ఱితల్లి' అని పేరు పెట్టండి అని రుక్మిణి అన్నది, అలసట పొందిన నవ్వుతో.

పదిరోజులు సుఖముగా గడచి పురిటినీళ్ళు పోసినారు. బాలసారెలేదు. శిశువు దినదిన ప్రవర్ధమానయై ఒళ్ళుచేయుచున్నది. రోహిణీదేవి యా బాలికకు చిట్టి చొక్కాలు కుట్టుకువచ్చినది. వెండిచెంబా, పాలు పోసికొనుట కొక వెండి కొమ్ము చెంబును బహుమతి పట్టుకొనివచ్చినది.

రోహిణీదేవి వచ్చినప్పుడెల్ల రుక్మిణి హృదయమున గలత జనించునది. భర్త యా బాలికను ప్రేమించుచున్నాడని యెచ్చటనో యామెలో మారుమూల ప్రతిధ్వనించినది. రోహిణీదేవి తన కన్న యందకత్తె. రోహిణియు తన భర్తయు సర్వదా మాట్లాడుకొనుచుందురని యామెకు గర్ణాకర్ణిక తెలిసినది. శ్యామసుందరియు నారాయణరావునుగూడ స్నేహితులని విన్నను, వారలను నిసుమంతయు నామె యనుమానించలేదు. భర్త తన ప్రాణమును దనకు ధారబోయునని యామెకు దెలియును. అయినను భర్తృహృదయమున ప్రేమసముద్రము నిండియున్న దనియు నయ్యది యెవ్వరిపైననైన సులభముగ ప్రవహించిపోవుననియు నామె గ్రహించినది.

తా నంత యందకత్తియ గాననియు భర్తృ సంపూర్ణప్రేమను దాను జూరగొనజాలననియు నామెకు విదితమే. భర్త యొకటి రెండు సారు లెవరితోడనో మైమరచి ప్రవర్తించినాడనియు నామె గ్రహించినది. కాని ఇదమిత్థమని తెలుపలేదు. లోలోన నొకటి రెండు వారములు కుళ్ళిపోయినది. అది పరమేశ్వరుడు చూచినాడు. తాను భార్యతో నగ్నిదేవుని యెదుటజేసిన వాగ్దానమునకు భిన్నముగ రెండు మూడు సారులు వివశుడై చరించినను ఆ వెనుక ఘోరనరకబాధ ననుభవించినాడు. ఆతనికి దలగొట్టి నట్లయింది. ప్రపంచము నల్లబడిపోయినది. భార్య ఘోరనరక మనుభవించుచున్న దని యాతడు గ్రహించి సర్వము మరచిపోయి యా బాలిక పదముల కడ ప్రణయ పూజామతియై మోకరిల్లినాడు.

అయినను వారట్టుల రెండువారములు బాధనందినారు. పరమేశ్వరమూర్తి పరితప్తచరిత్ర మాతని భోజనములో, నిద్రలేమిలో. భార్యకుదోచినది. ఎట్టకేలకు పతిప్రాణయగు ఆమె నావరించిన దుఃఖమేఘములు తొలగిపోయినవి. అప్పు డొకనాడు భర్తనుజేరి యామె 'ఇకనెప్పుడు నాయెడ దోషంచేయనని ప్రతిజ్ఞచేయండి' అని యామె కోరినది. పరమేశ్వరుడు సర్వభూతములు సాక్షిగ నా ప్రమాణ మొనరించినాడు.

'రుక్కూ! నా హృదయము పంకిలమయిన మాట నిజము. కాని నేను దుర్బలుడను. ఎప్పుడైనా ఈలాంటి గాఢనైచ్యమై వచింపరాని పాపంలో పడి పోయింది తెంపుసారులే. నన్ను క్షమించమని నేను కోరను. కాని నువ్వు పవిత్ర మైన చరిత్ర కలదానవు. నీకు నన్ను భర్తగా సమకూర్చిన విధే దూషవలసినవాడు. ఏమి చేయను దేవీ! నా బోటి పురుషులు ఈ ప్రపంచంలో జన్మించి తమచుట్టూ ఉన్న నిర్మలత్వానికి కళంకం తెస్తారు. స్వచ్ఛమైన నీ జీవితానికి నలుపుమచ్చను నేను' అని కన్నుల నీరు నించుకొన్నాడు.

రుక్మిణి భర్తగారి బాధను జూచి భరించలేకపోయినది. కరుణార్ద్ర హృదయ యైన యామె వెల్లువమై ప్రవహించి, భర్తను చుట్టివేయుచు తన పాదాలపై మోము వంచి వాపోవు భర్తను లేవనెత్తి తన హృదయానికి జేర్చుకొన్నది. నాటినుండియు జిన్నబిడ్డలరీతి నెప్పటి యట్లత్యంత ప్రేమతో వారు మెలంగినారు.

రుక్మిణి కివియన్నియు నొకసారి సినిమాలో కథవలె గోచరించినది. అప్పుడు మనస్సు కుదుటబడ నిట్టూర్పునించి సహజమగు మర్యాదతో ప్రీతితో రోహిణీ, సరళా, నళినీదేవులతో మాటలాడి కొమార్తను గూర్చినవారి మేలములకు హాస వదనయై జవాబు లిచ్చినది. సూర్యకాంతము సతతము నా బాల నెత్తుకొనుటయే. 'వదినా నా కాళ్ళమీద పడుకో బెట్టమ్మా! నువ్వు నీళ్ళుబోస్తే నేను తుడుస్తాను వదినా, కోడలు నవ్వుతుందిసుమా' అని ఆమె ఆనందమున మునిగిపోవును.

రుక్మిణి :—కాదమ్మా! మామయ్య ఎప్పుడు వస్తాడో? అని అత్తయ్య కనిపెట్టుకు ఉన్నదికదా అని నవ్వినది.

సూరీ :—అబ్బా అసాధ్యురాలే నా కోడలు వదినా? తల్లిపోలికే!

రుక్మిణి :—వేళావు బాణమూ?

అందరును నవ్విరి. శారద యా మాట విని యాగిపోయినది. ఆమె హృదయమునం దొక్కసారి గుబుక్కు మన్నది. తన చిన్న ఆడుబిడ్డ సూరీడునకు భర్త యన్న నింత ప్రేమయా? దూరమున నున్న భర్తకై ఎదురుచూచుటయా? నిజమే! అప్పుడప్పు డామె యుత్తరములు వ్రాయుచుండును. సూరీడు గదిలో నామె భర్తగారి ఛాయాచిత్ర మున్నది. ఆమె మెడలోని బంగారు గొలుసులో చిన్న చిత్ర మున్నది. భర్త యామెకు వ్రాసిన యుత్తరములన్నియు విశాఖపట్టణపు మంచి గంధపుపెట్టెలో నుంచుకొన్నది. అవి యన్నియు మరల మరల తీసి చదువు కొనుట శారద కనిపెట్టిది.

తమ యింటిలో గాపురమున్న యీ రుక్మిణీ పరమేశ్వరమూర్తులు ప్రేమచే నిండియుండుట, పరమేశ్వరమూర్తి తన భార్యతో సల్లాపములాడుచు నమితసంతో షమున బ్రతుకుదారిని నృత్యముచేయుట ఆమె చూచినది. జమీందారులలోనే భార్యా భర్తలు ప్రేమచే నిండియుందు రనుకొను శారదకు, జమీందారుల కుటుంబములలో

కన్న నితర కుటుంబములలోనే యెక్కువ ప్రేమ యుండుననియు, జమీందారుల కుటుంబములలో ప్రేమయే లేదేమో యనియు గోచరించెను.

శారద చెన్నపురి వచ్చిన మరునాడు ఆనందరావుగారును, ఆయన భార్య ప్రవిమలాదేవిగారును మోటారుపై నారాయణరావుగారి యింటికివచ్చి శారదను గుశలప్రశ్న జేసినారు. శారదకు ప్రాణము లేచివచ్చినది. ప్రవిమలాదేవి నామె బిగ్గ కౌగిలించుకొని కన్నుల నీరు నించినది. శారదను దగ్గరకు దీసికొని, 'తల్లీ నీ తండ్రిగారు చేసిన యీ దోషానికి నువ్వు అనుభవింపలసినదే ' యన్నది.

చటుక్కున శారద మనస్సులో ' ఏమి యనుభవించుమన్నాను ' అను ప్రశ్న స్పష్టమై పొడసూప ' అనుభవ మేమిటి ? ' అని మందహాసమున బలికినది.

నారాయణరావు పెళ్ళియైన వెనుక నీ రెండు సంవత్సరములనుండియు నొక్కసారియైన ఆనందరావుగారి ఇంటికి భోజనమునకు వెడలలేదు. తెలుగువారలలో బాగుగ ధనము వచ్చు న్యాయవాదులలో నానందరావుగారు ప్రథములు. అయినను నారాయణరావును దన కచ్చేరీకి రమ్మనిగాని భోజనమునకు రమ్మనిగాని అతడు పిలువలేదు. నారాయణరా వాయనకు గర్వమని గ్రహించినాడు. కీలుపాకులో మామ గారి యింట నున్నప్పుడు జమీందారుగారు వచ్చినప్పుడెల్ల ఆనందరావుగారు నారాయణుని కలిసికొనుచునే యుండిరి. మేనమామను భోజనమునకు రమ్మని పిలిచినాడు గాని నారాయణుని బిలువలేదు.

జమీందారుగా రల్లునిగూడ తన మేనల్లుడు పిలుచుచున్నాడనే నమ్మిరి. నారాయణరా వానందరావుగారి యుదంత మిసుమంతయు మామగారికి తెలియనీయక చరించెను.

నారాయణరావు చెన్నపురికి కాపురము వచ్చినప్పుడును ఆనందరావుగారు నారాయణరావుగారి యింటికి రాలేదు. హైకోర్టులో న్యాయవాదులసంఘ మందిర ములో గలిసికొన్నప్పుడును నారాయణరావు నాతడు పల్కరించువాడు కాడు. చెన్న పురి యాంధ్ర న్యాయవాదులు, తమిళ, కన్నడ, మళయాళ, న్యాయవాదులలో బెద్ద వారుకూడ అతడు లక్ష్మీసుందరప్రసాదరావుగారి యల్లుడనియు, బి. యల్. పరీక్షలో బ్రథముడుగా గృతార్థుడైన యువకుడనియు, భాగ్యవంతుడనియు, తెలివిగల బాలు డనియు, భారతి మొదలగు పత్రికలలో, త్రివేణి మొదలగు ఇంగ్లీషు మాసపత్రికలలో, వ్యాసముల వ్రాయుచుండుననియు, సంగీతమున నిధియనియు. బొమ్మలు అద్భుత ముగ జిత్రించుననియు తెలియగనే వారంద రాతనితో స్నేహముచేసినారు. న్యాయ వాదులసంఘములో నేవిషయము చర్చకు వచ్చినను నారాయణరా వక్కడ నున్నచో నతనిని వారు సందేహము లడుగుచుండుటయు, నాతడు నిర్దుష్టముగ వానినిగూర్చి తెలియజెప్పుటయు గలదు. వాని మేధ న్యాయవాది మందిరములో సామెతయైనది.

ఇది యంతయు నానందరావుగారు గమనించినారు. ఆయన యాశ్చర్యము నకు మేరలేదు. ఎంత గొప్ప న్యాయవాదియైనను దనచుట్టు కోటగోడల కట్టుకొన్న

వాని నెవ్వరు చేరగలరు. కావుననే నారాయణరావును రోడ్డి న్యా: గౌర
వించుట గాంచి యాయన ఆశ్చర్యపడెను.

నేడు నారాయణరా వింటికి వచ్చుచున్నాడని యాయనకు మొదటిసారి హృద
యమున జ్ఞానమేర్పడినది. తన మేనమామ కొమరిత శారద మగనియింటిలో
నున్నది. ఆమెను దాను దన భార్యయు వెళ్ళి చూడవలెను. 'ఆ' తప్పు నేమియు
నెరుగని యాతని మెదడునకు దోచిన దంచిమ. 'ఆ' ప్రపంచమావల నే మున్నదో,
యేమో?

## 3

## ప్ర కృ తి — పు రు షు డు

రామచంద్రరావు హార్వర్డు విశ్వవిద్యాలయములో 1926 వ జూలైలో
బి. ఎస్. సి. ఆనర్సులో ప్రవేశించినాడు. బి. ఎస్. సి. మూడు సంవత్సరముల
పరీక్ష. బి. ఎస్. సి ఆనర్సులో విశ్వవిద్యాలయమున రెండవవాడుగా జయమందెను.
బి. ఎస్. సి. ఆనర్సు జయమందిన ఆరు నెలలకు ఎమ్. ఎస్. సి. పత్రమును
విశ్వవిద్యాలయమువా రిత్తురు. అందుల కొక పరీక్షయు జరుగునట. ఆ పరీక్షవ్యాస
ములు వ్రాయించి వానిని పరీక్షించుట యట. ఎమ్. ఎస్. సి. పరీక్షకై చాలా పట్టు
దలతో జదివి 1929 ఫిబ్రవరినెలలో నా పరీక్షకయి వ్యాసము వ్రాయుట కారం
భించినాడు.

ఈలోన నా మూడేడులు 'హార్వర్డులోను' 'మశ్శాచియెట్సు' రాష్ట్ర ప్రభు
త్వమువా రేర్పరచిన విద్యుచ్ఛక్తి విద్యాలయములోగూడ చదువుచుండెను. అమెరికా
దేశమున నట్టి వీళ్ళ నెన్నిటినో విద్యాలయములు కల్పించెను. విద్యుచ్ఛక్తి ప్రపంచ
ములో నా విద్యాలయపుపరీక్ష చాలా గణనీయమైనది. లియోనారాకన్యయు నటులనే
జదువుచున్నది. ఆ విద్యాలయము మహానుభావుడగు 'ఎడిసను' పండితునిచే
నిర్మింపబడినది.

రామచంద్రరావు తెలివితేటలు గ్రహించి యా విద్యాలయమువా రాతనికి
వలయు సౌకర్యములు సమకూర్చుచుండిరి. ఆ విద్యలో పారంగత్వమునందవలెనన్న
నైదేడులు చదువవలెను. బి. ఏ. లెక్కలుగాని, పదార్థవిజ్ఞాన శాస్త్రముగాని చదివిన
వారిని మూడవ సంవత్సరపు దరగతిలో జేరనిచ్చెదరు. పరీక్షలో విజయమందిన
వారికి డి. యి. యి. అని బిరుదపత్రము నిచ్చెదరు. రామచంద్రరావు రెండు సంవ
త్సరముల పరీక్షలలో మొదటివాడుగా గృతార్థుడైనాడు.

లియోనారా కన్యకును నది తుది సంవత్సరపు పరీక్ష.

లాతిదేశములలో ఏకదేశస్థులు కలిసికొన్నప్పు డాత్మీయ సహోదరుల జూచి
నట్లు ప్రేమ జనించును, ప్రాణములేచివచ్చును. ఆంధ్రులే బెంగాలు దేశమునన్లో
కలసికొన్నచో, నంతకుమున్ను వారిరువురకు పరిచయమ్ము లేకపోయినను సరియే,

వారిలో నొకరిది బళ్ళారి, రెండవవారిది బరంపురము నైనను సరియే, ఒక్కచోట పుట్టి పెరిగినవారికన్న నెక్కువస్నేహముగ మెలగుదురు. అటులనే హిందూదేశస్థు లిరువు రే యాస్ట్రేలియా ఖండములోనో, జర్మనీలోనో కలిసిననాడు స్నేహితులై సంచరించెదరు.

రామచంద్రరావు మొదలగు హైందవ విద్యార్థు లనేకులు హార్వర్డు విద్యాలయమున, బెరికిలే, న్యూయార్కు, కాలిఫోర్నియా మొదలగు విద్యాలయముల జదువు చున్నారు. వర్తకము చేసుకొను గుజరాతీదేశస్థు లున్నారు. రాజకీయ వ్యవహారము లకై యున్నవా రున్నారు. వీరిలో నెవరెవరు కలుసుకొన్నను బ్రాణములర్పింతురు.

రామచంద్రరా వట్లె పెక్కుమంది విద్యార్థులతో స్నేహమొనర్చెను. రాజకీయ వ్యవహారములు చూచుకొనువారిలో గొందరు అమెరికా హిందూదేశముల కొండొంటికి గాఢమైత్రి నొనగూర్ప ప్రయత్నించువా రున్నారు. అందు కొందఱి భావము లెట్టివో యెరికిని తెలియదు. అట్టివారిలో గండార్‌సింగు, ప్రాణకాంతబోసు అను నిరువురు విద్యార్థు లున్నారు.

వారిరువురు చదువులు పూర్తిజేసుకొనిన వెనుక కొన్ని నెలలాగి ఫిబ్రవరి నెలలో హిందూదేశమునకు వచ్చినారు. వారు వచ్చిన కొద్దిరోజుల కా యువకులపై ప్రభుత్వమువా రభియోగమును జరిపినారు. వారికి చెరియొక మూడేళ్ల ఖైదును న్యాయాధికారి విధించెను.

మార్చినెల మొదటి వారములో నారాయణరావునకు రామచంద్రరావు వ్రాసిన యొక కమ్మ అందినది.

'హార్వర్డు విశ్వవిద్యాలయం, ఫిబ్రేవరి, 1929. ప్రియమైన బావా!

'నీవు వ్రాసిన ఉత్తరం అందింది. నీది యెంత చక్కని హృదయమోయి? ఈ మూడేళ్ళు నాకు సరియైన ధైర్యం కొలిపింది నువ్వేసుమా! వారం వారం నీ ఉత్తరానికి ఎదురుచూడ్డం నాకు రెండవభోజనం అయిపోయింది. నేనే నీకు జవాబులు ఆలస్యం చేసేవాణ్ణి. ఎప్పుడు డబ్బు కావాలంటే అప్పుడు పంపించావు. కోటీశ్వరుడగు అమెరికా దేశస్థుని కొమరు డెట్లు సంచరించగలిగినాడో ఆలాగు, నే నిక్కడ సంచరించానంటే దానికి కారణానివి నువ్వు. ఎమ్. ఎస్. సి. తప్పక వస్తుంది. డి. యి. యి తప్పదు. ఇంకను ఉన్నకొలదీ నేర్చుకోవలసింది చాలా ఉంది. కాని మనదేశంలో విశ్వవిద్యాలయాలు చాలాఉన్నవి. ఏ విద్యాలయంలోనైనా నాకు ఉద్యోగం సంపాదించి పెట్టగలవని నా నమ్మకం. ఆంధ్ర విశ్వవిద్యాలయం కొత్తగా పెట్టారుకదా! అందులో నాకో ఆచార్యపదవి సంపాదించగలవను నానమ్మికకు నువ్వు వ్యతిరేకం చెయ్యవద్దు. నేను డబ్బు సంపాదించాలనీ లేకపోతే కూడు దొరకదని కాదుగదా ప్రవేశించుటకు కోరేది. ఏదైనా విశ్వవిద్యాలయంలో ఉండి, విద్యుచ్ఛక్తి విషయమై కొత్తసంగతులు చాలా పరిశోధించవలెనని ఆశయమువుంది.

విశ్వ విద్యాలయములో నాకు ప్రవేశం దొరకకపోతే, ఏ బెంగుళూరు శాస్త్ర పరిశోధనాలయంలో నైననుసరే ప్రవేశము నాకిప్పించ కోరుతూఉన్నాను.

'చి॥ సౌ॥ సూరీడుకు చదువు చెప్పించి, ఈమెను ప్రయోగశీలను పంపదా మన్న ఉద్దేశం నీకు కలగడం చాలా ప్రశంసనీయం. పరీక్షలో నెగ్గితే అమెరికా నుండి మంచి బహుమతీతెస్తున్నానని చెప్పు. ఆవిడకూ నేను ఉత్తరం రాసున్నాను. నా సహోదరి శారదాదేవిని నే నింతవరకు చూడలేదు. ఆమె [illegible]లూను కలిసి చదువుకుంటున్నారని వినుటకున్ను చాలాసంతోషమయినది. చి॥ సౌ॥ సూరీడు సంగీతముకూడా బాగా నేర్చుకుంటున్నదని పాశ్చాత్య సంగీతముకూడా నేర్చుకుంటూన్నదని నీ ఉత్తరంలో చదివినప్పుడు నాకపరిమితానందం కలిగింది.

'నేను జూలయినెలలో బయలుదేరి ఇంగ్లండుమీదుగావస్తున్నాను. బొంబాయి వచ్చి అచ్చటనుంచి కొలంబోవచ్చి రైలుమీదవస్తాను. ఇంటికి నేను జేరుకునేందుకు రెండునెలలుపట్టును. ఈలోన ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మనీ, ఆస్ట్రియా, స్విట్జర్లండు, ఇటలీ చూచుకొని మరీ వస్తున్నాను. నీ కేమి కావలసినా తంతి నీయవలయును.

ఇట్లు నీ ప్రియమైన

రామచంద్ర'

విద్యుచ్ఛక్తి విద్యాలయములో పరీక్షలు సంపూర్ణము లయ్యేను. రామచంద్ర రావు విజయముగాంచి జయపత్రమును భారతదేశమున కంపుట కేర్పాటు చేసికొని, మరల నొకపరి దేశములోని చిత్రములు చూచెదనుగాక యని 'నయగరాపతనము' నకు బోయినాడు.

రామచంద్రు డిక నమెరికా వదలి వెళ్ళిపోవు చున్నాడని లియొనారాకన్య విచార గ్రస్తయయినది. ఇన్నాళ్ళు రామచంద్రు నొక నిమేషమేనియు విడబాసి యుండలేదు. ఆతని నా బాలిక 'నయాగరా' దన కారుమీద కొనిపోయినది.

దారిలో నొక నిర్జన ప్రదేశముకడ ప్రకృతి లీలా వినోదినియై యొసగుచోట కారు నాపినది.

'రామచంద్ర! మళ్ళీ మనమెప్పుడు కలుసుకొనుట? నీవు మరల అమెరికాకు వచ్చుటో లేక నేను హిందూదేశమునకు వచ్చుటో. లేనియెడల నీ రూపము నా దృష్టిపథమునుంచి మాయమైపోవును?'

'అదేమిటి నారా! అంత విచారముగా ఉన్నావు. నీవంటి ధైర్యమైనపిల్లను మా దేశంలో చూడనే చూడము! కథల్లో మాత్రము వింటాము?'

'నీ వెందుకు నా జీవిత నాటకంలో నొకపాత్ర అయినావు?'

'అది ఉత్తమ సంఘటనం కాదా. అది నా అదృష్టం కాదూ?'

'నీ వున్న మూడేళ్ళు నాకు నీవుసమకూర్చిన ఆనందము నా వ్యక్తిత్వమును వున్నత పథాల కెత్తివేసినది.'

'లీ! ఈలాగున ఏమిటి వణికిపోతున్నావు!'

'రామ్! నా ప్రియతముడైన స్నేహితుడా! భారతదేశము మహాత్ముని నాయకత్వాన సలుపు ప్రేమ మహాసంగ్రామము వలననే ప్రపంచమునకు ధర్మసందేశ మొసగగలదని నీవు సల్పిన జ్ఞానబోధ నన్నొక నూతన వ్యక్తిని జేసింది. ఆలోచించినకొద్దీ ప్రపంచాన్ని తరింపచేయుటకు అమెరికా హిందూదేశములు రెండూ కలియాలి. భరతదేశము పురుషుడు, మా దేశము స్త్రీ. ఈరెంటికీ సంపూర్ణసంయోగము కలగాలి. ఆనాడు ప్రపంచబోధ ప్రారంభమవుతుంది.'

'నా ప్రాణప్రియ స్నేహితురాలవగు లియోన్! నీవివాళ భగవంతుని సాన్నిధ్యమునుండి యవతరించిన దేవతవులా ఉన్నావు. నీ మోమున దివ్యతేజస్సు తాండవమాడుతూ ఉంది. నీ శిరస్సు వెనుక తేజోమండలము, వంగపండుచాయతో గన్పట్టుతూ ఉంది.'

లియోనారా నవ్వుచు రామచంద్రుని ఒడిలోనికి వచ్చి కూర్చున్నది. సత్య ప్రదర్శకములగు నామెకన్నులు పారలౌకికమగు నవ్వు నవ్వుచున్నవి. రామచంద్రు నామె కవుంగిలించుకొన్నది. రామచంద్రునిమూర్తి పులకరించిపోయినది.

'మా క్రైస్తవ మతస్థు లెందరో శ్రీ యేసుక్రీస్తు దివ్యబోధ గ్రహించలేక పోయినారు 'హోమ్స్' మహాఋషి చెప్పినట్లు శ్రీ గాంధి, క్రైస్తు అపరావతారమే. భగవద్గీతలోని బోధయే యేసు కొండమీద యిచ్చిన ఉపన్యాసం.'

'నా లియోనా! నే నిదివరకు మాదేశాన నున్న దివ్య మణులగు గ్రంథరాజా లేమీ చదువలేదు. నా లెక్కల్లో నేను పడిఉన్నా. ఏనాడు నిన్ను ప్రథమాన్ని ఓడపైన దర్శించానో, ఆ శుభముహూర్తాన్నే అమెరికా హిందూదేశము లేకమై ప్రపంచానికి మార్గదర్శకము లవ్వాలని నాకు మెరుపువలె హృదయమున గోచరించినది. ఇన్ని వందల సంవత్సరాలుగా ఇంగ్లండు భారతదేశమును పాలిస్తు, భరతదేశసందేశాన్ని గ్రహింపలేక పోయింది. ఇంగ్లీషువారు రాజ్యముచేయుట మాకు మరియు ఉపకారమైనది. భగవంతుడు వారి ఆక్రమణముచే మమ్మందరినీ యేకం చేసినట్లయింది సుమా.'

'నా హృదయానికీ, ఆత్మకూ ప్రియమిత్రుడవైన రామచంద్ర! సర్వదోష రహితమైన జీవితము గడపుటే సత్యము. అట్టి సత్యవ్రతము చేసిననేకాని సత్య స్వరూపుడగు భగవంతునితో నైక్యమందలేము. అట్టి సత్యవ్రత మొనర్చుటకు ప్రేమ ముఖ్యసూత్ర మన్నావు. నాచే రాధాకృష్ణగారి గ్రంథములు, వివేకానందుని యుపన్యాసములు, గాంధీ జీవితచరిత్రమూ చదివించావు. నా హృదయంలో మానవ సేవ చేయుట పరమపవిత్రమైనదనిన్నీ, మోక్షదాయకమైనదనిన్నీ తోచింది....'

ఆమె కంఠము రుద్ధమైనది. ఆమె నేత్రాంచలములు తడియైనవి. ఆమె మోమున ప్రేమకాంతులు తళుకుమనుచున్నవి. అపు డా బాలిక - యా యమెరికను

ప్రసిద్ధవైద్యుని కొమార్త, యా సౌందర్యనిధి లియొనారా - రామచంద్రుని బిగ్గగవుంగిలించుకొని యాతని హృదయస్థములో మోమునుంచి,

' నీవు నా గురువువు. నేనింతటినుంచి బ్రహ్మచారిణినై మానవసేవ చేయుటకు సంచిల్పించుకొన్నాను అమెరికాకు నేను చిహ్నాన్ని. కాని నన్ను దగ్ధము చేయు నా యీ ప్రేమను వదలివేయాలి. ప్రియతమా ! నా ప్రభూ ! నన్నొకసారి పాలించుకో. మొదలూ తుదీ ఏకమైన ఆనందము నాకియ్యి. నన్ని ఒక్క ముహూర్తకాలమూ భార్య నొనరించుకో: ఈ యొక్క నిమేషము నీలో ఐక్యమైపోవనీ ' అన్నది. ఆమె మాట లస్పష్టములై, కాకలీకూజితములై, యా సంధ్య వెలుగులలో గలిసిపోయినవి.

రామచంద్రుడు నిశ్చేష్టుడై, చైతన్యరహితుడైనాడు. ఆతని మోము వెలవెలబోయినది. లియొనారాను చుట్టిన యాతని చేతులు వాలిపోయినవి.

' ప్రభూ, నా కోర్కె పాలింపవా ? '

ఆమె మోము హృదయము తరుగునట్టి బాధతో నిండినది. ఆమె కన్నుల సంతతజలధారలు నయాగరాలైనవి.

' తీరని యీ కోర్కెతో నా మనస్సు శాంతిలేక దహించుకొనిపోవలసినదేనా? నాకు సేవకై యనుజ్ఞ నీవీయ దలచుకొనలేదా. అందమగు నా యీ బ్రతుకును విషాదాంతము చేయదలచినావా, నా ప్రాణప్రియా ! నీవేల నా జీవితచరిత్రలో నొక పాత్ర వయ్యావు ! అహో ! '

రామచంద్రుడు కరగిపోయినాడు. అతని లోకాలు సురిగిపోయినవి. ఈమెకింత ప్రేమ యున్నదా ? తాను పాపమాచరించుటలేదా ?

లియొనారా ఇంకను గట్టిగ నదిమికొన్నది. ఆమె మోమెత్తి, ఆతని హృదయమున తన హృదయ మదిమి పెదవులు ముద్దిడుటకు ఆతని మోము వంచినది.

ఇరువురు పుల్కరించిపోయినారు.

ఆ సంధ్యాకాంతులలో, పక్షుల కలస్వనములలో, తారకలు స్పష్టకాంతుల వర్షించు శుభముహూర్తాన ప్రకృతి గంభీరసౌందర్యాన నృత్యముచేయు నా చోట, ఒక్క విచిత్ర ప్రేమసంశ్లేషావేశము సంఘటించిపోయినది.

## ౪

## స్నే హ ప వి త్ర త

శారదను జమీందారుగారు వచ్చి పరీక్షకు రాజమహేంద్రవరము తీసికొనిపోయినారు.

శారద చెన్నపురిలో నున్నంతకాలము భర్తతో జదువునప్పుడుతప్ప, తదితర కాలమం దేమియు మాటలాడలేదు. నారాయణరావు శారదతో మాట్లాడలేదు.

చదువు చెప్పునప్పుడు బడిలో నుపాధ్యాయు లందరు విద్యార్థుల కేరీతి చెప్పుదురో యంతకన్న నిచ్చట నధిక మేమున్నదని నారాయణరావు తలపోసికొన్నాడు.

శారదయు దానును, ప్రేమతో తమ జీవిత నౌక నానందయురీతరంగములలో వదలినచో ఆ నావ యనంతమగు నే తీరము సేరియుండునో ?

నారాయణరావును బ్రజలందరు గౌరవించి ప్రేమించుట శారద చూచినది. నారాయణరావు సౌందర్యవంతు డని, విద్యార్థినులగు బాలికలు, విద్యావంతు లగు యువతులు అవిసెచెట్టును నాగవల్లు లలమికొనునట్లు, చేరుట గమనించినది. తా నీ పురుషశ్రేష్ఠు నేల ప్రేమింపలేకపోవుచున్నానని ఒక్కొక్కప్పు డామె యాశ్చర్య పడును. దినదిన నూతన పాఠముల కెదురుజూచును. ఆతని కంఠగతమధురస్వర ప్రవాహములో నామె తేలిపోవును.

సూర్యకాంతమునకు శారదకు నాతడు వీలయినప్పుడెల్ల సర్వప్రపంచమునకు సంబంధించిన విషయములను వారి కర్థమగునటుల వారువ్విళ్లూరుచు వినునంత తీపిగ బోధించుచుండెను.

ఫిబ్రవరి నెలాఖరునకు వారికి బాఠములన్నియు హృదయగతములైనవి. పరీక్షలో ప్రశ్నలకు జవాబువ్రాయు నేర్పంతయు నుపన్యసించినాడు. వారిచేత వందల కొలది జవాబులు వ్రాయించినాడు.

ఒకనా డతడు శారదకు బాఠము చెప్పుచుండెను. సూర్యకాంతము తన పాఠము లవగతము చేసికొనుట కింకొక గదిలోనికి బోయెను. నారాయణరావు కాంభోజిరాగయుక్తమగు తన గొంతుకతో ఇంగ్లీషులో నిట్లు వచించినాడు. 'షేక్స్పియరుకవి దేహమనఃప్రాణ ప్రపంచముల మహానాటకములు రచించినాడు. 'ఉత్తమదశోన్ముఖులు కాని వారి జీవితముల నీ ప్రపంచ సంబంధములగు గుణములు విషాదమున ముంచివేయును' అను ఉత్కృష్టవిషయమునే యాతడు వెల్లడించి నాడు. గుణములు నీచములు, ఉన్నతములు అని రెండు రకములు. నీచగుణములు గలవాడు నశించును.—అనే సర్వసాధారణ నీతి నవి మనకు దోపింపజేయును. పురుషకారహీనమగు మంచితనము మనల నడంచి వేయును—అను విషయమే ఆతడు మహావిషాదాంత మగు హామ్లెట్ నాటకములో చూపించినాడు. హామ్లెట్టు సజ్జనుడు. తన తండ్రిని, తన పినతండ్రి చంపెనా లేదా యను సంగతి పూర్ణముగ దెలిసికొనకుండ నెటులాతని శిక్షించుట. అని యాతడు సందేహించినాడు. ఆ సందేహమే యాతని నడంచినది. ఒథెల్లో సర్వమానవులను బూర్ణముగ నమ్మినాడు. ఆ నమ్మకమే భార్య విషయమున నపనమ్మక మైనప్పుడు క్యాసియోపై నసూయ, భార్యపై కోపము, చివరకు తాను తన భార్యయు నశించిపోవుట తటస్థించినది. కావున సద్గుణములైనను అహంకారమున జనించినట్లయిన వినాశహేతువులు. ఇంత గొప్పవియైనను షేక్స్పియరు నాటకములకు సంపూర్ణత్వము రాలేదు. మహాకళలైనను సంపూర్ణత్వము నందనిచో ఉత్కృష్టానంద మెట్లీయగలవు ? భారతీయ

నాటక శిల్పులకు సంపూర్ణత్వమున్నది. కాళిదాసు రచించిన శకుంతల గమనించి నచో నా మహానాటకము రెండు భాగములుగా విభజింపబడినవి. ప్రథమ భాగమున దేహమనఃప్రాణలోకముల ప్రదర్శించినాడు.

'దుష్యంతుడు మహారాజు, శకుంతల వనకన్య. మహారాజీతర దేవేరులలో శకుంతలను జ్ఞాపక ముంచుకొనవలయును. శకుంతలను మరచినాడు. ప్రాపంచిక మగు నానందము కొలదిమాత్ర మనుభవించి యా భౌతికసుఖములో మైమరచుట నీ యాత్మకు భంగకరము. ఓ ఋషికన్యా, నీ ఆర్ష సంప్రదాయము మరువకుము - అని దూర్వాసుడు ఆమెను శపించినాడు. ఆర్యబాల విషయసుఖములకోసం జనింప లేదు. సేవకే. తన ఆత్మ తాను తెలిసికొనుటకే. కావున మేనక శకుంతల నెత్తి కొనిపోయి కశ్యపాశ్రమమున వదలినది. ఆర్య సంప్రదాయమున పుత్రుల గనుట, పున్నామ నరకబాధ నివర్తించుకొనుటకు, పితౄణము దీర్చుటకు. అందు కొక పుత్రుడు చాలు. శకుంతల మాతమైనది. రెండవభాగమున శకుంతలా దుష్యంతు లకు స్వర్గలోక పరిసరముల పునస్సంధానము కలిగినది. అప్పటికి దుష్యంతుడు రాజర్షి, శకుంతల యోగిని ఇంక పవిత్రమగు వానప్రస్థాశ్రమము, సచ్చిదానంద జ్యోతిర్ముఖ మగు జీవితద్వంద్వము.

'ఇయ్యది భారతీయుల ఉత్కృష్టాశయము. కవిత్వపాకములో, కథాసరళిలో, అలంకారములలో జీవితప్రదర్శనములో ఒకరికొకరు తీసిపోరు కాళిదాసు షేక్సు పియరులు. కాని కాళిదాసులోని లాలిత్య మాధుర్య గంభీరతలకు షేక్సుపియరు కొంచెము తగ్గినాడు. కాళిదాసు గౌరీశంకర శిఖరము (ఎవరెస్టు). షేక్సుపియరు ధవళగిరి.

ఈరీతి నింగ్లీషులో నుపన్యసించు భర్తయొక్క భాషగాని భావములుగాని సంపూర్ణముగ గ్రాహ్యము గాకపోయినను శారద విస్ఫారిత నేత్రములతో నందమగు మోముతో, ఆకర్షింపబడి పరవశమైన హృదయముతో నట్లేకూర్చుండి భర్తవంక అనిమిషయై చూచుచున్నది.

చీకట్లు దిశల ప్రసరించుచున్నవి. సాయంకాలపు వెలుగు లా గదిలోనికి దొంగిచూచుచున్నవి. తోటలోని పూవుల సువాసన జగత్తును పరిమళ వివశత్వమున మూర్ఛముంచినది. పశ్చిమారుణచ్ఛాయ యొండు గవాక్షమున లోన బ్రవేశించి శారదమోమును వెలిగించినది. ప్రణయతపస్సిద్ధికై, తన ప్రణయాధిదేవియే ప్రత్యక్ష మైనట్లాతని కామె గోచరించినది.

ఇంతలో ఉల్కయొకటి మెరసిన ట్లామోములో మార్పులు జనించినవి. ఆ మోము శ్యామసుందరీదేవి మోమైనది. శ్యామసుందరి తన్నతి ప్రేమతో దిలకించి నట్లాతనికి దోచినది. శ్యామసుందరి చిరునవ్వునవ్వి, లేచి, చేతులుచాచి తనకడకు వచ్చి తనపై వంగినది. ఆమె యూపిరి పరిమళములు తన్నలమి నట్లయినది. అతడు, రక్తము వేడియై దేహమెల్ల ప్రవహింప, హృదయము హోరులెత్త, ఆమె

మెత్తని చిగురాకు పెదవులు తన పెదవులపై తగిలినట్లు భావించినాడు. ఇంతలో నామె తన్ను గౌగిలించి నట్లయినది.

ఆమె తమిదీర తన్నతి మోహావేశమున చుంబన మొనరించి నట్లాతడు తన భావపథమం దూహించి చటుక్కునలేచి తన పడకగదిలోనికి రెండడుగులలో జేరినాడు.

ఆతండుచకితుడై బాణహతిచే సుడివడిపోయి రెక్కలు టపటప కొట్టుకొను గువ్వపిట్టవలె హృదయము చలించిపోవ నిట్టూర్పు నించుచు పర్యంకము జేరినాడు. ఆతని కన్నులెఱ్ఱవారి పోయినవి. కణతల చిరుచెమ్మటలు నిర్మలాకాశాన నల్లని మేఘశకలములవలె పొడసూపినవి.

ఏమిది ? మనస్సులోనైన నా బాలిక శీలము చెరుపవచ్చునా ? అది పాపము ! పవిత్రమగు నాత్మకూడ పంకిలమ్మగు ననునంత పాపకార్యమది. ఎంత గర్హ్యము !...........

ఎట్టయెదుట తనఇల్లాలుండ, బరగాంతపై దనకీ యసమయావేశ మేలజనింప వలెను. భార్యను తాను ప్రేమింపకూడదా ? అయినచో నామెయే తన్ను చేరవచ్చి నట్లు తన యింద్రియములకు మించిన శక్తి తన్నట్లు కదల్చివేసినదా ?

శ్యామసుందరి యను భ్రాంతికి గారణము తనలోనున్న కల్మషమే. అయి నను తాను ద్రోహము చేయుటా ?

శ్యామసుందరీదేవి పవిత్రచరిత్ర కావుననే యాతడామెతో స్నేహము చేసినాడు. వ్యక్తికి స్నేహము పాపమా ? గర్హ్యమా ? పురుషుడు వనితలతో నేల స్నేహము చేయరాదు. పురుషుని పురుషుని ప్రేమలతల పెనవైచు స్నేహము పవిత్రమైనచో, మగవానిని వనితను సువాసనాబంధముల జేర్చివైచు స్నేహము మాత్రమేల పవిత్రము కారాదు ?

పురుషుల పరస్పర ప్రేమగూడ ధనలాభాది వ్యాజమూలకమై నీచమగును. స్త్రీ పురుష స్నేహములో నంతకంటె నీచమగు కారణముండుటకు వీలున్నది. స్నేహము పవిత్రమంటారు. స్నేహములేని పురుషుని మొరడనియు, శ్మశానము లోని చెట్టనియు నందురు. మిత్రకోటిలో మైమరచువాని బంధు సముద్రుడంటారు.

అట్టియెడ, పురుషునకును వనితకును స్నేహమేల పనికిరాదు. ఎట్టి సత్పు రుషుడైనను ఒక బాలికతో నెంత నిర్మల స్నేహాన మెలగినను గుసగుసలు, తేరి పార చూపులు, పెదవి విరుపులు. ఓహో !

యౌవనమందున్న స్త్రీ పురుషులకు మాత్రము పవిత్రస్నేహము సాధ్యమేల కారాదు !

శ్యామసుందరితో దన స్నేహము పవిత్రమైనదా ? ఏమూలమూలలనైన పవిత్రతకు దూరమగు నర్థ మేమైన గలదా ?

౨

## మోహావేశము

రాజేశ్వరరావు పుష్పశీలయు, నీ ఆరు నెలలు మోహావేశపరవశులయి తిరిగి నారు. రాజమహేంద్రవరమునుండి హైదరాబాదు, హైదరాబాదు నుండి ఢిల్లీ, ఢిల్లీ నుండి కలకత్తా, కలకత్తానుండి బొంబాయి. రెండవతరగతిలో నిరువురకుమాత్ర ముందు పెట్టెపుచ్చుకొనువారు స్టేషనుమాష్టరు చేతిలో రెండు, గార్డుచేతిలో రెండు, లంచము. అంతే! ఆతడే మహారాజు!

అజంతా మొదలగు ప్రదేశములకు గూడ నాతడు వెళ్ళెను. అంతటను బంగాళాలు మకా . ఎప్పుడు పుష్పశీలయే యెదుట నుండవలెను. ఎప్పుడు మోహావేశమే. పుష్పశీలకాయారు నెలల కాలము తృటిలో వెళ్ళిపోయినది. రాజే శ్వరు డామెను పూవువలె చూచుకొన్నాడు. మహారాణివలె నాదరించినాడు. ఆమె యేదికోరిన నది యిచ్చినాడు. ఆరునెలలు తిరిగి తిరిగి వారిరువురు హైదరాబాదు వచ్చినారు. అచ్చట నాతడు ఉద్యోగమునకై ప్రయత్నింప నారంభించెను.

రాజేశ్వరునకు దూరపుచుట్ట మగు బందరు నాయుడుగా రొక రచట పెద్ద 'యింజనీయరు.' ఆయన రాజేశ్వరునాదరించి నెలకు నూటయేబది మొగలాయిరూకల జీతముతో నారంభించి సంవత్సరమునకు పదిచొప్పున రెండువందల యేబది వరకు హెచ్చుపద్ధతిని, సహాయ ఇంజనీయరుగా నవాబుగారు కట్టించు 'నైజాముసాగర్' అను పెద్ద చెరువున బనిచేయుట కేర్పరచెను.

పుష్పశీలపై నెయ్యమున రాజేశ్వరుడు గూడ మాంసాదుల వర్జించెను. ఆమెయు భార్యవలె సంచరింప దొడంగెను. తాను కాపుపిల్లనైతినని యామె భావించుకొన్నది. వారిద్ద రాచెరువులో బనిచేయు నింజనీర్లకై యుద్దేశింపబడిన యొక బంగాళాలో కాపురముండిరి.

సుబ్బయ్యశాస్త్రిగారికి మతిపోయినది. స్వతంత్ర ప్రేమసంఘము నాయన నొవ్వ తిట్టినాడు. అగ్నియైనాడు. ప్రపంచము మ్రింగివేయుదమన్నంత కోపము వచ్చినది. రాజేశ్వరరావింటికిబోయి యాతని వృద్ధమాతపై మండిపడి దుర్భాష లాడుటచే వారు సేవకునిచే నాతని గెంటించివైచిరి. ఇంటికివచ్చి భార్య వస్తువులు చూచి యేడ్చినాడు. ప్రపంచమున నెవ్వని నిక నమ్ముట? ఛీ! ఛీ! పురుషుడన్న వాడు పెళ్ళిచేసుకోవాలి పరభార్యల నపేక్షించుట ఎంత హీనము. తా నిదివరకు చేసిన పొరపాట్లున్నవి. అవి తాత్కాలికములు. కాని ఈ దారుణ మేమి? దీనికి శిక్షాస్మృతి ననుసరించి పరభార్యాపహరణముక్రింద నభియోగము గొనివచ్చి ఈ పిశా చిని ఈ చండాలుని రక్తము పీల్చవలెను.

కాని! అభియోగము దాఖలు చేసినచో నిదివరకే తలవంపులుగానున్న తనకు మరియు దలవంపులగును. ఆడవారివల్ల లోకాలు పాడవుచున్నవికదా.

అతడు వీధివెంట జనుచున్నప్పుడందరు తన్నుచూచి హేళనచేయుచున్నట్లు భావించుకొన్నాడు. అభియోగము జేసినచో వ్రేలుతో చూపించి మరియు హేళనము చేయుదురేమో, మరియు దుర్భరపు బ్రతుకగును.

రాజేశ్వరరావుకు జమీందారుగారి యల్లుడగు నారాయణరావుగారు స్నేహితుడని యాతనికి దెలియును. చెన్నపట్టణముపోయి ఆయన సహాయ మడిగినచో నుపయోగించునేమో ?

ఆ యాలోచన జనించిన రాత్రియే చెన్నపట్టణము వచ్చినాడు సుబ్బయ్యశాస్త్రి. తిన్నగా నారాయణరావుగారి యింటికి వచ్చి నారాయణరావింటికడ లేకపోవుటచే నొక హోటలుకు బోయి సామానచ్చటబెట్టి, స్నాన మాచరించి, భోజనముచేసి నారాయణరావుగారి మేడకు వచ్చెను. అప్పుడే వచ్చి నారాయణరావు భోజనముకడ కూర్చున్నాడు.

నారాయణరావు భోజనముచేసి యీవలకు వచ్చుటతోడనే, సుబ్బయ్య శాస్త్రిగారు లేచి నమస్కరించెను. నారాయణరావు సుబ్బయ్య శాస్త్రిగారి నెరుంగును. ఆయనవచ్చిన పని నిమేషమున నాతని కవగతమైపోయినది.

'సుబ్బయ్యశాస్త్రిగారూ! నమస్కారము దయచేయండి.' అని యాతడన్నాడు.

సుబ్బయ్యశాస్త్రిగారికి కన్నుల నీరుతిరిగినవి. నారాయణరావు తెల్లబోయినాడు.

'అదేమిటండి శాస్త్రుల్లుగారూ, మీరు వచ్చినపని తెలుస్తూనేవుంది. వాళ్ళు తిరిగి హైదరాబాదు వెళ్ళినారట. అచ్చట ఆతనికేదియో యుద్యోగము దొరికినదట. నన్ను వెళ్ళి ప్రయత్నము చేయమని మీ యుద్దేశమైతే నేనీరాత్రి బయలుదేరి వెళ్తాను. ఇదివరకే అనుకుంటున్నాను. కాని అతను దేశాలు తిరుగుతున్నాడు. మీరుకూడా వచ్చి హైద్రాబాదులో ఉండండి. భగవంతుడు మన ప్రయత్నం నెరవేర్చకమానడు.

'చిత్తం! నేను నాశనం అయిపోయానండి. ఈ ఆరునెలలు నేను పడిన బాధ నా విరోధికైనా వద్దండి. మర్యాదగా బ్రతికినవాణ్ణి. ప్రజలు అన్నివిధాల నన్ను హేళనచేస్తున్నారు. ఎన్నిసార్లో గోదావరిలో పడిపోదామనిన్నీ, విషం పుచ్చుకుందామనిన్నీ తోచింది.'

'అలాగా!'

లోకపు మెప్పుగోరి, మంచి చేయుటయు, నిందకోడి చెడు చేయకుండుటయు గొప్ప కాదు. లోకమే మనశీలమును గాపాడుచున్నదా? హరిశ్చంద్రాది నాటకాలలో నీ భావములు వెల్లడించి ఈ నాటకగ్రంథకర్త లెట్టి ద్రోహమాచరించుచున్నారు! మనము మంచిచేయుట మంచికొరకుగాని, లోకము కొరకా? ఓ భరతమాతా! నీ కెట్టి కళంకము తెచ్చుచున్నామమ్మా. మేము చేయు మంచిచెడ్డలు సంఘమును కొను దానిపై నాధారపడి యున్నవికదా! మంచికదా యని మంచిచేయుటకాదు. చెడుకదా యని మానివేయుటకాదు. హరిశ్చంద్రుడు నిజమాడిన, ప్రజలు హరిశ్చం

ద్రుడు, సత్యమాచరించినాడని చెప్పకొనవలెననియా ? అందులకా, అత డావ్రతము పట్టుట ? అని నారాయణరా వనుకొనెను.

ఆరాత్రి వారిరువురు బెజవాడమీదుగా హైదరాబాదు ప్రయాణమైపోయిరి.

హైదరాబాదునుండి నైజామునాగరు వెళ్ళిరి. ఊరిముఖమున నొక యాత్రికుల బంగాళాలో సుబ్బయ్యశాస్త్రిగారు దిగినారు. నారాయణరావు రాజేశ్వరరావును కలిసి కొనుటకు వెడలిపోయినాడు.

రాజేశ్వరుని కుద్యోగమై పదునైదు దినంబులైనది. అతడందరితో, దోడి యధికారులతో, పైయధికారులతో, వ్యాపారులతో మంచిగా సంచరించుచుండెను. ఆ పదునైదు దినంబులలోనే యాతడన్న నందరు గౌరవముజూపుచుండిరి. రాజేశ్వర రావు తోడియధికారి యొక మహమ్మదీయ యువకుడున్నాడు. అత డొక నవాబుగారి కొడుకు. ఆ నవాబుగారికి నైజాము ప్రభుత్వములో జాల పలుకుబడి యున్నది. ఆ యువకుడు హైదరాబాదులో ఇంజనీరింగు చదువుకొన్నాడు. పలుకుబడిచే నాతని కా యుద్యోగ మిప్పించినారు.

ఆ యువకునకు రాజేశ్వరరావునకును మిక్కుటమగు స్నేహము కలిగినది.

రాజేశ్వరరావు స్వతంత్రప్రేమ సంఘములో నిజమగు సభ్యుడుగాని, స్వలాభమునకై యందు జేరలేదు. తనయం దిష్టములేని స్త్రీ నెప్పుడు నాతడు బలవంతము చేయలేదు. తాను మోహించిన యువతి యొకనాటితరువాతనైన తన యిష్టము వేరొకనిమీద ప్రసరింపజేసినప్పుడా యువకుడు హృదయమున నిసుమంతయు నసూయ పడక, ఆ యువతిని వదలివేయువాడు, జుగుప్స నొందలేదు. అతని హృదయ మిసుమంతయు బాధ ననుభవించలేదు. తాను పెళ్ళి చేసుకొన్న భార్య పరుని గోరినచో నామె కోర్కె దీర్చుట కాతడు సంసిద్ధుడనని హృదంతరమున సంకల్పించుకొనియే యున్నాడు.

పుష్పశీలయు దానును రాజమహేంద్రవరమునుండి బయలుదేరినప్పుడే యాతడు సుబ్బయ్యశాస్త్రిగారి కిట్టి యుత్తరము వ్రాసి టపాలో వేసినాడు.

‘ ఆర్యా ! మనం ఒక విచిత్ర సంఘంలో చేరిన సభ్యులం. ఆ సంఘంలో ఉన్న నియమాలు జరుపుటకు మీరు ప్రమాణం చేశారు ! ఇంక ఆ ఉద్దేశాలేమిటి.

1. ఆడవాళ్ళు ఇన్ని యుగాలనించీ మగవాళ్ళకు బానిసలై ఉంచుటచేత, వారి బానిసత్వం తొలగచేయుట, వారికి పురుషునికున్న సర్వ స్వతంత్రాలు ఇచ్చుట.

2. వివాహము అన్నది వ్యక్తిత్వాన్నిచంపి మానవుల్ని సంసారానికి బానిసల్ని చేస్తూఉన్నది. కాబట్టిన్నీ, ఈవివాహం అనేసంస్థ పురుషుడు స్త్రీని తనకుబానిసచేసుకోడానికే యేర్పాటు చేసుకున్నది. కాబట్టిన్నీ, సదరువివాహం అనేసంస్థను రూపుమాపి దానిస్థానే స్త్రీ పురుషులకు సమానహక్కుల్ని యిచ్చే సంస్థను ఏర్పాటు చేయడానికిన్నీ,

3. ఈ ఉద్దేశాన్ని ఆచరణలో పెట్టడానికి మన సంఘాధ్యక్షులగు తిరుపతి రావుగారు మనకు దినచర్య సూత్రాలు కొన్ని నియమించారు కదా. (a) ఎప్పటి

కప్పుడు కనబడినవారికెల్ల మన సంఘోద్దేశాలు చెప్పి సభ్యులను చేర్చుకోవడం (b) వివాహము చేసికొనని పురుషుడు వనితతో, వనిత పురుషునితో స్నేహమున కలసియుండవలెను. వారు ప్రేమకొరకై యట్లున్న మరియు నుత్తమము. (c) వివాహము చేసికొన్న సభ్యులు తమ భార్యలకు స్వాతంత్ర్యమిచ్చి వారి యిష్టానుసారము సంచరించుటకు సమ్మతింపవలెను.

"ఈ మూడు ముఖ్యసూత్రాలను దమరు గమనించవలెనని ప్రార్థిస్తున్నాను. నేను మీ భార్యయైన పుష్పశీలాదేవిని ప్రేమించాను. ఆమె నన్ను ప్రేమించినది. కాబట్టి యీ ప్రేమ సాఫల్యం చేసుకోటానికి మేము దేశాలు తిరుగుతున్నాము. మీ ప్రమాణం జ్ఞాపకం చేసుకోండి. ఎప్పుడు పుష్పశీల నాపై ప్రేమను మరుస్తుందో ఆనాడు తిరిగి మీ యింటికి, వస్తుంది. పుష్పశీలకూడా నా ఉద్దేశమే బలపరుస్తున్నది. అందుకనే ఆమెకూడా ఈ ఉత్తరంలో సంతకంచేస్తూ ఉన్నది.

మీ ప్రియమిత్రుడు రాజేశ్వరరావు.

'పై ఉత్తరం అంతా నాయిష్టంపైనకూడా వ్రాయబడింది. మీ మిత్రురాలు పుష్పశీల.'

ఈ ఉత్తరంచూచి తల బ్రద్దలు కొట్టుకున్నాడు సుబ్బయ్యశాస్త్రి. ఆ ఉత్తరం సంగతిని యాలోచించుకొనుచు సుబ్బయ్యశాస్త్రిగారు నిట్టూర్పు నించుచుండ నారాయణరావు రాజేశ్వరు డింటలేడనియు, బనికై బోయినాడనియు తెలుసుకొన్నాడు. నారాయణరావు గబగబ నడచుచు కూలీల, గుమాస్తాల, చిన్న యుద్యోగుల నడుగుచు రాజేశ్వరరావు పనిచేయు స్థలమునకు బోయెను.

రాజేశ్వరరావు నారాయణరావును కనుంగొనగనే తెల్లబోయినాడు. అతనికి జిరుచెమ్మటలు పట్టినవి. ఒక్కపరుగున వచ్చి నారాయణుని కవుగిలించుకొన్నాడు. 'నారాయణా నువ్వేనట్రా వచ్చింది. నువ్వేట్రా! ఏమిటిది. ఎందుకువచ్చావు ఎల్లా వచ్చావు? ఎపుడువచ్చావు? రా! రా! మాయింటికి వెళ్ళావా? ఎవ్వరున్నారు?'

'వెళ్ళాను. అక్కడ ఒక మహమ్మదీయ, యువకుడు చాలాడాబుగా ఉన్నాడు. అతడూ ఒక చక్కనిపిల్ల పుష్పశీల కాబోలు, తేయాకు బల్ల ప్రక్క కుర్చీలలో కూర్చుని ఉన్నారు. నన్నుచూచి మహమ్మదీయ యువకుడు ఈవలికివచ్చి నువ్విక్కడున్నావని చెప్పాడు. నీ బంగాళాకూ ఇక్కడకూ రెండు మైళ్లుందిరాఅబ్బా!'

## ౬

## వ్యాధికిమందు ఆయువుకు మందులేదు

సాధుశీల, సత్యహృదయ, సూరమ్మకు నెంతయోజబ్బుజేసినది. ఆమెకు పురిటిలో జేసిన జబ్బు నిశ్శేషము కాలేదు. చిక్కి శల్యమైనది. తిండి సహించుట లేదు. ఎప్పుడు తలనొప్పులు చిన్నచిన్న జ్వరములు.

రాజారావు తన భార్య పుట్టింటికడ అలతి రోగములచే కృశించుచున్నదని, తనకడకు గొనివచ్చి, యామెకు వైద్యముచేయ నారంభించెను. బలమునకై మందు లిచ్చెను. దేహములో నెచ్చటనైన రోగపదార్థ మున్నదేమో యన్న భయాన 'స్ట్రెప్టోకాకయి' మందు నరముల ద్వారమున లోనికిచ్చెను. క్షయయేమో అని భయముపుట్టి జాగ్రత్తగ పరీక్షచేసినాడు ఎక్కడను ఆ జాడయైనలేదు. అంతకంతకు రోగము ప్రకోపించి రాగమున బడినది.

మలేరియా జ్వరమేమోనని యాలోచన కలిగినది. సబ్ టెర్షియన్ మలేరియా యేజబ్బునైన అనుకరించును. అతడు క్వినయిను లోపలికి వాడినాడు. సూదివెంట నెక్కించినాడు. జ్వరము రోజుకు నూరుదగ్గర మొదలిడి నూటమూడు-డిగ్రీలవరకు నెక్కుచున్నది. ఆమె చిక్కిపోకుండ ద్రాక్షపంచదార, కోడిగుడ్డుసొన, బార్లీనీరు, పాలవిరుగుడునీరు ఇవి యన్నియు నామె కిప్పించుచుండెను. అత్తవారు వచ్చినారు. తనచుట్టములు వచ్చినారు. సూరమ్మకు జబ్బు విజృంభించినది. రాజారావు తన మిత్రులగు నిరువురు పేరుపొందిన వైద్యులకు తంతులనిచ్చి రప్పించుకొన్నాడు. వారువచ్చి యెడతెగక వైద్యముచేసినారు. ముగ్గురు జాగ్రత్తగ గ్రంథములు పరిశీలించి యాలోచించి వైద్యముచేసిరి. సన్నిపాత (టైఫాయిడు) జ్వరముకాదని నిర్ధారణచేసినారు. రక్తము, మలము, ఉమ్మి గిండికి పంపికూడ పరీక్షచేయించినారు.

ఊపిరితిత్తులు శ్లేష్మముచే నిండ 'అయొడిను ఏఫిడ్రిను' ఇచ్చినారు, తగ్గిపోయినది. గుండె అతి నెమ్మదిగ కొట్టుకొన్నది. నెమ్మదిగ ఏండ్రినాలిను మొదలగు మందులనిచ్చి యా గడ్డు దాటినారు. తడిగుడ్డలు తడిపి పొత్తికడుపుపైవైచి వైద్యము చేసినారు. పై లక్షణములన్నియు దగ్గినవి.

గుండె బలముగా నుండుటకు 'డిజటాలిస్' అను మందు, లోన పేగులలో విషములు చేరకుండుటకు 'డైమాలు', మూత్రకోశము శుభ్రముగ నుండుటకు ఎక్సమీను, మొదలగునవి యిచ్చుచు నతి జాగ్రత్తగ వైద్యము చేయుచునేయుండిరి. 'చోప్రా' మొదలగు మహానుభావులు పాశ్చాత్య వైద్యములోనికి గొనివచ్చిన ఆయుర్వేదౌషధముల నాసవముల నుపయోగించినారు.

ఇతర జబ్బులు వచ్చి తగ్గుటయేకాని అసలు జ్వరము తగ్గలేదు.

రాజారావు చుట్టములలో నొకడు గొప్ప యాయుర్వేద వైద్యుడువచ్చి చేయి చూచి పెదవి విరిచి రాజారావుకడకుపోయి 'ఏమిచేయ దలచుకొన్నావురా? అబ్బాయీ' అని అడిగెను.

రాజారావు "ఏమిచెప్పను మామయ్యా! ఈ రోజో రేపో అనుకుంటున్నాము. వ్యాధికి మందున్నది, ఆయుస్సుకు లేదు అని నాకీనాటికి తెలిసివచ్చింది" అనుచు నిట్టూర్పు విడిచెను.

భర్తయగు రాజారావును, తన బిడ్డలను నితర చుట్టములను వదలి, సూరమ్మా దేవి దివంగతురాలైనది.

భార్య బ్రతుకదని రాజారావుకు దోచినప్పుడే నారాయణరావుకు తంతినిచ్చి నాడు. నారాయణరావు హైదరాబాదు వెడలి ఇంకను రాలేదు. పరమేశ్వరుడు తిరిగి హైదరాబాదుకు తంతినిచ్చి తాను తక్షణం బయలుదేరి, అమలాపురం వెడలిపోయెను. పరమేశ్వరుడు వెళ్ళిన నాలుగు గంటలకు సూరమాంబ దేహము చాలించినది.

ఆ బాలిక తలిదండ్రులు, అన్నదమ్ములు, రాజారావు తల్లిదండ్రులు వచ్చినారు. ఇల్లంతయు చుట్టాలతో నిండి గొల్లుమనిపోయినది. రాజారావు స్తబ్ధుడైపోయినాడు.

కొత్తపేటనుండి సుబ్బారాయుడుగారు, జానకమ్మగారు వచ్చినారు. శ్రీరామమూర్తి రాజారావింటికి రాని నిముషము లేదు.

ప్రాణముపోవుముందు సూరమ్మ భర్తను బిలిచి యాతనికి రెండుచేతుల నిమ్మదిగ దరికి చేర్చి నమస్కరించి, 'పిల్లలు - మీకు - చెప్పనక్కరలేదు. మళ్ళీ - వివాహం - చేసుకోండి' అని - కన్నుల మూసికొని మరల తెరచినది. అప్పుడామె మోమున పారలౌకిక కాంతి ప్రజ్వరిల్లినది. ఆమె చిరునవ్వు నవ్వుచు, ప్రక్కనే భగవద్గీత చదువుచుండిన మామగారిని చూచి, మామగారికి నమస్కరించి 'కృష్ణా! కృష్ణా!' యని ప్రాణము వదలినది.

ఆయమ తల్లి తండ్రులు లా శవముపై వ్రాలి రోదించిపోయినారు.

'తల్లీ! నువ్వు భూదేవతవు. మాకెప్పుడు చాకిరీ చేసేదానవు. నా కొడుకు వల్ల కాకపోయినా నీ వల్ల ముక్తిపొందుదామనే అనుకున్నాను. అందరికి తల్లోని నాలికలా ఉండేదానవు.

'నా తల్లీ! నా బోటి నిర్భాగ్యురాలికి నీ వంటి కోడలు ఎలా దక్కుతుంది సూరమ్మతల్లీ!' యని రాజారావు తల్లి గుండెలవియ విలపించినది.

రాజారావుకు ఇరువు రాడపిల్లలు పెద్దపిల్ల ఆరేండ్ల బాలిక. రెండవది మొన్న పుట్టిన చంటిబిడ్డ. వీరిరువురకుమధ్య నొకయాడుపిల్ల పుట్టిపోయినది.

రాజారావు ధీరత్వముతో తనదుఃఖమునంతయు దిగమ్రింగి తిరిగాడు.

ఇంతలో నారాయణరావు రెండవరోజుకు వచ్చిపడినాడు.

రాజారావును దన హృదయమునకు జేర్చుకొన్నాడు. అక్కడ నారాయణుడు, రాజారావు, పరమేశ్వరమూర్తి మాత్రమేయున్నారు. రాజారావు వైద్యస్నేహితు లదివరకే వెడలిపోయినారు.

రాజారావు కంటివెంబడి అశ్రుధారలు ప్రవహించినవి. నారాయణు డోదార్చినాడు.

'నా బ్రతుకులో నా జన్మంలో ఉత్కృష్టభాగం మాయమైంది నారాయణా!'

'ఓయి తెలివితక్కువా? ఎక్కడికి మాయమైందంటావు. దేహం వదలి పోయిందంటావు. అయితే ఏం? ఆమె ఉత్తమవ్రత కావున మళ్లీ యెత్తేజన్మ, జన్మరాహిత్యం చేసుకునేందుకనే ఎత్తుతుందిరా!'

'ఎంత సమాధాన పరచుకున్నా మనసు కుదుట పడడం లేదురా'

అవునులే: ఎంతనుకున్నా మానవమాత్రులం. ఈ మానవ జన్మలో ఎన్నో మనం చెప్పలేకపోగలుగుతున్నాము. అనుభవించ గలుగుతున్నాం. ఈ జన్మలోంచే మనం తరించేదిగూడాను. అంత జబ్బు ఎలాచేసిందిరా, డాక్టరు ఆంజనేయులు, డాక్టరు నాగరాజుకూడా వచ్చారన్నావు. అవ్వా? అదేమిటోయి. మీరెవ్వరేమిటో చెప్పుకోలేని జబ్బుకూడా ఉంటాంట? ఇంతకూ మనకు దురదృష్టం రాసి ఉన్నదిలే. లేకపోతే అటువంటి విచిత్రరోగం రాదు. అదేమిటిరా పరం! కళ్ళనీళ్లు తుడుచుకో! వట్టి వెలహృదయం నువ్వూనూ! రాజారావూ! నీ కళ్ళనీళ్లుచూసి పరపుం కూడా గంగానదిలో యమునను సంగమం చేస్తున్నాడు. మొన్న నే చూసినట్టు ఉందిరా? అప్పుడు బతికించుకున్నావు. ఆ రోజుల్లో నువ్వు చూపించిన ప్రజ్ఞ ధన్వంతరిని తలపించింది. అట్టి సుశీల, పరమసాధ్విని చూట్టం అరుదురా. దేవుడు ఎవరికీ ఉపకారం చేయడేమో, ఆ పని మనుష్యులగోల ఏమిటి? 'మా తల్లి! మా తల్లి!' అని ఒకటే యేడుపు'

'నారాయణ! అదిగో ఆ పనిచేసే మనిషి, అక్కడ కూర్చున్నవారిలో గుమ్మం దగ్గిర రెండోది. అది మా అమ్మాయి బంగారుబిళ్ళ లెంపుకొనిపోతూ ఉండగా, మా నౌకరు పట్టుకున్నాడు. పోలీసువాళ్ళకు అప్పగించాలనుకున్నా; నా భార్య కన్నులువిప్పి చెల్లబోయి,

'అదేమిటండీ! మీ హృదయం గాంధీగారి బోధలు మరిచిందా! పోనీ లెండి! దాన్ని వదిలేయండి. తప్పని గట్టిగాచెప్పి వదలివేద్దాం. దాన్ని మానిపించ వద్దు?' అని సన్నసన్నగా చీవాట్లు పెట్టింది. నేను వైద్యంచేసి బతికించిన అమ్మాయి భర్త ఇక్కడ పోలీసు జవాను. మా యింటిలోని దొంగతనము సంగతి తెలిసికొని, చరచర మా యింటికివచ్చి, కేసు పెడతాననీ, అనుమతి యివ్వండనీ అడిగాడు. మా ఆవిడ ఒప్పుకోలేదు. ఆనాటినుంచి ఆ పనిమనిషి నమ్మకం ముద్ద అయిపోయిం దోయి!'

'అవునోయి, సూరమ్మనుగూర్చి నువ్వు నాకు చెప్పడమా? నా చెల్లికన్న ఎక్కువ ప్రేమ, నా తల్లికన్న ఎక్కువ ఆదరణ చూపించేది.'

రాజారావు తన హృదయమంతయు స్నేహితు లిరువురికడ వెళ్ళబోసి కొన్నాడు.

తాను వేదాంతము చదువుటయందు సర్వమూ మరచిపోవువాడు. వైద్యము నందు మునిగియుండువాడు. ఇంటిలో నేమియున్నదో ఏమిలేదో యను విచారణ ముతో నాతని కవసరముండునదికాదు. ఎంతమందియో చుట్టాలు వచ్చువారు! సూరమ్మ తనహృదయ మెటిగి చరించు సుశీల! గృహలక్ష్మి వృద్ధులగు నత్తమామ లకు, భక్తిమెయి పరిచర్య జరుపునది. తన భార్యయన్న హృదయమున నెంత ప్రేమయున్నను ఒక్కనాడైన తాను నిండారుప్రేమను భార్యతో మాటలాడుకొన లేదు. ఆయమకు దనభర్తమనస్సేమి కష్టపడునో యన్నభయమే.

'ఆమెను నా బిడ్డలకు తల్లి అయ్యేందుకు ఉపయోగించానేగాని నాహృదయం నిండారిగా ఆమెతో మాట్లాడలేదు. ఇంకోచిత్రం ఏమిటంటే, చుట్టపక్కాలకు ఎప్పుడూ పతిభక్తి బోధిస్తూ ఉండేది. భాగవతము కంఠతా, అందులోని వేదాంతార్థాలు చెప్పేదిట. నాకు తెలియదు. ఆమె చక్కని గొంతుకతో పద్యములు చదువగలదు. అన్న సంగతే తెలియదు నాకు.' అని రాజారావు తలపోసి విలపించెను.

అంతకన్న అంతకన్న వారి చర్యలు వేదాంత పథముల విహరించినవి. జీవపరమాత్మల సంబంధము, జీవావతారము, పరమాత్మావతారము, జీవాత్మ పరమాత్మ సంధానము, సాంఖ్యజ్ఞానసిద్ధాంతము, యోగకర్మసిద్ధాంతము, కర్మజ్ఞాన మార్గముల సమీకరణము, పురుష ప్రకృతి వాద బ్రహ్మవాద సమీకరణము, గీత ఎట్లు చేసెనో గీతావాక్కు ప్రపంచములో మహోత్తమ గ్రంథ మెట్లాయనో, శ్రీకృష్ణు డెట్లు సంపూర్ణావతారమో అన్నియు చర్చించుకొన్నారు.

వేదము లిరువురు పురుషులేయన్నవి. సాంఖ్యము అనంతమగు పురుషులు, ఒక్క ప్రకృతియన్నది. ఉపనిషత్తులొక్క బ్రహ్మమునే తెలిపినవి. గీతలో శ్రీకృష్ణుడు వాటినన్నిటిని సమన్వయము చేసినాడు.

భగవంతుడే లేదనువారు, అనేక లక్షలు భగవంతు లున్నారనువారు, ఒక్కడే భగవంతుడున్నాడనువారు, మూడువిధములుగ జనులున్నారు. ఈ మూడు వాదనలను సమన్వయము చేసినాడు శ్రీకృష్ణుడు. సాంఖ్యము ద్వైతవాదమును కూడ మించిపోయినది. సాంఖ్యులు విశ్వకారణము నేమందురు? విశ్వము నావరించిన రెండు మూలసూత్రములు పురుషుడు ప్రకృతి. పురుషుడు సాక్షి. ప్రకృతి శక్తి.

సాంఖ్యము వెనుక యోగము చర్చించినారు. గీతలోని యోగమార్గము పతంజలి చెప్పినదికాదు. పతంజలి గీతకు కొన్నివేల వర్షము లిటీవలివాడు. యోగమునుగూర్చి అనుశ్రుతముగా పరంపరగా వచ్చినవానిని పతంజలి ప్రోగుచేసి, సూత్రరూపముల వెల్లడించినాడు. గీతలోచెప్పు యోగము పతంజలికెన్నో సంవత్సరముల పూర్వకాలమునాటి ఋషిసంప్రదాయ మగుయోగము.

ఆ వెనుక ఉపనిషన్మతమును గూర్చి చర్చించినారు. భగవద్గీత ఈ మూడింటిని ఎట్లు సమన్వయించినది చర్చించినారు.

సాంఖ్యులు, పురుషుడు ప్రకృతి. త్రిగుణములు. త్రిగుణ జనితములగు ఇరువది నాలుగు తత్త్వములు అను వానితో మొదలుపెట్టి, వెనుక నుపనిషత్తులు చెప్పిన క్షర, అక్షర బ్రహ్మములను జెప్పి ఈ రెంటికిని సమన్వయముచేయు పురుషోత్తముడు అని పరబ్రహ్మ వాదమును సిద్ధాంతీకరించును. క్షర బ్రహ్మయు ప్రకృతియే. అక్షర బ్రహ్మము సాక్షి. క్షరముతో సంబంధము లేక తనలో జనించిన క్షరమునుజూచుచు నుండును. క్షర బ్రహ్మము అక్షర బ్రహ్మస్వరూపమే. ప్రకృతిని లయించి ప్రకృతిని ఆటంక ప్రకృతిలో చేరియును తన స్వరూపమగు క్షరబ్రహ్మమును జూచుచుండును. అక్షర పురుషుడు ప్రకృతిలో జేరక ప్రకృతిస్వరూపమగు క్షర

౮

# అగాధము

నారాయణరాయని జీవితాంతర్గతమగు ప్రేమ ప్రవాహము మహావేగమున ప్రవహించి మాయిమగు చున్నది. విద్యుచ్ఛక్తి రెండు స్వరూపములట. అవి ఒక దాని కొకటి వ్యతిరేకములట. రెండును కలిసినగాని విద్యుచ్ఛక్తికాదట. అట్లే మానవుని ప్రేమయు ఎదిరిప్రేమ లేనిచో వ్యర్థమై జీర్ణించి పోవును. ఒకప్పుడా జీవిని మూలమునంట కదల్చి వేయును.

ఎన్ని యుగములకో, శారదకు మెలకువవచ్చుటయని యెదురు చూచు చున్నాడు. ఇంగ్లీషుకథలో చెప్పిన 'నిదురసుందరి' ని మేల్కొల్పగల ముద్దు తన బ్రతుకులో లేదా? తానా రాజకుమారుడునుగాదా? యని యాత దనుకొన్నాడు. ఎన్నిసారులో దననిశ్చయమును మరచి యా బాలికను దరిచేర్చుకొని తనలో నైక్య మొనరింప దలచుకొన్నాడు. ఆ బాల వట్టి విగ్రహమువలె చైతన్య రహితమా యున్నట్లున్నది.

ఇటు శ్యామసుందరి ఉత్తమ మేధాసంపన్నురాలు. కర్మయోగిని. వైద్య వృత్తిచే రోగి నారాయణసేవ జేయ సంకల్పించినది. వైద్య వృత్తిచే వచ్చుధనమ్ము దేశసేవకై వినియోగించెదనని యామె దీక్ష. ఆ బాలిక తన సహోదరి. ఆమె సంగీతము నేర్చుకొన్నది. పరమేశ్వరునికడ పాటలు వ్రాయ నేర్చుకొన్నదట! ఏమి పట్టుదల. ఆమె హృదయమెంత సున్నితము. ఎంత ప్రేమమయము. ఆమె వైద్యురాలై యెట్లు మనగలదు? నీవుశస్త్రచికిత్స చేయగలవా యని తాను ప్రశ్నింప, 'వజ్రాదపి కఠోరాణి, మృదూనికుసుమాదపి, యని చదివినది. ఇట్టి యుత్తమాంగనలు దేశమాతకు భూషలుగదా?

ఈ యాలోచనలతో దానును బరమేశ్వరుడు కారునెక్కి శ్యామసుందరీదేవి యింటికా రాత్రి వెళ్ళినారు. అప్పుడు శ్యామసుందరి దీక్షగా పరీక్షకై చదువుకొను చున్నది. మనవారిని చూచి మోము ప్రఫుల్లమైపోవ తన సహజమగు నొయారపు నడకతో వచ్చి డాబామీద నున్న కుర్చీలసర్ది, రండని వారితో నచ్చట కూర్చున్నది. పరమేశ్వరుడు రోహిణి యేదని యామెను వెదకుచు లోనికి బోయినాడు.

పదియేను నిముషములు వారేమియు మాటలు లేక కూర్చుండినారు. ఆమె నలముకొన్న భక్తి యాతని చుట్టివేసినది. ఆమె తలవంచుకొని యేమి యాలోచించు కొనుచున్నదో, సముద్ర పవనములు శీతములై హాయిగ వీచుచున్నవి. తారకలు తమ కాంతిరకముల నెమ్మదిగ పన్నీరు చల్లుచున్నవి.

చటుక్కున నారాయణరావు తలయెత్తి 'చెల్లీ! నువ్వు పాటలు చేయు చున్నావని పరమేశ్వరుడు చెప్పాడు. ఒకపాట పాడ్తావా?'

'అదేమిటన్నా! పరమేశ్వరం అన్న, కొంటె అన్న. ఏమిటి నా పాటలు!

'పాడమ్మా! నా దగ్గిరకూడానా నీకు సిగ్గు.'

'పాడుతాను. మరి నువ్వేమీ అనుకోకుండా ఉండాలి. నీ వంటి వారిదగ్గర పాడుటకు చాలా ధైర్యం ఉండాలి అన్నయ్యా!'

'నేను కొట్టనుగద!'

'ఏమో ఎవరికి తెలుసును?'

'పాడుమరి. శ్రుతివద్దు, నీ కంఠంలోనే ఉంది శ్రుతి'

'వదినగారి కంఠంలో ఉన్నశ్రుతి, ఎవరి కంఠంలో ఉంది?'

'ఏమి లాభం?'

'అదేమిటన్నా.'

'ఏమీలేదు తల్లీ, ఏమీలేదు. శ్యామా! పాడు' ఆతనికంఠమున శ్రుతిమారినది.

చటుక్కున శ్యామసుందరి లేచి 'అన్నయ్యా! నీ ఆత్మ పరమ పవిత్రమైనది' అని అన్నది. ఆమె కూర్చుండినది. శారద నారాయణరావుయొక్క ఉత్కృష్ట జీవితరాగానికి శ్రుతి కాలేకపోయినది కాబోలు. ఈ యువకుడు తన గంభీర హృదయంతో, మొక్కవోని మనస్సుతో తలవాల్చి ముందుకే నడుచుచున్నాడు. శారద ఈ పుణ్యచరిత్రుని ప్రేమించుటలేదా? అవును అవును. ఆమెకు ఒక్కసారి మబ్బుచాటుననుండి వెన్నెల ప్రసరించి నట్లయినది. శారద చరిత్ర ఇప్పుడొక్కసారిగా అవగత మైపోయినది. శారద నారాయణరావును ప్రేమించుటలేదు.

ఎందుకు ప్రేమించుటలేదు? అయ్యో శారద ఎంత మూర్ఖహృదయ! ఎక్కడను ఈతడు తన రహస్య మిసుమంతయు నితరులకు దోపించక సంచరించుచున్నాడే. శారద! నీ వెంత దురదృష్టవంతురాలవు! నీ హృదయమున కర్కశత్వమున్నదా? నీ రూపమంతయు విగ్రహరూపమా? నీలోన నే మాత్రము ప్రేమలేకుండ నుండవలె. నీవు మరుభూమివా? ఏమి యీ విషాదము; ఈ విచిత్ర నాటిక, ఆమె భావములు వెలుగువలె ప్రసరించినవి. ఆపరాని దయ ఆమె నావరించిపోయినది. అశ్రులు తిరిగినవి. ఆమె మైమరచిపోయినది. తిన్నగ నారాయణరావు కడకు బోయినది.

ఆమె అతని తలను దనహృదయమున నదుముకొన్నది.

ఒక్కసారిగా ఇరువురకు దేహములు కంపించినవి. వార లిరువురి రక్తములు వేడియై పోయినవి. అప్రయత్నముగ నారాయణరావు శ్యామసుందరిని గవుగిలించుకొన్నాడు. వారిరువురు దృఢాలింగనాపరవశులైరి. శ్యామసుందరి నారాయణరావు మోమును దనవైపునకు ద్రిప్పి భక్తితో నాతని ఫాలమును ముద్దుగొన్నది. నారాయణుడు సర్వము మరచినాడు.

ఆమె శారదయైనట్లా గాఢలాలసుడగు నారాయణరావునకు దోచినది.

తక్షణ మా కౌగిలి సడలించి నారాయణుడు నిద్ర మేల్కొన్న వానిభంగి, నిట్టూర్పునించి 'అయ్యో' అనుకున్నాడు. గబగబ అచ్చటనుంచి రెండంగలలో

క్రిందికి దిగిపోయిన్నాడు. తిన్నగా తాను వెళ్ళుదారి తెలియక, చెమ్మటలూ దుడిచి కొనుచు సర్వమును మరచిన జడునిభంగి సముద్ర తీరమును జేరుకొన్నాడు.

అప్రయత్నముగ ఆతనికి హాహాకారమగు శోకము కంఠమునుండి వెలువడి నది. ఆతడు తలను బట్టికొని ఇసుకలో జదికలంబడినాడు.

ఏమది. ఇట్టి ఘోరపాప మాచరించినాదేమి. అట్లు తానాచరించుటకు గారణ మేమి. ఆమెను ప్రేమించుచున్నాడా. అవును; తన చెల్లెలుగా చూచుకొన్నాడు. తన కైదవచెల్లెలనుకున్నాడు. పెద్ద సూరీ డనుకున్నాడు. అంతే! నిర్మలప్రేమ రక్తసంబంధము లేనప్పుడు కొంచెము వెనుదిరిగినచో కామదోషిత మగునేమో?

తనకు వివాహము కానప్పుడు, ఒకరిద్దరు బాలికలజూచి తాను సంభోగాపేక్ష పొందినాడు. ఆ భావము ముహూర్తమాత్రము అటువెనుక నా తుచ్ఛభావము రాలేదు.

సంభోగభావము తుచ్ఛభావమా! అయినచో ఋషుల కెట్లు సంతతులు గలిగినవి. లోనపుల్కరము కందలించు మోహావేశ మున్నగాని సంభోగేచ్ఛజనింపదే, ఆయిచ్ఛ పాపమా? అది పాపమైన భార్యయందును అట్టి కోర్కె జనింపగూడదే? కాని యిదేమి యాలోచన! శ్యామసుందరి తన్ను ప్రేమించినట్లే యెరుగడు! తన్ను ముద్దుపెట్టుకొనుట సంపూర్ణముగా పాశ్చాత్యుల సోదరీ భావముననే కాదా! ఈ దేశమున అట్టి ఆచారములు లేకపోయినను ఆమె పెట్టిన ముద్దులలో దీప్త స్వాంతన మున్నది. అగుచో తన కంతవేడి యేల జనించినది? తనకట్టి ఆవేశము కలుగ ఏది కారణము? రాజేశ్వరుని మతము నిజము కాదుగద! ఛీ! అది యెట్లు.

ఆతని మత మింద్రియ సంబంధమైనది. అటువంటి యప్పుడు ఆతని మతము దోషభూయిష్టము. పురుషునిలో విటత్వము గర్భితమైయున్నదా? కర్రలోని నిప్పువలె? ఎప్పుడో యప్పుడు ప్రతిమానవునుండి యది బయట కురుకునా? పవిత్రమయిన ప్రేమ ఆనందదాయకమందురే. అదియు ఖేదభూయిష్ఠమా?

ఆతడు బాధపడిపోవుచున్నాడు. సముద్ర కెరటములవంక జూచుచున్నను అవి కనంబడలేదు. అటు తాను ప్రేమించిన తన భార్య తనకు ప్రేమ నీయదు. ప్రేమ నిచ్చుటకు సంసిద్ధియగు నొక యుత్తమాంగన తలంప వీలుకానిది. ఎందుకో, మనుష్యుని జీవితములో నింత భాగ మీ ప్రేమ యాక్రమించుకొనుట యని యాత డాడిపోసుకొన్నాడు.

ఏలాగున ఆమె మోము జూచుట. చూడకపోయిన తాను వట్టి పందయై పోడా! పిరికితనము కాదా అది? ఏది గత్యంతరము. అతని కణత లుబ్బుచునే యున్నవి. రక్తము వేగముగ బ్రవహించుచునే యున్నది. వేడియై, హిమశీతలము లైన తన యంగములు పట్టు తప్పిపోయినవి. ఆతని హృదయరోదనము సముద్ర

ఘోషలో మిళితమైనది. సముద్రము ఒడ్డుననే యా యువకుడు నిశ్చేష్టుడై యట్లే పడియున్నాడు. సర్వప్రపంచము ఆతనికి లేనిదై, మాయమైనది.

నారాయణరా వెప్పుడు సంభ్రమమున లేచి, నిముషమున తనకడనుండి మాయమైనాడో, ఆ క్షణములో శ్యామసుందరికి జగత్తు తలక్రిందైనట్లు మెలకువ వచ్చినది. ఆమె గజగజ వణకిపోయినది. ఆమె ఆలోచించుకొనుటకుగూడ భయం పడిపోయినది. ఆమె కప్రయత్నముగ నేత్రాంబువులు దొరలినవి. దడదడ మని యుబికిపోవు గుండియ నామె నణంచుకొన హృదయముపై రెండుచేతులు వేసికొని నొక్కికొన్నది. తానిట్టి తెలివితక్కువపనిచేసి, యాతని కలంచినదేమి? అట్టిది ఎప్పుడైన కలనైన తలంచినదా యని వాపోయినది. అంత సమాశ్వసించుకొన్నది. తా నింత యబలయైనదేమి? అత డంత కంగారుపడినాడేమి. తానేమి దోష మాచరించినది? కరుణావేశయై యాతని ననునయింపబోయినది. ఇంతలో శీలమునకేమైన భంగము కలిగించినదా? ఆతనిని కౌగలించినప్పు డేమియో తీపులు తన్నలమినట్లయినది. ఆతనిని దాను ముద్దుపెట్టుకొన్నది. అదియేల? ఆ ముద్దునీయుట భారత నారీమణులు చేయు పనియా? చంటిబిడ్డను ముద్దుగొన మధురముగా నుండదా? అంతకన్న వేరురుచి తా నాతనికి సమర్పించిన ముద్దులోను గోచరింప లేదు. ఎంత గట్టిగ కౌగలించినాడు. భయపడిన బాలుడట్లనే యాలింగనముచేయును.

త్రికరణములచే తానుదోష మాచరించినట్లే తనకు దోచుటలేదు. పురుషునితో స్త్రీ సంచరించినట్లు చరించినదా? తనలో స్త్రీత్వమేపోయినది. తాను వైద్యకళాశాలలో నెప్పుడు చేరినదో యప్పుడు స్త్రీత్వము వదలివేసినది. తన్నిదివర కేపురుషుడు నింత కదలింపలేదు. నారాయణరావు పవిత్రహృదయుడు. అతనిపై పవిత్రమగు ప్రేమ చూపించుచున్నవి. ఆ ప్రేమలో నపశ్రుతి యేమున్నది? తన ప్రేమలో దేహానంద మున్న నుండవచ్చుగాక. అది తాను దోషభూయిష్ఠ హృదయముతో నాచరింపలేదే. కాని ఆతని హృదయములో నేమున్నదోకాని, ఆతని కౌగలింతలో గంభీరమధురిమలు తోచినవి. తన ప్రేమలో నే మున్నదో? ఆక్షణికములో తానెవరైనదో.

అట్టి యుత్తమపూరుషు డొక్కసారి తన దేహము గోరిన దాను వెనుదీయవలెనా? అంత మాత్రమున తనలో కళంకము జేరునా? అదిఎట్లు? మహర్షి రుచిగల పదార్థము నొకసారి వాంఛించిన యాతనిలోని పవిత్రత యెట్లు నశించును.

ఏమో! ఏమో!!

తానాతని పవిత్రత భంగముచేయుటకు కారణమయ్యెనా. అట్లుకాదు. మహాసత్వుడగు నాతడు ప్రేమకై తపించినాడు. తనకు బరమ కరుణ గలిగినది. కరుణలో స్త్రీ ప్రేమ జనించినది. ఇరువురొక పరమనిమేషమున నేదియో యానందమున నోలలాడినారు. అంతమాత్రమున దోషమేమియులేదు.

బ్రహ్మమునకు సాక్షి. అక్షరబ్రహ్మమునకు పైన పరబ్రహ్మము పురుషోత్తము డున్నాడు. క్షరా క్షరబ్రహ్మ లిరువురు పరబ్రహ్మ స్వరూపములే. పరబ్రహ్మ మే లన ప్రకృతివలన జీవాత్మ యగును ఆప్రకృతియే మూల ప్రకృతి ఆ మూలప్రకృతిలో నుంచి జనించినది సాధారణ ప్రకృతి.

## ప్రే మా శ య ము

సూర్యకాంతం పరీక్షలో బాగుగా వ్రాసినది. తప్పక విజయమంది తీరునని నారాయణరావు నిశ్చయించినాడు. రాజారావును వీడి నారాయణరావును పరమేశ్వరు డును చెన్నపురి విచ్చేసినారు. శారద పరీక్షలో బాగుగ వ్రాసినట్లు జమీందారుగా రల్లునికి వ్రాసినారు.

దారిలో పరమేశ్వరునికి నారాయణరావు రాజేశ్వరుని చరిత్రయంతయు జెప్పినాడు.

'రాజేశ్వరరావుతో ఒకదిన మంతయు ధర్మజిజ్ఞాస చేశానురా! వాడి దృష్ట్యా చూస్తే న్యాయపథంగానే వుంటుంది వానినడత. వాడెంతసేపు చెప్పినా 'నాకు మీ వివాహధర్మములందు నమ్మకములేదు. పుష్పశీల నన్ను ప్రేమించింది. నేనామెను ప్రేమిస్తున్నాను. ఆవిడకు నామీద ఇష్టంపోతే ఆవిడ యిష్టంవచ్చినచోటికి వెళ్ళ వచ్చును. నే నెప్పుడూ ఏ విధమైన అభ్యంతరం పెట్టను. నీ వేదాంతం నా కవసరం లేదు. నీ ధర్మం, నీ అహింస, నీ సత్యమార్గం నాకు పథ్యంకాదు. నాకు అర్థంకాదు. నువ్వు నీ బోధ పుష్పశీలకు చేసుకో, ఆ అమ్మాయి మనస్సు మళ్లుతుందీ, తీసుకుని వెళ్ళి ఆ భర్తకే అంటగట్టవోయి. ఇది మాత్రం నేను నిర్ధారణగా చెప్పగల్ను. పుష్పశీల సంపూర్ణంగా నన్ను ప్రేమిస్తోంది. సర్వకాలం ఆమెకు నామీదే ఉంటుందని చెప్పను. ప్రేమకూడా నువ్వుచెప్పే బ్రహ్మపదార్థంలా నిత్యమని చెప్పటం మామతమే కాదు!' అన్నాడురా. నేను, ఆ అమ్మాయితో ఒంటిగా ధర్మమార్గం అంతా చెప్పి నాను. ఆ అమ్మాయి విన్నదంతా విని నవ్వుతూ 'నారాయణరావు అన్నగారూ! మీరంటే చాలా గొప్పగా చెబుతారు నాయుడుగారు. కాని చూస్తే మీరు వట్టి మున లమ్మకబుర్లు చెబుతున్నారు' అన్నది. నేనుమాత్రం తెల్లబోయినాను.'

'ఏమి చెప్పావురా? రాజేశ్వరుడుతో'

'ఏముందిరా? నీ వృత్తిలో సర్వసృష్టిన్నీ పరబ్రహ్మైక్యం చేయడమే మహాత్ముల దృష్ట్యా ఉన్నతాశయంఅన్నాను. కాబట్టి అందరూ ఒక్కసారే మోక్షం పొందినా ఇబ్బందిలేదురా అన్నాను, మనంచేసేపనులు రెండువిధాల ఆలోచించాలి. నివృత్తికోసం, ప్రవృత్తికోసం. అంటే మోక్షమార్గం క్రిందా ప్రపంచంలో ఆనందం పొందడం క్రిందా నువ్వు చేసినపని ఎందులోకి వస్తుందన్నాను.

'నాకు ఇప్పుడు ఆనందం ఇస్తోందిగా? అన్నాడు.

'అదేనా నువ్వుచేసే ప్రతికార్యం ఆలోచించుకోవలసిన పద్ధతి. ఏ కార్యం చేసినా దాని మంచి చెడుగుణ నీజీవితం అంతా ఎలా ఉపకరిస్తాయి, ఎలా అపకారం చేస్తాయి అని ఆలోచించుకోవుట్రా' అన్నాను.

'ఇప్పు డీ అమ్మాయీ నువ్వూ ఉన్నారుకదా, ఆభర్త నీపై శిక్షాస్మృతిక్రింద కేషు తెస్తాడనుకో. నువ్వు ఏ రెండేళ్ళో జైలుకు వెళ్ళవచ్చుకాదా?' అన్నాను.

'అవును. నువ్వు నీ అహింసామార్గం అవలంబిస్తూ జైలుకు యెందుకు వెళ్ళావు? నా ఆశయంకోసం జైలుకు వెళ్ళితే తప్పా?' అన్నాడు.

'మనం చేసే ప్రతికార్యం దోషరహితంగాఉండదు. 'సాధ్యమైనంతవరకు' అనే మాట ఒకటుందికదా. ఆలాగే నువ్వు ఆచరించే కార్యాలల్లో సాధ్యమైనంత వరకు ఇతరులకు కష్టంగా ఉండకూడదు అనికూడా చూడాలికదా' అని నే నంటే:

'చూడాలి కాని సంఘం ఒక దోషంచేస్తూంటే అది మార్చడానికి ప్రయత్నం చేసేటప్పుడు కొందరికి అపకారాలు జరుగుతాయి. నీ అహింసావ్రతంవల్ల ఎంత మందికో నష్టం కలుగవచ్చును. అంతమాత్రాన మానుతావా?' అని నన్ను ప్రశ్నించాడు.

'సరే అంతవరకు వచ్చావు గనుక నేను అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పు. ప్రపంచంలో ఉత్కృష్ట ఆశయం ఏది?' అంటే, 'సంతోషమే ఉత్కృష్టఆశయ' మన్నాడు.

'సంపూర్ణమైన సర్వతోముఖమైన సంతోషం ఏరకమైన స్త్రీ పురుష సంబంధములో లభిస్తుంది' అనే ప్రశ్నకు, 'ఇంతవరకులేదు. ముందుముందు మాపద్ధతి వల్ల లభించగల' దని చెప్పాడు.

'జడ్జీ లిండిసేగారి వ్రాతలు, సర్ హావిలాక్ ఎల్లిస్ మొదలగు వైద్యవిశారదుల వ్రాతలు చదివావా?' అన్నాను.

'అవన్నీ గమనించి వివాహశాసనం ఉన్న మన దేశంలో స్త్రీ పురుషులకు అంతకంటె ప్రాపంచికానందం ఎక్కువగాకలగడంలేదని చెప్పగలవా?' అన్నాను. 'అమెరికాలోని పద్ధతులు ఎంత నికృష్టంగా ఉన్నా లిండిసే కనబరచిన దోషాలకు ఆతడు చూపినది నివారణోపాయం కాదు' అన్నాడు. షెల్లీ మొదలగువారు మీ పద్ధతులు అవలంబించి భగ్నమనోరథులై కృశించి కృంగిపోయారు. యింక ప్రకృతిశాస్త్రజ్ఞులు శాస్త్రపరిశోధనచేస్తూచేస్తూ ప్రకృత్యతీతమగు పరబ్రహ్మకు మార్గము చూపుదారికి వచ్చి యచ్చట ఆగిపోయినారు. ప్రకృతి సంబంధమగు పరీక్షచేయడానికి పనికివచ్చే పరికరాలు పరబ్రహ్మమును కనిపెట్టలేవు. ప్రకృతిమార్గంచేత పరానికి దారి దొరకదు. దానికి పారలౌకికంగా ఆలోచించాలికదా. పారలౌకికంగా ఆలోచిస్తేనే మీదనున్నదారి కనబడుతుంది అంటూ ఈలాగున చెప్పాను! వాడు తల వాల్చుకొని వున్నాడురా. ఆపిల్లకూడా చెంతనేవున్నది. ఇంతా విని ఆ అమ్మాయి అన్నదికదా, 'నారాయణరావు అన్నగారూ! నాజన్మంలో నేను

మనుష్య స్త్రీగా సంచరించింది ఈరోజులే, మీరెంతచెప్పినా లాభంలేదు ' అన్నది. సరే, వాగా ఆలోచించుకోండి అని బయల్దేరడానికి సిద్ధంగాఉన్నాను. రాజేశ్వరునితో ఆ అమ్మాయి భర్త వచ్చినాడని చెప్పినాను. అత ' దల్లాగా ' అని ' అతన్నికూడా వచ్చి భార్య హృదయం మార్చడానికి ప్రయత్నించమనరా ' అన్నాడు. నాకు నవ్వు వచ్చింది. ఇంతలో నువ్వు పంపించిన భయంకరమైన పెళ్లిగ్రాము చక్కావచ్చింది.'

చెన్నపట్టణం వచ్చుటతోడనే నారాయణరావుగారి ఇంటిలో సూరీడు, శ్యామసుందరి, ఆమె ముగ్గురు చెల్లెళ్ల అందరూ కూర్చొనిఉండగా నారాయణరావు రాజారావు భార్య పోయినసంగతి చెప్పి, సూరమాంబ గుణగణములను వర్ణించి చెప్పినాడు. శ్యామసుందరి విషణ్ణ వదనయై విన్నది.

' అన్నా ! మంచివాళ్ళు బ్రతుకరుగదా ! '

' అవునమ్మా ! లోకంలో ఉండే చెడుగు మంచిని తరిమేస్తుందంటావు. మామూలు దృష్టికి అల్లాగే కనబడుతుంది. కాని ఈ ప్రపంచంలో చెడుగు ఇంకా హద్దుమీరకుండా ఉన్నదంటే, మంచియొక్క ప్రాబల్యంచేతనే. చెడుగు ప్రాబల్యంగా ఉంటే యీపాటికి జగత్తుకు ప్రళయం రాదటమ్మా. మనకు ఈ ప్రకృతే అంతా బోధిస్తూ ఉన్నది. రాక్షసశక్తి. కిరసనాయిలులో ఉన్నది. ఆవిరిలో ఉన్నది, విద్యుచ్ఛక్తిలో ఉన్నది. ఇవన్నీ కట్టుతప్పితే కాలాన్ని దగ్ధం చెయ్యగలవు. అలాగే మనుష్యునిలో ఉండే రాక్షస శక్తి కట్టుతప్పకుండా చేస్తూఉన్నది, అతనిలోని మంచే సుమా ! కాబట్టి చెడుగు మంచిని తరిమివేస్తోందని ఎల్లా చెప్పగలవమ్మా ? '

' నిజమే, అన్నా ! '

పర :—' ఒరే నారాయుడూ ! ఒక సంగతి ఆలోచించు, చెడుగు, మంచి, ఒక్క ప్రకృతిలోనుంచే కదా వస్తాయి. అప్ప చెల్లెళ్ళే. ఎందుకు ' మంచి ' మన మోక్షానికిమార్గం అయ్యింది. ' చెడుగు ' ఎందుకు కారాదు ? '

నారా :—నీకు తెలవదా నన్నడుగుతావు ! పురుషుడు ప్రకృతి మాయచే దేహాత్మ భ్రమలో పడుతున్నాడు, అహంకారంలో ఉన్నన్నాళ్ళు పురుషుడు సాక్షిభూతుడగు అక్షరుని, అక్షరస్థానమందుండి పురుషోత్తముని తెలిసికోలేడుకదా ! ఆ పురుషుడు,ఆ ప్రకృతి పరబ్రహ్మ స్వరూపులేకాదా. కాబట్టి ప్రకృతియొక్క గుణములలోంచి జన్మించిన మంచిచెడ్డలలో మంచి, పురుషుడు ; తానే అక్షర బ్రహ్మమను జ్ఞానం సంపాదించుకొనుటకు మార్గం అయ్యాడు. '

రుక్మిణియు, చిన్నబాలయు క్షేమముగ ఉన్నారు. పరమేశ్వరునకు గోమరిత యందు వెఱ్ఱిప్రేమ. ఆమెపై నెన్నియో పాటలు వ్రాసినాడు. రోహిణీదేవి వానిని చదువుమని మరియు మరియు గోరునది. పరమేశ్వరునిభావములన్నియు చిత్రములు. అనాదినుండియు ఒక సంపూర్ణ ఆత్మ ఉద్భవిస్తుందట. అది ఆ ఆదికాలంలోనే స్త్రీ పురుష మూర్తులచే రెండు ఆత్మలుగ విడివడునట. వారిజీవితయాత్రలో నెప్పుడో యొకప్పుడు భార్యాభర్తలై కలియుదురట. ఒకొక్కప్పుడు ప్రాణమిత్రులైన స్త్రీ

పురుషులై కలియుదురట. అట్టి జన్మలలో ఒకనాడు స్త్రీ పురుషునకు మోక్షముపొందు మార్గ ముపదేశించునట. అప్పుడా జంట ఒకటై తారకమార్గము నందునట. ఇది యంతయు నిజము కాకపోయినను ఒక్కటిమాత్రము నిజమని పరమేశ్వరుడు వాదించును.

'ఒరే నారాయుడు! పురుషునికొక యాశయ స్వరూపమయిన వనితయును, స్త్రీకి ఆశయ స్వరూపుడైన పురుషుడున్ను ఉండి తీరాలి. వా రాచరించు దీక్షకు ఉత్సాహము ఉత్తేజము ఇస్తూవుంటారని నేను పూర్ణంగా నమ్ముతాను. 'డాంటీకి' బియ్యట్రిసు వున్నట్లు, కీట్సుకు ఫానా వున్నది. నెపోలియనుకు జోసెఫైను. సంపూర్ణావతార స్వరూపమగు శ్రీకృష్ణునికి రాధ, పాండవులకు ద్రౌపది, రామునకు సీత, వివేకానందునకు నివేదిత, కాళిదాసున కాయన భార్య, లీలాశుకునకు చింతామణి, క్రైస్తునకు మాగ్దలీసు, మీరాబాయికి తాంసేను, ఆనిబిసెంటుకు కృష్ణాజీ అవునా?' అనినాడు ఒకనాడు పరమేశ్వరుడు.

'నువ్వు చెప్పినది చాలా భాగము నిజమే. ఎందుకు నీకా ఆలోచనకల్గింది?'

'నాకూ రోహిణీబాలకు స్నేహము కలిగినప్పటినుంచీ ఎన్ని పాటలో వ్రాశాను. బొమ్మలుకూడా చూశావా ఆ మధ్య ఆగాను. మరల నాకు ఎక్కడలేని శక్తి వచ్చినట్లు వేయుట ప్రారంభించాను.'

'అవును! నేనూ ఆశ్చర్యంపడుతూ వున్నాను. అదా నువ్వూ, రోహిణీ ఎప్పుడూ కలిసి మెలిసి మాట్లాడుకోవడం?'

'రోహిణీదేవికి ఈ యేణ్ణర్థంనుంచి చిత్రలేఖనం బాగా నేర్పుతున్నాను. నీకు జూపించమంటే పూర్తిగా తాను వేసిన బొమ్మలు తయ్యారుకాగానే చూపిస్తానంది. అంటే నేను దిద్దడం తక్కువగా ఉండడం అన్నమాట. నాలుగు బొమ్మలువేసింది. మొదటి మూడు నేను బాగా దిద్దాను. ఆ బొమ్మలలో నా ప్రజ్ఞే ఎక్కువ పాలున్నది. ఇప్పుడు వేసింది అంతా ఆమే. నేను ఒక గీతగీసినానో లేదో అన్నీ తనే వేసుకున్నది. బొమ్మలు వేయుటలో మమ్ముల నందరినీ మించేటట్టు ఉన్నదిరా!'

'దుర్మార్గుడా! నాకు చూపించకుండా నువ్వు ఇన్నాళ్ళు దాచావూ?'

'అరే! నీతో నేను వాళ్ళకి బొమ్మలువేయుట నేర్పుతున్నానని చెప్పలేదుట్రా?'

'కాని ఇంత బాగా వేస్తుందని సూచించి ఉంటే నేను చూసి సంతోషించేవాణ్ణిగా. ఏదీ ఈవాళ సాయంత్రం వాళ్ళ యింటికి వెళ్ళి చూద్దాము. శ్యామసుందరి బొమ్మలు వేయలేదు కాబోలు.'

'వేయలేదుకాని శ్యామసుందరి తెలుగులో కవిత్వం చేయడం మొదలు పెట్టినది. తెలుగు చదువను వ్రాయను బాగా తెలియకపోయినా వినికిడివల్ల ఎక్కడి నుంచి పట్టుకున్నదో తెలుగు నుడి ఏమి తియ్యగా వ్రాస్తూఉందిరా! పాటలలోని రహస్య మామెకు బోధించినాను. ఈ మధ్య సంస్కృతంబాగా చదువుకుంది. నీకి రోజునో రేపో పాడి వినిపిస్తానంది.

౯

# మోహ ధర్మము

నారాయణరావు తనకడకు రాకమునుపే రాజేశ్వరుడు పుష్పశీల హృదయము మారినదేమో యని సందియ మందసాగెను. ఆతని తోటి యుద్యోగి . యగు నా మహమ్మదీయ యువకుడు రాజేశ్వరరావింటికి బదింబదిగ రానారంభించెను. రాజేశ్వరరావు మాత్రము పుష్పశీలకు సంపూర్ణ స్వాతంత్ర్యమిచ్చి, యామె యిచ్ఛానుసారము మెలగనిచ్చెను. తమ ప్రేమ స్వాతంత్ర్య సంఘాదేశములు, ఆశయములు, విజయమందుట కాచరించవలయు మార్గములు అన్నియు పుష్పశీల కుపదేశించినాడు. నువ్వు నీ ప్రేమ ననుసరించి మెలగవచ్చును. నీకు నామీద ప్రేమ యెంతకాలం ఉంటుందో అంతకాలం నా దగ్గిర ఉండవచ్చును. నీకు ప్రేమ సంపూర్ణముగ నా యెడల నశించిపోయి, వేరొకని నీవు వలచినచో నీవు నిస్సంశయ ముగ ఆ పురుషుని కడకు వెళ్ళిపోవచ్చును. అనియు రాజేశ్వరరావా సుందరితో వచించినాడు.

పుష్పశీల చపలచిత్త, ఆమెహృదయము సీతాకోకచిలుకయే. రాజేశ్వరునిపై మమకార మప్పుడే నశించిపోసాగినది. ఇంతలో నీ మహమ్మదీయ యువకుడు రాజేశ్వరుని యింటికి రా నారంభించినాడు. రాజేశ్వరరావు పుష్పశీలకు నా మహమ్మ దీయ యువకునితో బరిచయము గలిగించెను.

పుష్పశీలకు ఇంగ్లీషున మిడిమిడి జ్ఞానముకలదు. కాన అభాషలో నా మహ మ్మదీయ బాలకునితో నేదేని మాటలాడుచు వినోదించుండెను. ఆ బాలకుడు రాజే శ్వరరావు లేనికాలములో కూడ రాజేశ్వరునింటికి వచ్చుచుండెను.

ఒకనా డాతడా యువతిచేయి పట్టుకొన్నాడు. పుష్పశీల మాటాడలేదు. చిరు నవ్వు నవ్వినది. రెండురోజులు పోయినవెనుక నా మహమ్మదీయ యువకుడామెను వెనుకనుండి వచ్చి కవుంగిలించుకొన్నాడు. పుష్పశీల ఆతని బాహువులలో బులక రించినది. వారిరువు రంత శయ్యాగృహమున కేగినారు.

రాజేశ్వరున కప్పుడే పుష్పశీలకు నా మహమ్మదీయ యువకునకు గల సంబం ధము కరతలామలకమై తోచినది. ఆనాటినుండి రాజేశ్వరుని హృదయమున నెచ్చ టనో కనంబడని కంటకమువలె నీర్ష్య బాధింపజొచ్చెను. రాజేశ్వరుడది ప్రథమమున నీర్ష్య యనుకొనలేదు. ఏదోబాధ యనుకొన్నాడు.

అప్పుడే నారాయణరావు వచ్చినాడు. నారాయణుడు వచ్చి యేమేమియో. చెప్పినాడు. గాంధీతత్త్వము బోధించినాడు. తనభార్యను నితరులకు సంతానార్థ మిచ్చిన ఆర్యకాలమునాటి గృహమేధి తప్పొనరించినాడా ? లేదు. తప్పు అనునది కాలమునుబట్టి మారుచుండునుగదా. తప్పు అని కనుంగొనుటకు ముఖ్యసూత్రము మనము హింస నాచరింపుచున్నామా ? యని నిర్ణయించు కొనుటయే.

పరదారను, పరధనమును ఆశించుట పరుల హింసించుటయే యగును. కావున పాపకృత్యమని వాదించినాడు. అహింసాసూత్రము నాధారము చేసికొని నీవు నీ కర్మనడుపవలెను. సంఘము ముక్తిమార్గము నన్వేషించుటలో నెన్నియో పద్ధతుల నలవడ చేసుకొనును. అవి యన్నియు, అహింసకు సత్యమునకు వ్యతిరేకము గాకూడదు, కావుననే సంఘమున ధనమంతయు నందరకు సమముగా బంచవలెనన్ని నిబంధన పెట్టుకొని దానికై పలువుర జంపుట పాపమగును. నీవు స్వచ్ఛకర్మ యోగివై, నీ ప్రేమచే సంఘప్రజ నంతను సంస్కరింపవలెను. అలాగుననే స్త్రీ విషయమును, స్త్రీలకు పురుషవాంఛయు, పురుషులకు స్త్రీ వాంఛయు హద్దుమీరుట మోక్షమునకు దూరము. అది ఇంద్రియ లోలత్వములో ముంచును, గాన దానికై వివాహసంస్థ నెలకొల్పి యావాంఛను జాలవరకు తగ్గించినారు. వివాహమన ప్రేమ లేకుండుట కాదుసుమా! అందు దోషము లేవైన నున్నయెడల మార్పుచేయుము. అంతియకాని నీ యిష్టము వచ్చినట్లు పోరాదు. మానవునకు స్వాతంత్ర్యము మంచి చేయుట కున్నదిగాని, చెడుగొనరించుటకులేదు.

ఈ రీతిగ నారాయణరావు తనకు బోధ యొనరించినాడు. అది నిజమా? ఆధ్యాత్మిక పథమొకటి యున్నదని తనకు నమ్మకములేదు. ఈ జన్మము ముగిసిన వెనుక ఆత్మలు మరల జన్మించునా? ఆ ఆత్మలు - త్రాసునకును, జూపునకును అందని ఈ ఆత్మలు ఆద్యంత రహితములన్నమాట కేవలము కల్పితము అని నిశ్చయము జనించును.

కాని ఆ నిశ్చయము పూర్వమెప్పుడు చలనము లేక స్థిరమై యుండునది. ఇదివర కెందరెన్నిరీతుల వాదించినను, వానిని ఛూ ఛూ యని త్రోసిపుచ్చువాడు. నే డాతనికి అనేక సందేహములు జనించినవి. తన భావములు, తన గురువుగారి సందేశము తప్పేమో? ఇదివరకు తన గురువుగారి మతమువంటిదే చార్వాకమతము ఉండెడిదట, రోమనుకాలమున, గ్రీకుమహా సామ్రాజ్యము విచ్ఛిన్నకాలమున ప్రజల కిట్టి విపరీతబుద్ధు లుండెడివట. అని నారాయణుడన్నాడు. అదినిజమా? ఇదినిజమా?

ఈ యాలోచనలతో నొకనాడు రాజేశ్వరుడు తన యింటికడకు వచ్చినాడు. ఆ మహమ్మదీయ బాలుడును, పుష్పశీలయు లోన నున్నారని సేవకుడు చెప్పినాడు. ఇంటిలోనికి వెళ్ళక మండిపోవు హృదయమును నుపశమింప జేసికొనుచు రాజేశ్వరుడు తన పాదము లెచటికి గొంపోవుచున్నవో యెఱుగని యవస్థలో నిల్లు విడిచి యేగెను.

తనలో నీర్ష్య జనించినదని యాతనికి స్పష్టమైతోచినది. దృఢవ్రతుడనని తా నెంత గర్వపడుచుండెనో యంతకు తగినశాస్తియైనది. నా కళ్ళ యెదుటనే స్త్రీలు చంచలచిత్తలను మాటను పుష్పశీల నాకు ఇంత చక్కగ బోధించునని యెఱుగనైతిని,

తన హృదయము దహించుచున్నది. తాను క్రొత్తగ స్వతంత్రప్రేమ సంఘములో చేరినప్పుడు కొందరు కొందరు యువకులతో, తాను వినోదించినప్పుడు వారు తన్నువదలి యితరులతో జనించునపుడు తానెట్టి యీర్ష్యము నందలేదే! అట్టి తనకు నేడీ యీర్ష్య యెక్కడినుండి జనించినది.

రాజేశ్వరుడు పుష్పశీలకడ కొక దినమున బోయినాడు.

'పుష్పం! నాపై ప్రేమఅంతా మారిపోయిందా,'

'ఛా! ఛా! అదేమిటి రాజా! అల్లా అంటావు! నీవు నా అతఃనాథుడవు. నిన్ను తప్ప నేను ఇంకో పురుషుణ్ణి తలంపలేను. నేను నీ దానను

'నువ్వు మాట్లాడేది నాలిక చివరినుంచా, హృదయములోనుంచా! పుష్పశీలా! నీకు ప్రేమమారితే మారిఉండవచ్చు. అది తప్పు అనే ఉద్దేశముతో నిన్నీ ప్రశ్నలు అడుగుటలేదు. నిజము చెప్పవలసింది, అని. ఎందుకీ గ్రుడ్డిలాట? మన యిద్దరిస్థితి యేదో ఒక నిశ్చయానికి ఒక మార్గానికి వస్తుందని, అంతే. నీపై నా ప్రేమ మాత్రము ఇసుమంతైనా తరగలేదు అదేమి చిత్రమో!'

'ఇదివరకు మీ ప్రేమకూడా అస్తమానము మారుతో ఉండేదిగా.

'అప్పటికి నా ప్రేమకు తగిన స్త్రీ మూర్తి కనబడలేదు కాబట్టి.'

'అల్లాగే నాకు ఇప్పటికి నా ప్రేమకు తగిన పురుషమూర్తి కనబడలేదేమో అనుకోరాదా?'

'అవును! అందుకనే నేను నిన్ను అడిగేది ఏమిటంటే, 'నీ హృదయము ప్రస్తుతము మారిందా'? అని అడుగు తున్నాను.'

'అది నేను ఎలా చెప్పగలనండీ!'

'అదేమిటి పుష్పం! నువ్వు చెప్పనేలేవా! ఇదివరకు లేనిది నన్ను కొత్తగా అండి అండీ అని అంటున్నావు. నీ హృదయం మారి నటులే తోస్తూంది.'

'అండీ అనగూడదా! మీరు నాకు భర్తవంటి వాళ్ళుగనుక అన్నాను.

'అబ్బా నన్ను నీ భర్తవంటివాణ్ణి అన్నావు. సరే నేనున్నూ మిమ్ము గౌరవం చేసి మాట్లాడనా?'

'అదేమిటి నామీద ప్రేమ తప్పిందా?'

పుష్పశీల సుడిగాలి వేగమున వచ్చి రాజేశ్వరుని కౌగలించుకొన్నది. లతని నడిమిపట్టి పెనవేసికొని పోయినది. 'నీకు వట్టి అనుమానం నాథా! లేనిపోనివి పెట్టుకోకు' అని యామె యాతని చెవిలో సన్నని యెలుగున పలికినది. అతడును, ఆమెయు మోహావేశమున మైమరచినారు.

నాలుగు రోజులైన వెనుక రాజేశ్వరుడు తోటలో చెట్లకు మన్ను త్రవ్వుచుండెను. ఆరోజు శుక్రవారము. సెలవు. చీకట్లుపడినవి. అంతయు నిశ్శబ్దముగా నున్నది. బంగాళాచుట్టు చెట్లపై పక్షులు గూళ్ళుచేరు పాటలు పాడుచున్నవి. ఫ్రేసవి

కాలము వచ్చుచున్నదని చూపిన వెఱ్ఱివేడియెండ పూర్ణముగా పోయినను దేశ మింకను జల్లబడలేదు.

రాజేశ్వరుడు తోటలో పనిచేసుకొనుచున్న సంగతిని పుష్పశీల మరచి విహారమునకై చెరువుగట్టుకు పోయినాడని యనుకొన్నది. కావుననే యందకాడగు న్యామహమ్మదీయ యువకుడు రాజేశ్వరుని యింటికివచ్చి, వరండా వెనుకను మధ్య గదిలో కుర్చీపై కూర్చుని, కలలు కనుచున్న పుష్పశీలను దన హృదయానికి జేర్చు కొన్నాడు. పుష్పశీల సర్వము మరచి యా మహమ్మదీయ బాలుని అదిమిపట్టుకొని యాతని నక్కడనున్న సోఫాపైకి ద్రోసి, యాతనిపై వ్రాలి యాతని నావరించినది. మేఘబాల అచలకుమారుని చుట్టినది. ఆ సమయముననే రాజేశ్వరుడు తోటలోనుండి లోనికి దొడ్డిత్రోవను వచ్చినాడు.

ఎట్టఎదుటి దృశ్యము తిలకించి నిశ్చేష్టుడయి యచ్చటనే నిలబడిపోయినాడు. పుష్పశీలయు నా మహమ్మదీయ యువకుడును చటుక్కున లేచి నిలుచుండి పోయి నారు. రాజేశ్వరుడు రౌద్రమూర్తియైనాడు. హుమ్మని చేయినెత్తి యా మహమ్మ దీయ బాలుని శక్తికొలది చెంపపై నొక పెట్టుపెట్టెను. ఆ యువకు డా దెబ్బ కొక కుర్చీపై పడిపోయినాడు. లేచి చొక్కా చేతులు వెనుకకు లాగి, రాజేశ్వరుని మోముపై ముష్టి ఘాతము నీయబోయినాడు. రాజేశ్వరు డెక్కుడు బలవంతుడగు టచే నాతని చేయిపట్టుకొని యాపి, కోపము దిగమ్రింగి 'క్షమించండి హుస్సేను గారూ! నేను! తొందరపడ్డాను. తొందరపడుటకు కారణం ఉందని మీరే గ్రహింప గలరు. ఇప్పుడు మీరింటికి వెళ్ళిపోండి' అన్నాడు.

పుష్పశీల తెల్లబోయినది. గజగజలాడుచు భయాకులయై యచ్చట నొదిగి నిలుచున్నది.

ఆ మహమ్మదీయ యువకుడు కందిపోయిన తన యెడమచంపను ఎడమచేత నొక్కి పట్టుకొని.

'నేను వెడితే, ఆ బాలికను చంపివేస్తావేమో?'

'రామా! నీకంత భయముగా ఉంటే ఆ అమ్మాయిని తీసుకుపెళ్లు.'

పుష్ప:—మీరు వెళ్ళండి సాహెబుగారూ!

ఆ యువకుడు రాజేశ్వరు నొకసారి, పుష్పశీల నొకసారి తీక్షణముగ జూచి 'నీ భార్య కాదుగా ఈ మనోహరిని నాకిచ్చివేయి, నేను తీసుకుపోతాను. నేను నిక్కా కట్టుకుంటాను.

రాజే:—ఏమిటి పుష్పశీలా నీకిష్టమా? అని గంభీరస్వరమున నడిగెను.

'అయితే అవుతుంది' అని యామె యన్నది.

రాజే:—అలాగా! అయితే నా అభ్యంతరం మాత్ర మేమిటి?

పుష్ప:—నేను రాను మీరు వెళ్ళండి సాహెబుగారూ!

ఆ యువకుడు వెనుతిరిగి యింటిగుమ్మములు దిగి వెడలిపోయినాడు.

రాజేశ్వరు డా వనితనుజూచి 'పుష్పం నాకు జ్ఞానోపదేశం చేశావు. కృతజ్ఞుణ్ణి' అని గబగబ, యా చీకటులలో కలసిపోయినాడు. పుష్పశీల కుర్చీపై చదికిలంబడినది.

అంత అనుమానరహితమనుకొన్న నిశ్చయములు ఇంత యనుమానపూరితములైనవి. తానింకేయాశయములకై సంఘముపై గద్దెగట్టుట? పూర్వకాలమునుండి స్త్రీ తన ప్రకృతిలోపమువల్ల, నొక పురుషునిజేరి అతని నాధారపరచుకొని యున్నది. అంతయకాని తాను దానిసయై పురుషునికి లోబడియుండలేదు, అని నారాయణుడు చెప్పిన ముక్కయే నిజముకాబోలు.

రాజేశ్వరుడు అంతకంతకు దీర్ఘవిచారమున బడెను. ఆతడు ఇతికర్తవ్యతామూఢుడై, కంటకవృక్షములనడుమ బడిన నరునివలె బాధ నందుచుండెను. ఇదివరకాతనికున్న నిశ్చయబుద్ధి మూలమట్టముగ గదలిపోయినది. నిర్మల హృదయము మేఘావృతమైనది.

స్త్రీకి స్వాతంత్ర్యము, పురుషునకు నీర్ష్య లేకుంట యను తమ యాశయములు తనయెడ మృగ్యమైనవి. తాను పుష్పశీల భర్తకు దృఢబుద్ధితో వ్రాసినదెల్ల బడాయియైనది. తనకును బుష్పశీల భర్తకును భేద మేమున్నది? పశువువలె నామహమ్మదీయ బాలకు నట్లు కొట్టినాడేమి?

ఎట్లు భగవంతుడా! భగవంతుని నమ్మడే, యేల జ్ఞాపకమునకు వచ్చినాడు? నారాయణు డేల దాపురించి తన కా యుత్కృష్టత బోధచేసినాడు? ఒకవేళ తమ సంఘాశయములన్నియు అజ్ఞాన విలసితములా?

తనకు నీర్ష్య జనించినది!

'అబ్బా! నా కీ గుండెల్లో బలువు. నాకేమీ దారి కనబడుటలేదు. ఆలాగు పుష్పశీల నా దగ్గిరనుండి వెళ్ళిపోతే వుండగలనా? నా పుష్పశీలా! నిన్నెంత ప్రేమించాను. ఆ మహమ్మదీయుణ్ణి చంపేద్దామనే అనుకున్నాను. నారాయణుడు చెప్పినట్లు నిజముగ పుష్పశీల బ్రతుకు నే నే తగలేశానా?

'ఓ పుష్పశీలా! పుష్పశీలా! నీ కష్టములకు నేనా కారణము. నీవు నావలన అథోగతిలో పడినావా?' కాదు. కాదు. తాను చేసినదంతయు మంచిదే.

ఆతని మనస్సున కేదియో నిశ్చయము కలిగినది. మోము రాతిలో చెక్కినట్లయినది. దేహము బిర్రబిగిసిపోయినది. అబ్బా! యని యా నిశ్చయమును దూరమునకు ద్రోసినాడు. తొందరపడుచున్నాడేమో. ఇంకొక మార్గము లేదు! ఇదే, ఇదే! 'నీ బ్రతుకు వృథా. నీ బ్రతుకు వృథా!' నారాయణుడు, పరమేశ్వరుడు, రాజారావు! వాళ్ల దేవతలు. 'భా నారాయణుని దగ్గరకు పోనా సాయంత్రము?'

అతడు రాత్రి పన్నెండుగంటలకు కూర్చుండి ఉత్తరము లెన్నియో వ్రాసెను. తెల్లవారగట్ల మూడగుచున్నది.

నెమ్మదిగ అడుగులిడుచు పుష్పశీల నిద్రించు గదిలోనికి బోయినాడు. ఆమె వాడిన పుష్పమువలె పందిరిమంచముపై పండుకొని యున్నది.

పుష్పశీల నొక్కసారి కౌగలించుకొన్నాడు ఆమె నిద్దురలో రాజేశ్వరరావును తనకడకు లాగికొన్నది.

ఆతని కన్నుల రెండుచుక్కలు నీరుతిరిగినవి. ఆమె కౌగిలి సడలించుకొని 'ఎప్పటికైనా ఆడవాళ్ళ బాధలకు బురుషులే కారకులు' అని గొణుగుచు తన ప్రాత గదిలోనికి బోయి సోఫాపై పండుకొని ఒకపొట్లము నోటిలో వేసికొని మంచినీరు త్రాగుచుండగనే యాతని చేతిలోనుండి గ్లాసు క్రిందకు పడి బద్దలైనది. ఆతనిచేయి వాలిపోయినది.

## ౧౦

## శస్త్రచికిత్స

కొత్తపేట

10 గం, 20—4—29

తటవర్తి నారాయణరావు
అడ్వకేట్
హైకోర్టు మద్రాసు.

'మీ నాయనగారు - దుష్టవ్రణము - (మాలిగ్నెంటు ట్యూమరు) - ప్రేలిమీద - రేపు - ఉదయం - మెయిలు - తీసుకొని వచ్చుచున్నాము - శస్త్రచికిత్స - రంగాచారి - ఏర్పాటుచేయి - స్టేషను - మోటారు - భయములేదు.

రాజారావు.'

అని తంతి నారాయణరావునకు చెన్నపురిలో హైకోర్టులో నున్నప్పు డందినది. నారాయణరావునకు హృదయం చలించి తల యొక్కసారి తిరిగినది. ఈ దుష్టవ్రణ మేమిటి? దీనివలన భయములేదని తంతిలో వ్రాసియున్నది. అతడు తత్క్షణమే రంగాచార్యులుగారి యింటికిబోయి వారితో మాట్లాడెను. ఆయన యా తంతినిచూచి 'రేపు తిన్నగా మా వైద్యశాలకు తీసికొనిరండి. అన్నీ సిద్ధంచేయించి వుంటాను' అని చెప్పినాడు. విషవ్రణములలో భయపడవలసినవి యున్నవి. ఏమీ భయము లేనివి యున్నవి. 'భయములేదా' యని ప్రశ్నింప, రంగాచారిగారు ధైర్యముచెప్పి నారాయణరావును బంపించినారు. శస్త్రవైద్య మయిన వెనుక యొకటి రెండు రోజు లుంచవలసినచో వైద్యశాలలోనే సుబ్బారాయుడుగారినుంచి నారాయణరావుగారి యింటికి వెడలిపోవచ్చునని రంగాచారిగారు చెప్పినారు.

మరునాటి ఉదయము మెయిలులో సూర్యకాంతము, నారాయణరావు, కారు మీద సెంత్రులు స్టేషనుకడకు వచ్చినారు. రెండుమూడు కిరాయిమోటారులనుగూడ

కుదిర్చి యుంచినాడు. మెయిలువచ్చియాగినది. ఒక రెండవతరగతి బండియంతయు నద్దెకు పుచ్చుకొని శ్రీరామమూర్తి, రాజారావు, లక్ష్మీపతి, సుబ్బనారాయణశాస్త్రి, వెంకాయమ్మ, రమణమ్మ, జానకమ్మగారును, లక్ష్మీపతి తల్లి శేషమ్మగారు, లక్ష్మీ నరసమ్మగారు మెయిలులో సుబ్బారాయుడుగారితో దిగిరి.

సుబ్బారాయుడుగారి కుడిచేయి కట్టబడియున్నది. ఆయన బాధ నణచుకొనుచు మధ్యమధ్య బొమలు ముడుచుకొనుచు, పెద్దకుమారుని దాసటగొని రైలుదిగి బాధతో నిండియున్న చిరునవ్వు చిన్నకుమారునిపై ప్రసరించెను. ఆతడు దెచ్చికోలుధైర్యము మోమున దోప తండ్రికడకువచ్చి. 'ఎల్లాఉంది నాన్నగారూ!' అని ప్రశ్నించెను. 'బాధగాఉంది. ఫరవాలేదులే, ఇదుగో సూరీడు, వచ్చింది? ఏమిలేదుతల్లీ, ఏదో చిన్నకురుపు, కణుపుజెష్టో లేక ఏదైన కాదో!' అని సుబ్బారాయుడుగా రనిరి.

తిన్నగా పరీక్షచేసి ఇది శస్త్రము చేయవలెనని రంగాచారిగారు నిర్ణయించి నారు. చిటికెన వ్రేలిపై ఒక చిన్న పుట్టుమచ్చయు, మచ్చపైన కాయయు నుండెడి దట. అది చటుక్కున పదిరోజులక్రిందట పెద్దది కానారంభించి పోటును బాధయు మొదలుపెట్టినది. చేయివాచినది. సుబ్బారాయుడుగారికి తిండి సహించుటలేదన్నారు. సుబ్బారాయుడుగా రిది యేమియని, అమలాపురము, పెద్దకుమారునికి గబురుపంపిరి. శ్రీరామమూర్తి రాజారావును తీసికొనివచ్చెను. రాజారావుమూత్రము పరీక్షించి మధువు లేదనియు మూత్రములో నితరమగు జబ్బేమియు లేదనియు ఆ వ్రణము దుష్ట వ్రణజాతి యనియు నిశ్చయించెను. కండరములలో పెరుగు 'సార్కోమా' యను వ్రణమట. అది పెరుగుటవలన వ్రణము పుట్టినచోటనేగాక రక్తములో నుంచి విషము ప్రవహించి వ్రణము కండరములు, నరములు, రక్తధమనులు, చెడు రక్తపు నాళములు పాడుచేసుకొనుచు విజృంభించి ప్రాణమునకు ముప్పముకూడ తెచ్చునని రాజారావు శ్రీరామమూర్తితో జెప్పి, అందుకు వ్రేలు కొట్టివేయవలసి యుండునేమో యనియు, చెన్నపట్టణము డాక్టరు రంగాచార్యులుగారి కడకు వెళ్లుట యుత్తమమనియు సలహాచెప్పెను. తాను కొంత మందు లోనికిచ్చి, కట్టుగట్టి, చెన్నపట్టణమున కారాత్రి మెయిలో బయలుదేరుటకు నిశ్చయించి నారాయణరావు నకు తంతినిచ్చెను.

రంగాచార్యులుగారు రాజారావు చెప్పినట్లుగానే యెంచి చిటికెనవ్రేలు మొదలంట కొట్టివేయవలెనని నిర్ధారణముచేసెను. సుబ్బారాయుడుగారు మత్తుమందక్కర లేదన్నారు. కాని రంగాచార్యులుగారు చాలా జాగ్రత్తగల వైద్యుడు చేతినెల్ల నిజముగా రాతివలె మొద్దుచేయుటకు తగినట్లు కండలలోనికి పిచ్చికారీ మందిచ్చి చేయిని బండచేసి కత్తులు మొదలయినవి సిద్ధము చేసికొని శస్త్రచికిత్స చేసినాడు. చిటికెన వ్రేలంతయు దీసివేయబడినది. 'సార్కోమా' సంబంధమగు వ్రణ చిహ్నము లేమియు లేకుండచేసి యంతయు శుభ్రముచేసి రక్తము నష్టముగాకుండ రక్తనాళములు కుట్టి రంగాచార్యులుగారు చర్మముకూడ కుట్టివేసినారు.

ఆరోజంతయు సుబ్బారాయుడుగా రక్కడనే యుండిరి. మరునాడు సాయంకాలము మోటారుకారుమీద నారాయణరావుగారి యింటికి తీసికొనివచ్చినారు వారిని.

ప్రతిదినము వచ్చి రంగాచారిగారు కట్టుకట్టుచుండిరి. నాలుగురోజులైన వెనుక, ఆయనకడనున్న సహాయవైద్యయువకుడు కట్టు కట్టుచుండెను. రంగాచారిగారు లోపలికి మంచిమందులిచ్చుచుండిరి. సుబ్బారాయుడుగారొక పదునైదు దినము లుండినవెనుక కొత్తపేట గ్రామము వెళ్ళవచ్చునని రంగాచారిగా రన్నారు.

సుబ్బారాయుడుగారిని జూచుటకు జమీందారుగారును శారదయు చెన్నపట్టణము వచ్చినారు. సుబ్బారాయుడుగారు, వియ్యంకుడు నవ్వుకొనుచు వేళాకోళములు పలుపుకొనిరి.

జమీ :—ఏమండీ బావగారూ ! మేరు పర్వతానికి పిడుగుతగిలిందిట ?

సుబ్బా :—ఒక వ్రేలు కొట్టేసిపోయింది వజ్రాయుధం.

జమీ :—అమృతం ఎత్తుకుపోయే గరుడుణ్ణి ఆపుచేద్దామని ఇంద్రుడు వజ్రాయుధం వేస్తే ఒక రెక్కయీక ఊడిపోయిందట గరుడుడికి. మీరేమన్నా అమృతం ఎత్తుకురాలేదు గదా బావగారూ !

సుబ్బా:ఎల్లాచూసినా ఇంద్రుడేకనపడ్డాడు బావగారికి పుక్కిటిపురాణాలుఅన్నీ తెలుసునే?

జమీ :—అదేమిటండోయి దెబ్బ కొడ్తున్నారు నాకు పురాణాలు రావని వ్యంగ్యము ఏమీ లేదుకద ?

సుబ్బా :—జమీందారులు శాసనసభలో సభ్యులు. పుక్కిటి పురాణాలకు తీరుబడి ఉంటుందా అని అన్నాను బావగారూ !

జమీ :—బావగారిబోటి పెద్దలు వెళ్ళండి అంటే వెళ్ళాను. మీబోటివారి తరపున ప్రతినిధినేగా ? మేము జమీందారులము. మీరు జమీందారులకు ప్రభువులు.

సుబ్బా :—ఎల్లాగయినా బావగారి మాట పైనే.

జమీం :—ఎప్పుడూ మీ చెయ్యేపైన.

సుబ్బా :—కాని మీ అల్లుడిచేయిపైన మీచేయి అయిందికాదండీ !

జమీం :—బావగారు డెబ్బదిఏళ్లు వస్తూవున్నా తమ అబ్బాయి అన్నగారిలా ఉన్నారు ఇరవైఏళ్ళు నాకన్న చిన్నవారుగా కనపడుతున్నారు.

సుబ్బా:—జ్ఞానవంతులకు దబ్బున ముసలితనం వస్తుందట.

జమీం :—యోగులకు పడుచుదనం వచ్చునట్లు.

వియ్యంకు లిద్దరు సరస సల్లాపముల కాలము పుచ్చిరి.

రాజారావు అమలాపురము వెళ్ళెదనని తెల్ప నారాయణరావు వలదని వారించెను. ఆరోజున పరమేశ్వరుడు, లక్ష్మీపతి, రాజారావు, ఆలం, రాఘవరాజను నొక క్షత్రియమిత్రుడు, నారాయణరావు కలసి సముద్రపుటొడ్డునకు వాహ్యాళికి పోయినారు. రాఘవరావు ఆలంతో ' ఏమిరా బలం అంటే మన పూర్వకాలపు వాళ్ళదిరా. నువ్వు

నేనూ ఉన్నాం. నారాయణరావు తండ్రిగారూను. ఆయన మత్తుమందు అక్కర లేకుండా చేతివేలు కొట్టేయ్యమన్నారు. నువ్వూ నేను అలా అనగలమా? మనకా బలం ఉందా? ఆధైర్యం ఉందా?' అని పలుకరించెను.

ఆలం:—అరే! ఏమిరోయి నువ్వు పెద్ద చత్రివుడవు! కత్తిలేదు. కలంపోట్లకి ఎందుకూ వచ్చావు?

పర:—నవాబులు, చెట్లకింద వకీళ్ళయినపుడు, రాజులు చెవుల్లో కలాలు దోపుకునే వాళ్ళయితే తప్పు వచ్చిందేమిటిరా తుక్క అన్నాయి!

ఆలం:—అల్లా, అల్లా! వీడిక్క కవీకూడా! దద్దమ్మ. నేనే నవాబును అయితే మాదర్బారుఖానానుంచి పది కొర్డాదెబ్బలతో దేవిడీమన్నా ఆజ్ఞవేస్తానురోయి.

పర:—నవాబుల దర్బారులకే రావాలి? మా మహారాజులు లేరుట్రా. అప్పుడు మూరురాయరగండ పరగండ భైరవ సకల మూర్ధన్యాభిశేఖర శ్రీమన్మహా రాజాధిరాజరాజేశ్వర రాఘవరాయలుంగారి కొలువుకూటంలో ఉంటానుగాని.

రాఘు:—అక్షరలక్షలు? ఒరే నారాయణ మంత్రీ! మన ఖజానానుంచి పదిపైసలు ఈ కవికి దాన మీయి.

ఆలం:—ఒరే రాజారావూ దివాన్: ఈ కవిని గాడిదమీద ఊరేగించూ! తియ్యరా త్రీకాజిల్సు.

నారా!—హుక్కా గుడగుడ అక్కరలేదూ ఇదిగో నాదగ్గర 'స్టేటు ఎక్స్‌ప్రెస్' ఉన్నది.

రాఘు:—అహింసావాదులు సిగరెట్లు కాల్చవచ్చునురా, నారాయణా! నీ అహింసా వాదం నీవూ! వకీలుపనికి సిగరెట్లకూ మంచి శ్రుతి.

పర:—ఏమోలే! సంగీతపాటకుడివి నీకు తెలియాలి మాకేం తెలుస్తుంది. పొగ కొట్టకుండా ఉండడానికి స. అ. రీ అ!

లక్ష్మీ:—అదేమిటిరా?

ఆలం:—వీడు పద్యం మాట్లాడుతున్నాడా డాబుదొరా?

నారా:—డాబుదొర కాదురా! డాగుదొర!

రాఘు:—కుక్కలదొరా!

లక్ష్మీ:—అల్లా అయితే పశువుల వైద్యుడవ్వాలి.

అందరూ ఇసుక తిన్నెలపై వసియించియుండిరి. రాజారావుమాత్రము తల వాల్చుకొని యేదియో ఆలోచనలో మునిగి, స్నేహితులతో మాటలాడక కూర్చుండి యున్నాడు. ఆలం రాజారావు ప్రక్కజేరి యాతనిచుట్టి 'రాజా! నీస్నేహితులందరి హృదయాలు నిన్ను ఆవరించిఉన్నాయోయి! నువ్వు దహించుకుపోతోంటే ఈతురక బిడ్డ మోటు మనస్సుకూడా నీరయిపోతోంది. మా అందరిలోకి గట్టి మనస్సు నీది' అన్నాడు.

రాజారావు బొటబొట కన్నీటి కాలువలైనాడు.

## ౧౧
## పరివర్తనము

నారాయణుని తండ్రికి శస్త్రచికిత్స చేయునప్పుడు శ్యామసుందరీదేవి చెంతనే యున్నది. తరువాత నారాయణుని దగ్గరకు వెళ్ళి 'అన్నా! మీతండ్రిగారు భీష్ములు వారులా ఉన్నారు. ఏమి బలం, ఏమి ధైర్యము, ఆవిగ్రహం ఏమిటి! మీ యిద్దరు కవలపిల్లలలా ఉన్నారు. నీకంటె ఇంక కొంచెం మాంచి కండలుగట్టిన మనిషి. ఆయన ముఖానకూడా కొంచెమయినా బాధ కనబరచకుండా ఉండడం నాకు ఎంతైనా ఆశ్చర్య మయిపోయింది. ఆయన పాదాలదగ్గిర కూర్చుండి ఆయనను ప్రతిరోజూ పూజచేస్తే నా జన్మం తరిస్తుంది. ఆయన నాతండ్రికూడాను. అన్నా! నీహృదయం నొవ్వలేదుకదా, నాన్నగారి బాధచూసి?' అన్నది.

ఆమె కన్నులు కరుణార్ద్రములై ప్రేమపూరితములై యాతని దిలకించినవి.

నారాయణరా వామెకు అనంత కృతజ్ఞతతో నమస్కరించి 'తల్లీ నీ వింత ప్రేమమయివేమిటమ్మా?' యని తన కారుమీద నెక్కించిపంపెను.

శ్యామసుందరీదేవి పరీక్షలకు జదువునప్పుడు రాజారావెంతయో సహాయము జేయ నారంభించెను.

కాలేజీ వదలి యేడాదిపాటు, వివిధ వైద్యాలయములలో విద్య సంపూర్ణము చేసికొని అమలాపురముపోయి వృత్తినారంభించినవెనుక రాజారావుపట్టినది బంగార మయ్యెను. రాజారావు రోగదశ, రోగజాతి (నిదానము) నిముషమున గుర్తెరుగు చుండెను. వైద్యముతోపాటు, రాజారావు మొదటినుండియు సద్గ్రంథముల జదువు కొనుచు, సత్తమభావములలో బులకించుచు సత్తమాశయముల కూర్చుకొనుచుం డెను. తనపూర్వులు తరతరములనుండియు సముపార్జించి యిచ్చిన బ్రహ్మవిద్యా మూలముచేనేమి, యాతని పూర్వకర్మచేనేమి రాజారావునకు (ఇంట్యూషన్) అతీంద్రియశక్తి యున్నది. కావుననే రోగలక్షణము లవలీలగ గ్రహించువాడు. పడవల సిన కాలమునకు సరియైనమందు పడుచుండెను. 'ఏమాత్ర మాయుర్దాయమున్నా ఆయన చేతిలో రోగి బ్రతుకవలసినదేనండి. ఏమి వైద్యుడండి. ఏమి హస్తవిశేష మండి' యని రాజారావును బొగడని కుటుంబి లే డమలాపురములోను, చుట్టు ప్రక్కల గ్రామములలోను.

రాజారావు, తండ్రిగారి సహాయమున, నారాయణరావు సహాయమున మూడు వేల రూపాయలు పెట్టుబడి పెట్టి తన వైద్యశాల నారంభించెను. అమలాపురములో మంచియిల్లద్దెకు పుచ్చుకొని అది యంతయు శుభ్రమైన వెల్లవేయించి మందుల బీరు వాలకు మందులకు బల్లలకు నొకగది, నిలువమందులకు సామానులకు నొకగది, తాను రోగుల పరిశీలించుట కొకగది, తాను వ్రాసికొనుటకు నడుము వాల్చుటకు

వైద్యసంబంధమున గాక స్నేహితులతో మాటలాడుట కొకగది, మూత్రాదుల పరీక్ష చేయుట కొకగది శస్త్రచికిత్స కొకగది యేర్పాటు చేసెను.

నారాయణరావు దేశయాత్రలు చేసి వచ్చినప్పుడు దయచేసి వైద్యశాల యంతయు మరియు బాగుగ నమర్చెను. మందులు కలిపియిచ్చు గదిలో, రోగుల బరీక్షించు గదిలో, రోగులు కూర్చుండుగదిలో, ఆరోగ్యసంతుల బొమ్మలు. ఇంగ్లండునుండి వచ్చు ఆరోగ్యపత్రికలనుండి కత్తిరించినవానిని పటములు కట్టించి వ్రేలాడదీసెను.

రాజారావు కూర్చుండు గదిలో అభినవ భారతీయ చిత్రముల గొని యలంకరించినాడు నారాయణరావు.

రాజారావు ఉపనిషత్తులనుండియు, యోగసూత్రములనుండియు, భగవద్గీతనుండియు ఉత్తేజకములు భక్తి మధురములునగు వాక్యములు మనోహ్లాదకరముగ వ్రాయించి, వానికి బటములుగట్టి వ్రేలాడదీయించినాడు, తన వైద్యశాల యందక్కడక్కడ.

కొన్ని సాధారణారోగ్యవిషయములు ముఖ్యముగా బ్రజలు గమనింపవలసిన సూత్రము లొక పెద్దగుడ్డపై పటమువలె వ్రాయించి రోగులు మొదలగువారు కూర్చుండుచోట గట్టించెను. మైసూరులో గంధపుచెక్కతో, విన్నాణముగ శిల్పు ముట్టిపడునట్లు చెక్కిన శ్రీకృష్ణుని వివిధ శైశవ క్రీడలజూపు విగ్రహములు, నీకు దొరికినవి అయినారు గొనిరమ్మని నారాయణరావునకు చెన్నపురికి వ్రాసి, నారాయణరావు వానిని బంపినవెనుక నాతడు తన వైద్యశాలలో నక్కడక్కడ వాని నలంకరించినాడు. ' దేహవైద్యము హృదయవైద్యము, ఆత్మవైద్యము అన్నియు నొకేసారి జరగాలని ఇల్లా పెట్టాను. ముఖ్యంగా చివర రెండు వైద్యాలు నాకోసంలెండి ' అని రాజారావు తన స్నేహితులతో ననుచుండును.

వైద్యమునకు వలయు మందులన్నియు సంపూర్ణముగా దెప్పించి యుంచికొన్నాడు, ఏ కాలమునకో గాని యవసరము రాని ఖరీదుగల మందైనను సరియే. అప్పుడు చెన్నపురికి తంతినిచ్చి తెప్పించుటకు బ్రయత్నించు వైద్యుడు ద్రోహియని యాతనివాదము. కావుననే "డాక్టరు రాజారావుగారి ఆస్పత్రిలోనండి, కాకినాడ గవర్నమెంటు ఆస్పత్రిలో గూడా లేని మందు లున్నాయండి," అని యాతనిగూర్చి పల్లెటూళ్ళ వెంబడి పేరు మ్రోగినది.

ఆతడు గ్రామములు సులభముగా బోవుటకై మోటారుసైకిలు (పక్కబండీతో సహాయున్న) బండి తెప్పించుకొన్నాడు. ఎచ్చటకు బోయిన నచ్చటకు వెంటబెట్టికొని తిరుగుటకు ఆతనికడ రెండు పెట్టెలు ఒక ఖద్దరు సంచియు నున్నవి. ఖద్దరు సంచి చాలా చిన్నది. ఎనిమిదంగుళముల చదరము అందు రెండరలు, పట్టుకొనుటకు గూడా త్రాడు; మొదటి అరలో గుండెపరీక్ష జేయు యంత్రము, ఆయుర్వేదౌషధపు బొట్లములున్న యొక చిన్న దంతపుపెట్టె (పరమేశ్వరమూర్తి బహుమతి)

రెండవ యరలో, శరీరమున మందు పొడచుటకు సూది పిచికారి పెట్టెయు, ఒక చిన్న ఇత్తడిపెట్టెలో సూదిమందులు, ఎడ్రినాలిన్, పిట్రూటిన్, స్ట్రికినైను, డిజిటాలిను మందుల గాజుగొట్టములు నుండును.

పెద్దపెట్టెలలో నొకటి చిన్న వైద్యశాలయే. ముఖ్యములగు మందులన్నియు, తాత్కాలిక శస్త్రచికిత్సకు వలయు పరికరములు నందుండును రెండవపెట్టెలో పొడుపుమందుల రకములన్నియు, అన్నిరకముల సూది - పిచికారీలు మొదలగు సామానంతయు నుండును.

రాజారావునకు మొదటినెల రెండువందలు వచ్చినవి. రెండవనెల నాలుగు వందలు, మూడవనెలనుంచి మాసమాస మయిదు వందల రూకలు వచ్చుచున్నవి. నారాయణరా విచ్చిన వేయిరూకలు నాతడు తిరిగి యిచ్చివేసెను.

ఆతనిపేరు కోనసీమయంతట ప్రాకిపోయినది. నెమ్మదిగ గోదావరి అద్దరిని యిద్దరిని రాజారావును వైద్యములకై గొనిపోవ నారంభించినారు.

అంతతో ఎచ్చటనుండి వచ్చినదో మాయమృత్యుదేవత ! ఇరువురు బిడ్డలును తల్లిలేనివారయినారు.

మోహావేశమేగాని ప్రేమ యన నెట్టిదో యెఱుగని చిననాటి దినములలో భార్య కాపురమునకు వచ్చినది. ఎన్నిసార్లు వివేకానందుని చదివిన నేమి ? ఎన్నిసార్లు జ్ఞానానందుని విన్న నేమి ? ఆ వేదాంతము మనస్సునుండి అంతఃకరణమునకైన నంటినదా ?

రామమోహనరాయలు బోధించిననేమి, వీరేశలింగముగారు పాఠములు చెప్పిననేమి, సాంఘిక ధర్మ మర్థమయినదా ? తన భార్యను జిన్నతనములో గలసికొనకయున్నచో, నామె ఆరోగ్యవంతురాలై యుండెడిదేమో ? పుష్పవతి యగుట తరువాయిగ భారతీయుడు బాలికను గలియుటయేకదా ?

భార్య బ్రతికినంతకాలము గోపురంధ్రీమతల్లి, ప్రేమజీవి ! ఆమె నెరిగెనా తాను ? ఆమె తన బిడ్డలకు దల్లి యన్నయాటయేకదా తనకు దెలిసినది. 'పరమేశ్వరా ! నా కర్తవ్యమేమి ? తండ్రీ ! యీ పరీక్ష నీదా ? నా వేదాంతము పరీక్షచేయ దలచుకొన్నావా ? డబ్బుగణిస్తూ యింటిలో మూటలుకట్టే యీ విచిత్ర రోగి నారాయణ సేవ నీకు నచ్చినదా ? నా హృదయం కల్మషం అయ్యేవుంది చిన్నతనాన్నుంచిన్ని. కాబట్టే నన్ను తరింపచెయ్యాలని వచ్చిన నా అన్నపూర్ణని నేను బ్రతికించుకోలేకపోయాను. నా బిడ్డలను తల్లిలేనివారిగా చేశాను.' అని రాజారావు క్రుంగిపోవుచుండెను.

చుట్టుప్రక్కల చుట్టాలు, సంబంధములు తీసికొనివచ్చి రాజారావుకు వివాహము చెయ్యవలెనని ప్రయత్నించిరి. రాజారావు 'ఆ మాట తలపెట్టకండి' అని చెప్పినాడు.

పైకి ధైర్యముగ రాజారావు తిరుగుచునే యున్నాడు. ఇదివరకు నాటకము లన్న నిష్టములేదు. సంగీతమన్న చిదుపుకో త్రిప్పు కవిత్వమన్న కనులు తిరుగును. కవియన్న నసహ్యము.

అయ్యో ఎంత కష్టము అని యెవరైన అనినచో 'ఏమిటి కష్టము' ఎవరికి, ఆత్మకా? అని ప్రశ్నించేవాడు.

'ఇతడు వట్టి పొడివేదాంతి' అని హేళన చేసేవాడు పరమేశ్వరుడు. రాజారావును. సినిమాలకు వెళ్ళితే, ఎప్పుడైనా తన స్నేహితులతో వెళ్లుట: వారికొరకే. సంగీతపు కచ్చేరీలు మొదలగు వానికి 'యిష్టు'లకు వెళ్ళును అందులకే.

అట్టి రాజారావు నేడు అబలయైనాడు. చంటిబిడ్డ ఏడ్చిన, అతని కన్నులనీరు తిరుగును. కరుణార్ద్రములగు కథలువిన్న భరింపలేడు. పురాణాలన్నియు జదువ ప్రారంభించినాడు. చదువుచు జదువుచు దన్మయుడైపోవును. ఏమి యీ కవిత్వము అనును. రోగులు వారంతట వారిచ్చినచో ఫీజులు పుచ్చుకొనును, లేనిచో లేదు. చెవులనుండి బిరడా తీసినట్లు సంగీతము వినును. కన్నులనుండి తెరతొలగినట్లు నాటకములు సినిమాలు చూచును.

అతడిప్పుడు తన హృదయమును గనుగొన్నాడు. నేడు తన వైద్యశాలలో నమర్చిన బాలకృష్ణుని లీలలు పరమార్థము కాసాగినవి. భగవద్గీతలో పురుషోత్తమ భావముయొక్క అర్థము గోచరింపసాగెను.

'కృష్ణా! కృష్ణా! భక్తిలేని యీ హృదయమునకు భక్తిపరిమళము నిచ్చి నావా? నా భార్యను గొనిపోయి' యని హృదయములో ననుకొనుచు కంటికిపెట్టిన జోడుతీసికొని కన్నులు తుడుచుకొని తలవంచి నమస్కరించినాడు.

## ౧౨

## ఆత్మహత్య

'నా హృదయము నారాయణరావు నావరించి వదలి రాకున్నదేల?' అను ప్రశ్న శ్యామసుందరిని వీడలేదు. నారాయణునిపై తనకున్న ప్రేమతత్త్వ మెట్టిదో యని యాలోచించుకొన్నది. ఆ ప్రేమ వాంఛాప్రేరితము మాత్రముకాదు. అది ఒక్కసారే కరిగినది. నే డాతడు ప్రేమార్ద్రుడైవచ్చి తన్ను కోరినను - దాసు కుంచించుకొని పోవలసినదే. ఆ దినమున తన శరీరాంగములన్నియు నుప్పొంగి పోయినవి. మూర్తీభవించిన అతని పురుషత్వము తలచుకొన్నను నేడు పుల్కయైన జనింపకుండుట కాశ్చర్యమొందినది శ్యామసుందరీదేవి.

ఆ దివ్య ముహూర్తము, తానాతని కౌగిలిలో కరిగిపోయిన పరమప్రసన్నత, తనజీవితములో ముందుకు దారిజూపు దివ్యతేజస్సువంటిది యని యామె నిర్ధారణ చేసికొన్నది. అప్పటి నుండియు నామెకు సకలలోకములు తన్ను జుట్టుకొన్నట్లు భావము తోచినది. 'నే నందరిని ప్రేమించుచున్నాను. నన్నందరు ప్రేమించు

చున్నారు. నేను ప్రేమమూర్తిని. ప్రేమచే నందరు నాలో నున్నా' రన్న దివ్యవాణి తనలో ప్రతిధ్వనించుచున్నదని యామె భావించుకొన్నది. ఆనాటినుండి ఆమె ప్రతి జీవియందును ప్రేమాను భావము జూచినది.

ఇంతలో రాజారావు వచ్చినాడు, సుబ్బారాయుడుగారి జబ్బుకొరకు. రాజారావు నకు భార్యపోయినదా? ఆయన జన్మము తరించు సంసారనౌక విచ్ఛిన్నమయి పోయినదా? ఆయనతో జేయిచేయి కలుపుకొని బ్రతుకు తెరవు నడచు దాటసారి భగ్నమై పోయిందా? ఆమె కిరువురు బిడ్డలట ఆ బిడ్డలనాదరించి పెంచువా రెవరు? మూడుకాళ్ళ ముదుసలియగు మాతామహియా?

రాజారావు వివాహమేల యాడకూడదు. ఛీ! అదేమి యాలోచన.. ఆయన వేదాంతి యనియు, అందువలన ఆయన హృదయము కర్కశమైనదనియు దనతో నొకనాడు నారాయణరావు చెప్పినాడు. అట్టి పుణ్యపురుషుడు మరల వివాహము చేసుకొనునా. ఆయన బాలికల యదృష్టమెట్టిదో? తనతో నారాయణరావు అన్నగారు సూరమాంబ పావనచరిత్రయని చెప్పినాడు. గంభీర హృదయుడగు నారాయణరావే ఆమె పేరు తలచుకొని కన్నీరు పెట్టుకొన్నాడు. ఆ వార్తనిని సూరీడుచెల్లి తన ఒడిలోనికి జేరి, వెక్కి, వెక్కి వాపోయినది ఆ సూరమాంబ ఎంతిసాధ్వియో?

ఇట్టి యాలోచనలు తన్నావరించుకొన వదలించుకొనుచు వైద్యపరీక్షకై సంపూర్ణ దీక్షవహించి చదువుకొనుచున్నది శ్యామసుందరి

ఇంతలో రాజేశ్వరరావు విషము పుచ్చుకొని చనిపోయినాడని, రోహిణి వార్త తెచ్చినది.

'అదేమిటే? ఆ నాయుళ్ళబ్బాయి ఎప్పుడూ సంతోషంగా ఉండేవాడు! అల్లాంటివాడు ప్రపంచం అంతా పాడుచేద్దామని తిరిగే పాపపు మనిషి విషం పుచ్చు కోవడమేమిటి?'

అప్పుడే నారాయణరావు, రాజారావు, లక్ష్మీపతి పరమేశ్వరమూర్తి లక్కడకు వచ్చినారు.

నారా:—రాజేశ్వరరావు విషముపుచ్చుకొని చచ్చిపోయినాడని నాకు టెలిగ్రాం వచ్చినది చెల్లీ! నీ చదువు అడ్డం కొడ్తున్నాను. నాకు రెండుత్తరాలు యివాళ వచ్చినాయి. టెలిగ్రాం హైదరాబాదు పోలీసువారు పంపించినారు. ఉత్తరాలు రాజేశ్వరుడు ఇంకో నిమిషానికి విషం పుచ్చుకోబోతూ వ్రాసినవి. అందులో నీ కోటి ఉన్నది, అది నేను విప్పలేదు. నా పేరున నీకు వ్రాసినాడు. ఇదిగో.

శ్యామ సుందరి ఆ యుత్తరమును నారాయణరావు చేతినుండి కంపిత హస్తములతో తీసికొని బల్లపై పెట్టి యిట్లు చెప్పనారంభించినది.

'నా స్నేహితులు. నాకు సహోదరులవంటి వారగు, మీ దగ్గర చెప్పు తున్నాను.

'మూడేళ్ళ క్రిందట రాజేశ్వరరావు మా యింటికి స్నేహితుడుగా వచ్చేవాడు. అతన్ని వేరే స్నేహితుడు తీసుకొనివచ్చి పరిచయంచేసినాడు. సరదాగా మాట్లాడుతూ నవ్వించే హాస్యం చేస్తూ, సంగీతాన్ని చిత్రలేఖనాన్ని హేళనచేస్తూ మా యింటికి యెప్పుడూ వస్తూండేవాడు. ఒకనాడు స్వతంత్రప్రేమ అని ఒక ఉపన్యాసం ప్రారంభించాడు. అంతా చెప్పి 'నీ మీద నాకు చాలా ప్రేమ ఉన్నది. నీకూ అలాగే నా మీద ప్రేమవుంటే నన్ను పాలించుకో' అన్నాడు అన్నా! నేను మాటలాడలేక పోయాను మూర్ఛవచ్చినట్లయినది. ఒక్కసారిగా లేచి, మహాకోపంతో 'నిన్ను సముద్రంలో ఉదుకు దుర్మార్గుడా! రాక్షసుడా!' అని నన్ను తెలియకుండా కేకలు వేశాను. నాటి నేటికి అతన్ని చూడలేదు. అప్పుడప్పుడు మీ సంభాషణలో అతడు మీ స్నేహితుడని విన్నాను. అంతే ఆ ఉత్తరంమీరే అందరికీ చదివి వినిపించండి అన్నగారు!' అనినది. ఆమె ఆడుసింహమువలె క్రోధరూపయైనది. మోము జేవురించినది. సహజముగు నామె సౌందర్యమునకు కోపముచే విపరీతశోభ వచ్చినది.'

నారాయణరావు ఆ కవరు చింపి, లోన ఉత్తరముతీసి మడతవిప్పి ఇట్లు చదువ నారంభించినాడు.

'శ్రీ శ్యామసుందరీదేవికి—

అమ్మా నమస్కారములు. ఈ పాపిని నువ్వు ఈ పాటికి మరచిపోయి ఉండవచ్చును. ఆ రోజున నువ్వు ప్రళయకాళ్త్రివలె లేచి నాపై కేకలువేస్తే భయపడి పారిపోయాను. నేను నా అభిప్రాయాల్ని సత్యమైనవానిగా నమ్మాను. అవే మీకూ చెప్పాను. చెప్పి నా హృదయంలోఉన్న కోర్కె మీకు తెలియపర్చాను. ఇంతే. ఏ వనితామణిని నేను హీనముగాగాని, హేళనగాగాని చూడలేదు. భగవంతు డనే వాడు వుంటే, ఆడవాళ్ళే ఆయన అవతారాలని, సైతాను అనే దెయ్యంవుంటే మగ వాళ్ళే ఆతని అవతారాలని నా ఉద్దేశం.

'నేను ఆ రోజున అన్న ముక్కలకు నామైని చాలా తప్పు అభిప్రాయం పడ్డారని నాకు మన స్నేహితుడు చెప్పాడు. అప్పుడే మీకు ఉత్తరం వ్రాయాలని అనుకున్నాను. తల్లీ! నా ఉద్దేశం, నా అభిప్రాయాలలో సత్యము ఉన్నది. నేను తుచ్ఛుడనే. మీరు పరపురుషుల్ని చేరేటటువంటి మనుష్యులని ఉద్దేశింపబడి అన్నది కాదు. నేను మనసులో ఒక ఉద్దేశం పైకి ఒకఉద్దేశం ఉంచుకునే వాణ్ణిగాను. కాబట్టి అప్పుడు నాకు ప్రేమ కలిగినప్పుడు (వాంఛ అనండి) ఆ సంగతి దాచుకోకుండా మీతో అన్నాను. అంతే. మిమ్ము అప్పటినుండి క్షమాపణ కోరవలెనని అనుకొన్నాను, గాని వీలులేకపోయింది. నేడు నా ఉద్దేశాలు మారాయోలేదో చెప్పలేని విషమ సంధిలోకి వచ్చి నారాయణుని ఉత్తరంలో రాసిన కారణాలవల్ల ఈ ప్రపంచం వదలివేస్తున్నాను. మీరు క్షమిస్తే నాకు ఆత్మ అనేదియుంటే అది సంతోషిస్తుంది. తల్లీ నమస్కారాలు.

—రాజేశ్వరుడు.

అందరూ స్తంభించి పోయినారు. నారాయణరావు శ్యామసుందరివైపు తిరిగి. 'అమ్మా! ఆతని ఆత్మతరఫున క్షమించమని నిన్ను కోరుతున్నాను' అని అడిగి నాడు. శ్యామసుందరి కన్నుల నీరు తిరుగ 'అన్నా! అతన్ని గురించి నేను తప్పు అభిప్రాయము పడినందుకు ఆతని ఆత్మను క్షమార్పణ అడుగవలసి ఉన్నది. భగవంతుడు అతని ఆత్మకు శాంతి నిచ్చుగాక' అని అన్నది

మాటలాడక స్నేహితులందరూ దాపలకువచ్చినారు. రోహిణీదేవి వారికడకు వచ్చి 'నారాయణరావు అన్నా: రాజేశ్వరుడు విషం పుచ్చుకొని చనిపోయినాడా?'. అని అడిగింది.

'అవునమ్మా'

'ఏమిటీ కారణం?'

'ఈ ఉత్తరం చదువుకో! తర్వాత నేను చెప్తాను.'

రోహిణి ఆ యుత్తరము దీసికొని చదివికొన నారంభించినది.

'నా ప్రియ సోదరుడగు నారాయణా! నీ చేయియేది? నేను సెలవు తీసుకుంటున్నారా! నాకు చాలా పెద్ద ప్రయాణం వుందో, లేదో ఇంతటితో ఆఖరో తెలియదు. కాని ఇంతవరకు దివ్యంగా బ్రతికాను. యుద్ధంలో అభిమన్యకుమారుడిలా ఆయుధంతో జన్మ విసర్జిస్తున్నాను. జన్మ విసర్జించటంకాదు ఆఖరు చేయటం! ఏమోరా? ఏదయినా ఇబ్బందిలేదు.

'పుష్పశీల ప్రతిమధుపానికి తన మధువును ఇస్తోంది? మంచిపేరు పెట్టాడు. కాని ఆమె ఏమిచేస్తుంది? పాపం నేనే ఆవిడ బ్రతుకు, ఒక లంగరుకు కట్టివుంటే, లంగరు త్రాడుకోసేశాను.

'ఇంతకూ ఆవిడ పుష్పం అయినందుకు నాకు మనస్సులో ఈర్ష్య పుట్టింది. కాదనుకొని ఎంత సమాధానం చెప్పుకొన్నా లాభం లేకపోయింది. నామతం మా మతానికి విరుద్ధం అయింది. మా ఆశయాలు గంగలో కలసినవి.

'అయితే అయింది నువ్వు చెప్పిన బోధఅంతా ఆలోచించి చూశా! ఎక్కడా సమాధానం కుదరదు. కాని అవునేమో అన్న అనుమానం పట్టుకుంది. అనుమానాన్ని దూరంగా తోలివేద్దాము అనుకుంటే లాభం లేకపోయింది.

'ఈర్ష్య ఎక్కువైతే, పుష్పశీలాదేవి నా మీద ప్రేమ పూర్తిగా వదలి, ఇంకోళ్ళను ప్రేమించి నాదగ్గరనుంచి వెళ్ళితే, ఈ యీర్ష్య వదలక నన్ను బాధిస్తే? ఎల్లాగ.

'అది కాకుండా పుష్పశీలమీద ప్రేమపోదే! ఎంత ప్రయత్నించినా? ఆమె నన్ను విడిచి వెళ్ళిపోతే బ్రతకడం ఎట్లాగు? ఆమె మనస్సు చల్లపడిపోయింది. చల్లగా జారిపోయినది. పోనీ ఎల్లాగో నేను ఆ దేవిని విడిచి ఉంటాననుకో. ఉంటే మాత్రం ఈ జన్మకేమి సార్థక్యం? ఇంకో జన్మ ఉందీ! సరే! మళ్ళీ పుట్టాను.

అప్పుడైనా ఈ హృదయంతో ఉన్న ఈ తుపాను, ఈ మంట, ఈ అగ్నిపర్వతం చల్లారిపోయి, నాకు నిజము గోచరిస్తుందేమో ?

'లేదు, యింతటితో ఈ జీవితం ఆఖరు అయితే అపరిమి తానందంలో బ్రతికిన నేను దుఃఖం ఎల్లా భరించనురా!

'సెలవు. నువ్వూ, పరమేశ్వరుడు, రాజా, ఆలం, సత్యం, రాఘవపురం నన్ను ఎంతో ప్రేమించారు. మీ అందరి దగ్గరా సెలవు. చాలా ధైర్యంతోను, భయంలే కుండాను నాజన్మం ముగిస్తున్నా.

ఈ ఉత్తరం అందరికీ చూపించు. మీ అందర్నీ కౌగలిస్తున్నా.

నమస్తే

రాజేశ్వరుడు.

'తా॥ క॥ మాతల్లిగార్ని వెళ్ళి ఊరార్చు, వృద్ధ; రాజే.'

ఈ ఉత్తరం చదువలేక చదివినది రోహిణీదేవి. నిశ్శబ్దము.

'పిరికివాడురా' అన్నాడు పరమేశ్వరుడు.

నారా :—పిరికివాడేమిటి? వాడికి సరియైన మార్గం గోచరించలేదు. నామాటలు కూడా వాడి చావుకు కారణమయ్యాయా, అని నాకు చాలా దిగులుగా ఉన్నది. ఏమి హృదయం!

రాజా :—అదేమిటి నారాయుడూ? వెఱ్ఱిగా మాట్లాడుతున్నావు?

పర :—ఏమి చెప్పగలంరా? మనుష్యునిహృదయం ఎప్పుడెల్లా వెడుతుందో?

## ౧౩

## వేదాంతబోధ

శారదకు క్రమముగా అత్తవారింటను, మదరాసులో భర్త నెలకొల్పిన కాపురఃపుటింటిలోను చనువుగా మెలంగుట అలవాటయినది. సూరీడు తన వదినగారితో ప్రేమ యుట్టిపడునట్లు మాట్లాడును. వదినగారి నెల్లప్పుడు పలుకరించును, మాట్లాడించును. శారద యొంటిగా గూర్చుండ, నచ్చట నామెకు దోడుగ నుండుటకు బోవును.

శారద యత్తవారింట నున్నప్పు డేరితోడను అంత మాట్లాడునదికాదు. ఒక సూరీడుతో మాత్రము మాట్లాడునది. సూరీడును శారదయు జెన్నపట్టణములో గలిసి యున్నప్పుడు వారిరువురకు బ్రాణస్నేహము కలిగినది.

ఇప్పుడు శారద యత్తగారితో మాట్లాడుచున్నది. ఆడుబిడ్డలందరితోడను మాట్లాడును. మామగారు తనకేదైన కావలయునని సూరీడును బిలిచినప్పుడు, శారద దాను వెళ్ళి 'యేమి కావాలండి' యని యడుగును. సుబ్బారాయుడుగారు 'నీ కెందుకులే అమ్మా' అనుటయు సిగ్గుపడి వెళ్ళి సూరీడు నచటి కంపును.

తనలో ఎందుకీ మార్పుగలిగినదో, అత్తగారితో, ఆడుబిడ్డలతో, మామగారితో తానీ మాత్రమైన నేల మాట్లాడుట మొదలు పెట్టెనో యామెకు దెలియదు. రెండు మూడు సారులామె ఆలోచించుకొని మాట్లాడక యుండవలయునని యనుకొన్నది. కాని యంతకు రెట్టింపుసారులు అప్రయత్నముగ వారితో మాట్లాడినది. ఆమె హృదయము ప్రేమమయము. తండ్రిపోలిక. అత్తవారియింట చనువేర్పడగనే యా మహాప్రవాహములో బడిపోయినది.

సూరీడుకు తలదువ్వుట నేర్చుకొన్నది. పిల్లల జనవుగా నాడించుట మొదలిడినది.

ఇంతలో శకుంతల, చెల్లెలు తన మరిదిగారి యింటికి వచ్చినదనియు మరిదిగారి తండ్రికి వైద్యము చేయించుటకు చెన్నపట్టణము తీసికొని వచ్చినారనియు దెలిసి, యనంతపురమునుండి, చెన్నపట్టణము తన మేనత్తకుమారునియింటికిరువురు బిడ్డలతోడను వచ్చినది.

నారాయణరావునందు గౌరవము కుదిరినప్పటినుండియు శకుంతలకు తన భర్తయెడ దొంటివైఖరి మారిపోయినది.

జగన్మోహనుని వివాహానంతరము తిరిగి భర్తకడకు వెళ్ళినప్పుడు, భర్త తనపై కేకలు వేసినప్పుడు మరలజవాబు చెప్పెడిదికాదు. ఆ రోజునుండి భర్తకు వలయు దుస్తులందించుట, స్నానమునకు నీరు తోడించుట మొదలగు పరిచర్యలన్నియు సేవకులచే జేయించుటమాని, తానే చేయ దొరకొన్నది. విశ్వేశ్వరరావుగారికి భార్య పరివర్తన మాశ్చర్యము కలిగించినది.

ఇంటివిషయమైన యన్నియు కనుంగొనుట కారంభించినది. భర్త పక్కపై పరుపులు సరియైనవి లేవని, రాయలసీమలో దొరకు మంచి దూదితో చక్కని పరుపులు కుట్టించినది. రంగు రంగుల ఖద్దరు దుప్పట్లు కొన్నది. భర్త మంచముపై పెద్ద దోమతెర కట్టించినది. స్వయముగా తాంబూలము చుట్టి యిచ్చినది. విశ్వేశ్వరరావు ఇది యంతయు జూచి ఆశ్చర్యమునంది 'ఏమిటిది, ఇంతశ్రద్ధ ఎప్పటినుంచి వచ్చింది. ఏదైనా ఉద్దేశంతో చేస్తున్నావా?' అని యడిగెను. భర్తను గద్దించి మాఱుపలుకుచుండు శకుంతల నేడు మాట్లాడక చిరునవ్వున తనదారిని పోయినది. ఆమె కిప్పుడు మరల గర్భము.

ఆనందరావుగారి కారులో దనబిడ్డలదీసికొని శకుంతలతిన్నగా నారాయణరావుగారి యింటికి వచ్చినది. శారద మోము ప్రఫుల్లమయ్యెను. శకుంతల సుబ్బారాయుడుగారిని చూచుటకు వచ్చినదని తెలియగనే జానకమ్మగారు సంతోషాశ్చర్యముల నందిరి. శకుంతల యందరిని బలుకరించి తిన్నగా దన చెల్లెలితో సుబ్బారాయుడుగారు పండుకొన్న గదిలోనికివెళ్ళి 'మామయ్యగారూ! వంట్లో కులాసాగా ఉన్నదాండి?' అని పలుకరించెను. సుబ్బారాయుడుగారు శకుంతల నానవాలుపట్టి చిరు

నవ్వుతో గదినెల్ల వెలిగించుచు, 'అమ్మా కూర్చో! శారదా! కూర్చో' యనియెను. శారదయు శకుంతలయు నవ్వుటనే యొక సోఫాపై నధివసించిరి.

'మీకు జబ్బుచేసిందనీ, యిక్కడకు శస్త్రం చేయించుటకు వెళ్ళుచున్నారనీ మా బావయ్యగారు ఉత్తరం రాశారు. మా పెళ్లాయి కూడా యూళ్లోనుంచి, శస్త్ర వైద్యం అయిందని మీకు చాలా కులాసాగా ఉన్నదనీ వ్రాసింది. ఉత్తరాలు రాగానే మీ అబ్బాయిగారినడిగి, వచ్చానండి. పుండు మానిందాండి.'

'వేలు కొట్టేశారమ్మా'

'అదేమిటి? మామయ్యగారూ?'

'వేలిమీద ఏదో వ్రణంట. ఆ వేలు కొంచెం ఎప్పటిక్కీ అలాగే పాడయిందట. అందుకని తీసివేశారు'

'ఏ వేలండి'

'చిటికెనవేలే. కుడిచెయ్యికి కూడాను. మా అబ్బాయిగారు, పిల్లలు అందరూ కులాసాగా ఉంటున్నారా అమ్మా? పిల్లలూ నీ బిడ్డలామ్మా!' ఆ బిడ్డల తనకడకురమ్మని నవ్వుచు సుబ్బారాయుడుగారు పిలిచినారు. పెద్దకుర్రవాడు మాత్రమే సుబ్బారాయుడుగారి కడకు వచ్చినాడు. సుబ్బారాయుడుగారు వానిని తలనిమిరి, 'నాయనా ఆడుకో! వెళ్ళి' అని అన్నారు.

భోజనములైనవెనుక నాడువారందరు కూర్చున్నారు. వెంకాయమ్మ అప్పుడే యమ్మమ్మకూడ నైనది. ఆమె ఎప్పుడూ మాట్లాడుచుండును. ఆమెకు గ్రొత్తలేదు. తన పెత్తల్లికి శిష్యురాలయి పంచీకరణపు పట్టుపేయుట, అచల బ్రహ్మనుగురించి మాటలాడుచు శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దరువులు పాడుకొనుట మొదలగునవి యన్నియు, నేర్చుకొన్నది. చుట్టము లందరనీ పలుకరించి వారిని కూడగట్టుకొని యుండుట యామెకు ప్రీతి. భర్తగారు పద్ధతి నియోగి, పట్టుదల మానిసియు నగుట తానును భర్త కనుగుణముగ నాచారమున పూర్ణముగ బట్టుదల చూపును.

యజ్ఞనారాయణశాస్త్రి వివాహోపనయనాది విధులు చేయించగలరు. వేదములు ఎనభైనాలుగు పన్నాలు నేర్చుకొన్నాడు. ఉర్లాము వెళ్ళి బహుమతి నొందు సామర్థ్యము సంపాదించుకొన్నాడు. వారి గ్రామమంతయు పద్ధతినియోగులే. యజ్ఞనారాయణశాస్త్రి వసతిగల పెద్ద సంసారి. స్వంతకమతము ఎనభై యకరాల పల్లపు మాగాణియున్నది. వారింట వంటలక్కలు పనికిరారు. కాబట్టి కోడండ్రందరు పని చేయవలసినదే. పుట్టింటికడ పని ముట్టుకొనుట యెరుంగని వెంకాయమ్మ అత్తింటి కడ 'ఏమి పనివంతురాలమ్మా' యనిపించుకున్నది.

శారదను దగ్గరకు జేర్చుకొని 'ఏమో, శారదా! మీ అక్కయ్యగారికి అన్నీ శ్రద్ధగా కనుక్కుంటున్నావా, అమ్మా?' యని ప్రశ్నించినది.

శకుం:—అదేమిటండీ వదినగారూ. మా అమ్మాయి మనస్సుని కనుక్కుంటే ఏమి గొప్పండీ!

వెంకా :—అమ్మో బ్రహ్మాస్త్రము పంపించారు. మా యింటికి కోడలయినప్పుడు మీ అమ్మాయి ఎల్లా అవుతుందండీ వదినగారూ! మీకు మాకు కనుక్కోవల సిందే శారద.

:—ఎల్లాగయినా తటవర్తివారికి జవాబులు చెప్పలేము. మీ పెద్దన్నగారు వకీలు, మీ తమ్ముడు వకీలు, మీరుకూడా న్యాయంగా వకీలుగారన్నమాటే. మీ వాదనకు మేము జవాబు చెప్పలేమండోయి.

జాన :—అదేమిటమ్మా కోడలా, మీ ఆయన కలెక్టరు. ప్లీడర్లువచ్చి ఆయనదగ్గర వాదించవలసిందేగా. భర్త కలెక్టరయితే భార్య కలెక్టరుకాదూ ప్లీడ రెంత వాదించినా కలెక్టరుగారు కొట్టివేస్తారు.

శకుం :—అత్తయ్యగారు హైకోర్టు వకీలై, వదినగారితో కలిస్తే కలెక్టర్లుకూడా ఆర్డర్లు వేయడానికి వీలులేదు.

అందరు ఘొల్లున నవ్వుకొన్నారు. ఇంతలో వంటయింటి పనియంతయు ముగించుకొని లక్ష్మీనరసమ్మగారుకూడ నచ్చటకివచ్చి కూర్చున్నారు. 'ఏమిటీ మా కోడలు అంటూంది. మా చెల్లెలు హైకోర్టువకీలా మా అన్నగారు గవర్నరుదగ్గర మెంబరీగా. ఆయన గవర్నరన్నమాట. అయితే శకుంతలా గవర్నరే. వకీలు గవర్నరుముందర ఏమీ మాట్లాడగలడమ్మా కోడలుపిల్లా?

శకుంతల విరగబడి నవ్వింది. 'ఇక్కడ మాపక్షంవాళ్ళెవరు లేరు. మా వాదం ఓడిపోయింది' అని అన్నది. శారద చిరునవ్వు నవ్వుచు, సూర్యకాంత ముతోబాటు అత్తగారికీ వదినగార్లకూ తమలపాకులు చుట్టలు చుట్టుచున్నది.

ఇంతలో రోహిణి, సరళ, నళిని, వారితల్లియు లోనికి వచ్చినారు.

శ్యామసుందరికి పరీక్షలగుచున్నవి.

లక్ష్మీనరసమ్మగారికి కులములేని యీ బ్రహ్మసమాజం పిల్లలు తనయింటికి వచ్చుట ఇష్టములేదు. ఇంతవరకు ఎదిగి పెళ్ళికాకుండా ఆపిల్లలు చదువుకొనుచున్నారనియు, ముత్తయిదువవలె కనబడు వారి తల్లి రెండుసార్లు వైధవ్య మనుభవించిన దనియు దెలియగనే, యీ ప్రపంచమంతయు నెచ్చటకు పోవుచున్నదోయని యామె హృదయము గడగడలాడినది. నారాయణు డిట్టివారితో సహవాసము చేయుట, కులము పోగొట్టుకొనుటకే. ఈపట్టణవాసాలలో ఇంతేకదా, యనుకొన్నది.

పెత్తల్లి హృదయంలోని ఆలోచన గ్రహించి, వెంకాయమ్మ 'అక్కయ్యా! రెండు కంద్యార్థాలు పాడవే' యనెను,

లక్ష్మీనరసమ్మగారు సరేయనుచు, శ్రావ్యమగు గొంతుకనెత్తి,

అన్నపు సూక్ష్మాంశము మన సెన్నగ
నీరంబు ప్రాణ మెఱుగుము,
రెండెన్నడు కలియవో, నాదే సున్న
సుపో యెఱుక మా సుగుణసంపన్నా

'కలియుట యెఱుకసుమీ యింతకన్నా
ఉన్న దెఱుక మూలమన్నదె వినలేమ.
ఎన్నడు నీఘ్రాంతి నిన్నంటనియ్యకు సుగుణసంపన్నా
కలియుటే యెఱుకసుమి యింతకన్నా ॥

గురువు శిష్యుణ్ణిచూచి అంటున్నాడు. అన్నముయొక్క సూక్ష్మాంశమే మనస్సు, నీళ్ళయొక్క సూక్ష్మాంశము ప్రాణము. ఈ రెండూ కూడితే యెఱుక. ఈ రెండూ కూడకపోతే అప్పుడే యెరుకలేదన్నమాట అని.

వెంకా :—అన్నము యెలా మనస్సవుతుంది ?

లక్ష్మి :—అరగించిన అన్నం ఏడుదినాలల్లో రసమున్ను, అది క్రమంగా రుధిరము, మాంసము, మెదడు, అస్థి, మజ్జ, శుక్ల, శోణితములు అగును. వాటి కలియికవల్ల పిండం అవుతుంది. ఆ పిండంలో మనస్సు చేరుతుంది. అంత ప్రాణం చేరుతుంది. అన్నములోవున్న ఎనిమిదోవంతు ఆకాశము, ఎనిమిదోవంతు వాయువు, కలిసి మనస్సు ఏర్పడుతుంది.

'ఇక ప్రాణం యెనిమిదోవంతు, వాయువు ఎనిమిదోవంతు. మనంత్రాగే జలంలో వాయువుకూడా వుంది.

'ఎల్లాగా ? అసలునిర్గుణంలోంచి మూలప్రకృతీ, అందులోనుండి త్రిగుణాలు పుట్టినవి. అందునుండి మహత్తత్త్వము, మహత్తత్త్వన్నుంచి అహంకారము, అహంకారములోంచి శబ్దస్పర్శరూపరసగంధాములనే పంచభూతాలు, ఆ పంచభూతాల అన్యోన్య సమ్మేళనంవల్ల సమస్త జగత్తేర్పడింది ?'

## ౧౪

## 'ఒ పె రా'

లక్ష్మీపతియు, నారాయణరావును ఆ రాత్రి సూరీడును శారదను తీసికొని ఎల్ఫిన్‌స్టన్ కంపెనీకి ఇంగ్లీషు నాట్యము చూడవెళ్ళిరి. పరమేశ్వరుడు, ఆలం, రాఘవరాజు, రాజారావులు నాటక మందిరముకడ గలిసికొనిరి. నారాయణరావు పదిరూపాయల తరగతి టిక్కెట్లు ఇదివరకే కొనియుంచెను. పసుపుల కుర్చీలపై లక్ష్మీపతిని తర్వాత సూరీడును శారదను కూర్చుండబెట్టిరి. మిత్రులు తా మాసీను లగుటలో నారాయణరావుకు శారద ప్రక్క కుర్చీ మిగులునట్లు జేసిరి.

నారాయణరావునకు శారదకుగూడ హృదయములు ఝల్లుమన్నవి. ఆమె మోము ప్రఫుల్లమగుట నా చీకటిలో నెవరు కనుగొనగలరు ?

నాట్యము మొదలు పెట్టినారు. ఆ నాట్య మొక నాటకమువలె నున్నది. కథానాయిక నాట్యము చేయుచు ప్రవేశించెను. కథానాయకుడు నాట్యము చేసెను. కథానాయికతో నిరువదిమంది, కథానాయకునితో పదిమంది నాట్యముచేయు వనితలు ప్రవేశించిరి.

'గమ్మత్తు గమ్మత్తు దుస్తులురా, ఏమి చిత్రాలుగా ఉన్నారురా మనుష్యులు?' అని లక్ష్మీపతి అన్నాడు.

దినమొల అయినట్లుగా వేషాలు. అందరు ఒకటే దుస్తులు, ఒకటే రీతి నాట్యం. కథానాయికమాత్రం ముందునుండి, వెనుక హంగుచేయు సకియలకన్న నెక్కువగ నృత్యము చేయును, ముందునకువచ్చి పాటపాడును.

అంకము మొదలు చివరవరకు ఒకటే నాట్యము, పాటలు.

అలంకారములు అద్భుతములు, దుస్తులు నిరుపమానములు. ఆ నటీమణుల యందము హృదయసంచలన కారణము.

కథాభాగము తక్కువ, నాట్య మెక్కువ. మగవారిలో పాటపాడెడు వారి గొంతుకలు సముద్ర ఘోషానురూపములు. ఎంత స్థాయికైనను పోగలవు. ఆడవారి గొంతుకలు కిన్నరీ సదృశములు.

నాటకము జరుగునప్పుడు శారద తన చేతిని పొరపాటున భర్తచేతిపై వైచినది. భర్తచేయి యని తెలిసెను. ఆస్పర్శసుఖాన చేయిమరల తీసికొనలేకపోయి నది. భర్త గమనించలేదని యనుకొన్నంత కాలమట్లనే యుంచినది. మధుర ప్రవాహాలు ప్రసరించినవి. ప్రేమావేశముననో ఏమో ఆమె వణకిపోయినది. సిగ్గుతో చేయి వెనుకకు నెమ్మదిగా లాగికొన్నది.

విశ్రాంతి సమయమున నారాయణరావు మొదలగువారు బయటకు పోయి సిగరెట్లు కాల్చుకొనివచ్చినారు. నారాయణరావు వెలగల 'చాకొలెట్లు' (ఒక విధ మగు మిఠాయిలు) గొని అవి సూరీడు కందిచ్చుటలో తూలి శారదపై వ్రాలినాడు. అరనిమేషములో సర్దుకొన్నాడు.

భార్యాభర్త లిరువురకు దేహమున మెరుపుతీగెలు అలముకొన్నవి. శారదకు నాట్యమున తక్కిన భాగమంతయు దానే నాట్యమాడుచున్నట్లు తోచినది. ఆమె యా యానందములో లీనమై, తేలిపోయినది. ఆ ప్రేక్షకులు ఎదుట దృశ్యము, సర్వమును మరచినది. ఓరజూపుతో భర్తను చూచినది. ఆ చిరుచీకటిలో సమున్నతాంగుడు, సుందరుడగు భర్త దివ్యునివలె యామెకు దోచినాడు. ఆమె కన్నుల మధురిమములు తిరిగినవి, హృదయాన పరిమళములలమినవి. లోకమంతయు సంగీతముతో నిండిపోయినది.

నాట్యము (ఒపెరా) పూర్తియగుటయు మనవారందరు బయటకువచ్చి తమ తమ బసలకు జేరినారు. మరునాడు సాయంకాలము నారాయణరా వింటికడ వారందరు చేరినారు. రాఘవరాజు, రాజారావు వెళ్ళిపోవలసిన దినములు వచ్చినవి. కావున స్నేహితులందరిని, రోహిణిని, సరళను, నళినీదేవిని ఉపాహారముల విందునకు, రాత్రి విందునకును బిలిచినాడు. తండ్రిగారికి జబ్బు పూర్ణముగ నివారణ మొనర్చిన డాక్టరు రంగాచారిగారికి, ఆయన సహాయవైద్యులకు తేయాకు నీటి విందును, రాత్రి సంపూర్ణమగు విందును. ఆనందరావుగారును, నారాయణరావు

గురువుగారును, నటరాజన్ మొదలగు వారందరును వచ్చిరి. హైకోర్టు న్యాయవాదు లంద రరుదెంచిరి.

శ్యామసుందరీదేవి వచ్చుట కామెకు పరీక్షలు. ఉపాహారములు తేయాకునీరు మొదలగునవి యన్నియు, కోమలవిలాసమువారు సరఫరాచేసినారు. వారి బ్రాహ్మణ యువకు లిరువదిమంది తెల్లని గాంధిటోపీలు, లాల్చీలు ధరించి తినుబండము లందర రకు వడ్డించుటకు సిద్ధముగా నున్నారు. హైకోర్టు న్యాయాధిపతులను, చెన్నపురిలోని నాగేశ్వరరాయాద్యాంధ్ర ప్రముఖులను, పెద్దషాహుకార్లను విందునకు పిలిచినాడు నారాయణరావు. నారాయణరావు, రాజారావు, పరమేశ్వరుడు, లక్ష్మీపతి, అన్ని సరంజాములు చేయించినారు. అద్దెలకు పాలరాయిబల్లలు, చక్కని కుర్చీలు తీసికొని రాబడినవి.

నారాయణరావు భవనము వెనుకనున్న విశాల వనములో విందు. తోటమాలి యని పేరుపొందిన నారాయణరావు తోటయంతయు గులాబీలతో, రంగురంగుల మెట్టతామరపూలతో వివిధ రకాల చామంతులతో, బోగైనువిల్లాలతో చిత్రచిత్రపు క్రోటన్సు మొక్కలతో, నలంకరింపబడి కన్నుల వైకుంఠముగ నున్నది. చెట్లలో, ఆకులలో, జొంపములలో పూవులనడుమ రంగు రంగు విద్యుద్దీపము లమర్చినారు. నారాయణరావు మామగారికి ముందురోజుననే తంతి యిచ్చుటచే జమీందారుగారును ఆ రోజు ఉదయముననే విచ్చేసిరి.

విందు ఏ లోటును లేకుండ జరిగినది. సంగీతపు కచ్చేరీ జరుగుటకుముందు నారాయణరావు లేచి ఇట్లు మాట్లాడెను.

'సోదరీమణులారా! ఆర్యులారా! సహోదరులారా! మా తండ్రిగారికి చాలా జబ్బుచేసినది. అది శస్త్రవైద్యము. డాక్టరు రంగాచార్యులవారు తమ సహజ సామర్థ్యము, నైపుణ్యము, కనబరచుచు, మా తండ్రిగారికి చికిత్సజేసి కుదిర్చినారు. రంగాచారిగారి ప్రేమకు, వారి ప్రతిభకు, నేనును మా తండ్రిగారును, మా చుట్టములందరు కృతజ్ఞులము. మేము ఏమిచేసినను వారి ఋణము తీర్పలేము. వారి సహాయవైద్యులను, నా మిత్రుడగు వైద్యుడు రాజారావును నేను పొగడుటకు చాలను. భగవంతుడు వారిని మిమ్ములనందరిని ఆరోగ్యము ఐశ్వర్యమునొసగి సంరక్షించుగాక యని ప్రార్థించుచున్నాను. (కరతాళములు)

వెంటనే రంగాచార్యులుగారు లేచి 'నారాయణరావుగారు, తమ తండ్రిగారు ఆరోగ్యముగా నున్నా రన్న సంతోషముతో, నన్ను పొగడినారు. నాలో ఏమున్నది? ఏ వైద్యుడైన ఆ పని చేయగల్గును. మాకు మా కూలి యిస్తే మా శక్తికి తగినట్లు సహాయం చేస్తాము. తర్వాత దైవము. ఇంతమాత్రమునకు నేను వారి పొగడ్తకు దగను.' అని కూర్చుండెను. (కరతాళములు)

సంగీతపు కచ్చేరి అయినది. శ్రీ రామయ్యగారు తమ సంగీతముచే అతిథుల నుప్పొంగజేసి ఆంధ్రదేశమున నింతటి ప్రజ్ఞావంతు లున్నారా? యనిపించినారు.

నళినీదేవి తన ఆంగ్లభాషా పాండిత్య మెల్లర హృదయముల నాటజేసినది. ఆమెకు పాశ్చాత్యవిద్య నభ్యసించుచున్నాననను గర్వము మెండు. ఆమె ఎప్పుడు ఇంగ్లీషుభాషయే మాటలాడును. చకచక తిరుగుటలో, రకరకముగ మాట్లాడుటలో, పకపక నగుటలో దాను గళాశాలలో జదువు బాలనని అందరకు దెల్లమగునట్లు సంచరించును.

అల్పాహారపు విందులో విసవిస పెద్దల మధ్యనుండి నడచివెళ్ళి నారాయణుని 'అన్నయ్యా! యెవరు సంగీతము పాడునది? శ్రీరామయ్యగారి. తన కచేరియని వ్రాసినావు - ఆయన గొప్ప పాటకుడా' యని యడిగినది. నారాయణరావు చిరునవ్వుతో సమాధానము చెప్పి పంపించినాడు.

సరళ మితభాషిణి. ఆమె లజ్జాశీల. రోహిణి గడుసరి. ఆమె యెట్టివారి హృదయములనైన నాకర్షించు హొయలు చూపించగలదు. పదిమంది తన్ను మెచ్చుకొనుటకు యామె కానందము. నళినికి ప్రేమయే తెలియదు. అందకత్తె నన్నభావము మాత్రము తన మాటలలో, ఆటలలో వ్యంజనమున దెలియజేయుచు, చిరుబాలికవలె సంచరించును. వారు మువ్వురు విందులో వనితల మధ్య కూర్చుండినారు.

నారాయణరావు వారి నమితగౌరవ మొనరించి యాదరించినాడు. పరమేశ్వరుడు వీలయినప్పుడెల్ల రోహిణితో నేదేని మంతనమాడును. వారితోబాటు పెక్కురు వనిత లాహ్వానింపబడినారు. చాలమంది వచ్చి వారితోపాటే గూర్చుండిరి.

అల్పాహారపువిందు పూర్తియైన వెనుక భోజనమునకు గూడ నళినీ సరళా రోహిణులు నారాయణరావింట నాగిపోయిరి.

శ్రీరామమూర్తికి వీరివి జూచిన కొలదియు నాశ్చర్యముగ నుండెను. అయినను రాజమహేంద్రవరములో జదువునప్పుడు శ్రీ వీరేశలింగాఖ్యుని బోధనలు విని యున్న వాడగుటచే మనస్సు సమాధానము చేసికొనెను. అతనికి సరదాపుట్టి వారితో సంభాషణ నారంభించెను.

శ్రీరా:—మీ అక్కయ్యగారి పరీక్ష లవుతున్నాయట కాదండీ?

నళిని:—అదేమిటి పెద్దన్నగారూ! మమ్మ మీరు అని గౌరవంచెయ్యాలా?

రోహి:—మా పెద్దవదినగారిని దీసికొనిరాలేదే?

శ్రీరా:—సంసారం పెద్దది. మా యింటిదగ్గిర ఎవ్వరూ ఉండకపోతే ఎలాగు? నేను కొత్తపేట రెండుసారులు వెళ్ళివచ్చాను. అమలాపురం పెద్ద కేసులు ఉంటే చూస్కోడానికిన్నీ వెళ్ళానండీ?

నళిని:—అదేమిటండీ అన్నగారూ, మీరు మళ్ళీ అండీ అండీ అంటున్నారు. అల్లాయితే మీతో మాట్లాడం.

శ్రీరా:—క్షమించండి — కాదు క్షమించమ్మా. నువ్వు పరీక్షలో బాగా వ్రాశావా?

నళిని:—తప్పకుండా నెగ్గుతానని ధైర్యంఉంది. అమలాపురంలో బాలికలకు ఉన్నత పాఠశాల ఉన్నదా అన్నగారూ?

శ్రీరా :— లేదమ్మా. అక్కడ ఎవ్వరు చదువుకుంటారు ?
నళిని :—ఎవ్వరూ లేరండి ? ఆశ్చర్యం !
రోహిణి :—బాగా ఉంది నళినీ. చెన్నపట్టణంలోమాత్రం ఏమాత్రం ఉన్నారేమిటి ?
ఇంతలో పరమేశ్వరు డచ్చటికివచ్చి రోహిణీదేవిని జూచి ' చెల్లీ ! మీరు ఇంగ్లీషునాట్యమండలి నాట్యం చూచుటకు ' ఎల్ఫిన్‌స్టన్ ' వెళ్ళినారా ' యని యడిగినాడు.
రోహి :—లేదన్నయ్యా ! బాగా ఉన్నదా ? నిన్న మీరు వెళ్ళినారటకాదూ. శారద వదిన చెప్పింది.
పర :—వెళ్ళాం. ఇదివరకు నేను సినీమాలలో జూశాను. వాటికన్న బాగుందమ్మా.
నళిని :—మన భోగమువాళ్ళ నాట్యంకన్న బాగుందా ?
ఇంతలో రాజారావు, నారాయణరావు, యజ్ఞనారాయణశాస్త్రి యచ్చటికి వచ్చిరి. లక్ష్మీపతి దొడ్డి మరల ఎప్పటియట్లు సర్దించుచు మోటారు బస్సులమీద సామాను బంపించివేయుచుండెను. జమీందారుగారును భోజనమున కక్కడనే యున్నారు. ఆయనయు వచ్చి యా ' హాలులో ' గూర్చుండెను.
పర :—ఏవమ్మో, మనవాళ్ళనాట్యం అంటే వేళాకోళం కాదుసుమా.
ఆరాత్రి డాక్టరు రంగాచార్యులగారికిని తదితర వైద్యులకును అనేకుల మిత్రులకును విందును, విందు పూర్తియైన వెనుక శ్రీ వేదవల్లి నాట్యమును నారాయణుడేర్పాటు చేసినాడు.
నళిని :—ఏమిటిమరి, దక్షిణాదిగణికలు వేసే వేషం విపరీతం. మొన్న కవితా సభలో చూచిన భాగవతం విపరీతం మనదేశం నేను చూడలేదా మన వేశ్యల తెయితక్కలు నేను చూడలేదా ? (అని విరగబడి నవ్వెను.)
పర :—అదేమిటి నళిని ! నీకు లలితకళ అంటే తెలియదన్నమాట.
నారా :—చెప్పరావాళ్ళకి ! వెనకకూడా నేను ఒక చిన్న ఉపన్యాసం ఇస్తే, తల ఊపింది నళిని. శ్యామ, రోహిణీ అర్థంచేసుకున్నారు.
నళిని :—అది నీలోటుకాదు అన్నయ్యా ! నాలుగు నిమిషాలలో ఏమిటో ఏమిటో గుప్పేస్తే అర్థంకాలేదు.
జమీం :—నాకు చిన్నతనాన్నుండీ వీరేశలింగంపంతులుగారి శుశ్రూషవల్ల భాగవతం అంటే, నాట్యంఅంటే విపరీతమైన అసహ్యం. ఏదయ్యా పరమేశ్వరమూర్తి గారు ! దాన్నిగురించి మీ అభిప్రాయంచెప్పండి.
ఇంతలో సుబ్బారాయుడుగారచ్చటకు వచ్చుటయు, వారికి నారాయణరావు మంచిదిండుల కుర్చీ నిచ్చి తాను కూర్చుండెను.
సుబ్బా :—ఏమిటి బావగారూ నాట్యం అంటున్నారు.
జమీం :—(నవ్వుచు) పరమేశ్వరమూర్తిగారు నాట్యంలో ఉండే అందాలు చెప్తూతా నంటే చెప్పమంటున్నాను.

సుబ్బా :—మా చిన్నతనంలో మాకు భరతశాస్త్రంలో ఉండే అందాలుకూడా నేర్పే వారు బావగారూ. బోగంమేళంలో మేము కూర్చుంటే గణికలకు హడలు. సమస్తమైన కళలు మా నాన్నగారికి తెలుసును. మా చిన్నవాడు మా నాన్న గారి పోలికేకాదండీ. మా నాన్నగారంటే హడలు మాకు. ఆయన సంగీతాలు పాడితే, లోకాలు మూర్ఛిల్లేవి. తొంబది అయిదేళ్ళ వృద్ధుడయి పొలంలో పని చేసుకొని ఇంటికివచ్చి, స్నానంచేసి, భోజనంచేసుకుని, రాత్రి రెండో ఝాముపరకు త్యాగరాయ కృతులు పాడ్తోఉంటే ఊరు జనం అంతా అక్కడే ఉండేవారు. త్యాగయ్యగారిని ఎరుగును. ఆయన ప్రియశిష్యుడే మా నాన్న గారు. ఆ సంప్రదాయం సరిగా ఉన్నదీలేనిదీ నాకు తెసులును. నూవాడు పాడుతుంటే అచ్చంగా మా నాన్నగారి గొంతుకేగాని అంత అందం పూర్తిగారాలేదు.

నారా :—అది ఇంగ్లీషుచదువు నాన్నగారూ!

పర :—నాట్యాన్నిగురించి రెండు ముక్కలు పెద్దనాన్నగారు చెప్పితే చాలా బాగా ఉంటుందని మనవి.

జమీం :—అవును. బావగారూ!

సుబ్బా :—ఏముందీ నాట్యం రెండు రకాలు నృత్యం, నృత్తం. నృత్యం - భావం కలిగిన నాట్యము. నృత్తం - అలంకారస్వరూపనాట్యం : స్వరకల్పనవంటిది. నృత్యం మళ్ళీ రెండురకాలు. ఉద్ధృతమైనభావాలు కలది తాండవం; కోమల భావాలు కలది లాస్యం.

## ౧౫

## రెండే మార్గాలు

జమీం :—మాకు విపులపరచి చెప్పండీ బావగారూ.

సుబ్బా :—వస్తున్నా.

భక్తిచేత ఒడలు తెలియకుండా, కోపంచేత, రౌద్రంచేత, వీరత్వంచేత ఆవేశంపూనినభావాన్ని తెలియచేసేది తాండవం అండీ. శివుని లయతాండవం, కాళికాదేవి సంహారతాండవం, శ్రీకృష్ణుడు భీష్ముని చంపడానికి చక్రం పుచ్చుకొని ఉరికిన వీరతాండవం, రావణాసురుడు యుద్ధానికివస్తూ చేసిన రౌద్రతాండవం, చైతన్య నివర్తి దేవాది మహాభక్తులు చేసిన పారవశ్యతాండవం.

ఇక రెండోది లాస్యం అన్నా; ప్రేమచేత, రాధ, సత్యభామ, శ్రీకృష్ణుడు మొదలగు వారి శృంగారాది కోమలభావాలు తెలియజేసేది లాస్యం.

ఈ విద్య మహోత్తమ మయినది. బావగారూ! కవిత్వానికి భాష సాధన వస్తువు, చిత్రలేఖనానికి రంగు, శిల్పానికి శిలా మొదలైనవి, సంగీతానికి ధ్వని. ఆలాగా నాట్యానికి ముఖ్యసాధనవస్తువు మనుష్యుని దేహం, మనుష్యుడే ముఖ్య

వస్తువు. అతనిలో ఉన్నసర్వశక్తు అన్నా. అందుచనే నాట్యవిద్యను తపస్సు చేసు కొని అర్చించేవాడు మహోత్తముడు అన్నారు పెద్దలు.

జమీ :—చిత్తం.

సుబ్బా :—భావాన్ని వ్యక్తీకరించడం అభినయం. ఆభావం అంగాభినయంతో, వాచ్యాభినయంతో, ఆహార్యాభినయంతో, సాత్వికాభినయంతో చూపిస్తాడు నటకుడు.

జమీం :—నాట్యానికి అభినయం ప్రధానమాండి, నృత్యంచేయడం ప్రధానమాండి.

సుబ్బా :—భావం లేకపోతే కళ కానే కాదుగదాండీ. అంచేత భరతము అంటే భావరాగ తాళ యుక్తమైంది అని భరతశాస్త్రం చెబుతుంది.

జమీం ;—చిత్తం.

సుబ్బా :—అభినయం, సంగీతంగా ఉండాలి. అంటే రాగయుక్తంగా, తాళ యుక్తంగా ఉండాలి. తాళం పదములగతివల్లా, రాగము పాడడంవల్ల చూపిస్తారు. నాట్యం చేస్తూ, ఒక పదం పాడుతూ ఒక భావాన్ని ప్రదర్శించేది కరణం. ఆ కరణానికి ముఖ్యభావ సూచననుబట్టి పేరు పెట్టారు. ఆలాగు లెఖ్ఖ చూస్తే నూట యెనిమిది కరణాలు ఉదహరించారు భరతుడు కొన్ని కరణాలు కలిస్తే అంగహారము అంటారు.

జమీం :—విశదంగా చెప్పాలండి.

సుబ్బా :—త్యాగరాయ కృతిని తీసుకుందాం. కృతి సంపూర్ణకావ్యము. అందులో పల్లవి ఒక కరణమువంటిది. అనుపల్లవి ఇంకోకరణం, చరణాలు ఇతర కరణాలు. అన్నీకలిసి అంగహారం అన్నమాట. ఎన్నోకృతులు ఒక మహా కావ్యం. ప్రతి అష్టపది ఒక అంగహారం అనుకోండి— అన్ని అష్టపదులు కలిసి మహాకావ్యం. అల్లాగే ఒక సంపూర్ణకావ్యం నర్తించడం ప్రదర్శించడం 'నాట్యం' అంటారు.

జమీం :—చిత్తం.

నళిని :—పెదనాన్నగారూ ! అభినయం నాలాగు రకాలన్నారు. అవి చేతులుతిప్పడం మొదలైనవేనా అండీ ?

సుబ్బా :—అవునమ్మా, అంగాభినయంలో దేహం అంతా వస్తువు అవుతుంది. అందులో ముఖ్యాంగాలు, ప్రత్యంగాలు, ఉపాంగాలు, అని ఉన్నాయి. చేతులు, తల, కళ్ళు, కంఠము, పార్శ్వము, నడుము, కాళ్లు ముఖ్యాంగాలు. చేతికి మోచేయి ప్రత్యంగము, వేళ్లు ఉపాంగాలు. కంటికి కనుబొమ ప్రత్యంగము. కనురెప్పలు, గుడ్లు ఉపాంగాలు. అల్లా అన్నింటికీ. వీని కదలికతో భావం చెప్పడం అంగాభినయము. భరతుడు, నందికేశ్వరుడు, ఈ అభినయాలు విధించారు. అవి కాలాన్నిబట్టి మారాయిలెండి.

పర :—లేకపోతే వివిధరాష్ట్రాల్లో వివిధ విధానాలు ఎల్లా వచ్చాయండి.

యజ్ఞ :—ఏమిటయ్యా పరమేశ్వరమూర్తీ, ఆ విధానాలు.
పర :—కథకళి సంప్రదాయం మళయాళదేశంలో, కథక సంప్రదాయము ఉత్తర దేశాలల్లో, మణిపూరులో ఆ పేరింటి సంప్రదాయం- కూచపూడి సంప్రదాయం తంజావూరి సంప్రదాయం ఇల్లా ఉన్నాయి బావగారూ!
సుబ్బా :—నేను ఆ వివిధరకాల నాట్యాలు చూడలేదుగాని, పూర్వం విదుషీమణులు, సుందర శరీరం కలవాళ్ళు అయిన భోగంవాళ్ళు తెలుగుదేశంనిండా ఉండే వాళ్ళు, అద్భుతంగా నాట్యం చేసేవాళ్ళు. వారి నాట్యాలెన్నో చూశాను.
జమీం :—ఇపుడా విద్య నశించిపోయి, చాలా హీనస్థితిలో ఉంది కదాండి.
సుబ్బా :—చిత్తం. మళ్ళీ ఆ విద్య పునరుద్ధరించడం చాలా ముఖ్యమండి. అందు కనే మా నారాయణునితో చెప్పి ఇవాళ వేదవల్లి నాట్యం ఏర్పాటు చేయించాను బావగారూ.

ఆ రాత్రి షడ్రసోపేతమేకాక బహుళరసోపేతమగు విందు నర్పించినాడు నారాయణుడు. భోజనము లైనవెనుక హాలులో అందరును ఉచితాసనముల నుప విష్టులైరి. వేదవల్లియు నాట్యోచిత వేషమున వచ్చి సభ్యు లందరికి నమస్కరించి నిలువబడినది. ఆమె వెనుక వాద్యవిశారదులైన మార్దంగికుడు, వాయులీనకుడు, తాళధారియు, గాయకుడును నిలుచుండిరి.

వేదవల్లి అందకత్తియ. దాక్షిణాత్య భోగమువారిలో నుత్తమురాలు. నృత్య ప్రజ్ఞా ప్రతిష్ఠ చరిత్రగల కుటుంబమున జనించినది. ఆమె నృత్య కళాశక్తి దక్షిణ దేశములో నెంతయు ప్రౌగడ్త నందినది. ఆమె పట్టులాగు తొడుగుకొని, బనారసు చీర, కాళ్ళకు వెనుకకు విరిచికట్టి, వెనుకనుండి ముందుకు వల్లెవేసికొని, వెడల్పు సరిగ అంచు చీరకొంగు, కుచ్చెళ్ళు ముందుకు విడిచి, వెలగల హొంబట్టు సరిగ రవిక తొడగి కొన్నది. రవ్వలయొడ్డాణము, నడుమునకు మేఖలయైనది. రవ్వల బేసరియు, రవ్వల అడ్డబాసయు, రవ్వలపతకమును, రవ్వల దుద్దులును, ముత్యపు బాపట బొట్టును, ఆమె మోము నలంకరించినవి. పొడుగుగ వాలుజడ రచించి ఒత్తుగ పూలు ముడుచుకొన్నది. వివిధ రత్నములు కూర్చిన శిరోభూషలు రాగిడి, చంద్రవంక, తములపాకు, మొగలిరేకు, చేమంతిపూవు మొదలైనవి ధరించినదామె. చెంపసరులు చెంపకల్లీలు దాల్చినది. కాళ్ళకు గజ్జియలు ధరించినది.

ఆమె మద్దెలకు నమస్కరించి, భగవంతుని, సభ్యులను ప్రార్థించి, 'అలారిప్పు' (అలరింపు) ప్రారంభించెను. స్వరజతులు చూపినది. తిల్లానానృత్యము చేసినది. భైరవీవర్ణము ప్రారంభించినది.

మలయమారుతమై ఇటునటు ప్రసరించినది. సెలయేటి పతనాలవలె ఉరికినది. వాగై పరవళ్ళైనది. మండలములు, చంక్రమణము, గతులు సుడులై, తరంగాలై వడులై పోయినది.

ఆమె పరిభ్రమణము నాగువాము నడకలైనది.

ఒక గంటసేపామె అవర్ణము నృత్యమొనర్చినది. ఆ వెనుక శ్రీనారాయణ తీర్థుల ఆదితాళయుక్తమైన తరంగము పాడనారంభించెను. ఆమె ముఖారిరాగాన గోపికయై బాలకృష్ణుని ధ్యానించినది. ఆమెయే బాలకృష్ణుడై బాల్యక్రీడల వినోదించి నది. మారాము పెట్టినది.

కృష్ణం కలయసఖి సుందరం-
బాలకృష్ణం కలయసఖి
కృష్ణం, గతవిషయ తృష్ణం - కగత్రష్ణి
విష్ణుం సురారిగణజిష్ణుం, సదాబాల

ఆతని బంగారుగజ్జెల మ్రోత లోకసమ్మోహన స్వరపూరితమై, వేణునినాద సంశ్లిష్టమై, దిశల నావరించినది. నీలమేఘశకల మొకంతు ఆకాశయానము చేయువడి, రరఠకలాడినవి విద్యుల్లతలు. తారాగణములు జ్వలించినవి. వెన్నెల వెలుగులు లోకాలోకాలను కాంతింపజేసినవి.

ఆ వెనుక నామె క్షేత్రజ్ఞుని పదమును అభినయించినది. భైరవీజన్యమై, త్రిశ్ర జాతిత్రిపుట తాళయుక్తమైన దాపాట :

'మంచిదినము నేడే—
మహరాజుగా రమ్మనవే!'

ఆమె రాధ, విరహిణియై, అర్థఖండితయై, తన గంభీరభావముపదలక, దివ్యలీలా వినోదుడై పరమదక్షిణనాయకుడైన, నీలగోపాలుని రమ్మని చెలికత్తెకు చెప్పుచున్నది. ఆతని తప్పుల సైరించెదనన్నది. ఆతని ఇతర ప్రేయసుల మాట లైన తలపనన్నది.

పరమేశ్వరు డా బాలిక నృత్యము నాలోకించుచు, ఉప్పొంగిపోవుచు, ప్రతి హస్తప్రాణము నందును, అభినయమునందును లయించిపోవుచు పరవశుడైనాడు. ఆ బాలిక ఉచ్చారణ బాగుండకపోయిననేమి? ఆంధ్రులకు తక్కనౌరులకు వాచ్యాభి నయము లేకపోయిననేమి? ఏమి యీ అద్భుతనృత్యము.

ఆబాల ధవళపన్నగాంగనవలె నాడినదట. ఆబాల రూపమూ అభినయమున లీనమై యామెయే నృత్యదేవి యైనదట. ధూపకరండమునుండి పై కెగయు పరీమ ళార్ద్ర ధూమవక్రగతి భంగములనుదాల్చినదట. విచిత్ర మనోహరవర్ణభాసిత కుసుమ లతవలె లోలాంగియైనదట.

ఆబాలిక యవయవములు ప్రత్యభినయమునకు సర్వకరిబాంగహారాలకు మరియు సౌందర్యము చేకూర్చినవట. కదలికలో దాక్షిణాత్యమగు యత్కించిత్ కర్కశత్వమున్నను ఆ నృత్య ప్రజ్ఞాకౌశల్యములలో నదియు శోభించినదట.

వచ్చిన అతిథులు స్నేహితులు ఎవరి ఇండ్లకు వారు వెడలినారు.

సుబ్బారాయుడుగారికి పూర్తిగా స్వస్థత కలిగినది? అందరును గొత్తపేట బయలుదేరిరి. నారాయణరావు కొత్తపేట వెడల నిశ్చయించెను.

ర్మాజారావు కొద్దిరోజులుండి, యమలాపురమునకు వెళ్ళిపోయినాడు.

శ్యామసుందరి పరీక్షలై పోయినవి. తాను తప్పక విజయమందుదునని యామె ధైర్యముతో జెప్పగలిగెను. హైకోర్టునకు సెలవు లిచ్చుటచే నారాయణరావు చెన్న పురి కాపురమును గట్టిపెట్టి భార్యాది బంధుసహితుడై తండ్రితో వెళ్ళిపోయినాడు.

శకుంతల చెన్నపట్టణములో నాల్గుదినములుండి తిరిగి వెళ్ళిపోయినది. ఆమె చెన్నపట్టణములో నున్నంతకాలము నారాయణరావుతో నన్నివిషయ లు మాట్లా డుచు, నాతనితో నమితస్నేహమున సంచరించుచు, జెల్లెలిచే నాతనికి బలవంతమున బరిచర్యలు జేయించుచుండెను. శారదకింత సిగ్గేమి యని యామె తలపోసికొన్నది. భార్యాభర్త లెప్పుడు మాట్లాడుకొనరు. శారద యేమియు నారాయణున కందిచ్చుట గాని, యాతనికి వలయుసేవల నొరులొనరించునట్లు చూచుటగాని యామెకు గనంబడ లేదు. వీరిరువురి హృదయ పరిస్థితు లెట్లున్నవో యామెకు బూర్తిగా దెలియలేదు.

ఒకనాడు నారాయణుని 'యాతనిగదిలో నుండుమని కోరినది. తన చెల్లెలు శారద నచ్చుటకు గొనిపోయెను. శారదయు, నారాయణరావునుగూడ తెల్లబోయిరి.

'మా అమ్మాయిచేత మీకు తలదువ్వించాలని సరదాఅండీ' యని శకుంతల యన్నది. చిరునవ్వుతో నారాయణరావు ఆశ్చర్యపడి, 'నాకు కొంచెము పనివుంది వదినగారూ' అనెను.

శకుం:—మీపని సరేండి, నేను ప్రార్థించే ఈ కాస్తపనీ నాకోసం చేయ రాదా మరిదిగారు.

నారా:—మీ యిష్టం.

శారద, భయము సంతోషము ఆశ్చర్యము తన్ను ముంచివేయ వణకుచు నారాయణునికిం దలదువ్వెను.

కొత్తపేట వచ్చిన కొన్ని దినాలకు పెద్దాపురమునుండి నారాయణరావు స్నేహితుడొకడు తంతి నిచ్చాడు. 'మీ అక్కగారిని మీ బావగారు కొట్టి వీధిలోనికి దరిమి తలుపువేసినాడు. మీ అక్క మూర్ఛపోయింది.' యని యందున్నది.

నారాయణరావు తత్క్షణం పెద్దాపురము వెళ్ళిపోయినాడు. ఎందుకు పెద్దాపురం వెళ్ళినది యేరికి తెలియనీయలేదు.

పెద్దాపురమునకు నారాయణరావు వెళ్ళినప్పటి కన్నియు భీభత్సముగనున్నవి. భార్యాభర్తలుగాని, తన మేనకోడలుగాని భోజనమే చేయలేదు. తన చిన్నక్కగారికి మూర్ఛ వచ్చుచునే యున్నది. నారాయణరావు హృదయమంతయు గోపముతోను, విచారముతోను, నిండిపోయినది.

మగవా రీరీతి నెట్లు సంచరించగలరు? ఆడువారు పశువులని భావించి చరించు పురుషు లింక నీనాటి కున్నారా? సంపూర్ణ మానవత్వములేని వీరికి మోక్షార్హత ఎప్పుడువచ్చునో! బంచమ సహోదరులయెడ, బీదజనులయెడల స్త్రీలయెడల పర జాతులయెడ తమ పశుత్వమింకను జూపు మానవులు కోట్లకొలది యున్న

ఈయుగము నిజముగ కలియుగమే! భగవంతు డున్నాడని గాని, తాను శుద్ధ సత్వ మూర్తియగు భగవంతుని యవతారమని గాని మనుష్యు డెటుల మరచిపోవునో? తన అక్క సత్త్వగుణ సంపన్నురాలు. భర్తయనిన భగవంతుని యవతారమని భావించు పూర్వయుగాలనాటిది. అట్టి శుభచరితలకే కష్టములన్నియు సమకూడును గాబోలు. గడుసుదనమున వర్తించుచు భర్తను తమకు దాసానుదాసులుగా జేయు భార్యల బ్రతుకు పూవులలో బ్రయాణమేకదా? . . .

నారాయణరావు బావగారి కడకు బోయి, 'బావా నీకు బుద్ధిలేదోయి. నీవు మనుష్యుడవనుకున్నానుగాని, కేవలము పశువుతో సమానుడవని అనుకోలేదోయి, ఇదేమిటి నీకింత కోపము. కోపాని కంతువుండాలి. ఎంతవరకూ ఈకోపం వెళ్ళడము? పోనీ నీకేమి చిక్కురాకుండా ఏదైనా చాకువంటి ఒకకత్తిచూసి, దాన్ని నరికివెయ్యరాదూ. లేమా, విషం తెచ్చిపెడతాను. నీకసితీరగా దానినోట్లో వెయ్యి. ఆ విషం మనుష్యుల్ని నరకబాధ అనుభవింపజేసి మరీ చంపేదిగాచూచి తెస్తాను. అల్లా చంపు అప్పటికి నీకోపం అంతానికి వస్తుందేమో? మొదట కోపంతెప్పించుకోడం. తర్వాత విచారించడం. రెండూ ఒకేజాతికి చెందినవి. అదిగో సత్యవతికి మూర్ఛపట్టుకొన్నది. ఇంక దాని జన్మం అల్లా పీల్చి పిప్పిచేస్తుంది. అది చచ్చిన దాంతో జమ. నీకు తృప్తి తీరిందా?

'ఒకవేళ మా అక్కయ్యయందు దోషం వుందంటావా చెప్పు. అది పెద్ద రకం దోషం అయితే నువ్వు చేసినపనికి సంతోషిస్తాను.'

నారాయణరావు కన్నుల నీరుతిరిగినది. 'బావా క్షమించు. ఈ నా కటిక జన్మానికి కనులు తిరగడం ఇదే మొదటిసారి. ఏదో కోపంకొద్దీ అన్నమాటలు. కాని కోపం చంపుకొని చెప్పుతున్నాను. నువ్వుచేసిన పాపానికి నివృత్తి నీలోనే ఉన్నది. నీ హృదయం కరిగేటందుకు నాలోని కల్మషం అంతా పోయేటంధుకు నేను నాలుగురోజులు మీయింటనే ఉపవాసవ్రతం చెయ్యవలెనని వుంది.' యని నారాయణరా వూరకొన్నాడు. వీరభద్రరావు బావమరది వచ్చినప్పటినుంచి యవనత వదనుడై, పాలిపోయిన మోముతో మూరుకొన్నాడు

ఆనాడంతయు వైద్యుల బిలిచి యక్కగారికి వైద్యము చేయించినాడు నారాయణుడు. ప్రక్కయింటివారు మేనగోడలికి దిండిపెట్టెదమని తీసికొనిపోయి భోజనము పెట్టినారు. నారాయణరావు ఎందరు భోజనమునకు రమ్మన్నను వెళ్ళినాడు కాడు. సాయంకాలము మూడుగంటలకు సత్యవతికి మెలకువ వచ్చినది.

మెలకువ వచ్చునప్పటికి సోదరుడగు నారాయణరావునుజూచి కల యనుకొన్నది. సత్యవతి కొంతవడికి నొడలెఱిగి కనుల నీరునించినది.

రెండేండ్లనుండి తన బావగారు సాధుమూర్తియై సంచరించినారు. తన చిన్నక్కగారు రెండేండ్లక్రిందట గర్భవతియై యున్నప్పుడు. ఆమె నిట్లే బాధించి పెట్టిన

కష్టము ఆమె దేహము మూలపుంట కదల్చివైచినందున, ఒక నెల ముందుగ బురుడువచ్చి సత్యవతి చచ్చి బ్రతికినది. బిడ్డయు బోయినది.

అది యంతయు వీరభద్రరావు గ్రహించినాడు. నాటినుండియు భార్యను పువ్వులలోనుంచి పూజించుచుండెను.

మరల నేడైదవమాసము గర్భమట సత్యవతికి. సత్యవతి చక్కని మొగము పాలిపోయి, చిక్కికృశించి, యామె పెద్దకన్నులు మరింత పెద్దవియై భయంకరముగ నుండెను. తగుమాత్రము బొద్దుగనుండి సౌందర్యనిధియైన యామె దేహము చిక్కి, క్షయరోగ పీడిత శరీరమువలె నున్నది.

నారాయణరావు చిన్నక్కగారి ప్రక్కలో గూర్చున్నప్పుడు, సత్యవతి యతి నీరసముగ నున్నను నెమ్మదిగలేచి, జరిగి, యాతనియొడిలో దలనుంచుకొని, 'తమ్ముడూ!' అని ఆతని ఒడలు నిరిమినది. నారాయణరావు హృదయముద్ర వించి పోయినది. ఎప్పుడు దుఃఖమెరుగడు. కన్నుల నీరురాదు. లోనతరిగివేయు చున్నది. 'అక్కయ్యా, ఈ పద్ధతి మారేటందుకు రెండు మార్గా లున్నాయి; ఒకటి నేను కైరాలో, బొంబాయిలో ఢిల్లీలో గాంధీగారు ఉపవాసం చేసినట్లు మీ యింటిలో ఈ దెబ్బదెబ్బా ఉపవాస వ్రతంచేయడం, లేదా, నిన్ను మా యింటికి తీసుకుపోయి, బావ కాళ్ళబేరానికి వచ్చిందాకా వుంచివేయడం. కాని యీ రెండు నీకిష్టం వుండవు. నీకేది ఇష్టం అయితే అది చేస్తాను. నేను నెలరోజులైనా నిరాఘాటంగా ఉపోష్యం ఉంటాను. నీ యిష్టంలేకుండా చేస్తే నా హృదయంలో సరియైన పవిత్రత వుండదు. పైగా నీకు వెఱ్ఱిదుఃఖమువచ్చి ఈ అపరిమిత నీరసంలో ప్రాణం పోతే ఏమి చెయ్యను. కనక నీ యిష్టంలేకుండా చెయ్యను అక్కయ్యా?'

'ఒరే తమ్ముడూ! నువ్వు ఉపోష్యం చెయ్యవద్దు. నన్ను తీసుకొని వెళ్ళావద్దు. ఆయనకు సేవచేస్తూ ఉంటాను. ప్రాణం పోతేపోతుంది. లేకపోతే ఎల్లాగురా; నేను ఇప్పుడు ఆయన్ని వదలిరావడం?'

'ఓహో! ఏమి పతివ్రతండీ! సెబాసు! మళ్ళీ ఆరుంధతీవాళ్ళూ పుట్టివచ్చారు; నాకు కోపం రావాలి అని ప్రార్థిస్తున్నాను!' అని యాతడు మనస్సులోననుకొన్నాడు.

అక్కగారికి నారింజరస మింత యిచ్చి, బలవంతాన త్రాగించి, రాజారావునకు తంతి నిచ్చి, నారాయణరావు బజారునకు వెళ్ళివచ్చుచుండగా బావగారు వీరభద్రరావు హోటలులో భోజనముచేసి వచ్చుట కనుంగొనెను. కరుణార్ద్రమగు చిరునవ్వాతని మోమున ఉల్కవలె మెరసిపోయినది.

## ౧౬

## ఆకు మళ్ల

రెండవనాటి సాయంసమయమునకు నారాయణరావు, సత్యవతి, యామె కుమార్తె నాగరత్నం రాజారావుతో కొత్తపేట చేరినారు. సత్యవతిని జూచి

జానకమ్మగారు దిగులుపడి యామెను ఒడిలోనికి చేర్చి కౌగిలించుకొని 'నా తల్లీ! ఎంత చిక్కి నావమ్మా నా అదృష్టం మండి పోయింది గనక నిన్ను తీసుకెళ్ళి ఆ బ్రహ్మరాక్షసి నోట్లో పారేశాము తల్లీ!' యని వాపోవదొడగెను. సూరీడు, వెంకాయమ్మ, లక్ష్మీనరసమ్మగారు, అందరు కన్నుల నీరు నింపుకొన్నారు.

రాజా:—పిన్నిగారు చూశారా! సత్యవతి అక్కయ్యకు మూర్ఛవచ్చింది. అల్లాగ రాకూడదండి. ఉండండి, ఓహో చేతులుకూడా కొంకర్లు పోతున్నాయి. నారాయణరావు, అక్కయ్యను ఎత్తుకు లోపలికి తీసుకురా. సూరీడు! వెంటనే చన్నీళ్లు, అర్జెంటు

నారాయణరావు అంగలో అందరికి ముందు చల్లనినీరు పట్టుకొనివచ్చి, అక్కగారికి మోముమీద నెమ్మదిగా కొట్టుచుండెను. రాజారావు తన మందుల పెట్టెలోనుండి యొక సీసాతీసి యామె ముక్కుకడ బెట్టినాడు, సత్యవతికి మెలకువ వచ్చినది. లోనికి గ్లూకోజు ఇంజెక్షను ఇచ్చినాడు.

సుబ్బారాయుడుగారక్కడకువచ్చి యామెను జంటిపిల్లవలె నెత్తుకొని లోన మంచముపై పరుండబెట్టినారు. సత్యవతి తండ్రిమెడ కౌగిలించుకొన్నది.

పెద్దాపురములో జరిగిన సంగతి నాగరత్నం అమ్మమ్మతో, తాతగారితో నిట్లు చెప్పినది.

'రెండోరోజున మానాన్న హోటలులో తినడం చూశాట్ట మామయ్య ఇంటికి వచ్చి మాతో చెప్పాడు. కచ్చేరీనుంచి రాత్రి ఎనిమిదిగంటలకుగాని రాలేదు మానాన్న. మామయ్య. నాన్నతో ఎంతోసేపు బోధించి చెప్పాడు నాన్నని, మామయ్య చాలా మాటలు అన్నాడు. మా నాన్నకు ఏదో కోపంవచ్చి తిరిగి మామయ్యను నాలుగు తిట్లుతిట్టాడు. ఇంతలో మామయ్య ఉగ్రుడై లేచాడు. మా నాన్నని ఇటూ అటూ రెండు లెంపకాయలు ఫెళ్లుమని కొట్టాడు. చొక్కాచేతులు పైకితీసి 'కానుకో నిన్ను ఈరోజున హతమార్చేస్తాను' అన్నాడు. మామయ్యను చూసేటప్పటికి నాకే వణుకుపుట్టింది అమ్మమ్మా! మామయ్య ఎంతో పొడుగు ఎదిగిపోయినట్లే అయింది. తాతయ్యా! నువ్వు నా చిన్నతనంలో చూడిదూడను కొట్టిన పాలేరువాణ్ణి, రాక్షసిలా ఉన్నవాణ్ణి ఒళ్ళు హూనం అయ్యేటట్లు కొట్టినప్పుడు ఉన్నావు, అల్లాగే వున్నాడు మామయ్య!'

నారాయణరావు పకపక నవ్వుచుండెను. అందరు అతనిని జూచి తెల్లబోయిరి. రాజారావు మోమున మందహాసములు ప్రసరించినవి.

సుబ్బా:—ఏమిటిరా బాబు?

నారా:—ఏమిలేదునాన్న! కోపంఅంతా నటించాను. ఆతనికి కోపం తెప్పించి మాటలు వాగించి, భయపెట్టాలని ఎత్తువేశాను. ఆ ఎత్తులో పడ్డాడు.

'ఏమందో బావగారు నిండుగా ఉన్నారు. ఇంట్లో పెళ్ళాం బిడ్డలు గంగలో కలిస్తే ఏమి? మనకారోగ్యం, మనకాయుస్సు అనుకోవడం, హోటళ్ళకు వెళ్ళి

భోజనం చెయ్యడం, వహ్వా!' అని అన్నాను. అతని మొహం జేవురించింది అప్పుడే. ఇదే సందుఅని.

'భార్యను, చూలాలనైనా తలపక చెయ్యి చేసుగోడం, చేతవును! ఏమి చక్కని వాడవు. ఎన్నిఏళ్ళు వస్తేయేమి? కొంచెం దయాదాక్షిణ్యం ఉండాలి, ఈవల జబ్బుతో, తిండిలేక మాడుతున్న భార్య విషయం అక్కరలేకుండా ఏం మొహం పెట్టుకొని హోటలులో తిండితిని వచ్చావు?' అని అన్నా. అతనికి నిజంగా కోపం వచ్చింది. రుద్రుడయ్యాడు.

'నీ మొహం చూడకూడదు, భార్యా భర్తల్ని ఎడపాపే పాపివి' అన్నాడు అంతవరకూ తెల్లబోయినట్లు నటించాను.

'రంకుముండ అప్పగారిని వెనకకూడా వేసుకువచ్చావు.'

అని అంటూవుంటే, మహాకోపం వచ్చినట్లు నటించి వెళ్ళి 'కాసుకో పశువా! నేను నీకు బుద్ధిచెప్పుతా ఉండు' అని నసాళం అంటేటట్లు రెండులెంప కాయలు కొట్టాను. నాగరత్నం ఘొల్లుమంది. అక్కయ్య వింటూ ఉన్నది గదిలో. దానికి నాయెత్తు చెప్పలేదు కాదూ, కెవ్వున కేకవేసి వచ్చి మా యిద్దరి మధ్యపడి నన్ను వెనక్కులాగి, భర్తను కౌగలించుకొని. 'ఛీ ఛీ నువ్వు నాకు తమ్ముడివికావు! నా మంగళసూత్రానికి మాలిన్యం తెస్తావా! వెళ్ళిపో, నీకు కక్ష ఉంటే నన్ను చంపు' అన్నది. అక్కయ్యని ఆరోజున చూడాలి. కాళికాదేవి, మహామాతే నాకు అక్కగారే, సుబ్బారాయుడుగారి కూతురే. తక్షణం ఆవిడ కాళ్ళమీదబడ్డా! 'అక్కయ్యా క్షమించు నేను పాపిని. ఎప్పుడూ నాకు కోపంరాదు. బావ నిన్నంటే వచ్చింది' అని అన్నాను.

బావ గజగజలాడుతూ ఉన్నాడు. అప్పుడు బావ దగ్గరకు వెళ్ళి ఆతని చేయి పట్టుకొని 'క్షమించు బావా! నేను ఏదో తొందరపడ్డాను. నీ భార్యను నువ్వు రండా అనడంవల్ల, నాకు ఒళ్లు తెలియలేదు' అన్నాను.

ఆ రాత్రికే రాజారావూ వచ్చాడు. నెమ్మదిగా అందరికీ తాపాలు కోపాలు తగ్గాయి. బావమరది తన్ను కొట్టకుండా కాపాడింది తనభార్య అనుకున్నాడో, మరేమో తెలియదు. రాత్రి భార్యను బ్రతిమాలుకున్నాడు. భార్య వద్దంటున్నా లెంప కాయలు కొట్టుకున్నాడు.

రాజారావు అక్కయ్యని పరీక్షచేసి, ఈమెమనసు పాడయిపోయింది, మూర్ఛపట్టుకొని పిప్పిచేసి పిచ్చిలోకి దింపుతూంది. అప్పుడే గుండెజబ్బు, క్షయకు వచ్చేస్థితీ ఏర్పడ్డాయి. అందువల్ల ఈమెమనస్సు బాగుపడాలి. పనిచేయకుండా ఉండాలి. మంచిమందులు పుచ్చుకోవాలి అని చెప్పాడు.

అదంతా బావవింటూనే ఉన్నాడే అమ్మా. ఆ మధ్యాహ్నం బావను రాజారావు చాటుకు తీసుకువెళ్ళి చెప్పాట్ట. 'ఏమండి వీరభద్రరావుగారు! నాకు తెలుసును, మీకు తెలియదు, నా భార్య పరమ పతివ్రత, ఏడాది ఏడాదీ కాన్పు. పశువులా సంప

రించి బంగారంవంటి భార్యను చంపుకున్నాను. అటువంటి దివ్యభామినిని ఎవరివ్వ గలరు. మీ భార్య పతివ్రత. మీరు యిలాగే సంచరిస్తే ఆమె ఒక పిడాదికూడా బ్రతుకదు. నేను వైద్యుణ్ణి గనుక చెప్పుతున్నాను.

'రెండు. మీకు మీ భార్యపైన కోపం విపరీతంగా వస్తోంది. అంత కోపం తెప్పించుకోవడం వలన మెదడూ, గుండె పాడై పిచ్చో, గుండెజబ్బో తయారవు తుంది. మీ రకంవాళ్ళగురించి, ఆ వైద్యశాలలో మేము చూస్తూవుంటాముగనుక చెపుతున్నాను. ఆలోచించుకోండి' అన్నాడు.

బావమరది కొరతాడన్న భయం. భార్యకు పిచ్చో ప్రాణభయమో వస్తుం దన్న భయము. తనకేదో ఆపత్తు కలుగుతుందన్నభయము. యీ మూడు పడగల కొట్టినాయి కాబోలు. దావ రెండు నెలలు సెలవుపెట్టి తనఊరు వెళదానంటే మన యింటికి వచ్చివుండమనీ అతనుగూడా మందు తీసుకోవాలని రాజారావుచెప్పాడు. సరేనన్నాడు. ఓ వారము రోజులలో వస్తాడు.

* * *

రాజారావు, నారాయణరావు, లక్ష్మీపతి పొలములవైపు ఉదయము వాహ్యాళికి వెళ్ళినారు.

కోనసీమ సొబగు వేసవికాలములో వనలక్ష్మియే. ఆంధ్రదేశానికి కోనసీమ-నాయకమణి. ఉభయ గోదావరీ మధ్యదేశము. రత్నాలే పండుతుంది. 'ఆముక్త మాల్యద' లో శ్రీకృష్ణరాయడు, దక్షిణాదిసీమ యందాలు తనివోవ వర్ణించినాడు. కోనసీమ సొబగున కొక్క మహాగ్రంథమైన ఆంధ్రాన జనింపలేదేమో? కోనసీమ యందు సర్వశాస్త్ర పారంగతులైన యుత్తములు ఎన్నివేల సంవత్సరములనుండి నివాసము చేయుచుందిరో?

కోనసీమ అత్తరువుల మంజూష; మందమలయపవనములు, పనస పండులు, కాడమల్లె, బొడ్డుమల్లెలు, నారింజపూవులు, అరటితోటలు, కొబ్బరి పూవులు, పోకయాకులు, మామిడిపూతలు, మధురాతిమధుర సౌరభముల సర్వత్ర కలయంపి చల్లుచుండును. రంగురంగుల శర్కరకేళులు, పనసపండులు, జామ, బత్తాయి, నారింజ మామిడిఫలములు కోనసీమనంతయు మధురరస పూర్ణమును జేసినవి

అచట సూర్యరశ్మి పడదు. వేడిగాలులు వీచవు. కొబ్బరిమానుబారలు, పోకదొన్నెలు, పోకతోటలచలువ, పున్నాగముల సుగంధము, పచ్చనితోటలు, నీలంపుగోదావరి, నీలాకాశము, వివిధపుష్పాలు, ఫలరాజములు, బంగారమే పండు పసిమికోనసీమ.

సీతాఫలము, రామాఫలములు నోరూరచేయును. నీలపిల్లిగోవా, కొత్తపల్లి కొబ్బరి, పెద్దరకం, చెరుకురసం, బంగారుకలశి, సువర్ణరేఖ, జహంగీర్, తీపిగుటక్, జొన్నలబారు మొదలగు మామిడిఫలములు ఘుమ్ముఘుమ్మనును.

కొబ్బరితోటలు వేనకువేలు. ప్రతితోటలో నీటిబొండాలు, గంగఫలాలు; కోన సీమ కొబ్బరిసీమ, గొనములసీమ, క్రొన్ననసీమ.

మనవారు తిన్నగా నారాయణరావు తోటకడకు పోయిరి. మోములు కడిగి కొని, స్నానములాచరించి, పాలేరు కూడ బట్టుకొనివచ్చిన బట్టలుధరించి, యనతి దూరమున గూలివారు ఆకుమళ్ళకు నీరుపోయు వరిపొలములవైపుకు బోయిరి.

ఆకుమళ్ళ చెరువులోనుండి ఆకుమళ్ళపంపులలోనికి, కొన్ని కారెములు, కొన్నిగూడ జంటలు నీరు తోడుచున్నవి. అందులో నొకబాలిక గొంతెత్తి పాట బాడ, నందరు పల్లవి నందుకొను చుండిరి.

'ఆకుమళ్ళాకు, నీ
రాకుమళ్ళాకు పోయి
లచ్చుమయ్యా, నీమచ్చమాయా!
సోగా మీసాలయందం
సొంపూతలపాగయందం
ఊగేటి వళ్లుఅందం
రాగాలగొంతు కందం
లచ్చుమయ్యా. నీ మచ్చమాయా!
దండాకడియాలు వెలుగు
కండాలు ముడిసుట్టు
నల్లాని నీయెదలో
ఒళ్ళూరుఝల్లనిపిస్తది
లచ్చుమయ్యా, నీ మచ్చమాయా!
జోడూజోడూ కలిసి
గూడెత్తి నీరేద్దం
నువ్వూ కొండలరాజ
నేనేగోదావరినదిని
లచ్చుమయ్యా, నీ మచ్చమాయా!

అందరూ గొల్లుననవ్వికొనిరి. ఆ బాలికతో జంటగా గూడవేయు బాలకుని, 'దానికి ఎదురుపదమాడరా! ఆడూ! లేకపోతే ఓడిపోయి నట్టేరో!' అన్నారు.

ఆ యువకుడు తలయూపి,

'ఎయ్యవేగూడా, నా పిల్లా!
తియ్యని పాటలు పాడేమే!
పాటా పాటలో కలిపేస్తే
పరుగిడు నీరూ మళ్లల్లో!
ఎయ్యవెగూడా నా పిల్లా'

అని పాడినాడు. 'బాగుందిరా నాగా! బంగారూ! నువ్వురా' అన్నారు. 'బంగారు!

సెప్పకుంట మనవి యినవే.
నా సొగసుపిల్ల, నాగోటువంక
సెప్పకుంట మనవి యినవే.
నాకోసం ఎదురుచూచి
నాగుండె తలుసుకోని
పిల్లా నేనొచ్చేయేళ
ఘల్లుమన్నయి మెట్లోకాసులు
సెపుకుంట మనవీయినవే....
నీరులేక దాగమేసి
నారు వాడి పోతోవుంది
నారాక, నామాట
నారుమడికి సేరౌతది
సెపుకుంట మనవి యినవే....
నారు మొక్క నల్లనే
నాపిల్ల తెల్లనే
నీరొస్తె, నేనొస్తె
మొక్కపచ్చనౌతాది
పిల్లనల్లనౌతాది
సెపుకుంట మనవి యినవే.

## ౧౨

## పరశురామప్రీతి

ఏమి వీరి ఆనందము! గంజికదా వారితిండి, గడ్డిగడా వారి పడక, పూరి గుడిసెకదా వారి భవనము. ఆనంద మెక్కడనున్నదీ? ఇచ్చటా, మనలోనా? పారలౌకికానందము పరమహంసలకు; లౌకికానందమో, ఈ భూమాత శిశువులకేనా! వీరు కవులు, గాయకులు, నర్తకులు. వారు పుట్టినది ప్రకృతి సౌందర్యములో, బ్రతుకునది ప్రకృతి మాధుర్యములో. లయించునది ప్రకృత్యానందములో.

తనబోటివారి నాగరికత, జ్ఞానసముపార్జన, ఇవియెల్ల నెందులకు? తనచరిత్ర వారిలో నొక సామాన్యునిచరిత్రతో పోల్చిచూచినచో నపహాస్యభాజనమై కన్పట్టును: అనుకొనుచు నారాయణరావు తన స్నేహితులతో నడచుచుండెను.

లక్ష్మీపతి తలయెత్తి 'వీళ్ళ కవిత్వం ఎంత అందముగా ఉందిరా. ఇదివరకు ఇది వినేలేదు. ఒక్కొక్క యుగానికి, ఒక్కొక్కరి కవిత్వము పైకిరావాలిరా?

మహారాజులపై కవిత్వము, పై జాతులపై కవిత్వమూ అయింది. ఇక 'జానపదుల కవిత్వము' అన్నాడు. ఎవరి భావాలల్లో వాళ్లు ఉన్నారు.

భోజనాలవేళ కింటికి చేరబోవుచు మనవారు ముగ్గురు, దొడ్డిదారివైపు వచ్చు చుండిరి.

సోమయ్యకూతురు, చల్లాలు ఇంటిదగ్గరకు వచ్చిరి. అక్కడసోమయ్య కొమరుడు సత్తెయ్యయు. చల్లాలుమొగుడు శీతన్నయు హోరాహోరీగా కొట్టుకొను చుండిరి. ఆడవాళ్ళందరు ఘొల్లుమనుచు వారిరువురను విడదీయుటకు సర్వవిధముల ప్రయత్నము చేయుచు విఫలు లగుచుండిరి.

నారాయణరావు గబగబ రెండడుగులు ముందునకు వేసి, బలమున నిరువురను విడదీసి, యావలావలకు గెంటివేసెను. ఆతని కన్నులు స్ఫులింగపూరితములై వారిపై దీక్ష్ణములై ప్రసరించినవి. ఆతడు మేఘగర్జనమున,

'బుద్ధిలేదుట్రా మీకు, వీధిలోని కాట్లకుక్కలా! మిమ్మును బడితపట్టుకొని చావకొట్టాలా?' అనుచు మరియు రౌద్రమూర్తియై సింహసమానుడై నిలుచబడి యుండజూచి, పంది, యెనబోతులవలె బలిసియున్న ఆ యిరువురు తలలు వాల్చుకొన్నారు.

సోమయ్య భార్య రామానుజమ్మ, 'బాబూ! రచ్చించండి. యీళ్ళిద్దరూ ఈపూళ ఒకళ్ళ నొకళ్ళు కొట్టుకొని చంపేసుకొనేవోళ్ళండి బాబూ. మీరు వచ్చారు దేవుళ్ళలా.' అని ఘొల్లుమని యేడువదొడంగినది. 'ఏమిటి కారణం? మాదొడ్డి కప్రతిష్ఠ తెచ్చారు.' అని నారాయణరావు అడిగెను

'శీతన్న పెళ్ళాన్ని సావకొట్టున్నాడండి, సత్తెయ్యవచ్చి, అక్కగారిని ఇడదీసి బావగారితో కలబడ్డాడండి' అని అక్కడచేరిన తూర్పు కాపుచిన్నది పలికినది.

'ఒరే శీతన్నా, వీళ్ళందరిదగ్గరా అంటున్నాను. నువ్వుచేసే పని యెంత ద్రోహమో తెలియునా? ఆడదానిమీదచెయ్యిచేసుకుంటావు! దున్నపోతా! ఛీ! ఛీ! వట్టి నీచుడవు. సోమన్న కల్లుడవా నువ్వు! నీ చరిత్ర అంతా అసహ్యంగా ఉంచుకొని, ఇత రాడవాళ్ళ కాపురాలు [illegible]కగొట్టుతూ, పైగా భార్యని కొట్తావు, బుద్ధి ఉందా? నీ దుష్టబుద్ధులు మానెయ్యి. లేకపోతే నడు ఈఊరునుంచి, నిన్నుగురించి నాకు ఒక్కమాట వ్యతిరేకంగా రానీ, నేను స్వయంగావచ్చి నిన్ను ఈ కొత్తపేట లోకి రాకుండా తరిమివేస్తాను.' అప్పటికి నారాయణరావుకు కోపము త[illegible]ది. వైష్ణవముద్రలు చురచుర అంటినట్లు శీతన్న కుంగిపోవుటచూచి,

'ఒరే శీతన్నా! ఫలానివారిదొడ్డిలో వున్న వాళ్ళనిపించుకోవాలి. ఇంతటితో నేను మన్నిస్తాను. నా మనస్సు మెత్తన. నేను ఎవరిజోలికి వెళ్ళనని తెలుసును గదా నీకు. మా నాన్నగారైతే నిన్ను తోళ్ళు వూడేటట్టు కొట్టవలసిందేకదా? మా అన్నయ్య తక్షణం వెళ్ళిపొమ్మంటాడు కద. వెనక ఓమాటు చూశాను నీభార్య

కుంగిపోవటం. నీభార్య అదం ఏచాప్టిలో ఎవ్వరికైనా ఉందా? దానిప్రేమలో మెలుగు, పో!' అనినాడు.

సీతన్న సిగ్గుతో చచ్చిపోయినాడు. 'అయ్యో! చిట్టి బావయ్యగారికి తెలిసి పోయిందే! తెలుసన్నా చంపని ఆ దేవుడికి ఎంతకోపం తెప్పించాను,' అని మనస్సులో నెంతయు విచారించినాడు.

ఆరాత్రి పడకగదిలోనికిబోయి, చల్లాలు పండుకొనియుండ, పట్టిమంచము దాపున గూర్చుండి యామె పదములనంటి 'చెమించుపిల్లా! తెలవకచేశా! కలువ పువ్వు దగ్గరుంచుకొని, కసింతపువ్వుకోసం, పడరానిపాట్లు పడ్డాదంట. ఇక బుద్ధి కలిగి ఉంటా, నీపాదం అన!' అని ఆమె పాదాలపై తలవంచినాడు. వెక్కి వెక్కి యేడ్చుచు చల్లాలు కాళ్ళు లాగికొని లేచికూర్చున్నది. సీతన్న మంచముపై గూర్చుండి యామెను దగ్గరకు లాగికొని 'చందురుడుంటే చుక్కెందుకు పిల్లా!' అనుచు అనునయించెను. పశ్చాత్తాపతప్తుడగు భర్తమోము జూచి, నిట్టూర్పువిడిచి, ప్రేమ పూరితములగు నాతని బాహులతలలో నామె యిమిడి పోయినది.

రాజారావు వెళ్ళిపోయినాడు. వీరభద్రరావు వచ్చి యత్తవారింటనేయున్నాడు. రాజారావు తన కారుమీదగాని, సుబ్బారాయుడుగారి కారుమీదగాని వలయునప్పుడెల్ల కొత్తపేట వచ్చి సత్యవతిని జూచి వెళ్ళుచుండెదనని చెప్పి, మందులవిషయమై చేయవలసినదంతయు చెప్పి, మందులిచ్చి వెళ్ళిపోయినాడు. వీరభద్రరావునకును, ఆతడు మందులు తెప్పించి యిచ్చుచున్నాడు.

ఆ యేడు గాడ్పులు విపరీతముగ వీచుచున్నవి. కాన సామర్లకోటనుండి తెప్పించిన వట్టివేళ్ళ తడికల గట్టించి నారాయణరావు తన యిల్లంతయు హిమగిరి వలె నొనరించెను. రాజమహేంద్రవరముకన్న కొత్తపేట చాల చల్లగ నున్నది. జమీందారుగారు, వారి భార్యయు, కొమరుండును నీలగిరికి వెళ్ళినారు. శారద యత్త గారింటనే యున్నది.

ఆమె క్రొత్తపేట వచ్చినప్పటినుండియు, భర్తకు కాళ్ళు కడుగుకొనుటకు నీరొసగసాగెను. నాగరత్నంతో 'తాళం చెవులు పట్టుకురా నాగరత్నం,' అంటే సూరీడు గ్రహించి చిరునవ్వుతో 'నాగరత్నం చిన్నమామయ్యావే!' అన్నది. 'నాకు తెలవదా యేమిటిపిన్నీ!' అని నాగరత్నం సుడిగాలిలా మాయమై నారాయణరావు బట్టల బీరువాతాళములు 'చిన్నత్తయ్య యిమ్మంటున్న' దని తీసుకొని వచ్చినది.

నారాయణరావు కాళ్ళు కడుగుకొని లోనికి వచ్చునప్పటికి పట్టుబట్టలు పట్టు కొని నాగరత్నం నిలిచియుండెను.

'నాగరత్నం! చిన్నత్తయ్య బీరువాతీసి, నీకిచ్చిందాఏమిటే?' యని ప్రశ్నించి నాడు. నాగరత్నం అవునన్నది.

ఆ మఱునాడు మధ్యాహ్నం కొత్తపేటలో యిళ్ళంటుకొన్నవి. తనయింటి కడ నిప్పు నార్పు, వాయుపదార్థ మొకటియున్న గొట్టము పట్టించుకొని లక్ష్మీపతియు

వీరభద్రరావునుగూడరా. నారాయణరావు అంటుకున్న ఇళ్ళపై పునకు బరుగెత్తెను.

జనముల కేకలువేసి నీళ్ళబిందెలను బట్టుకరండని అందరిని, కడవలు పట్టుకురండని కొందరిని పురమాయించి, యిళ్ళనెక్కువారిని యిళ్ళనెక్కించి, విప్పించి వేయుచు, అప్పుడే అంటుకొన్న యిళ్ళలోకి దాను జొరబడుచు, సామానుదీయుచు, యువకుల నాపనికి నియోగించుచు నారాయణరావు, ఆగ్నేయాస్త్రమునకు వారుణాస్త్రమైనాడు.

గాలి వేయుచున్నందున నూరంతయు దగులబడిపోవలసినదే. నారాయణరావు కట్టుదిట్టములచే కొలది యిండ్లుమాత్రమే తగులబడియారిపోయినవి.

అందులో బెద్దకాపుగారి తాటాకుల నాలుగిళ్ళభవంతి యున్నది. అతడు భాగ్యవంతుడు. ధనము, సామాను, బట్టలు, పెట్టెలు మున్నగు వానిని చాలవరకు నారాయణరావు మొదలగువారు యీవల బడవైచి రక్షించిరి. ఇంతలో బెద్దకాపు వెఱ్ఱియెత్తినవానివలె నేడ్చుచు 'చిన్న బాబయ్యగారు, నా కొంప కూలిపోయింది. భోషాణం పట్టుకురాలేదు. బాబూ నానోటులు, భూమి తనఖా పత్రాలు క్రయములు, అన్నీ అందులో ఉన్నాయి. ఇంక నాపని అయిపోయిందండయ్యో.' అని ఏడ్చుచు కూలబడిపోయినాడు.

ఇల్లు మహాగ్నిజ్వాలల విరజిమ్ముచు, ఎఱ్ఱటి పూలతోనిండిన తురాయివలె మండిపోవుచున్నది. ఫెళఫెళ, ధణ్, ధణ్ మను ధ్వనులు, పిడుగుబోలి దెసల నావరించుచున్నవి. జ్వాలలు మిన్నంటి పోవుచుండెను. ఆవేడి భరింప వీలులేనిది.

నారాయణరావు ఒకసారి మహావైశ్వానర తాండవము పారజూచినాడు, పెద్దకాపు నిస్సహాయతను దిలకించినాడు.

'భోషాణం ఎక్కడుందంటావు?'

'సావిట్లో తండ్రీ!'

'నీళ్ళతో రెండు బిందెలత్తో' అని కేక పెట్టినాడు నారాయణుడు.

'నీళ్లకారుతోఉండే రెండు తడిగుడ్డలు నా నెత్తిమీద వెయ్యి బావా!' అని లక్ష్మీపతిని కేకవేసినా డాతడు.

లక్ష్మీపతియు వీరభద్రరావును తడిగుడ్డలు నెత్తిమీద వేయుటయు, రెండు చేతులా రెండుబిందెలూ పుచ్చుకొని నారాయణరావు లోనికురికినాడు.

అందరూ ఘొల్లుమన్నారు. ఆతడట్లు చేయునని ఎవరనుకొనినారు! 'వద్దండో' అని పెద్ద కాపు.

'అదేమిటోయి బావా' అని పొలికేక వీరభద్రరావు.

'నారాయణరావుగారో, కొంపలు ముంచకండో' అని జనమంతయును.

వీరభద్రరావు స్తబ్ధుడై నిలువబడిపోయినాడు. లక్ష్మీపతి తన బావవెన్నంటి వెళ్ళబోయినాడు. నారాయణుడాతనికి గుమ్మముకడ కనుపించలేదు. మంటలాతని

గుమ్మముకడనుండి, తరిమివేసినవి. అందరూ ఆశ్చర్యముతో, భయముతో నిశ్చేష్టులైరి. మంటలును శబ్దముచేయుట కూడ మానినవా!

గుమ్మముకడ ఒకబిందెడు నీళ్లు తలపై గ్రుమ్మరించుకొని, ఆ బిందెను వెనుకకు విసరివైచి, వంగిపోయినాడు మండువాలోనున్న ఘోషాణము దగ్గరకు నారాయణరావు.

అతని సాహసౌదార్యాలకు మెచ్చి, వైశ్వానరుడు మిద్దెయున్న ఆ సావిడి లోనికి తొంగిచూచుట మానినాడు. మండువాలోని మంటలు గుప్పుగుప్పున వచ్చుచున్నవి. అప్పుడే ఘోషాణము అంటుకొన్నది. రెండవ బిందె నీరు నెత్తిపై కుమ్మరించుకొని, వంగి ఘోషాణం ముందుకాళ్లు రెండునుబట్టి ఎత్తి దడదడ గుమ్మముకడకు లాగుకొని వచ్చినాడు.

లోపల ఏమి చేయుచున్నాడో, సొమ్మసిల్లి పడిపోయినాడోయని కంఠపూర్ణమగు దుఃఖముతో లక్ష్మీపతి నీళ్ళబిందెలు తెప్పించుచు, చేటలతో గుమ్మములోనికి బోయించుచు, దానును లోనికి దుముక సిద్ధముగా నున్నంతలో మంటలలోనుండి నారాయణుడు ఘోషాణములాగికొనుచు వచ్చుట చూచినాడు. నారాయణుడు గుమ్మము వరకు వెనుక కోళ్ళు వచ్చునట్లు లాగి, మహాసత్వమున హుంకరించి, ఘోషాణమును ఒక్క పెట్టు అటు అడ్డముగా తిప్పి ఆ వెనుక కాలును, ఇటు అడ్డముగా తిప్పి ఈ వెనుక కాలును ఈవలకు లాగి బరబర యీడ్చి లాగిపారవైచి, ఖాండవదహనము చేయు అర్జునునివలె, లంకదహించు ఆంజనేయునివలె నిలుచుండి, లక్ష్మీపతికడకు వచ్చి, అలసటపడి రోజుచు పడిపోయినాడు.

వేడిగాడ్పులో, అగ్నిహోత్రుని వేడిలో జనమునకు గాడ్పు తగులకుండ నొనర్చుటకు, వేడి కాఫీ రెండు మూడు బిందెలు పంపిచుమని తల్లితో నారాయణుడు ముందే చెప్పి వచ్చినాడు. ఆ వేడికాఫీ యెంతమంది ప్రాణములనో రక్షించినది. లక్ష్మీపతి గజగజ వణకుచు నారాయణరావు నదిమిపట్టుకొని తన ఒడిలోచేర్చి, కళ్ళనీరు గారుచుండ, ఇంత కాఫీ బావమరది పెదవుల కందిచ్చి త్రావించినాడు. పది నిముషములలో నారాయణుడు తేరినాడు. ఇంటికి చరచర వచ్చినాడు. బండి వద్దన్నాడు, పట్టుకొనవద్దన్నాడు.

ఊరంతయు 'నారాయణరావుగారు నారాయణరావుగారు' అని చెప్పుకొన్నారు. విప్పంతయు నిశ్శేషముగ నార్పివేయుటకు జనము నియమింపవలయునని, పెద్దకాపుతో జెప్పి నారాయణరావింటికి వచ్చెను.

వీరభద్రుని యాశ్చర్యమునకు మితిలేదు. 'ఇతడా, నా బావమరది' యని యాత డాశ్చర్యచకితుడైనాడు. అతని ప్రేమంతయు నారాయణరావు నావరించిపోయినది.

జరిగినదెల్లయు బూసగ్రుచ్చినట్లు లక్ష్మీపతి 'యింటిల్లపాదికి' చెప్పినాడు. శారదకు గుండెలు దడదడ కొట్టుకొన్నవి. 'ఇల్లుకూలితే! నా తండ్రీ! అన్నే

యిల్లాంటిపనులే చేస్తావు నువ్వు ' అంటూ జానకమ్మగారు కూర్చున్న కుమారుని తల నిమిరినది. ఇంతలో పెద్దకాపు, ఆతని కుమారులు వచ్చి సుబ్బారాయుడుగారికి నమస్కారముచేసి, నారాయణరావు పాదాలకు దండము పెట్టిరి. సుబ్బారాయుడు గారు రహస్యముగా దన కన్నుల నీరుతుడుచుకొనిరి. తక్కినవారందరు సంతోష భాష్పముల విడచిరి.

'తండ్రీ నన్ను రక్షించారు. ఏమి ధైర్యం, ఏమి చొరవ, ఏమి బలం! నారాయణరావుబాబుది. సుబ్బారాయుడు అన్నగారూ, మీ బాబు మావాళ్ళందరికీ బుద్ధి చెప్పారండీ!'

## ౧౮

## పరీక్షాఫలితములు

ఆ రాత్రి నారాయణరావు తన పందిరిమంచముపై పండుకొని మాగన్ను వైచెను. శారదయు నారాయణరావును వేఱువేఱుగ పండుకొందురు. శారదకు నింకొక మంచము వేయించుమని రహస్యముగ సూరీడుతో చెప్పినాడాతడు. శారదయు నా మంచముమీద పండుకొనునది. లోకమున కేమి తెలియును? భార్యాభర్తలు సిగ్గుచే మాట్లాడరనుకొన్నారు. ఎంతో ' సరదా ' గల నారాయణరావు తల దువ్వించుకొనడు, భార్య నేమియు నడుగడు. శారద భర్తకు నీళ్ళు తోడించుటగాని, సబ్బు నిచ్చుటగాని, తువాలిచ్చుటగాని లేదు. శారదకడనుండి భర్తకుగాని, నారాయణరావుకడనుండి భార్యకుగాని యుత్తరములులేవు. ఇది యంతయు నొక విచిత్ర దాంపత్య మనుకొనినారు. సూరీడుకూడా నిజము పూర్తిగ గ్రహింపలేదు. శకుంతల మాత్రము సంపూర్ణముగా గ్రహించినది.

ప్రథమదినములలో నారాయణుడు ఆవేదననందెను. అతని ప్రేమ విజృంభించి ఆతని దహించివేయునది. అతడు ధీరోదాత్తుడగుటచే, నిశ్చలచిత్తుడై భార్యను పొరపాటుననైన ముట్టుకొనువాడుకాడు.

శారద తన్ను భర్త ఏమికోరునో యని భయపడునది. అందుకనియే కాపురమునకు వచ్చిన ప్రథమ దినములలో ఎంతసేపటివరకో నిద్రపోవక, చివరి కొడలు తెలియక నిదురబోవునది. రాను రాను భర్త సద్గుణసంపన్నుడనియు దయార్ద్రహృదయుడనియు సంపూర్ణముగా నవగతమైన దామెకు. అందుచే నిర్భయముగ నామె భర్తతో నొక్క గదిలోనే నిదురగూరునది.

తా నొక్కతియే పండుకొనుచున్నానన్న భావమే యామెకు పరీక్షలకు జదువు రోజులలో లేదు. అప్పుడామె సంపూర్ణముగ బాలికయే.

హిందూకుటుంబములలో భార్యాభర్తలకు పునస్సంధాన మహోత్సవము సలిపి నప్పుడు పదుమూడు, పదునాలుగు, పదునైదేడుల యీడుండును. అప్పుడు బాలిక

లకు ప్రేమయుంచుట యరిది రానురాను వారికి భర్తలయం దనురాగము వృద్ధి యగును.

చెన్నపురిలో, భర్తపాటలు, భర్తమాటలు విన నామె కుతూహల పడునది. ఫిడేలు వాయించుకొనుచు పరవశుడై, గొంతెత్తి గంభీరమధురముగ బాటలు పాడు భర్తపాట నేపథ్యమునుండి వినుచు, శారద పారవశ్యత నందునది రెండుమూడు సారు లామె తాను భర్తను ప్రేమించుచున్నానా యని సందియమందినది. 'యేల ప్రేమింపకూడదు. భర్త సుందరుడని ప్రతివారును జెప్పెదరే? నిజముగా సుంద రుడే! ఏమి తెలివితేటలు!

నేడు నారాయణరావు చేసిన యీ మహాద్భుతకార్యము ఎవరు జరుపగలరు? మహావీరుడు తనభర్త. గ్రీకు కథలలో జదివిన వీరాగ్రగణ్యుల కీయన యేల దీసి పోవును? ఆయన రూపము బొమ్మలలో వేయు వీరుల కెంతమాత్రమునుదీసిపోదు. స్నానము చేయునప్పు డాయన మూర్తి ఎంత సుందరమయి కనుపించును

ఆమె మనోనేత్రములకు నారాయణుని కమ్మెచ్చుల దండలు, పొంకమగు కంఠనరములు, తేజస్సును సూచించుచు మచ్చునకేని యొక యపశ్రుతిరేఖ లేని సుందరమగుమోము. నల్లని ఒత్తయిన జుట్టు, విశాలమై ఎత్తయినచాతీ, పొడుగగు నా రూపము జూచి ఈ మన దేవతవలె నున్నాడని యామె భావించి సిగ్గుపడినది. తన అక్క శకుంతల మరదిగారన్న నెంత గౌరవము చూపును! తన తండ్రికి అల్లునిపై బ్రేమ యింతంతగాదు.

కొంచెమయినచో నెంత ఆపత్తు కలిగియుండును? ఏలాగునైన కొంచెము జాగ్రత్తగ నుండవలయునని నాన్నగారితో చెప్పించవలెను. ఈయన ఎంత పరోప కారి?

ఆమె హృదయము పూర్ణమైనది. తలుపులు దరిగవేసికొని, నిదురించు తన భర్తను జూచి పులకించిపోయినది. సిగ్గుచే మొగము జేవురింప నెమ్మదిగ తనభర్త పర్యంకము సేరి, యాతని తనివోవ బరికించి యాతనితల నంటియంటనట్లంటినది. ఒక్కసారి యామె హృదయము పున్నమనాటి సంద్రమై ఉత్తుంగ తరంగయుతమై పొంగినది.

ఈయన కాళ్ళకడ నేల పండుకొనరాదు. ఇతడేనా తన నాథుడు! తండ్రిగా రిదియంతయు చూచియేనా తన్నీ మహాభాగున కిచ్చినారు. ఆమె యాతనికి నమస్క రించినది. చిరునవ్వులు నాట్యములాడునా యన్నట్లు, సహజముగ వంపురేఖలున్న యాతని పెదవుల జూచి తన పెదవుల మెత్తందనము తలచికొని ఆ పెదవుల....? ఆమె మత్తిల్లినది, కనుల బరువు లావరించినవి.

వెలుగున్నదో, లేదో యనిపించు పడకగది దీపపువెలుగులు నిదురనంటించు భర్త నొక దివ్యపురుషునిగ గన్పింపజేయ, నామె యాతని పదములకడ నెమ్మదిగ జేరి పండుకొన్నది.

ఆతని పాదములు తన యొడలికి దగులుటతో నేదియో వర్ణింపరాని అద్భుత మాధుర్యమో విద్యుల్లతవలె నామె శరీరమంతయు ప్రాకిపోయినది.

ఈ ఉత్తమపురుషుడు, ఈ సౌందర్యనిధి, ఈ వీరసింహుడు, తనభర్త! తన్ను ప్రేమించి తన్ను వివాహమాడినాడు. తా నెంతమూర్ఖురాలయి సంచరించినది. పెన్నిధిని పెంటపోవనుకున్నది. ఈయన తన్ను చేపట్టునా? తన్ను తీయనిమాటల నాదరించునా? ఆ గంభీరదృష్టులతో తన్ను చూడనైన చూచునా? ఆ వెడదరొమ్మున బలములు తిరుగు బాహువులతో తన్నదిమివేయునా? తా నెంత శిక్షకైన నర్హురాలు. ఆమెకు భయ మావహించినది. ఆయనపాదము లంటి వేయి మొ్రొక్కులు మ్రొక్కెను, ఆయన మన్నించునా? మన్నించునా?

ఇది యంతయు నారాయణరావు చూచుచున్నాడు. ఆమె తనకడకు వచ్చినప్పుడు, తన తల నామె తాకినయప్పుడు ఆతనియొడలు ఝల్లుమని పోయినది. ఆతని హృదయ ముప్పొంగిపోయినది. వేయి తీపు లాతని నలమినట్లయినది. లేచి యా బాల నేల కౌగిలిలో నదిమివేయరాదు? రూపెత్తిన లాలిత్యము తన ప్రణయ కాంత సౌందర్యము. సౌందర్యమునకు వన్నెలు దిద్దు సౌందర్యము. ఇన్నాళ్ళకు ఈమె తన్ననుగ్రహింప నున్నదా! జరిగిన దంతయు కలకానున్నదా? ఆమెను తన జీవితాశయమూర్తిగ నొనర్చుకొని, ఆమెతో లోకాల నావరించి, ఆమెను పూజించి, ఆమె దివ్య గాంధర్వములో లయమై, ఆమె పవిత్ర సౌందర్యజ్యోత్స్నలో కిరణమై ఆమెయు దానును లయమైపోవుట ఎన్నడు?

ఇంకను ఆమె గాఢోత్కంఠయై ప్రేమ మహా ఝంఝూనిలముల గదలిపోవలె!

ఆతడు కదలక యట్లే స్వప్న మధురాకాంక్షల దేలిపోవుచుండెను. రాత్రి ఘడియలు గడచిపోవుచునే యున్నవి.

* * *

మరునాడు శారదాదేవి మొదటి తరగతిలో కృతార్థురాలైనట్లును, సూర్యకాంతమున కన్నియు మంచిగుణములు వచ్చినట్లును జమీందారుగారు కూనూరునుండి తంతి నంపిరి.

నారాయణరావున కన్నియు శుభవార్తలే. రెండురోజులక్రిందటనే రామచంద్రరావు నాలుగురోజులలో సింహళమందు దిగునని తంతి వచ్చినది.

ఇదివరకే చెన్నపురిలో రవ్వలు చెక్కిన గాజులజతలు రెండు, ఒక్కొక్కటి అయిదువందలకు నారాయణరావు కొన్నాడు. అవి పరీక్షలో నెగ్గబోవు నీ బాలల బహుమతులకే! సన్ననిగాజులు, వానిపై నచ్చటచ్చట చక్కని చిన్న రవ్వలు. ఆ రెండుజతలు నారాయణరావు భార్యకొకటి, చెల్లెలికొకటి బహుమానము లిచ్చెను. వారెంతయు నుప్పొంగిరి.

ఆరోజునే సుబ్బారాయుడుగారు తనవొడ్డిలోని ఆడువారందరికీ ఖద్దరు రవికల గుడ్డలు, పండ్లు, బహుమతులు పంపించిరి.

శారదకు సంతోషము ద్విగుణమగునట్లు ప్రతివారు సూరీడును శారదను పొగడువారే. సూర్యకాంతము శారదను కౌగిలించుకొన్నది. 'వదినా! మా అన్న గారు అమెరికానుంచి నాలుగురోజుల్లో వస్తున్నారటగాదూ?' అనినది శారద.

'ఉండమ్మా వదినా! అన్నీ వేళాకోళాలు మొదలుపెట్టావు.'

సోమయ్యభార్య, జానకమ్మగారితో తన యల్లునికి తనకుమారునికి జరిగిన యుద్ధము, అల్లుని చెడునడువడి, చిన్న బాబయ్యగారుచేసిన యుపకారములన్నియు చెప్పినది. 'ఆనాటినుంచి శీతన్న మారిపోయాడండి. నారాయణరావుగారు మంచి ప్రెబువుతల్లీ' అని చెప్పుకొన్నది. శారద యా చిత్ర చరిత్ర వినుచు కన్నుల ఆనందపు వెలుగుల జిమ్మినది.

అందుకనా చల్లాలు తన్నతిగౌరవము చేయుచున్నది? తానన్న వెట్టి యాపేక్ష జూపుచున్నది. చల్లాలు, వెంకాయమ్మ ఒక్కయీడు. చిన్నతనమునుండి నారాయణుని ఆటలు పాటలు నన్నియు చల్లాలెఱుగును.

'మీ ఆయనగోప, చిన్నతనంలో, కుట్టమూర్తిలా ఉండేవోరు. తొనలు తొనలండీవొళ్లు, వంటినిండా నగలతో గంతులేస్తూంటే దిష్టితగిలి పోతుందనుకునే వోరు అమ్మగారూ. అందరికీ ఎత్తుకోవాలని ఉండేది, ఎత్తుకోనిస్తేనా, ఆర్కి ఎంత బలం? ఓమాటు మావంగోలావుగిత్తదూడను ఊరకుక్క ఒక్కటి కరవ పోతోంటే దాన్ని తోకుచ్చుకొని బరబరబర లాగిపారేశారు. అప్పుడు మూడో యేడు. కుక్క పోతరించిన గేద్దూడలాంటిది. అడిలి కొంయ్య కొంయ్యో అంటూ పారిపోయిందండి

'ఆయన సదుగులు పెద్దవి, బుద్దులు గొప్పవి. ఎంత గొప్పవోరండీ.'

'చిన్నతనాన్నుంచి ఎలాంటి వోళ్ళమీదా పేమ, మాలోళ్ళంటే వాళ్ళకన్నీ యిస్తూ ఉండేవోరు. గాంధిగారిమాట రాకమునుపే ఇంటిలో వన్నీ తీసుకెళ్ళి మాలోళ్ళపిల్లలకీ, మా పిల్లలకీ పెట్టుండేవోరండి. ఎంత బకితి. మావోళ్ళంతా బజనచేస్తూవుంటే ఆ అందం వొలికే కన్నుల్తో చూస్తూవుండేవోరు. దయ ఇంతింతా కాదుండి. మేం అప్పుడే అనుకునేవోళ్ళం. ఈయన పపంచంలోకల్లా తెలివైన వోరని.'

'చదువులు అవీ ఎల్లాగుండేవి?' శారద ఆ ప్రశ్న అప్రయత్నముగ వేసినది. తానేనా అడిగినది యని యాశ్చర్యము పడినది.

'అమ్మయ్యో! ఆరి చదువేమిటి? అదుటులం కాదమ్మా! నీ అదురుష్టం అమ్మో. మీ యిద్దరికీ యీడూజోడూ. తల్లీ మీకీపాటికి. చిన్నతనంలో నారాయణం గారివంటి బొజ్జనాన్నగోరు పుట్టాలండి. ముందుసంవత్సరం తప్పకుండా పుడ్తారుండి.'

'ఖైదుకు వెళ్ళారా?'

'అవునుండీ. ఇంతప్పటినుంచీ నెచ్చేరులే. అంతలో గాందిగారొచ్చారు. ఒకటే నెఱ్ఱేరులు నారాయణగోరు. తచ్చణం ఆయన్ని పట్టుకొని ఆరునెల్లు ఖైదులో యేశారు. ఎంతమందొచ్చారు బాబో ఆరు ఖైదుకు ఎళ్ళేటప్పుడు, ఈ సీమోళ్ళంతా వచ్చారుండి.

'ఖైదులో వున్నప్పుడు నిద్దరలేదు. తిండిలేదు మా జానకమ్మగోరికి. పెద్దయ్యగోరు మాత్రం దైర్యంగ వున్నారుండి జెయిలునుండి రాగానే, మీ యత్త గోరు ఆరతి యిచ్చారుండి. పూజలు పురస్కారాలు జరిపారుండి.

## ౧౯

## బంధితుడు

వారంరోజులైన వెనుక మధురనుంచి రామచంద్రరావు, తన్ను విప్లవకారులలో నొకనిగా నెంచి పోలీసువారు నిర్బంధించిరనియు, నారాయణుని తక్షణము రమ్మనియు తంతివార్త నంపెను. నారాయణు డావెంటనే బయలుదేరి మెయిలందుకొని చెన్నపురి వెళ్ళినాడు. ఆసాయంకాలము మెయిలులో మధురకు బోవచ్చుననియు పోలీసు ముఖ్యాధికారితో నీ విషయమై మాట్లాడుట మంచిదనియు తలచి, తన న్యాయవాది గురువుగారికడకు బోయి యంతయు జెప్పెను. వారును నారాయణరావును గలసి రాజధాని పోలీసు ముఖ్యాధికారి కార్యాలయమునకు జని యచ్చట విచారించగా, రామచంద్రరావు విషయమై యేదియో గూఢసమాచారమును, అందునకు సంబంధించిన కాగితములను ముఖ్యాధికారికి అందినట్లును - ఆయనే రామచంద్రరావును బంధింప నుత్తర్వులిచ్చినట్లు ఇదియంతయు ప్రాణకాంతిబోసు, గండారుసింగులపై ప్రభుత్వమువారు తెచ్చిన యభియోగమునకు సంబంధించినదనియు దెలిసినది.

దానితో నారాయణరావు తిన్నగ నీలగిరికి, కూనూరు పోయినాడు. మామగారితో మాట్లాడినాడు. మామగారిని దీసికొని ఉదకమండలము వెళ్ళినాడు. జమీందారుగారు ముఖ్యమంత్రిని పట్టుకొని ఆయనతో గలసి, పోలీసు ముఖ్యాధికారికడకు వెళ్ళినారు. మంత్రియు, జమీందారును రామచంద్రరావు కేసు విషయమై వచ్చినారని వినగనే యా యుద్యోగి యాశ్చర్యమునంది—

'మీకు చుట్టమాఅండి రాజాగారూ ?' అని ప్రశ్నించి, 'ఇవిగో ! ఇవి ఆతని కేసుకు సంబంధించిన కాగితాలు. మా వాళ్ళు పదిరోజులు రిమాండు పుచ్చుకొన్నారు. అనుమానాస్పదములైన కారణాలు చాలా వున్నవి' అని తెలియజెప్పెను.

జమీందారుగా రా కాగితములన్నియు బరీక్ష జేసిరి. అమెరికాలో రహస్యశాఖా కర్మచారుడు వ్రాసిన సముజాయిషీలవి. అమెరికాలో తిలకు జన్మదిన మహోత్సవ సందర్భమున రామచంద్ర రా వుపన్యాస మిచ్చినట్లు (ఆ యుపన్యాస భాగము కత్తిరించియున్నది) ఆ యుపన్యాసము విప్లవవాద పూరితమైయున్నట్లు, 'భారత

సందేశ్ ' అను పత్రికలో రామచంద్రరావు తీవ్రవాదనలతో వ్యాసము వ్రాసినట్లు (అ పత్రిక ప్రతియునున్నది) - ప్రాణకాంతబోసు మొదలగువారితో కలసి భరత దేశమున విప్లవము గలుగచేయ రహస్యాలోచనలు సలిపినట్లు, ఈ మొదలగు వివరములం దున్నవి. ఇవి యన్నియు అప్రూవరుగా మారిన ఒక ముద్దాయివలన గ్రహించిన విషయములు.

ఇన్స్పెక్టరు - జనరలుగారి యనుమతితో, జమీందారుగారు వెళ్ళి, ప్రభుత్వ న్యాయవాది (అడ్వకేటు జనరలు) గారిని తీసికొనివచ్చిరి.

వారందరు రామచంద్రరావుగారి కేసునుగూర్చి సంపూర్ణముగా తమలో తాము చర్చించుకొనిరి. అడ్వకేటు - జనరలుగారి తోడను, ముఖ్యమంత్రిగారి తోడను, పోలీసు ముఖ్యన్యాయాధికారితోడను రామచంద్రరావు చాలా తెలివైన యువకుడనియు నాతడు ప్రపంచమంతట లెక్కలలో ప్రసిద్ధికెక్కిన కొద్దిమందిలో నొకడనియు, ఆతనికి ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలలో నాచార్య పదవి సముపార్జింప గోరిక యనియు, ఆతడు ఎమ్. యస్. సి. పట్టము నొందిన వాడనియు, ఆంధ్రులలో నట్టివా రితరు లెవ్వరు లేరనియు జెప్పి వాదించినారు జమీందారుగారు.

అడ్వకేటు - జనరలుగారు కాగితములన్నియు బరిశీలించి 'ఇందులో ఇంత వరకున్నది. రెండే సాక్ష్యములు, ఒకటి అమెరికా రహస్యచారుడు, రెండు విప్లవ కారులలో ప్రభుత్వపక్షానికి తిరిగినవాడు, వాళ్ళు ఏమి చెప్పగలరు ? ఒకడు, రామ చంద్రరావు పత్రికలో వ్రాసినట్లు, ఉపన్యాస మిచ్చినట్లు చెప్పును. మరియొకడు ఒక రాత్రి వీరందరు కలిసినట్లు మోము కప్పబడి యున్నట్టు చెప్పును. వార్తాపత్రికలు సాక్ష్యములుగా పనికిరావు. రాత్రివేళ ఒకరినొకరు గుర్తించుట యెట్లు ?

'ప్రాణకాంతబోసు, గండార్‌సింగుల కేసులో సంగతివేరు. వారు హిందూ దేశమువచ్చి బాంబులు తయారుచేయుట మొదలు పెట్టినారు. ఇంకను హిందూ దేశములో నేవేవో చేసినారు. ఆ సాక్ష్య బలమున ఇది అంతా ప్రభుత్వముపై కుట్ర అని అర్థమయింది.

'ఆ కేసులో రామచంద్రునకు సంబంధములేదు ' అని ఆయన వాదించినాడు.

ముఖ్యమంత్రియు రామచంద్రుడు నిర్దోషియని చాల గట్టిగ చెప్పినాడు. సరేయని, ఎట్టకేలకు పోలీసు ముఖ్యాధికారి యొప్పుకొనుచు, కేంద్రప్రభుత్వమువారికి జరిగిన విషయములు, రామచంద్రరావుపై కేసులేదనియు, మదరాసు ప్రభుత్వము వారును తనతో నేకీభవించుచున్నారనియు మనవిచేయుచు వ్రాసెను.

శ్రీ మదరాసు గవర్నరుగారు ఇన్స్పెక్టరు జనరలుగా రొనర్చినపని మంచి దని నట్లుచేయవచ్చుననియు ననుమతినిచ్చిరి.

ప్రభుత్వపుతంతి రామచంద్రుని విడుదలచేయుమని రామనాధుజిల్లా పోలీసు సూపరింటెండెంటుకు పోయినది.

జమీందారుగారు సంతోషముతో ముఖ్యమంత్రికడనుండియు. పోలీసు ముఖ్యాధికారికడనుండియు ముఖ్య న్యాయవాదికడనుండియు సెలవుపుచ్చుకొని, నారాయణరావు కడకు వచ్చెను. వారిరువురు గలసి కూనూరు వెళ్ళిరి. నారాయణరావు అత్తగారికి, భార్య మేనత్తకు నమస్కరించి కేశవచంద్రుని కౌగిలించుకొని మ్యూమగారికడ సెలవుపుచ్చుకొని, మధురప్రయాణమయ్యెను. తానువచ్చుచున్నాననియు, విడుదలచేసెదరనియు తనబావ కాతడు మధురకు తంతినంపెను.

ఇటలీలో బ్రిండిజీకడ 'నాయిటాలి' యను మహానౌక నెక్కి నప్పటి నుండియు. రామచంద్రరాయనికి దన దేశముపై, తనయింటిపై, తన బంధుగులపై, మనస్సు పరుగిడజొచ్చెను

ఈ దేశములలో నెంత యైశ్వర్యమున్న నేమి, ఎన్ని సౌకర్యములున్న నేమి, ఎంత నాగరికతయున్న నేమి తన దేశమున కీడువచ్చునా!

'సుజలాం సుఫలాం మలయజ శీతలాం సస్యశ్యామలాం, మాతరం వందేమాతరం.'

ఆహా! తనతల్లి కెన్నినదులు, ఎన్నిక్రీడాసరస్సులు. ముక్కారులు బండు కేదారములతో, ఒడలు మరపించు చల్లదనముతో తనతల్లి తన్ను చేరపిలుచుచున్నది.

'శుభ్రజ్యోత్స్నా పులకితయామినీం
పుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం - మాతరం.

--వుల, కొండల, పట్టణాల, బయళ్ళ, పొలాల, తోటల, నదుల, సముద్రాల చల్లగా ధవళమై పుచ్చపూవువలె పడు వెన్నెలచేత పులకించి పోదువా తల్లీ. అందములై ఆనందమనోహరములై అపరిమిత సువాసనా లహరీ పూరితములై వివిధ వర్ణాలంకార శోభితములై పూవులచే అలంకరింపబడిన దామాత. ఆమె శిరోజములా హిమాలయములు! అందమగు కాశ్మీరము, తమ తల్లికి ప్రపుల్లమగు ముఖమా?

ఓహో మాతా! నీగతి దుర్భరము. కానిమ్ము పుత్రులు నిన్ను మరచెదరా! జగన్మాతా!

'త్రింశత్ కోటి కంఠ కలకల నినాదకరాళె
ద్వాత్రింశత్ కోటిభుజైర్ ధ్రుతకరకరవాలే'

తల్లి ముఖాన వినవచ్చు భాషలన్ని విని ఎంత కాలమయినది.

ముద్దులుగులుకు తెలుగుభాష వినరాక చెవులు తుప్పులు పట్టినవి.

'ఆంధ్రదేశము మాకు అమరదైవతము'

తల్లీ! తెలుగుమాతా! నీతీపిలో తానెప్పుడూ లీనమగునో అమ్మా! గోదావరీ, పుణ్యస్రవంతీ, నీ గంభీరత, నీప్రేమతాను, మరువగలుగునా? ఎప్పుడు దూరాన నా పాపికొండలు, నీలోని లంకలు, నీ నీలజములు కన్నులకరవుదీర చూడగల్గుగునోకదా?

కృష్ణా! పెన్నా! ఏనాటికో మీ దర్శనము రాజమహేంద్రనగరము, కాకినాథపురము కాకినాడయందలి వీధుల తాను నడచిపోవలయు.

అతని మనస్సు తళుక్కుమన్నది. కొత్తపేట, అత్తవారిల్లు, తనచిన్నారి భార్యయగు సూర్యకాంతము.

ఏమి తెలివైనదా బాల! ఎంత అందగత్తెయయినది. సంపూర్ణప్రౌఢవలె నెదిగినది. పదునేడేండ్ల బాలిక; ఆ భగవంతునిమాయ. లియొనారా తన లక్షల నెంచక, తన్ను సంపూర్ణముగ నర్పించుకొన్నదే! జాతికి జాతికి భ్రుతికలియదా యేమి? తన సౌందర్యనిధి, సర్వకళాశోభిత సూర్యకాంత మేమిచేయుచుండునో. తనభర్త పరీక్షల జయమంది వచ్చుచున్నాడని లోన సంతోషించుచుండునో? పరీక్షలలో నెగ్గినదా? తప్పక నెగ్గును నారాయణరావుబావ చెల్లెలు. ఆమె నెప్పుడు చేరకలుగునో? తన్ను చూడగనే యామె మోమున నెట్టి మార్పులు కలుగునో?

నారాయణరావుబావ గంభీరస్వనములు విని యెన్నాళ్ళయినది.

తనతల్లి, ఆమె యెన్ని అశ్రువులురాల్చినదో? ఎంతచిక్కినదో? భార్యనైన వదలవచ్చును. తల్లిని వదలలేము. తల్లీ! ఈ నిర్భాగ్యుడు ఎంత తెంపరియయి సుదూర దేశాలు పోయినాడు. ఎప్పుడు కాకినాడలో అడుగుపెట్టునో? తల్లి పాదాలపై మోమునుంచవలె. ఆమెయొడిలో ఒరిగిపోవునుగాక. ఆమె తన తల నిమురునా? పూజ్యులగు తండ్రిగారికి నమస్కారములు. తానమెరికాలో చదువు కొన్నంత కాలము, ఎంత విచిత్రపు ప్రేమ నొలికించు నుత్తరములు వ్రాసినారు. వర్తకులగు తన స్నేహితులచే, తన కొమరుని స్నేహితులచే, ననేకములగు వార్తల నంపినారు. మామగారు గంభీరులు. ఆయనకు భయములేదు. మానవ మహోత్కృష్టతయం దెంతయో నమ్మకము. ఆయన మేరువువలె నుండును. ఆయన యే యుగపువీరుడో?

సూర్యకాంతము, తనతో మాటలాడునా? తన పెళ్ళినాటి యామెరూపము, యీ నాటి యామె రూపవిలాసము! ఎంత మారినది? ఎవరా యని ఒక్కనిమేషము తాను తెల్లబోయినాడు ఆఖరి ఛాయాచిత్రము చూచినప్పుడు. శాంతి ఉన్నదన్నారు. తన బావ ముహూర్తము కూడ పెట్టినామని ఏడెనుకు తంతి నిచ్చినాడు. అతనికి తనపై నెంత ప్రేమయో? ఈ అందరి ప్రేమకు దాను బాత్రుడగుట కేమి చేసెనో?

సింహళము దరిసినది. కొలంబోలో నౌక ఆగినది. నౌకలో భరతదేశపు భోజనమేపెట్టిరి. ఇటలీదేశస్థులు భారతీయుల నెక్కువ గౌరవము చేసెదరు.

రామచంద్రరావు నౌక దిగుచు వెనుకటి తన నౌకా ప్రయాణము జ్ఞాపకము తెచ్చుకొన్నాడు.

లియొనారాకన్య, యెంత ప్రేమార్ద్రహృదయ. అతని కాసాయంకాల దివ్య ముహూర్త మీజన్మమున మరపురాదు, ఏమియానందమిచ్చినది. అతి పవిత్ర

హృదయ. కాని అట్లు తన్నర్పించుకొన్నదే. ఎంత ప్రయత్నించినను తా నామె సౌందర్యమునకు ప్రేమకు ముగ్ధుడైపోక తప్పినదికాదు.

ఆమె యేమన్నది. 'నాప్రియతమ స్నేహితుడా రామచంద్, నీ భార్యతో పోయి సుఖముగా కాపురముచేయుము. మమ్ములమరచిపోకుము. మాకందరకు హిందూదేశముపై నున్న ప్రేమ, ఏదేశమునందునులేదు.

'ఏల మేము హిందూదేశ స్వాతంత్ర్యమునకు సాయము చేయుటలేదు? అని ప్రశ్నకదా? ఏదేశమున కా దేశము ప్రయత్నించి విజయమందవలెను. నీవు భారతములోని పద్యము చదివి నాకు అర్థము చెప్పినావే. అటులే చివరకు మా దేశమువంటి దేశములు సాయముచేయును.

'మీదేశ ముత్కృష్టమైనది. అట్టి పమరపూజ్యమగు దేశము స్వాతంత్ర్యము నకై పోరాడుచుండ ప్రపంచోద్ధారకమగు పరమశక్తి ఉద్భవిస్తుంది. యూదులు, తమ దేశస్వాతంత్ర్యమునకై పోరాడుటవలననే, అవతారపురుషుడగు క్రైస్తు జన్మించ లేదా? ఆలాగున గాంధియో మరి యెవ్వరో ప్రపంచము తరింపజేయుటకు మీదేశ మునసే యుద్భవించాలి.'

అని చెప్పినది. ఏమి యామె యుత్సాహము. ఆమె ప్రేమ. తప్పక హిందూదేశము వచ్చెదనన్నది. తనకు పునస్సంధాన మహోత్సవము జరుగునాటి కామె బహుమతి వచ్చునట. తా నామెకు తన పునస్సంధానముహూర్తపు తారీకు తెలుపుచు తంతినిచ్చినాడు. అని యాత డాలోచించుకొనుచు అచటనున్న అరవల, తెలుగుల, ఔత్తరాహుల భాషలు చెవులార వినుచు బులకించుచు రహస్యముగ దిరుగు కన్నీరు తుడుచుకొనుచు మంచి ఆంగ్లేయ హోటలులోనికిబోయి పూర్ణమగు భారతీయ భోజనము మాంసరహితమగు దానిని గొనిరమ్మని, గదిలోనికి బోయి, భోజనపు దుస్తులు మార్చుకొని భోజనముచేసి రైలెక్కి పొలనారువా చేరుకొన్నాడు.

## ౨౦

## రామచంద్రుని రాక

పొలనారువాలో (స్టీమరు) చిన్న పొగయోడనెక్కి ధనుష్కోటిలోదిగి, ఒళ్లు పులకరించపోవ భక్త్యావేశపూరితుడై, ఏరును చూడకుండ వంగి కొంతమన్ను తీసి ముద్దుగొని నోటిలో వేసుకున్నాడు. అచ్చటనేయున్న యొక జానపదుడు 'ఈ దొర మన్ను తిన్నాడేమి?' యని యనుకొన్నాడు. ఇంతలో ముప్వురు పోలీసు వారు, ఒక రక్షక భటాధికారియు, నిరువురు భటులువచ్చి 'అయ్యా మీ పేరేమి?' అని అడిగినారు.

'నా పేరు రామచంద్రరావు.'

'ఇంటిపేరు?'

'బుద్ధవరపు'

'అయ్యా! మిమ్ముల శ్రీ జార్జిసార్వభౌముని పేర నిర్బంధించుటకు నుత్తరు విదిగో, మిమ్ముల నిర్బంధించుచున్నాను.' అని యా రక్షకభటాధికారి యాతని భుజముపై చేయివైచెను.

'అలాగా అండి' అని రామచంద్రరావు తెల్లబోయి, యిదేమియని మనస్సులో చకితుడైనాడు. మోమున నిర్భయముతోప చిరునగ వలంకరింప 'ఇదేదో పొరపాటు. నన్నెందుకు మీరు నిర్బంధించుచున్నారో నాకు చెప్పగలరా?' యనెను.

'క్షమించండి, నాకు తెలియదు, మాపై అధికారులకు తెలియును.'

'నన్నెక్కడకు తీసుకొని పోయెదరు?'

'మధుర. అక్కడ కారాగారమున నుంచెదము.

'మా వారికి తంతినీయ వలయునే?'

'మధురనుండి యిచ్చెదరుగాక?'

మరునాడు మధుర చేరినారు. మధురనుండి బావమరదికి తంతినిచ్చినాడు. ఎందుకు తన్నిట్లు బంధించుట? తానేమియు చేయలేదే? నేను అసహాయవాదిని కాదే! ఇకనెందుకు? విప్లవకారుడనా! అదియుకాదే. అమెరికాలో ఉపన్యాసమిచ్చిన సంగతి చటుక్కున జ్ఞాపకము వచ్చినది. ఏమో యావేశమున నేదియో యన్నాడు. అంతమాత్రమునకే! బావమరది ఖైదుకువెళ్ళలేదా! తానును కారాగారమునకు బోయిన దేశమాత సేవయే. 'తల్లీ నీ పాదములకడ అడుగు పెట్టగనే భారతీయుడు బంధింపబడవలెనా?' యనుకొన్నాడు. తనకు విప్లవము. కుట్రనచ్చదు. ఏదో దేశములో శాస్త్రజ్ఞానము వృద్ధినందింప, బాటుపడవలెననియు భరతమాతకీర్తి సర్వదిశల ప్రకాశింప జేయవలయుననియు నాతని వాంఛ. ఏది ఎట్లయిన నంతయు భగవంతుని చేతిలో నున్నది.

నారాయణరావు, రామచంద్రరావును నిర్బంధించిన నాలవరోజున మధురకు జేరుకొన్నాడు. కూనూరునుండి యా యువకుడు మధుర జేరుకొను లోపలనే రామచంద్రరావును సగౌరవముగ విడుదల చేయవలెననియు, అయినను చెన్నపురి వరకొక గూఢచారిని వెంటబంప వలయుననియు రహస్యపు వార్తచేరినది. జమీందారుగారీ నిర్బంధమును రామచంద్రరావునకు గల్పించినందులకు ప్రభుత్వము వారిపై నాతడే చర్యయు, తీసుకొనక కుండునట్లు వాగ్దానము చేసెను. రామచంద్రునికి తాను వచ్చుచున్నట్లు జిల్లారక్షక భటాధికారిపేర నారాయణరావు తంతినిచ్చెను.

మామగారికి మనస్సులో నానందముతో, గృతజ్ఞతా పూర్వకమగు వందనములు చేయుచు నారాయణరావు మధురస్టేషనులో దిగి, జిల్లాపోలీసు అధికారి కడకు బోయినాడు. అచ్చట ఒక్క నిమేషము, ఎవరు తన బావమరదియో, రక్షకభటాధికారి యెవరో గుర్తింపలేకపోయినాడు. ఆ భటాధికారి యాంగ్లేయుడు. మరుసటి క్షణములో నానవాలు పట్టి రక్షకభటాధికారికి ముందు నమస్కరించి, వెనుక

రామచంద్రరాయనికి నమస్కరించి అధికారిచూపిన యాసనముపై కూర్చుండెను. వారు ముగ్గురు అనేక విషయములగూర్చి మాటలాడుకొనిరి.

నారాయణరావు వచ్చినపుడే రామచంద్రరావు 'బావా యీయన నాకు చూపిన గౌరవము అపరిమితము. వీనిని నే నెప్పుడును మరువను. ఈయనయు లెక్కలలో ఆక్సుఫర్డులో బి. యె. లో కృతార్థు డైనాడట. ఎన్నియో విషయములు చర్చించు కొన్నాము.' అని అన్నాడు.

'వారికి మే మెంతయు కృతజ్ఞులము' అని తాను కొనివచ్చిన పూవుల మాలలు, నాలుగు వెండికప్పుల దొంతర ఆయనకు బహుమతి నిచ్చినాడు నారాయణరావు.

దారిలో వారిని జమీందారుగారి కుటుంబము కలిసినారు. వారంతయు సంతోష మున చెన్నపురిచేరినారు. చెన్నపురిలో జమీందారుగారి యింట నందరు మకాము చేసినారు. మధురనుండియే విజయవార్తలు కాకినాడకు, కొత్తపేటకు, అమలాపురము నకు బంపబడినవి.

చెన్నపురిలో పరమేశ్వరుడును, నారాయణరావును, రామచంద్రరావును, స్నేహితులందరి యిళ్ళకు వెళ్ళిరి, అచ్చట వారెంతయో సంతోషమున కాలము పుచ్చిరి.

మధ్యాహ్నము భోజనములయిన వెనుక వారందరు శ్యామసుందరీదేవిగారి యింటికి వెళ్ళిరి. అక్కసెల్లెళ్లందరు రామచంద్రరాయని నమితముగ గౌరవము చేసిరి. ఈతడా సూరీడు భర్తయని వారు సంతోషించిరి.

ఆ రాత్రియే బయలుదేరి కాకినాడ వెళ్లవలె ననుకొన్నారు. కాని నారాయణ రావునకు నమితానంద దాయకమును, మహత్తరమునగు నొక యాలోచన తట్టినది. అందుకై మరునాడుకూడ వారు చెన్నపురిలో నాగిపోయిరి.

రాజారావు ఉత్కృష్ట పురుషుడు, శ్యామసుందరి పవిత్ర చరిత్ర, వీ రిరువు రేల వివాహమాడరాదు? ఇరువురు వైద్యవృత్తియం దారితేరినారు. ఇరువురు సేవ జేయుటయే జన్మకు పరమార్థమని సంకల్పించుకొన్నారు. శ్యామసుందరి యొప్పు కొనునా? అతనికి ఒకనాటిరాత్రి జరిగిన యుదంతమంతయు దృశ్యమువలె గోచ రించినది. ఆమె హృదయములో నేమున్నదో? తనపై ప్రేమ సోదరుని ప్రేమయై యున్నది. ఆ సోదర ప్రేమయే ఉత్కృష్ట మైనదట. దివ్యకరుణావేశ యైనదట. అంతియ!

నారాయణరావు శ్యామసుందరిని మరునాడు కలిసికొన్నాడు. ఆమెతో తన కోరిక ప్రసంగించుట యెంతకష్టము. 'చెల్లీ నా కొక దివ్యమగుస్వప్నము ఎప్పుడూ కనబడుతూ ఉంటుంది'

'ఏమిటది అన్నా' ఆమె మాటలు చిరువెండి గంటలవలె మ్రోగినవి.

'నువ్వు దేశసేవ మానవసేవయు చేసి తరింప సంకల్పించుకొన్నావు. తరిబీతులన్నియు పూర్తియైన వెనుక సబర్మతీ యాశ్రమమునకు బోయి సేవచేయు నధికారము సంపాదించు కొంటానన్నావు.'

'అవును అన్నయ్యా ఆ మహాత్ముని పాదాలకడ సేవచేయుట నేర్చుకొని నా జన్మను సేవలో ఐక్యము సేయవలెనని నేను నిశ్చయించు కొన్నాను. నేనెంత వరకు తగుదునో? నే నందుకు తగుదునా అన్నా!'

'నీవు అన్యథా తలచనంటే నేనొక ప్రశ్న అడుగుతాను.

'అన్నా! నువ్వేదన్నా నేను వేరభిప్రాయం పడగలనా?' ఏలనో యామెకు గుండెలు ఝల్లు మన్నవి. ఏమది? ఏమది?

'నా కల చెప్పనీతల్లీ! ఇన్ని దినాలూ నాకు అనేకములగు ఆలోచనలు పుట్టుతున్నవి, నశించిపోతున్నవి! అద్భుతములు, ఆనందదాయకములు. దేశసేవచేయ కంకణము కట్టుకొన్న విద్యావతి, బ్రహ్మచారిణియా! ఈ కాలములో, ఇట్టి పరిస్థితులలో జన్మమెట్లు గడపుట! ఎంతటి వైరాగ్య హృదయులైనా, వైరాగ్యకర్ములైనా, మానవులు తమ కెదురువచ్చు సైతాను, కామదేవుని భయంకరమైన తంత్రాలకు పడిపోతారు. క్రీస్తు, బుద్ధుడు, గాంధి మొదలగువారు అవతారపురుషులే, అనేకములగు ఇబ్బందులతో ఆ పిశాచాల్ని జయింపగలిగారు భగవద్గీత అందుకనే కర్మమార్గము నుపదేశించింది తల్లీ.'

శ్యామసుందరి నిస్తబ్ధయై యూరకున్నది.

'నా స్వప్నం, నా ఆశయం! ఇరువురు ఉత్తములు, దేశసేవ చేయదలచిన వారు ఏకపథ సంచారులు, విడివిడిగా వారి జీవితముల వేరుమార్గాల ప్రసరించనీక ఏకాశయ పూర్ణావేశులై భార్యాభర్తలై దేశసేవ ఏల చేయరాదు? అని. నువ్వు బ్రహ్మచారిణివిగా ఉండటం ఎంతకష్టముతల్లీ. మనము మానవులం. ఎంత ఉత్తములైనా ఏ దుష్టకాలములోనో ఈ దేహానికి దాసులు కావలసి వస్తుంది తల్లీ! అది దాటుటకు మార్గమే గృహస్థాశ్రమం అని చెప్పారు. నీబోటి ఉత్తమురాలికి సరియైన స్నేహితుడు చేదోడైయున్న నీ యాశయం మరింత సులభంగా పూర్తి అవుతుంది కాదూ!'

శ్యామసుందరి మాట్లాడలేదు. ఎట్టకేలకు, 'అన్నా నీ వుద్దేశం రెండు మాటల్లో చెప్పు' అన్నది.

'నువ్వున్ను, రాజారావున్నూ ఏల మీ జీవిత నౌకలు జంటచేసి ఈ సంసార జలధిలో, మీ ఆశయానంద ద్వీపం చేరరాదు? ఇరువురికీ ఒకే ఆశయము, ఒకే విద్య, ఇరువురు ఉత్తములు. పారలౌకిక విషయములందాపేక్ష మిక్కుటముగా గలవారు. ఒకరికొకరుసహాయం. మీయిద్దరు దేశానికిసేవచేయడం ఎంతవుత్తమం;

ఆ స్వప్నం నేను ఎన్నిసారులో నిర్మించుకొన్నాను. స్వప్నములో ఆనందంపొందాను ఏమంటావు ?'

శ్యామసుందరి నిర్ఘాంతయై ఆశ్చర్యమానసయై కొంతసేపటికి చిరునవ్వునవ్వి. 'అన్నా! నువ్వు యింటికివెళ్ళు. నేను ఆలోచించుకొని నీకు తంతినిస్తా నీ ఉదారమగు మనస్సు నా కెప్పుడు అవగతమే అన్నా' అని యామె కన్నీరు విడిచినది. నారాయణరావామె తలపై తన హస్తముంచి, యామెకు నమస్కరించి యందరికడ సెలవుతీసికొని వెడలిపోయినాడు.

గోదావరిస్టేషనులో రాజారావు, లక్ష్మీపతి, వీరభద్రరావు, భీమరాజుగారు, సుబ్బారాయుడుగారు, జానకమ్మగారు, రామచంద్రరావు తల్లిగారు, రామచంద్రరావు స్నేహితులు, ఊరిలోని పెద్దలు రామచంద్రరావును ఎదుర్కొన్నారు. పూలమాలలు వేసినారు. రామచంద్రరావు మోము ప్రపుల్లమయిపోయినది. అచ్చటనుండి యందరు కాకినాడ వెళ్ళినారు. కాకినాడ స్నేహితులు, ప్రముఖులు సామర్లకోట స్టేషనులో నెదుర్కొన్నారు. ఊరేగించెదమన్నారు. వలదని రామచంద్రరావెంత వాదించినను, నారాయణరావెంత ప్రార్థించినను కాకినాడ పురవాసులు రామచంద్రరాయని నూరేగింపుచు, నాయన బసకడకు గొనిపోయిరి. కుమారుని నిర్బంధము, నారాయణరావు ప్రయత్నము, జమీందారుగారి సాయము, భీమరాజుగారు, దుర్గమాంబగారు విని యెంతయు నానందించినారు. కుమారునకు ఖయిదు తప్పినదని యంతవరకు భీమరాజుగారుగాని దుర్గమాంబగారుగాని యెరుంగరు. వారు సంతోషబాష్పములు విడుచుచునే యుండిరి.

దుర్గమాంబగారు కొడుకు విదేశముల పాలయ్యెనను విచారము కృశించిపోయినది. నే డామెకు వేయి యేనుగులబలము వచ్చినట్లయినది. భీమరాజుగారు, సుబ్బారాయుడుగారు సంతోషమున కాలముపుచ్చిరి. రామచంద్రరావునకు గార్యము చేయుటకు పురోహితుని రప్పించి శుభముహూర్తము మరల నిశ్చయింపవలసివచ్చెను.

జానకమ్మగారు దుర్గాంబగారిని కౌగిలించుకొని, తన ఆనందాశ్రువులు వియ్యపురాలి యశ్రువులలో గలిపివేసినది.

రామచంద్రరావు భార్య పరీక్షలో విజయమందిన సంగతి తెలిసి యెంతయు సంతసించినాడు. శాంతి యేమిటో ? ఇంకను కొన్ని వెఱ్ఱియాచారముల మనవారు వదలలేదు. అయినను దేనిలో ఏమర్థమున్నదో ? ఈలోన సూరీడును చూడరాదే ! ఇక నెన్నిదినాలు ఆమెతో మాట్లాడుటకు ? పదిహేనుదినము లెట్లు ? ఛీ ! తానెంత వెఱ్ఱివాడైనాడు !

మరచినాడు, రంగూనులో జపానులో అమెరికాలో స్నేహితులందరికి గష్టులు వ్రాయవలె, తా నెప్పుడును వారికి వ్రాయుచునేయున్నాడు. ఇంటికి జేరినట్లు వ్రాయవలె. లియోనారాకు సూరీడుచే నింగ్లీషున నుత్తరము వ్రాయించవలెను.

## ౨౧

## సంబంధ నిశ్చయము

జగన్మోహనరావును సూర్‌చంద్ - ప్రేమచందు కంపెనీవారు తమ అయిదు వందల రూపాయలపై చిల్లర డిక్రీ బాకీకి చెన్నపురి వచ్చినప్పు డరెస్టు చేయించినారు. జగన్మోహనుడు అంతకంతకు అప్పులలో బడిపోయినాడు. ప్రతిచోటున బాకీలే. తన వివాహమునకై యనేకచోట్ల నప్పుచేసెను. సూర్‌చంద్ కంపెనీవారికి వేయిరూపాయలు బాకీపడి, అయిదువందలు తీర్చినాడు తక్కిన అయిదువందలు ఎన్నిసార్లడిగినను తీర్పలేక పోయినాడు. వారాతని జమీసంగతులు కనుగొని ముందుగా మేల్కొనుట మంచిదని, యాతనిపై సిటీస్మాల్‌కాజుకోర్టు (చిన్నన్యాయస్థానము) లో నభియోగము దెచ్చి డిక్రీ పొందినారు. అప్పటికీ జగన్మోహనుడు లెక్కచేయలేదు. తన్ను నిర్బంధించగనే జగన్మోహనుడు తెల్లబోయినాడు. అప్పుడాతడు కారుమీద స్పెన్సరు హోటలునుండి జార్జిటవునులో విశాఖపట్నమునుంచి వచ్చిన డయానాయుండు మేడకుబోవుచుండెను. సూర్‌చంద్ కంపెనీవారి యుద్యోగి యొక్క మోటారు స్పెన్సరుహోటలు బయట న్యాయస్థానోద్యోగితో సిద్ధముగానుండెను. శ్రీ జగన్మోహనరాయ బహద్దరు జమీందారుడు అద్దెకారు నెక్కిపోవుచుండ, దారిలో 'రౌండుటానా' దగ్గర కారాగినది. వెనుకనే వచ్చుచున్న కారులో న్యాయస్థానోద్యోగి వచ్చి నిర్బంధపు టుత్తరువు చూపించుటయు, జగన్మోహనరావు తెల్లబోయినాడు. అతనికి వెఱ్ఱికోపము వచ్చినది. సిగ్గుచే ప్రాణము చచ్చిపోయినది. పదిమందియు చుట్టును మూగినారు. ఆసమయముననే నారాయణరావు ట్రిప్లికేనులో శ్యామసుందరితో మాట్లాడి యాలోచించుకొనుచు కారుమీద పోవుచున్నారు. ఆ క్షణముననే పోలీసువారును ఇతరులును రెండుకారులచుట్టు మూగియుండుటచూచి, 'ఒక జమీందారుని, బాకీకి అరెస్టుచేశారు' అని ప్రజలనుకొను మాటలు విని, కారాపుచేసి తానా జమీందారుడు జగన్మోహనుడై యుండనోపునని గ్రహించి, చటుక్కున నక్కడికేగి యేమి సమాచారమని యడిగినాడు.

సంగతులన్నియు విశదముగా, నా యుద్యోగితో తాను మాట్లాడి అప్పుధనమెంతయో తెలిసికొని తనకడ నా ధనము లేనందున హిందూస్థానీ బ్యాంకికి చెక్కిచ్చెదనన్నాడు. సూర్‌చంద్ కంపెనీ మనుష్యుడు నారాయణరావుగారి చెక్కుపుచ్చుకొని రశీదిచ్చెను.

ఎవరిదారిని వారు వెడలి పోయిరి. జగన్మోహనుడు నిస్తబ్ధుడై యేమి ఈ రాక్షసు డిట్లు చేసినాడు. ఆతనికడనే ధనమున్నదా? తనదగ్గరలేదా? తన్నవమానముచేయ నిట్లు చేసినాడు. తన కర్మము కాకపోయిన తనకీ నిర్బంధమును, నారాయణరావు వలన నింత యవమానమును రానేల? నేడే ఆ ధన మెచ్చటనేని ప్రోగుచేసి నారాయణరావునకు పంపివేయవలెను. వీడు వట్టి ఫంది, ఫంద

గనుకనే భార్యయొక్క ప్రేమ చూరగొనలేక పోయినాడు. తనకెన్నో పనులుండి తీరుబడిలేకే పోయినది కాని, శారద తన కౌగిలింతలకై యెదురుచూచుచుండవలసి నదేకద యీపాటికి. సరే. వీడు తన్నవమానపరచినందులకు, వీని భార్యను పూర్తిగా వశము చేసికొనవలయును. తనకు వివాహమైనప్పటినుండియు, ఆ విషయమున శ్రద్ధకలిగినదికాదు. తన మేనత్తగారి యింటికి కీలుపాకు వెళ్ళి, ఎవరెవరెచ్చట నున్నారో తెలిసికొనవలయును. ఈమధ్య మేనత్తయు నామె భర్తయు కూనూరునుండి వచ్చెదరని తన తల్లికి తన మేనత్త వ్రాసినదికదా. అవును, శారద ఇక్కడనే యున్నదన్నారు. సరే తాను విశాఖపట్టణము వెళ్ళక పూర్వము శారదను గూర్చి కనుంగొనవలయును.

నారాయణరావు, రాజారావు, సుబ్బారాయుడుగారు, జానకమ్మగారు కొత్తపేట వెళ్ళినారు. దారిపొడవున నారాయణరావు ఏదియో యాలోచించుచునేయుండెను. రామచంద్రరావు ఇంటికివచ్చినాడు. ముద్దుచెల్లెలగు సూర్యకాంతము భర్తను గలసికొనును. ఇక చెన్నపురిలో తానొక్కడు గాపురముండవలయును. కొత్తపేట వెళ్ళినపిమ్మట తన మదరాసు కాపురము సంగతి ఎట్లు తేల్చుకొనుట. శారదాదేవి తన ప్రియురాలై ప్రణయదేవతయగు సూచనలు ఎండమావులా? ఆమె హృదయము కరిగినదను సూచనలు తోచుచున్నవి. తన భావిస్థితి యెట్టిది? ఈ బ్రతుకుదారి ప్రయాణము 'ఒంటిగా ఉయ్యాల లూగుట' యగునా? పూజించుటకైన, పరిమళము ఆవహించని తన బ్రతుకు పూవు పరమప్రభున కంకితమీయుటకైన తగునా?

ఒక్కసారి మనసార శారద తనతో మాటలాడినదా? కవోష్ణమును, పరిమళ పూరితము నద్భుతానంద పూర్ణమును, సర్వసౌందర్యనిధియునగు నా బాలికామూర్తి తన మెడచుట్టు బిగియార బాహువులు బిగించి, స్వప్నాల నీదులాడు ఆ వెడద నయనాలతో తన కన్నులలోనికి తనివోవచొచ్చి చూచి. మాధురీసర్వస్వములు సుడివోవు గులాబిమొగ్గలు, ఉభయసంధ్యారుణాలైన ఆ పెదవులతో తమివోవ, జన్మలు కరిగిపోవ ముద్దిడి తన దివ్యప్రణయినియై తన్ను చేరుట ఈజన్మమునందున్నదోలేదో?

ఆనాడు జరిగిన మహాపరాభవము, తన్ను దహించివైవనీక, తన్ను దుర్గమహిమాలయ శీత శిఖరాలకు తరుమనీక, తన ప్రాణాల చిదిమివేయనీక, యేదియో యాశ ఈ నాటక మాడించుచున్నది. ఎంతకాలము దేవీ! జన్మరజ్జువునకు ఆఖరి సూత్రములు తెగువర్దకు నీ విటులుండుట?

ఇంటికి వచ్చునప్పటికి శ్యామసుందరి యుత్తరము వచ్చినది.

అన్నా! గంటలుకొలది తరచి, తరచి యాలోచించితిని. ఇందులో అపారమైన ఈశుని కరుణజూచాను! నీవా యీశుని వాక్కువు. నేను నీ యాజ్ఞకు బద్ధురాలను. నేను మీ స్నేహితుని ప్రేమించి ఎరుగను. నిన్ను మాత్రము నా ప్రియ

సహోదరునిగా ప్రేమించి ఎరుగుదును. అయినను డాక్టరుగారు పూజ్యతములగు మహా పురుషులు. వారి సేవచేయుచు నా సర్వము. వారి కర్పించుటకు నేను సిద్ధపడి యున్నాను.

నీ ప్రియమగు చెల్లెలు,
శ్యామ.

నారాయణరావానందపరవశుడైనాడు. ఇంక రాజారావునుఒప్పింపవలయును.

ఆ సాయంకాలము ఒంటిగా రాజారావును తోటలోనికి తీసుకొనిపోయినాడు:

'రాజా! నీకు కొన్ని గంటలు ఉపన్యాసము లీయాలోయి! నిన్ను సమూలముగా కదల్చివేసే సంగతులు మాట్లాడాలోయ్!

రాజారావు భార్య పోయినప్పటినుండియు శుద్ధవైరాగ్యమూర్తియైనాడు. ఏదియో ధ్యానము, విరాగమూనిన నడత, ఈ జన్మము వృథా, ఈ జన్మము పెద్ద వోటమి అన్న నిట్టూర్పు. డాక్టరునకుండవలసిన శుచిత్వము మాయమయిపోయినది. ఎందరు చుట్టములు కోరినను, ఎందరు స్నేహితులు ప్రార్థించినను మరల వివాహము చేసికొనుట కొప్పుకొనలేదు. తల్లిదండ్రులు దీనముగ వేడినారు. వారు కాకినాడ నుండి వారి స్వగ్రామమునకు, నటువెనుక కుమారుని దగ్గరకుబోయినారు. ఛాందసులు పూర్వకాలపువారు.

రాజారావుకు పట్టుదల మెండు పూర్వాచారములేమియు గిట్టవు. తన కుమార్తెలిరువురు పుట్టినప్పుడు బారసాల చేసికొనలేదు. రెండవ కొమార్త కలిగినప్పుడు శాంతి యున్నను జరుపలేదు. పురిటిళ్ళలోనికి, మాలవాని యిళ్ళకు వెళ్ళినను బట్టలు విడుచువాడుకాడు. అదియంతయు తల్లిదండ్రులు భరించలేకపోవువారు. అయినను లోకమెరిగినవారు, ఎన్నియో యాచారములు మారిపోవుట కనుగొన్న వారును గాన పుత్రుని ఇష్టమువచ్చినట్లు పోనిచ్చినారు.

పుత్రుడు వివాహము చేసికొననని ఖండితముగ జెప్పుటచే వారు కుమారుని పట్టుదల నెరిగినవారుగాన కార్యములేదని మిన్నకుండిరి.

నారాయణరావిది యంతయు నెరుగును. ప్రపంచములో రాజారావు హృదయము మార్చవలెనన్న మార్చుటకు శక్తిగలవాడొక్క నారాయణరావే. నారాయణరావన్న రాజారావు ఆనందమున మునిగిపోవును. రాజారావన్న నారాయణరావు పరవశుడగును. ఇరువురు పరమేశ్వరుడన్న ప్రాణము విడిచెదరు. పరమేశ్వరునకు నీ ఇరువురు కుంభక రేచకములు.

'రాజా! నువ్వు యోగివా?'

'కాను'

'ఈ ప్రపంచము, ప్రపంచవాసనను నంతయు వదలివేసి సన్యాసివి కావలెనని కోరికయున్నదా

'అదే పరమావధిగా పెట్టుకొన్నాను.

'ముసలితనములోనా ?'

'ఎప్పుడు అంతరాత్మ ఆజ్ఞాపించితే అప్పుడు సిద్ధముగా ఉంటాను.'

'అంతవరకు ?'

'రోగి నారాయణ సేవచేస్తూయుంటాను.

'అరవిందాది మహాయోగులు, రాధాకృష్ణాది తత్త్వవేత్తలు, ఏమి చెప్పారురా ? సన్యాసమును గూర్చి.'

'సంపూర్ణముగా త్రికరణశుద్ధిగా వైరాగ్యము కలిగినగాని సన్యాసము పుచ్చుకొనవద్దని.'

'సన్యాసము పుచ్చుకొనునంతవరకు ఏమి చేసినచో నీకు, నీ అంతరాత్మ ఆజ్ఞ వినబడుతుంది.'

'పరిశుద్ధమగు కర్మయోగ మాచరించినప్పుడు'

'కర్మయోగ మాచరించినప్పుడు నీహృదయము పరిశుద్ధముగా నుండవలెను గదా నీవుచేయు వైద్యసేవలో, నీవు తిరుగు ప్రపంచంలో, నీ హృదయము పంకిలం కాకుండా ఉండగలవా ?'

'చెప్పలేను.'

'చెప్పలేవు సరే, ధర్మమార్గాన నడిచే గృహస్థుకు మనస్సు చంచల మవడానికి సావకాశం ఉన్నదా ? నువ్వు, నీ భార్య జీవించిఉన్నంతకాలం. సంసారం అనుభవించేవాడివికదా ! నీమనస్సు చలించలేదా ?'

'చలించదని చెప్పలేను. ఇంద్రియాలకు తృప్తికలిగేది, అందుకని.

'తృప్తికలిగినా, హృదయం చలించేవారున్నారు, చాలాబాగాఉంటూ ఎప్పుడో ఒకప్పుడు జీవితం పంకిలం చేసుకున్న వాళ్లున్నారు. వారి మాట అటుండనిచ్చి జ్ఞానియై మంచిమార్గాన నడచి చివరకు సంపూర్ణవైరాగ్యం పొందుదామని ఆశయం ఉన్నప్పుడు, అలాంటి ఆలోచనలు, ధైర్యమూ, పట్టుదలా, ఆశయం ఉన్న బాలిక చెట్టబట్టాలని ఉన్నప్పుడు ఆ పురుషుడేల ఒప్పుకోకూడదు ? అట్టివాళ్ళిద్దరూ కలిసి జీవిత ప్రయాణం ఏల సాగించకూడదు ?'

'అబ్బాయీ నీ ఉద్దేశం స్పష్టంగా చెప్పు. కవిత్వం మాట్లాడకు.'

'సరే, శ్యామసుందరీదేవీ, నువ్వూ వైద్యులు. ఆమె సద్గుణ గరిష్ఠ. గాంధీ మహాత్ముని ఆశ్రమానికి పోయి యచ్చట మానవసేవ చేయుటకు బూనుకొంది. రోగి నారాయణసేవే ఆమెకీ పరమావధి. బ్రహ్మచారిణియై కాలము గడుపదలచుకొంది. నువ్వు తెలిసినవాడవు. మహాత్ముల వాక్యాలెన్నో ని చదివినవాడవు. నువ్వు వివాహం చేసుకోకుండా రోగి నారాయణసేవ చేయలేవు. పరిపక్వదశ వచ్చినగాని సన్యాసం పుచ్చుకోలేవు. ప్రతి నిముషముచాటున, ప్రతి యింటిలోను, స్త్రీవాంఛ పొంచి నిన్ను కూలదోయడానికి ప్రయత్నం చేస్తూ వుంటుందికదా ! శ్యామను నువ్వు వివాహం

ఏల చేసుకోరాదు? ఇది నా కెన్ని దినాలనుండియో స్వప్నానందము ఇస్తూవుంది. మీ యిద్దరి వివాహము, ఆంధ్రదేశానికి ఆశయం అవుతుంది. మీవాళ్ళ నీ కడ్డం. అదొక్కటే నువ్వు ఆలోచిస్తావని నాకుతెలుసురా? అదినువ్వు నీ ధైర్యంచేతదాటాలి.'

'నారాయణా! నువ్వు నన్ను ఆకాశంలో ఉండే ఒక పరమపురుషుడని అనుకుంటున్నావు. నేను నీకన్న నీచుడను. నా మనస్సు పాము మెలికలులా తిరుగుతూనే ఉన్నది. నేను బ్రహ్మచర్యం చేద్దామని పెట్టుకున్న దెందుకంటే, నేను నా భార్యతో మోహావేశాన సంచరించేవాణ్ణి. అదే ఆమెను కొనిపోయిందని నా నమ్మకం. అబ్బా!........(అతని కన్నుల నీరు తిరుగుచున్నవి) నేను పాపిన్ని. ఇక అలాంటి పాపాలు చేయకుండా ఉందామని....కాని నాలో నన్ను ఆలోచించుకొని, నా అంతరాత్మకు ఇష్టం అయితే, తప్పక నా తల్లిదండ్రుల ఒప్పిస్తాను........ నాకూ నీ ఆలోచనే తట్టింది. చెన్నపట్నంలో - శ్యామసుందరిని చూచినప్పుడు, ఆమె నా బిడ్డలకు అద్భుతమైన తల్లి కాగలదు. దివ్యురాలైన సూరమ్మ తప్పక సంతోషిస్తుంది. నన్ను ఆలోచించనీ - నీ ఆత్మ నా ఆత్మ ఇంత సామ్యమైనవికాబట్టి ఒకటే ఆలోచన తట్టినది నారాయణా ' అతని కన్నులలో నీరు ప్రవాహమయ్యెను. నారాయణుని కన్నులు చెమర్చినవి.

ఇరువురు శోకమును దాటిన మహదానందమున నా చీకట్లలో, నా చెట్లనీడలలో దిక్కులలో కలసిపోయిరి.

## ౨౨

## దుస్తంత్రము

రాజమహేంద్రవరము వచ్చినప్పటినుండియు వరదకామేశ్వరీదేవికి మలేరియా జ్వరం పట్టుకొన్నది. రెండురోజులలో తగ్గిపోవునని జమీందారుగారు ఎంచినారు గాని, నాలుగురోజులైనను, నూటమూడు, నూటనాలుగుడిగ్రీల జ్వరమువచ్చుచున్నది.

కొమార్తలతో రావలసినదని ఇరువురల్లుళ్ళకు తంతివార్త లంపినారు.

ఆ రోజుననే నారాయణరావు శారదయు, రాజమహేంద్రవరం ప్రయాణమైనారు. విశ్వేశ్వరరావుగారును శకుంతలయు వచ్చినారు.

నారాయణరావత్తగారికడకేగి, కుశలప్రశ్నచేసి, యామెనాడిజూచి, జ్వరము నూటనాలుగుండుననీ యంచనా వేసికొనెను. కొయినామందు పుచ్చుచున్నారు. నారింజ బత్తాయిరసము, బార్లీజావ యిచ్చుచున్నారు.

ఆమె ఏలనో నీరసించిపోయినది. రాజమహేంద్రవరములో జమీందారుగారి కొక పూర్వకాలపు వైద్యుడున్నాడు. ఆయన ఎం. బి. సి. యమ్. పరీక్ష నెగ్గి, యుద్యోగము చేసి, యుపకారవేతనము పుచ్చుకొనుచు రాజమహేంద్రవరములో వైద్యము ప్రారంభముచేసెను. ప్రప్రథమమున మంచివైద్యము నేర్చినవాడే. పేరు

పొందినవాడే. నేడు వృద్ధసింహమువలె కోరలు లేకున్నాడు. క్రొత్త గ్రంథము లేఖియు చదువడు.

నారాయణరా వాతని వైద్యమునకు బలమాపాదింప సంకల్పించి, మామ గారితో మఱిమఱియు చెల్పి రాజారావును రప్పించినాడు.

రాజారావు నాలుగురోజులు మలేరియాతో కుస్తీపట్టి నీలరక్తధమనిలోనుండి 'క్వినయిను ' మందు పొడిచి ఇచ్చినాడు మూడుసార్లు. బలమునకు వరదకామేశ్వరీ దేవికి తెలియకుండ కోడిగ్రుడ్లలోని తెల్లసొన చిలకరించి బత్తాయిరసములో ద్రాక్ష రసపు వంచదార కలపి యిప్పించినాడు. నాలుగురోజు లయినవెనుక జ్వరము తగ్గి పోయినది. రాజారావు తగు సలహాలు, మందులు చెప్పి యమలాపురము వెళ్ళిపోవ సిద్ధమై, జబ్బు నిమ్మదించిన వెనుక రెండురోజులకు పథ్యము పెట్టించి వెళ్ళి పోయినాడు.

పరిచారిక లెందరున్నను, బీదచుట్టములు చాకిరి చేయువా రెందరున్నను, రేయింబవళ్లు అత్తగారి మంచముకడకూర్చుండి మందులిచ్చియు, నాహారమిచ్చియు, జ్వరాంశలు చూచి వ్రాసికొనియు శుశ్రూష చేసినాడు నారాయణరావు. అతనిచేయి తలపై పడినప్పుడు వరదకామేశ్వరికి ప్రాణము లేచివచ్చి హాయిగ నిద్దురపట్టినది. అతనిమాట, ఆమెకు జోలపాట అయినది. అతడెదురుగ కూర్చుండియుండ పథ్యం ఘంట పట్టినది.

జ్వరతీవ్రతలో ఒడలు తెలియక పడియున్నప్పుడు వెనుకటి నారాయణరావును తిట్టినది. జగన్మోహనుని పొగడినది. శారద నెత్తుకొనిపోయిన రాక్షసుడని వచించి నది. నారాయణరావు చిరునవ్వునవ్వుకొనుచు ' ఇదియొరహస్యమనుకొని యాశ్చర్య పూరితుడగుచు, నెమ్మదిగ, యూడికొలోను ' లో గుడ్డలుతడిపి నుదుటిపై వేయువాడు.

ఆనాటి అల్లుడు వేఱు, ఈ అల్లుడు వేఱా ? అని కనులు విప్పి వరదకామే శ్వరి ఆశ్చర్యమున మునిగి యల్లునిజూచి యానందించినది. అతడు దగ్గరలేనపుడు జ్వరపు నిద్దురలో నుండి మెలకువ వచ్చినచో ' నారాయణరావు ! ' అని నెమ్మదిగ బిలుచునది.

ఒకనాడు జమీందారుగారు భార్యకడ కూర్చున్నారు. ఆమెకు నూట అయి దంశముల జ్వరము వచ్చినది. ఒళ్ళు పేలిపోవుచున్నది. జమీందారుగారు హృద యమున భయముతో భార్య మంచముపై గూర్చుండినారు. రాజారావు ' ఏమీభయవా లేదండీ ' యన్నాడు. నారాయణరావు భోజనమునకు బోయినాడు.

ఒడలు తెలియక పరుండియున్న వరదకామేశ్వరీదేవి కనులు తెరచి, భర్తను జూచి ' అల్లుణ్ణి పిలవండి ' అన్నది. జమీందారుగారు చకితులై, కన్నులు జలము స్రవింప నవనతవదను డయ్యెను.

ఇదినరకు నారాయణరావును అల్లుడని చెప్పుకొన్నదిలేదు. ఈనాటికి, ఈమె బ్రాతుపడి పదిమందిలో మరల నడచునా ?

రాజారావది గ్రహించి 'అయ్యా! ఇంతకన్న ఇక ఎక్కువరాదు. ఇంతకూడా ఇకరానేరాదు. ఇంకో వారంరోజులలోపల ఆమెకుపూర్ణముగా నెమ్మదిస్తుందండి. మలేరియాయే. పోనీ, రక్తము పరీక్షచేద్దామంటే, ఇప్పుడు క్వయినా యిచ్చుటవల్లవీల్లేదు.'

'చెమటలు పట్టడం, క్వినయిను 'ఇంజక్షను' ఇవ్వగానే జ్వరము తగ్గడం, దాని మొగముమీద కనబడుతూనేవుంది. మనం లోపలకు, 'ఎటెబ్రేను,' 'ప్లాస్మోక్వీను కాంపౌండు' ఇస్తూనే ఉన్నాము' అన్నాడు.

ఇంతలో నారాయణరావు వచ్చి, అత్తగారికడ కూర్చుండెను. ఆమె మరల కన్నులుతెరచి అల్లునిపై చేయివైచి నిదురపోయినది. పదినిముషములకు జెమటలు పట్టి జ్వరము నెమ్మదిగా నూట రెంటికి దిగిపోయింది.

కేశవచంద్రుడు భయమున బెదరు చూపుతో దల్లికడకు వచ్చువాడు.

'బావా! అమ్మకి బాగా నెమ్మదిస్తుందిలే. నువ్వేమీ అధైర్యపడకు. ఎనిమిదేళ్ళ కుర్రాడివి ధైర్యంగా ఉండాలి.' అని నారాయణరావనగనే యాతడు 'నువ్వంటే మా అమ్మకు తప్పకుండా నిమ్మదిస్తుందోయి. బావా' అనుచూ ఆ బాలుడు శకుంతలా శారదలు వారి మేనత్తయు; నితర స్త్రీలు కూర్చున్న చోటికి వెళ్ళి 'చిన్నక్కా! చిన్నబావ లేకపోతే అమ్మకు జబ్బు నెమ్మదించదు సుమా, బావను వెళ్ళిపోవద్దని చెప్పు' అనెను. శారద సిగ్గుపడినది. శకుంతల 'నిజము నాన్నా!' యని యాతని జేరదీసి కౌగిలించుకొని ముద్దిడుకొన్నది. ముద్దిడినచోట తుడుచుకొన్నా డాతడు.

శకుంతల పిల్లలూ నారాయణరావుకడ అతి చనువైనారు. 'చిన్నబావయ్యగారు?' అని ఒకటేపాట.

జ్వరమునుండి తేరినపిదప జమీందారిణి నారాయణరావును తనకు బూర్తిగ బలము పట్టువరకు నుండుమనికోరినది. మరినాలుగు రోజులు నారాయణరావచ్చట నుండిఅత్తగారులేచి తిరుగుచున్నప్పు డందరి సెలవునంది కొత్తపేటవెళ్ళిపోయినాడు.

జ్వరములోనే జగన్మోహనరావు మేనత్తను జూచుటకు వచ్చినాడు. ఆ రోజులలో నప్పుడప్పుడువచ్చి యామె క్షేమ మరయుచుండువాడు. అతడు శారదను తన మోహపాశములలో నిమిడ్చి బంధించుట యెట్లని యెత్తులు వేయుచుండెను. శారదతో నాతడన్నియు చక్కని సమాచారములు మాటలాడుచుండెను. తన మేనత్త జబ్బు సంగతి మాట్లాడుచు శారదకు ధైర్యము చెప్పుచుండెను. శకుంతలయు, జమీందారుగారును ఉదాసీన భావముతో నాతనితో మాట్లాడువారు. లోన హృదయము కోపదగ్ధమగుచుండ నారాయణరావుతో జగన్మోహనరావు 'మీ లెక్క కొద్దిరోజులలో బంపెదనులెండి' అని యనెను.

'అదేమిటండీ అన్నగారూ! మీరు ఏమీ పంపవద్దు. ఏదో మీకా సమయాన దగ్గరలేకపోవడంచేత, తుంటరులు అల్లాచేసారు. దానిమాట తలపెట్టకండిసుమా! పంపిస్తే తిరగ కొట్టుతానండోయి!' యని నవ్వినాడు.

'నేనే నన్నగారిని! ఆ దున్నపోతు నాకు తమ్ముడు. ఓహో! మంచిహాస్యము (జోక్)' అని గొణుగుకొనుచు జగన్మోహనుడు శారదయేదో నవల చదువుకొనుచు తనగదిలో గూర్చుండ, నచ్చటికి వెళ్ళినాడు.

'ఏమిటి చదువుచున్నావు శారదా?'

'లేమిజరిబ్లే'

'ఏమిటీ'

'ఈ మధ్యే 'హ్యూగో' కవి రచించిన నవలలు చదువుట ప్రారంభించాను'

'హ్యూగోకేమిగాని' అలెగ్జాండరు డ్యూమాసు 'వేల్సునావెల్సు చదివినావా?'

'డ్యూమాసు 'మాంటిక్రిష్టో' చదివాను'

అక్కడనున్న నవలలన్నియు నాతడు పరికించి చూచినాడు. అన్నియు మంచిరకము. బంగారుబైండు 'మొరాకో' తోలు, చక్కని కాగితములుగలిగి, 'శారదకు—నారాయణరావు' అని వ్రాసియున్న గ్రంథములే.

ఏమిటి, నారాయణరావుకు 'టేస్టు' గూడా ఉన్నది! అచ్ఛా! ఈ యప హాస్య మంతకన్న ఎక్కువగుచున్నదే అని యాత డనుకొనెను.

నారాయణరావు వెళ్ళినవెనుక, జగన్మోహనుడు శారద హృదయము సంపూర్ణముగ లాగివేయ ప్రయత్నములు చేసెను. తంతిమీద నియవది రూకలుఖరీదుగల 'ఒమారు.ఖయ్యాం' గ్రంథము తెప్పించి బహుమతి యిచ్చెను. ఆమెతో నవలల గురించి, ఇంగ్లీషు కవిత్వమును గూర్చి చర్చ ప్రారంభించెను. ఇప్పు డింగ్లీషు భాషలో వెలువడు కవిత్వమే నిజమయిన కవిత్వము అని యొక గ్రంథమును చూపెను.

అందు స్త్రీ పురుషసంబంధ క్రియలన్నియు రహస్యములేక వర్ణింపబడి యున్నవి. శారద ఆశ్చర్యపడి ఇది నాకు వలదని తిరిగి ఇచ్చివేసినది. ఎంతయో అసహ్యించు కొన్నది.

వారము రోజులు శారదను పొగడినాడు, మెచ్చుకొన్నాడు. నీవు ఇంగ్లీషు భాషలో కవిత్వము వ్రాయమన్నాడు. సంగీతము పాడుమన్నాడు. 'సరియైన ఉన్నత కుటుంబములవారుగాని సంగీత తత్వం గ్రహించలేరు శారదా. కంసాలి నగలు చేస్తాడు. ధరించే వాళ్ళం మనం. ఆడవాళ్ళు ఎవరైనా నేర్చుకోవచ్చు. మొగ వాళ్ళలో తక్కువ జాతివాళ్ళు నేర్చుకోవాలి అంతే' అని యాతడన్నాడు.

శారద కొంచెము విసుగుపడినది.

వా రిద్దరు వివిధవిషయములు చర్చించినారు. సంగీతము, చదువు, ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆ చర్చలలో నొకసారి జమీందారుగారు, విశ్వేశ్వరరావుగారుకూడ పాల్గొన్నారు.

జమీం:—ఏది ఎట్లయితే బెజవాడ వదలి విశాఖపట్టణం వెళ్ళుతోంది.

విశ్వేశ్వరరావు:—తెలుగు దేశానికి ఎంతో దూరాన పెడితే ఎల్లాగండి, కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురంవాళ్లూ మా నెల్లూరి వాళ్లూగోల.

జగ:—విశాఖపట్టణం సముద్రతీరం, కొండలు ఉన్నాయి. విశాఖపట్టణం ముందు, ముందు ఆంధ్రదేశానికి రాజధాని అవుతుంది. రేవు కట్టుట మొదలుపెట్టారు. అల్లాంటిచోట ఉండగూడదా ఏమిటి.

విశ్వే:—ఒక మారుమూలలకు ఎల్లాపెడ్తారు?

జమీం:—ఇప్పుడేం చెయ్యగలము, మా రాజమండ్రీవాళ్ళు కొంచెం తగలేశారు. కాని చాలా బాగావృద్ధి అవుతోంది ఆంధ్రవిశ్వవిద్యాలయం.

మేనత్తకు జ్వరము నెమ్మదించిన పదిరోజులకు జగన్మోహనరావునకు పీలయిన కాలము దొరికినది. విశ్వేశ్వరరావుగారు, జమీందారు రెండురోజులై వెళ్ళిపోయినారు. శకుంతలకు నీరాడు ప్రొద్దులు వచ్చుచున్నవి.

శారద జగన్మోహనునితో జనవుగా దిరుగుచున్నది, చనవుగ మాట్లాడుచున్నది. ఆ సమయములో ఆమెకు హుషారు పుట్టించి, ఆమెను కౌగిలించుకొని ముద్దిడు కొనవలయును. మోమోటముచే, దనకున్న చనువుచే, ప్రథమమున నామె కొంత యడ్డము పెట్టినను, తన మోహమున నామె కరగిపోవలయును.

అహా! ఏమి యీ బాలయందము! నవమోహనాంగి. ఇంత అందకత్తెయైనచే. ఈ యందానికి సాటియేలేదు. ఆమె యవయవములన్నియు నే దోషము లేక గ్రీకుదేవత 'వీనసుది' వలె నున్నవి. ఈమెతో మోహానందపు లోతు నెరుంగని నాడు తన జన్మము వృథా!

ఆ సాయంకాలము శారదతో దాను భోజనమునకు ముందులేచి, తక్కిన యందరు భోజనము చేయుచున్నప్పుడు, మేడపై శారద గదిలో....తాను పరిపూర్ణమగు సంతోషము ననుభవింపవలె.

ఆ రోజు జగన్మోహనుడు తనకున్న తెలివినంతయు జూపెను. హార్మోనియముపై ఇంగ్లీషు పాటల వాయించుచు పాటలబాడెను. నాట్యమాడుట - చూపెను. శారద సమ్మోహనాస్త్ర పీడితయైనట్లు, సర్పమునుజూచి చేష్టలుడిగిన మండూకము వలె నిస్తబ్ధయై మెలంగినది. సాయంకాల మేడు గంటలకు నారాయణుడు కారులో నుండి దిగినాడు.

## ౨౩

## చెంపపెట్టు

నారాయణరావు అత్తవారింటినుండి వచ్చిన వెనుక నమలాపురం వెళ్ళి రాజారావును గలిసికొన్నాడు.

'నారాయణా! నే నెంతో యాలోచించితిని, తలిదండ్రుల అయిష్టతకు లెక్క చేయను. పూర్ణముగ నాలో వాంఛ జనించినదేమో యని క్రుంగిపోవుచున్నానోయి

'ఓయి వెర్రివాడా! వాంఛా? మన యీ అల్పజీవితంలో సరియైన మార్గాన్ని నడచినట్లయితే వాంఛే ఉన్నతమైంది అవుతుంది. నీభార్య కానున్న యామెను వాంఛించుట ఎలాంటి తప్పు. సరే యిష్టపడ్డావు. నీకు ప్రేమ, సంతోషం. మాటలచే గాక చేతలచే చూపిస్తే సిగ్గు, అయినా నిన్ను కౌగిలించుకొంటున్నా!' యనెను. నారాయణరావు హృదయం వేయి పాలసముద్రముల మునిగినట్లయినది. తక్షణమే యాతడు శ్యామసుందరీదేవికి పెద్ద యుత్తరము వ్రాసినాడు. వారిరువురు రాజారావు తల్లిదండ్రుల నొప్పించు మార్గమాలోచించుకొనిరి. వేదోక్త ప్రకారము వివాహము సలుపుట యుత్తమ మనుకొన్నారు. చెన్నపురిలో శ్యామసుందరీదేవిగారి కుటుంబమును నారాయణుని యింటిలోబెట్టి యచ్చట వివాహము సేయుట లెస్స యని నిర్ధారణ జేసికొన్నారు. కొన్ని దినము లాగి అనేకవిధముల వాదనలు చేసి, అనునయించి రాజారావు తల్లిదండ్రుల, రాజారావు శ్యామసుందరీదేవుల వివాహానికి ఒప్పించినాడు నారాయణరావు.

నారాయణరావునకు దన లాయరు వృత్తియేమియు నచ్చలేదు. మొదటి నుండియు నాతడందేమాత్రము నిష్టములేకయే చేరినాడు. నేడు తండ్రి 'బాబూ! ఈ సంపాదనంతా ఎవరు తింటారు? నేను అవధ్యుడనై నాను. ఇంటిదగ్గర ఎవ్వరూ లేర్రు. నువ్వు వచ్చి యిచ్చట ఉండవలసినదనిన్నీ నీ చిత్తంవచ్చినట్లు జాగ్రత్తగా సంచరించవలసినదనిన్నీ నా కోరిక. పెద్దవాడు దగ్గరే ఉంటాడు. నేనింక కృష్ణా రామా అంటూ కాలక్షేపం చేస్తాను. పూర్తిగా వానప్రస్థుణ్ణేకద! మన దక్షిణపుతోటలో ఉన్న యింటిలో నీ తల్లీ, నేను తపస్సు చేసుకుంటూ ఉంటాము. బ్రతికి ఉన్నంత వరకు నీకూ, అన్నయ్యకూ - భగవంతుడు నాకు శక్తి యిచ్చినంతవరకు, సహాయం చేస్తాను' అన్నాడు.

రామచంద్రరావు సూరీడు పరమప్రణయములో ఆకాశపథాల విహరింపనున్నారు. తా నీ చెన్నపురి నుండుట యెందులకు?

కొత్తపేటలో నొక విద్యాశ్రమము పెట్టినచో? తండ్రి దక్షిణపుతోటలో వానప్రస్థుడై యుండెదనన్నాడు. తమకు వచ్చు రాబడిలో నెలకు నాలుగువందలిచ్చుట సులభము. తండ్రిగారి, అన్నగారి అనుమతి తప్పక లభించును.

బ్యాంకిలో నున్న నాలుగు లక్షలలో, నేబదివేల రూకలు ఆశ్రమమునకని ఇచ్చి అది రిజిష్టరు చేయించి, యందువలన వచ్చు నాదాయమున ఏల నా యాశ్రమము వృద్ధి నొందింపరాదు? తండ్రిగారు సకలకళా సంపన్నులు. భాషాకోవిదులు. ఆయన ముఖ్యాచార్యులుగా నుందురుగాక.

అనుకొనుటతడవుగా నారాయణరావు రాజారావునకు, పరమేశ్వరమూర్తికి, శ్యామసుందరీదేవికి, లక్ష్మీపతికి తంతుల నిచ్చెను. పరమేశ్వరమూర్తి భార్యతో శ్యామసుందరీదేవితో మరునాడు భోజనమువేళకు వచ్చెను. ఆ సాయంకాలమునకు లక్ష్మీపతియు, రాజారావును కొత్తపేట వచ్చిరి.

రాజారావు 'ఏమిరా నీవల్లనా పనికి భంగము వస్తూఉంది' అని అన్నాడు.

'ఓయి అబ్బాయి, నీపనికి పూర్తిగా అడ్డువచ్చేపని చేస్తూ ఉన్నాను, కాసుకో. నేను ఇక్కడ మహావిద్యాదానం ఇచ్చే ఆశ్రమం పెట్టదలచుకొన్నాను. పరమాత్మా రాధన, దేశారాధన ముఖ్యాశయాలు. పురుషోత్తమునిలో ఐక్యమందు ఉత్కృష్ట కర్మమార్గము మనము అనుసరిస్తాముగాక. నేను వృత్తిమానేస్తున్నాను. రాజారావు శ్యామసుందరి, పరమేశ్వరమూర్తి, లక్ష్మీపతి నేడు, ఆ ఆశ్రమంలో ఆచార్యులం. నాకు మనదేశంలో పూర్వకాలంనుంచీ వస్తూవున్న ఆయుర్వేద వైద్యంలో మందు లన్నీ పరీక్షించి, వానిలోని గుణగణాల్ని నిర్ధారణచేసే పని చేద్దామని యున్నది.

ఆశ్రమానికి సంబంధించిన వ్యాపారాలన్నీ లక్ష్మీపతి చూస్తూ ఉంటాడుగాక, పరమేశ్వరుడే కవి, చిత్రకారకుడు. ఇంకో కవిని, పండితుణ్ణి ఎవరినన్నా పట్టుకు వద్దాము. నేను సంగీతము చెప్తాను. ఇంకో సంగీతపాఠకుణ్ణి తీసుకొనివస్తా. నాట్యంచెప్పే ప్రతిభావంతుడైన ఆచార్యులను వెదకుదాం.

మానాన్నగారు సర్వవిద్యాదక్షులు. పారలౌకిక విషయాలందు మనకందరికీ గురువు అవుతారు గాక! ఏమిటీ మీ అభిప్రాయాలు చెప్పండి.

అందరు చాల సంతోషించిరి. ఆశ్రమాన్నిగూర్చి కష్టనిష్ఠురము లాలోచించిరి.

ఇంతలో స్నేహితులతో రాజారావు శ్యామసుందరీదేవుల వివాహపుసంగ్రతులు నారాయణరావు చెప్పినాడు. లక్ష్మీపతియు, పరమేశ్వరుడును సంతోషస్వాంతులై రాజారావును, శ్యామసుందరిని అభినందించిరి.

శ్యామసుందరీదేవి చిరుసిగ్గున తలవాల్చుకున్నది. పరమేశ్వరు డప్పుడు మంగళగీతము పాడి వారిపై పూవులు చల్లినాడు. వారందరు నారాయణరావుతో నింటికి పోయినారు.

శ్యామసుందరీదేవి కొత్తపేటలో కొలదిరోజులుండి, తర్వాత ప్రేమపూర్వక ముగ సూరీడును కౌగిలించుకొని, 'నీవు నీ భర్తయు గలియు శుభముహూర్తాన నేనుండుటకు వీలులేదు. చెల్లి' యన్నది.

అందరికడ సెలవుతీసికొని శ్యామసుందరి చెన్నపట్టణము ప్రయాణమైనది. పరమేశ్వరుడు, నారాయణరావు, రాజారావు, లక్ష్మీపతియు, శ్యామసుందరిని సాగనం పుటకు రాజమహేంద్రవరము వెళ్ళిరి. నారాయణరావు అత్తవారింటికివెళ్ళి అత్తగారి ఆరోగ్యము సంగతి కనుగొనివచ్చెదనని చెప్పి యచ్చటకు బోయెను. తక్కినవా రందరు భోజనమునకు లక్ష్మీపతిగారి యింటికి బోయిరి.

నారాయణరావు వచ్చుటయు జగన్మోహనునకు ఆపరానికోపము వచ్చినది. శారద తనతో భోజనము చేయుటకు వీలుండదు. శారదయు, జగన్మోహనుడును వెండియాకులలో ఒకేసారి భోజనమునకు గూర్చుండిరి. భర్త వచ్చినాడనివిని శారద చివ్వునలేచి మందహాసమున మొగమంతయు వెలిగిపోవ తనగదిలోనికిబోయినది.

అత్తగారు అల్లుడు వచ్చినాడను సంతోషమున, అల్లుని శారదకు వడ్డించిన చోట గూర్చుండ నేర్పాటుచేసినది.

బ్రాహ్మణు డందిచ్చిన వేడినీటిచే స్నానమాచరించుచుండ శారద తువాలీయ నారాయణుని కడకు వచ్చినది. అతడా తువాలంది పుచ్చుకొనుచు,

'శారదా భోజనమైనదా ?' యని ప్రశ్నించినాడు. అట్లు ప్రశ్నించుటకాతనికి సిగ్గు పోడమినది. అత్యవసరమగు పనియున్నగాని శారద నాతడిదివరకు ప్రశ్నింపలేదు.

ఏదియో పరమానందము శారదను ముంచివేసినది. ఆ ఆనందమునకు కారణము భర్తరాకయని యామె గ్రహించినది. ఏమి కోర్కె తోచినదో భర్తకడకు తువాలు పట్టుకొని పరతెంచినది. గొంతుకను హృదయము చిందరవందరచేయ,

'లేదు. మీతో కూర్చుండవచ్చునా ?' యని యామె జవాబిచ్చినది.

ఈ బాలిక శారదయేనా ?

'తప్పక మన యిద్దరికి వేరే వడ్డించే యేర్పాటుచేయి. శ్యామసుందరివచ్చి వెళ్ళిపోతున్నది. రాజారావుకూ ఆమెకూ సంబంధం నిశ్చయంచేశాము. ఆమెను అభినందించడానికి వస్తావా భోజనాలైనాక. రైలుకు సాగనంపనూవచ్చును.'

'శ్యామ వదినకు పెళ్ళా, డాక్టరన్నగార్ని పెళ్ళి చేసుకుంటూవున్నదా. చాలా బాగుంది. దబ్బున భోజనంచేసి వెళ్ళి శ్యామవదినను కౌగిలించుకోవాలి.'

శారద లోనికి రెండంగలు వేసినది. ఆమెమోము ప్రఫుల్లమైపోయినది. నారాయణుడు దివ్యహాసము వెలుగ అక్కడకు నవ్వుచు వచ్చి శకుంత లందిచ్చు పట్టుబట్టను కైకొనినాడు.

'ఏమండి మరదిగారూ! కొత్తపేటలో అందరూ క్షేమంగా ఉన్నారా ?'

'ఉన్నారండీ! శారదకూ నాకూ వేరే వడ్డించే ఏర్పాటు చేయండి.'

ఇదేమిటి ? చెల్లెలిని గూర్చి ఏ సందర్భమునను తనమరది ఇట్లు మాట్లాడుట తానెరుంగదు. శారదయు భర్తయన అంత అనురాగయుక్తమని యామె కెన్నడును దోచలేదు. కాని కుమారస్వామివలె నున్న ఈ ఉత్కృష్ట హృదయుని ప్రేమించని మానవుడుండగలడా ? ఈయనవంటివాడు భర్తయైనచో యేయామె అతని పాదములు కొలువక ఒక్క నిమేషము ఉండగలుగును ?

శారదకు, నారాయణరావునకు వేరుగా నింకొక్కచోట వడ్డించినారు. శారదను సిగ్గును, కాంక్షయు ఒక్కసారే ముంచివేసినవి. తనభర్త కంచమున పెండ్లిలోనైన దాను తినలేదు. ఆయన ఎంగిలియే తానెరుగదు. ఆయనతో గలసి ఒక్కకంచాన భుజింప నామెకు గాఢవాంఛ కలిగినది. అది గ్రహించినాడో యనినట్లు నారాయణ రావు ప్రాణము లుగ్గబట్టి, తన కెక్కువ యయినవని మామిడిపండు ముక్కలు రెండు తన కంచముకడనున్న వెండి బాదముఆకులలో నొకదానినుండి తీసి యామె వెండియాకులో వేసినాడు. ఆమె అతనివంక సాభిప్రాయమై చిరునవ్వు నవ్వుచు చూచి ఆ ముక్కలను మనసులో కళ్ళ కద్దుకొని భుజించినది.

భోజనము లైనవి. శారద నిముషములో చక్కనివేషము వేసికొనినది. కారులో భర్తప్రక్కనే యధివసించి, ఏదియేని వ్యాజంబున నాతని నంటుచు గుండె దడదడలాడ ఆనందలహరీస్నాతయై తేలికొని పోవుచున్నది.

'శ్యామ వదిన ఎప్పుడు వచ్చింది?'

'మొన్న కొత్తపేటవచ్చింది. అక్కడే సంబంధం నిశ్చయించేశాము సూరీడు గంతులువేసింది. నువ్వు బి. యే. లో ఆమె ఎఫ్. ఏ. లో ఒకేసారి చేరాలిశారదా!'

శారదను శ్యామసుందరి కౌగిలించుకొనినది. నారాయణుని చెల్లెలికడకు పోయి 'వదినగారూ మా యింటికి ఎప్పుడూ రారేమండి' యని అడిగినది.

'నువ్వే మా యింటికి ఇంతవరకూ వచ్చావా వదినా! దొంగమ్మాయివి'

'రేపటినుంచీ రోజూ వస్తూవుంటానండీ.'

రెండుకార్లమీద అందరునుబయలుదేరి రాజమహేంద్రవరం స్టేషనుకుబోయిరి.

'రాజారావు తానుకూడా చెన్నపట్నంవెళ్ళకూడదురా నారాయుడు? దగ్గిరఉండి కాబోయే మరదళ్ళను, అత్తగారిని బావమరదినీ వాళ్ళనూ తీసుకురావచ్చుగా' అన్నాడు పరమేశ్వరుడు.

'ఫస్టురా! పరం' అని నారాయణుడు.

'చాలా బాగుంది' అని లక్ష్మీపతి.

అందరును ఎంతయో మంచిదనిరి.

వారిద్దరికి రెండవతరగతి టిక్కెట్లు కొని జత సీటుల రెండవతరగతిపెట్టెలో నెక్కించినారు. శామసుందరి శారదను హృదయాని కద్దుకొని 'తల్లీ నీ భర్త భగవంతుని అనుగుచెలికాడు. దివ్యుడు. నీ అదృష్టం తల్లీ! ఆయన్ని సర్వవిధాలా పూజచేయి' అని యామె చెవిలో చెప్పి, శారదను చెక్కిళ్ళపై ముద్దులు గొనెను. శారద అప్రయత్నముగ శ్యామను మరల కౌగిలించి 'వదినా నీ భర్తాదివ్యుడేసుమా. నాదగ్గిరకు వస్తున్నావు ఎంతోసంతోషంగాఉంది. త్వరగా రా! అందర్నీ అడిగాను.'

రైలుకదలినది. నారాయణుడు, పరమేశ్వరుడు శారదయు జమీందారుని ఇంటికి వచ్చినారు. రెండవకారులో లక్ష్మీపతి తన ఇంటికి బోయినాడు. జగన్మోహనునకు మతిలేదు. శారద చేతికి జిక్కినటులే చిక్కి ఇంతలో నా పరమచండాలుడు వచ్చుటవలన జారిపోయినది. ఆ పశువునకు రసగ్రహణశక్తి యెక్కడున్నది? ఆతనికి ఆవేశ మెక్కువయైనది. రెండుమెతుకులు నోటిలో యెటులనో వేసికొని ఈవలకు వచ్చినాడు. ఆతని యొడలు వేడెక్కియున్నది. ఆతని తమస్సు సర్వాంగాలను సంపూర్ణముగ ఆవహించినది. ఆతనికి శారదాదేవి మోము, జవ్వనము, సౌందర్యము మాత్రమే ఆ చీకటిలోనుండి తళుక్కుమని మెఱయుచున్నవి.

ఇంతలో శారదయు నారాయణరావును పరమేశ్వరుడును కారునుండి దిగి లోనికి విచ్చేసిరి. భర్తను వెన్నంటివచ్చు శారదను చూచి జగన్మోహనుడు, రౌద్రముచే కంపించిపోయినాడు.

శారద తిన్నగా లోనికిబోయి కాలిజోడులు విడిచి వంటింటిలో భోజనము చేయు తండ్రిగారికడ కూర్చున్నది. ఆమెకు జగన్మోహనుని జూడగనే భయము వేసినది. తన దగ్గరకు జేరు పూజ్యపురుషుడగు భర్త నాతడు నెడముగా తరిమివేయ డుగదా ? ఆమెకుంచించికొనిపోయి తండ్రికడనే ఒక పీటపై చతికిలబడియెను.

జమీందారుడు :—(భార్యను జూచుచు) ఇందాక కాకినాడలో ఇద్దరు స్నేహితులు ఏవోసంగతులు నీ మేనల్లుణ్ణి గురించి చెప్పారు. ఎవరో కంపెనీవారు ఇతన్ని బాకీకోసం అరెస్టుచేశారుట, ఆ సమయంలో నీ చిన్నల్లుడు బాకీడబ్బు ఇచ్చి నీ మేనల్లుణ్ణి వదలించాట్ట ?

'ఎప్పుడండీ ?'

'మొన్నమనం వచ్చేటప్పుడే. ఆరోజుమనం అక్కడేఉన్నాముసుమా ! నారాయణరావు అప్పటికీ ఇప్పటికీ ఎవరితోనుచెప్పలేదు, ఏమి గొప్పహృదయంఆతనిది'

'మా మోహనుడు ఇలా తయారయ్యాడేమిటి ! అతి దుష్టసావాసముచేస్తాడు.'

శారద ఈ మాటలన్నియు ఆశ్చర్యము నొందుచు విన్నది. భర్తను దలచుకొనుటయు నామె కన్నులు తళుక్కున కాంతిమంతము లైనవి. ఆయనకు తీరని అవమాన మామె తెచ్చిపెట్టినది. ఎట్లు తాను ఆయనకు గల్పించిన బాధను నివారింప చేయగలదు. తన పాపానికి నివృత్తి ఉన్నదా ?

భర్తను గురించిన యాలోచనలు తీపులై మధురవేదనా కారణములై, ఆనంద పూర్ణములై విషాదమిశ్రిత సంతోషయుతములై హృదయమును ఇట్టిటు ఊపివేయుచుండ పులకరించు హృదయముతో శారద తనగదిలోనికి బోవుచు మేడమెట్లకడకేగ బయలుదేరినది.

అచ్చట పిల్లివలె, ఘూకమువలె, రాక్షసునివలె జగన్మోహనుడు పొంచియున్నాడు. లోని మేడమెట్లుండిన హాలులోని విద్యుద్దీపములు ఆర్పినాడు. కాని పక్కహాలులోని దీపాల వెలుగుమాత్ర మున్నది. ఆత డక్కడనే పొంచియున్నాడు.

అత్తరువులతో ఆతడు ఘుమఘుమ లాడిపోవుచున్నాడు ఉల్లిపొర పట్టు లాల్చీ, ఉల్లిపొర పట్టుపంచె ధరించి అతడు సర్వ సౌందర్యములు సేకరించినానని పొంచియున్నాడు.

అతడు గోడపై నున్న తెల్లని బల్లివలె నున్నాడు.

అతడు మూలను వలపన్నుకొని అనేకములైన కన్నులతో చూచుచు పొంచి యున్న సాలీడువలె నున్నాడు.

ఆ సమయమున ఆ దారిని మేడమీదికి శారద తక్క నింకొక్కరు పోరని యాత డెరుగును.

దీపము లారియున్న వేమి యనిగాని, ఏదియో ఘుమఘుమ సువాసనలు వెదజల్లుచున్న వేమియనిగాని. ఎవరో యస్పష్టముగ మెట్లప్రక్క నిలచుండి యున్నారనిగాని శారదకు దెలియదు.

ఆమెకు హృదయములో నారాయణిరావు; బయట మోహవ్యాధుడు మోహనుడు.

ఆమె మెట్లు సమీపించినది. ఆత డామెను జేరినాడు

'శారదా' అని వినంబడని ధ్వని.

'ఎవరు?' అని చకితయై శారద!

'నేను ప్రణయేశ్వరీ! నీ బావను!'

అత డామె భుజముపై చేయివేసినాడు. ఆమె మూర్తిని ముట్టుటతోడనే యాతని ఒళ్ళు వేడియెక్కినది. అతడు మోహావేశియైనాడు. శారదను గట్టిగా అదుముకొని కౌగలించు కొన్నాడు.

ఆమె భయాశ్చర్యములకు లోనై మాటలాడలేక పోయినది. అతడామె మూర్తిని మరియు దన ఒడలికి అదుముకొన్నాడు.

ఆమె వ్యాఘ్రముకడ చేష్టలుడిగిన లేడియై పోయినది. జగన్మోహనుడు ఆమె మోము వెనుకకువంచి ఆమెను ముద్దుపెట్టుకొన బోయినాడు. ఆ చీకటిలో ప్రేతముఖమున ఆతని కన్నులు చింత నిప్పులవలె కణకణలాడు చున్నవి. ఆమె ఆతని ముఖము తన ముఖముకడకు రానీక చేతులుపెట్టి వెనుకకు నెట్టినది.

అత డామె చేతులు కుడిచేత బలవంతముగ నొత్తిగించి ఆమె పెదవులె కడకు తన పెదవులు జేర్చబోయినాడు. ఆతని నిట్టూర్పులు తన మోముపై బ్రస రించుటయు శారద మహాశక్తి యైనది. ఒడలు కంపింప నొక్క ఊపున యాతని కౌగిలి సడలించి, యాతని రొమ్ముపై ఎడమచేయి వైచి నెట్టి కుడిచేత జగన్మోహ నుని చెంపపై ఫెళ్ళున నొక్క పెట్టు పెట్టినది.

అతడు తల తిరుగ తూలి, తెల్లబోయి, మేడమెట్ల కట్టలనాని తన్ను నిలుపుకొన్నాడు.

శారద చరచర మేడమెట్లెక్కి తన గదిలోనికిబోయి పందిరి మంచముపై మేనువాల్చి క్రోధము సడల అవమానము తలచుకొని వెక్కివెక్కి యేడ్చినది.

శారద చెంపపెట్టుకొట్టు సమయమునే యచ్చటకు వచ్చిన మషాల్చి పోతి గాడు అదిచూచి 'ఏమి ఈ వెధవయ్యా నా తల్లి శారదపై చేయివేయుటయె! మంచి పరాభవము.చేసింది నా తల్లి.' అని కోపముతోపోయి దాది చిట్టితో చెప్పినాడు.

దాది చిట్టిపోయి శకుంతలతో నిది వర్ణించినది. ఆమె రౌద్రమూర్తియై చెల్లెలికడకు బోయి 'తల్లీ వాడేమి చేశాడే' యని యడిగినది. శారద దుఃఖమాపు కొని కోపమురా లేచి యక్కతో జరిగినది చెప్పినది. శకుంతల క్రిందకుదిగి తల్లితో నంతయు జెప్పి, తల్లిరా చరచరనడచి, తన గదిలోనికిబోయి సోఫాపై నధివసించి యుండి చెంప సవరించు కొనుచున్న జగన్మోహనునిచూచి 'ఏమోయి! నీ సంగతి బాగుండలేదు. నువ్వు ఇంక మా ఎవరిఇండ్లకు రావద్దు పొద్దున్నె మెయిలుకువెళ్ళు. మాతో ఎవరితోను చెప్పనక్కరలేదు!' అని యన్నది.

జగన్మోహనుడు అవమానరోషాలతో చటుక్కున లేచి సామాను సర్దించుకొని, కారుపై తక్షణమే స్టేషనుకు వెడలిపోయినాడు.

## ౨౪

## ప్రేమమహాతరంగిణి

సూర్యకాంతమునకు శుభముహూర్తము నిర్ణయించిన శుభదినము వచ్చినది.

సుబ్బారాయుడుగారి చుట్టములందరు విచ్చేసిరి. దొడ్డమ్మపేటనుండి తటవర్తివారి జ్ఞాతులందరు వచ్చినారు. జమీందారుగారి కుటుంబము యావన్మందియు నరుదెంచినారు. సుబ్బారాయుడుగారి యిల్లు మేడయు కిటకిట లాడి పోయినది.

దక్షిణపుతోట బంగాళా జమీందారిగారి కుటుంబమున కేర్పరచినారు. పగలంతయు నిచ్చటనే యుండి వారు రాత్రి యచ్చట విశ్రాంతి తీసుకొందురట.

పగలు శాంతి జరిగినది. రాత్రి శుభ ముహూర్తము జరిగినది.

సూర్యకాంతము మోము దివ్యజ్యోత్స్నల వెలిగిపోయినది. రామచంద్రుడు అనిరుద్ధమూర్తి యైనాడు.

వారి ప్రేమ దిశల ప్రసరించినది సర్వరాగాల మాధుర్య మేచికొన్నది. ఆ దంపతులపొదివికొని, తన గర్భాన దాచికొన్నది.

సూర్యకాంతము సంజ్ఞాదేవివలె సర్వరాగ రంజితయై, సూర్యునివలె వెలుగు రామచంద్రుని ఆవరించినది....

శారదా హృదయము నవనీతమై కరిగినది.

సూర్యకాంతమును తేల్చిపోవు ఆనంద శైవలిని యామెను సుడిచుట్టినది.

ప్రేమచే, నుదయమున గుమ్మిడి పండావుదూడ, బొమ్మవలె ముద్దులు గులుకుచు, స్ఫటికశిలా శిల్పాకారమై, వెండిగంటలు 'ననన' ధ్వనులీన గంతు లిడుచుండ నారాయణరావు దూడ నెత్తుకొని మూర్ధము పుణికినాడు. గంగి గోవగు గుమ్మడి పండావు నారాయణరావుకడకు వెట్టి ప్రేమతో గంతులిడుచు వచ్చినది.

'గోవు మా లచ్చిమికి ? కోటిదణ్ణాలు' అను కొనుచున్నాడు నారాయణరావు.

ఆ ఆవు ఉప్పొంగుచు నారాయణరావును సమీపించుచున్న యపుడు శారద చూచినది. భర్త నాధవశనందిని పొడుచునన్న భయముతో 'అయ్యో!' అనుచు భర్తకునా ధేనువునకు 'మధ్యవెళ్ళినది. ఆ ఆవు ప్రక్కకు తప్పుకొన్నను శాందకు తగులుట వలన యామె పడిపోయినది.

నారాయణరావు భయమున నా దూడ నచ్చట వదలి వెనుకకు తిరిగి పడిపోయి లేవబోవు భార్యను పూలమాలవలె నెత్తుకున్నాడు. సుడిగాలివలె ముద్దులామె నదిమివేసినాడు. 'ఏమి ? దెబ్బ తగలలేదుగద ?' యని భయపూరిత స్వరాన్న నాథుడు ప్రశ్నించెను. భర్త గౌగిలింతలో పారవశ్యమందిన శారద కనులు మూసి నదో హోయియను ఆనంద మధురిమవశునకు మధురిమమైనది.

'శారదా! శారదా' అతని మాట విహ్వల స్వర పూరితమైనది.

అది శారదకు పంచమ స్వరమైనది..

ఆమె నవ్వుచు కన్నులు తెరచి, అతని కౌగిలిలో నుండి సిగ్గువచ్చు వ్యంజనమున కదలి 'దెబ్బ తగలలేదండి' యని అస్పష్ట మధురవాక్కుల బలికినది.

నారాయణు డామె నట్లనే లోనికి గొనిపోయి మంచాన పరుండబెట్టెను. చల్లాలు నారాయణరావుతో 'మిమ్మ ఆవు పొడుస్తోందను కొని శారదమ్మగోరు అడ్డమెళ్ళారండి.' యన్నది.

నారాయణరావు కనులు చెమర్చినవి. అతని కంఠమున దీపులు డగ్గుత్తిక యైనవి.

సాయంకాలము నారాయణరావు తనగదిలోనికి బోయినాడు. ఆ గది యతి మనోహరముగ నలంకరింపబడి యుండుటచూచి ఇది ఏమి యని యక్కజం పడినాడు. ఇంతలో శారదయు. సూర్యకాంతమును అక్కడకు వచ్చినారు.

సూర్యకాంతమును, శారదను, జూచి నారాయణుడు వేరొండు మార్గమున సంతర్పితుడైనాడు.

ఆ యోషామణు లిరువురాగది నింకను రమ్యముగ నలంకరించినారు. నారాయణరావు సముపార్జించిన చిత్రములను, శిల్పములను, గంధపు బొమ్మల నచ్చటచ్చట నునిచినారు. చక్కని తెర లమర్చినారు. బల్లలపై తమలా పాకులు, పోకలు మొదలైనవియు, ఉపాహారములను, ఫలములను అందం దమర్చినారు.

సుబ్బారాయుడుగారు, శారదను భోజనములవేళ జూచినారు. ఈమె మోమింత సంపూర్ణానంద వికసితమైనదేమి? తనగర్భశుక్తి ముక్తాఫలము, సర్వరస పరిగ్రాహి, తనకు పేరుదిద్దు నారాయణుని హృదయ మీనాడు, గనుగొన్నది యీ బాల! బిడ్డలారా సుఖింపుడు. సుబ్బారాయుడుగారి దీర్ఘబాహువు మనంపథమున నాశీర్వాదపూర్వకముగ నెత్తబడినది.

జమీందారుగారు తనయనుజూచినాడు. ఆమెలోని ప్రేమవాహిని తళుక్కుమని యాతనిహృదయాన జొచ్చినది. శారదా! నాముద్దు తల్లీ! నీకై దేశాల గాలించి సేకరించిన నాయకమణిని నీతల ధరించుకో! అది అతి పవిత్రమైనది! అదిగో నారాయణరావు. తేరిచూడ రాకున్నాడు.

నారాయణరావు రాత్రి పదునొకండు గంటలు దాటినవెనుక తనపడకగది చేరినాడు. శారద మంచముపై దివ్యరూపయై నిదురబోవుచున్నది.

రెండవమంచములేదు. ఆగది ఆకాశపథగామియగు సుందరతర విమానము వలెనున్నది.

తల్పముపై శారద శయనించియున్నది. గంగానదీ ప్రవాహముల తేలియాడు శ్వేతహంసివోలె, ఆమె పవళించియుండ, దుకూలాంబర రేఖలామూర్తిని అల్లనై తేల్చుచున్నవి. ఆమె దివ్యసౌందర్య తేజఃపుంజము ఒక ప్రక్కకు తిరిగి తలక్రింద

లలితలవంగీ సుందరమగు బాహువును పధానమొనర్చి ఆమె మోహనభంగిమ రూపమై యందు బర్వుండియున్నది.

నారాయణుడు నెమ్మదిగ తలుపు గడియవేసి తన మంచము జేరి గుండెలు దడదడ గొట్టుకొన సర్వలావణ్యముల ప్రోవు అబాల నిద్రనభియించు చున్నదని తెలిసి యామెపై వ్రాలినాడు.

శారదలేచి యాతని కౌగిలింతలో తన బాహువుల నాతనిమెడపై వైచినది. వారిరువురు తమ ప్రథమ చుంబనపు మైమరపులో నొకరైనారు.

ఆతని కౌగిలిసడల్చి మంచమునుండి దిగజారి పుష్పపు పళ్ళెర ముందుకొని వచ్చి యాతని పాదముల బూజవేయుచు,

' శ్రీరామపాదమా '

యన్నకృతి మధుర కాలీస్వనమున పాడుకొన్నది.

ఎదుట గోవర్ధనచిత్ర మున్నది. 'శారదా సర్వప్రపంచబాల నాపురాణ పురుషుడు తన చిటికెన వ్రేలి కొనగోట ధరించుచున్నాడు సుమా !'

'నా హృదయేశ్వరీ! నేనీనాటికి పవిత్రుణ్ణి. ఆ పురుషోత్తముని పదపద్మ ధ్యానస్థులమై మనము మన జీవిత మార్గాన్ని వెళ్ళి, ఆ గోవర్ధనగిరిక్రింద చేరగలముసుమా !'

'నీకై నే ఎదురుచూస్తి
నీకై నే వెదకినాను కనుమూతలకలలలో
మన వెరుగనితీపుల్లో
అనాధుని పదములకడ
గోవర్ధనగిరి నీడను
నా రాణీ మనప్రేమలు
పూవులుగా నర్పింతుము.'

శారద :—మీరీ దండలు వేసుకోరూ ?

నారా :—తల వంచానుగాదూ !

శారద :—(చిరునవ్వుతో) తాంబూలము ఇంకా వేసుకోలేదేమీ ?

నారా :—నా కిచ్చే హస్తాలీనాటికికదా ప్రత్యక్షమైనవి.

శారద కన్నీరు నింపినది. నారాయణరావామెను హృదయమున నదుము కొని యామె తలను మూర్కొనినాడు. ఆమె తన మోము నాతని విశాలవక్షమున నదిమికొన్నది.

సంపూర్ణ జ్యోత్స్న లానాయికా నాయకులలో లీనమైపోయినవి. ల్నా దంపతుల దివ్యప్రేమపూరిత జన్మలు కండని ఆశీర్వదించినవి.

నీలవర్ణము లా ప్రణయమూర్తుల నావరించిపోయినవి.

ఓం అసతో మా సద్గమయ! తమసోమా జ్యోతిర్గమయ!! మృత్యోర్మా అమృతంగమయ!!!